# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ. కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడి యెట్. ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు.

పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

వస్త్రములపై అద్దకపుపని మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత- బుక్ బైండింగు, ఎంబ్రాయిడరీ. : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభ పారిశ్రామిక భవనములు, 7-ఎ రోజరీ చర్చి రోడ్డులో నడుపబడుచున్నవి.

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ : స్త్రీలకు టైపు.—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్— మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది.

ముద్రణశాఖ : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

ఆంధ్ర మహిళా సభ నర్సింగ్‌హోమ్‌లో కొత్తగా నిర్మింప బడుచున్న "చిల్డ్రన్స్ వార్డు"కు

## శ్రీమతి ఇందిరాగాంధీ

బుధవారము 19 - 1 - 55 తేదీనాడు ప్రారంభోత్సవము చేయుదురు.

## శ్రీమతి మణిబెన్ పటేల్

ప్రారంభోత్సవమున కధ్యక్షత వహించెదరు.

తాము తప్పక దయచేయ ప్రార్థితులు.



# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: జనవరి '55 :: సంచిక 9



ఇంకా పెర్‌ఫేర్, బాలానందం, పాకకళ, గ్రంథసమీక్ష తదితర విషయములు.


సంవత్సరచందా :: :: — ఆరు రూపాయలు.

సంపాదకురాలు : లక్ష్మీరఘురామ్

వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంయుక్త సంపాదకురాలు : కె. సుగుణమణి

ముద్రణ : ఆంధ్ర మహిళా ప్రెస్.



సంపుటి 11 :: జనవరి 55 :: సంచిక 9

# పాడి పంటలు

మన ఆంధ్రదేశములో కోతలు ఆరంభించాయి. ఈసారి వరిపంట సంతృప్తికరముగానే వున్నదంటున్నారు రైతులు. కాని మొన్న వ్యవసాయ శాఖవారు రజతోత్సవము చేసుకొనుచున్న సందర్భములో శ్రీ రాజేంద్రప్రసాద్ మొదలగువారు మన రైతులు అధునిక పద్ధతులు అలవరచుకొని ఇంకా బాగా వ్యవసాయము చేయించి పంట ఎక్కువ పండేటట్లు చేయవలెనని చెప్పారు.

మన దేశమునకు పాడిపంటలే జీవకర్ర. అటువంటప్పుడు ఈ రెండింటి విషయమున ఎక్కువ శ్రద్ధ తీసికొనవలసి యున్నది.

పంట–వ్యవసాయముతోపాటు, పాడి విషయమున శ్రద్ధ తీసికొనవలసియున్నది. పాడిమీదనే మనదేశ ఆరోగ్య ధనసంపదలు చాలవరకు ఆధారపడియున్నవి. ఈపాడి విషయమున శ్రద్ధతీసికొనుట స్త్రీలు, గృహిణులవంతే నని నేను వేరుగ చెప్పవలసిన పనిలేదు. ఇంటిలో పాడిచక్కగా, చేసికొనుట ఒకపెద్దపనియే. కాని అదికష్టమని గాని. నామోషియనిగాని చేయకుండుట గర్హనీయము, కష్టేఫలి. చక్కగా ఇంటిలో తృప్తికరముగా పాలు పెరుగులు, వెన్న నేతులు. ఇంటిప్రాంగణములో ఆవుదూడలు గంతులువేస్తూ దూకుతూవుంటే ఆగృహానికి ఎంత అందం చూచుటకెంత ఆనందము.

వ్యవసాయము వలెనే - పాడివిషయములో కూడ ఎక్కువ శ్రద్ధతీసికొనవలసిన అవసరమున్నది. ఆపశువులకు పెట్టు ఆహారము నందేమి, వాటిని పెంచుట యందేమి, వాటివైద్య విధానమందేమి అవసరమున్నప్పుడెల్ల అధునాతనపు అలవాట్లు అలవరచుకొన వలసియున్నది. మనదేశములో పాడిపశువులు ఎక్కువ ఆరోగ్యకరముగ లేవు. అందుచేతనే తగినన్ని పాలును ఇచ్చుటలేదు. ఇట్టిపరిస్థితులకనేక కారణములున్నను ఈ విషయమున ప్రభుత్వము తగినశ్రద్ధతీసికొని తగినసహాయము చేయగలరని మనమూహింప వచ్చునేమో! సలహా కేంద్రములు, పశు వైద్య శాలలూ ఇంకా చాలా ఎక్కువగా కావలసియున్నవి. గ్రామ సీమలలోని ప్రజలుత్సాహవంతులై పాడియందు తగిన శ్రద్ధ తీసికొనిన ప్రభుత్వము సహాయము చేయక తప్పుతుందా!

# సంకల్పం

మన సంకల్పాలే మనచర్యలకు హేతుభూతాలౌతాయి; మనజీవిత విధానాన్ని నిర్ణయిస్తాయి. మనం ఎరిగీ ఎరుగక మాట్లాడే ప్రతీ మాటహా, తెలిసీ తెలియకుండా గావించే ప్రతీచర్యకూ వెనుక మూలాంకురం సంకల్పమే. సంకల్పాలు విత్తనాల వంటివి. ఏ విత్తనం చల్లితే ఆ పంటే పండుతుంది. ఎలాంటి సంకల్పాలు మనబుర్రలో పుడుతుంటే మనం అలాంటి వారిమే ఔతాం. యద్భావంతద్భవతి అన్నారు. పెద్దలు ఎప్పుడూ సత్సంకల్పాలే తలపెట్టమన్నారు.

రేపు మనం ఫలానా చోటుకు వెళ్ళాలి అన్నసంకల్పం ముందు పుడుతుంది. అదే మర్నాడు మనల్ని అక్కడకు తీసుకుపోతుంది. రేపు ఫలానా పనిచెయ్యాలి అనుకుంటాం—అలాగేచేస్తాం. అంటే ఏమిటి? ఇప్పటి సంకల్పాలే రేపటి చర్యగానూ, ఫలితాలుగానూ పరిణామం చెందుతున్నాయన్న మాటేగద.

ఐతే "బుద్ధికర్మానుసారిణీ" అన్నారుగదాయని. "అంతా మనకర్మం ప్రకారం జరుగుతుంది" అని నిస్పృహచెంది, కాళ్ళు ఆరజాపుకు కూర్చుంటే మానవుని కున్న ఘనత ఏదీ? కొంత మానవప్రయత్నం ఉండాలి; ఉంటే దైవ సహాయం అదే లభిస్తుంది ఉదాహరణ "ఆత్రోవను వెళ్ళకు. పెద్దపులి ఉన్నద"ని ఒకరన్నారనుకుందాం. "కర్మ ఉంటే ఎలాగచస్తాం" అని కేవలంకర్మసిద్ధాంతాన్ని నమ్మి పులినోటబడి "కర్మం" అంటే ఎవరేమనగలరు? అతడుశక్తి కొలది ప్రయత్నించి, మరోత్రోవను పోడానికి యత్నించి, అప్పటికీ దానివాతపడితే "కర్మం" అని అప్పుడంటే. ఏమోనని అంతా అనుకోవచ్చు. "అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభం" అనిచెప్పిన పెద్దలే, సత్కర్మవలన దుష్కర్మఫలం కొంత తగ్గించుకో వచ్చునని. ఇంకా సామర్థ్యం ఉంటే "యోగాగ్నిదగ్ధకర్మలు" అన్నట్లు పూర్తిగా కర్మనే దగ్ధంగావించగల సమర్థత మానవుని కుందని చెప్పారు. సంకల్ప బలిమివల్ల ఆత్మ విశ్వాసం అబ్బుతుంది. మహా సముద్రాల్ని పిల్లకాలువగా దాటించ గలిగింది "విశ్వాసం;" విశ్వాసం సాధించ లేనిది లేదు.

ఒకవ్యక్తియొక్క సంకల్ప బలిమిగొప్పదైతే అది తననూ, తోటివారినీ, ప్రపంచాన్నీకూడ మార్చేసే ప్రభావంకలిగి ఉంటుంది. అలాంటి సంకల్ప సిద్ధులు అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ ఉంటూనే వుంటారు. "రామపాద సాగరం" "ఆంధ్రరాష్ట్రం" అన్నవి ముందు కొందరి బుర్రల్లో పుట్టిన ఊహలు మాత్రమే. ఐనా అవి క్రమంగా సాకారం దాల్చి, ప్రజాభ్యుదయానికి లోక కళ్యాణానికి దోహదమౌతాయి. వీటిని సంకల్పాలనండి, పగటికలలనండి. అలాంటి పగటికలలు గాంచేవారే మనకుకావాలి. గాంధీ మహాత్ముడి సంకల్ప బలిమి, ప్రపంచ చరిత్రనే మార్చివేసింది. అతణ్ణి గన్నతల్లి ఎలాంటి పగటి కలలు గన్నదో ఎవరు చెప్పగలరు? మనజాతీయ వీరులు, వీర నారీమణులూ జైళ్ళలోగన్న పగటి కలల ఫలితమే మనమంతా యిప్పుడు అనుభవిస్తున్న స్వాతంత్ర్యం అంటే, అతిశయోక్తి ఎలా అవుతుంది? సంకల్పం గొప్పదైనప్పుడు అది రేడియో ప్రసారం కంటే సూక్ష్మంగా ప్రసారంచెంది అనేక బుర్రల్లో నాటుకొని పని చేస్తుంది. అంతా వేదికలెక్కి ఉపన్యాసాలే యివ్వనక్కరలేదు, పేపరలో పేరు పడనక్కరలేదు, శారదామాత లాంటి వారి జీవితాలూ, సంకల్పాలూ ఎందరెందర్ని తమకు తెలియకుండానే మార్చి. తీర్చి. దిద్దుతున్నాయో ఎవరు చెప్పగలరు? పటుతర సంకల్పాలున్నవారు జైలులో గాదు. మహారణ్యాలలోగాదు. గుహాంతరాలలో నివసించినప్పటికీ, వారి సంకల్పాలు రాతిగోడల్ని దూసుకుపోయి శతాబ్దాలపాటు ప్రపంచాన్నే స్పందింప జేస్తాయి. సత్సంకల్పం యొక్క శక్తి అలాంటిది. రామకృష్ణ వివేకానందుల అమోఘ సంకల్పాలు అలాంటివి గనుకనే ఖండ ఖండాంతరాలు ఉద్రూతలూగి మారిపోతున్నాయి. ఈ పరిణామం ఆటంబాంబుల అట్టహాసం వంటిదా? కాదు. అంతకంటెను పటుతరమైనది; అయినా, కనులకు కనబడకుండను, చెవులకు వినపడకుండను, రోజా పుష్పరాసులను వికసింపజేసే చల్లని మంచువాగున నిశ్శబ్దంగా పని చేస్తున్నది.

తమయొక్క తమకుటుంబాల యొక్క తమతోటివా[రి] యొక్క ప్రపంచంయొక్క శాంతిక్షేమాలు, జీవితాభ్యుదయ సార్థక్యాలు కోరేవారు మనకు ఇప్పుడు కావా[లి]. అందరూ అలాంటి సంకల్పాలనే మననంచేయాలి. భారత ప్రధాని శాంతి సంకల్పాలు ఆనాటి రానాడు బలం చేకూర్చుకొని, దేశదేశాల వాతావరణాన్ని మార్చడం మన

ప్రత్యక్షంగా చూస్తున్నాంగదా. మనకోసం, లోకంకోసం, అంతా ఎప్పుడూ మంచి ఆలోచనలు అలవర్చుకోవాలి. సత్సంకల్పాలకు సజ్జన సాంగత్యం, సద్గ్రంథ పఠన, సదుద్దేశాల మననం, పెద్దల ఆదర్శం మనకు గొప్పగా తోడ్పడుతాయి.

ప్రస్తుతపరిస్థితులు చూడండి: మనలో అనేకులకు కడుపు నిండా తిండి, బుద్ధి వికసించడానికి విద్య, తల దాచుకోందుకు కొంపవగైరా సుఖజీవనానికి వలసిన ముఖ్యావసరాలు ముక్తసరిగా నైనలేవు. మాదేశం గొప్పది, మహోజ్జ్వలచరిత్ర గలది, మేము గొప్పవారం అనుకుంటున్న మనకళ్ళెదుట, "అన్నీ ఉన్న దేశంలోనే అన్నీ కరువుగా" ఉంటుంటే చూస్తూ ఎలా ఊరుకోగలం? అందుచేత అంతా ఆలోచించండి. ఈ విషమ సమస్య పరిష్కారాన్ని గురించి బాగా ఆలోచించండి. ఆబాలగోపాలానికి, ప్రజలకు- ప్రభుత్వానికి, స్త్రీలకు — పురుషులకు అందరికి ప్రస్తుతం యిదే తలంపు. పదిమంది శ్రేయస్సూ దృష్టిలో నుంచుకొని, మానవులు మానవమాత్రులుగానైనా జీవించి, జీవితానందం కొంత చవిజూచి, జీవిత సార్థక్యం కొంత సాధించేటట్లు చేయడం ఎలాగు అన్న ఆలోచన అందరికీ తట్టాలి. ఐహికాముష్మిక సుఖజీవనాలకు సులభ పంథాలని ర్మించడం ఎలాగు అని అన్వేషణ సాగాలి.

ఇలాంటి సంకల్పం కలిగిన్నాడు, ఇక పిచ్చిపిచ్చి పార్టీలకు తావుండదు. పిచ్చి తగాయిదాలు దూరంగా నెట్టివేయబడతాయి, అహంనశిస్తుంది, స్వార్థం రూపుమాసిపోతుంది, పదిమంది శ్రేయస్సే ప్రధానంగా పెట్టుకొని అంతా వ్యవహరిస్తారు. ఆ సంకల్పమే అన్నీ చేయిస్తుంది. ఐక్యత అదే తెస్తుంది. ఆంధ్రులయొక్క, ఆంధ్రేతరులయొక్క, దేశంయొక్క, లోకంయొక్క శ్రేయస్సును సాధించే సంకల్పాలే, పకటికలతే మనకందరికీ యిప్పుడు కావలసింది. పెద్దలు తలపెట్టిన రామరాజ్య స్థాపనమెట్లా అన్నదే ఈ రోజుల్లో అందరి సంకల్పమూను.

కె. సు.



ఆంధ్ర మహిళాసభ

## సర్వసభ్య సమావేశము

ఆంధ్ర మహిళాసభ సర్వ సభ్యసమావేశము ది 15–1–1955 సరిగా 4 గం॥ లకు లజ్‌చర్చ్ రోడ్డులోని సభాభవనములో జరుగును. శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు అధ్యక్షత వహించెదరు.

విషయములు :

1. గత సర్వసభ్య సమావేశపు వివరములు
2. వివిధ శాఖల కార్య క్రమ నివేదికలు
3. వివిధ శాఖల జమాఖర్చులు
5. ఇతర విషయములు

సభ్యురాండ్రు దయచేయ ప్రార్థితులు.

బె. తిమ్మాబాయి
క. రంగనాయకమ్మ
కార్యదర్శినులు.

# ప్రసిద్ధ దంపతులు - గాంధీ దంపతులు

శ్రీమతి గాడేపల్లి సుందరీశంకరం

పురాణ కాలంనుంచి నేటి కాలం వరకూ పుణ్యభూమియైన ఈ భారతదేశంలో ప్రసిద్ధి చెందిన దంపతులు వుంటూనే వచ్చారు. ఏ దాంపత్యమైనా ప్రసిద్ధి కెక్కాలీ అంటే లోక కల్యాణంకోసం ఆ దంపతులిరువురు పాటుపడి ప్రజాసేవ చేయాలి. సతీపతులిరువురిలో సతి పతి ననుసరించడం గాని, పతి సతి ననుసరించడం గాని జరిగితేనేగాని ఆ దంపతులు తలపెట్టిన యే మహాకార్యమైనా విజయ వంతము కానేరదు. అన్ని విధములా దంపతులిరువురి మధ్యా యేకాభిప్రాయమో, యిరువురిమధ్యా గౌరవాభిమానములో వుండి తీరాలి. ఒకరినొకరు అర్థం చేసుకోవాలి— ఆకర్షించుకోవాలి— యిరువురికి పరమార్థ దృష్టి వుండి ప్రజాసేవ చేయాలి.

ఆ శంకరుని కోసం పార్వతిదేవి అహోరాత్రములు తదేక దీక్షతో మంచు వేసవిని, పంచాగ్నిహోత్ర మధ్యంలో కొన్నాళ్ళు, వర్ష కాలమున కుత్తుక బంటి జలములోవుండి కొన్నాళ్ళు ఆకులు, అలములు భక్షించి కొన్నాళ్ళు, అవి కూడ విసర్జించి నిరాహార దీక్షతో కొన్నాళ్ళు, ఘోర తపస్సు చేసి ఆ పరమేశ్వరునికి ప్రేమ పాత్రురాలైంది. ఈశ్వరుడు కూడా తనకు ఆమెయందుగల గాఢానురాగాన్ని వ్యక్తపరచడానికి కాబోలు, తన అర్ధ శరీరాన్నే యామెకిచ్చి అర్ధాంగినిగా చేసుకున్నాడు. ఈవిధంగా పార్వతీ పరమేశ్వరుల దాంపత్యము ప్రసిద్ధి కెక్కితే.— ఏరికోరి శ్రీరామచంద్రుని పెండ్లాడి పదునాలుగేండ్లు వనవాసము చేసి, అడుగడుక్కీ శ్రీరామచంద్రుని అగ్ని పరీక్షలకు గురియై తట్టుకొనుచు, పుట్టినది లగాయతు గిట్టేవరకూ కష్టములేయనుభవించిన సీతామహాదేవి శ్రీరామచంద్రునితో ప్రసిద్ధి కెక్కినది. శ్రీరామచంద్రుడునూ, రాక్షసుడైన రావణుడు సీతామహాదేవిని లంకకు తీసుకునిపోగా దిశలూ కొండలూ గుహలూ మార్మోగేటట్లు ఆలో లక్ష్మణా యని విలపించాడు పాపం— వానర సహాయంతోనే వారధి నిర్మించి రావణుని సంహరించి తన ప్రేమరాశియైన సీతాదేవిని తెచ్చుకొన్నాడుగదా శ్రీరామచంద్రుడు— ఇట్లు ఈ భారతావనిలో, నలదమయంతులు, చంద్రమతి హరిశ్చంద్రులు, సావిత్రి సత్యవంతులు ప్రసిద్ధి కెక్కి ఆదర్శ దంపతులైనట్లే మోహనదాస్ కరమ్ చంద్ గాంధీ, ఆయన సతీమణి కస్తూరీబాయిల దాంపత్యము కూడా ఆ చంద్ర తారార్కమునుగ చిరస్థాయిగా వుండిపోయింది. మన భారత చరిత్రలో వారి దాంపత్య విశేషాలు సువర్ణాక్షరాలతో లిఖింపబడగలవనటంలో సందేహంలేదు. ఆ సేతుహిమాచల పర్యంతమే కాకుండా ప్రపంచమంతటిలోనూ ఆదర్శ దంపతులైన ఈ గాంధీ దంపతులను యెరుగనివారుండరు. అతి సనాతనమైన సుప్రసిద్ధ కుటుంబంలో పోరుబందరులో జన్మించారు ఈ పుణ్య దంపతులు. వివాహం జరిగింది అతి బాల్యంలోనే— ఉభయులకీ వయస్సులో అట్టే తేడా కూడా లేదు. ఆయనకు 15 ఉంటే ఈవిడకు 8 ది కాబోలు వయస్సు— అయితేనేమి ? వారి దాంపత్యము శుక్లపక్ష చంద్రునివలె దినదినప్రవర్ధమానంగా వృద్ధిచెంది వారిద్దరి మధ్యగల గాఢానురాగలత దట్టముగా అల్లుకొని, అవని కంతకీ ఆదర్శప్రాయులైన దంపతులుగా ప్రసిద్ధి కెక్కారు. ఈ దంపతులను తలుచుకుంటేనే వళ్ళు పులకరించక మానదు

విద్య నిమిత్తం గాంధీజీ చాలకాలం లండనులో వున్నారు. స్వదేశానికి తిరిగి వచ్చిన కొద్ది రోజులకే పత్నీ సమేతుడై ప్రాక్టీసు కోసమని దక్షిణాఫ్రికాకు యిరువురూ ప్రయాణమై వెళ్ళడం జరిగింది— అక్కడ గల భారతీయుల కడగండ్లను చూసి గాంధీ మహాత్ముని హృదయం తపించి పోయింది— అది సహించలేక పోయారు— అక్కడ సహాయ నిరాకరణోద్యమం సత్యాగ్రహోద్యమాలు ప్రారంభించాడు. కస్తూరిబాసతీమతల్లి కూడా భర్తకి చేదోడు వాదోడై వేలకొలది ప్రజలకు అన్నపూర్ణవలె అన్నము పెట్టి పోషించింది. ఆ ప్రజలందరికీ తన భర్తకంటె కూడ తానే ముందుగా మాతృ దేవియై గౌరవం పొందింది— అక్కడి ఉద్యమాల్లో కృతకృత్యులైన తరువాత ఆ పుణ్యదంపతులిరువురూ స్వదేశమైన భారత దేశానికి తిరిగి వచ్చారు. ఆకలి మంటలను దాస్య శృంఖలాలతో పరప్రభుత్వ యినుప పాదాలక్రింద నలిగి పోతూవున్న తమ మాతృభూమిని చూచి తపించి పోయారు. స్వదేశానికి స్వాతంత్ర్యము సంపాదించి పెట్టుటకు ఆ దంపతులు పడిన కష్టములు వర్ణనాతీతము. కస్తూరీబాయి సతి, భర్తతో సమస్తమైన రాజకీయ సంబంధమైన బాధలనూ అనుభవించి తుదకు భర్త ఒడిలోనే ప్రాణములు వదలి వీర పత్నీత్వము సిద్ధింప జేసు

కొన్నది. భర్తయైన గాంధీమహాత్ముడు తనకిష్టములేని పనులు యెన్ని చెప్పిననూ పతి యనుసరణమే పరమానందమను దృష్టితో. జీవితాంతము వరకూ భర్త కోరిక ప్రకారమే తానునూ ప్రవర్తించి కైరా జిల్లాలలో ఓం ప్రథమంగా తలపెట్టిన సహాయ నిరాకరణోద్యములోనేమి. 1930 నాటి ఉప్పు సత్యాగ్రహోద్యమంలో నేమి భర్తృవాక్య పరిపాలన గావించి ప్రజాసేవ చేసి పరమ సాధ్వి యనిపించుకొంది. ఆ భార్యాభర్తల నడుమగల ఆంతరంగిక విషయాలు, ఒకటి రెండు గమనిస్తే ఆ దంపతులలో ఒకరిపై యొకరికి గల ఆదరాభిమానాలు అర్థమవుతాయి.

ఒకప్పుడు ఏ ఖర్చుకైనా వుంటుందని కస్తూరీబాయి నాల్గు రూపాయలు దాచుకొన్నదట. అది గాంధీ మహాత్ముడు చూచి, కోపించి, మూడు మాసములు ఆమెతో మాట్లాడనని కఠిన శిక్ష విధించాడట. పాపం ఆమె ఆ మూడు మాసములు నిరాహార దీక్షతో పరోక్షంగానే పతిసేవ చేస్తూ కాలక్షేపం చేసిందిట ఆ పరమ సాధ్వి.

ఓసారి మహాత్ముడు అతిథులతో భోజనానికి కూర్చుండగా. ఆమె సన్నని వస్త్రమేదో కట్టుకొని వడ్డిస్తున్నదట. అది చూచి మహాత్ముడు మహోగ్రుడై 'ఇది యే'మని ప్రశ్నించాడుట. ఖద్దరు చీర మురికిగావుంది- అందుచేత యీ సన్నచీర వుంటే కట్టుకున్నాను' అని అన్నదట. దాంతో మహాత్ముడన్నదేమో తెలుసా — ఆ సన్నటిచీర కట్టుకుని నీవు వడ్డించుటకంటే నగ్న వస్త్రవై వడ్డించుట మేలని కోపగించి మందలించాడుట. అంత కఠినముగా భర్త ప్రతిచిన్న విషయంలోనూ ప్రవర్తించినా. ఆమె పత్యనుసరణమే పరమార్థముగా భావించి అంతటి కఠిన హృదయుడైన మహాత్మునితో కాపురం చేసి వన్నెకెక్కింది. మహాత్మునియందు ఆమెకుగల అనురాగానికి తార్కాణంగా ఒక్క విషయం చెబితేచాలును. గాంధీగారు రాజకీయ ప్రసంగాల్లో వుండిపోయి తిండికూడా మరచిపోయేవాడుట. అప్పుడు యీమె కాలాతిక్రమణానికి ఓర్వలేక తాను స్వయంగా ఆహారాన్ని భర్త దగ్గిరకు తెచ్చి తన చేతులతో నోటికందిచేదట. అప్పుడు గాంధీగారు విసుగుకొంటే ఆమె చంటిపిల్లవానిని తల్లి బుజ్జగించిన విధముగా ప్రాధేయపడితే, ఆమె ప్రార్థనలు అక్కడే కూర్చునియున్న యితరులు గమనించి మహాత్ముని వేడుకొని ఆమె అందించిన యాహారాన్ని తినునట్లుగా చేసేవారుట. ఈమె తన భర్త విషయంలో 'కార్యేషు దాసీ కరణేషు మంత్రీ భోజ్యేషు మాతా' అను వాక్యములను అక్షరాలా ఆచరణలో పెట్టిన పరమసాధ్వి. మహాత్ముడు నడిపించిన మహోద్యమాలన్నింటికీ వాస్తవానికి కార్యాచరణ చేసిన కార్యదర్శి కస్తూరీ బాయియే అనటంలో ఆశ్చర్యంలేదు. ఈమె ఆయనతో వహించిన దీక్ష ఫలితములే. ఆయనకీ, దేశానికీ విజయకారణాలయ్యాయి అనటం అతిశయోక్తి కాదనుకొంటాను. మనస్సుతోనూ, క్రియతోనూ వాక్కుతోను యెల్లవేళలా భర్తయొక్కమాట, చర్య, తనవిగా భావించి, పూనుకొనినిర్వహించిన మహాపతివ్రత. అయితే ఇటువంటిభార్యపై ఆ మహాత్మునికి ఎంతటిప్రేమాతిశయాలున్నాయో ఆ పుణ్యదంపతులను చూచినవారికి యెప్పుడూ గోచరమౌతూనే యుండేవి. చివరకు అవసానకాలంలో ఆమె ప్రాణోత్క్రమణ సమయంలో అంతటి స్థితప్రజ్ఞుడైన గాంధీమహాత్ముడు కూడా దుఃఖంతో స్తంభీభూతుడవటం చూస్తే ఆయనకెంత ప్రేమాభిమాన గౌరవములు తన భార్యయెడ గలదో, ఆనాడు అక్కడే యుండిన సరోజినీదేవి వెల్లడించింది. దివంగతులైన యీ ప్రసిద్ధ దంపతులు పురాణ దంపతులైన త్రిమూర్తులలో ఒకరై యుండవచ్చునని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఇటువంటి నిస్వార్థమైన సేవా, త్యాగమయజీవితాన్ని గడపిన ఈ దంపతులు మన భారతదేశానికే కాక సకల ప్రపంచానికీ ఆదర్శ దంపతులైనారు. కనుకనే పురాణ దంపతులకు వలెనే శిలా విగ్రహములూ, స్మారక మందిరములూ కూడా నిర్మించి భక్తి శ్రద్ధలతో పూజా పునస్కారాలు జరుగుతూనే వుంటాయి —





కత్తి నాట్యం

(చైనీయుల జాతీయ నాట్యం)

పూర్వం చైనా దేశస్థులు, ఇరుప్రక్కలా పదునున్న ఖడ్గాన్ని, ఆత్మరక్షణార్థం ఉపయోగించేవారు. దాన్ని ఉపయోగించే విధానం నేర్చుకోవడంలో ఆవ్యక్తి పటుతరమైన ఋజువర్తనాన్ని, గౌరవనీయమైన ఆత్మనూ పొందుతాడని వారనుకుంటారు.



# రాజకీయాలు

శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు.

1954 నవంబర్ నాలుగోవారం మొదలుకుని డిసెంబర్ మూడోవారం వరకూ జాతీయ, అంతర్జాతీయ రంగాల్లో నడిచిన ప్రముఖ సంఘటనలు ఈవిధంగా ఉన్నవి: ఆంధ్రలో ఎన్నికలు ఫిబ్రవరి 11 నుంచి 27 వరకు జరుగుతవని గవర్నర్ ప్రకటించటం, నందికొండ ప్రాజక్టుకు కేంద్ర ప్రభుత్వం కొన్ని షరతులతో అంగీకరించటం, భారతదేశ ఆర్థిక వ్యవస్థను సోషలిస్టు పద్ధతిలోకి మార్చటానికి లోక్‌సభ ఆమోదించటం, ఇండియాలో యుగోస్లావ్ నాయకుడు టిటో, చైనాలో బర్మా ప్రధాని నూ పర్యటించటం, ఐక్యరాజ్యసమితి కార్యదర్శి హామర్‌షెల్డ్ పెకింగ్ వెళ్ళే ఏర్పాటు జరగటం.

* * *

ఆంధ్రలో కొత్త శాసనసభకు ఫిబ్రవరి 11 నుంచి 27 వరకూ, మొత్తం 5 రోజులపాటు, 196 మంది సభ్యుల్ని ఎన్నుకునేందుకు ఎన్నికలు జరుగుతవని ప్రకటించబడ్డది. వీటిలో ఎన్నుకోబడే శాసనసభ కాలపరిమితి 5 సం॥లపాటు ఉంటుంది. అంటే ఈతడవ పార్లమెంటు ఎన్నికలతోపాటుగా శాసనసభ ఎన్నికలు జరగవన్నమాట.

ఈతడవ ఆంధ్రలో కమ్యూనిస్టులకూ, కాంగ్రెసుకూ బలాబలాలను తేల్చివేసే అతిప్రధాన పోరాటం జరగబోతున్నదనీ, దీని ప్రభావం యావద్భారత దేశంమీదనూ ప్రసరించగలవనీ సర్వత్రాభావించ బడుతున్నది. తన భవిష్యత్తు అంతా ఈ ఎన్నికలమీదనే ఆధారపడిఉన్నదని కాంగ్రెస్ భావిస్తున్నది. అందుకోసమే, కాంగ్రెస్ ఇతర పార్టీలతో ఒడంబడికలు చేసుకొనదనీ, కాంగ్రెస్‌తో సహకరించదలచుకునేవాళ్ళు కాంగ్రెస్‌లో జేరిపోవటమన్నది ఒక్కటేమార్గమనీ ఆర్భాటాలు చేసిన కాంగ్రెస్‌నాయకులు, దురహంకారాన్ని దిగమింగుకుని మిగిలిన కమ్యూనిస్టేతరపక్షాలతో డెమాక్రటిక్ ఫ్రంట్ ఒకటి ఏర్పాటు చేయటానికి అంగీకరించారు. కాంగ్రెస్, కృషికార్ లోక్, ప్రజాపార్టీలు కలిసి ఉమ్మడిగా అభ్యర్థుల్ని ఎంచుకుని, కలిసి పనిచేయటానికి నిశ్చయించుకున్నారు. ఈకలయిక ఎన్నికల్లోనేకాకుండా, శాసనసభలోనే ఉండాలని నిశ్చయించుకున్నారు.

ఈఫ్రంట్ మెజారిటీ సంపాదించి ప్రభుత్వం స్థాపించకలిగితే బలపడుతుందనీ, ఓడిపోతే అవిభక్త మద్రాసులోని యునైటెడ్ డెమాక్రటిక్ ఫ్రంట్, హైదరాబాదులోని పీపుల్స్ డెమాక్రటిక్ ఫ్రంట్, తిరుక్కొచ్చిలోని యునైటెడ్ లెఫ్టిస్ట్ ఫ్రంట్‌ల మోస్తరువిచ్చిన్నం అవుతుందనీ, వెనకటి చరిత్రనుబట్టి చెప్పవచ్చు.

ప్రభుత్వం ఏర్పరిచిన తరవాతకూడా ఈవర్గాలకు చీలికరావటం అంతకష్టమయిన విషయం కాదని, గత శాసనసభ పరిస్థితులే నిరూపిస్తున్నవి. కాంగ్రెసును అధికారంలోకి రాకుండా చేయాలని ఇతరపక్షాలు ఇంతకుముందు చేసిన ప్రయత్నాలు ఎంతనెగ్గినవో, కమ్యూనిస్టుల్ని అధికారంలోకి రాకుండాచేయాలని ఈఫ్రంట్ చేస్తున్న ప్రయత్నాలకూ, వాళ్ళకు ఉండే ఐక్యతకూ, అంతకన్నా ఎక్కువ అవకాశాలు ఉంచడం అనుమానాస్పదం.

ఎన్నికలనిర్వహణలో అతిరథుడు మహారథుడు అని పేరుమోగిన ఎస్. కె. పాటిల్‌గారు కాంగ్రెస్ తరఫున ప్రచారం జరిపిస్తారు. భారతదేశంలో ఉన్న కమ్యూనిస్టు ప్రముఖులుయావన్మందీ, ఆంధ్రలో తమ పార్టీకి అండగా నిలబడుతున్నారు. అధికారాన్ని వశపరుచుకోవాలన్న సంకల్పంతో యావన్మంది ప్రముఖ ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులూ ఈ ఎన్నికల్లో పోటీచేస్తున్నారు.

ఈ కమ్యూనిస్టేతర ఫ్రంటులో ప్రజాసోషలిస్టుపార్టీ జేరలేదు. కార్యదర్శి పి. వి. జి. రాజుగారు ఈసహకార

పద్ధతిని నిరసించారు. అయితే అధ్యక్షుడు కొమ్మారెడ్డి సూర్యనారాయణ, ఎన్నికల నిర్వహణాధికారి నడింపల్లి నరసింహారావుగార్లు సంప్రదింపులకోసం ఢిల్లీకివెళ్ళారు. అఖిలభారత పి. ఎస్. పి. అధ్యక్షుడు నరేంద్రదేవతో నెహ్రూ ఈవిషయమై సంప్రదించినట్లు తెలుస్తున్నది.

ఆంధ్ర ప్రభుత్వాన్ని పడదోసిన విశ్వాసరాహిత్య తీర్మానాన్ని ప్రతిపాదించినట్టి కృషికార్‌లోక్ ప్రముఖుడు లచ్చన్నగారు ఈ ఫ్రంట్ స్థాపనకుముందు పి.ఎస్.పి.తో ఒక ఎన్నికలమైత్రి కుదుర్చుకున్నారు. ఈ ఒప్పందాన్ని గౌరవించేందుకు 16 స్థానాలను ఫ్రంట్ వదిలిపెడుతుందని తెలుస్తున్నది.

మొత్తానికి ఈ ఫ్రంట్ స్థాపనవల్ల రెండు అంశాలు తేలుతున్నవి.

1. ఆంధ్రలో ప్రధాన రాజకీయ పక్షంగా కమ్యూనిస్టు పార్టీ తయారుకావటం.

2. అతి స్వల్ప వివాదాలవల్లనో, విభేదాలవల్లనో కాంగ్రెస్‌నుంచి బయటికి వచ్చి ఏర్పడ్డ చిల్లరపార్టీలకు, కాంగ్రెసుతో తేడా ఏమీలేదని నిరూపణకావటం.

*　　*　　*

నందికొండ ప్రాజక్టును కొన్ని షరతులమీద ప్రథమ పంచవర్ష ప్రణాళికలో జేర్చటానికి కేంద్ర ప్రభుత్వం నిశ్చయించింది. భూమి అభివృద్ధిపన్నును విధించటం, నీటితీరువను పెంచటం, భూమిశిస్తును వెనకటి పద్ధతుల్లోనే వసూలు చేయటం, సాగుక్రిందలేని భూముల్ని అమ్మి డబ్బు సేకరించటం మొదలైన అంశాల ద్వారా ప్రాజక్టు ఆర్థికప్రాతిపదికను ఆంధ్ర ప్రభుత్వం స్పష్టపరచాలనీ, దానికి శాసనరూపమయిన హామీ ఇవ్వాలనీ, తమనిపుణులు ప్రాజక్టుకు చేసే మార్పులకు అంగీకరించాలనీ కేంద్ర ప్రభుత్వం కోరింది. ఈ షరతులను ఇంతవరకూ దేశ మొత్తంమీద కోసీ, చెంబల్ ప్రాజక్టులకు మాత్రమే విధించినట్లు కేంద్ర మంత్రి హాథీవెల్లడించారు. ఈ షరతుల విషయమై చర్యతీసుకునే అధికారం ఆంధ్ర గవర్నరుకు ఇవ్వబడ్డది. క్రొత్తమంత్రి వర్గం ఏర్పడ్డ తరవాతనే ఆంధ్రలో క్రొత్త ప్రాజక్టుల నిర్మాణమని కేంద్ర డిప్యూటీ మంత్రి దాతార్ డిసెంబర్ 18న పార్లమెంటులో చేసిన ప్రకటన ఏమయిందో తెలియదు. ప్రాజక్టుఎప్పుడు మొదలయ్యేదీకూడా తెలియదు.

కేంద్ర షరతులన్నిటికీ ఆంధ్ర కాంగ్రెస్ అంగీకరించింది. కమ్యూనిస్టు నాయకులు మాత్రం వీటిని తీవ్రంగా విమర్శిస్తూ, బంజర్లపంపిణీ, భూమిసంస్కరణలు మొదలైనవాటికి ఇవి అడ్డం రావీలులేదని, ప్రజలసహకారంతో ప్రాజక్టును తాము చాలా చౌకగా నిర్మించగలమనీ చెపుతున్నారు.

ఆంధ్రా డెమాక్రటిక్ ఫ్రంట్ నాయకులు ఈసంస్కరణలన్నిటికీ తిలోదకాలిస్తే, మద్యనిషేధం ఒక్కటీ వారిని గెలిపించకలుగుతుందా ?

కేంద్ర ప్రభుత్వం షరతులు విధించటానికి కారణం ఆంధ్ర మంత్రివర్గం బంజర్లపంపిణీ, చిన్న రైతులకు శిస్తు రద్దుచేస్తూ తలపెట్టిన చర్యలే.

*　　*　　*

తిరుకొచ్చిలో కమ్యూనిస్టుల్ని అధికారంలోకి రాకుండా చేయటానికని కాంగ్రెస్ ప్రజాసోషలిస్టు మంత్రివర్గానికి ఇస్తున్నసహకారం ఈనెలలో ఉపసంహరించుకోబడ్డది. ముఖ్యాంశాలమీద తమ సలహా తీసుకుంటామని ఇచ్చిన హామీని ముఖ్యమంత్రి తానుపిళ్ళె పాటించకపోవటం, కాంగ్రెసును అన్నివిధాలా దెబ్బతీయటమే తమలక్ష్యంగా పి. ఎస్. పి. నాయకులు వ్యవహరించటం మూలంగా తామీచర్య తీసుకోవలసివచ్చిందని కాంగ్రెస్ పార్టీ వాదిస్తున్నది. పి.ఎస్.పి. నాయకులు కాంగ్రెసుకు మంగళం పాడించటానికి ప్రయత్నిస్తున్నారనీ, వాళ్ళు ప్రారంభించే ప్రాజక్టులూ, చేయించే పనులూ, కాంగ్రెసేతర సభ్యులు ఎన్నికయిన ప్రాంతాల్లోనేననీ, ఏ సంఘంలోనూ తమకు ప్రాతినిధ్యం లేకుండా ప్రభుత్వం చేస్తున్నదనీ, స్థానికసంస్థలోకూడా తమను అధికారంలోకి రాకుండా చేసేందుకు పి.ఎస్.పి. ప్రయత్నిస్తున్నదనీ కాంగ్రెస్ ఆరోపించింది. దేశంలో ప్రతి ఒక్క రాష్ట్రంలోనూ కాంగ్రెస్ మంత్రి వర్గాలను గురించి ప్రతికూలపక్షాలు చెప్పే విమర్శలు ఇవే.

కాంగ్రెస్ తన తోడ్పాటును ఉపసంహరించుకొన్నందుకు కారణం తిరిగి అధికారాపేక్ష కలగటమేనని పి. ఎస్. పి. నాయకులు ఆరోపిస్తున్నారు. కిందటి శాసన

సభలో తిరువాన్కూర్ తమిళ కాంగ్రెస్ విడిపోవటాన పడిపోయిన కాంగ్రెసు పార్టీ ఇప్పుడు తిరిగీ వాళ్ళ సహకారంతో ప్రభుత్వం స్థాపించాలని ఆశపడుతున్నదనీ, దానికి తమిళ కాంగ్రెస్ సుముఖంగానే ఉన్నదనీ తెలుస్తున్నది. ఈ కమ్యూనిస్టేతర పక్షాల మైత్రిని' చూపిన మీదట, ఆంధ్ర పి. ఎస్. పి. నాయకులు కాంగ్రెస్ ఫ్రంటులో జేరేందుకు వెనకాడుతున్నారు.

* * *

దేశ ఆర్థిక వ్యవస్థను క్రమేపీ సోషలిస్టు పద్ధతిలోకి మార్చాలని లోక్‌సభ తీర్మానించింది. 1948 సం॥ లో ప్రభుత్వం ప్రతిపాదించిన పారిశ్రామిక విధానం సోషలిజాన్నే ఉద్దేశించిందని పండిత నెహ్రూ చెప్పినదానికి కృపలానీ ప్రభృతులు విమర్శిస్తూ, అది సోషలిజం అయితే, అదేదో విపరీతమయిన సోషలిజమే అయిఉండాలని అన్నారు. రెండో పంచవర్ష ప్రణాళికలో ప్రైవేటు నిర్వహణ కిందఉన్న పరిశ్రమలకన్నా, ప్రభుత్వ నిర్వహణ కిందికి వచ్చే పరిశ్రమలు ఎక్కువ ఉండగలవనీ, అయితే ప్రైవేటు పరిశ్రమలన్నిటినీ జాతీయం చేయటం మాత్రం జరగదనీ నెహ్రూ అన్నారు.

ఈ పద్ధతిన గుడ్డల మిల్లులనూ, జనపనార మిల్లుల్నూ, భీమాకంపెనీలను 2 ॥సం॥ల వరకూ ముట్టుకోకుండా ప్రభుత్వం ఉంటే, నిరుద్యోగ సమస్యను పరిష్కరించటం అసాధ్యమని, వీటన్నిటినీ ప్రభుత్వం వశపరుచుకోవాలనీ కాంగ్రెస్ సభ్యుడు గాడ్గిల్‌గారు సూచించారు. విదేశీకంపెనీల వ్యవహారాలపై విచారణ జరిపించాలని జోషిం ఆల్వా అన్నారు.

వాణిజ్య మంత్రి కృష్ణమాచారిగారు మాట్లాడుతూ అందరికీ పని లంభించాలంటే జీవన స్థాయిని తగ్గించుకోవలసి వుంటుందని హెచ్చరించారు. అంటే జీతాల, కూలీల తగ్గింపుకు ఇది సూచనఏమో!

* * *

రాజ్యసభ ఈ నెలలో హిందూ వివాహాల, విడాకుల బిల్లును కొన్ని సవరణలతో ఆమోదించింది.— అందులో ముఖ్యాంశాలివి:— 1. వివాహానికి కనీస వయస్సు స్త్రీలకు 15, పురుషులకు 18 (దీనిని రాజ్యసభలోని స్త్రీ సభ్యులే గట్టిగా కోరారు) 2. ఎవరికయినా ఒక్కరిని మించి భార్యలు ఉంటే, వాళ్ళు భర్తనుండి విడాకులు కోరవచ్చును. 3. విడాకుల్లో కొన్ని సందర్భాల్లో భార్యే భర్తకు మనోవర్తి ఇవ్వవలసి వుంటుంది.

ఈ బిల్లుపై జరిగిన చర్చ సందర్భంలో కొందరు సభ్యురాండ్రు స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం లేనిదే ఇది నిరర్థకమనీ, దీనికన్నా ముందుగా హిందూవారసత్వం బిల్లును, స్త్రీలకు ఆస్తి హక్కుల బిల్లునూ ప్రతిపాదించి ఉండవలసిందని అన్నారు.

* * *

ఐక్యరాజ్య సమితి8 వ సర్వసభ్య సమావేశం ఈ నెలలోనే పూర్తి అయింది. ఈ సమావేశంలో అది మొరాకో సైప్రస్ మొదలైన పలనల విషయంలో పాలకవర్గాలకు అనుకూలంగా చర్చలను వాయిదావేయించింది. అమెరికా చెప్పుచేతల్లో నడిచి, చైనా విషయంలో మరొక తప్పటడుగు వేసింది. 11 మంది అమెరికన్ వైమానికులు, ఇద్దరు పౌరులు చైనాలో గూఢచారి చర్యలు జరిపినందుకని చెప్పి శిక్షింపబడ్డారు. ఆ వైమానికులు కొరియా యుద్ధంలో పాల్గొన్న వాళ్ళనీ. వాళ్ళను శిక్షించటం కొరియా యుద్ధ విరమణ ఒప్పందానికి విరుద్ధమనీ ఐక్యరాజ్య సమితి తీర్మానించింది. తీర్మానం చేసేందుకు ముందు చైనావాదాన్ని వినలేదు.

ఈ విషయమై సౌమ్యంగా పరిష్కరించుకునే ఉద్దేశంతో సమితి కార్యదర్శి హామర్ షెల్డ్ పెంకింగ్‌కు రాదలచినట్లు తెలియజేయగా, చైనా ప్రధాని అంగీకరించారు. జనవరి మొదటి వారంలో ఆయన పెంకింగ్ వెడతారు. చైనా సౌమ్య వైఖరివల్లనూ, సమితి కార్యదర్శి అక్కడికి వెళ్ళటం వల్లనూ, సమితిలో చైనా ప్రాతినిధ్య సమస్య పరిష్కారం అయే అవకాశం లేకపోలేదు.

* * *

జర్మనీని సాయుధం చేయటానికి పశ్చిమ రాజ్యాలు చేస్తున్న ప్రయత్నాలను రష్యా తీవ్రంగా ప్రతిఘటిస్తున్నది. ఆప్రయత్నాలను విరమించకపోతే, తను లోగడ చేసుకున్న మైత్రి ఒప్పందాలను రద్దు చేస్తానని బ్రిటన్ ఫ్రాన్స్‌లకు హెచ్చరికచేసింది. తూర్పు యూరప్ దేశాలను సమావేశపరిచి, మరొక రక్షణవ్యవస్థను ఏర్పాటు చేస్తున్నది.

## రాజకీయాలు

ఈనెలలోనే యుగోస్లావ్ అధ్యక్షుడు మార్షల్‌టిటో ఇండియాలోనూ, బర్మాప్రధాని నూ చైనాలోనూ పర్యటించారు. ఉభయులుకూడా, ఇండియా, చైనాలు ప్రతిపాదించిన శాంతియుత సహజీవనం పట్ల విశ్వాసం వెల్లడించారు. చైనా శాంతి వాంఛ పట్లనూ విశ్వాసం వెల్లడించగా. రష్యా, తూర్పుయూరోప్ దేశాలు స్నేహంగా ఉండగోరుతున్నందుకు టిటో సంతృప్తి వెల్లడించారు. ఫార్మోజా సమస్యా పరిష్కారానికి తాను మధ్యవర్తిత్వం చేయటానికి సిద్ధంగా ఉన్నానని నూప్రకటించారు. ఫార్మోజా చైనాలో అంతర్భాగమేనని ఉద్ఘాటించారు.

* * *

డిసెంబర్ 11నుంచి జరగవలసిన బ్యాంకు ఉద్యోగుల సమ్మె వాయిదా వేయబడ్డది. జీతాల హెచ్చింపుకోసం పశ్చిమ బెంగాల్ పోలీసులు నిరశన దీక్ష చేయగా వెయ్యి మంది అరెస్టు కావడం, దరిమిలా సమ్మెవిరమణ జరిగినవి. బొంబాయిరేవు నావికులు. సమ్మె చేయగా, యుద్ధకాలంలో జారీ అయిన అత్యవసర సిబ్బంది చట్టం అమలు చేస్తానని ప్రభుత్వం హెచ్చరించటం వల్ల, అది ఆగిపోయింది.





ఇటీవల శ్రీమతి ఇందిరాగాంధీ పెకింగ్ వెళ్ళినప్పుడు అఖిలచైనా డిమాక్రాటిక్ విమెన్స్ ఫెడరేషన్‌వారు ఆమె గౌరవార్థం ఏర్పరచిన టీపార్టీ దృశ్యం. ఫొటోలో (ఎడమవైపున) కాంగ్-కీ-చింగ్ (మధ్యను) లై-ఛై-చియంగ్, అఖిలచైనా డిమాక్రాటిక్ విమెన్స్ ఫెడరేషన్ స్టాండిగ్ కమిటీ సభ్యులు, వారి అతిథి శ్రీమతి ఇందిరాగాంధీ ఉన్నారు.

# అబల బోస్

శ్రీమతి కె. రామలక్ష్మి

సాధారణంగా మనం చూస్తూవుటాం. జగద్విఖ్యాతులైన మహామహుల ధర్మపత్నులు తగినంత వెలుగులోకి రారు. అంతేకాదు. వారిపట్ల ప్రపంచంకూడా ఎక్కువ శ్రద్ధాశక్తులు కనపరచదు, విఖ్యాతుని భార్యగా రాణించగల శక్తి గలస్త్రీకూడా గాంభీర్యం కలదే అయివుండాలి, లేకుంటే ఆతనికి భార్యగా రాణించడం కష్టం అతను శాస్త్రజ్ఞుడు కానివ్వండి, రాజకీయవేత్త కానీయండి. కవి కానివ్వండి, చిత్రకారుడు కానివ్వండి, ఎవరికేనా సరే, కష్టసుఖాలు పంచుకొని, తనలో గుప్తంగా వున్న శక్తులను రగుల్కొల్పి జ్వలింప చేయడానికి తగిన సహచరి లేకుంటే, తానందుకోదలచుకొన్న ఉన్నతోన్నత శిఖరాల నందుకోలేడు. భారతీయ ఋషులు యీ విషయాన్ని ఎప్పుడో ఒప్పుకున్నారు. గురువుగారి భార్యకూడా గురువుగారి వలెనే పూజింపబడింది, ఆరాధింపబడింది. శాస్త్రీయ ప్రపంచమూ భారతీయులూ కూడా సర్. జె. స, బోస్‌ని ఆధునిక యుగంలో గురువుగా గుర్తించారు. కాని, ఒక ఆదర్శ గృహిణిగా ఒక వ్యక్తిత్వం గల మహిళగా శ్రీమతి అబల బోస్‌ని ప్రపంచం గుర్తించ వలసినంతగా గుర్తించలేదు, నిజానికి యీ ప్రపంచానికి ఒక జె. సి. బోస్‌ని అందివ్వగల ఘనత అబలబోస్‌దే. భారతదేశంలో చైతన్యవంతులైన మహిళలలో అబల బోస్ ప్రప్రథములు.బెంగాల్ సాంఘిక సంస్కరణల ప్రారంభదశలో ఒకబలవత్తర శక్తిగా పనిచేసింది అబలబోస్.

పుట్టిన పుట్టుక, స్వతహాగా గల మనస్తత్వం, తెచ్చుకొన్న సంస్కృతి—అబలని ఆమె నెరవేర్ప వలసిన మహత్తర కార్యాలకి సంసిద్ధురాలను చేశాయి.

తండ్రి కీర్తిశేషులు, శ్రీ దుర్గా మోహన్‌దాస్ బ్రహ్మ సమాజ సభ్యులలో ప్రముఖుడు, కలకత్తాలో పేరుమోసిన లాయరు, స్త్రీ విద్య విషయంలో ప్రముఖపాత్ర వహించి ఆడపిల్లల చదువుకోసం పోరాడిన వీరుడు. బాలికల పాఠశాల ప్రారంభకులలో ఒకడు. ఈ స్కూలు ఎంతో ఉచ్ఛదశలోకి వచ్చింది. అబలకి తండ్రి అంటే అపరిమితమైన అభిమానమే కాకుండా, గర్వంకూడా. తల్లి తండ్రి తానే అయి కుమార్తెని పెంచిన దుర్గా మోహన్‌దాస్‌కి అబల తగిన కూతురని పించుకొంది. విజ్ఞాన శాస్త్రం అంటే అభిమానంచేత అబలని ఆదోవే పట్టించాడు. నాలుగు సంవత్సరాలపాటు మద్రాసు మెడికల్ కాలేజీలో చదువు సాగించింది. ఆఖరు సంవత్సరంలో, విషజ్వరం పీడించడంవల్ల చేసేదేమీలేక చదువు ముగించి తిరిగి యింటికి వచ్చేసింది. కాని యీ శాస్త్రీయ విజ్ఞానం ఆమెలో శాస్త్రజ్ఞులంటే అభిమానాన్ని రేకెత్తించింది. అప్పుడే ఇంగ్లండు నుండి తిరిగి వచ్చిన జగదీశ్ చంద్రబోస్‌ని కలుసుకొని అతనితో సాన్నిహిత్యాన్ని, కోరికని పెంపొందించుకొంది. జగదీశ్ చంద్రబోస్ అబలకంటె వివాహం నాటికి ఆరు సంవత్సరాలుపెద్ద. వీరి వివాహం, అనేకవిధాలయిన సాంఘికసంస్కరణలకి ప్రతిరూపం. అబలకి యిరవై రెండు సంవత్సరాలు, ప్రొఫెసర్ బోస్‌కి ఇరవై ఎనిమిది. అబల ఐశ్వర్యవంతుల యింట్లో అదృష్టపు ఒడిలో పెరిగింది. జగదీశ్ చంద్రబోస్, కుటుంబం ఆర్థికంగా అష్టకష్టాలూ పడే కుటుంబం. అతన్ని అన్నివిధాలా అప్పులు పీడించేవి. ఈ కష్టాలన్నీ పంచుకోడానికి తన సౌఖ్యాలన్ని మరచిపోటానికి కూడా అబల వెనుతీయలేదంటే, ఆమె ఉక్కులాంటి నైతికబలం, సౌశీల్యం వెల్లడవుతుంది. వివాహమైన తొలిరోజులు అన్నివిధాలా పరీక్షాదినాలు. చిన్న అద్దె యింటికోసం, యూనివర్సిటీకి ఎంతో దూరంలో కాపురం వుండేవారు. వారంలో ఎక్కువగంటలు ఏకాంతంలో గడపవలసి వచ్చేది అబల. అయినా ఆమె బాధపడలేదు. సెలవు దినాల్లో కోల్పోయిన అమూల్యమైన ఘడియలని తిరిగి సృష్టించు కొనేవారు,

## జీవిత చిత్రణ

ఇద్దరూ కలిసి. తక్షశిల, నలందా, కాశ్మీరు, అజంతా మొదలైన చారిత్రాత్మక స్థలాలని చూచుకొంటూ, ప్రకృతికీ, దేశచరిత్రకీ అతి సన్నిహితంగా వుంటూ కాలం గడిపేవారు. జగదీశ్ చంద్రబోస్ సాయంత్రం షికారుకి కొంచెం బద్ధకించినా వూరుకొనేదికాదు అబల. నయాన్నో భయాన్నో బయటకు తీసుకు వెళ్ళేదట. అతని కనురెప్పగా వుంటూ, అతని ఆహారం విషయంలో, ఎంతో జాగ్రత్తగా వుంటూ, యిల్లు సరిదిద్దుకు వస్తూండేది. ఎప్పుడూ పరిశుభ్రమైన దుస్తులలో ప్రశాంతంగా వుంటూండేవాడు బోస్. నిజానికి, ఆతనికి కళ్ళూ చెవులూ చేతులూ అబలే. తనులేకుంటే, ఒక్కడూ తనని తనే సరిదిద్దుకోలేడని ఒప్పుకొనేది అబల. అతను ప్రపంచయాత్రలు చేస్తుంటే మొదట్లో తనకి ఏమాత్రం యిష్టంలేకున్నా, తరువాత ఆయిష్టాన్ని అలవరచుకొని, తానూ వెళ్ళింది. ఈ యాత్రలు ఎంతో ఆనందాన్ని యిచ్చాయని చెప్తూ, మార్గరెట్ కజిన్సు సతితో "వివిధ దేశస్థులని కలుసుకోవడం మాట్లాడడం మనదృక్పథాని కెంతో వైశాల్యం యిస్తుంది. అంతేకాదు, యింత వైవిధ్యం కల వారందరి పైపై భేదాలమాట ప్రక్కకు నెట్టితే, అందరి అంతరాంతరాలలోని మానవత్వం ఒకటే అని తెలుసు కోడంకూడా ఎంతో బాగుంటుంది." అంది అబల. ప్రపంచంలో విఖ్యాతులైన అందరు శాస్త్ర కారులనీ కలుసుకొని, వారితో అభిమాన పూరితమైన స్నేహాలని పెంపొందింప కొంది అబల యూరపులో అమెరికాలో ఎన్నో కుటుంబాలు ఆమెకు అతి సన్నిహితు లయ్యారు.

అబలను మొదటి సారి చూడగానే కలిగే భావన ఒక్కటే. "స్వేచ్ఛాజీవి, మాతృమూర్తి; లోకజ్ఞానం కలది" అన్నదే ఆ భావన. తనకు పిల్లలు లేకున్నా మేనల్లుళ్ళూ, మేనకోడళ్ళూ అబల అంటే తల్లికంటే ఎక్కువగా చూసుకొంటారు. రిసెర్చి యిన్స్టిట్యూట్ లోని విద్యార్థులందరికీ మాతృదేవే అబల. ఇంతే కాకుండా కష్టించి పనిచేసే, బ్రహ్మసమాజ్ గరల్సు స్కూలు సెక్రటరీగానూ, నారీ శిక్షాసమితి అధ్వర్యాన నడిచే యింకో ఆరు బడుల కార్యదర్శిగానూ, పనిచేస్తూ, దరిదాపు 500 మంది పిల్లలకి మాతృమూర్తి అబల. విషయాలు సరి చేయడంలో, ఆర్గనైజింగులో గల తన నేర్పునంతా విని యోగించి అనేక యువతులకీ తల్లులకీ చదువు సంధ్యలకి తల్లి అయింది అబల. స్త్రీ విద్య పట్ల ఆమె ఉత్కంఠత చాలా సంవత్సరాల క్రితమే బయలుదేరింది. బెంగాల్ లో స్త్రీ స్వేచ్ఛా విద్యల పట్ల బయలుదేరిన సంస్కరణాభిలాషకి అబల ఆమె యిద్దరు స్నేహితులూ నడుము కట్టారు, ఈ ముగురూ, తగిన శిక్షణ తీసుకొందుకూ, దేశ సేవకై నారీ శేవకై సర్వం ధారపోయడానికీ ప్రమాణం స్వీకరించారు. చాలా రోజులపాటు తన ఆధ్వర్యాన వున్న స్కూళ్ళకి ప్రభుత్వ సహాయం స్వీకరించ నిరాకరించింది. కాని, ప్రభుత్వం ఖర్చు చేయదలిచిన సొమ్ము ప్రజదేఅనీ తను ఖర్చు చేయదలచు కొన్నదీ ప్రజలకే అనీ ఆలోచించి, ప్రభుత్వ సహాయాన్ని తీసుకొంది. అప్పటికీ స్కూలుకి ఆమే ఆమె అక్కలూ అన్నలూ నలభై వేలరూపాయిలు యిచ్చారు.

అబల దేశభక్తి పరాయిణత ఆమె యిల్లు చూసిన ప్రతివారికీ తెలుస్తుంది. విదేశ వస్తువులే ఆయింట్లో కనిపించవు. అలాగని శాస్త్రీయ సంబంధమైన పనిముట్లు ఆమె కాదనలేదు. పని తక్కువా, సులభం చేసే అనేకమైన పనిముట్లని వాడుకలోకి తెచ్చుకొంది. భారతీయ సౌకుమార్యాన్నీ పాశ్చాత్య సౌఖ్యాలనీ అబల తెలివితేటలతో సమన్వయపరుచుకోకల్గింది.

అబల జీవితంలో మిన్నగా ఎంచే స్నేహం సిస్టర్ నివేదిత తోటిది. నివేదిత అనేకమార్లు అబల యింటవుండి ఆమె ఆతిథ్యాన్ని అనుభవించింది. అబలదృష్టిలో నివేదిత తోటి స్నేహం అపూర్వమైనది.

స్త్రీ హక్కుల డిబేట్లు జరిగే రోజులలో (1921) బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్, ఆడవాళ్ళగేలరీలో ప్రతిదినం అబలబోస్‌ని చూడగలిగేవారట. రాజకీయాలకి స్త్రీలపై ఆంక్షలుండడం అన్యాయం అనీ, అన్నిటా సమాన హక్కులు వుండాలనీ పోరేవారిలో అబల ప్రముఖురాలు. పౌరహక్కుల విషయంలో మాంటెగును కలుసుకొన్న ప్రముఖులలో అబలబోస్ ఒకతె. ఈమె మేనల్లుడు ఎస్. ఎమ్. బోస్ బెంగాల్ కౌన్సిల్‌లో సఫ్రేజ్ రిసొల్యూషన్ ప్రతిపాదించాడు. అది ఓడిపోవటం అబలకెంతో బాధ కల్గించింది. బెంగాల్‌లో సఫ్రేజ్ పోరాటంలో ప్రముఖ పాత్ర వహించిన బంగియ నారీసమాజ్ కమిటీ మెంబర్లలో ఒకతెగా వుండి అబల ఎనలేని సేవ చేసింది. మహిళాలోకం యీ సంగతి ఎప్పటికి మరిచిపోదు.

ఆంధ్ర మహిళ

వితంతువులకీ, నైతిక పథాన్నుంచి తొలగిన స్త్రీలకీ కేంద్రాలూ, వసతిగృహాలూ విస్తృతంగా కావాలని, ఆమె ఒక ప్రణాళికని తయారు చేసింది. బొంబాయి ప్రాంతాలకి రమాబాయి రనడె స్థాపించిన అనేక సంస్థలు ఎంత ఉపయోగపడ్డాయో, కలకత్తా ప్రాంతాలకి యివీ అలాగే. వీటిని ప్రోత్సహిస్తూ ఒక బెంగాలీ దాత, శ్రీమతి హరిమతి దత్తా, పదివేలు విరాళం యిచ్చింది.

భర్త బాగోగులకీ, యింటికీ తన శక్తినీ నేర్పునూ ధారపోస్తూ కూడా, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల మధ్య పెరిగిన భారతనారి దేశానికీ, ప్రపంచానికీ కూడా అమూల్యమైన సేవ చేయకలదన్న విషయం శ్రీమతి అబలబోస్ విశదం చేసింది. 1900 లోనే స్వామి వివేకానంద యీ విషయాలన్నీ ఆమెలో గుర్తించ కలిగాడు. పారిస్ ఇంటర్ నేషనల్ కాంగ్రెసును గురించి 1900 లోనే ఉత్తరం వ్రాస్తూ "ఈ కాంగ్రెసులో తమతమ దేశ ప్రతిభలనీ ప్రతిపత్తినీ చాటడానికి అనేకులు సమావేశం అయారు. నిజమైన సేవకులకి యిక్కడ ఘనత కలుగుతుంది. అదే ఘనత వారివారి దేశాలలో ప్రతిబింబిత మవుతుంది. నే పుట్టిన దేశాన్నించి వచ్చిన వ్యక్తి ఏది? ఈ మానవ సముద్రం మధ్య ఒక చిన్న స్వరూపం లేచి నిల్చుంది. ఈ స్వరూపం పల్కిన ప్రతిమాటా, ప్రేక్షకులని స్తంభింప చేసింది. అలాగే, ఆనందోత్సాహంతో ఒకని మాతృదేశం పులకరిస్తుంది. ఈ ఏకైక వీరుణ్ణి దీవించు; ఈ ఏకైక వీరుని అందవంతమైన నారీమూర్తిని దీవించు" అంటాడు. అబలబోస్ జీవితంలో అంతటి ఉత్తమ స్థానాన్ని ఆక్రమించుకోకల్గింది.

అబల భారతస్త్రీమూర్తులకి ఏకైకప్రతినిధి. అధునాతన యుగంలో అపరమైత్రేయిగా తన భర్తతో పాటు యీ ప్రపంచారణ్యంలో సంచరిస్తూ, విభిన్నత్వాన్ని చెందివున్న మానవత్వంనుంచి, కించిత్ దైవత్వాన్నే ఆస్వాదిస్తూ, అన్వేషిస్తూ, అందిస్తూ కాలం గడిపింది అబలబోస్.

అబలబోస్ జీవితం ఆడవాళ్ళకి ఒక గుణపాఠం. స్త్రీ తలచుకొంటే సాధించలేనిదంటూ వుండదన్న దానికి నిదర్శన. అబల అబల కాదు సబలే అని నిరూపించుకొన్నది. జీవితంలో యిదమిద్ధంగా ఏదీ నిశ్చయించుకోలేక, చేదోడు వాదోడు లేక, చీకట్లో కొట్టుమిట్లాడే వారికి అబలబోస్ జీవితం ఒక వెలుగుచుక్క. వెలుగుబాట. ఆధునిక వనితాలోకానికి అబల ఒక ధృవతార.





## — వేల్పుబువ్వ —

శ్రీ బాలాంత్రపు వేంకటరావు

సీ. కవ్వంపువడిసడిఁగన్నపాల్కడలి మీఁ
గడలలో నొకపువ్వ కన్నువిచ్చె—
కనుతెప్ప సెజ్జల నునుమించుటూయెల
గోములో నొక చందమామనవ్వె—
నగవుక్రొక్కారుసోయగపురేకలపువ్వుఁ
దోఁటలో నొకరేకు తొంగిచూచె—
చూపుజాడలవెజ్జుచొక్కింపుగేల్దమ్మి
దోయిలో నొకదొన్నెతొలకరించె—
దొన్నెలో నున్న దమృతంపువెన్నబువ్వ,
నునుగడకుఁ జావురానీనిమందుబువ్వ,
కొమరులుగ వెల్పు లరిగించుకొన్నబువ్వ,
వెలఁదివెన్నుండుపంచిన "వేల్పుబువ్వ"—



సంక్రాంతి వేడుకలు!

# సంక్రాంతి

శ్రీ పి. ఎస్. గోపాల్

మకర సంక్రాంతి పండుగ
మదినెంతో హాయినిండగ!
విరిసీ విరియని తెల్లనిమల్లె మొగ్గలు
కురిసీ కురియని పూవుల తేనెజల్లులు!
విహరించే మధుపానికి పన్నీటి జల్లు!
భళిరా ఇది అంతా ఒక సంక్రాంతికె జెల్లు!

మధుమాసపు సరంభం
విధిగా ఈనాడే
ప్రారంభం ఔతుందని
సారంగం పాడె

విరిసిన వెన్నెల వానలో!
కురిసే అమృతంపు సోనలు!
మురిసే జవరాళ్ళ కాళ్ళపారాణులు!
ముత్యాల. రతనాల రంగవల్లులు!
మదికెంతో సంతోషం!
హృదినెంతో ఉల్లాసం!
అందమైన సంక్రాంతి నేడేనోయీ
ఆనందాలను తేలే దీనాడేనోయీ!

అలుకతోడ పలుకని మా అల్లుడుగారు!
చిలుకలతో పలుకని మా పిల్లలతీరు!
అదిఅంతా ఒకలోకం
మదినెంతో ఆనందం! ॥మకరసంక్రాంతి॥

కొంటెమరదలొస్తే మా అల్లుడాటకట్టు
కావస్తే చూడచ్చు కాకిమీద ఒట్టు
బుంగమూతి బావగారు కూరుచున్నారు
బంగరువాచీ ఇస్తే చెంగున లేస్తారు!
నే చెప్తే వింటారు!

అలుకమాని కులుకుతారు—
చిలుకబావగారు.
మా— పిలకబావగారు.
పకాపకా నవ్వుతారు! పదం పాడుతారు॥
॥మకర సంక్రాంతి॥

# ★ మేమొక స్కూలు కట్టేం ★

శ్రీమతి ఫ్రిడ బెడి.

ఇప్పుడు కూడా నేనా స్కూలు మానసిక దృష్టిలో చూడగలను. అప్పుడు 1948-49 సం॥ శీతాకాలం. కాశ్మీరులో మంచు (snow) సాధారణంగా డిశంబరు ఆఖరుకాలంలో పడి. బన్నిహాల్ కనుమను ఒకొక్కక్కసారి ఒక మాసం, చలి విపరీతంగా వుంటే కాలాల్లో అంతకంటె ఎక్కువ మాసాలు మూసేస్తుంది. 1948 జనవరిలో మామూలు శీతాకాలం ప్రవేశించింది. ఆమంచు పొడుం గొట్టడం నిషాట్ తోటల వెనుకనుంచి ప్రారంభించి శ్రీనగర్ రోడ్లూ, కాలిబాటలవరకు జరిగింది.

శ్రీనగర్ ప్రఖ్యాతిజెందిన కాశ్మీరులోయకు ముఖ్య పట్టణం, కేంద్రస్థానంలో ఉంది కట్టుకథలోలాగ తామర పూల మయమైన డాల్ చెరువువరకు. జీలం నది వరకు వ్యాపించియున్న మధ్య మధ్య నున్న అసంఖ్యాకాలైన జలాశయాలతో, ప్రాచ్య వెన్నిస్‌లా గుంటుంది. ఈ జలాశయాల్లో అనేక మంది పడవల్ని నడుపుతూంటారు. కొందరు, బహుశా బీదలు. ఆహార దినుసులు, నిత్యోపయోగమైన వస్తువులు మొదలు వ్యవసాయానికి కావలసిన మన్ను వరకు వీటిల్లో రవాణా చేస్తుంటారు. ఇతరులు, మామూలుగా కొంచం గొప్పవారైనవారు. తమ బోట్లలోనే నివసిస్తూ, ప్రశాంతమైన తటాక జలాల్లో లంగర్లు వేసుకొని కాపురాలు చేస్తుంటారు.

ఈ నివాసయోగ్యమైన బోట్లు, పేద్దనోవాన్ ఆర్కుల్లాగ ఉంటాయి. హోటళ్ళలో ఉండేవాటికంటే ఆడంబరాలైన కుర్చీలు, సోఫాలు వగైరా సామగ్రితో కూడిన పడక గదలు, పదిమంది కూర్చునే గదులూ కలిగిఉండి, వేసవి కాలంలో వేలాది ప్రజల్ని ఆకర్షిస్తూంటాయి. ఇండియాలో వొళ్ళు ఉడికిపోయే వేసంగుల్లో ప్రజలు (ఎడారుల్లో ఒయేసిస్సుల్లాగ) కొండలమీద చల్లదనానికి చేరుకుంటారు. పర్వతాలతోను, మొగలాయీల తోటలతోను చుట్టముట్టబడియున్న జలాశయాల్లోని కట్టుకథల్లోని బోట్లులాగునున్న పడవల్లో తేలుతూ ఆనందించడం కంటె ఆహ్లాదకరమైనదేముంటుంది ?

ఏళ్ళ తరబడిగా చూడవచ్చే ప్రయాణీకులకు ఇలాంటి బోట్లు అద్దెకీయడం జీవనోపాధిగా పెట్టుకొని ప్రజలు ఆ శీతాకాలంలో గట్టి యిక్కట్లలో పడ్డారు. 1946 వేసంగిని ప్రఖ్యాతి నందిన "క్విట్ కాశ్మీర్" (కాశ్మీరు విడిచి పొండి) అన్న ఉద్యమం ప్రారంభమైంది. అల్లకల్లోలంగానున్న వేలీ వాతావరణంలోకి ఆసంవత్సరం బహుస్వల్ప ప్రయాణీకులు వచ్చేరు. 1947 లో ఇండియా విభజింపబడి పాకిస్తాన్ ఏర్పడింది. వెనువెంటనే కాశ్మీరు వేలీమీద కొండ జాతుల దండయాత్ర ప్రారంభమైంది. అందుచేత మళ్ళీ ఆ వేసవికూడ— ప్రభుత్వంమారి, స్థిరపరిస్థితులులేని ఈ ప్రాంతాలకు ప్రయాణీకులులేరు. పడవలవారు పర్వత ప్రాంతాలలో దారుణంగా ఉండే శీతల బాధల్లో పడిపోయారు— తమ కుటుంబాలకు వలసిన తిండిలేక— భార్య బిడ్డలకు తగినన్ని గుడ్డలు లేక— రెండేళ్ళు పాత గుడ్డలతోటి కాలక్షేపం చేశారు.

ఇలాంటి పరిస్థితుల్లో— ఈ పడవల వారికీ, వారి కుటుంబాలకూ ప్రయాణీకులు రాకపోవడం వల్ల పని లేకుండాపోయి యిక్కట్లకు లోనైన కూలినాలి జనానికి సహాయం చేయడానికి బొంబాయిలో నున్న కాశ్మీరు మిత్రులు కొందరు విరాళాలు పోగుచేయడం ప్రారంభించారు. ఇలాగ పోగుచేసిన 50 వేల రూ॥లు పడవ కుటుంబాలకు వీలైనంత సహకారి గావడానికి సర్దవలసివచ్చింది. దీనితోపాటు బట్టలు, వూలుగుడ్డలు బహు ఉదారతతో లండన్ రెడ్‌క్రాస్ సొసైటీవారు, తమలో సేవచేయడంలో పేరెన్నికగన్న మేక్లీన్ సతిగారితో పంపించి మాకు తోడ్పడ్డారు.

డబ్బు అందరికీ సర్దుబాటు చేయడం ఎలాగ అన్నదే సమస్య. డబ్బు దానం స్వీకరించడం అంటే అమిత ఆత్మగౌరవం, గర్వం, కష్టపడి కృషి చేసుకోడం లక్షణాలుగల జాతివారేగాక, ఇతర రీత్యా యిక్కట్లకు లోనయ్యే వేలీలోని బీదవారు కూడ అంగీకరించరు కాని డబ్బు లేకుండా ఆహారం తదితర అవసరాలు లభించవు. ఇతర వస్తువులేవీ ఎంత పంచిపెట్టినా ఇంత సంతృప్తినీయలేవు. అప్పుడు— మా స్కూలు ఉద్దేశం ఉద్భవించింది.

బోట్లవారికి సం॥లో కొన్ని మాసాలే పని ఉంటుంది. తమ పడవలను అద్దెకు పుచ్చుకొనేవారి యిష్టప్రకారం వాటితోపాటు వీరూ వేసవిని తిరుగుతూంటారు, వారి

## మేమొక స్కూలు కట్టేం

పిల్లలు ఒక్క శీతాకాలంలో మాత్రం స్థిరంగా ఒకచోట నుండగలుగుతారు. అప్పుడు బ్రహ్మాండమైన మంచు మయమైన శీతాకాలంలో స్కూళ్ళన్నిటికీ రెండున్నర మాసాలు దీర్ఘ శలవులు యిచ్చేసి మూసేస్తారు. ఇలాంటి పరిస్థితుల్లో వీరికి చదువు సంధ్యలు సున్న.

అందుచేత ఇదో మంచి అవకాశం. బోటు ప్రజల బిడ్డల కోసరం కాశ్మీర్ పట్నంలో ఒక శీతకాలపుస్కూలు ప్రారంభించడానికి నిశ్చయింపబడింది. అవసరమున్న కుటుంబాల్లోనుంచి ఒక అబ్బాయి, అమ్మాయిని ఎంచి వీరికి విద్య గరపడానికి బిడ్డ ఒక్కంటికి 15 రూ.లు విద్యార్థి వేతనం, నిశ్చయింపబడింది. దీనివల్ల వారి కుటుంబాలకు 30 రూ.లు ముట్టేవి. పిల్లలకు వారి జీవితంలో చదువుకొనే అవకాశం ఏర్పడింది. ఇందుకు ప్రత్యేకంగా తర్ఫీదై, విద్యగరపడంలో ప్రావీణ్యతకూ, సంఘసేవలో నమ్మకానికీ పేరొందిన మేష్టర్లు నియమింపబడ్డారు.

స్కూలు భవనం డాల్‌గేట్‌లో ఒక కాళీ హోటలు. ఆ రెండంతస్థులుగల పెద్ద భవంతిలో 250 బాలికలు, 250 బాలురు విధి తప్పక చదువు, వ్రాత, సిలిక్కు, ప్రపంచజ్ఞానం చేతి పనులు నేర్చుకొందుకు హాజరయ్యేవారు. ఇది ఒక తమాషాయైన ప్రయోగమే. ముఖ్యంగా ఆడపిల్లలు మే మనుకున్నదానికంటె ఎక్కువ ఉబలాటం పడేవారు. వారిలో ఉండే విద్యాగంధం చూడాలంటే వినండి. స్కూలుకు వచ్చే 4 ఏళ్ళ ప్రాయం బిడ్డలనుంచి 16-17 ఏళ్ళ యువతులవరకు నున్న 250 మంది ఆడపిల్లల్లోను 20 మందికి వట్టి అక్షరజ్ఞానం మాత్రమే ఉండేది. ఆడపిల్లలకంటె పుస్తకం చదువుల్లో ఎక్కువైన వారమనుకొనే మగపిల్లల్లోను ఇంతే— వారిలోనూ 250 మంది లో 20 మందిలో కొంతఅక్షరాల్ని గుర్తుపట్టే జ్ఞానం ఉండేది. వారుకూడా ఈ మూడు మాసాలు చదువుకు లభించిన అవకాశాన్ని ఆతురతతో స్వీకరించారు.

చేతి పనుల శాఖలో ఆడపిల్లలకు కుట్టు నేర్పబడేది. చదువుకాలం పూర్తి కావచ్చేసరికి పెద్ద పిల్లల దుస్తులు (ఉత్తర హిందూ స్థానంలో స్త్రీలకు పరిపాటైన ఆ పొడుగు లాగులు) కుట్టడం వరకు వచ్చారు. సూదిలో దారం ఎక్కించడంతో ప్రారంభించేం ఈ కుట్టు క్లాసుల పాఠాలు అని నేను చెబితే— ఇంత తక్కువ వ్యవధిలో సాధించిన అభివృద్ధికి మీరంతా ఆశ్చర్యపోవచ్చు. చిన్న బాలికలకు ఇంత ప్రవీణత రాలేదుగాని చాల మందికి పిల్లల దుస్తులు కుట్టడం వచ్చింది. తమ బట్టలు తాము కుట్టుకునే సామర్థ్యం చేతనయింది. ఈ వివరాలు ఎందుకు చెబుతున్నానంటే— కాశ్మీరు కుట్టు. కాశ్మీరు శాలువాలు ప్రపంచమంతటా పేరు పొందేయి గనుక మీలో చాలా మంది కాశ్మీరు స్త్రీలు కుట్టుల్లో గొప్పప్రావీణు లనుకోవచ్చు. కాశ్మీరువని అమ్మబడే మీరు చూస్తున్న అందమైన సరుకులన్నీ మగవారు చేసేవే. తమ పిల్లల బట్టలు కూడ, స్త్రీలు, మగ దర్జీలకిచ్చి చిరుగులు కుట్టిస్తారు, లేకపోతే తమ ఇంట్లోనే ఒక మగవాడు కుడతాడు. ఈ చదువుకునే పిల్లలు ఇంకా గుడ్డ పేలికంతో మంచి మంచి ఆట బొమ్మలు, మగ పిల్లలకు గుడ్డలతో కుట్టిన జంతువుల బొమ్మలు వగైరాలన్నీ తయారు చేశారు. ఇవి ముందు ముందు మంచి లాభకరమైన కుటీర పరిశ్రమలుగా రూపొందుతాయనుకుంటున్నాము.

బడికి పంపడానికి పిల్లలు లేని కుటుంబాలనుంచి వచ్చిన కొందరు వయస్సుగల స్త్రీలు కూడ ఉన్నారు. వారికి వేస్టు పట్టు అల్లడం నేర్పించి ఉచిత విద్యార్థి వేతనాలిచ్చాము.

నేను ఇంకా ఆ బడి పిల్లలను చూడగలను— "ఆ ప్రొద్దుటే కళకళ లాడే ముఖాలు" —మేము యిచ్చిన యూనిఫారాలతోటి. ఇచ్చిన యూనిఫారం ఏమిటంటే లేత పసుపు పచ్చ పట్టు గుడ్డ లాగూ, ఒక స్వెట్టరు, ఒక ఎర్రరంగు ముఖానికి వేసుకొనే తెర. దీన్ని నొసట మీద వేసికట్టి వెనకవైపున చక్కటి ముడి వేసుకుంటారు. శీతగాలిలో విడిచిన షాలిమర్ గులాబీలవంటి రంగుగల చెక్కిళ్ళు, మెరసే నల్లటి కళ్ళు, రెండు జడలుగాకట్టి వీపువెంట వ్రేలాడేసిన నల్లటి పట్టులాంటి కురులుగల కాశ్మీరు దేశపు పిల్లల్ని మీరెప్పుడైనా చూచి ఉంటే ఎంతముద్దొస్తూ ఉంటారో మీకే తెలుస్తుంది. చిన్న పిల్లలు మరీ ఆకర్షవంతగా ఉంటారు. మగ పిల్లలు కాకీ రంగు ఉన్ని గుడ్డలు, నల్లటి షర్టులు, తరుచు కాశ్మీరు పేరు పొందిన ఆ పెద్దబొచ్చు టోపీలు ధరించేవారు. ఉన్న మూడు మాసాల వ్యవధిలోను వారు చాల అభివృద్ధిలోకి వచ్చారు. ఒకచో స్థిరపడియుండి చక్కగా చదువుకొనే భాగ్యవంతుల బిడ్డల్లాగ గాక అవకాశాలు లేక వెనుకబడి పోయి ఉండే ఇలాంటి పిల్లల్లో ఎంత తెలివితేటలు, చాకచక్యం ఉంటుందో మాకు బాగా విశదమయింది.

# మేమొక స్కూలు కట్టేం

నేను ఆమూడు (జనవరి, ఫిబ్రవరి, మార్చి) మాసాలు ఎన్నడూ మరిచిపోలేను. "మేము కట్టిన స్కూలు"— పనిలేనివారికి సహాయం చేయడానికి నిర్మింపబడింది; ఇప్పుడు అది లేదు. బోటు ప్రజలు మళ్ళీ తమ ప్రయాణీకుల హడావిడిలో మునిగి మంచి లాభాలు సంపాదిస్తున్నారు. వారి పిల్లలు కొంతమందికి చదువు చెప్పిస్తున్నారు. కొందరు విధిలేక అలా స్థిరత్వంలేక పడవలతోబాటు తిరిగే తల్లిదండ్రులతో తిరుగుతూ కాలక్షేపం చేస్తున్నారు. కాని, ఆ 250 మంది ఆడపిల్లలు, 250 మగపిల్లలు గులామ్ మహమద్ సాహేబు, మట్టో సాహేబు, లక్ష్మి గార్లు మరికొందరు ఎంచిన మాష్టర్లు వారి శీతకాలం శెలవలు మానుకొని తమ అందరితోను గడిపిన ఆ ఆనంద పదమైన రోజులు వాళ్ళు యావజ్జీవం జ్ఞాపక ముంచుకుంటారు. అలాగే తమకు, తమ కుటుంబాలకు బట్టలు పంచిపెట్టి మహా ఓర్పుతో ఆడపిల్లలకు కుట్టు, అల్లిక, చిరుగులు కుట్టడం వగైరాలు నేర్పిన ఆ మేక్లీను సతీగార్ని కూడ జ్ఞాపకముంచుకుతీరుతారని అనుకుంటున్నాను.

ముందు ముందు, ప్రచారం చేసే స్కూళ్ళూ, ఆమాటకువస్తే నీటిలో పడవల స్కూళ్లూ సాకారందాల్చి, బోటు పనులమీద జీవనం చేసేవారి పిల్లలు, విధిగా చదువుకొందుకు నిశ్చయమైన యేర్పాట్లు జరిగితే- మేము శీతాకాలంలోను, దాడి సమయంలోను సాగించిన ఆ ధైర్యమైన ప్రయత్నమూ, ప్రయోగము సదా జ్ఞప్తిలో ఉంచుకుంటాం.



# స్వప్న తోరణం

శ్రీ గోరా శాస్త్రి.

(ఒక పెద్దహాలులో వేడుక, వినోదం ఏదో జరుగుతున్నట్లు రొద వినిపిస్తుంది. ఒక యిరవై ముప్ఫయిమంది జనం చేరి మాటాడుకొంటున్న అలజడి. ఒక్కసారిగా అంతా చప్పట్లు కొడతారు.)

రాధ : (చప్పట్లు కొట్టడం ఆపేసి - విరగబడి నవ్వుతూ) వండర్‌ఫుల్ ! వండర్‌ఫుల్ ! మిస్టర్ గోపాల్. కంగ్రాచులేషన్స్. పేకముక్కల మ్యాజిక్ బాగా నేర్చుకున్నావే !

గోపాల్ : మరేమిటనుకున్నారు రాధా దేవీ! నేను ఏది నేర్చుకున్నా క్షుణ్ణంగా నేర్చుకుంటాననుకోండి!

సుందరి : (గొంతులో అమాయికత్వం నటిస్తూ) మీరు జంతు శాస్త్రంలో ఎం. ఏ. కదండి?

రా : కాదు సుందరీ. తెలియనట్టడుగుతావేం ?

గో : అహాఁ- మరేం లేదులెండి- సాక్షాత్తూ మీ చెల్లెలు కదూ- కాస్త వ్యంగ్యం అలవాటు చేసుకొంటోంది. మీరు మట్టుకు, సుందరిగారూ- మీ బి.ఏ. పాక శాస్త్రంలో కదూ ?

సుం : తగ్గండి మరి ! పాకశాస్త్రంలో కాదు- పూరిపాకల శాస్త్రంలో-

గో : అంటే ?

సుం : చూశారా! అంటే ఎకనమిక్స్. ఇండియా నిండా పూరి పాకలే కదండీ ! ఆ మాత్రం పోల్చుకోలేరూ ?

గో : లేకేం. ఇంకా చూడండి. (అందరినీ ఉద్దేశించి బిగ్గరగా) లేడీస్- అండ్ జంటిల్‌మన్ ! ఈ సాయంత్రం యీ సుందర సాయంత్రం- మనమంతా కుమారి రాధా దేవి పుట్టినరోజు పండగ- బర్త్‌డే- సెలబ్రేట్ చేస్తున్నాం- అంచేత మనందరం హాయిగా - ఆడుతూ - పాడుతూ- నవ్వుతూ నవ్విస్తూ- వెరిగుడ్ ! ఇప్పుడు మీరంతా పేకముక్కల మ్యాజిక్ చూశారు- ఇంకో చిత్రమైన ఫీట్ ! దీన్ని ఇంగ్లీషులో థాట్ రీడింగ్ అంటారు !

సుం : (రాగ వరుసలో) ఎన్ని-విద్యలు- నేర్చినాడమ్మా !

రా : ఉష్. ఉండవే సుందరీ!

గో : —అంటారా ! ఇక చూడండి తమాషా! ఒరేయ్ వెంకట్రావ్ ! ఓసారి యిలారా.

వెం : నే రాన్రా బాబూ!

గో : ఏం ?

వెం : నా బుర్రలో ఉన్న థాట్స్ అన్నీకలిసి నాలుగో అయిదో. అవన్నీ నువ్వు పైకి చదివేస్తే ఏం దారి ?

(అందరూ గొల్లున నవ్వుతారు)

గో : భయంలేదురా ?

సుం : ఫరవాలేదు రండి వెంకట్రావుగారూ !

వెం : మీ సొమ్మేం పోయింది రమ్మంటారు! ధైర్యం ఉంటే మీరు నించోండి.

ఇంకో స్త్రీ : ఆడవాళ్ళ థాట్స్ చదవగలరండీ మీరు ?

గో : నిస్సందేహంగా !

స్త్రీ : అయితే ఉండండి... వస్తున్నాను... ఆఁ... ఇప్పుడు చెప్పండి. నేను మీడియమ్‌ని అనుకోండి...

గో : వెరీగుడ్. లేడీస్ అండ్ జంటిల్‌మన్ ... చూడండి యీ తమాషా ! విమలగారూ! మీ ధైర్యం మెచ్చుకోదగింది... సిద్ధంగా ఉన్నారా ?

నేస్త : యస్.

ఎస చూడండి... అ॥ ఇప్పుడు నేనో నెంబరు తలుచుకున్నాను. ఏమిటో నంబరు ?

విమల : ఏడు.

గో : కరెక్ట్. సరిగా అదే.

(అందరూ గొల్లున నవ్వుతారు)

గో : ఇంకా చూడండి. మిస్ విమలా! ఇప్పుడు నేను తొమ్మిది నంబర్లు తలుచుకున్నాను. అన్నీ తొమ్మిది లోపు. ఏమిటానంబర్లు ?

విమల : తొమ్మిదీ, ఎనిమిదీ, ఏడూ, ఆరూ, అయిదూ, నాలుగూ, మూడూ, రెండూ, ఒకటీ!

గో : ఆల్ కరెక్ట్.

(అందరూ నవ్వుతారు)

గో : ఇంకొక్క ఫీట్. సుందరిగారూ, దయచేసి ఓ చేతి రుమాలుతో విమలగారి కళ్ళకి గంతలు కట్టండి.

సుం : సరే... ఇదిగో కట్టేశాను.

గో : ఇదిగో విమలగారూ. నా చేతిలో ఓ వస్తువుంది. అదేమిటో పోల్చుకోండి.

విమల : పోల్చుకున్నాను.

గో : చేతిలో ఉన్నది సూటుకేసా ?

విమల : కాదు.

గో : పందిరి మంచమా ?

విమల : కాదు అద్దాల బీరువా అంతకంటె కాదు.

సుం : పోనీ కాలుతున్న కొరకంచా ?

విమల : అయినా బాగుండును. కాని కాదు.

(అందరూ గొల్లుమని నవ్వుతారు)

గో : చూశారా ! ఏదికాదో విమలగారి చేత యిట్టే చెప్పించేశాను.

రాధ : మరే ! థాట్ రీడింగ్ అంటే అలా ఉండాలి.

విమల : కంగ్రాచ్యులేషన్స్ గోపాల్ గారూ. నా మనస్సులో ఉన్నదంతా యిట్టే పోల్చేశారే ?

వెం : ఒరే గోపాల్ !

గో : ఏరా బాబూ !

వెం : అంతా బాగానే ఉందిగాని- నా సందేహం ఏమిటంటే - నువ్వు థాట్ రీడింగ్ అని ప్రారంభిస్తే- చివరికి ఆవిడ థాట్స్ నువ్వు పోల్చుకోవడం పోయి నీ థాట్స్ అన్నీ విమలగారు పోల్చుకున్నారేమోనని.

విమల : ఎంతమాట వెంకట్రావుగారూ. ఆడవాళ్ళ థాట్స్ గోపాల్ గారు బాగా చదవగలరు.

సుం : ఆ సంగతి నేను ఏనాడో కనిపెట్టాను విమలా.

విమల : అన్నట్టు టైము ఎనిమిది దాటిందే ? ఇంక నేను వెళ్ళాలి రాధా ! ఇంక రామం రాడు వచ్చేవాడయితే యింత ఆలస్యం చెయ్యడు.

రాధ : వెళతానంటావా ? సరే- రామం కావాలని ఎందుకో రాలేదు- పోనీ నాన్నగారు మాడు- ఈ సాయంత్రం ఆయనేనా కాస్త యింటిదగ్గర ఉంటే ఎంత బాగుండును ?

సుం : ఆయనకేవో లక్ష పనులు పోనిస్తూ... వస్తారులే.

వెం : ఇంక మేం వెళ్తాం రాధాదేవీ ! ఏదో సాయంత్రం అందరం స్నేహితులం మీ పుట్టినరోజు పేరు చెప్పి కలుసుకొన్నాం— కాస్సేపు కులాసాగా కాలక్షేపం చేశాం. సెలవ్ మరి.

(వెళ్ళొస్తాం రాధా ! ఇంక వెళ్ళిరానా రాధా ! థ్యాంక్యూ రాధా! సెలవు తీసుకుంటాను రాధగారూ! ఇలాగ ఒక అరడజను సంకీర్ణ కంఠాలు- స్త్రీలవీ పురుషులవీ- కలగా పులగంగా వినిపిస్తాయి )

గో : ఇంక నన్నూ వెళ్ళమంటారా రాధాదేవీ !

సుం : మంచిది గోపాల్ గారూ. ఇవాళ నిజంగా మీరే పార్టీకి ప్రాణం పోశారు. థాంక్స్. జయప్రదంగా వెళ్ళిరండి.

గో : మళ్ళీ ఎప్పుడు దర్శనం రాధాదేవీ ?

రాధ : అంత పెద్ద దర్శనానికేముందండీ. ఒక్క వీధిలోని వాళ్ళం- ఎప్పుడు పడితే అప్పుడే కలుసుకుందాం.

గో : గుడ్ నైట్ ! విష్ యూ హాపీ డ్రీమ్స్.

(క్షణం నిశ్శబ్దం)

సుం : హమ్మయ్య. గ్రహం వొదిలింది ఎలాగయితే నేం. కానూరిపు జీడిలా ఒకంతట వదలడు... ఇడియెట్.

రాధ : పోనీలే గాని- రామం చూశావా సుందరీ ఎంత పనిచేశాడో.

సుం : నేను అనుమానపడుతూనే ఉన్నాను. నాకెందుకో పార్టీకి రామం రాడనిపించింది.

రాధ : ఎంచేత ?

సుం : మనిషి ధోరణి కనబడ్డంలేదే రాధా ? మళ్ళీ అలా అడుగుతావ్ ?

రాధ : నిజమేలే. వారం పది రోజులనుంచి తప్పించుకు తిరుగుతున్నాడు. పోనీలే. అంతేనా ? ఆపైన ఏం చేస్తాడు ? నేను బాధపడతాననుకున్నాడు కాబోలు- వెర్రివాడు- రాధ అంత వెర్రిబాగులది ఏం కాదు. నేనూ ఇపుడిపుడు కొంచెం కళ్ళు తెరుస్తున్నాను. ఒక రకంగా చూస్తే- యీ రామం యింక మనింటికి రాకపోవడమే మంచిది......

సుం : ఎందు కదంతా నాతో చెప్తున్నావ్ ?

రాధ : ఏం చేసితే ? వినడానికి నీకంత బాధగా ఉందా?

సుం : మధ్యని నాకెందుకు బాధ ?- ఏదో కథ చెప్పి నట్టుంది. వచ్చేడో లేదో చూద్దామని సాయంత్రం వాళ్ళింటికెళితే వాళ్ళ పార్వతి కూడా అలాగే అందిలే.

రాధ : (ఆశ్చర్యంగా) సాయంత్రం వెళ్ళావా వాళ్ళింటికి ?

సుం : వెళ్ళాను. ఇంట్లో ఉన్నాడేమో చూద్దామనీ. లేడు.

రాధ : ఏమంది పార్వతి ?

సుం : ఏమంటుంది ? నవ్వుతూ పలకరిస్తుంది. తేనె లొలుకుతూ మాటాడుతుంది. అమ్మో అలాగుంది గాని- శుద్ధ నంగనాచి.

రాధ : పార్వతిలాంటి మనిషి యీ భూప్రపంచంలో లేదంటాడు రామం. ఆమె దేవత అని రామం నమ్మకం.

సుం : అంతేలే. కొన్ని కొన్ని గుడ్డి నమ్మకాలలాగే ఉంటాయి... అబ్బ... భోరుమని ఇన్ని గిపాలెందుకో చీదరగా ఉంది.

రాధ : అన్నీ ఆర్పేసి ఒక్క నీలం లైటు మాత్రం ఉంచు. ఇంకా రాలేదు చూశావా నాన్నగారు.

సుం : ఏ క్లబ్బులో పేకాడుతూ కూర్చున్నారో... వస్తారులే.

(సన్నగా- అతి సన్నగా- భూగర్భంలోంచి వచ్చినట్లు వీణ తానం వినబడుతుంది)

పార్వతి : అరె ! ఎవరో రేడియో స్విచ్ వేసి వదిలేసి నట్లుంది. అరె ! ఇక్కడే ఉన్నారా మావయ్యా. ఇంత చీకటిగా ఉంటే లైటు వేసుకోకండా— ఏమిటాలోచిస్తున్నావ్ రామం మావయ్యా ?... (వీణ ఆగిపోతుంది)

రామం : అప్పుడే చీకటి పడిందా పార్వతీ ?

పా : (నవ్వు) అబ్బే- లేదు. ఇప్పుడే సూర్యుడుదయిస్తున్నాడు. ఇది పగలో రాత్రో కూడా నీకు తెలియడం లేదు.

రా : తెలియకేం పార్వతీ. ఇది చీకటి రాత్రి. ఎప్పుడు తెల్లారుతుందా అని చూస్తున్నాను. అంతే.

పా : ఎంత చీకటి రాత్రికీ ఓ అంతం అన్నది ఉంటుంది. దాని మాటలకేంగాని— ఏమిటంత తీవ్రంగా ఆలోచిస్తున్నావు ? సుందరి పాపం- నీకోసం రెండుసార్లు ఒచ్చి వెళ్ళింది. నువ్వింట్లో లేవనుకున్నాను. పార్టీకి వెళ్ళలేదేం ?

రా : ఏమిటో. వెళ్ళాలనిపించలేదు. అంతే. అన్నయ్య యింకా రాలేదా ?

పా : పెద్దమావయ్యా ! నీ అన్నగారాయన. ఒస్తాడు నెమ్మదిగా. ఆఫీసులో అంకెల కూడిక యింకా అవలేదు కాబోలు.

రా : అక్కయ్య ఏం చేస్తోంది ?

పా : అమ్మో ! అమ్మ వంటింట్లో ఉంది. ఇంతకూ మాట మార్చేస్తున్నావు. రాధాదేవి పార్టీకి నువ్వెందుకు వెళ్ళలేదంటే సమాధానం చెప్పవేం ?

# స్వప్న తోరణం

రా : ఏమిటో కొన్నింటికి సమాధానం చెప్పలేం. ఈ వైశాఖంలో నీ పెళ్ళి ముహూర్తం నిశ్చయిద్దామా అంటే మీ మేనత్తా మావయ్యా సమాధానం చెప్పరేం ?

పా : అవునులే. బోగపడింది. కొన్నింటికి మనం సమాధానాలు చెప్పలేం. ఇందాక వాళ్ళ సుందరికూడా యిలాగే యేమిటో ప్రశ్నలు వేసింది. మీ మావయ్య యింట్లో ఉండగానే లేదంటున్నావా, లేక నిజంగా లేడా అనడిగింది. యేం చెప్పను సమాధానం ?

రా : నువ్వు అంత పనీ చేశావుగా ! నేనింట్లో వున్నా లేనన్నావుగా.

పా : నాకు నిజంగా తెలీదు– నువ్వు ఇంట్లోనే వున్నావని. తెలిసే ముస్తాబు చేసి సుందరి వెంట పంపించితీరేదాన్ని. మధ్య నాకేమిటి మావయ్యా.

రా : కోపం తెచ్చుకోకు పార్వతీ. పార్టీకి వెళ్ళడం యిష్టంలేకే యిలా గదిలో ఎవరికీ తెలియకుండా దాక్కున్నాను.

పా : ఏమిటో నీ వైఖరంతా ఓ వారం పదిరోజులనుంచి ఎంతో చిత్రంగా ఉంది. అమ్మకూడా అడిగింది.

రా : నాకేం– హాయిగా ఉన్నాను. గంగిరెద్దు వేషం వేసుకొని రోజూ ఆఫీసుకి వెడుతున్నాను, వస్తున్నాను. ఆపైన స్నేహితులు, షికార్లు, సినిమాలు— అంతా మామూలుగానే ఉన్నానే ?

పా : అంతే అంటావ్ ?

రా. కాక మరి ! తీరి కూర్చున్నావ్ అలా అలా ఊహించుకుంటున్నావ్ నువ్వే ఇంక లాభంలేదు పార్వతీ ! ఈ వైశాఖంలో నీకు తప్పకుండా పెళ్ళి చేసెయ్యాలి. రేపో యెల్లుండో మీ మేనత్తకి యింకో ఘాటైన ఉత్తరం వ్రాస్తాను. కుర్రాడు నీకు నచ్చినట్లేగా.

పా : అంతేలే... జాడ్యం నీలో ఉంచుకొని వైద్యం నాకు ఏర్పాటు చేస్తున్నావు. నువ్వు నిజంగా కొంచెం పిచ్చివాడివి మామయ్యా ?

రా : క్రమంగా యీ లోకాన్ని చూచి పిచ్చెక్కుతోంది.

పా : లోకం ఏంచేసింది మధ్య. లేక నీ దృష్టిలో లోకం అంటే రాధాదేవీ, సుందరీ– వీళ్ళిద్దరేనా ?

రా : లేదు– ఇంకో పేరు మరచిపోయాను.

పా : ఆ చిట్టచివరి తెవరు ?

రా : విమలాగని. తెలియదూ ?

పా : తెలియకేం ? బంగారుతల్లి. ప్రస్తుతానికి వీళ్ళన్నమాట నీ స్వప్నసుందరులు.

రా : మరి.

(రామారావ్ అని బయటినుండి పిలుపు)

పా : అదిగో. సుందరి పిలుస్తోంది. ఏం చెప్పమంటావ్ ?

రా : లోపలికి ఆహ్వానించు– నిరభ్యంతరంగా.

(కొంచెం విరామం)

సు : హల్లో ! రామారావ్ ! దొరికావోయ్ చివరికి. ఏం పార్వతీ ! ఎప్పుడు చేరుకున్నాడు కొంపకి ?

పా : (నవ్వుతూ) అతన్నే అడుగు ! ఏం మామయ్యా ? ఎప్పుడొచ్చావ్ యింటికి ?

రా : సారీ సుందరీ ! సమయానికి వేరే యింకో అర్జంటుపని తగిలింది... పార్టీ సజావుగానే జరిగిందా ? ఏమంటోంది రాధ ?

సు : అలా ఉండాలి నటనలటే– నువ్వు సినిమాల్లో చేరిపోకూడదు రామారావ్ ?

రా : చేర్పిస్తావా ?

సు : తప్పకుండా. ఆమాటకొస్తే మా నాన్నగారితో చెప్పి ఓ సినిమా కంపెనీ పెట్టిస్తాను. అదెంత భాగ్యం? అది సరేగాని– నీ ధోరణే బాగాలేదు రామారావ్ ! సాయంత్రంనుంచి యిది మూడోసారి నిన్ను వెతుక్కుంటూ రావడం. తెలుసా ?

రా : వెంకట్రావ్, గోపాల్ వాళ్ళంతా వచ్చారా పార్టీకి ?

సుం : రాకేం ! అంతావచ్చారు.

(సశేషం)

# భూ వ ల య ము

భూవలయమనేది ప్రాచీన భారతీయ వైజ్ఞానిక గ్రంథము. దీనిని కుముదేందు అనే వ్యక్తి రచించినాడట.

కలకత్తాలో నవంబరు మాసములో జరిగిన ఒక జైన ప్రదర్శనములో ఈ గ్రంథము ప్రదర్శింపబడ్డది. వెయ్యి సంవత్సరములనాటి తాటాకులు 2400 వరకూ ఈ ప్రదర్శనలో ప్రదర్శింప బడుచున్నవి. ఇందులో ఒక లక్షాడెబ్బయి రెండువేల శ్లోకాలున్నవి. ఇందులో మొత్తము 718 భాషల్లో చదవవచ్చునట.

ఈ గ్రంథము జైనుల చరిత్రకు చాలా ఉపయోగించగలదట.

ఎంత హీనంగా లెక్కవేసినా ఒక శతాబ్దము దాట కుండావున్న ఈ గ్రంథంలో అంకెల స్థానాల విలువను నిర్ణయించే పద్ధతి. ఒక పద్ధతిలో ఉన్న స్థానాలను మరొక పద్ధతిలోకి మార్చే పద్ధతీ, మొత్త సంకలన సూత్రాలు. వివిధ సంఖ్యలను మరొక అంకెయొక్క మూలాలుగా నిరూపించటం (లాగరె థమ్స్) మొదలైన గణిత శాస్త్ర విశేషాలెన్నో ఉన్నవి.

ఇంకా మన దేశంలో 9వ శతాబ్దినాటికే పదార్థ విజ్ఞాన శాస్త్రము, రసాయన శాస్త్రము, జీవ శాస్త్రము, జంతు శాస్త్రము, ఆయుర్వేదము, ఖగోళ శాస్త్రము. పశువైద్యము మొదలైన వివిధ శాస్త్రాలు ఎట్లా అభివృద్ధి చెందినవో ఈ గ్రంథము వివరించగలదని తెలుస్తున్నది.

# "ఆశా జీవులు"

శ్రీ పి. వి. రత్నం

"ఎవరెస్టు శిఖరం." ఎత్తైన శిఖరం.
మహోన్నత శిఖరం. మరుపురాని శిఖరం.

మానవులను ముప్పతిప్పలు పెట్టిన మహోజ్జ్వల శిఖరం. ఆ పేరు ఎత్తితే చాయి— ఎన్నెన్ని భావాలు! ఎంతెంత ఆలోచనలు.

"అమ్మయ్యో!" అని ఒకసారి ఆశ్చర్యం. "అబ్బ!" అని ఒకసారి నిట్టూర్పు. కాని ఆ ఆశ్చర్యం ఆలోచనలు కల్గించింది. అందుకే అంత ఆవేశం. అందుకే అంత అభివృద్ధి.

నూరు సంవత్సరాలనుంచి నిద్రపోనివ్వని శిఖరం. సలుమూలలా పేరు ప్రతిష్ఠలార్జించుకున్న శిఖరం. పలు దఫాలుగా, పలు విధాలుగా ప్రయత్నం మీద ప్రయత్నం, ఫలితం సాధించాలన్న ప్రగాఢ వాంఛ.

అచంచల విశ్వాసం. అంతులేని ఆత్మవిశ్వాసం. పరాజయం పిమ్మట పరాజయం, ప్రాణాల్ని సైతం పొట్టపెట్టుకున్న పరాజయం. ఎముకల్ని కొరికే చలి. ఎవ్వరూ ప్రదేశం. కన్పించని ప్రపంచాన్ని పరిహసించిన ప్రదేశం. ఎంత కష్టం! ఎంత శ్రమ!

ఎంత ఓర్పు కావాలి? ఎంత నేర్పు వుండాలి? ప్లాను కావాలి. పట్టుదల వుండాలి. ప్రాణాలకు తెగించాలి. పరాజయాన్ని పాతిపెట్టాలి. భయాన్ని బాదాలి. అబ్బ! మానవునికి ఎందుకింత ఆరాటం? ఏమిటీ ఆత్రుత?

"కృష్ణా రామా" అంటూ, కలో గంజో త్రాగి, ఒక మూల కూర్చొని, కాలక్షేపం చేయక, మంచు కొండలలో కుస్తీ పట్టడమెందుకు?

ప్రపంచంలో ఎందరు బ్రతకడం లేదు? వీరూ తమ పొట్టల్ని పోషించుకోలేరా? కూటి కొరకు కోటి విద్య లున్నాయి కదా? మరి ఎందుకింత కాంక్ష? ఏమిటీ కలలు?

ఊహా. నరుడు తల్చుకుంటే, నల్లరాళ్ళు సైతం బ్రద్దలై పోతాయ్. మానవుడు సాధించని దంటూ లేదనికాబోలు. సంవత్సరాలు దొర్లిపోతున్నా. ఎందరెందరో, జట్లుజట్లుగా, దేశదేశాలనుంచి, ఎన్నెన్నో పర్యాయములు, ఫలితం కోసం రావడం, పరాజయం పొందడం చూస్తే, మానవునిలోని అకుంఠిత దీక్ష, అర్ధం అవుతుంది.

కొండల్ని కొలవడం— సముద్రాల్ని దాటడం— ఆకాశంలో తేలడం— అబ్బ! ఎంత ధైర్యం! ఎంత అభివృద్ధి!

ప్రకృతిని సాధించాలన్న ఆశ మానవునిలో ఆవిర్భవించకపోతే, మరి ఎలాంటి ఎదుగూ బొదుగూ లేకుండా, అనామకంగా, అయోమయంగా, ఆనందం లేకుండా, ఆదాయం లేకుండా, మైలు రాయిలా, మొద్దు నిద్రలో మునిగి వుండేవాడే.

పోటీ. పెద్ద పోటీ. ఆపోటీలో గెలుపొందాలని ఎంత సాహసానికి ఒడిగట్టారో! ఎంత ముందుకు సాగిపోయారో!

ఆనాడు, టెన్‌సింగ్ ప్రభృతులు ఎవరెస్టు సిఖరాన్ని, ఎట్టకేలకు, అధిరోహించారన్న వార్త నాలో నాకే ఆశ్చర్యం, ఆనందం— ఒకసారి 'అబ్బ'! అన్న నిట్టూర్పు— 'అమ్మయ్యో' అన్న ఆశ్చర్యం నాలో కల్గించాయి. కాని అంతలోనే నాలో ఉవ్వెత్తున ఉత్సాహ కెరటాలు పొంగి పొర్లాయ్.

మహోన్నత శిఖరాన్ని మానవుడు జయించాడు. జయపతాకను ప్రతిష్ఠించాడు. ప్రశంసలు, పూల వర్షంలా కురిసాయ్. దేశ దేశాలా, ఖండ ఖండలా, కీర్తి ప్రతిష్ఠలు— కస్తూరిలా అలుముకున్నయ్. అఖిల ప్రపంచంలో ఆనంద కిరణాలు. అహ్లాద జ్యోతులు. ఆశాజీవులకు హారతులు.......

ఇదే ఆలోచన. ఇదే ఆదర్శం, నాలో పరీక్ష ప్యాసు కావాలన్న పట్టుదల ప్రత్యక్ష మయింది. ఎన్నోసార్లు నాలో ఆశ అదృశ్యమైపోయి, నిరాశా నిస్పృహలు నాట్యం చేస్తున్న సమయంలో— ఈ చల్లని వార్త— అదే ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించారన్న రేడియో వార్త. ఆశను మోలకెత్తించింది.

మెదడులో మెదిలిన ఆలోచన— పెదవులపై మందహాసం— అన్ని సార్లు డింకీలు కొట్టినందుకు, నలుగురూ నవ్వడం, గుస గుసలు ;.... ఇంట్లో ఈసడింపులు.... నన్నట్లా "మొద్దులా" చేసాయ్. మొద్దుబారిన మెదడు... మనశ్శాంతి లేని జీవితం... నా అమూల్య కాలం, ధనం, శ్రమ, శక్తి సర్వనాశనమైపోతుంటే, నాలో నిరాశ నృత్యం చేయదా?

చేసింది. బాగా చేసింది. కాని ఆ నిట్టూర్పు. ఆ ఆలోచన. మళ్ళీ నూతన భావాలు, నవచైతన్యం కల్గించి, కునుకు తీయకుండా, కుమిలి పోకుండా, కన్నీరు కారకుండా, చేశాయ్.

పరీక్ష పోవడమంటే ఎవరెస్టు శిఖరంనుంచి పడిపోవడమన్నమాట. పరితపిస్తే ఫలితంఏముంది?

ఎవరెస్టు శిఖరం నా కళ్ళ ముందుంది. అదే నాలోని ఆశ. ఆరని ఆశ. ఆశాజ్యోతిలా ముందుంది. ఆ కాంతిలో, కళ్ళు తెరిచి చదివాను. బాగా చదివాను.

చివరికి ఆనాడు పరీక్షా ఫలితాలు ప్రకటించబడ్డాయ్. ఆత్రుత ...ఆవేదన....గుండెలు గుభేలు గుభేలు మంటున్నాయ్. వణకుతున్న చేతులతో పేపరు పేజీలు త్రిప్పి, ఫలితాలు చూస్తుంటే, కాళ్ళు దడ.... కళ్ళు చీకట్లు క్రమ్మాయ్. నిదానంగా చూస్తున్నా. ఎంతసేపటికీ, ఎక్కడ నా నెంబరు కన్పించకపోతే. చటాలున కూర్చొని. పేపరు చూడబోతుంటే, ప్రక్కనున్న మిత్రుడు "ప్యాస్ ! ప్యాసయ్యావురా" అంటూ దభాలున నా వీపు మీద ఒక చరుపు చరిచే సరికి, ఆనంద భాష్పాలతో, ఆలింగనం చేసుకున్నా వాడ్ని ; ఉక్కిరి బిక్కిరై పోతున్న ఉత్సాహ ఉద్వేగాలతో.

కొద్ది క్షణాలకు 'అబ్బ ?' అన్న నిట్టూర్పు, 'అమ్మయ్య !' అన్న ఆనందం నన్ను పలకరించుకొని, వగర్చుకొంటున్నా. వడివడిగా ఇంటికి తీసుకొచ్చాయ్,

పొంగిపోతూ, అందరికీ అనేకసార్లు "ప్యాసయ్యాను. నేను ప్యాసయ్యాను" అని మురిసిపోతూ చెప్పాను.

అందుకే ఇప్పుడు నాలో గర్వం. నలుగురిలో తలెత్తుకొని సగర్వంగా నడుస్తున్నా. నాలో జీవం పోసిన ఎవరెస్టు శిఖరాన్ని ఎన్నటికీ మర్చిపోలేను' ఎలా మర్చిపోగలను ?

అందుకే పీడితులూ, పరాజితులూ, ముమ్మాటికీ "ఎవరెస్టు" శిఖరాన్ని మర్చిపోకూడదు, ఇప్పుడు 'ఎవరెస్టు' ఎక్కినట్లే తల్చుస్తాను. అంతేకాదు 'ఎవరెస్టు' పేరు తల్చుకొని, నాలో నేనే, ఇప్పుడు నవ్వుకుంటుంటాను. ఎందుకా.... హ్హా ...హ్హా.... అందుకేనండీ.

## ఉరుములు - మెరుపులు

"పార్లమెంటు సభ్యులు యోగాభ్యాసము చేస్తున్నారట-" పత్రికా వార్త.

ఢిల్లీలో యోగాభ్యాసానికి వాతావరణ బాగున్నది కాబోలు-

మున్ముందు ఒక మహా సంక్షోభం రానున్నదనే భీతి నేటి ప్రపంచాన్ని ఆవరించివున్నది" — ప్రపంచ బౌద్ధ మహా సభలో

ఈ విపత్తును అదిగమించటానికి ఇప్పటి నుంచీ కొన్ని కమిటీలు ఏర్పరచాలి. ఒక నిధికూడా ఆరంభించాలి.

"రాజధానిలో మాట్లాడితే ఒక మహాసభ జరుగుతోందని. ఇవి ఇట్లా జరగకుండా కొంత అదుపు అవసరమని నెహ్రూ అన్నారు"— పత్రికా వార్త

దీనికి విరుగుడు వినే వారికన్నా మాట్లాడేవారు ఎక్కువగా విజృంభించటమే- కె. ల. ర.

షేక్స్పియరు కథ :

# రోమియో ★ జూలియట్

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

వెరోనోలోని ముఖ్య కుటుంబాలు కేప్యులెట్లు - మంటాగ్యూలు. ఆ కుటుంబాలు రెంటికిని చిరకాలమునుండి వైరమే. వీరిమధ్య ఎప్పుడూ ఏదో ఒక తీవ్రమైన కలహాలు జరుగుతూనే వుండేవి. వట్టి ఘర్షణలే కాకుండా చీటికి మాటికి చెయ్యికూడా చేసుకొనేవారే. ఆఖరుకి ఆ కుటుంబాల నౌకరులు సహితము ఏ బజారులోనో, రోడ్డుమీదో ఎదురైతే సంఘర్షణేదో ఒకటి జరుగకుండా వుండేదిగాదు.

ఒకరోజు కేపులెట్టు పెద్దయజమాని ఒక పెద్ద విందు చేశారు. ఆ విందుకు అనేకమైన ప్రభువులను చక్కని స్త్రీలను ఆహ్వానించిరి. దేశములోని సుందరాంగులందరినీ విందులో చూడవచ్చును. మంటేగ్యూ కుటుంబములోని వారు తక్క మిగిలిన వారందరు ఆహ్వానింపబడిరి, విందుకు వచ్చేవారందరినీ బ్రహ్మాండముగా ఇంటిలోనికి ఆహ్వానిస్తూ వారిహోదాలకు తగినట్లు ఆసీనులను చేయుచుండిరి. ఈ విందుకు రోజలైనుకూడ ఆహ్వానింపబడెను. మంటెగ్యూ కుమారుడైన రోమియోకు రోజలైను ప్రియురాలు. రోమియో మిత్రుడు బినొనోనియో అనువాడు. ఈవిందుకు ఎట్లయినను మారువేషము వేసుకొనైనను తన మిత్రుని వెళ్ళమని బలపరచెను — కారణము ఇచ్చట దేశములోని అందకత్తెలనందరినీ చూచిన పిదప తన ప్రియురాలు రోజలైన అందచందాల వివరములతో తన చెవులు చిల్లులు పడునట్లు వినుకించుట మానుకొనుననియే. రోజలైను తనను ప్రేమించక పోయినను రోమియోకు ఆమె దేదీప్యమానమైన దేవకన్యకగా కనపడుచుండుటచే సర్వకాల సర్వావస్థల యందు రోజలైను అందచందాల వివరాలతో విసుగించుచుండెను. చిట్టచివరకు విందుకు వెళ్ళుటకు సమ్మతించి తన మిత్రుడు బొనవిలో ఇంకొక మిత్రుడు మెరిక్యూషియోలతో కలసి మాస్కు ధరించి వెళ్ళెను. అప్పటి కాలములో అప్పుడప్పుడు మాస్కు ధరించి విందుకు వెళ్ళుట పరిపాటే, వీరిని అందరితోపాటు పెద్ద కాపులెట్ ప్రభువు ఆదరించి ఆసీనులను చేసి అక్కడ జరుగుచున్న నాట్యములలో పాల్గొనమని చెప్పెను. ఆ నాట్యము చేయువారిలో ఒక సుందరాంగి అద్భుత సౌందర్యము రోమియోను దిగ్భ్రాంతి చేసెను. మైమరచి 'ఆహా! ఏమి సౌందర్య'మని గట్టిగా అనెను. ప్రభువు కాపులెట్ మేనల్లుడు టైబాల్టు అనువాడు ఈ మాటలు విని శబ్దముచే రోమియోను గుర్తించెను. మంటేగ్యూ కుటుంబీకుడు తమ ఇంటి విందులకు వచ్చుట సహింపడయ్యె. పరిహాసము చేయుటకే తమ యింటికి వచ్చెనని తలచి రోమియోపై చెయ్యి చేసుకొన వుద్యుక్తుడాయెను. కాని విందు సమయమందు రభస చేసిన తన మేనమామ కోపగించునేమోయని అతి కష్టముతో మానుకొనెను.

రోమియో అతిచతురతతో ఆసుందరాంగితో మాట్లాడు అవకాశము కలిగించుకొనెను సంభాషణా చాతుర్యముతో ఆమెను నిలపి సంభాషించుచుండగా ఆమె తల్లి పిలుచుటచే రోమియోను విడచి ఆమె వెళ్ళవలసివచ్చెను ఆపిలచినది క్యాపులెట్ సతి అనియు, తన హృదయ మనోహరి, సుందరాంగి, వారి ప్రియపుత్రిక జూలియట్ అనియు తెలిసికొని తాను చాల బాధపడెను. కాని గట్టిగా హృదయములో హత్తుకొనిపోయిన ఆ సుందర స్వరూపాన్ని తుడచివేయలేక పోయినాడు. బాధపడుతూనే ఆమెను ప్రేమింప మొదలిడినాడు. అట్లే జూలియట్ నూ రోమియో ముఖమైన చూడకుండగనే ఆతనిని ఏలనో గాఢముగా ప్రేమింప మొదలిడెను.

అప్పటికే అర్థరాత్రి సమయమగుటచే రోమియో తన మిత్రులతో సహా ఇంటికి బయలుదేరిరి. కాని బైట కాలు పెట్టగనే తన సొమ్మేదో ఇంట్లో విడచివచ్చినట్లు తోచి రోమియో తన మిత్రులకు తెలియకుండ ప్రహరి గోడదూకి కోశయోలెటు గృహావరణలోనికి ప్రవేశించెను. అచట జూలియట్ సౌందర్యమును గురించి ఆలోచించుచుండగనే ఒక కిటికీలోనుండి జూలియట్ సుందర విగ్రహము కనబడెను. చంద్రబింబముకన్నను ఆమె ఎన్నియోరెట్లు ఎక్కువ ప్రకాశవంతముగా కనబడెను. ఆమెను చూచుచు అట్లే నిలబడిపోయెను. ఇంతలో ఆమె ఒక దీర్ఘనిట్టూర్పు

పిడచుచు "అయ్యో - నేను" అనెను. ఆహా 'ఏమి సుందరీ - నా దేవకన్య - ఏమిటి చెప్పు నీ మనస్సులోని మాటయని' మెల్లగా రోమియో తనలో తాననుకొనెను. ఇంతలో ఆమె రోమియో అచటనున్నాడని తెలియక 'ఓ రోమియో, ఓ రోమియో నీవెందుకు రోమియో వైతివి? నాకొరకు నీ పేరువిడచి నా ప్రియునివి కావేని నేను ఈక్షణము నుండి కాపులెటు వంశీయురాలను కాజాలను" అనెను. ఈమాటలు వినుటతోనే జూలియటు కూడ తనను ప్రేమించుచున్నదని తెలిసికొని అపరిమిత ఆనంద సముద్రమున మునిగిపోయెను. జూలియట్ తనలో తానే గట్టిగా రోమియో, మొంటేగో కుటుంబీకుడే లాయెనో, తనకు తన ప్రియునకు ఆకుటుంబ కక్షుల వలన ఎట్టికీడు మూడునోయని విధినిదూరెను ఇట్లామె తన ప్రేమ విరహ విలాపకలాపములు గట్టిగా సాగించుచుండగా రోమియో వీనులు విందుతో హృదయానంద భరితుడగు చుండెను మెల్లిగా కిటికీ వద్దకు వచ్చి ఆమె కనబడకుండ ఆమెను ఇట్లు వేడుకొనెను. 'నీకే పేరుతో నా పేరు పిలచిన ఆనందమో ఆ పేరుతోనే నన్ను పిలువుము. నీవే పేరుతో పిలచినను సరే - నేను ప్రస్తుతము రోమియోను కాదు నీప్రియుడను కావున నీయిచ్ఛవచ్చిన పేరుతో పిలువుము' అనెను. ఈమాటలు, పురుషకంఠము తనకిటికీ వద్దనగనే జూలియట్‌కు అపరిమితమైన భయము కలిగెను. 'నీవిచటకేలవచ్చితివి. ఎవరు వెళ్ళమనిరి? ఇచ్చట ఎవరైన నిన్ను చూచితిరేని నీకు మరణము తప్పదు' అని మెల్లిగా అనెను. 'ప్రేమే నాకీవిధానము చూపినది. నిన్ను ప్రేమించి మరణించుటే మేలని' రోమియో అనెను. దానిలో ఆమె భయపడుచూనే రోమియోమీద తనకు కలిగిన ప్రేమను తెలపెను. రోమియో తనివి తీర ఆమాటలు వినుచుండగనే గంటలు క్షణములవలె గడచిపోయెను. తూర్పున చీకట్లు తొలగుచుండెను. తెల్లవారుచున్నదని తెలిసికొని చాల భయపడి చిట్టచివరకు రోమియో జూలియటును వదలివెళ్ళెను. తెల్లవారగనే అతనికి ఎచ్చటకు రావలసినది కబురు బంపెదనని ఆనిర్ణీత స్థలములో కలసికొని వివాహము చేసికొని తరువాత తన నాథునితో పాటు ఆవిశాల ప్రపంచములో ఎచ్చటకైన బయలుదేరి వెళ్ళవచ్చుననియు చెప్పెను.

రోమియో అప్పటికైన ఇంటికి మరలి విశ్రాంతి తీసుకొనక తన మిత్రుడు ఫ్రయరు లారెన్సు యుండు ఆశ్రమమునకు వెళ్ళెను ఇంత తెల్లవారుతూనే రోమియోను చూచి ఆమతగురువు ప్రేమ బాధతో నిద్రపోలేక కాబోలునని తలచెను. కాని రోమియో తన క్రొత్త రాగదేవత జూలియటు సంగతి చెప్పి ఆనాడే తనకు ఆమెకు వివాహము చేయు ఏర్పాట్లు చేయుమని అనేక విధముల ప్రార్థించెను నిన్నటివరకూ రోజలేను అందాన్ని శ్లాఘించిన చిన్నవాడు నేడు జూలియట్ సౌందర్యాలాలసుడగుట ఆశ్చర్యము కలిగించి హృదయాల్లోగాక యువకులకు కండ్లలో ప్రేమ అవతరించునుగదాయని ఆలోచించ సాగాడు. కాని రోమియో తన వివాహ ఏర్పాటు చేస్తానని ఒప్పుకునే వరకు ఆయనను వదలలేదు.

జూలియటు పంపిన వార్తాహరుడు రాగానే తన ఏర్పాట్లను ఆమెకు తెలియచేసి లారెన్సు సహాయముతో ఆయన ఎదుటవారికి న్యాయబద్ధముగ వివాహము జరిపెను వెంటనే జూలియట్ తన ఇంటికి వెళ్ళెను. రోమియో తిరిగి ఆరాత్రికి తన కిటికీ దగ్గరకు వచ్చెదనని వాగ్దానము చేసెను ఆదినము మధ్యాహ్నము రోమియో స్నేహితులు బెన్నోలియోను మర్క్యూషియోను రాజమార్గమున వెళ్ళుచుండగా టైబాల్టువారిని చూచి రాత్రి కోపమింకను ఉపశమింపకుండుటచే వారిపై చెయ్యి చేసుకొనెను ఇంతలోకే అచ్చటకు రోమియోకూడ వచ్చెను. మర్క్యూషియోకు బలమైన గాయము తగిలెను రోమియో తన మిత్రుని చంపినందులకు కినసి టైబాల్టును చంపెను.

వెంటనే న్యాయస్థానమందు న్యాయ విచారణ జరిగెను. వెంటనే రోమియో వెరోనా నగరము విడచి వెళ్ళవలసినదిగా తీర్పు చెప్పబడెను.

కొద్ది గంటలమాత్రమే మధురమైన వాతావరణములో యున్న ఆవధువు జూలియట్ ఈ విషాదవార్త విని చాల ఖేదపడెను. రోమియో ఈ సంఘటన తరువాత లారెన్సు ఆశ్రమము చేరి అచ్చట పిచ్చివానివలె ప్రేలుచుండెను. తాను వెరోనా పట్టణము విడచి ఎట్లు వెళ్ళుదునని తల పీకుకొనుచు అరచుచుండెను. అప్పుడు ఆమతగురువు తన మిత్రుని మీద అధికమైన జాలితో కర్మ సిద్ధాంతమును

తెలియపర్చుచు ఓదార్చ జూచెను. కాని రోమియో వేదాంతసారములు విను స్థితిలో లేడు. ఇంతలో జూలియటు వద్దనుండి కబురు వచ్చెను. అదృష్టవశాత్తు టైబోల్టు చనిపోయెను. కాని ఆమల్ల యుద్ధములో నీవే చనిపోయి యుండెడివాడివే. పైగా న్యాయమూర్తులును నీమీద ఎక్కువ కఠినమైన శిక్ష బదులు నీకు దేశాంతర వాస శిక్షమాత్రమేకదా విధించిరి. రాత్రికివెళ్ళి జూలియట్‌ను కలుసుకొని ఆమెకు వీడ్కోలు చెప్పి, తెల్లవారక మునుపే విరోనో పట్టణము వదలి మంటోవో నగరమునకు వెళ్ళి అక్కడ నివసించుచుండుము. సమయము వచ్చినపుడు మీ వివాహ విషయము ఎల్లరకు తెలియ చేసెదను. అప్పుడు మీ ఇద్దరి తల్లిదండ్రుల వంశములలోని కలతలు తగ్గించుకొని మీకు సుఖము తప్పక కలిగింతురు! అని రోమియోకు సలహా ఇచ్చెను. రోమియో అట్లేననెను. జూలియటు వద్దనుండి వర్తమానములు జాబులు ఎప్పటి కప్పుడు తనకు పంపెదనని లారెన్సు వద్ద వాగ్దానముగై కొనెను.

ఆరాత్రి రోమియో క్రిందటి రేయి వలెనే ప్రహరీ దూకిలోని ఆవరణలోనికి వెళ్ళెను. తన భార్య జూలియటు కిటికీ వద్దలేదు కాని మరగున వున్న ద్వారము నొకదానిని తెరచి తన భర్తను లోనికి పిలచుకొని పోయెను. రాత్రం తయు కంటికి కూరుకు లేక ప్రేమ పాశములు వల్లెవేసు కొనిరి. కొద్ది క్షణములలోనే రేయెల్ల కడచిపోయినట్లుం డెను. కాకులు కూయనారంభించెను. తెల్లవారు చున్న దను తెలిసితో దుఃఖరేఖలు ఇద్దరి మొఖమున పొడ సూపెను. భారమైన దుఃఖముతో హృదయావేదనతో రోమియో తన ప్రేయసిని విడచి వెళ్ళెను. త్వరత్వరగా విరోనో పట్టణముకూడా విడచి వెళ్ళెను.

ఈ ప్రపంచములో కొందరి జీవితములు సుఖమయము. కొందరి జీవితములు దుఃఖమయము. ఏక్షణమున ఈజంట కన్నులు మనసులు కలసినవో ఆవేళావిశేషమేమో వారికి అప్పటినుండే శాంతిలేదుకదా అన్ని విషాదచ్ఛాయలే!

ఈవిషాద సంఘటన తరువాత కొన్నిదినములకు జూలి యటు తండ్రి ఆమె వివాహమును పేరిసు ప్రభువుతో నిర్ణయించెను. ఈవిషయము తెలిసికొని భయపడి పరిపరి విధముల తండ్రిని ప్రాధేయపడి తనకప్పుడే వివాహము వలదనియు మరి అనేక ఇతర కారణములు చెప్పియు, ఆ వివాహ ప్రయత్నము తప్పింప చూచెను. కాని ఆమె తండ్రి అవన్నియు స్త్రీ సహజపు సిగ్గుసిరులని భ్రమపడి వివాహ ప్రయత్నమునకు వలయు అన్ని ఏర్పాట్లను చేయుటకు సన్నిద్ధుడాయెను.

ఇంక చేయునది లేక జూలియటు తన విశ్వాస పాత్రుడైన భర్త స్నేహితుడగు లారెన్సును సలహానడిగెను.

ఆవేదాంతి జూలియటును ఇంటికి వెళ్ళి పేరిసు ప్రభువును వివాహము చేసుకొనుటకు సమ్మతించమనెను. అట్లు చేయుటకన్న మరణమే శరణ్యమనెను. అప్పుడు ఆ మతగురువు చిరునవ్వు నవ్వి - పోయి తాను చెప్పిన ప్రకారము పారిసు ప్రభువును వివాహము చేసుకొనుటకు నప్పుకొనమనెను. ఆమె చేతిలో ఒక చిన్న సీసానిచ్చి దానిని ఆరాత్రికి తీసుకొనమనెను. అది తీసుకొనిన మర ణించినట్లు పడిపోవుదురనియు, మర్నాడు వివాహ సమయ మునకు పెండ్లికుమారుడు కళ్యాణ గృహమునకు వచ్చు నప్పటికి తాను మరణించినట్లు పడియుండుననియు అప్పుడు తనని ఆదేశ ఆచార ప్రకారము పాడె మీద శ్మశాన వాటికకు తీసుకొని వత్తురనియు తన దేహము తెచ్చినవారు వెళ్ళిపోయిన పిమ్మట అనగా సరిగా ఔషధము సేవించిన 42 గంటలకు తెలివి వచ్చుననియు అప్పటికి రోమియో అచ్చటికి వచ్చునట్లు చేయుదుననియు తరువాత ఇద్దరు తమ ఇచ్చవచ్చిన చోటకు వెళ్ళి సుఖముగా నుండవచ్చుననియు చెప్పెను. ఈ వుపాయము చాల బాగున్నదని తలచినను కొద్దిగా భయపడినది. కాని పేరిసు ప్రభువును వివాహ మాడనుండ తప్పించుకొనుటకు రోమియోను చేరుటకు వేరొక ఉపాయము తోచక ఇదియే గతియని తలచి ఆయన వద్ద ఆ సీసా తీసికొని ఆయన చెప్పిన ప్రకారమే చేసెద నని చెప్పి ఇంటికి వెళ్ళెను.

మార్గ మధ్యమునే పేరిసు ప్రభువును కలుసుకొనెను. ఆయనను వివాహమాడుటకు అంగీకారము తెలిపెను. వెంటనే వాయువేగముతో ఆయన వెళ్ళి ముసలి క్యాపు లెటు దంపతులకు తెలిపెను. వారు మిక్కిలి అలజడితో వివాహ సన్నాహము ఏర్పాట్లు మరింత ఉత్సాహముతో

చేయ మొదలిడిరి మహా వైభవముగ జరుగదగిన వివాహమునకు వలయునన్ని ఏర్పాట్లు మహావేగముగా, ఆడంబరముగా జరుగుచుండెను.

ఆదినము బుధవారము. సూర్యాస్తమయమగుచున్నది. ఇంతలోనే జూలియటు మనసులో పెద్ద ఆందోళనతుఫాను చెలరేగినది. తను ఆమందు త్రాగిన నిజముగా మరణించితే తన ప్రియుడైన రోమియో గతి ఏమగునో లేక నలుబది నాల్గు గంటల పూర్వమే తనకు తెలివివచ్చిన అప్పటికి రోమియో రానియెడల తనేమి చేయవలెను. తనని శ్మశాన భూమిలో వదలివెళ్ళినప్పుడు పిశాచములు వగైరాలు పట్టుకొని హింసించితే? ఇట్లా అనేకవిధముల ఆలోచించుచూ దుఃఖించుచూ, విధిని దూరుతూ తన అదృష్ట మెట్టిదోయని ఆలోచించెను. దిక్కు తోచలేదు. ఆ ఔషధము సేవించుటే తరుణోపాయమని ఔషధము త్రాగి పడక మీదవ్రాలెను. తెలివి తప్పెను.

గురువారముదయము మేళతాళాలతో మంగళ వాద్యములతో పెండ్లికొడుకు వేసపజాము నే జూలియటు గృహమునకు వచ్చెను. ఆనిర్జీవ జూలియటు ప్రతిమను చూచి పేరిసు ప్రభువు నిర్జీవుడాయెను. ఆమెకై విలపించెను. తన దురదృష్టమును తిట్టుకొనెను. వివాహమునకు కావలసిన పురోహితుని బదులు అంత్యక్రియలకొరకు పురోహితుని పిలిపింపవలసివచ్చెను. ఇంటిలో వివాహమునకు చేయు ఏర్పాట్లన్నియు అంత్యక్రియలకు మరలింపవలసివచ్చెను.

శుభవార్తలకన్న దుఃఖవార్తలు శీఘ్రముగా చేరును కదా! ఫ్రెయరు లారెన్సు బంపిన వార్త చేరకముందే రోమియోకు జూలియటు మరణవార్త తెలిసెను. ఆహా ఏమి సృష్టివైపరీత్యము. తానొకటి తలచిన దైవ మింకొకటి తలచునుగదా జూలియటు మరణ వార్త వినగనే ఒక రహస్య స్థలమునకు పోయి కొద్దిగా ఒక చిటికె విషమును కొని దానిని భద్రముగా దాచికొని వెరోనాకు బయలుదేరెను అచ్చట చివరిసారి తన భార్యయగు కళేబరమునైన చూచి ఆ విషమును రోమియో నచ్చటనే సేవింపదలచెను. తాను వెంటనే బయలుదేరెను గనుక లారెన్సు బంపిన వార్త తనకు అందనేలేదు. రోమియో శ్మశానమునకు చేరునప్పటికి అచట పేరిసు ప్రభువును చూచెను. (ప్యారిసు ప్రభువును కట్టచివరకొకసారి తన జూలియట్ జూచు కొనుటకే వచ్చియుండెను) వారిద్దరు కత్తి కత్తి దూసికొని జూలియటు కళేబరమునకు సమీపముననే పడిరి.

జూలియటుకు తెలివి వచ్చు సమయము వచ్చినది. లారెన్సు బంపిన వార్త రోమియోకు అందలేదని తెలసి తానే జూలియటు కళేబరము వద్దకు వెళ్ళెను. అప్పుడే జూలియటు లేచెను. ఇంతలో ఎవ్వరి సందడియో విని లారెన్సు అచటినుండి పరారైను. జూలియటు రోమియో చేతిలో కప్పు చూచెను. ఆ కప్పుతో ఏదో విషము త్రాగి మరణించెనని తెలసికొనెను. ఆ కప్పులో ఇంకా కొద్దిగ విషమున్న తనుకూడా త్రాగవచ్చునని చూచెను. కాని అందు లేక పోయెను. వెంటనే సమీపమున నున్న ఒక ఖడ్గము తీసి దానితో తనను తానే పొడుచుకొని చంపుకొనెను. రోమియో ప్రక్కనే వ్రాలి మరణించెను.

ప్రేమజీవుల విపరీతగాథ!

మంటేగో ప్రభువు వంశము కాప్యులిట్ ప్రభువు వంశము ఈ వార్తలు విని చాలా దుఃఖించిరి. వారిని ఇదివరకు కన్నా ఒకరినొకరు ఈ విషాద గాథకు కారకులని దూషించుకొనిరి. వారి వైరము మరింత పెరిగెను.

అప్పుడు లారెన్సు వారందరి సమక్షంలో రోమియో జూలియటుల ప్రేమగాథ వివాహము తెలిపెను. రెండు వంశముల వారును వారి బిడ్డలతో పాటు తమ వైరమును ముగించుటకు నిశ్చయించుకొని ప్రేమ పూర్వకముగ క్యాపులెటు ప్రభువు మంటేగు ప్రభువు కౌగిలించుకొనిరి. తమ బిడ్డల జీవితములాహుతైన తరువాత వారు—కోడలి స్మారక చిహ్నముగా ఆమె విగ్రహము నొకదానిని బంగారుతో చేయించి వెరోనా పట్టములో ప్రతిష్ఠింప చేసెను క్యాపులెటు తన అల్లుని విగ్రహము చేయించి ప్రతిష్ఠ చేసెను అంతటితో వారి వైరములు రూపుమాసెను.

కాని పాపము రోమియో జూలియట్ల జీవితము అట్లు విషాదముగ ముగిసెనుగదా! ఆ ప్రేమజీవుల ప్రేమగాథ అమరగాథయై మనకందరికీ చిరస్మరణీయ మైనది.

(లేంబ్ షేక్సుపియరు కథకు అనువాదము) ప్రతినెలా సుప్రసిద్ధ ఆంగ్లరచయిత కథకొకదాని అనువాద మిచ్చుట ప్రకటింప దలచాము)

# సంక్షేమం



## ఈ అనుబంధంలో

ఆంధ్రరాష్ట్ర సంఘ సంక్షేమ సలహాసంస్థ నాల్గవ సమావేశము, ఆంధ్ర రాష్ట్ర సంక్షేమ విస్తరణ ప్రణాళికా కార్యదర్శుల (కన్వీనర్లు) మొదటి మహాసభ సంయుక్తంగా డిసెంబరు 15 వ తేదిన గుంటూరులో జరిగింది. మహాసభను ప్రారంభోత్సవం చేసిన ఆంధ్ర ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావుగారి ఉపన్యాసంలోని ముఖ్యాంశాలు !

# "స్వార్థత్యాగానికీ, పరోపకారానికీ స్వతస్సిద్ధంగా తగినవారు స్త్రీలు"

—శ్రీ కోకా సుబ్బారావు

సంఘసేవ అనేది నేడు క్రొత్త విషయమేమీకాదు. సృష్టి ఆదినుండీ ఉన్నదే. ప్రతివాని హృదయ కుహరం లోనూ నిగూఢంగా ఈ భావం ఉంటూనే ఉంటుంది. తన అవసరాలను తీర్చుకుని, తన కుటుంబీకులకు సహాయం చేయటం, క్రమంగా ఈ సహాయాన్ని సంఘంలోని ఇతరులకు విస్తరింప చేయటం మానవసహజం. ఈసేవా కార్యక్రమమును దేశమంతటా విస్తరింపజేయుటయే సంఘ సంక్షేమ సంస్థయొక్క వుద్దేశం. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తినైన నన్ను ఈసమావేశ ప్రారంభోత్సవం చెయ్యటానికి ఆహ్వానించటంలో, ఈ సంస్థకు ఎట్టి రాజకీయాలతోగాని, మతకుల సిద్ధాంతాలతోగాని, సంబంధాలు లేక కేవలం సంఘ సేవయే పరమావధిగా ఎంచుకుంటున్నట్లు ఋజువుచెయ్యటం జరిగిందన్నమాట.

సంఘ సేవాతత్పరులు కొద్దిపాటి అవధులను దాటి, విశ్వమానవ కల్యాణానికి, సమస్త మానవుల శ్రేయస్సుకూ పాటు పడుతున్నారు. ఇటువంటి లోకశాంతి మన పురాణాల్లో విస్తారంగా పొగడబడింది. భగవద్గీతలో ఫలాపేక్ష రహితంగా సత్కర్మ చెయ్యమని చెప్పబడింది. తన స్వార్థం కోసం తనుపాటు బడటమే పరమావధి కారాదు. స్వయం సహాయంలో స్వార్థం, త్యాగం ఇమిడి ఉన్నవి. మనం కొంత త్యాగం చేస్తే తప్ప, ఇతరుల కేమీ సహాయం చేయలేము. ఇట్టిస్వార్థత్యాగానికీ, పరోపకారానికీ స్వతసిద్ధంగా తగినవారు స్త్రీలు. తల్లులు తమ సుఖాన్ని త్యాగంచేసి, తమ పిల్లల శ్రేయస్సుకై తహతహ లాడుతారు. సంఘంలో విద్యావంతులైన స్త్రీలు ముందుకు వచ్చి ఈ సంఘ సంక్షేమ కార్యక్రమాలను జయప్రదంగా నిర్వహించ వలసి ఉంటుంది.

ఈ విషయంలో ప్రజలమీద వున్న బాధ్యత అపారం. ప్రజల సహకారం లభించినప్పుడే ప్రభుత్వకృషి పూర్తిగా ఫలిస్తుంది. కాని ప్రజలు తామెంతో ఘనకార్యం చేస్తున్నామనీ, ఎవరినో ఉద్ధరిస్తున్నామనీ భావం పెంచుకోక, దీనులయెడల తమ విధ్యుక్త ధర్మం నెరవేరుస్తున్నామనే భావంతో వారితో కలిసిమెలిసి, వారి కష్టసుఖాలలో భాగం పంచుకుంటూ సంఘ సేవ చెయ్యాలి. సంఘసేవను అనేక విధాలుగా చెయ్యవచ్చు. నిరాశ్రయులకు ఇళ్ళుకట్టించవచ్చును. కుష్టు, గుడ్డి, మొదలైన వారికి వైద్యసహాయం కలిగించవచ్చును. ఈ సేవాకార్య క్రమంలో ఉదారులు, స్వార్థరహితులు అయినవారి పూర్తి సహకారం అవసరం. మన ఆంధ్ర దేశంలో ఇటువంటి వారు ఎందరో ఉన్నారు. సంఘసేవా కార్యక్రమాలకు ప్రజల పూర్తి సహకారం లభిస్తుందని నేను దృఢంగా విశ్వసిస్తున్నాను.

ఇతర దేశాలతో పోల్చి చూస్తే మనదేశం ఎంతో వెనుక బడిఉన్నది. మనదేశంలో దరిద్రం తాండవిస్తున్నది. అజ్ఞానం చాలా ఎక్కువగా వుంటోంది. జన సంఖ్య రోజురోజుకూ పెరిగి పోతున్నది. చిన్నతనంలోనే అనేక రోగాలకూ, దుర్బలవాట్లకూ గురైన వారు ఎందరో ఉన్నారు. వైద్య సహాయం తక్కువ. లేమి లేకుండా చెయ్యటానికి ప్రభుత్వం చెయ్యగలిగిన దంతా చేస్తున్నది. కాని ప్రభుత్వం మాత్రమే ఏమీ చెయ్యలేము. ప్రజల సహకారంతో యీ సంఘ సంక్షేమ కార్య క్రమం జయప్రదం కాగలదని ఆశిస్తున్నాను.



# ఆంధ్రరాష్ట్ర సాంఘిక సలహా సంస్థ

# నాల్గవ సమావేశము

## ఆంధ్రరాష్ట్ర సాంఘిక సంక్షేమ ప్రణాళికల జిల్లా కన్వీనర్ల ప్రథమసమావేశము గుంటూరు.

ఆంధ్రరాష్ట్ర సంఘ సంక్షేమ సలహా సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి చన్నఘంటమ్మగారి ఉపన్యాస ముఖ్యాంశములు.

సర్వతంత్ర స్వతంత్ర ప్రజా స్వామ్యానికి అనుకూలంగా లిఖించబడ్డ మన రాజ్యాంగ చట్టంలో, శ్రేయోరాజ్య స్థాపనకు అవసరమైన సూత్రాలు కొన్ని పేర్కొన బడ్డాయి. స్త్రీ పురుషులకు సమాన హక్కులు; సమాన ప్రతిపత్తి. సమాన ఉద్యోగార్హతలు కల్పించడం, ప్రజల యొక్క ఆరోగ్యం, పిల్లలయొక్క సంక్షేమం, వృద్ధుల సంరక్షణ, తమ బాధ్యతలుగా గుర్తించి వరి పాలించడం ప్రభుత్వము యొక్క లక్ష్యాలుగా యీ సూత్రాలలో సూచించ బడ్డవి.

పై సూత్రాలను అమలు జరిపే నిమిత్తం, 1950 లో ప్లానింగ్ కమిషను నియమింప బడ్డది. ఈ కమిషనువారు తయారు చేసిన ప్రథమ పంచవర్ష ప్రణాళికకు కాగల 2244 కోట్ల మొత్తము వ్యయములో, 5 వ వంతు-అనగా 400 కోట్ల రూపాయలకు పైగా, సంక్షేమ కార్యక్రమాలు—విద్య, ఆరోగ్యం, నిరుద్యోగ నివారణ, వెనుకబడ్డ జాతుల ఉద్ధరణ, గృహనిర్మాణం, కార్మికుల సంక్షేమం యిత్యాది కార్య క్రమాలకు కేటాయించ బడ్డది.

సాంఘికసేవ అనేది "పరోపకారమిదం శరీరం" అన్న మన హిందూ దేశంలోగాని, హైందవ సాంప్రదాయంలోగాని క్రొత్త విషయాలుకావు. దానం, ధార్మికచింత పారం పర్యంగా మన జాతిలో వ్రేళ్ళుపాతుకుని ఉన్నప్పటికీ, కారణాంతరాల వల్ల, సాంప్రదాయానుబంధంగా సాంఘిక కార్య క్రమాలు విస్తరించ లేక పోయాయి. అక్కడక్కడ కొందరు ప్రత్యేక వ్యక్తులు, కొన్ని ప్రత్యేక సంస్థలు, బ్రహ్మసమాజమ్, రామక్రిష్ణమిషన్, దివ్యజ్ఞానసమాజం, క్రైస్తవమిషన్సు. యిత్యాదిముఖ్యంగా మత సంబంధంగా, ఏర్పడ్డ సంస్థలు, తదుపరి రాజకీయాలకు అనుబంధంగా, ఏర్పడ్డ రాష్ట్రీ సంస్థలు. దీనుల దారిద్ర్యం తొలగించడానికి, బీదలకు విద్య చెప్పడానికి, దరిద్రుల రోగ నివారణకు కృషిచేస్తూ వచ్చాయి. స్వచ్ఛందంగా యిట్లా ఏర్పడి, సేవా కార్య క్రమాలు సాధిస్తున్న యిలాంటి అనేక సంస్థల సహకారాన్ని పొందుతూ, వారి కృషిని ఒక నిర్ణీతమైన పంథాలో వినియోగించుటకై తగిన ప్రోత్సాహము, తగుమాత్రము ఆర్థిక సహాయము యిచ్చిన పక్షంలో, ప్రభుత్వపు బాధ్యత కొంత తగ్గి ఆశయాలు త్వరలోనే ఫలించే అవకాశాలుండుననే నమ్మకంతో, కేంద్ర సాంఘికసంక్షేమ సమితి, ఆగస్టు 15-1953 లో శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారి ఆధ్వర్యాన అవతరించింది. ఒక వంక ప్రభుత్వ ప్రాతినిధ్యం, ఒక వంక స్వచ్ఛంద సేవికా సేవకుల ప్రాతినిధ్యం గలిగి, ప్రభుత్వానికి అనుబంధమైనప్పటికీ, స్వతంత్రంగా వ్యవహరించే టటువంటి యీ సంస్థయొక్క కార్య ప్రణాళికకై, ప్రథమ పంచవర్షపు ప్రణాళికలో 4 కోట్లరూపాయలు కేటాయించ బడ్డవి.

శిశు సంక్షేమం, స్త్రీ సంక్షేమం, వికలాంగుల సంక్షేమం, బాలనేరస్థుల సంస్కరణ, యీ కార్య క్రమాలకు కేంద్ర సాంఘిక సమితి ప్రాముఖ్యతనిస్తుంది. ఆదిలో, ఈ సమితి నియమించిన ఉపసంఘాలు, దేశం మొత్తం మీద పర్యటించి, స్వచ్ఛంద సేవాసంస్థలు కొనసాగించుచున్న సేవాకార్య క్రమాలను పరిశీలించి, కేంద్ర సమితికి పంపిన సిఫారసులననుసరించి, యిప్పటివరకు రమారమి 1000 సంస్థలకు, కేంద్ర సమితివారు, విరాళాలనిచ్చి, జరుగుచున్న కార్యక్రమ అభివృద్ధికి సూచనలిస్తూ ప్రోత్సహించారు. ఆంధ్ర దేశంలో ఇంతవరకు 74 స్వచ్ఛంద సంస్థలకు $2\frac{1}{2}$ లక్షలకు పైగా యీ విధంగా ధనసహాయం అందజేయ బడ్డది. సంస్థల నిర్వహణకయ్యే వ్యయ

ములో 15000 లకు మించని సగము గ్రాంటును యీయడానికి కేంద్రసంస్థ ఏర్పాటు చేసింది.

ఇంకా ఎక్కువ సంస్థలకు యిలాంటి ప్రోత్సాహ మిచ్చుటకు, అనువైన చోట్ల క్రొత్త సంస్థలు కూడ ఏర్పాటగునట్లు ప్రజలలో ఉత్సాహము కలిగించుటకు, గ్రామాల్లో సంక్షేమ కార్య క్రమం విస్తరించే ప్రణాళికలను అమలు జరుపుటకు—ఒక్కొక్క రాష్ట్రములో ఒక్కొక్క సలహా సమితి ఏర్పాటు చేసింది. ఈ సలహా సమితిలో కూడ ప్రభుత్వోద్యోగులు, ప్రభుత్వ ప్రతినిధులు, అనుభవముగల స్వచ్ఛంద సేవా కార్య కర్తలు ఉన్నారు. మన ఆంధ్ర రాష్ట్రానికి యీ రోజున సమావేశమైన..... ...

శ్రీమతి రామసుబ్బమ్మ. }
కోటమ్మరెడ్డి — } ప్రభుత్వ ప్రతినిధులు—
బుచ్చికృష్ణమ్మ —
శ్రీ రాఘవరావు.

లేడీ వెంకటసుబ్బారావు — రాలేదు.
శ్రీ బి. నటరాజన్ } - రాలేదు.
కుమారి జె. జమునాబాయి } ఉద్యోగస్తులు.
శ్రీమతి ఎ. సి. కృష్ణరావు.

ఇదిగాక, జిల్లాలలో విస్తరణ కార్య క్రమాలను అమలు జరిపే నిమిత్తం, ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క జిల్లా కార్యవర్గం ఏర్పాటు చేయబడ్డారు—స్థానికంగా పలుకుబడి, స్థానికసేవా కార్య క్రమాలలో అనుభవం, పరిచయంగల వ్యక్తులు యిందు సభ్యులుగా నియమింపబడ్డారు- D. M. O, D. P. O, A. O- ఇందు ప్రభుత్వ ప్రతినిధులు, ఇచ్చట సమావేశమైన జిల్లాప్రతినిధులు. ఈ రాష్ట్ర సలహాసమితి, జిల్లా కార్య వర్గాలు, గత జూలై నుండి నియమింప బడ్డవి—

రాష్ట్రసమితి సభ్యులు, వ్యష్టిగాను, సమిష్టిగాను పర్యటించి గత ఐదు మాసాల్లో ఒక 60 సేవా సంస్థలను దర్శించారు. అక్టోబరులో జరిగిన రాష్ట్ర సమితి మూడవ సమావేశంలో, 50 సేవా సంస్థలనుండి గ్రాంటులకై వచ్చిన దరఖాస్తులను పరిశీలించి, వారి సిఫారసులను కేంద్ర సమితికి పంపించారు.

ఇప్పుడు ప్రారంభమైన నాల్గవ సమావేశంలో — రమారమి75 దరఖాస్తులు పరిశీలించబడుతాయి.

ఇంక సంక్షేమ విస్తరణ కార్యక్రమ బాధ్యత వహించిన జిల్లా కార్యవర్గాలు ఎంతో ఉత్సాహంగా పని ప్రారంభించి, ఆగష్టు 15 వ తేదీకల్లా ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క ప్రాజెక్టు ప్రారంభించారు. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో, దేశం మొత్తంమీద 350 ప్రాజెక్టులు ప్రారంభించి, జరిపించాలని - కేంద్ర సమితివారి ఆశయం-ఆంధ్ర రాష్ట్రానికి ఇందు 17 ప్రాజెక్టులు కేటాయింపబడ్డాయి. ఒక్కొక్క ప్రాజెక్టు ఒకజిల్లాలో, ఒకటి రెండు తాలూకాలకు సంబంధించిన 20, 30 గ్రామాల ప్రజలకు, అంటే 30, 40 వేల జనాభాకు, సంక్షేమం అందజేస్తుంది. జిల్లా కార్యవర్గంవారు ప్రప్రథమంలో వెనుకబడియున్న గ్రామాలలో పర్యటించి, గ్రామస్థులతో ప్రసంగించి; వారి అవసరాలను అర్థం చేసుకుని యిక్కడ ఒక కేంద్రాన్ని స్థాపిస్తారు. ఇట్లాంటి కేంద్రాలు, ఒక్కొక్క ప్రాజెక్టు ఆవరణలో 5కు తగ్గకుండానూ, 7కు మించకుండానూ ఏర్పాటు చేయబడతాయి. అంటే ఒక్కొక్క సంక్షేమ కేంద్రం- సుమారు నాలుగైదు పల్లెల ప్రజలకు- ఉపయోగపడుతుంది రెండు సంవత్సరాలు యీ ప్రాజెక్టు నిర్వహించడానికి, సుమారు 50000/- వ్యయమౌతుందని, అందు సగభాగం— కేంద్రసమితి, కాలు భాగం రాష్ట్ర ప్రభుత్వం, మిగతాది గ్రామ ప్రజలు భరించవలెనని పథకముయొక్క స్వరూపం—పర్యటనకనువైన ఒక జీపును ప్రతి జిల్లాకూ కేంద్రసమితి యిచ్చియున్నది.

ఆంధ్ర దేశంలో, గ్రామ ప్రజలు ఎక్కడ కోరినా ప్రసూతి కేంద్రమే. గ్రామాల్లో వైద్యసహాయమన్నది పూర్తిగా శూన్యంగా ఉన్నది. అందు ముఖ్యంగా, గర్భిణీ స్త్రీలకు వైద్య సహాయం లేక, ప్రమాదదశలో ఒక్కొక్క మారు 40 మైళ్ళవరకూ, బండిమీదనో, చేతులమీదనో వేసుకొని వచ్చే పరిస్థితి ఎన్నో గ్రామాలో కలుగుతూ వుంది. అందువల్ల, ప్రసూతి కేంద్రాల ఏర్పాటుకే, మన జిల్లా ప్రాజెక్టులలో ప్రాముఖ్యత యీయబడినది. దాని కనుబంధంగా పిల్లలకు పాలు పోయుట, ఆటలు పాటలు నేర్పుట, పరిశుభ్రత నేర్పుట, యిటువంటి కార్యక్రమం కూడా చాలా కేంద్రాలలో ఏర్పాటు చేయబడ్డది.

గుంటూరు జిల్లావారు- ఇప్పటికి 6 ప్రసూతి కేంద్రాలు స్థాపించారు. 19 వ తేదీన పనపర్లలో మరియొకటి స్థాపించబోవుచున్నారు. ప్రజలు అమిత వుత్సాహంగా, యీ స్థాపనకు తమ సహకారాన్నిస్తున్నారు. ఎన్నో

గ్రామాల ప్రజలు తమ గ్రామాల్లో యిల్లాంటి కేంద్రాలు ఏర్పాటుచేయమని జిల్లా కార్యవర్గాన్ని కోరడం. ప్రాధేయపడి, నిరుత్సాహంతో తిరిగివెళ్ళడంకూడాసంభవిస్తూవుంది.

అయితే అన్నీ ప్రసూతి కేంద్రాలుగా ఉండనవసరంలేదని నిర్ణయించారు. శిశు సంరక్షణ, శిశు విహారములు నెలకొల్పుట, వికలాంగులకు, వృద్ధులకు, వృత్తిని కల్పించడం, అంటువ్యాధులతో బాధపడేవారిని ఇండ్లనుండి వేరుచేసి, తగిన వైద్యాలయాలకు పంపించడం- యిలాంటి కార్యక్రమాలు కూడ యీ ప్రణాళికలో జేరినవేను. రాజమండ్రి- రాజానగరంలో, వికలాంగులకు, వృద్ధులకు, వృత్తి కేంద్రాన్ని స్థాపించి, వారికి భోజనం, వస్త్రములు యిస్తున్నారు. ఈ పథకంగా, ఒక్కొక్క జిల్లాలో 3.4.5 కేంద్రాలు స్థాపించి, యీ నాల్గు మాసాలుగా జిల్లా కార్యవర్గంవారు కృషి చేయుచున్నారు. ఎండనక, వాననక ఇసుకలో, బురదలో, దారిలేని అడవులలో, పర్యటించి, దూర దూరాన ఉన్న గ్రామాల్లో యీ కేంద్రాలను స్థాపించి, నిర్వహించుచున్న జిల్లా కార్యవర్గంవారి ఉత్సాహం, పట్టుదల చాలా అభినందించదగియున్నవి.

రాష్ట్ర సలహాసమితి 3-వ సమావేశం కర్నూలులో జరిగినప్పుడు శ్రీ ప్రకాశం పంతులుగారు, గాంధీజీ సూచించిన నిర్మాణ కార్యక్రమం సంఘ సంక్షేమానికి ప్రాతిపదిక"యని ఉద్ఘాటించారు. "గ్రామపునర్నిర్మాణానికి గాంధీజీ అనుచరులు దారి చూపించారు. కమ్యూనిటీ ప్రాజెక్టు, నేషనల్ఎక్స్‌టెంట్ష‌న్ సర్వీసులుయున్నగునవి అధికోత్పత్తి, రోడ్లు వంతెనల నిర్మాణాన్ని స్వయంసమృద్ధి గ్రామాల్లో సాధించుటకు ఏర్పాటైనాయి. అందువల్ల, కేంద్రసమితివారు నెలకొల్పిన సంక్షేమ విస్తరణ ప్రణాళిక సకాలంలోనే ప్రారంభించబడ్డవి. గ్రామాల్లో ప్రారంభమైన అభివృద్ధి ప్రణాళికలకు, ఇవి ఒక పరిపూర్ణమైన స్వరూపాన్ని కలిగిస్తుంది" అని బాబూ రాజేంద్రప్రసాద్ గారు నవంబరులో ఢిల్లీలో జరిగిన సలహాసంఘ అధ్యక్షుల మహాసభలో ఉపన్యసించారు.

"సంక్షేమవిస్తరణ ప్రణాళికల వలన మానవజీవితాలలోని కొరతలను కొంతవరకూ తగ్గించ గలిగినా, సంపూర్ణ సమగ్రజీవితానికి మరికొన్ని అవకాశాలు కలిగించగలిగినా, మానవసంబంధ బాంధవ్యాలలో కొంత సమన్వయం తీసుకురాగలిగినా, సంపూర్ణ సంక్షేమంవైపు, శ్రేయోరాజ్య స్థాపనవైపు, మనం మరొకమెట్టు ముందుకు సాగినట్లే అనిన శ్రీమతి దుర్గాబాయిగారి వచనాలు— ఆంధ్రదేశంలో జరుగుచున్న కృషిని చూచినప్పుడల్లా స్ఫురణకువచ్చి, మనసుకు కొంతతృప్తిని కలిగిస్తూ వుంటాయి.

నవంబరులో ఢిల్లీలో జరిగిన రాష్ట్ర సమితుల అధ్యక్షుల సమావేశంతో, కేంద్ర సంక్షేమ సమితి ఒకనూతన ఘట్టానికి చేరుకోగలిగిందని చెప్పాలి. స్వచ్ఛంద సహకారంతో జరుపబడుచున్న యీ సంక్షేమ కార్యక్రమం — యీనాడు ఎన్నో నూతన, అవకాశాలను ప్రజలకు కల్పిస్తూవుంది. ఇంతకు పూర్వము స్థాపితమై కృషిచేయుచున్న సంస్థలకేగాక, క్రొత్తగా స్థాపింపబడే సంస్థలకు, నిర్వహణకేగాక, గృహనిర్మాణానికి కూడా. గ్రాంటులు యిచ్చుటకు క్రొత్తగా నిర్ణయింపబడ్డవి. విద్యా ప్రచారానికి, సంచారవైద్యానికి ఉపయోగించ డానికి ఒక మోటారు వాన్‌ను సంస్థలకు దానంచేయడానికి కూడా నిర్ణయించింది. వృద్ధులకు, నిరాశ్రయులకు ఆశ్రయము, కార్మికస్త్రీల శిశువులకై క్రెచీలు, కుంటి గ్రుడ్డిమూక మొదలగు వికలాంగులకు విద్యాలయాలు, వసతి గృహాలు, బాల్యనేరస్తులకు అనువైనవసతి, విద్యాలయాలు, అనాధశరణాలయాలు, ప్రసూతి కేంద్రాలు—ఎక్కువగా స్థాపించుటకు ప్రోత్సాహమివ్వ వలెనని నిర్ణయించింది, ఆడఖైదీల బిడ్డలకు తాత్కాలిక వసతి గృహాలు, విడుదలైన ఖైదీలకు ఉద్యోగము కల్పించుటకు, విడుదలైన బాల్యనేరస్తులకు వృత్తి కల్పించుటకు, సహకార కర్మాగారాలు, మంత్రసానులు, దాయిలు, అగ్నిజన్లను తర్ఫీదుచేసే శిక్షణ పాఠశాలలు- ఇట్టి సంస్థల నిర్వహణకు ఎక్కువ ప్రోత్సాహ మిచ్చుటకుకూడ నిశ్చయించింది. పట్టణాల్లో ఉండే మధ్యతరగతి స్త్రీలకు తమయింటనుండి చేయగల పనిని నేర్పించి తన్మూలంగా, కొంత ఆదాయం కల్పించడానికని, పెద్ద నగర సంక్షేమ పథకాలు కూడా ప్రారంభించ డానికి నిశ్చయించింది. ఢిల్లీలో ఈ సంస్థ పరిముఖంగా ప్రారంభింప బడుచున్న అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ దీనికొక ఉదాహరణ 500 కుటుంబాల స్త్రీలకు ఇది వారి యిండ్లలోనే వృత్తిని కలిగించగలదని అంచనా—

ఈవిధంగా సంక్షేమ కార్యక్రమాన్ని విస్తృతంచేస్తూ మానవునిలోనున్న సేవాశక్తిని సమీకరిస్తూ, స్వచ్ఛంద

# గుంటూరు సమావేశము

సేవాదళాన్ని దేశం మొత్తంమీద ఆయత్త పరుస్తూ, ఒక ఆదర్శమైన శ్రేయో రాజ్యాన్ని స్థాపించడానికి ప్రభుత్వానికి చేదోడుగా నిలవడమే కేంద్ర సమితి ఆశయం.

విషయం విస్తృతంగా చెప్పి మీకందరికూ కాలయాపన చేసితినేమోనని భయపడుచున్నాను. తమ అమూల్యమైన కాలంలో కొద్దిభాగం— యీ కార్యక్రమానికని ఒసంగిన ప్రధాన న్యాయమూర్తికి, సమావేశమైన అతిథులకు నా కృతజ్ఞత తెలియజేయు చున్నాను మీ ఆశీర్వాదములతో, సహకారముతో మేము తలపెట్టిన కార్యక్రమం దిగ్విజయంగా విస్తృతమై, ప్రజామోదాన్ని బడయగలదని ఆశిస్తున్నాను. కార్యక్రమ నిర్వహణలో ఉత్సాహము జూపుచున్న రాష్ట్ర సభ్యులకు, జిల్లా కార్య వర్గాలకు, ప్రజా బాహుళ్యానికి, కావలసిన ప్రచారమిచ్చి సహకరిస్తున్న పత్రికా నిర్వాహకులకు, నా ధన్యవాదాలు.



# పుష్పవర్షం



ఇది బౌద్ధవాఙ్మయం నుండి గ్రహించిన కథ; తథాగత తన పద్మసింహాసనమున నుపవిష్టుడై యుండి, తన శిష్యులకు బౌద్ధ మత సారాంశము బోధించుచుండగా, విమల కీర్తి యొక్క ప్రస్తుత శరీరం వేసలి నగరమున రోగ గ్రస్తమైఉన్నదని తెలుసుకుంటాడు. ఆయన మంజుశ్రీనీ, బోధిసత్వునీ, తన శిష్యులినీ పంపిస్తాడు. ఈ యన్ని గురించి విచారించడానికని. సువాసనా లోకంలో పూలను గురించి శ్రద్ధ తీసుకుంటున్న దేవ కన్యను కూడ అక్కడకు పంపిస్తాడు పూలు పిచికిమ్మడానికని. తథాగత ఆజ్ఞానుసారం ఆమె తన పూల పరిచారికలను వెనుక విడుకొని వేసలికి బయలుదేరుతుంది. పీరు సుమేరు, ఫ్యుటోషాన్, ఇంకా యితర దివ్య స్థలాలమీదనుండి యెగిరి వెళ్ళి వేసలి నగరంలో విమలకీర్తి, మంజుశ్రీ, తదితరులు బౌద్ధ మతాన్ని గూర్చి చర్చించుచున్న సమయానికి చేరుకుంటారు. ఆమె వారిపై పూలు వర్షించి, పడమటి దిశగా తిరిగిపోతుంది.—

—చైనీస్ బ్యాలట్ లోని సన్నివేశం.

# ఇండియాలో కుటుంబ సంక్షేమ కృషి

:o:

డాక్టర్ మిస్ జి. ఆర్. బెనర్జి.
(బొంబాయి టాటా సాంఘిక శాస్త్రపాఠశాలాధ్యాపకులు)

కుటుంబం విశిష్టమైన సంఘానికి పునాది. మానవుల మధ్య సుహృద్భావ సంబంధాలు పెంపొందాలంటే, దానికి అవసరమైనదికూడా కుటుంబమే. కనుకనే కుటుంబంలోని క్లిష్టసమస్యలకు, వ్యక్తిగతమైన చిక్కులకు గల సంబంధాలకు యిటీవల అత్యధికమైన ప్రాధాన్యం యివ్వబడింది.

కుటుంబానికి సంబంధించిన వివిధ సమస్యల పరిష్కారానికి వేర్వేరు సంస్థలు నెలకొల్పబడినవి. వీటి ప్రధాన లక్ష్యం కుటుంబ సంక్షేమమే కనక కుటుంబసంక్షేమ సంస్థలుగానే యివి తరుచుగా పరిగణింపబడుతున్నవి. ఈదృష్టితో చూస్తే ప్రసూతి, శిశు రక్షణ కేంద్రంకూడా తల్లి బిడ్డల ఆరోగ్యావసరాలను తీర్చడానికే కృషి చేస్తుంది కనక యిది కూడా కుటుంబ సంక్షేమ సంస్థే కాగలదు. చిక్కులలోవున్న కుటుంబాలకు ఆర్థిక సహాయంచేసే సంస్థలకు కూడా ఈ సూత్రం వర్తిస్తుంది.

అయితే, పైన పేర్కొన్న సంస్థలు చేసేకృషి కుటుంబ సమస్యలలో ఒక భాగం మాత్రమే. ఉదాహరణకు ఒక కుటుంబాన్ని తీసుకొందాం. భర్త నిరుద్యోగి. భార్యకు జబ్బుగావుంది. పిల్లవాడు బాల నేరస్థుడై వుంటాడు. ఎంప్లాయిమెంటు బ్యూరో భర్తకు ఉద్యోగం మాత్రమే సమకూర్చగలదు. ఆసుపత్రి భార్యకు చికిత్స చెయ్యాలి. సంక్షేమ సంస్థలేవీ మొత్తంమీద కుటుంబం సమస్యలను గమనించవు. ఆధునిక కుటుంబ సంక్షేమ సంస్థ అయితే మొత్తం కుటుంబాన్నే ఒక వర్గంగా తీసుకొని, వ్యక్తిగతంగా కుటుంబసభ్యుల అవసరాలను తీర్చడంద్వారా మొత్తం సమస్యను పరిష్కరించడానికి పూనుకొంటూ వుంటుంది.

ఈ సంస్థ అనేక సమస్యలను ఏవిధంగా పరిష్కరించగలదు? ఒక ఎంప్లాయ్‌మెంటు బ్యూరోను, ఒక ఆసుపత్రిని, ఒక బిడ్డల రక్షణ కేంద్రాన్ని కూడా ఈ సంస్థ నిర్వహించవలసివుంటుందా? అక్కరలేదు. ఇతర సంస్థలతో సహకరించడం ద్వారానే ఈ సమస్యలను పరిష్కరించగలుగుతుంది

కుటుంబ సంక్షేమ సంస్థలో సాంఘిక సమస్యల పరిష్కారంలో ప్రత్యేక శిక్షణ పొందిన సంఘసేవకు లుంటారు. తమ సమస్యలను స్వయంగా పరిష్కరించుకొనజాలని వారికి, తత్పరిష్కారంలో వీరు తోడ్పడుతూ వుంటారు. కుటుంబ సంబంధాలపైన, తలిదండ్రులకు, పిల్లలకు గల సంబంధాలపైన యజమానికి - పనివానికి గల సంబంధాలపైన ఈ సంస్థ సలహాలిస్తూ వుంటుంది. ఈ సంస్థలోని సంఘ సేవకుడు ప్రజలకు తగు సలహాలివ్వగల నిపుణుడై వుంటాడు.

కుటుంబానికి చెందిన ఏదో ఒక సమస్యపై సలహా కోసమే కుటుంబ సంక్షేమ సంస్థ సలహాను కోరినప్పటికీ, మొత్తం కుటుంబ సమస్యలో భాగంగానే భావించి సంస్థ పరిశీలిస్తుంది. రోగ చికిత్స పొందడంలో అశ్రద్ధచేసిన సందర్భాలు, భార్యాభర్తల మధ్య సామరస్యం లేకపోవడం, నిరుద్యోగం, పిల్లల చదువు వంటి సమస్యల విషయంలోకూడా కుటుంబం కోరికలకు, పరిస్థితులకు అనుగుణంగా సహాయం చెయ్యబడుతూ వుండగలదు.

సాంఘిక సమస్యల కృషి మన దేశంలో ప్రారంభదశలోనే వున్నందున యిందుకు కృషిచేసే సంస్థల సంఖ్య ప్రస్తుతంలో తక్కువగానే వున్నది. ఏ సమస్యనైనా మొత్తం సమస్యలదృష్ట్యా పరిశీలించి, వ్యక్తిగతంగా పరిష్కారానికి తోడ్పడే సంస్థ ఒక్కటీ లేదు. కుటుంబ సంక్షేమ సంస్థ మనదేశంలో ఓం ప్రథమంగా 1950 మే నెలలో బొంబాయిలో నెలకొన్నది. ఈ కృషి ఆవశ్యకతను గుర్తించిన కొందరు ప్రముఖులు దీనికి పూనుకొన్నారు. ఎన్.ఎం. వాడియా ధర్మసంస్థ, అమెరికన్ విమెన్స్ క్లబ్, సర్ దొరాబ్జీ టాటా ట్రస్ట్, అఖిలభారత సాంఘిక మహాసభ, మున్నగువాటి సహాయ సహకారాలతోను, కొందరు హితైషులు కానుకగా యిచ్చిన కుర్చీలు బల్లలు సమకూర్చగా ఈ కుటుంబ సంక్షేమ సంస్థ ఏర్పడ్డది. సుశిక్షితుడైన ఒక సంఘ సేవకుడు ఉద్యోగిగా నియమించ బడ్డాడు.

# కుటుంబ సంక్షేమం

బొంబాయి మదర్స్ అండ్ చిల్డ్రన్స్ వెల్‌ఫేర్ సొసైటీ ఈ సంస్థ కార్యాలయాన్ని 10 బి డి.డి చాల్, డెలిస్లె రోడ్ లోని తమ భవనంలోనే ఏర్పాటు చేసుకొనడానికి అనుమతించింది. జాతి మత వివక్షత లేకుండా అవసరంవున్న వారందరు ఈ సంస్థ సహాయం పొందే అవకాశం కలిగించబడింది. ప్రభుత్వం నిర్వహిస్తున్న ఆసుపత్రులు, బాల్య నేరస్థులను విచారణచేసే న్యాయ స్థానాలు, శిశు సంరక్షణ కేంద్రాలు, ప్రయివేటుగా వ్యక్తులు కోరే సలహాలను యిస్తూ వుంటుంది. కొంత మంది ఈ సంస్థతో తామే సరాసరిగా వ్యవహరిస్తూవుంటారు. పెండ్లికాని తల్లులకు, బాల నేరస్థులకు పునరావాసం కల్పించవలసిందని, అటువంటి వారిని ఎవరైనా పెంచుకొనడానికిగల అవకాశాలను పరిశీలించవలసిందని దాంపత్య జీవితంలో దంపతులమధ్య ఏర్పడివున్న వైమనస్యం తొలగించవలసిందని, ఆంతరంగిక సమస్యలపై సలహా లియవలసిందని, ఆసుపత్రులనుంచి విడుదల పొందిన కొందరి విషయంలో తర్వాత జాగ్రత్తకు, అనారోగ్య సమస్యలకు తగు ఏర్పాట్లు చెయ్యవలసిందని అనేకమంది సలహాలను కోరుతూ వుంటారు.

సలహాకోరి వచ్చే వ్యక్తి తన పరిస్థితిని తాను సమగ్రంగా గ్రహించగలగడానికి, తన అనిశ్చిత స్థితిని విడిచి, ఒక నిశ్చయానికి రాగలగడానికి తన సమస్యల పరిష్కార విషయంలో ఎదుర్కొంటున్న చిక్కులనుగురించి చెప్పుకొనడానికి ఈ సంస్థకు చెందిన సంఘ సేవకుడు తోడ్పడతాడు.

కుటుంబ సమస్యల పరిష్కారంలో వ్యక్తి జీవన పరిస్థితులలో ఏర్పడ్డ చిక్కులను తొలగించడానికి, తగ్గించడానికి, తన స్వశక్తి చేతనే తగు విధంగా ఆ చిక్కులను సవరించుకొనడానికి, సంస్థ సంఘ సేవకుడు సహాయపడతాడు, ఈ సమస్యలను ఒకదాని తరువాత మరొకటిగా గాని, ఏకకాలమందే గాని ఆ సమస్య తీరునుబట్టి తత్పరిష్కారానికి చర్య తీసుకొంటుంది. కొన్ని సందర్భాలలో సంస్థ చిక్కులోవున్న వ్యక్తినిగాని, కుటుంబం సభ్యులనుగాని సంప్రతిస్తుంది. ప్రత్యేక సహాయాలను చేస్తుంది.

సలహా లివ్వవలసినసందర్భాలలో కొన్ని సమయాలలో సంస్థ సహాయాన్ని అర్థించిన వ్యక్తితో కలిసి పని చేయవలసి వుంటుంది. కొన్ని సందర్భాలలో కుటుంబం సభ్యులతోనే సంప్రతించి, వారు ఆ సమస్యపట్ల తమ వైఖరిని మార్చుకొనడంలో తోడ్పడుతుంది. అభ్యర్థికి, అతని కుటుంబానికి సహాయం చేసే సందర్భంలో సంస్థ పాఠశాలల, ఆసుపత్రుల, ధార్మిక సంస్థల తోడ్పాటును ఆర్థిక సహాయం, ఉద్యోగం చూసిపెట్టడం, ఏకాలు అయినా తీసివేయబడిన పరిస్థితిలో కృత్రిమమైన కాలును ఏర్పాటు చెయ్యడం వంటివి కుటుంబ సమస్య పరిష్కారానికి తోడ్పడగలవు. ప్రతి సమస్యను సంస్థ పరిష్కరించిన తర్వాత కూడా తర్వాతి జాగ్రతకు తగు చర్య తీసుకొని ముగిస్తుంది.

పరిష్కారానికి పిమ్మట సహాయం పొందిన వ్యక్తి తిరిగి చిక్కుల నెదుర్కొనడనే హామీని సంస్థ యివ్వజాలదుగదా! అయితే సంస్థనుంచి సహాయం పొందిన అనుభవాన్ని బట్టి కొందరు ఆ తర్వాత ఎదురైన చిక్కులను ధైర్య, విశ్వాసాలతో పరిష్కరించుకోగలరని, పరిస్థితులు విషమించకుండానే సంస్థ సహాయాన్ని కోరగలరని ఆశించవచ్చు.

కుటుంబ సమస్యల పరిష్కారంలో తోడ్పడడానికి, గృహజీవన విధానాలను ఉద్బోధించడానికి, విచ్ఛిన్నమైన కుటుంబాల సముద్ధరణకు ఇండియాలోని వేర్వేరు ప్రాంతాలలో కుటుంబ సంక్షేమ సంస్థలను ఏర్పాటు చెయ్యవలసిన ఆవశ్యకత ఎంతైనాకలదు. ఏ సమస్యనైనా మొత్తం కుటుంబం సమస్యగా భావించడం, ఆ సమస్య వలంగా ఏర్పడ్డ చిక్కును వారించడం, అది తిరిగి సంభవించకుండా చూడడం వంటి చర్యలద్వారా కుటుంబసమస్యలను తగ్గించడం, కుటుంబాలు విచ్ఛిన్నమైపోకుండా కాపాడడం ఈ కుటుంబ సంక్షేమ సంస్థలకు కర్తవ్యం కాగలదు.



# కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ

## ఇంతవరకు జరిగిన కృషి

శ్రీమతి ఎం. రంగనాయకిగారు

ప్లానింగ్ కమిషన్ సిఫారసుపై కేంద్ర సంక్షేమ సంస్థ ఏర్పడి అప్పుడే ఏడాది దాటింది. స్త్రీలు, బిడ్డల సంక్షేమానికి దేశంలో పాటుపడుతూన్న స్వచ్ఛంద సంస్థలకు తోడ్పడడమే కేంద్ర సంక్షేమ సంస్థ ప్రధాన లక్ష్యం. స్వచ్ఛంద సేవ చేస్తున్న సంస్థలకు యింతవరకు ప్రభుత్వ సహాయం అంత ఎక్కువగా అందడంలేదు. ఏ దేశానికైనా సాంఘిక, ఆర్థిక, సంస్కృతి రంగాలలో యిటువంటి సంస్థలు విధి విహితంగా వుండవలసిందే. ప్రజల సాంఘిక, ఆర్థికాభివృద్ధికి తోడ్పడే ఈ సంస్థలకు కేంద్ర ప్రభుత్వం తగు ప్రాధాన్యమివ్వడం సర్వవిధాల సమంజసమౌతున్నది.

కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ స్వయం నిర్ణయాధికారంకల సంస్థ. స్వచ్ఛంద సంఘ సంక్షేమ సంఘాల ప్రతినిధులు, పార్లమెంటు ఉభయ సభల ప్రతినిధులు దీనిలో సభ్యులు. ఈ సంస్థకు శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ గారు అధ్యక్షులు. సాంఘిక సంక్షేమ సాధనకు కేంద్ర ప్రభుత్వం నాలుగు కోట్ల రూపాయలు ప్రత్యేకించింది. బహు కొలది కాలంలోనే తనకు గల స్వయం నిర్ణయాధికారాన్ని పురస్కరించుకొని, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ అపూర్వాభివృద్ధిని సాధించింది.

దేశంలోని సంఘ సంక్షేమ సంఘాలకు కేంద్ర సంస్థ మాచింగ్ పద్ధతిని ద్రవ్య సహాయం చేస్తున్నది. ఇప్పటికి 1523 సంస్థలు ద్రవ్య సహాయానికి దరఖాస్తు చెయ్యగా 1008 సంస్థలకు కేంద్ర సంక్షేమ సంస్థ సహాయం చేసింది. ఏసంస్థకైనా కేంద్ర సంస్థ గ్రాంటు రూపంలో సహాయం చెయ్యదగు గరిష్ట మొత్తం 15,000 రూపాయలు. కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ అజమాయిషీలోనే ఈ సహాయం సమకూర్చబడుతూ వుంటుంది.

దేశంలోని వేర్వేరు స్వచ్ఛంద సంస్థలు చేస్తున్న కృషిని స్థానిక సమస్యలను పరిశీలించడానికి కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ పంపిన నిపుణులు, సంఘ సేవకులు ప్రతిరాష్ట్రంలోను స్థానికావసరాలను తీర్చడానికి సంక్షేమ సలహా సంఘాలు ఏర్పాటు చెయ్యడం అవసరమని సూచించారు. సంక్షేమ విస్తరణ ప్రణాళికల నిర్వహణకు కేంద్ర సంక్షేమ సంస్థ నిర్ణయానికి ఈ సూచన అనుగుణంగా వున్నందున 1954 ఏప్రిల్ నుంచి రాష్ట్రీయ సంఘ సంక్షేమ సలహా సంఘాలు ఏర్పాటు చెయ్యబడ్డాయి.

దేశంలోని 27 రాష్ట్రాలలోను సంఘ సంక్షేమ సలహా సంఘాలున్నాయి. ఈ సలహా సంఘాలు ఏర్పాటు ఆయా రాష్ట్రాల ముఖ్యమంత్రులతో సంప్రదించినమీదట జరుగుతూ వుంటుంది. వీటిలోని సభ్యులను రాష్ట్రీయ ప్రభుత్వాలు, కేంద్ర సంక్షేమ సంస్థ నియమిస్తూ వుంటాయి. కేంద్ర సంక్షేమ సంస్థ రాష్ట్రీయ ప్రభుత్వాలు కలసే ఈ సంఘాలకు అధ్యక్షులను ఎన్నుకొంటాయి. ఈ విధంగా అధికార, అనధికార వర్గాలకృషి సమీకరించబడడం గమనార్హం. రాష్ట్రీయ సంక్షేమ సలహా సంఘాలకు కేంద్ర సంక్షేమసంస్థ ఆర్థికంగాను, సాంకేతికంగాను సహాయం చేస్తూవుంటుంది.

కేంద్ర సంక్షేమ సంస్థ బాధ్యత ఈ కార్యభారం ఏకేంద్రీకృతం చెయ్యబడడంతో ముగియలేదు. గ్రామ ప్రాంతాలలో సంక్షేమ విస్తరణ ప్రణాళికల నిర్వహణకు కేంద్ర సంక్షేమ సంస్థే పూనుకొన్నది. ఈ ప్రాజెక్టుల నమలు జరపడంలో రాష్ట్రీయ సంఘ సంక్షేమ సలహా సంఘాలు అత్యంతమైన బాధ్యతను నిర్వహిస్తూ వున్నవి. గ్రామ ప్రాంతాలలోని ప్రజల సంక్షేమాన్నే లక్షించే యీ సంక్షేమ విస్తరణ కార్యక్రమాలకు కమ్యూనిటీ ప్రాజెక్టు, జాతీయ విస్తరణ కార్యక్రమాలు ఒకటే కాకుండా చూడడానికి ఎక్కువ జాగ్రత్త వహించబడుతుంది.

సంక్షేమ విస్తరణ ప్రణాళిక 15 నుంచి 20 దగ్గర దగ్గరగా వుండే గ్రామాలకు— సుమారు 20,000 జనాభాగల వాటికి అనవర్తించబడుతూవుంది. ఇది బహుళార్థ సాధక

## సాంఘిక సంక్షేమం

మైనది. స్త్రీలు, బిడ్డలు, దుర్బలుల సంక్షేమ సాధనకిది యుద్దేశించబడింది. మహిళా సేవకులు దీనికై తమకాలాన్ని పూర్తిగా వినియోగిస్తారు వీరికి స్వచ్ఛంద సేవకులు కొంత కాలం వినియోగించి సాయపడుతూవుంటారు.

ప్రతి ప్రాజెక్టుకు సుమారుగా 50,000 రూపాయలు ఖర్చు కాగలదని అంచనా వెయ్యబడుతుంది. కేంద్ర సంక్షేమ సంస్థ దీనిలో సగం భరిస్తుంది. మిగిలిన సగం రాష్ట్రీయ ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలు భరిస్తాయి. సంస్థల సేవకుల ప్రయాణ సౌకర్యాలకు కేంద్ర సంక్షేమ సంస్థ ఏర్పాటు చేస్తుంది. ఏ తరగతి రాష్ట్రాలలో 17 ప్రాజెక్టులు, బి తరగతి రాష్ట్రాలలో పది ప్రాజెక్టులు, సి తరగతి రాష్ట్రాలలో ఐదు ప్రాజెక్టులు తలపెట్టబడ్డాయి.

పెక్కు రాష్ట్రాలలో సంక్షేమ సలహా సంఘాలు కార్యక్రమాలు ప్రారంభించాయి. రాష్ట్రీయ సలహా సంఘాలకు, ప్రాజెక్టు ప్రాంతాలకు జీప్ కార్లు పంపించబడ్డాయి.

352 ప్రాజెక్టుల నిర్వహణకు కేంద్ర సంక్షేమ సంస్థ తలపెట్టగా అప్పుడే 136 ప్రాజెక్టులు స్వాతంత్ర్య వార్షిక దినోత్సవంనాడు, గాంధి జయంతినాడు ప్రారంభించబడ్డాయి. మొత్తంమీద దేశంలోగల 329 జిల్లాలలోను ఈ ప్రాజెక్టులు జిల్లాల వారీగా ప్రారంభించబడ్డాయి. ఇంకా 23 ప్రాజెక్టులు ఆ తర్వాత నిర్వహించడానికై అట్టేపెట్టబడ్డాయి.

పట్టణ ప్రాంతంలోని తక్కువ రాబడిగల స్త్రీల కోసం ఢిల్లీలో కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ కుటుంబ సంక్షేమ కృషి సందర్భంగా ఒక పైలట్ ప్రాజెక్టును తలపెట్టింది. ఒక అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ నిర్మాణం ఈ సందర్భంలో చాల మట్టుకు పూర్తి అయింది. ఈ సంవత్సరాంతంలోగానే ఫ్యాక్టరీ పని ప్రారంభం కావచ్చు.

విస్తృతమైన ఈ కృషి సందర్భంగా ప్రచారం కోసం వేర్వేరు రాష్ట్రాలలోని సంక్షేమ సంఘాల తమ తమ అభిప్రాయాలను తెలుపుకోనడం కోసం 'సోషల్ వెల్ ఫేర్' అనే మాస పత్రిక ప్రకటనకు కేంద్ర సంస్థ సంపాదకవర్గం తగు చర్య తీసుకొంటోంది. దేశ భాషా పత్రికలలో ఇంగ్లీష్ పత్రికలలోని వ్యాసాలు ప్రచురణకు కూడా ఏర్పాట్లు గైకొనబడుతున్నవి.

కేంద్ర సంక్షేమ సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయ్ దేశ్ ముఖ్ గారి ఆధ్వర్యంలో సాంఘిక సంక్షేమ శాసనాలపై రెండు ప్రమాణ గ్రంథాలను ప్లానింగ్ కమిషన్ తయారు చేస్తున్నది. ఈ రెండు గ్రంథాల సంయుక్త సంపాదక వర్గానికికూడా శ్రీమతి దుర్గాబాయ్ దేశ్ ముఖ్ గారే అధ్యక్షులు.

---

# Andhra Mahila Sabha

## NURSING HOME

**(Report for November '54)**

| Department | | No. of Cases |
|---|---|---|
| Out-Patient Department | ... | 2,216 |
| In-Patient Department | ... | 139 |
| Delivery cases | ... | 55 |
| Free distribution of milk to children | ... | 1350 |

All the patients treated and Maternity aid given as shown above are very poor people from the slum areas in the neighbourhood and no fees are charged from them.

Forty one women are at present receiving training as Midwives and Nurses.

# దాసీలుగా బ్రతుకుతున్న స్త్రీలు

శ్రీమతి పద్మినీసేన్ గుప్త



"స్త్రీలు! కార్మిక సంక్షేమం" శీర్షికపై పెక్కు వ్యాసాలు వ్రాస్తున్న శ్రీమతి పద్మినీ సేన్‌గుప్త కార్మికవృత్తిలో జీవించే స్త్రీల దైనందిన జీవనంపట్ల ఎంతో శ్రద్ధాసక్తులు కల విదుషీమణి. 1945 నుంచి 1953 వరకు ఇండియన్ జూట్ మిల్ అసోసియేషన్‌లో లేబర్ ఆఫీసరుగా పనిచేసినప్పుడు ఆమిల్లుల ప్రాంతంలో పెక్కు ఆసుపత్రులు, క్రీచీలు, పాల కేంద్రాలు, జనానాక్లబ్బులు, క్రీడా కేంద్రాలు, బారక్‌పూర్, టిటాఘుర్‌లలో ఏర్పాటు కావడానికి కృషి చేశారు. అక్కడ ఆమె మహిళా సంక్షేమ సంఘాలను కూడా స్థాపించారు. పనిపాటులు చేసి జీవించే స్త్రీల సమస్యలను పరిష్కరించడానికి స్వయంగా కృషి చేశారు.

1901 లో మద్రాసులో ఆమె జన్మించారు. ప్రఖ్యాత పత్రికా రచయిత్రి శ్రీమతి కమల సత్యనాథన్ గారి కుమార్తె ఆమె. ఎం.ఏ పరీక్షలో ఉత్తీర్ణురాలైనపిదప ఆమెపత్రికా రచనలో శిక్షణ పొందారు. అప్పటినుంచీ సాంఘిక సంక్షేమకృషితోపాటు పత్రికా రచనను కొనసాగిస్తున్నారు. "ప్రాచీనభారతంలో దైనందిన జీవితం" (**Every day-life in Ancient India**) అన్న ఆమె రచనను ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్‌వారు ప్రకటించారు. శ్రీమతి పద్మినిసేన్‌గుప్త ఇప్పుడు బెంగాల్ ప్రాంతంలోని యంగ్ ఉమెన్స్ క్రిష్టియన్ అసోసియేషన్‌కు అధ్యక్షురాలుగా వున్నారు. కలకత్తాకు చేరువగా వున్న ఖరిబేరియా గ్రామ సంక్షేమ కేంద్రం ఆమె అజమాయిషీలోనే నిర్వహించబడుతూంది.

దక్షిణ భారతదేశంలో రెడ్‌క్రాస్ సంస్థకు పెక్కుశాఖలను ఏర్పాటు చేశారు. బెంగాల్ గరల్‌గైడ్స్ అసోసియేషన్‌కు పబ్లిసిటీ కమీషనర్‌గా కూడా పనిచేశారు. భారతీయ కార్మిక స్త్రీల శ్రేయోభివృద్ధులపైగల తీవ్రమైన ఆకాంక్ష ఆమె రచనలలో ప్రతిబింబిస్తూ వుంటుంది. అదే ఆమె రచనలోని విశిష్టత. అదే ఆమె రచనలోని ప్రత్యేకాకర్షణకూడా.

* * *

మధ్య తరగతికి కొంచెం తక్కువ శ్రేణికి. సర్వ సామాన్య శ్రేణికి చెందిన స్త్రీలు ఏదైనా ఫ్యాక్టరీలో గాని, కర్మాగారంలోగాని కొలువునకు వుండనప్పటికీ ఏవో పనులలో నిమగ్నులయ్యేవుంటారు.

ఒక పాతజనాభా నివేదికలో యీవిధంగా పేర్కొనబడివుంది. "నిరుద్యోగులు శీర్షిక క్రింద చేర్చబడిన వారిలో, పెక్కుమంది నిజానికి వంటపని, నీళ్లుమోయడం, ధాన్యాలు దంచడం, పిల్లల్ని ఎత్తుకోవడం మున్నగు పనులు చేస్తునే ఉన్నారు." ఇటువంటివారంతా 1931 లో 'ఇంటిపనులు చేస్తున్నవారు' అని పేర్కొనబడింది. ఇండియాలో చాలామంది 'ఆయాలు'గా పనిచేస్తున్న స్త్రీలు కలరు. వీరిని 'స్త్రీ కార్మికులు'గా పేర్కొన్నజాడ కనిపించదు. ఈ ఆయాలు, బెంగాల్‌లోని 'ఝూ'లు లేదా 'పనికత్తెలు' లేకుండావుంటే ఇండియాలో ఏమిజరిగి వుండేదా అనుకొంటాను.

1940 లో నేషనల్ ప్లానింగ్ కమిటీ కార్మిక పరిస్థితుల విచారణ సంఘం తన నివేదికలో ఇళ్ళలో పనిచేసే పరిచారికలుమున్నగు వారి సంక్షేమానికి కొన్ని సిఫారసులు చెయ్యడం ముదావహం. వారిరక్షణకు ఏదైనా శాసనం చెయ్యడంలో 'ఇంటి నౌకరులు' అని వాడేటప్పుడు,

వారిలో ఇంటికి సంబంధించిన అన్నికాల చాకిరిచేసేవారి నందరినీ కూడా చేర్చవలసివుంది.

విచారణ సంఘం తన నివేదికలో చేసిన సిఫారసులు ఈవిధంగా తెలుపుతున్నాయి. 15 సంవత్సరాల వయస్సు లోపు పిల్లలు పనిచెయ్యరాదు. నౌకరుకు రాత్రి తొమ్మిది గంటలపాటు విశ్రాంతివుండాలి. పగలు మధ్యాహ్నం ఒంటిగంటనుంచి సాయంకాలం అయిదుగంటలవరకు పని వుండకూడదు. ప్రతీ ఆదివారంపూట సెలవియ్యాలి. నౌకరులు మామూలుగా కుటుంబ జీవితం గడుపుకోవాలి. తగువసతి సౌకర్యం కలిగించాలి. తిండిపెట్టి, 20 రూపాయలకు తక్కువకాని వేతనం యివ్వాలి. వేతనం సక్రమంగా చెల్లించాలి. వేతనాల శాసనం, వర్కుమన్స్ కంపెన్‌సేషన్ చట్టం, సాంఘికభీమా సౌకర్యం వీరికి వర్తించాలి. దాసిపనులు చేసే స్త్రీలకు ప్రసవకాలం సౌకర్యాలివ్వబడాలి సాంఘిక రక్షణ చర్యల దృష్ట్యా ఇతర పనివారికి ఏవిధమైన సౌకర్యాలున్నాయో, అవి అన్ని వీరికి సమకూర్చబడాలి.

ఆయాలు, వంటపనుల్లో సహాయం చేసేవారు, ఇళ్ళు తుడిచి, దాసీపనులు చేసేవారు ఎంతకష్టపడి పనిచేస్తూ వుంటారో, ఏవిధంగా తగినంతగాలి, వెలుతురు, నీటి సదుపాయం లేక బాధపడుతూవుంటారో, ఎంత తక్కువ జీతాలకు ఎంత ఎక్కువ పనిచేస్తూవుంటారో పరిశీలించి, గ్రహించి వీరివిషయంలో తగురక్షణలు కల్పించవలసి వుంది.

యూరోపియనుల యిళ్ళలో పనిపాటులు చేసేవారి పరిస్థితి బాగుంటుంది. అయితే పెక్కు భారతీయుల కుటుంబాలుకూడా నౌకరులు విధివిరామాలు లేకుండా పని చేసే అమానుషులుకాక మానవత్వం కల సౌజన్యవంతు లని యిప్పుడిపుడు గుర్తిస్తున్నాయి. రవీంద్రనాథ్ టాగూరు తన "పురాతనభృత్య" గేయంలో నౌకరుల త్యాగశీలతను ప్రశంసించాడు. పెక్కుమంది పత్నులు తమ పనివాళ్ళను గురించి ఏమేమో ఫిర్యాదులు చెబుతూనే ఉన్నప్పటికీ, భారతీయ కుటుంబంలో పనిమనిషివల్ల ఆ కుటుంబంలోని వారికి కలిగే సుఖం తక్కువైనదికాదని. యితర దేశాలలో యిట్టి సౌకర్యం చాలా అరుదైనదని నేను చెప్ప గలను.

ఇంక మిగిలిన యితర తరహాలపని వారిమాటేమి? వేర్వేరు వృత్తులలో వేర్వేరు రంగాలలో పనిచేసే స్త్రీ కార్మికులకు సంబంధించిన లెఖలవివరాలను పరిశీలిస్తే అనేకమంది స్త్రీలు క్రమబద్ధంకాని పెక్కు వృత్తి వ్యాపారాలలో పనులుచేసి కుక్షినింపుకొంటున్నారని తేట పడుతుంది. నిజానికి పాటకజనంలో స్త్రీలు ఏదో ఒక పని చేస్తేనేకాని వారికి రోజుజరగదు. ఈపరిస్థితివల్ల పని పాటులలో నిమగ్నులైవున్న స్త్రీల సంఖ్య లక్షలలో వుంటున్నది. వీరివిషయంలో నేను యిటీవలలెఖ్ఖలను సేకరించలేక పోయినప్పటికీ, అఖిలభారత మహిళాసభ, ఉమన్స్ ఇండియన్ అసోసియేషన్ 1939 లో నానాజాతి సమితికి అందజేసిన మెమోరాండంలో చిన్న చిన్న వ్యాపారాలలో పనిచేస్తున్న స్త్రీలకు సంబంధించిన భోగట్టా వున్నది. ఈ వ్యాపారాలలో పురుషులకంటె స్త్రీలే ఎక్కువగా వున్నారు. పాలు, పెరుగు వ్యాపారం చేసే ప్రతీ వెయ్యిమందిలోను 486 మంది పురుషులైతే 514 మంది స్త్రీలున్నారు. బొగ్గు, పిడకలు, వంట చెరుకు వ్యాపారంచేసే ప్రతీ వెయ్యిమందిలోను 443 మంది పురుషులైతే 557 మంది స్త్రీలుకలరు.

గ్రామాలలో పాలు పోసేది ముఖ్యంగా స్త్రీలే. ఊరి వెలుపల అడవులలో కట్టెలు ఏరుకొని తెచ్చేది స్త్రీలే. జిమ్ కార్బెట్ 'మాన్ ఈటర్స్ ఆఫ్ కుమాన్' పుస్తకంలో పేర్కొన్నట్లు కట్టెలకోసం అడవుల లోపలకంటు వెళ్ళి జంతువుల వాతబడేది స్త్రీలే చాలామంది స్త్రీలు పేడను పిడకలుగా చేసి వంటచెరకుగా విక్రయిస్తారు. రైల్వే సైడింగులవద్ద కుప్పలనుంచి బొగ్గును ఏరితెచ్చుకొని, కొన్ని అణాలకు దానిని విక్రయించుకొని గడిపేవారు కొందరు. వీధులు ఊడ్చేవారు కొందరు.

ధాన్యం దంచడం, పిండి విసరడం వంటిపనులుచేసే వారిలో చాలమంది స్త్రీలుకలరు. 1936 లో వారి సంఖ్య 1000 మందికి 185 మంది పురుషులైతే స్త్రీలు 815 మంది వంతున వున్నారు. పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన పారిశ్రామిక కార్యక్రమంలో ధాన్యం దంచడం గ్రామీణ పరిశ్రమలలో ముఖ్యమైనదిగా పరిగణించబడడం గమనార్హం. "రాతి చక్రాల ద్వారా ధాన్యం దంపించడం ద్వారా ఎక్కువ బియ్యం, పొట్టురాబట్టడమే ఈకార్యక్రమం లక్ష్యం." ధాన్యం దంపుడు అమలున గలప్రాంతాలలో 50,000 చక్కీలు నాలుగు సంవత్సరాలలో పంపిణీ చెయ్యడానికి యోచించబడుతూవుంది. హల్లరు రైస్ మిల్లులను క్రమంగా తగ్గించివేయడమే ఈ కార్యక్రమానికి

లక్ష్యం" అని పంచవర్ష ప్రణాళిక పేర్కొన్నది. (రెండవ పంచవర్ష ప్రణాళిక. 144 పుట.)

స్త్రీలు పనిచేస్తున్న యితర వ్యాపారాలలో లాండ్రీపని ఒకటి. ప్రతీ వెయ్యిమందికి ఈపని చేస్తున్న స్త్రీలు 300 మందివున్నారు. అయితే ఫ్యాక్టరీలలోని లాండ్రీలలోను రంగుల అద్దకంలోను పనిచేస్తున్న వారి సంఖ్య 1951లో ఇండియా మొత్తంమీద 51 మందే అయినప్పటికీ పెక్కు మంది స్త్రీలు గ్రామాలలో చాకిత పనులను తమ మా నాన చేసుకొంటూవున్నారనే చెప్పవచ్చు.

తోలు ఫ్యాక్టరీలలో పనిచేస్తున్న స్త్రీల సంఖ్య 1951 లో 624. అయితే ప్రయివేటుగా ఈ పరిశ్రమలో పని చేస్తున్న స్త్రీల సంఖ్య ఇంకా ఎక్కువగా వుండవచ్చు. గ్రామాలలో తోలుపనులు చేసేవారికోసం సహకార పద్ధతి సంఘాలు ఏర్పాటుచేసి, పట్టణాలలోను, పరిసరాల లోను వారికి శిక్షణ యిప్పించి, అభివృద్ధిని సాధించడానికి పంచవర్ష ప్రణాళికలో నిర్ణయించబడింది. చిన్నచిన్న వ్యాపారాలు చేసుకునేవారి అభివృద్ధిని పంచాయతీ, సహ కారోద్యమాలు నిర్దిష్ట కార్యక్రమాల ద్వారా సాధించ వచ్చు.

ఊలు నేత కేంద్రాలస్థాపనకు, చేతికాగితం పరిశ్రమకు, తేనెటీగల పెంపకానికికూడా పంచవర్ష ప్రణాళిక కార్య క్రమాలను నిర్ణయించింది. ఈకార్యక్రమాలన్నిటి వల్ల స్వయంగా చిన్న చిన్న వ్యాపారాలు చేసుకొని చాలీచాలని సంపాదనలతో బాధపడుతున్న పెక్కుమంది స్త్రీలకు తగినంతపని కల్పించవచ్చు.

సహకార సంఘాల స్థాపనవల్ల పెక్కుమంది కష్ట పడి సంపాదించుకొన్న దానిలో కొంత చేజిక్కించుకొనే కంట్రాక్టుదారుల గొడవను తప్పిస్తుంది.

"ప్రతీ ప్రభుత్వశాఖ, ప్రతీ మంత్రివర్గం సహకార వ్యాపారపు పద్ధతులను అమలు జరపనట్లయితే సుస్థి రఫలితాలను సాధింపజాలము" అనికూడా పంచవర్ష ప్రణాళిక (83వ పుట)లో పేర్కొనబడ్డది.

ఇంకా చేపలు, కాయకూరలు, పువ్వులు, పళ్ళు, గాజులు అమ్ముకునేవారు, లేసులు కుట్టేవారు, కుండలు చేసేవారు, నేతపనివారు, నూలు వడికేవారు మారు మూలల కుగ్రామాలలోకూడా రోజుకు కొన్ని అణాలు సంపాదించుకొనడంకోసం పనిచెయ్యడం కద్దు. ఈ పరిశ్రమలన్నీ ప్లానింగ్ కమీషన్ కార్యక్రమంవలెనే అభివృద్ధి పొందించబడవలసివున్నది. నిజానికి చేనేత, కుటీర, గ్రామ పరిశ్రమల విషయాలలో ఎక్కువ శ్రద్ధా సక్తులు వహించబడుతున్నవి. పారిశ్రామిక పాఠశాలలు విరివిగా స్థాపించబడుతున్నవి. చేతిపనులతోపాటు కూర గాయలు, పువ్వులు, మొక్కల పెంపకం, ఊరగాయలు, పప్పడాలు, మిఠాయిలు, యితర వ్యాపారాలు ప్రస్తుతంలో కంటె క్రమబద్ధ విధానంలో కొనసాగడానికి, అభివృద్ధి పొందడానికి కృషి చెయ్యవలసివుంది.

కోరమాండల్ కోస్తాలో మత్స్యకారులైన వనితలతో నేను ఉదయకాలం గడపిన సంగతిని మరువలేను. ఎంత ఉత్సాహంతో వారు చేపలను వలనుంచి సేకరించి, బుట్టలు నింపుకొని అమ్మకానికై వెళ్ళేవారు ? ఒక్కొ కపుడు చేపలు లభించేవే కావు. కాళీ బుట్టలతో నిరాశగా వెళ్లిపోయేవారు. లేదా పెద్ద తుపాను వచ్చి, ఆనావలు మునిగిపోయేవి. ఇటువంటి సంఘటనలు ఎవరు గమనించకుండానే ఎన్నిసార్లుజరుగుతూ వుంటాయో ! అవును. ఇండియాలో పనిపాటులవల్ల కుటుంబం పోషిం చేది పురుషులు – ఆ పురుషులకు ఏదైనా విపత్తు సంభ విల్లితే విలపించేది స్త్రీలు. అలా విలపిస్తూకూడా ఆ స్త్రీలు పనులుచేస్తూవుంటారు. లేకపోతేవారికి రోజు గడువదు.



# మనోవికాసంలేని బిడ్డలు

## బొంబాయి సాంఘిక సంస్థ కృషి

మన దేశంలో అనేకకుటుంబాలు అధ్వాన్న పరిస్థితు లలో కాలం గడుపుతున్నాయి. ఆ దుర్భర పరిస్థితుల విపరీత పరిణామం అనుభవించేది బిడ్డలు. వారికి మనో వికాసం తక్కువ, అదేవారిని వక్రమార్గాలకు, నేరాలకు ప్రోత్సహిస్తూ వుంటుంది. ఈ బిడ్డల చేష్టలను చూసి నిస్స హాయులైన వారి తలిదండ్రులు కర్తవ్య విమూఢులై సిగ్గుతో క్రుంగి, కుమిలి పోతూవుంటారు.

ప్రజలు సహృదయంతో పరిశీలించ వలసిన సమస్య యిది. శారీరికంగా వికలాంగులైన వారితో యీ మనో వికాసంలేని బిడ్డలను పోల్చవచ్చు. వీరి సంరక్షణ బాధ్యత సంఘమే వహించ వలసివుంది. ఇండియాలో యీ బిడ్డల సంగతిని తొలిసారిగా గ్రహించింది శ్రీమతి జయ్‌వకీల్‌సతి; 1944 లో ఆమె తన యింటనే యిటు వంటి బిడ్డలకు చిన్న కిండర్ గార్డెన్ పాఠశాలను ఏర్పాట్లు చేసింది. తొమ్మిదేళ్ళ ప్రాయంగల యిద్దరు ఆడ పిల్లలను చేరదీసింది, విదేశాలలో నూరేళ్ళుగా యిట్టి బిడ్డల సంరక్షణ, శిక్షణ కృషిసాగిస్తున్న సంస్థలు అమూ ల్యమైన సలహాలనిస్తూ సహకరించాయి. 15 మంది బిడ్డ లకు ఈ పాఠశాల సహాయ పడడంలో కృతకృత్యతను సాధించింది.

దేశంలో యిటువంటి బిడ్డలు ఎందరో వున్నందున, ఈ కార్య క్రమాన్ని విస్తరించే వుద్దేశంతో 1949 లో పిల్లలకు ప్రత్యేక రక్షణ, పోషణ, శిక్షణలనుసమకూర్చే సంఘం (**The Society for the care, Treatment, and Training of children in need of Special care**) రూపొందించ బడింది.

పిల్లల సంఖ్య త్వరలోనే 30 కి పెరింగింది. నిపు ణుల సూచనలపై ప్రతిబిడ్డకు ప్రత్యేక సంరక్షణను సమ కూర్చే పద్ధతి ఆచరణలో పెట్ట బడింది, క్రమేపీ ఈ సంస్థకు బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ సహాయం లభించాయి.

దేశం అంతటా యిటువంటి సంస్థలు అవసరమని గుర్తించ బడినందున 1952 లో ఈ సంఘం ఉపాధ్యా యుల శిక్షణకు తగు ఏర్పాట్లు చేసింది. అన్ని రాష్ట్రాల లోను సుశిక్షితులైన ఈ ఉపాధ్యాయుల ద్వారా మనో వికాసంలేని బిడ్డల రక్షణకు సంస్థలను నెలకొల్పి, వీరు కూడా యితర బాలబాలికల వలెనే స్వతంత్రంగా జీవించ గల పౌరులుగా అభివృద్ధి పొంద దగు అవకాశాలను కలి గించడానికే సంకల్పించ బడ్డది.

మనో వికాసంలేని బిడ్డలకు ఈ విధంగా రక్షణ కలి గించ బడడమే గాక, వృత్తి వ్యాపారాలకు తగిన అవకా శాలు కలిగించడానికి వీలుగా ఇంకా అభివృద్ధి చెయ్యడా నికి కూడ ఈ పాఠశాల నిర్వాహకులు కృషిచేస్తున్నారు. ఇది బొంబాయిలో —రవిలాడ్జి, వార్డెన్ రోడ్‌లో వున్నది.







# సోహన్ సింగు

దివాన్ వీరెందర్‌నాథ్

సోహన్‌సింగు అదృష్టహీనుడని అందరికీ తెలుసు. అతను పుట్టినప్పుడు పురిటిమంచం కింద పాముని చూశారు. దానికి తోడు, ఆలోచించకుండా అతని తండ్రి ఆ పాముని చంపాడు. పిల్లాడు ఆరోగ్యంగా పెరిగి పెద్దవాడు అవుతున్నా, అతని అమ్మమ్మకి మటుకు అనుమానమే : అపశకునం ఫలించక తప్పదని.

ఆరోజు రానేవచ్చింది. తన అనుమానాలు ఉత్తివి కాదనీ, ఎంతో అనుభవంమీద మాట్లాడకల్గుతున్నాననీ, అమ్మమ్మ గట్టిగా చెప్పకల్గింది ఆరోజు. సోహన్‌సింగు తండ్రి ఆలమ్‌సింగూ, అతని తండ్రి, భార్యాతో చుట్టాలని చూసి బన్నునుండి రావల్‌పిండికి తిరిగివస్తున్నాడు. రావల్‌పిండిలో అతను చౌకిదార్. అదిదారుణమైన శీతకాలపు ఉదయం. గాలి భరింపరానంత బాధ పెడుతూంది. ఇంటికి వచ్చి సోహన్‌సింగు నిలువలేకపోయాడు. నిల్చోపెడితే పడిపోతున్నాడు. శరీరం పొత్తి కడుపుకింద మంచులా చల్లబడిపోయింది. పీరుసాహెబు నుండి సివిల్ ఆసుపత్రి డాక్టరుదాకా ఎవరూ ఏమీ చేయలేకపోయారు. చివరకి తల్లితండ్రులు అసలు నిజం తెలుసుకున్నారు: సోహన్‌సింగు యిక ఎప్పుడూ నడువలేడు. తన జీవితాన్నంతా ప్రాకుతూదేకుతూ గడిపివేయాలి.

దేశవిభజనతో రావల్‌పిండినుండి ఢిల్లీకి వచ్చేశారు ఆలమ్‌సింగూ అతని కుటుంబమూ. ఢిల్లీ జిల్లాకోర్టులో చౌకీదార్‌గా చేరాడు ఆలమ్‌సింగు. అప్పటికి సోహన్‌సింగుకి ఐదు సంవత్సరాలు నిండాయి. స్కూలుకి పోలేదు. పదో తరగతిదాకా చదువుకొన్న తల్లి, ఇంటి దగ్గిర అతనికి లెక్కలు, హిందీ నేర్పుతూవుండేది. ఇక అతను నడిచే ఆశలేదని అందరూ నిర్ధారణ చేసుకున్నారు కొన్ని సంవత్సరాలు అలాగే గడిచిపోయాయి.... కాని, ఆనాటికి సోహన్‌సింగు అనుకున్నాడు. తను తప్పక లేచి నిలవాలని!

ఒక రోజు తల్లి దగ్గిర చదువుకుంటూ, 'నేను యితర కుర్రాళ్ళలాగ అవతలికి వెళ్ళి ఏదైనా చేయాలి. కనట్ ప్లేసకి వెళ్ళి తానూ అందరిలాగా ఏమేనా అమ్మాలి' అని చెప్పాడు తల్లితో. తల్లి యితని కోరికకి ఆశ్చర్య పోయింది. కాని సోహన్‌సింగు మటుకు కానాట్ ప్లేస్‌లోని షాపుల వరాండాలో ప్రాకడం మాత్రం వదలలేదు. తల్లితండ్రులు గటిగా ఏమీ అనలేక పోయారు. సోహన్‌సింగే, ఒక ఆటోరిక్షాను పిలిపించుకొని కనట్ ప్లేస్ వెళ్ళాడు. దువ్వెనలూ పిన్నులూ కొన్ని కొని యిచ్చింది తల్లి. అవి సంచిలో వేసుకొని బయలుదేరాడు. సాయంత్రానికి ఖాళీసంచితోనూ, జేబునిండుగా చిల్లర డబ్బులతోనూ సోహన్‌సింగు యింటికి తిరిగివచ్చాడు. ఇంట్లో అందరూ అతన్ని చూసి గర్వపడ్డారు ఆరోజు.

ఇంట్లో కూర్చుని ఒకరోజు చదువుకొంటూ వుంటే, ఆలమ్‌సింగుని చూడడానికి ఒకాయన వచ్చాడు. ఇర్విన్ ఆసుపత్రిలో పిల్లల సెక్షనులోని డాక్టరు రౌఫ్‌నని తనని తనే పరిచయం చేసుకున్నాడు. కనట్‌ప్లేస్‌లో యీ కుర్రవాడు ప్రాకుతూ తిరగడం తాను చూశాననీ, తనశక్తి వంచన లేకుండా, ఆ కుర్రవాడు తన కాళ్ళమీద నిలిచేలా చేస్తాననీ డాక్టరు రౌఫ్ చెప్పాడు. దానికి సోహన్‌సింగు కుటుంబం ఆనందంతో ఒప్పుకుంది.

# సోహన్ సింగు

సోహన్‌సింగుని ఆస్పత్రికి తీసుకువెళ్ళి అతని కుడి కాలు ఆపరేట్ చేశారు: తరువాత నాలుగు నెలలకి ప్లాస్టరులోనుండి బైటికి వచ్చిన సోహన్‌సింగు కాలు తిన్నగా నిలువకల్గింది. ప్రాకడానికి బదులు యిప్పుడతను కఱ్ఱల సహాయంతో నడువకలడు. డాక్టరు రాఫ్, సోహన్ సింగుకి కట్టయీ ఒకరకమైన బూటూకూడా యిచ్చాడు. కొంతకాలంపోతే ఎడమకాలుకూడా సరిఅవుతుందని చెప్పాడు.

ఆరోజు మొదలు. మళ్ళీ, తన దువ్వెనలూ పెన్నులూ మొదలైనవి తీసుకొని కనట్ ప్లేస్‌లో తన పాతవర్తకం ప్రారంభించాడు సోహన్‌సింగు. సాయంత్రానికి ఆ వర్తకం పూర్తిచేసి 'ఈవెనింగ్ న్యూస్' కూడా అమ్మి, రెండురూపాయలేనా పట్టుకుని యింటికివస్తాడు. అతని దగ్గిర యేమైనాకొని, అసలు చెప్పిన ఖరీదుకంటె కొంచం ఎక్కువ యిచ్చిచూడండి. మనకే ఆశ్చర్యం వేసేలా 'అఖ్ఖర్లే'దంటాడు! ఎందుకు? అతని దృష్టిలో అదీ ముష్టిలాంటిదే. అంతేకాదు. రాజపుత్రుని కొడుకు అనుకరించకూడనిది అదే అని అతని తల్లి చెప్పగా విన్నాడు.

సోహన్ సింగుకి మానసికమైన సమస్యలే లేవు. అందరి పిల్లలను చూసినట్లే యితన్ని చూసింది తల్లి. తన తమ్ముళ్ళమాట అలావుంచి, ఆ చుట్టుపక్కల పిల్లలందరిమీదా అజమాయిషీ చేస్తాడు సోహన్ సింగు. తమ్ముళ్ళంటే ఎంతో గారాబం. తనకి పన్నెండేళ్ళు నిండక పోయినా, "తనతమ్ముళ్ళు చదువుకోవాలి" అన్నట్లు తాపత్రయ పడతాడు. కొన్ని రోజుల క్రితం తన బూటొకటి పారేసుకున్నాడు. అది కొనాలంటే పదిరూపాయలు కావాలి. ఒక నెలరోజులపాటు కష్టపడి పోగు చేశాడు. కాని సరిగ్గా ఆదేసమయానికి తమ్ముడికి స్కూల్లో ప్రమోషను వచ్చింది. కొత్త పుస్తకాలు కొనాలి. జీతం కట్టాలి. ఇంట్లో డబ్బులేదు. ఎలాగూ యింట్లో అందరూ పస్తంటున్నాకూడా, తను బూటుకోసం కూడబెట్టిన పదిరూపాయలతో తమ్ముణ్ణి పెద్దక్లాసులో చేర్పించాడు సోహన సింగు.

ఇంత అయినా అతనిలోని "కుర్రతనం" మాత్రం పోలేదు. అతను కనే కలలలో అది కనిపిస్తూనే వుంటుంది తక్షణ కార్యక్రమ ప్రకారం, అతను ఒక సబ్బుపెట్టె తెచ్చి అందులో అన్ని సరుకులూ పెట్టి సందడి ఎక్కువగా వున్నచోట కనట్ ప్లేస్‌లో అది పెట్టుకొని కూర్చోవాలని! ఇదే కొన్నాళ్ళకి చక్కని దుకాణంగా మారుతుందని అతని నమ్మకం. ఏమి దుకాణం? ఢిల్లీలో ఎక్కడాదొరకనంతటి మంచి బొమ్మల దుకాణం!

---

## అస్వాధారణం నాస్తి....

ఉన్న నలుగురు బిడ్డల్లోను ఆమెయే పెద్దది. పదేళ్ళ ప్రాయం. ఒక తమ్ముడికి ఏడేళ్ళు. మరో తమ్మునికి అయిదేళ్ళు. కడసారపుది కొన్నినెల్ల పసిపాప. ఆపాప పుట్టినప్పుడే తల్లి చనిపోయింది.

ఉద్యోగంలేక తండ్రి బాధపడుతున్నాడు ఒక బంధువు ఓ అబ్బాయిని తీసుకుపోయి పెంచుకున్నాడు. పసిపాపనిచ్చి తండ్రి మిగిలిన బిడ్డలను వాళ్ళ అమ్మమ్మ దగ్గరకు పంపాడు.

ఆ బిడ్డను సాకడం తమవల్ల కాదని తండ్రికి అప్పగించి రమ్మనీ అమ్మమ్మ ఆదేశించింది. పదేళ్ళ పిల్ల పాపనెత్తుకుని అంతదూరం తమ్ముడితో కలిసి నడిచిరావడంచూసి తండ్రి కోపోద్రిక్తుడై తిరిగి అమ్మమ్మ దగ్గరకే పొమ్మని గద్దించాడు.

ఏం చెయ్యడానికీ తోచక ఆ పదేళ్ళపిల్ల పాపను చెరువులో పడవేసింది. పోలీసులు ఆపాప దేహంచూసి, దర్యాప్తుచేసి అక్కను తమ్ముణ్ణి ఢిల్లీలోని రిమాండ్‌హోంకు పంపారు. సంగతి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఆ అమ్మాయి వలవల ఏడుస్తుంది. చేతులారా చంపవలసివచ్చినందుకు.

— సోషల్ వెల్ఫేరునుండి.



# డబ్బు విలువ

శ్రీ చింతలపాటి హరగోపాల్ కృష్ణశర్మ

మా తమ్ముడు ఈమధ్య చెడిపోతున్నాడని గ్రహించా. కారణం ఇంట్లో చెప్పిన పనులు చేయకపోవడం, పైపెచ్చు మా అమ్మా వాళ్ళనే ఎదిరించడం మొదలైనవాటి వలన ధృఢపర్చుకోగలిగాను. నిజంగా నామటుకు నాకే విచారమేసింది. వాడు చెడిపోవడానికి బాధ్యులు ఎవరా ? సంఘమా- వాతావరణమా- స్నేహితులా లేక ఇంట్లో వాళ్ళా ? అసలు వాడెట్లు చెడిపోయాడు నాదగ్గరుంటూ ? అనేది బాధిస్తోంది. వాడి నేవిధంగా బాగుచేసి, సరి అయిన మార్గంలో పెట్టగలను ? అనేది ప్రశ్న.

అసలు మా నాన్నగారు రిటైర్డ్ తాలూకా ఆఫీసు గుమాస్తా. మేంఇద్దరమే కొడుకులవడం వలన, కూతుళ్లు లేకపోవడం వలన నన్ను ఎమ్. ఏ. దాక చదివించారు. పెండ్లి చేసారు. ఆతరువాత రెండేళ్ళకల్లా చనిపోయారు, చనిపోతూ అమ్మని, తమ్ముడ్ని ఆదరించమని మరీ మరి చెప్పి పోయారు. నామటుకు నాకు అమ్మంటే గౌరవం వుంది. ఆవిడ ఏవిషయాలు పట్టించుకోదు. చనువుగా మెలుగుతుంది. మా తమ్ముడంటే కూడా అమితమైన ప్రేమ ఉంది. వాడు అప్పటికి 4 వ ఫారం చదువుతున్నాడు. వాణ్నికూడా నాలాగ ఎమ్. ఏ. చదివించాలని ఉండేది. మా ఆవిడకూడా చాల మంచిది. మా తమ్ముడంటే ప్రేమ. మా అమ్మంటే గౌరవంవుంది. అందుచేత ఇంట్లో "అత్తా-కోడళ్ళ" తగవులుండేవికావు. ఈ ఒక్క విషయానికి నామటుకు నేనే ఉప్పొంగిపూయేవాడిని. కాని ఒక్క తమ్ముడి విషయంలో కథ కాస్త అడ్డం తిరిగింది. వాడంటే ఇంట్లో అందరికీ ప్రేమ అవడంవల్ల వాడు ఇటు వదినగారిదగ్గర, అటు అమ్మ దగ్గర డబ్బులు తీసుకునేవాడు. అది స్నేహితులతో కలిసి "సినిమాలకు, హోటళ్ళకి" ఖర్చుపెట్టున్నాడని విన్నా. కుర్రవాళ్ళకి సరదాలు ఉంటాయి. కాదననుగాని అవి మరీ మితిమీర కూడదు. ఎప్పుడైతే ఈవిషయం గ్రహించానో, అంటే వాడు దురలవాట్లకు లోనౌతున్నాడని వెంటనే మొదట మా ఆవిడకు చెప్పేశా "కుర్రవాళ్ళకి బాధ్యత అనేది తెలియనప్పుడు- డబ్బంటే ఏమిటో తెలియనప్పుడు, వాళ్ళ చేతికి డబ్బు అందించరాదు. ఆవిధంగా డబ్బులిస్తున్నామంటే వాడు చెడిపోవడానికి, భవిష్యత్తు చెడకొట్టడానికి మనమే కారకులవుతాము" అంటే "కుర్రతనంలో కాకపోతే పెద్దయినతర్వాత ఖర్చుపెడ్తారాఏమిటి, పెద్దయిన తరువాత అన్నిటితోబాటు డబ్బు విలువలు- అన్నీ తెలుస్తాయిలెండి" అనేసింది పుటుక్కున. పోనీ అమ్మకు చెప్పుదామా అంటే ఆవిడకు వాడంటే మహాప్రేమ, వాడి మీద ఈగవాలిన మొదట ఆవిడే సహించలేదు ఎల్లాగో అలాగ నచ్చచెపుదామనుకుని బయలుదేరా అమ్మదగ్గరకు. మా ఆవిడదగ్గరలాగనే పాఠం వల్లించా. దాంతో ఆవిడ ఇంత ఎత్తున లేచింది. నాకు తమ్ముడంటే ఇష్టంలే

దన్నట్టుగామాట్లాడింది. అంతేగాని ఆవిషయంలోని మంచి చెడుల గురించి ఆలోచించలేదు.

నాకు మటుకు ఓ ధైర్యం ఉంది, వాడు అంతగా ఉద్యోగం చేసుకోలేకపోయిన తిండి. బట్ట ఇవ్వగల తాహతు ఉంది. ఈరోజువరకూ వాడిని ప్రేమతోనే చూస్తున్నాను. కాని రేపటి సంగతేమో. వాడంటే ఛీదరించుకోవచ్చు. నాకేగనక నల్గురు పుట్టితే నా భార్య అసహ్యించుకోవచ్చు. రేపటి సంగతి ఏమవుతుందో ఎవరు ఆలోచించగలరు ? అందుకనే అప్పుడప్పుడు నా మిత్రులు "అరే నీకు ముందుచూపు- ఆలోచన ఎక్కువరా" అంటారు. అసలు నాకు మొట్టమొదటే గనక తెలిస్తే మందలించేవాడిని. కాని ఇప్పుడు మందలించకుండా సరి అయిన దోవలో పెట్టాలని నా ఆలోచన. వాడికి అసలే అభిమానం జాస్తి. మందలిస్తే ఎంతటి పనికైనా (అంటే ఆత్మహత్య) వెనుదీయడు. పోనీ వాడే సరైన మార్గానికి వస్తాడులే పెద్ద అయిన తరువాత అని అనుకుందామా అంటే మనసొప్పడంలేదు. దానికితోడు నాన్నగారు చనిపోతూ చెప్పినమాటలు నగరా దెబ్బలాగ వినిపించాయి. "అరే పెద్దవాడు- మోహన్‌ని జాగ్రత్త. వాడి భారమంతా నీకే వప్పజెప్పి పోతున్నా. నేను నిన్ను ఎట్లా పెంచి పెద్దవాడిని జేసానో అట్లాగా వాడ్ని కూడ చూడవల్సింది" అని పదే పదే చెప్పారు. అందుచేత ఏమైనాసరే వాడిని బాగు చెయ్యాలని నిశ్చయించుకున్నా. ఏవిధంగా అనేది ప్రశ్న ? ఆఫీసులో కాగితాలు చూస్తున్నంతసేపు ఇదే ఆలోచన. పోనీ ఎవరినైనా సలహా అడుగుదామంటే ఇష్టంలేకపోయింది. ఇంట్లో సంగతులన్నీ పరాయివాళ్ళకి చెప్పుకోవడమేమిటనిపించింది. ఇలా ఆలోచిస్తుంటే నా మైండ్‌కి ఒక ఆలోచన తట్టింది. ఆ ఆలోచనకు నాలో నేనే ఉప్పొంగిపోయా.

ఇంక మరేం ఆలోచించకుండా ఇంటికి వచ్చేసా. ఎన్నడూ నాతో షికారుకి రమ్మని పిలవలేదు వాడ్ని. కాని ఈరోజున షికారుకి రమ్మని పిలిచేసరికి వాడికి ఆశ్చర్యం, భయం వేసాయి. మారు మాట్లాడకుండా వచ్చేసాడు నాతోటి. మెరినా బీచ్‌కి తీసుకెళ్ళాను. ఒక మూల కూర్చుని మొదట డబ్బంటే ఏమిటో- అదిలేకపోతే కలిగే నష్టాలేమిటో అన్నీ వివరంగా చెప్పా. అవ్వే వాడి చెవికి ఎక్కనేలేదు. ఇంక ఇట్లా లాభంలేదనుకుని "ఒక్క రోజున ఒక రూపాయి సంపాదించుకురా చూద్దాం" అన్నా. ఏమిటి ఏవిధంగానైనా డబ్బు విలువ తెలిసొచ్చేటట్లు చేద్దామనే ఉద్దేశ్యంతో. "ఓ, ఒక్క రూపాయేగదా సంపాదించుకుని రాగలను" అన్నాడు. నాకు నవ్వొచ్చింది. వీడికి రూపాయంటే పైసలాగా ఉందేం చెప్మా ? అని.

మరుసటిరోజు సాయంకాలం చదువుతూవుంటే రూపాయి నోటొకటి తీసుకొచ్చి ఇచ్చాడు. వీడు ఏవిధంగా తీసుకొచ్చాడో తెలుసుకోవాలిగదా ! మొదటిసంగతనుకుని వాడిముందరే ముష్టివాడికి ఆరూపాయి నోటిచ్చేస్తూ మా వాడితో అన్నా "ఏ వదినగారినో, లేకపోతే అమ్మగారినో అడిగి తీసుకొచ్చి ఉంటావు" అని, నేనేదో ఊరికే అనేశా. వాడాశ్చర్యపోయాడు. వెంటనే ఇంట్లోకి వెళ్ళిపోయాడు. నిజానికి వాడు అమ్మని అడిగి తీసుకున్నాడట ఆ రూపాయి. నేనేదో నవ్వులాటకన్నా విషయం నిజమే అయింది. అసలు నా ఉద్దేశ్యం వాడు నిజంగా కష్టపడి సంపాదిస్తే ఆ రూపాయి ముష్టివాడికి వేస్తుంటే అడ్డపడతాడనుకున్నా ? అంతేగవండీ. కష్టపడి సంపాదించిన రూపాయి ముష్టివాడికి పారేయడానికి మనస్సొప్పుతుందా ! ఈ ఆలోచనతో అన్న విషయము నిజమే అయింది. వాడనుకున్నాడు-- ఇంట్లో వాళ్ళు నాకు చెప్పారనుకున్నాడు అందుచేత రెండోరోజు వాళ్ళ స్నేహితుడిని అడిగి తీసుకొచ్చి ఇచ్చాడు. అదీ మొదటిసారిలాగనే ముష్టివాడికి వేశేసాను. దాంతో వాడు నేనెట్లు కనుక్కోగల్గుతున్నాను అని ఆశ్చర్యపోయాడు. తరువాత 3వరోజు అభిమానం, పౌరుషం ముంచెత్తుకొచ్చింది. ఏమైనాసరే సంపాదించుకొద్దామని బయలుదేరాడు.

మూడో రోజున రాత్రి 8 గం॥లకు రూపాయి చిల్లరతో పట్టుకొచ్చాడు. బయట ముష్టివాళ్ళెవరూ లేకపోయారు. దాంతో ముష్టివాళ్ళకి వేసేబదులు— బయట పారేయబోతుంటే అడ్డపడ్డాడు. "ఏం" అన్నా. "అన్న

ఎంతో కష్టపడి సంపాదించాను ఈరోజున. నిన్న స్నేహితుడ్ని, మొన్న అమ్మని అడిగి తీసుకొచ్చా. కాని నీవెట్లాగో కనుక్కున్నావు. అందుచేత ఈరోజున సంపాదించుకొద్దామని బయలుదేరా. ఎవడూ నా మొగమే జూడలేదు దాంతో బస్సు స్టేండుం దగ్గర పెట్టెలవి మోసి. రైలు స్టేషన్ల వద్ద పెట్టెలవి మోసి సంపాదించ. నీవు డబ్బు విలువ గురించి చెపితే నాకు ఏం అర్థంకాలేదుగాని, ఇవాళ తెల్సింది డబ్బంటే ఏమిటో పూర్వం రూపాయలంటే చిళ్ళ పెంకులులాగా ఉండేవి. కానీ ఇవాళ బుద్ధి వచ్చిందిరా అన్నయ్యా" అన్నాడు. నాకు నిజంగా ఒక పక్క సంతోషం, వేరొక పక్క విచారం వేసింది. వాడికి డబ్బంటే ఏమిటో తెల్సిందిగదాని ఒక పక్క సంతోషం, రూపాయి కోసం వాడు పడ్డ అవస్థని చూస్తే విచారం వేసాయి.

అంతే ఆరోజు మొదలుకుని బుద్ధిగా ఉన్నాడు. నాలా ఎమ్. ఏ. ప్యాసు అయ్యాడు, ఇప్పుడు విజయవాడలో కలెక్టరుగా పనిచేస్తున్నాడు. ఇప్పటికి వాడు నన్నెంతో మెచ్చుకుంటాడు వాడ్ని బాగుచేసానని. అంతే. బాలలు చిన్నప్పుడు నాన్న సంపాదిస్తుంటే డబ్బంటే ఏమిటో తెలియక అన్యాయంగా చెడిపోతారు. పెద్దయి వాళ్ళ హయాం వచ్చేసరికి పశ్చాత్తాపబడతారు. లేకపోతే కొంత మంది తలిదండ్రులను తిట్టారు.



# మానవుని చావు

శ్రీ భీమవరపు సత్యనారాయణమూర్తి

పూర్వం మానవులకు చావు లేకపోయింది. విపరీతంగా జీవులు పుట్టటం సంభవించింది. ఒకనాడు భూదేవి గబగబా బ్రహ్మ దగ్గరకు పరుగెత్తుకొచ్చి తన భారం బాపవలసిందిగా అర్థించింది. కారణానికి సమాధానమిస్తూ, "భూలోకంలో మనుష్యులను జంతువులను తదితర ప్రాణులను చక్కగా పుట్టిస్తున్నందులకు చాల సంతోషంగానే వుంది. కాని వీరి పుట్టుకలకు యెక్కడా అంతులేదా? అనేక కుటుంబాలు వెలుస్తున్నవి. అనేకమంది తమ తాతలను, ముత్తాతలను మూల పురుషులను చూడటమే గాకుండా మనుమలను,ముని మనుమలను మునిమనుమడి మునిమనుమలను చూస్తున్నారు. ఇంతమందికీ జీవనోపాధి జరగటం చాల చికాకుగా వుంది. ముసలితనం మోయలేక మూలుగుతున్న వృద్ధులు, తమ మనుమడులు సరసంగా గడ్డాలు, గోచీలు వూడపీకుతూ ఏడిపిస్తున్నందులకు చాల దురవస్థలుగా వున్నారు. 'పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణసంకటం!' గా పరిణమిస్తున్నది. ఏ పని చేయలేక పనులు లేకపోవటం వల్ల పాపకార్యాలుకు పాలుపడుతున్న ప్రజల భారంతో క్రుంగిపోతున్నాను. నన్ను రక్షించ వలసిందిగా వేడుతున్నాను" అని ఆమె వలవల ఏడ్చింది. బ్రహ్మ ఆమె కన్నీళ్ళు తన దోసిలినిండా పట్టాడు. ఆమెపై జాలికలిగింది. శక్తి స్వరూపమగు ఆడది ఏడిస్తే, లోకం దద్దరిల్ల వలసిందే గనుక ఆయన ఆమె భారం తగ్గించటానికి ఆమె కంటి చుక్కల ధారలని తన దోసిలితో పట్టి "ఈ కంటి నీరు చుక్కలు ఎన్ని అయితే నా దోసిలిలో పడ్డయ్యో, యివన్నీ అన్ని రకాల జబ్బులగుగాక!" అని ఆయన ఆ నీటిని భూమిమీద చల్లాడు. ఒక చుక్క మలబద్ధకము రెండవది తలనొప్పి మూడవది మశూచి నాలుగోది జ్వరం యిల్లా రకరకాల జబ్బులుగా మారిపోయాయి. ఇవి వచ్చి యీ మానవుల్ని పీడించటం మృత్యు దేవత వీటి సాయాన మానవులని చంపటం జరుగుతూ వచ్చింది. అప్పటినుంచి భూభారం తగ్గి కొంత శాంతించింది. ఆనాటి నుంచే మానవులకు చావు అంటూ కలిగింది.



# "భగవంతుని లీల"

శ్రీ పిశ్వా సుబ్బారావుశాస్త్రి

అశోక మహారణ్యం. ఆ అరణ్యంలో ఏకాంత జీవితం గడుపుతూ భగవన్నామస్మరణ జేసుకుంటున్నాడు ఒక మహర్షి. ఆతని పేరు భగవాన్.

భగవాన్ గొప్ప దైవభక్తి గలవాడు. ఆయనకిప్పుడు అరవయ్యేళ్ళు. ఇప్పుడు కలిగిందతనికి ఒక సందేహం అది 'భగవంతుడు అందర్నీ సమంగా చూస్తున్నాడా?' అని. ఆయన యీ సందేహం తీర్చుకోవాలనుకున్నాడు

సరే! భగవాన్ దేశాటనానికి బయలుదేరాడు. ఆయన అలా బయలుదేరాడు— ఎక్కడికో. ఏమిటో....! ఆయనలా నీళ్ళు, పళ్ళు సేవిస్తూ పోతున్నాడు.

సూర్యోదయం అయింది. పక్షులుకిలకిల మంటున్నాయి. రైతులు పొలాలకి బయలుదేరారు. స్త్రీలు బిందెల్ని చంకనేసుకొని నీలాటి రేవుకు బయలుదేరారు. బ్రాహ్మణులు సూర్యనమస్కారాలు చేయసాగారు.

భగవాన్ స్నానం చేసి, ఏవో కందమూలాలు తిని నడక సాగించాడు. అతనికి ఎదురుగా వచ్చాడు ఒక యువకుడు. తెల్లని ఛాయ, దృఢమయిన శరీరం. తీర్చి దిద్దిన కళ్ళు, నల్లటి ఉంగరాల జుట్టూ ఎంతో అందంగాను, అమాయకంగాను కనపడుతున్నాడు.

"స్వామీ! నమస్కారములు!" ఆయువకుడు ఎంతో వినయంగా నమస్కరించాడు.

"శ్రీఘ్రమే—" అన్న భగవాన్ మాటల త్రుంచేసి "దేవా! నేను లోకాన్ని చూడటానికి బయలుదేరాను!" అన్నాడు యువకుడు.

"సరే! నేనుకూడా లోకసంచారానికే బయలుదేరాను. నాతో రా నాయనా!" అన్నాడు భగవాన్.

భగవాన్, యువకుడు యిద్దరూ బయలుదేరారు "నాయనా! నీ పేరు ...?" అన్నాడు భగవాన్.

"చంద్రుడు- స్వామీ....!" అన్నాడు యువకుడు. ఇద్దరూ మౌనంగా నడక సాగించారు.

సూర్యుడు అస్తమించాడు. పక్షులు గూళ్ళు చేరుకోసాగినై. రైతులు యిళ్ళకి బయలుదేరారు— చంద్రుడు వెన్నెలని విరజిమ్ముకుంటూ మబ్బులని తోసుకుంటూ బయటికి రాసాగేడు.

"స్వామీ! అదో....! ఆదీపకాంతులు చూశారా? అది ఎవరో ధనవంతుడి గృహంలావుంది...! పోదాం రండి....!" అన్నాడు ఒక మేడని చూపిస్తూ చంద్రుడు.

"నాయనా! చంద్రా! నేను కూడా అలసిపోయాను: పద- పోదాం!"— భగవాన్, చంద్రులు ఆయింటికి బయలుదేరారు.

బాట కిరువైపులా పూల మొక్కలూ, సిమెంటుచేసిన బాట! భగవాన్, యువకుడు ఆయిల్లుచేరారు- వాళ్ళు వీధిలో వుండగానే ఒక ముసలాతను వాళ్ళిద్దరికీ నమస్కరించి "ఈరోజు మీరిద్దరూ అతిధులు!" అన్నాడు.

భగవాన్, చంద్రులకి చక్కని గది యిచ్చారు. ఆ గదిలో రెండు హంస తూలికా పాన్పులు వున్నాయి. చుట్టూ కిటికీలు. అద్దాలు వున్నాయి. ఒక చక్కటి కర్ర బల్లమీద అనేక రకాల పళ్ళు, పానీయాలు వున్నాయి.

ఇద్దరు నౌకర్లు వచ్చి వాళ్ళిద్దర్నీ స్నానాల గదిలోకి తీసుకువెళ్ళి, స్నానం చేయించారు.

తర్వాత యిద్దరికీ, బంగారు పళ్ళాలలో చక్కని విందు వంటల్తో భోజనం పెట్టారు— ఇద్దరూ తృప్తిగా భోజనం చేసి, తాంబూలాలు వేసుకున్నారు.

వాళ్ళు నిద్రపోయేముందు నౌకర్లు రెండు బంగారు కప్పులలో ద్రాక్షారసాన్ని తెచ్చి యిచ్చారు— అది త్రాగి నిద్దరోయారిద్దరూ.

తెల్లవారక మునుపే స్నానం చేసి, చక్కని కమ్మని ఫలహారాలు తీసుకొని యిద్దరూ బయలుదేరారు.

భగవాన్ త్రోవలో ఆయింటి యజమానిని గురించి ఎంతో పొగుడుతూ మాట్లాడేడు.

"స్వామీ! చూశారా....?"— అన్నాడు చంద్రుడు. ఆ గృహస్థుడు పానీయంతో యిచ్చిన బంగారు కప్పు చూపిస్తూ— భగవాన్‌కి, చంద్రుడు యిలా దొంగిలించి తెచ్చాడని చాలా కోపం వచ్చింది. కాని ఏమీ అనలేదు.

# "భగవంతుని లీల"

ఆకాశమంతా మబ్బులు క్రమ్మింది, గాలిబాగా వీచింది. ఉరుములూ- మెఱుపులు రాసాగేయి. భగవాన్ యువకుడు గబగబా నడవ సాగారు— కాని కొంచంసేపు వర్షం జోరు హెచ్చింది. ఆచీకట్లో కన్ను పొడుచుకున్నా కళ్ళు కనిపించవు! అందులోకి అమావాస్య రాత్రి!! వాళ్ళకి అల్లంత దూరాన్న ఒక చిన్న దీపం వెలుతురు కనిపించింది. అక్కడికి బయలుదేరారు.

ఆయిల్లు ఒక లక్షాధికారిది. ఎంత లక్షాధికారి అయినా పిల్లికి బిచ్చం పెట్టని రకం!— అందుకే చిన్న గుడ్డిదీపం పెట్టుకు కూర్చున్నాడు.

ఇద్దరూ వెళ్ళి తలుపు కొట్టారు— ఎంతకీ తియ్యలేదు. వాళ్ళు మరింత గట్టిగా బాదారు!- తలుపులు విరుగుతాయేమో అని తలుపు తీశాడు పిసినారి.

ఇద్దరూ వణుకుతూ ఒకమూల కూర్చున్నారు. "ఆకలిగావుంది ....! ఏమన్నా పెట్టహూ!" అన్నాడు చంద్రుడు.

ఆలక్షాధికారి విసుక్కుంటూ— ఒక ఎండిపోయి, పాడయిపోయిన రొట్టె, ఇన్ని నీళ్ళూ తెచ్చి యిచ్చాడు. చంద్రుడు అవే తిని కడుపు నింపుకున్నాడు.

వర్షం కొంచెం వెలిసింది. "ఇకదయ చేస్తారా?" అని తలుపు తీసెనుంమన్నాడు లక్షాధికారి.

భగవాన్‌కి యీసారి చంద్రుడిమీద కోపం వచ్చింది. ఎందుకంటారేమో - చంద్రుడు అక్కణ్నుంచి తెచ్చిన బంగారుకప్పు పిసినిగొట్టుకి బహుమానంగా యిచ్చాడు! —భగవాన్ అయినా ఏమీ అనలేక పొయ్యాడు.

తర్వాత యిద్దరూ నడక సాగించి ఒకరాత్రికి ఒక ధనవంతుడి గృహం చేరుకున్నారు. అక్కడ అతను వాళ్ళని చాలామర్యాదగా చూశాడు.- వెళ్తూవున్నప్పుడు చంద్రుడు చేసిన పని భగవాన్‌కి మరింత కోపం తెప్పించాయి!

ఆ ధనవంతుడికి ఒక్కడే కొడుకు, అతణ్ణి ఎంతో గారాబంగా పెంచుకుంటున్నాడాయన. ఆ కుర్రాడు నిద్రపోతూండగా వెళ్ళి ... చంద్రుడు అతన్ని కత్తితో చంపి బయటకు వచ్చేశాడు.

తర్వాత ఆధనవంతుడు వాళ్ళకి దారి చూపించమని ఒక నౌకర్‌ని పంపేడు. భగవాన్, నౌకర్ ముందు నడుస్తూన్నారు. చంద్రుడు వెనుక వస్తూ, నౌకర్ వంతెన మీదికి రాగానే గభాల్ను వాణ్ని ఆ కాల్వలో తోసివేశాడు!

ఇక భగవాన్ దీనిని భరించలేక ఉగ్రుడయిపోయి, చంద్రుడి మీదకి చెయ్యి ఎత్తాడు! అంతలోనే అదంతా కాంతితో నిండిపోయింది!

"భగవాన్!" అనే పిలుపుతో భగవాన్ పైకి చూశాడు - ఆయువకుడు ఒక చక్కని దేవకన్యగా మారిపోయాడు. పలచటి దుస్తులతో, గాలికి ఎగురుతున్న జుట్టుతో ఆమె యిలా చెప్పింది.

"భగవాన్"! నేను భగవంతుని సేవకురాలుని..! భగవంతుడు అందర్నీ సమంగా చూస్తున్నాడు..!! — ఆ ధనవంతుడు డబ్బువుందికదా అని పాత్రఎరగకుండా అందరికీ దానం చేస్తున్నాడు. అది గుర్తించేందుకు అలా చేశాను..— పిసినిగొట్టు ఈ ఎండురొట్టికే యింతవస్తే ఇంకా మంచిదానం చేస్తే ఎంత వస్తుందో అనిదానం చేస్తాడు! అందుకే అలాచేశాను! మూడోవాడు కొడుకు పుట్టగానే, అంతకుముందుచేసే భగవన్నామస్మరణమాని, సంసారంలో పడ్డాడు! అందుకే అలాచేశాను..! నౌకరు యజమానిని చంపాలని పన్నాగం పన్నేడు! అందుకే వాణ్ని చంపేను .... !కాబట్టి భగవంతుడు ఎదురుగా వచ్చి కనిపించడు..! భగవంతుడు అందరికీ న్యాయం చేస్తూవుంటాడు! భగవంతుడు మనలోనేవుండి మనచేతనే ఆయన చేయిస్తాడు..!"

భగవాన్ ఆమెకి నమస్కరించాడు. ఆమె భగవాన్‌ని దీవించి మాయమయింది.

భగవాన్ తపస్సు చేసుకుంటూ, చివరికి భగవంతుణ్ని చేరాడు.






# జీవారంభం

శ్రీ కె. లా. బా. జయంతీదేవి, B.Sc., (Hons.)

జీవము (Life) అనగానేమి? ఎప్పుడు భూమి మీద ప్రారంభము అయినది అని చెప్పుట మనకు అలవికాదు మనుష్యులు, జంతువులు, వృక్షములు జీవము కలవి. అవి అన్నియు పుట్టుచున్నవి పెరుగుచున్నవి. గాలి పీల్చుచున్నవి. జాత్యభివృద్ధి చేసికొని తుదకు గిట్టుచున్నవి. వీనిలో జంతువులు చలనము గలవి కాని వృక్షములు చలనము లేనివి. కొందరు వైజ్ఞానికులు రాళ్ళను రప్పలను కూడ ప్రాణము కలవిగా నెంచుచున్నారు.

నేడు మనము ఏక రకములగు మనుష్యులను చూచుచున్నాము. అనేక రకములగు జంతువులను చూచుచున్నాము. ఏనుగులు, సింహములు, ఆవులు, గుఱ్ఱములు, కోతులు మున్నగు చతుష్పాతులు (Quadruped) పాము మున్నగు సర్పములు (Reptiles) పలురకములగు చేపలు(Pices) పక్షులు (Aves) కీటకములు (Insects) ఇవేకాక ఏక కణ జీవులు.

ఇదేవిధముగ వృక్షములలో కూడ పెద్ద పెద్ద యూకలిప్టసు. (Eucalyptus) సికోయా (Sequoia) వృక్షములు ఫెరనులు (Ferns) నాచులు (Mosses) బూజులు, కుక్కగొడుగులు (Fungi) ఆల్గే (Algae) మొదలగునవి. వృక్ష జాతిలోకూడ ఏక కణ జీవులు కలవు. (Unicellular organisms)

ఈ పై చెప్పబడిన వివిధ రకములగు జంతు వృక్షాదులన్నియు భూమి పుట్టుకతోనే యుద్భవించినవా లేక కాలక్రమేణా వచ్చినవా అను ప్రశ్న మనలను విసిగించుచున్నది.

ఈ ప్రశ్నకు మనకు భూగర్భములోని 'ఫాసిలు' (Fossil) కొంతవరకు సమాధానము చెప్పుచున్నవి. 'ఫాసిలు' అనగా "భూమినుండి త్రవ్వి ఎత్తబడిన శిలారూపమై పోయిన జంతులేక ఉద్భిజ్జ సంబంధమైన వస్తువు" ఈ "ఫాసిలు" ఎట్లేర్పడినవి. ఆయా జంతువుల కాళ్ళ అడుగులు కాలవశమున ఇసుక కరిగిపోయి గట్టిపడి యుండవచ్చును. లేదా రష్యాలోని మామత్ (Mammoth) వంటి జంతువులు మంచులో కూరుకొని పోయి మరుగు పరచ బడినవి.

కొన్ని రకములగు ఫాసిలులు శిలాద్రవము (Lava) లో భద్రపరుప బడినవి. పాంపేలో అగ్ని పర్వతము బ్రద్దలయినప్పుడు వచ్చిన శిలాద్రవములో ఆ పట్టణమంతయు అట్లే యుంచబడినది. వంటచేయు స్త్రీలు, ఆడుకొను బాలురు, పంకావీచు నౌకరు మున్నగువారు ఎట్లుండిరో అట్లే ఫాసిలుగా మారిపోయిరి.

ఈ ఫాసిలులను సమగ్రముగా పరీక్షించగా తేలినది ఆదిలో నేడున్నట్టి జంతు వృక్షములు లేవనియు. అప్పటి శీతోష్ణస్థితియే వేరనియు మొట్ట మొదట అమీబా (Amoeba) యుగ్లీనా (Euglena) మొదలగు ఏక కణ జీవు లేర్పడినవి. వీనినే ప్రోటిస్టా (Protista) అని పిలతురు. ఇవి జంతువులకు వృక్షములకు మధ్యగానున్నవి.

వీనినుండి జంతుజాతి, వృక్షజాతి రెండూ బయలుదేరిన వట. కాలక్రమేణా వీనినుండి కొత్త జాతులు పుట్టినవట. ఈ మొదటి జీవులు వుప్పునీటిలో నివసించు చుండెనట. కాలక్రమేణా సముద్రపు నీటి యొక్క వుప్పుతగ్గి మంచి నీటి పరిసరములు ఏర్పడెనట. తుదకు ఈ నీరు కూడా ఇగిరి జీవులు భూమిమీద నివసించుట కలవాటు పడినవి. దీనితోపాటు భూమి యొక్క వేడిమి కూడ తగ్గుచు వచ్చినది.

ఈ మార్పులు జరుగుటకు చాలకాల వ్యవధి పట్టెను. ఈకాల పట్టీని మూడు ముఖ్యభాగములుగా చేయవచ్చును.

1. పేలియోజోయిక్. Palaeozoic
2. మీసోజోయిక్. Mesozoic
3. కైనోజోయిక్. Ceinozoic

మొదటిది పేలియోజోయిక్ యుగము : ఈ యుగ మతి ప్రాచీనము. ఈ యుగములో భూమిచాల వేడిగా నుండెను. అంతయు క్షారజలమయము. జంతుజాతిలో ట్రైలోబేటా (Trilobata) వృక్షజాతిలో సైలోఫైటేల్సు (Psilophytales) ముఖ్యమైనవి. ఈ యుగాంతములో భూమి చల్లబడినది. ఆయాజంతు, వృక్షములు, వుప్పు నీటిలో నుండి మంచినీటికిని, తరువాత బురదనేలలో కడపట భూమిమీద నివసించుటకు అలవాటు పడినవి.

2. మీసోజోయిక్. (Mesozoic) ఈ కాలములో జీవులకు అనుకూల పరిసితు లేర్పడెను. జంతువు లలో రెప్టయిల్సు మున్నగునవి వృక్షములలో సూది ఆకు చెట్లు, జింకోయి (Ginkgo) టెరిడో స్పెరములు (Pteridosperms) మున్నగునవి. ఈ యుగాంతములో కీటకములు, ఆంజియో స్పెరములు (Angiosperms) పుష్పించువృక్షములు కూడ పుట్టినవి.

3. కైనోజోయిక్ : ఈ యుగములో ఇండియా ఆఫ్రికా, ఆస్ట్రేలియా భూభాగము లేర్పడెను. పశుప్పా తులు, కోతులు, మానవుడు బయలుదేరినవి. వృక్షజాతిలో ఆంజియోస్పెరములు (Angiosperms)ఎక్కువభాగము ఆక్రమించు కొన్నవి. ఈ ఆంజియోస్పెరములలో ఏక జాతి బీజదళములు (Monocots) ద్విబీజదళములు, (Dicots) అను రెండు వుపశాఖలు కలవు.

ఆదికాలమునుండియు జంతు వృక్షజాతులు సమాంత ముగనే (Parallel) పెంపొందుచున్నవి. రెండునూ ఒకేజాతి ప్రొటిస్టానుండి వుద్భవించినవి అప్పటి నుండి రెండు ఒకదానిమీద మరొకటి ఆధారపడుతూ వచ్చినవి. నేడు జంతు జాతిలో ఉత్కృష్టమైన జీవిమానవుడు. వృక్ష జాతిలో ఆంజియోస్పెరము (Angiosperm)



## వీర కార్మికుని ఆత్మ సమర్పణ

వరాసియా బొగ్గుగనుల ప్రమాదంలో గనులలో ఇరుక్కుపోయిన కార్మికులను రక్షించడానికి పూనుకొని, తన ప్రాణాలు కోల్పోయిన కార్మికుని వీరగాథ తెలియ వచ్చింది. ఈ కార్మికుని పేరు శ్రీ శ్యామ్‌లాల్. ఈయన తన ప్రమాదాన్ని కూడా లెక్కపెట్టక స్యూటన్ చిఖాలీ బొగ్గు గనులలో వరద మూలంగా ఇరుక్కు పోయిన తోటి కార్మికులలో 10 మందిని సురక్షితంగా ఇవతలికి చేర్చాడు. తర్వాత మరి కొందరిని రక్షించ డానికి వెళ్ళాడు. కాని, నీటి వేగం ఎక్కువైంది. ఆ మహావీరుడు తను కూడా ఆ నీటి వడికి ఆగలేక పోయాడు : ప్రాణాలు కోల్పోయాడు. పుట్టుట గిట్టుట కొరకే కాని శ్రీ శ్యామ్‌లాల్ జీవితము ధన్యము. ఆయన ఆత్మకు శాంతి చేకూరుగాక.

## మగని మోసము!

ప్రక్కింటి ముసలావిడకు బాగా జబ్బు చేసింది. డాక్టరు గారు ఒక ఔన్సు బ్రాంది గ్లాసులో పోసి త్రాగమని ఇచ్చారు.

ఒక్క చుక్క కష్టంగా చప్పరించి "చిత్రంగా వుందే. మా ఇంటాయన ఇప్పటికి ఇరువై సంవ రాల నుండీ త్రాగేమందు వాసనే వస్తున్నదిది" అన్నది.

పాపము మగని మోసమెరుగదు.

# "నీవేమి చేయగలవు?"

డాక్టరు. ఎస్. హనుమంతరావు, ఎం.ఎ., ఎం.ఎస్.,

"నీబిడ్డ అతిగాఏడిస్తే? "

ఎక్కువగా ఏడ్చే బిడ్డ ఆకలిగా వున్నట్టు గుర్తు. దుస్తులు తడిగావుంటే మార్చాలి. భుజంమీద వేసుకొని వీపుమీద నెమ్మదిగా కొడితే లోపలగాలి పులితేపుల రూపంలో వస్తుంది. అప్పుడు శాంతిస్తాడు. బిడ్డలు రోజులో కొన్నిసార్లు ఏడుస్తూ వుండాలి, ఇది చెడుగు కాదు.

"నీ బిడ్డ ఏడ్చినపుడు ఎక్కువసేపు గుక్కపడితే?"

కొందఱు పిల్లలు ఏడ్చినప్పుడు కొన్ని నిమిషాలవరకు గుక్క పట్టి వుంటారు. అటువంటి సమయములో కాళ్ళు చేతులు నీల్గుకొని వుంటవి. ఆలాంటప్పుడు ప్రశాంతంగా వుండడం మంచిది. చికిత్స లేకుండగనే బిడ్డ యథారీతికి రాగలడు. ఇది ప్రమాదకరంకాదు. కనుక నీ పని పాటలకు యిది ఆటంకం కానియ్యరాదు. కొన్నిసార్లు దీనివిషయమై సానుభూతి చూచేకొలదీ ఈ అలవాటు ఎక్కువవుతుంటుంది. కోపపడగూడదు. ఓపిక పట్టుదల అవసరం. బిడ్డను శిక్షింప ప్రయత్నింపరాదు. యివి దీర్ఘకాలంగా వుంటే వైద్యుని సంప్రదించాలి.

"నీ బిడ్డ కంటిలో ఇసుకపడితే ?"

కండ్లు నలుపనివ్వరాదు. గోరువెచ్చటినీటితో వెంటనే కండ్లు కడగాలి. నీరు కంటిలో ఒకప్రక్క నుండి మరొక ప్రక్కకు వచ్చునట్లు తలను అటుయిటు త్రిప్పాలి, నీరు విస్తారంగా వాడాలి. కనుగ్రుడ్డుమీదగాని కను రెప్పమీదగాని వున్న ఇసుక రేనువులన్నియు పోవువరకు కంటిని కడుగుతూ వుండాలి. ఎంత ప్రయత్నించినా ఇసుక పూర్తిగా తొలగించ లేనపుడు కండ్లు మూయించి మంచి వైద్యుని సంప్రదింపుము.

"నీ బిడ్డ వేలుకోసుకుంటే? "

గాయము లోతుగావుంటే సుభ్రమైన గుడ్డతో కట్టి వైద్యుని కొరకు కబురు చేయుము. కోత స్వల్పమైనదైతే గోరువెచ్చని నీటితో కడిగి కట్టు కట్టుము.

"నీ బిడ్డ పుట్టుచెయ్యి వాడైతే? "

ఎడమచేతి ఉపయోగము అలవడ్డ బిడ్డకు కుడిచేయి ఉపయోగించుటకు నేర్ప ప్రయత్నించ వద్దు. ఈలా ప్రయత్నించడం ఎక్కువ లాభంలేదు — కలిసి వచ్చేది కూడా ఏదీలేదు.

"నీ బిడ్డకు ముక్కునుండి రక్తముపడితే? "

తలపైకి ఎత్తిపట్టి వుంచాలి, మెడచుట్టూ వున్నదుస్తులను వదలుచేసి. మెడవెనుకను ముక్కు వెలుపలను శీతల తడికట్టు వేయాలి. ముక్కుచీదరాదు.

"నీ బిడ్డకు కడుపునొప్పి వచ్చినపుడు? "

చిన్నపిల్లలు సాధారణముగా కడుపు నొప్పితో బాధపడుతుంటారు. దీనికనేక కారణాలు వుండవచ్చును. ఎక్కువ తినడం కావచ్చు లేక ఎక్కువ బలమైనతిండి కావచ్చులేదా అధి కోద్రేకం కావచ్చు. వెంటనే పండుకో బెట్టాలి. బిడ్డ వెల్లకిలా పడుకొని కొంతసేపు నెమ్మదిగా వుండాలి. కొన్ని సార్లు నొప్పి దానంతటదే సర్దుకుంటుంది. లేక వాంతి అయితే దానివెంటనే నొప్పికూడ పోతుంది. నొప్పి త్వరలో సర్దుకొనక పోయినను నొప్పు కడుపు దిగువభాగాన కుడిప్రక్కగా వున్నను ఆపెండిక్సు జబ్బని అనుమాన పడవచ్చును. పొత్తి కడుపులో నొప్పి కల వారికి విరేచన ఔషధాలు యివ్వరాదు. వైద్యుడు రోగిని చూచేవరకు మంచినీరుతప్ప మరేమి యివ్వరాదు.



# "డెయిరీ ఫారమ్"

* శ్రీ వేమరాజు భానుమూర్తి *

ఆవేళ ఆదివారం. మధ్యాహ్నం తీరుబాటుగా కూర్చున్నాం. ఇంతలో చక్రవర్తి వచ్చాడు. 'అన్నయ్యా మరి ఐస్‌క్రీమ్' కొనిపెట్టవూ? అంటూ గారం ప్రారంభించాడు.

"ఇంతకీ ఆ కొనేది అంతా మీ తమ్ముడికేనా నాకూ కొనిపెట్టరా? అంది జోగా.

మీరంతా తినే వాళ్ళయితే నేనొక్కత్తేనా మానివేసేది అంది సుభద్ర.

దానికేం భాగ్యం. అందరం అలాగే తిందాంలెండి. అన్నాను.

అవతల వీధిలోంచి 'ఐస్‌క్రీమ్' వేన్‌వాడు అప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది అన్నట్టు 'హారన్' కొట్టాడు

పట్టాభివీధిలో వచ్చి "'డెయిరీవేన్' మన గుమ్మంలో నిలబడివుంది మీరెవ్వరైనా పిలిచారా? ఏమిటి?" అని అడిగాడు.

"చక్రవర్తి పిలిచాడుకాబోలు 'ఐస్‌క్రీమ్' కోసమని" అని సర్దేసింది అమ్మ.

"మరి ఆ 'ఐస్‌క్రీమ్' ఎక్కడినుంచి వస్తోంది?" అంది లక్ష్మి.

"డైరీ ఫారమ్'లో అదనంగా మిగిలిపోయిన పాలతో ఈ 'ఐస్‌క్రీమ్' అవీ తయారుచేసి అమ్ముతారు. ఆ మాత్రం తెలియదంటే" అంది జోగా.

ఇంతలో పాలవాడు వచ్చాడు. వాడు మామూలుగా 'నీళ్ళలో పాలుకలిపి' పోస్తూంటాడు. అందుకని గృహిణి వాడితో దెబ్బలాడింది. "నిన్ను మానిపించివేసి ఇంక హాయిగా డెయిరీ పాలుపోయించుకుంటామమ్మా! చక్కగానూ వుంటాయి. మీటరు కొలతకీ ఆగుతాయి. పేచీ పూచీలుండవు" అని బెదిరించింది.

ఇంతలో పట్టాభి అందరికీ 'ఐస్‌క్రీమ్ పొట్లాలు కొనుక్కు వచ్చాడు. తింటూండగ మొదలెట్టాడు. "అన్నయ్యా, అప్పుడెప్పుడో డెయిరీ ఫారానికి తీసుకు వెడతానన్నావుకదా?" అన్నాడు.

'వాళ్ళని తీసుకువెళ్ళి చూపిద్దాం పాపం" అని హుషారిచ్చింది గృహిణి.

సరే అని 'డెయిరీ ఫారమ్' మేనేజరుగారికి 'టెలిఫోన్' చేశాం. 'సంతోషం' అన్నారు ఆయన. వెంటనే బయలుదేరుదామనుకున్నాం. నేను వస్తాను. నేనంటే నేనని అందరుబయలుదేరారు.

మా మేళం చాలా మంది బయలుదేరాం.

ఆ పాలకేంద్రం ఎటు చూసినా అందమైన పచ్చిక బయళ్ళ మధ్య బ్రహ్మాండంగా నాలుగంతస్తుల మేడగా కట్టబడివుంది. గేటువద్దరే 'మేనేజరు'గారు మాకు ఎదురు వచ్చి స్వాగతమిచ్చి తీసుకువెళ్ళారు. నాలుగడుగులు వేసేసరికి పాలవాళ్ళు కాబోలు పెద్ద పెద్ద బొక్కెనలతో బారులు తీరినిలబడ్డారు. అవి బరువుగాకూడా వున్నాయి. ఒక్కొక్కడే వచ్చి అక్కడ గోడలోకి అమర్చబడిన పెద్ద 'గరాట'లోకి దిమ్మరించి వెళ్ళుతున్నారు.

"ఇదేమిటండీ, వాళ్ళు ఈ గోడగరాటీలోకి పంపుతున్నది?" అంది సుభద్ర.

'పాలు' అన్నాడు మేనేజరు బాయి.

"ఇక్కడ పాలు చేత్తోపిదకరని విన్నామే-నిజమేనా?" అంది అమ్మ.

"ఇక్కడ మాత్రం పాలుచేతులతోనే పితుకుతున్నారు కానీండి పాశ్చాత్య దేశాలలో మాత్రం యంత్రాల సాయంతో పితుకుతారు. ఇక్కడకూడా త్వరలోనే యంత్రాలలో పితికే పద్ధతిని ఏర్పాటు చేయించుకుంటున్నాము. ఇంకా అయిదారు మాసాలలో తగిన ఏర్పాట్లు అన్నీ పూర్తికావచ్చు. ఇప్పుడు ఇప్పుడు ఒక చిన్న కొట్టంలో అయిదారు ఆవులను మాత్రం ఆ పద్ధతితో పాలు పితుకుతున్నాము. రండి చూద్దాము" అని అక్కడికి తీసుకువెళ్ళారు మేనేజరుగారు.

అక్కడనుంచి గోష్ఠానికి వెళ్ళాము అనేక వేలపశువులు అక్కడవున్నాయి. అన్నీ నవనవలాడుతూ తొనలబట్టి ఎంతో ఆరోగ్యంగా, పుష్టిగా ఉన్నట్టున్నాయి. ఆవిరిమీద శుద్ధి చేయబడిన స్టెయిన్‌లెస్ స్టీల్ బొక్కెనలోనికి

పాలవాళ్ళు పరిశుభ్రంగా చేతులు సబ్బులుతో రుద్ది కడుక్కొని పాలు పిండుతున్నారు. యంత్రాలతో పాలు పిండేగదికి వెళ్ళి చూచాము నాలుగు రొమ్ములకు నాలుగు రబ్బరు గొట్టాలు తగిలించారు. ఇక్కడ ఏదో మీటు నొక్కారు. ఆవు పొదుగులో సంచలనం కనబడింది. చూస్తుండగా యంత్రం పాలన్నింటినీ పిండి వేసింది.

ఈవిధంగా పిండిన పాలనే ఇందాకా మనం చూసిన పాలవాళ్ళు బొక్కెనలతో గోడ గరాటీలోకి పోస్తున్నారు.

"అక్కడేం చేస్తారే పాలని" అంది జోగా.

"చూద్దుగాని నడు!" అంటూ ఆవైపుకు తీసుకు వెళ్ళారు. అక్కడ ఒక స్టెయిన్‌లెస్‌స్టీల్ గొట్టంలోంచి ఈ పాలుగదిలోకి పరిశుద్ధం చేయబడిన బొక్కెనలోకి వచ్చి పడుతున్నాయి. అక్కడ ఒక వుద్యోగి ప్రతి ఆవు ఎంత పాలు యిస్తున్నదీ లెక్కవేస్తున్నాడు.

'ఇదెందుకండి' అన్నారు మా నాన్నగారు. ఇది అంతా ఆయనకు ఆశ్చర్యం కలిగించింది.

"పశువులను దాగా మేపి ఇంకా ఎక్కువ పాలు ఇచ్చేటట్టు చెయ్యడానికి ఈలెక్కలు ఉపకరిస్తాయి అందు కోసమని అన్నాడావుద్యోగి.

"ఓహో:" అనుకున్నారు నాన్నగారు.

"ఇదిగో ఈ ప్రక్క గదిలో ఆయనెవరో 'టెస్ట్ ట్యూబ్‌లో' పాలుపోసి చూస్తున్నాడేమిటో!" అన్నాడు పట్టాభి.

"అదా అది లేబరేటరీ గది. ఇక్కడ 'కెమిస్ట్' ఏ పాలలో ఏ పదార్థాలు ఏపాళ్ళలో వున్నాయో పరీక్షించి లెక్కవేయిస్తాడు. ఆ తరువాత పాలను శుద్ధి యంత్రం లోనికి పంపుతారు ఆ పాలు అన్నింటినీ" అన్నారు మేనేజరు భాయి.

"ఇంక పాలు కాచుకోరా:" అని అడిగింది మా అమ్మ అమాయకంగా.

"కాచుకొనే పని మీలాంటి ఇల్లాళ్ళకి. ఇక్కడ మేము పాలలో ఏవిధమైనరోగ కారకమైన సూక్ష్మజీవులు లేకుండా శుద్ధిచేస్తాము అంతే. ఇదిగో ఈగదిలోవున్న ఆ పెద్ద యంత్రం చూడండి. ఇక్కడ పాలనుతూస్తారు. మచ్చు తీసుకొని ధూళిని వడకట్టే యంత్రంలోనికి పంపుతాము. ఇక్కడ ఈ పాలన్నీ శుభ్రంగా వడకట్టబడతాయి. ఆపైన విద్యుచ్ఛక్తి యంత్రంలో 107° లకు వేడి చేసి 40° లకు చల్లార్చి వేస్తాము. దానితో సూక్ష్మ క్రిములన్నీ నశించిపోతాయి. ఈ పద్ధతినే ఇంగ్లీషులో 'పాశ్చరైజేషన్' అంటారు. ఇందుకు పదిహేను సెకన్ల కంటె ఎక్కువ పట్టదు.

ఈ ప్రక్క హాలులో ఇంకో పెద్ద యంత్రంవుంది. ఈవిధంగా శుద్ధి చేయబడిన పాలను సీసాలలో నింపి వేస్తుంది ఆ యంత్రం.

అదుగో చూడండి. ఆ క్రింద ఆవిరితో శుద్ధి చేయబడిన సీసాలు ఒక్కొక్కటిగా నింపి పైకి వస్తున్నాయి చూడండి" అని ఆ యంత్రాన్ని చూపించారు మేనేజరు గారు. ఈ పాలు నిండిన ఈ సీసాలన్నిటికీ ఒక్క 'మొట్టికాయతో' అల్యూమినమూతలు అమరిపోతున్నాయి. అవి అన్నీ సరిగా తొట్టెలోనికి సరిగా అమర్చబడుతున్నాయి. ఈ యంత్రాలన్నీ అమెరికా, ఆఫ్రికా, కెనడా స్విడ్జర్లెండునుంచి తెప్పించారు.

ఆ చివర వెటర్నరీసెక్షన్ పశువులకు చికిత్స చేసి వాటి ఆరోగ్యం విషయమై ఎంతో శ్రద్ధగా పనిచేస్తున్నారు. వెళ్దాం పదండి అని మేనేజరుసాబ్ మమ్మల్ని అందర్నీ అక్కడికి తీసుకువెళ్ళారు. ఇంతలో "నాన్నగారూ" మన రంగడు 'ఇక్కడికి ఏలా వచ్చాడండీ' అని చక్రవర్తి ఒక్క కేకవేశాడు. మావూళ్ళో ఆవుదూడకి వాడు పెట్టుకొన్న ముద్దుపేరు రెండి. ఈ బుల్లితువ్వాయిలను చూడండి ఎంతబాగున్నాయో!" అంది జోగా.

'నాకు బుల్లితువ్వాయిలంటే బలే ఇష్టం' అన్నాడు పట్టాభి. అక్కడ దూడలు ఎంతో ఉత్సాహంతో చెంగు చెంగున గంతులేస్తున్నాయి.

ఈకేంద్రంలో ఉత్తమ జాతిపశువుల ఉత్పత్తికి, దూడల పెంపకానికీ. శ్రద్ధగా ఏర్పాట్లు చేసి మందలను వృద్ధి చేస్తున్నారని, దూడలనుకొని, పెంచి, తిరిగి రైతులకు, అమ్మేస్తున్నామని మేనేజరు మాకు చెప్పారు.

గోష్ఠం అంతనీ చూసివస్తుంటే అక్కడ ఒక పెద్ద హాలులో 'మిల్క్‌బార్' కనబడింది. అందులో అందురూ పాలు తాగుతున్నారు. వెన్న రొట్టి తింటున్నారు. ఐస్

క్రీమ్ తింటున్నారు. ఇది చూచి చక్రవర్తికి నోరూరింది. ఏదో అడగబోతున్నాడు. అన్నయ్యా! అన్నాడు. ఇంతలో మేనేజరు భాయి "మా ఆతిథ్యం కాస్త రుచి చూడరా?" అని సాదరంగా ఆహ్వానించాడు.

"ఆ ఎందుకులెండి అంటూ మొహమ్మాటము పడు తూనే ఒక్కొక్కరొక్కరే దారితీశారు.

'ఐస్‌క్రీమ్' అన్నయ్యా అన్నాడు చక్రవర్తి అందరికి బిస్కట్లు ఫలహారం పెట్టి 'రోజ్‌మిల్క్' పాసీ చల్లని పానీయంగా యిచ్చారు. 'ఐస్‌క్రీమ్' కూడా తినిపించారు లెండి.

'ఐస్‌క్రీమ్' 'రోజ్‌మిల్క్' మాధుర్యాన్ని తలచు కుంటూ మా మేళం అంతా బయటికి వచ్చేశాం.

"అదండి సంగతి. ఈవిధంగా పొదుగునుంచి సీసాలలో భద్రపరచేవరకు మా కేంద్రంలో ఇన్ని మార్పులు పొందుతున్నాయి. ఈవిధంగా సీసాలలో భద్రపరచబడిన పాలను ప్రజలందరికీ వారివారి అవసరాలకు తగినంతగా బస్తీలో అన్ని పేటలలోను డిపోలు పెట్టించి సరఫరా చేయిస్తున్నాం. ఆ డిపోలకు పాలబుడ్లను మా స్వాంత లారీలలోనే చేరవేస్తున్నాము. ఆస్పత్రులకూ, కార్పరేషన్ పాఠశాలలకు, కాఫీహోటళ్ళకు మేమే పాలు సరఫరా చేస్తున్నాము. ఇంకా మిగిలిపోయిన పాలను 'ఐస్‌క్రీమ్'గా తయారు చేయించి 'వేన్‌'లో ఊరంతా త్రిప్పి అమ్మిస్తున్నాము. మా డెయిరీ ఫారమ్ 'ఐస్‌క్రీమ్'ను ఇందాకా రుచి చూశారుకదా ఇవంటే పెద్దాళ్ళకూ, పిల్లలకీ, కూడా బలే ఇష్టం." అంటూ మేనేజరుసాబ్ మమ్మల్ని మళ్ళీ గుమ్మందాకా వచ్చి సాగనంపారు.

'డెయిరీ ఫారమ్' ఎంతో బాగుందికదూ అన్నయ్యా అన్నాడు పట్టాభి.

"నిజమే ఎంతో బాగుంది" అన్నారు సుభద్ర, జోగా.

"ఎంతెంత లేసిపనులు చేస్తున్నారు. బాగున్నాయి ఇక్కడి పద్ధతులన్నీ ఇవి మన పల్లెటూళ్ళకు కూడా పాకితే బాగుంటుడును" అన్నారు నాన్నగారు.

నాకు 'రోజ్‌మిల్క్' బాగుంది అంది సుభద్ర. అన్నిటికంటె 'ఐస్‌క్రీమ్' నాకు బాగా నచ్చింది అన్నాడు చక్రవర్తి.

అందరం 'డెయిరీఫారమ్' గొడవలే చెప్పుకుంటూ ఇంటికి వచ్చేశాం.

# స్వాగతమ్

శ్రీ మధురాంతకం రాజారాం

దినకరుని తేజము చల్లనై
దినమంత కంతకు కురుచనై
చలిగాలి రివ్వున వీవగా
నెలవెల్లి గ్రుడ్డిగ దోచగా
పొలమందు ధాన్యపు కుప్పల
తూర్పార బట్టుచు పాడు, నా
నలినాక్షి హృదయా హ్లాదివౌ
సంక్రాంతి! నీ కిదెస్వాగతమ్!
హేమంత ఋతు సీమంతిని
ప్రేమించి తెచ్చిన కానుక
చేమంతి పువ్వులు కొప్పులో
సింగార మొలకు చునుండగా
క్రొంగొత్త ఓణిని దాలిచి
గొబ్బెమ్మ పూజలు చేయు, మా
చిన్నారి చెల్లికి చెలియవౌ
సంక్రాంతి నీకిదె స్వాగతమ్!

తొలి కోడి కూసెడి వేళకే
జలమందు తానములాడి, మా
సాతాని జియ్యరు వచ్చెను,
ఏతాము ఉరవడి హెచ్చెను!
ఇంటింట ఆటలు పాటలే
అల్లుండ్ర సరసపు మాటలే
హాయ్ హాయి నొసగే దానవే
సంక్రాతి నీకిదె స్వాగతమ్!
చవులూర పాకము చేసేది
కోడండ్ర నవ్వుల కల కల,
కవ్వంబు గిర గిర లాగెడి
అత్తయ్య గాజుల గల గల,
తృణ దోలలో ఉయ్యాలలూగే
మను మంచు బిందువు తళ తళ,
నీ రాక పోకలు ఒక కల!
సంక్రాంతి! నీకిదె స్వాగతమ్!

# చంద్రు నిర్ణయం



'ఇదిగో అమ్మా! ఇంకోసారి ఆమాట చెప్పావంటే నేను వూరుకోను. రేపుగు బండిలోనే మద్రాసు వెళ్ళిపోతా.'

'అదికాదు చంద్రు. నీకు ఎందుకు అంతకోపం వస్తుందో నాకు తెలియదు! నిన్ను ఏమన్నా చేయరాని పని చేయమన్నానా! పెండ్లి చేసుకోరా అంటే అంత విసుగెందుకూ! ఒక్కగాని ఒక్క కొడుకు. పెండ్లి చేస్తే కోడలు పిల్లలు నీవు చూడముచ్చటగా కాపరం చేయడం చూడాలని మీ నాన్న నేను ఎంత అనుకుంటూన్నామో నీకు తెలుసా? ఈ సెలవల్లో నీవు వచ్చినప్పుడు ఏదన్నా కుదురుద్దామని ఎంతో ఆశ పెట్టుకున్నాను. నీకు నచ్చిన పిల్లని ఏరుకున్నావంటే అంతే మాకు చాలు' అంటూ నిట్టూర్చింది రమణమ్మ.

'అదికాదే అమ్మా ఇప్పుడేమో అలాగే అంటావు. కోడలు అని ఒక అవిడ ఇంట్లో కాలుపెట్టగానే ఆవిడకూ నీకూ సరిపోవద్దూ! లేకపోతే ప్రతిరోజూ పోట్లాటలేగా! మీ ఇద్దరి మధ్యా నేను నానా తిప్పలూ పడాలి. ఇలాగే హాయిగా వుండనీవేనన్ను" అంటూ రామచంద్రరావు తన గదిలోకి లేచివెళ్ళాడు.

"అయ్యోరాత! వీడికి ఎక్కడ దొరికారో ఆ స్నేహితులు; వారి ఖర్మం కొద్దీ అటువంటి భార్యలు దొరికితే చంద్రుడు పెండ్లనగానే భయపడతాడు! అందరూ వారిలాగానే వుంటారా! వీడికి ఎన్నటికి బుద్ధి మారుతుందో భగవంతుడా!" అని అనుకుంటూ వంటింటి పనిమీద వెళ్ళిపోయింది.

రామచంద్రరావు ఇంజనీరుగా మద్రాసులో పనిలో చేరి ఇప్పటికి అప్పుడే నాలుగేళ్ళు దాటినై. అక్కడ గది అద్దెకు తీసుకుని వుంటూన్నాడు. ప్రతి సంవత్సరం ఒక నెల సెలవుమీద తలితండ్రులను చూడడానికని ఒంగోలు వచ్చి వెళ్ళేవాడు. పెండ్లి విషయం ప్రస్తావించగానే అక్కడ నుంచె లేచి వెళ్ళిపోయేవాడు. తలి తండ్రులు ఆతనినీ బలవంతపెట్టి ఒప్పించడాన్కి వెనుదీశారు.

చంద్రు తన స్నేహితులు రాము, మురారిల గృహస్థ జీవితం చూచి తనుకూడా అలాంటి బుద్ధిలేని పని చేయకూడదని అనుకున్నాడు. రాము ఇంట్లో అతని తలితండ్రులు చెల్లెళ్ళూ తమ్ముళ్ళూ కలిసే వుంటారు. పెళ్ళయిన కొత్తకదా వారి సరదాకు మనమడ్డు ఎందుకని రాము తల్లి వూరుకోదు. ఒకరోజున చంద్రు వుండగానే రాము తల్లి కొడుకుతో పోట్లాట వేసుకుంది. ఇంతకీ అతను చేసిన తప్పు తన భార్య అడిగితే కుట్టుకోడాన్కని ధారం, ఏవో బట్టలు తెచ్చాడట! అదే తను ముందురోజు "నీ చెల్లెలికి ఒక పరికిణీగుడ్డ తీసుకురారా" అంటే "జీతం రానీ అమ్మా" అన్నాడట! కోడల్ని చూస్తే ఇంత ఓర్వ రానితనం ఎందుకో ఈ అత్తలకి అని ఆశ్చర్యపోయాడు చంద్రు. రాము పాపం అనలేక అనుభవించలేక బాధ పడేవాడు. మురారి ఇంట్లో పరిస్థితి ఇంకొక విధంగా వుండేది. వాని ఇంట్లో అతనూ భార్య ఇద్దరే. అ వచ్చే జీతాన్ని భార్య చేతిలో పెట్టేవాడు. ఆవిడా ఇష్టమొచ్చినట్లు ఖర్చు పెట్టేది. ఇరవై రోజుల్లో ముప్పై రోజుల జీతం ఖర్చు పెట్టేసి మిగతా పది రోజులూ చేతిలో డబ్బు లేకపోతే ఎవరినన్నా చేబదులు అడగడం! ఇదీ వారింటి వరస. భార్యతో ఖర్చు తగ్గించమనడాన్కి మురారి కొంచెం వెనుదీసేవాడు. ఆవిడ మటుకు కావాలని అలా చేస్తుందా! అనుభవం చాలదు కొత్తచేత అలా చేస్తోందని వూరుకొనేవాడు మురారి. చంద్రుతో 'నన్ను చూచన్నా నీవు బుద్ధి తెచ్చుకోరా! ఇప్పుడప్పుడే పెండ్లి చేసుకోకు నీకు ఇంకా పెద్దజీతమైనాక చూద్దువుగాని' అని తన అనుభవం కొద్దీ చెప్పేవాడు. ఇదంతా చూచిన చంద్రు పెండ్లి వద్దురా బాబూ అనుకున్నాడు.

ఒకరోజున తన గదిలో ఏదో పుస్తకం తిరగవేస్తూ పడుకున్నాడు. అప్పుడే భోజనమైంది. సావిట్లో ఎవరో వచ్చి 'పిన్నిగారూ' అంటూ పిలిచారు. చంద్రు తన చదువులో అంతగా ఆ పిలుపుని పాటింపలేదు. రెండు మూడు సార్లు ఆదే పిలుపు వినగానే అమ్మ వినలేదు గాబోలు అని లేచి సావిట్లోకి వెళ్ళాడు. అక్కడ ఒక

అమ్మాయి వెండి కుంకపు భరిణి చేతిలో పెట్టుకుని నిల్చున్నది. కొత్త నీలిచీర, తలనిండా పూలు. కంటినిండా కాటుక— 'పిన్నిగారు లేరా?' అన్న ప్రశ్న విని ఉలిక్కిపడ్డాడు చంద్రు. 'ఆ! దొడ్లో వున్నటుంది పిలుస్తాను' అంటూ తల్లిని పిలవడానిక్కి వెళ్ళాడు. 'అమ్మా నీకోసం ఎవరో వచ్చారే వెళ్ళిచూడు' అన్నాడు.

రమణమ్మగారి వెనకాలే వచ్చి అక్కడ నిల్చున్న చంద్రుని చూడనట్టుగా ఆ అమ్మాయి రమణమ్మగారితో 'పిన్నిగారూ మా తమ్ముడి పుట్టినరోజు. సాయంత్రం పేరంటానికి తప్పకండా రండి' అంటూ బొట్టుపెట్టింది." ఆలాగేనమ్మా. సుశీల బొట్టుపెడుతానుండు' అంటూ రమణమ్మ లోపలికి వెళ్ళగానే అక్కడ తనుండడం భావ్యం కాదని చంద్రు తన గగిలోకి వెళ్ళిపోయాడు.

చదువుతున్న పుస్తకం చదవడానికి మళ్ళీ కాలేదు. అక్షరాలకు ప్రతిగా ఆ అమ్మాయి --సుశీల— కనిపించడం చూచి —ఛీ! ఇదేమిటి ఒక్కసారి చూడగానే నా మనస్సును ఇలా ఆవరించిందే! ఆ అమ్మాయి ఎవరో యేమో! నాకెందుకు ఈ గొడవంతా' అని ఇంకొక సారి పుస్తకం చదవడానిక్కి ప్రయత్నించాడు. ఎంత చేసినా ఆ రూపం, ఆ తియ్యని మాటలు (యెంత కొద్దివైనా) తన నించి దూరం చేయలేకపోయాడు. త్వరలో మద్రాసు వెళ్ళిపోవాలి. ఇక్కడుంటే తనకి మనశ్శాంతి వుండదనుకున్నాడు.

ఒక రోజున పేపరు చదువుతూ అలాగే నిద్రపోయాడు— ఆఫీసునుంచి ఇంటికి వస్తున్నాడు. దారిలో మంచి జాజి పూలు అమ్మడం చూచి 'దానికి' తిసుకెడితే ఎంత బాగుండుననుకుని ఒక బేడ పూలు కొన్నాడు. ఆ పొట్లాన్ని కోటు జేబులో దాచుకుని ఇల్లు చేరాడు. తను ఎదురు చూచినట్లే 'అది' గుమ్మంలో నిల్చుని తన రాకకై ఎదురు చూస్తూంది. తను మెట్లెక్కుతుండగా సిగ్గుతో తలవంచుకుని లోపలికి వెళ్ళింది. కాఫీ ఫలహారం తెచ్చి బల్లమీద పెట్టిన ఆవిడికి ఆ జాజి పూల దండ ఇచ్చాడు. అవి తీసుకుని 'ఎక్కడివండి పూలు చాలా వాసనగా వున్నాయి' అన్నది. చంద్రు ఎవరో తనని కొట్టి లేపినట్టు లేచాడు. అవును నిజంగానే అదే కంఠం! 'ఎక్కడివండీ పూలు చాలా వాసనగా వున్నాయి' అంటూంది. మెల్లగా లేచి వెళ్ళి సావిట్లోకి తొంగిచూచాడు.

సుశీల, ఇంకొక ఆవిడ (తల్లి గాబోలు) రమణమ్మగారితో మాట్లాడుతున్నారు. "మా దొడ్లో పూచినవేనమ్మా! పూలు కోయడానికి కూడా నాకు తీరికవుండదు. కొన్నిరోజులు అలాగే రాలిపోతుంటాయి' అన్నది రమణమ్మ.

'ఆ! అది సరేనండి రమణమ్మగారూ! మీ అబ్బాయి వచ్చారటగదా! పెండ్లి సంగతి ఏమన్నా అనుకుంటున్నారా!' అన్నది ఆ వచ్చిన ఆవిడ.

'వచ్చాడమ్మా! మేమెంత అనుకుని ఏం లాభం? పెండ్లి మాటంటే తారామండలానికి ఎగురుతాడు. చేసుకున్న వాళ్ళంతా ఏం సుఖపడుతున్నారు? నాకు ఈ వచ్చే జీతంతో నాకే చాలదే' అంటాడు. ఏం చేయడానిక్కి తోచటంలేదు మాచమ్మగారూ!'

"దానికేం రమణమ్మగారూ! అందరూ అలాగే అంటూంటారు. మా అన్నయ్యకు ఇద్దరే కూతుళ్ళు. కావలసినంత అస్తుంది. పెద్దదానికి పెండ్లయింది. ఇక ఇది రెండవది. కట్నం కానుక వాళ్ళనే జరుపుతారు. మీరు సమ్మతిస్తే పిల్లను ఇక్కడికే పిలిపిస్తాను. మీరు కాస్త ఆలోచించి చెప్పండి"

("అయితే నీ కూతురికి రావన్నమాట" అంటూ నిరుత్సాహం చెందాడు చంద్రు)

"ఇంకొకసారి అడిగి చూస్తాను మాచమ్మగారూ. అయినా ఈకాలం పిల్లలకి పెద్దలు చెప్పిన మాటంటే శ్రద్ధేలేదు"

"ఆ మాట ముమ్మాటికి నిజం. చూడండి మా సుశీల కూడా అంతే, చదివినంత వరకూ చాలు అంటే వినదు. బి. ఏ. పూర్తి కావాలి అని పట్టు బట్టింది ఇంకొక సంవత్సరం వరకూ పెండ్లి మాట మానెయ్యమంటుంది. దాని తండ్రికి ముద్దుల కూతురు. అది చెప్పినట్టే జరిగి తీరాలంటారు."

"కాదండీ పిన్నిగారూ. మీరే చెప్పండి బి. ఏ. పూర్తయినాక పెండ్లి మాటంటే అమ్మకు ఎందుకు అంతకోపం వస్తుందో! ఇంకొక సంవత్సరంలో యేమంత మునిగిపోతుంది, మీరే చెప్పండి?"

("నీకుకూడా నాఅంత పట్టుదల వున్నదే!" అనుకున్నాడు చంద్రు)

# చంద్రు నిర్ణయం

ఇదయినాక కొద్దిసేపటికే వాళ్ళిద్దరూ లేచి వెళ్ళారు. "చంద్రూ కాఫీ త్రాగుతావా ?" గ్లాసుతో లోపలికి వచ్చిన తల్లినిచూచి 'ఎవరే అమ్మా ఆ వచ్చింది' అని తెలియనట్టుగా అడిగాడు.

"వాళ్ళే, మొన్న పేరంటం పిలవ వచ్చిందే ఆ అమ్మాయి సుశీల. దాని తల్లీను. ఏదో పెండ్లి సంబంధ మట ఆవిడ అన్నకూతురుట మీరు చూచేందుకు ఒప్పు కుంటే ఇక్కడికే పిలిపిస్తానన్నది దీనికి నిన్నడిగి చెపు తానని పంపాను.

"అయితే తనకూతురికి కాదన్నమాట" అన్నాడు తనతల్లివేపు చూసి నవ్వుతూ."

"ఆ అమ్మాయి చాలా మంచిదిరా ! పిల్లలంటే అలా వుండాలి. చదువుకున్నందుకు ఎటువంటి పొగరుబోతు తనం లేకుండా. ఎంతో అణుకువతో నా దగ్గర ప్రవర్తి స్తుంది. దానికి బి. ఏ. పూర్తికావాలంటుంది. తల్లికి అం తగా ఇష్టంలేదు. అయినా ఇప్పటికాలంలో చదివితే మటుకూ ఏంతప్పు. సుశీల చెప్పినట్టు చదువు పూర్తయి నాకే పెండ్లి కావడం మంచిది."

"ఆయితే నువ్వు ఆ అమ్మాయి పక్షంగానే మాట్లాడు తున్నావన్నమాట అవునాఅమ్మా"

"అవునురా. అది బుద్ధిమంతురాలు, క్రొత్త సంసా రంలో అంతశ్రద్ధగా చదువుకోడం వీల్లేదని తెలుసుకుంది సగంలో ఆపటంకంటే, ఒక సంవత్సరం ఆలస్యమైనా పరీక్ష అయినాక పెండ్లి చేసుకోవడం మంచిది. అన్ని ట్లోను చురుకైనపిల్ల, ఇంటిపనులలో, కుట్లు, చదువూ— అన్నీవచ్చు. ఎవరు భాగ్యం చేసారో అటువంటి పెండ్లాం దొరకడానికి !" అన్నది ఎంతో నిరుత్సాహంతో.

"అదికాదే అమ్మా, ఆవిడ అన్నకూతురి కోసం వచ్చి పోతే, నీవుదాన్ని మాని ఆవిడకూతురినే పొగుడు తున్నావు కదే !" అన్నాడు నవ్వుతూ.

"ఆ ! ఆ అమ్మాయిని చూచానురా ! ఒట్టి పల్లెటూరి రకం. నాకే నచ్చలేదు. అందుకనే నీవిప్పుడు పెండ్లి చేసుకోవని చెప్పాను" అయినా మాణిక్యం వంటి అమ్మాయి ఎదురుగా వుంటే ఆ పల్లెటూరి పిల్ల ఎవరికి నచ్చుతుంది అంటూ తన పనిమీద వెళ్ళి పోయింది రమణమ్మ.

చంద్రుకు సెలవులు అయిపోతూ వున్నాయి. ఇంకొక రెండు రోజుల్లో మద్రాసు చేరుకోవాలి. తన బట్టలన్నీ సర్దుకుంటూ వున్నప్పుడు సావిట్లో ఎవరో చెప్పులు వదు లుతున్న చప్పుడువిని లేచివచ్చి చూచాడు. సుశీల అతనిని చూచి అక్కడే నిలబడ్డది. "పిన్నిగారు లేరా ?"



'లేదు ఇప్పుడే ఎవరింటికో వెళ్ళింది. అమ్మతో ఏ మన్నా చెప్పాల్సి వచ్చావా ? అమ్మరాగానే చెపుతాను"

"ఏమీలేదు మాకు కాలేజీతెరిచారు రేపు గుంటూరికి వెళ్ళుతాను చెప్పిపోదామని వచ్చా" అన్నది.

"అయితే ఇదే ఆఖరి సంవత్సరమన్నమాట, బి. ఏ. కాగానే ఇంకా చదువుతావా ?" అంటూ మెల్లగా మాట లకు ప్రారంభించాడు.

"నాకు చదవాలని వున్నా మా నాన్న అమ్మ ఒప్పుకో వద్దూ ? ఇంతకీ నేను ఈ సంవత్సరం పూర్తి చేసినాక కదా ఆ ఆలోచన?" అన్నది నవ్వుతూ.

"నీవు పెండ్లికూడా వద్దని ఇంత ఆసక్తితో ఈ సంవ త్సరం పూర్తిచేయడం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. పెండ్లి అయినాక చదవకూడదా?" అన్నాడు.

"నాకు ఆ ఆలోచన అంతగా నచ్చలేదు. ఒక్క ఏడు నిదానిస్తే ఏమంత మునిగిపోతుంది. మీరు పెద్ద జీతం వచ్చేవరకూ పెండ్లి వద్దనడం బాగుందిగానీ నేను చదువు పూర్తయే వరకూ వద్దన్నది ఆశ్చర్యంగా వున్నదా ? అన్నది కొంటెగా నవ్వుతూ.

"అవును నాకు వచ్చేజీతం నాకే సరిపోకుంటే పెండ్లి చేసుకుని ఆ వచ్చేమనిషిని కూడా పోషించడం ఎలాగా మరి? "

"అదీ నిజమే ఆవిడ ఏమురారి భార్యలాంటిదో వస్తే అవును మీపని ! "

"మురారి భార్య నీకుతెలుసునా ? ఎవరు చెప్పారా విషయం? '' ఆశ్చర్యంతో అడిగాడు.

"మీ అమ్మగారే ! అదీగాక మురారి భార్య ఇంటరులో నాతో చదువుకున్నది. హాస్టలులో మేమంతా వున్నప్పుడు మాకు ఇంటినుంచి పంపిన డబ్బుతో సరిపెట్టుకుంటూంటే ఆవిడ చాలక మళ్ళీ ఒకసారి తెప్పించుకునేది. మేమెంత చెప్పినా దుబారా ఖర్చును తగ్గించేది కాదు. ''

"అయితే ఆవిడ అలవాటు, అంతేగానీ, నిజంగా మురారి జీతంచాలక కాదు వారింటి పరిస్థితికి అన్నమాట. అంతేనా? "

"అంతే ఎంతపెద్ద జీతమైన ఆవిడఖర్చు పెట్టడములో వుంది. పొదుపుగల మనిషైతే కొద్దిలోనే సరిపుచ్చుతుంది. అంతేకాని అందరూ మురారి భార్యలాగ వుండరు'' అన్నది నవ్వుతూ.

"అయితేనేను పొరబడ్డాను. కానీ మన అనుభవానికి వచ్చేదాక ఆసంగతి మనకు తెలియదుకదా ! "

"క్రొత్త వాళ్ళయితే ఆభయం. కానీ చాలాకాలం నుంచీ ఒక కుటుంబానికి తెలిసిన వాళ్ళయితే ఆ భయం వుండదు''

"ఇప్పుడు నాకువచ్చే జీతంతో సుఖంగా సంసారం గడపవచ్చు నంటావా ? అంతేనా'' అన్నాడు అర్థగర్భిత నయనాలతో సుశీలవైపు చూస్తూ.

"నాకేం తెలుసు, మీకు ఎటువంటి భార్య రానున్నదో ఆవిడను బట్టి వుంటుంది. అదీగాక మీకు త్వరలోనే ఇంక్రిమెంటు వస్తుందటగా ! మీరు ఆతరవాతనే గృహస్థ జీవితం ప్రారంభించ వచ్చుగా ! ''

"నావిషయాల్లో నీవు చాలా ఆసక్తి చూపావే? ''

"అవునుమరి మీరు నావిషయాలను మీ తల్లిగారిని అడిగి తెలుసుకోలేదా ! నేను మాత్రం వూరుకుంటానా?"

"ఏమోననుకున్నాను ! భలే తెలివిగలదానివే ! అయితే నీవు ఏ నిర్ణయానికి వచ్చావు? "

"నేను వక్కతేకాదు మీ తల్లిదండ్రులు, మా తల్లిదండ్రులు కలిసే నిర్ణయానికి వచ్చారు మీకు ఇంక్రిమెంటు, నాకు పరీక్ష కాగానే మాట్లాడుదామని అనుకున్నారు. "

''అయితే మీరింతమందిచేరి నన్ను ఒక్కడిని ఒప్పించడానిక్కి ప్రయత్నించారన్న మాట. ఆనాడు ఆనాటకం కూడా నాకొరకే ఆడారన్నమాట. ఇందరిని ఎదిరించడానిక్కి నాయందు శక్తి చాలనందున, మీరు నిర్ణయించిన దాన్ని ఒప్పుకున్నట్టుగా అందరికీ నీవేతెలుపు, సరేనా? " అన్నాడు చంద్రు సంతోషం నిండిన హృదయంతో.

అప్పుడే లోపలికి ప్రవేశించిన రమణమ్మ ''నేను విన్నానులే ! ఈ ఫలితానికని ప్రతిరోజూ ఎదురు చూస్తున్నాను. నేటికి నా మనస్సు నిశ్చింతగా వుంది. ఇన్నేళ్ళ నుంచినీవు వినసందుకు మంచి భార్యనే పొందావు. సుశీల వంటి భార్య రావడానిక్కి నీవు, కోడలుగా పొందడానిక్కి మేము, ఎంతో అదృష్టవంతులము. '' అంటూ అక్కడ వచ్చి ఇద్దరి మధ్యా నిలబడ్డది.

''అమ్మా అంతలో త్వరపడకూ. ఇంకొక ఏడు నీవు ఓపిక పట్టాలే కోడలు రావడానికి. కదు సుశీలా? " అన్నాడు దానివేపు చిలిపిగా చూస్తూ.

"అదేమిట్రా ? ఇంకొక ఏడెందుకే ? మరీ విడ్డూరంగావుందే? ''

''అవునమ్మామరి, సుశీల తన పరీక్ష కొరకు, నేను ఇంక్రిమెంటు కొరకు చూస్తున్నాము. అది రాగానే నీ కోర్కె చెల్లిస్తాము. అంతే: "

''నీ సంసారం ఎవరి సంసారం లాగుండబోతుంది ? రాము, మురారి నీ నిర్ణయాన్ని గురించి ఏం చెప్తారో అలోచించావా ?" అన్నది రమణమ్మ నవ్వుతూ.

"ఎవరిలాగున్నాసరే అమ్మా, అంత అనానుకూలాల మధ్యావారు ఎంత సంతోషంగా వున్నారో నాకిప్పుడు కొద్దిగా బోధపడుతున్నది. ఏదో వారి అదృష్టం వారిది. మేము మటుకు ఈ చిన్న ఆటంకాలను లెక్క చేయకండా మా జీవితాలను సంతోష మయంగా చేయ నిశ్చయించాము" ప్రేమ పూరిత నయనాలతో సుశీల వైపు చూస్తూ అన్నాడు చంద్రు.

# అదంతా ఎక్కడ?

పదుగురు ఆడపిల్లలం
నవ్వుతూ కూర్చున్నాం
రైలు కదిలింది
రమాదేవి పుస్తకం
రాజకుమారి బొమ్మలు
లక్ష్మీదేవి పత్రిక
దీక్షగా చూస్తున్నారు.

నాకు ఏమీతోచక
నాలుగువైపులా చూశాను.
పురుషులూ, స్త్రీలూ,
పిల్లలూ, తల్లులూ
చాలమంది ఆపెట్టెలో
చోటులేక నిలబడ్డారు.

మేముకొంచెం జరిగి
ముగ్గురికి చోటిచ్చాము
వేగంగా పోతుంది రైలు
సగంమంది నిద్రపోయారు
చల్లగాలి వీస్తోంది
చెవులకు చేతిరుమాలుకట్టి
చెల్లాయి ప్రక్కకు జరిగి
కళ్ళుమూసుకున్నాను.

పైనుండి ఏదో
పడింది కాళ్ళమీద
ఉలిక్కిపడిలేచి
కళ్ళుతెరిచి చూశాను
కాళ్ళమీద పడినది
నల్లఅట్ట పుస్తకం
తీసిచూశాను.
తెల్లకాగితాలు
నీలిరంగు రూళ్ళు
మూడుపేజీల తర్వాత
ముత్యాల్లాంటి అక్షరాలు
చదవకూడదనుకుంటూనే
చదవడం మొదలుపెట్టాను.

"అడిగావు కనుక
అన్నీ చెప్తున్నాను
పూలతోటలో నేను
నీలిపూవును.
చల్లగాలికి ఆడి
పిల్లగాలికి పాడాను.
వాళ్ళక్రిందపడి
నలిగిపోయానుకడకు
రాజభవనంలో నేను
రాకుమారునిగా పుట్టి
యుద్ధాలు చేసి
పెద్దరాజ్యం స్థాపించి
పసిడిసింహాసనంమీద
పాలించాను రాజ్యం
హంసతూలికా తల్పంమీద
హాయిగా నిద్రపోయాను.
రాత్రివేళ ఒకరోజు
మంత్రి బాకుతోపొడిచి
నన్ను చంపివేశాడు.
నా రాజ్యం తీసుకున్నాడు.
తర్వాత నేను తిరిగి
ధనికునియింట పుట్టాను.
చదవుకోడానికి
చెన్నపట్నం వెళ్ళి
కాలేజీలో చేరి
ఖర్చుపెట్టానుడబ్బు
కాని చదువు రాలేదు
కడకు లావ్‌లో దిగి
రాధను ప్రేమించాను
రాధలేకపోతే
బాధగా ఉండేది
రాధ నాన్నగారు
పదివేల కట్నంతో
పద్మనాభంగారి కొడుక్కి
రాధమ్మనిచ్చారు.

ప్రియురాలు లేనందున
పెట్టెలు పగలుగొట్టి
పుస్తకాలు చింపాను.
పిచ్చియెక్కిందని
ఆసుపత్రిలో నన్ను
అయిదునెలలుంచారు.

బయటకు వచ్చేసరికి
పైసాకే లేకపోయింది.
పల్లెటూరు చేరి
పకీరునయ్యాను
బికారినయ్యాను
భుజానికున్న సంచితో
భిక్షకై తిరిగాను
పట్టెడన్నమైనా
పొట్టకు దొరకలేదు.
కాండవిలో చేరి
గజదొంగనయ్యాను
దారులుకాచి
దొంగతనాలు చేశాను.

దొరలు పట్టుకొని
నేరం చేశానని
నాలుగుగోడలమధ్య
జైలులో పెట్టారు.
ఆ చీకటి జైలులో
ఆరురోజులున్నాను
ఏడోరోజు రాత్రి
ఎవరికీ కనబడకుండా
ప్రహరీ గోడదాటి
పారిపోయివచ్చాను.

ఇదంతా జరిగింది
ఎక్కడనుకున్నావు?"
అనే ప్రశ్నతో
ఆ వ్రాత ఆగిపోయింది.
ఇంకేమైనా ఉందని

# అదంతా ఎక్కడ ?

ఒక్కొక్క పేజీ తిరగేసి
జాగ్రత్తగా చూశాను
ఎక్కడా అందులో
ఒక్కమాటచూడలేను.
అన్నీ తెల్లకాగితాలు
సన్ననినీలిరూళ్ళు
ఆపుస్తకం మూసివేసి
ఆలోచించాను అరగంట.
అది చదివేటప్పుడు
అతనిగురించి నాకు
జాలివేసింది
కోపమొచ్చింది
భయముకలిగింది
పైకి కనిపిస్తున్న
బంగారు గొలుసు
జాకెట్టులోకి త్రోసి
పవిటచెంగుతీసి
మెడచుట్టూ చుట్టాను.
అయినా నాకెందుకో
అతనిగురించి భయం
అంతకంత కెక్కువయింది
చెంతనున్న పెద్దవారితో
అతనిగురించి చెప్పి
పోలీసువారిని పిలిచి
పట్టిద్దామనుకున్నాను.
అయినా ఒకసారి
అతనిని చూద్దామని
పైకి లేచాను
పైనిపరుపుమీద
నల్లని దుప్పటొకటి
కాళ్ళనుండి తలవరకూ
కప్పుకొని హాయిగా
నిద్రపోతున్నాడు
ముఖం కనబడలేదు
ఇంకా రెండు పుస్తకాలు
క్రింద పడటానికి
సిద్ధంగా ఉన్నాయి
నాదగ్గరున్న పుస్తకం
నలిగిపోకుండా తిరిగి
అతని పరుపులో పెట్టి
కూర్చుందామనుకున్నాను.
ఆడపిల్లను కనుక
ఆపని చేయలేక
అక్కడే కూర్చున్నాను
ఎప్పుడు పట్టిందో నిద్ర
ఎలాగపట్టిందో నిద్ర
నాకు తెలియకుండానే
నేను నిద్రపోయాను
మెలుకువ వచ్చేసరికి
తెల్లవారిపోయింది
విజిలువేసి రైలు
విజయవాడలో ఆగింది.
పైనిపడుకున్నతను
బెడ్డింగు చుట్టి
క్రిందకు దిగివచ్చి
ఎదురుగా కూర్చున్నాడు
దొంగలాగలేడతను
ఉంగరాల జుట్టు
విశాలమైన కళ్ళు
వెడల్పైన నొసలు
సుకుమార శరీరం
సువర్ణఛాయ
కలిగి ఉన్నాడతను.
నల్ల అట్టపుస్తకం
నాదగ్గరే ఉంది
అతనికిచ్చివేయాలని
అనేకసార్లు తీశాను.
పలకరించలేక
పుస్తకం ఇవ్వలేను.
ఆస్టేషనులోనే
అతను దిగిపోతున్నాడు
ఆ పుస్తకం నేను
అతనికివ్వకపోవడం
అన్యాయమనిపించింది
"ఏమండీ ఈపుస్తకం
తమరిదేమో చూడండి"
అని ధైర్యంగా లేచి
అతనితో అన్నాను.
ఆయన ఆశ్చర్యంగా చూసి
ఆపుస్తకం తీసి
"ఔను నా పుస్తకమే
మీకెలాగ వచ్చింది ?
ఎక్కడ దొరికింది ?"
అడుగుతూనే అతను
ఆరైలుపెట్టెనుండి
క్రిందకు దిగిపోయి
కిటికీవద్ద నిలబడి
చాల థాంక్స్ అన్నాడు.
అయితే అది జరిగింది
ఎక్కడో చెప్తారా ?
అడిగాను నేను.
అతను నవ్వుతూ అన్నాడు
"ఇదంతా ఈరైలులో
అదంతా నాకథలో."
రైలు కదిలింది
మైలు దాటింది
మలుపు తిరిగింది.
మలుపురాక యీసంగతి
మీతోయిప్పుడు చెప్పాను.






# సాటిన్ లాంటి శరీరం

"శరీరాన్ని సాటిన్‌లాగ ఉంచుకోవటం సాధ్యమా అంటే"; "ఎందుకుకాదు" అన్న సమాధానం సందేహించ కుండా ఇయ్యవచ్చు. రాత్రింపగలు సాటిన్‌లాగ మెరిసేట్లు మన శరీరాన్ని చేసుకోవటం మనచేతిలో ఉంది. శరీరసౌకుమార్యాన్ని పొందటానికి చేయాల్సిన ముఖ్య పద్ధతి స్నానము.

ఈస్నానము చేయటంలోని వివిధ విధములు వింత వింత అందాలను ఇస్తాయి. అందులో ముఖ్యమైనవి చూదాము.

స్నానము ప్రతి రోజు ఉదయము చేయటం వంటికి మనసుకికూడ మంచిది. లేవగల్గి చేయగల్గితే ప్రొద్దుట ఆరుగంటలలోపల చేస్తే ఎంతో హాయిగా రోజంతా గడుస్తుంది.

కొంతమంది దృష్టిలో స్నానము చేయటం మడికోసమని. అందుకని అన్నం తినేముందు, లేకపోతే వంట చేసేముందు చెంబుడునీళ్ళు ఆదరాబాదరా పోసుకొని స్నానమయిందని ఎంచుకొంటారు. నిజానికి స్నానము ఆచారంకోసముకాదు, శుభ్రతకోసం. మన పూర్వులు పెట్టినదికూడ అదే ఉద్దేశం. ఆచారమనే వంకతో శుభ్రత నేర్పించుదామని వాళ్ళనుకొంటే ఆచారంవంక అశుభ్రత జాస్తి అవుతుంది. ఇది మనవాళ్ళ తెలివి లేమి అనాలి. వంటకు ముందు శుభ్రంగా ఉండకపోతే తినేవస్తువులు కూడ శుభ్రంగా ఉండక ఆరోగ్యం చెడిపోతుంది. ఆ శాస్త్రం చెప్పక ఆచారం లేకపోతే పాపం అన్నారు మన పూర్వులు. దానికి వ్యతిరేకంగా మడిబట్టకదా అని జానెడు తడిబట్టను చుట్టుకొని చూసేవాళ్ళకు చికాకు పుట్టిస్తారు.

సరే ఇక దాన్ని వదిలేసి అసలు విషయాన్నికి వద్దాం. స్నానం అంటే రక్తం బాగా పారేట్లు, వంటికి అతికిన మన్ను పోయేట్లు బాగా రుద్దుకొని, బోలెడునీళ్ళు పోసుకొనేది మాత్రమే. వల్లు కొంచెం గట్టిగ సోపుతోనో, సీకాయతోనో, సున్నిపిండితోనో కొంచెం గట్టిగ రుద్దుకోవాలి. ఈచలికాలం సోపును తగ్గించివాడటం మంచిది. సీకాయపొడిని, నూనెను, పసుపును కలిపి రుద్దుకోవటం వలన వంటికి మెరుపువస్తుంది. ఇక అదికాకపోతే పెసరపిండి (ఇతర పిండ్లు కలవకుండ) లో గామంచాలు, కస్తూరి పసుపువేసి రుద్దుకొంటే సువాసనతో, చక్కని చాయతో, మెత్తగ మెరుస్తుంది శరీరం.

సోపునుపయోగించేటట్లైతే చేతితోకంటే, స్పాంజితోనో, Bath Bresh తోనో రుద్దుకోవటం మంచిది. ఇవేవికాకపోతే సోపును శుభ్రమైన తువ్వాలకు రాసి రుద్దుకోవచ్చు.

ఇక స్నానాన్నికిముందేమి చేయాలో చూదాం. ముఖ్యంగా ఈచలికాలంలో రోజు నూనెరాసుకొని

శ్రీమతి సువేణి కాశ్యప్.

పోసుకోవాలి. నూనె రాసుకొని పెసరపిండినలుగు పెట్టుకొంటే వంటికి చాల మంచిది. రక్తం గూడుకట్టటం అనేదిలేకుండా రక్తం బాగా పారి చక్కని వాయతో అందర్ని ఆకర్షిస్తూ ఉంటుంది మనశరీరం.

ఇదికాకపోతే మరోపద్ధతి చేయవచ్చు. అది ఉప్పు నూనెతో మసాజ్ చేయటం. ఉప్పును మెత్తగనూరి. లేకపోతే **Table Salt** ను రెండు **Tea Spoones** ఒక కప్పులో వేసి దానిలో కొంచెం నీళ్ళు పోసి బాగా ఉప్పంత కరిగిపోయేంతవరకుంచి అందులో ఉప్పునీళ్ళకు రెట్టింపు కొబ్బరి నూనెవేసి పాల తెలుపు వచ్చేంతవరకు చిలకరించి దానితో **Massage** చేస్తే నిస్సందేహంగా శరీరం సాటిన్ లాగ మెరుస్తుంది. ఇందులో కొబ్బరి నూనెకు బదులు ఆలివ్ నూనె వేస్తే బాగా పని చేస్తుంది. ఇలా**Massage** చేసిన తర్వాత శీకాయతోనో, సున్నిపిండితోనో రుద్దుకోవటం మంచిది.

ఇవి చేసినా చేయకపోయినా రోజు స్నానం చేసే గంగాళము నీళలో ఏడెనిమిది బొట్లు కొబ్బరి నూనెవేసి పోసుకోవటం వలన ఉపయోగం చాల ఉన్నది. ఈపద్ధతి వేసవిలో తప్ప ఇతరకాలాలలో చేయాలి.

ఇంకా అందంగా ఉండాలంటే స్నానం చేసే **Tub** లో ఒక ఔన్సు పాలు కలిపి దానితో స్నానం చేస్తే శరీరం పాలు కారుతున్నంతనున్నగ మెరుస్తు, నీడ కనిపిస్తూంటుంది.

ఇక శరీర సౌరభంకోసం కావాలనుకొంటే స్నానం చేసే నీళ్ళలో పన్నీరుగాని మరువంగాని వేసి నానబెట్టి పోసుకోవచ్చును.

స్నానం అయిపోయాక మంచి తువ్వాలతో దేహాన్నంతా శుభ్రంగ తడిలేకుండా తుడుచుకోవాలి. ఇది తెలియని విషయంకాదు. కాని దాని ఉపయోగమెంతో చాలమందికి తెలియకపోవచ్చును తడిలేకుండా తుడుచుకోవటం వలన మనకు తెలియని చిరాకుపోతుంది. అసలు ఇలా కొంచెమెక్కువగ తుడవటంవలన, రుద్దినా, పోని మన్ను పోతుంది. ఇంకా, కొంచెము సేపు తడిలేకపోయినా టవల్‌తో (టర్కీటవల్) తుడిస్తే అదొకరకమైన మెరుపు వస్తుంది,

స్నానము వేన్నీళ్ళతోకంటే చన్నీళ్ళతో చేస్తే ఆరోగ్యంగా ఉంటుంది. ఎప్పుడుపడితే అప్పుడు చేయటంకూడ మంచిదికాదు. ఉదయము సాయంత్రము రెండుపూటలు స్నానం చేసే అలవాటుంటే చేసినందు వలన ప్రమాదం లేదు. అలాంటప్పుడు ఉదయము బాగా శాస్త్రోక్తంగా పోసుకొని సాయంత్రమప్పుడు మామూలుగ తొందరగ పోసుకోవటం మంచిది.

సోపులు వాడేటప్పుడు రోజుకొక క్రొత్తరకం వాడటం అంతమంచిదికాదు. ఒకే సోపు వాడటంవలన శరీరస్థితి ఒకేమాదిరి ఉంటుంది కొన్ని సోపులు దేహాన్ని పెళ్లెట్లు చేస్తాయి అందుకని సోపులు కొనేటప్పుడు జాగ్రత్తగ చూసికోవాలి. మంచి సోపులు, వాడుకలో ఉన్నవి కొనటం మంచిది.

కురుపులు లేచినప్పుడు, ఒళ్లు దురదలు ఉన్నప్పుడు వేప నూనె ఒంటికి రాసుకొని మార్గోసోపులాంటివి రుద్దుకోవటం శ్రేయస్కరం. వేపపుల్లలు కాగేనీళ్ళలో వేసి ఆనీళ్ళు పోసుకొన్నా కురుపులు, చీముమొదలైనవి మాని పోతాయి.

ఇలా రోజు శ్రద్ధతో స్నానం చేస్తే శరీరం సాటిన్ లాగ మెరవటమే కాకుండ చామంతి పుష్పంలాగ చక్కగ ఉంటుంది.





## మనలో మనమాట

# కోడి! ఏమంటావు?

శ్రీమతి లక్ష్మీరఘురామ్

అది ఒక నల్లకోడి. కాళ్ళు కురచ. పొట్టిగా లావుగా వుంది.

డిశంబరు రోజులు. ఇంట్లో మంచి తాజావి కోడి గ్రుడ్లున్నవి. పొదగవేస్తే బాగుంటుందని అన్నది తోట వాడి పెళ్ళాము. సరే నన్నాను.

గ్రుడ్లు పొదగవేసిన వారము రోజులకు మెరుపులు, ఉరుములు మద్రాసులో వాన, కోడి గ్రుడ్లు మురిగి పోతాయి. నీటికోసం ప్రజలంతా అల్లాడి పోతుంటే కోడి గ్రుడ్లు మురిగిపోతే మునిగి పోయిందేమిటి. అనుకున్నట్లే ఇరవై ఒక్క రోజులకు చక్కటి తెల్లపిల్లలు రెండు దిగి నవి. మిగిలిన గ్రుడ్లు మురిగిపోయిన వన్నమాట.

రెండు మూడు రోజులు నూకలు వేశాము. కోడి చక్కగా ముక్కుతో పొడిచి తినటం నేర్పించింది, ఆ పిల్లలు చక్కగా నేర్చుకున్నవి. బేడ్మింటను బంతుల వలె కోళ్ళ గంపలో గుడుగుడు మంటు తిరుగు తున్నవి. గంపవగ్గరకు వెళ్ళి నూకలు వెయ్యబోతే తన పిల్లల నేమైనా చేయబోతున్నామనుకొని ముక్కుతో పొడు స్తుంది. ఆ తీక్షణతచూస్తే అదిఒక రాక్షసివలె వుంటుంది. మాతృప్రేమ అంత శక్తి నిస్తుంద కాబోలు తల్లికి!

పిల్లలు దినదినాభి వృద్ధి పొందుతున్నవి. గంపను వదలి చక్కగా బయట తిరుగు చున్నవి. నల్ల పెట్ట చక్కగా పిల్లలను రక్షింపు కుంటుంది, ఏదైనా ఆహా రము కనబడగానే క్కొ క్కొ క్కొ అని తను తిన కుండా పిల్లలను పిలిచి వాటికి ఆ ఆహారము తినిపించి తాను ఇంకో చోటు ఆహారము వెతుక్కుంటూ పోయేది. కోడి—పిల్లలకు ఇంకా ఒక బారెడు దూరములో నేనుండ గానే రెక్కలు విప్పుకొని రాక్షసివలె వచ్చి మీదపడి ముక్కుతో పొడిచేది. పిల్లలు ఆరు నెలలకల్లా తలంత యినవి, ఇహ తల్లికి పిల్లల బాధ్యతలేదు. దేనిదారి దానిది రెక్కలు వచ్చేవరకంటే ఇదే కాబోలు.

గిర్రున ఏడాది తిరిగొచ్చింది. ఈసారి కోడిని పొద గేద్దామని హెచ్చరించింది తోటవాడి పెండ్లాము. సరే నన్నాను.

చక్కటి తాజా గ్రుడ్లు పదిహేను వేసింది కుంపట్లో. తోటాడి పెళ్ళామూ పిల్లలు గలదే. దాని చెయ్యిరాశే! ఈసారి వానలేదు వరద లేదు. మద్రాసు పంపుల్లో నీళ్ళుంటేనేమి లేకుంటే నేమి, కోడి గ్రుడ్లు 13 పిల్లలయి నవి. 13 మంచి అంకె కాదన్నాడు ఒక ఛాందసుడు.

కోడి పిల్లలు యథావిధిగా గంపక్రింద వేయ బడ్డవి. నూకలు నీళ్ళు పోస్తున్నారుకాని ఈసారి తల్లిలో మార్పు!!

మునుపటివలె ఆహారము చూపుతుంది పిల్లలకి. పిల్లలన్నీ వచ్చి తింటూన్నప్పుడు వేరే స్థలములో ఆహా రము వెతుకుతూ వుంటుంది. దాని వెంటే కొన్ని బయలు దేరుతవి. రెండు మూడుచోట్ల చూపుతుంది. ఇహవేసారి పోతుందేమో బుట్టదగ్గిర నీడలోకి వచ్చి మట్టిలోచక్కగా గురిగెలాకూర్చుంటుంది. సరే ఇంతలో నాలుగైదు పిల్లలు అక్కడికీ తయారే. రెండు వీపుమీద ఎక్కుతవి. ఒకటి ఒక

కాలూ ఇంకొటి ఇంకొక కాలూ పట్టుకు పీకుతవి. ఇంకొకటి కోడి చుట్టూ తిరుగుతూ తిరుగుతూ ఆడు కుంటూ వుంటుంది. బుట్ట పైనుంచి వేసిన నూకలేమయినా ఇరుక్కొని వుంటే పిల్లలు మూడు ఒక్క నూక కోసము ఎగబడుతవి. పాపము కోడి ఏమి చేస్తుంది. కూర్చున్నది కూర్చున్నట్టే ఉన్నది—కొన్నాళ్ళకు వేళ్ళ రక్తము కారటము ఆరంభించినది. టించరువేసి తెల్లగుడ్డ కట్టు కట్టాము టించరు రంగు చూచో రక్తము చూచో కట్టుగట్టిన గుడ్డను కోడి పిల్లలు గాయాన్ని ముక్కుతో పీకి రసాబాసా చేసినవి. ఎన్నాళ్ళున్నా గాయము నయము కాకపోగా ఇంకా ఎక్కువగా రక్తము కారడము ఆరంభించింది. పిల్లలకి వెతకి ఆహారము చూపించటము లేదు. అవే వెతుక్కో నారంభించినవి. ఎప్పుడో ఒకప్పుడు లేచి (దానికిటపికున్నప్పుడు కాబోలు) గప్ చిప్‌గా కాస్త తాను తినేది. పిల్లలను దగ్గరకు పిలిచేది కాదు.

ఏమిటోదాని ఉద్దేశము? పిల్లలు ఆరు నెలలు పెరిగి మునుపటి సారి రెండు పిల్లలు రెండు నెల్లప్పుడు ఎంతున్నవో అంతే వున్నవి. వాటికి తగిన రక్షణలేదు, తల్లెప్పుడో రిసైను చేసినట్లుంది ! గద్ద ఒక పిల్లని, కాకి ఒక పిల్లని వంతుల వంతులుగా వేసికొని పోవుచున్నవి. ఇదివరకువలె ఎక్కడ తిరుగుతున్నా పిల్లలకుహాని చేస్తారేమోనని కనిపెట్టుకొని వుండదు, శత్రువులను వెదకటానికి రాక్షసివలె ఎగరదు !

ఈ మార్పుకు కారణము? కోడి నేర్పిన పాఠము మానవులకు వర్తిస్తుందా?

ఏమో ! ఎటూ తేల్చి చెప్పలేమేమో

చెప్పదలచు కుంటే చెప్పొచ్చునుగాని. ఎందుకు చెప్పటము. ఎవరికి వారే తోచిన నిర్ణయాలు చేసుకుంటే మంచిది.

ఇదంతా మనసో మనసూచేయుమండీ !

# పొడుపు కథలు

శ్రీమతి డి. ఒదరీ నారాయణమ్మ

1. ఉట్టమట్టు సమంవస్తు వస్తునా
మత్రియశ్యాక్షరం చకారాది.
లకారాంతం

2. చాంద్రమానసమాయుక్తం
వస్తునామత్రియశ్యాక్షరం
అకారాది, క్షకారాంతం

3. వృక్షేగ్రవాసీ, నచపక్షిరాజః
చర్మాంగధారీ. నచసోమ
యాజి త్రినేత్రధారీ. నచశూల
పాణింజలంధరిత్రీ నఘటో
నమేఘః

4. ఆరసముసనుండు, నరి పక్షి
యునుకాదు. తోకకలిగి
యుండు మేకకాదు. త్రాడు
కలిగియుండు. తలపెద్దయు
కాదు. దీనిభావమేమి, తెలుపుమలేశ.

5. దేహమంమదేవేంద్రునికంప్లు
తినకు జీవము లేదు. తగు
జీవులనుచంపు. దీనిభావ
మేమి తెలుపుమలేశ

(జవాబులు :— 76 వ పేజీలో చూడండి)





# పండ్లతో పిండి వంటలు

[చాలామంది పాఠకులు పాకకళ శీర్షిక కావలయునని కోరుటచే ఈ శీర్షికను ప్రతినెలా ప్రకటించదలచాము. సం॥]

### అరటిపండు ఫ్రిట్టర్లు

6. అరటి పండ్లు
చిక్కని కొబ్బరపాలు.
2. టేబిలు స్పూన్ల మైదాపిండి
నెయ్యి లేక డాల్డా.

అరటిపండ్లు వలచి, మైదాపిండిలో వేసి, కొబ్బరపాలు పోస్తూ బాగా ముద్దగా పిసకవలయును. చిటికెడు మెత్తని వుప్పు వేయవలయును.

బాండీలో సగానికి తక్కువ గాకుండా నెయ్యి పోసి ఈ పై ముద్దను పకోడీలు వేసినట్లుగా కాగే నేతులో వెయ్యవలయును. రెండువైపులా గోధుమ రంగుకు కాలిన తరువాత జల్లి గరిటతో తీసి, పళ్లెములోనికి పెట్టవలయును. మెత్తటి పంచదార (చక్కెర) వేడివేడి వాటిమీదనే చల్లవలయును.

### మామిడిపండ్ల పుడ్డింగు.

1. పడిపాలు. (పడుంటే తెలుగు దేశములో $1\frac{1}{2}$ శేరు.)
1. టేబిలుస్పూను మెత్తటి బియ్యపు నూక
1. టీ స్పూను ఏలక్కాయల పొడి.
20. బాదం పప్పులు (తోలుతీసినవి)
2. గరిటెలు తోలు తీసిన పిస్తాపప్పు.
6. తియ్యని బాగా పండిన మామిడి పండ్లు.

కొద్దిగా చక్కెర.

పాలు కాచవలెను. పాలు కాగుతూవున్నప్పుడు చక్కెరను, బియ్యపు నూకను పాలలో వేసి కొద్ది మంట మీద వుంచవలయును. పాలు గట్టిపడబోతూవున్నప్పుడు చెక్కు తీసిన మామిడిపండ్ల ముక్కలను ఆ పాలలో వేయవలయును. ముద్దగా అయినప్పుడు అడుగు మాడకుండా జాగ్రత్త పడి పొయ్యిమీదనుంచి తీసి వేరే గిన్నెలోకి పెట్టవలయును. బాదము పప్పులు పిస్తాలు సన్నగా కోసి వాటిని, ఏలకుపొడిని ఆముద్దమీద సమముగా చల్లవలయును. రిఫ్రిజిరేటరు వున్న దానిలో పెట్టిన బాగుండును. లేనియెడల ఆ గిన్నెను చల్లని నీటిలో (బేసినులో నీళ్ళుపోసి) పెట్టవలయును. వేడిగా నున్నప్పుడు రుచిగా నుండదు. చల్లబడిన తరువాతనే తినవలయును.

కె. ల. ర.



# గ్రంథ సమీక్ష

★

## శ్రీ శారదా మణి

శ్రీ శారదాశత వార్షికోత్సవ ప్రచురణం.

రచన: శ్రీ పి. గణపతిశాస్త్రి. ప్రకాశకులు; శ్రీ రామ కృష్ణమతాధ్యక్షులు. రాజమండ్రి ముద్రణ: ఆంధ్ర పత్రికా ముద్రణాలయం. వెల: అర్థరూపాయి.

"పూజ్యురాలు. లోకోత్తర చరితా అయిన శ్రీ శారదా మాత జీవితం ఎల్లరికు సులువుగా బోధపడేటట్లు సులభ మైన వ్యావహారిక భాషలో వ్రాసి. సరస రచనానిపుణులగు గ్రంథకర్తగారు తెలుగు పాఠకలోకానికి కానుకగా ఇస్తు న్నారు. శ్రీ శారదామణి జీవితంలాగే శాస్త్రిగారి రచన అతి సరళమై, రసభరితమైంది. ఇది తెలుగు పాఠకుల హృదయాన్ని ఆకర్షించి. వారిజీవితాల్ని ప్రకాశవంతమూ ధన్యమూ చేస్తుందనడంలో సందేహం లేదు."

## మణి దీపిక

రచనా, ప్రకాశకులూ. ముద్రణా పైవారే. ఇది పద్య కావ్యం. ఇతివృత్తం: భక్తిప్రబోధమై శ్రావ్యమైన ముక్త కాలతో "మాతృదేవి" స్మరణ. వెల: 0—8—0

## బాలహిత బోధిని

గ్రంథకర్త్రి శ్రీమతి చవలవాడ నాగరత్నము. 78 రత్నాల్లాంటి పద్యాల్లో రత్నాల్లాంటి నీతులిమిడ్చేరు. బాల బాలికలకు హితబోధ కుపకరించే గ్రంథరాజం. ప్రాథమిక పాఠశాలల్లో పాఠ్య గ్రంథంగా నుంచితే కవయిత్రి కృషి సాఫల్య మౌతుంది. వెల: 0-2-6 లభించేచోటు: చవ లవాడ కోటి నరసింహము. పరసత్యాళ్ళూరు పోస్టు. సత్తెనపల్లితాలుకా--గుంటూరుజిల్లా. కె. సు.

## గోపురం మామయ్య.

(గేయసంపుటి)

ప్రాప్తిస్థానం —— బుక్‌మన్స్. మద్రాసు.

అనాదినుంచి ఆంధ్రదేశంలో నయితేనేమి, అఖిలభార తావనిలో నైతేనేమి విద్య, సంస్కారము సాంప్రదాయ సిద్ధంగా వుంటూనేవుంది. నన్నయభట్టుకాలానుంచీ ఆంధ్ర సాహిత్యం గ్రంథస్థమౌతూనూ వచ్చింది. పురాణాలు మొదలుకొని పుక్కిటి గాథలవరకూ ప్రజలలో బహుళ వ్యాప్తమౌతూనే వచ్చింది. అందులో బాలబాలికలకు వుప యోగపడే సాహిత్యం గ్రంథస్థం కాకపోయినా, లేక పోలేదు. పాడేపాటలు ఆడే ఆటలరూపంలోనే కాకుండా చెప్పుకునే కథల రూపంలోకూడా వుంటూనేవుంది. ప్రతి పాటా- ప్రతి పద్యం—ప్రతికథ పిల్లలకు సుబోధకంగానూ వుండడమే కాకుండా శీలవంతులైన భావిపౌరులుగా చేయ గలిగిన సమర్థత దానికి లేకపోలేదు. అయినప్పటికి యితర దేశీయుల బాలసాహిత్యం మనం దిగుమతి చేసు కోవలసిన అవసరంలేదని నేననునుగాని, యిటీవల బాలబాలి కల నిమిత్తం ప్రచురింప బడుతున్న చందమామ బాల యిత్యాది పత్రికలలోని బాలసాహిత్యానికి యీ ప్రకృత గేయసంపుటి యేమంత వన్నెతెచ్చుటలేదు.

అన్యదేశీయుల సాహిత్య మనువదించుటలో అదిమన జాతీయతకు అనుగుణ్యంగా వుండాలి. అటువంటి పదాలు యేరుకోవాలి. ఇతివృత్తం అన్యులదైనా పాత్రసృష్టి మన జాతీయతకు దగ్గరగావుండి తీరాలి. అలా రచనపడనప్పుడు మనకి అన్యదేశీయుల సాహిత్యం వుపకారం కన్నా అప కారమే యెక్కువ చేస్తుందేమో!

## శ్రీ జగద్గురువు-వేంకటేశ్వర నక్షత్రమాల

(శ్రీ శంకరగురుచరితము రచయిత-కుమారి సుందరి)

బాలకవయిత్రి కుమారి సుందరి పద్యకావ్యముగ రచిం చిన శ్రీ జగద్గురు శంకరభగవత్పాదుల చరితము శ్రీ వేంకటేశ్వర నక్షత్రమాల రెండును చదివాను, చాలాశ్రా వ్యముగ నున్నవి. తొలిప్రయత్నంలోనే పెద్దల మన్నన లకు పాత్రురాలైన యీ చిన్న ఆంధ్రకవయిత్రికి మా ఆంధ్ర మహిళ ఆశీస్సులు—చెప్పుకుంటూవున్న యీ వయ స్సులోనే యింత ప్రసన్నతాశయముతో కవనము చెప్ప గలిగిన యీ కుమారి సుందరి ప్రౌఢమైన ప్రబంధ రచన కూడ సాగించ గలదనుటకు మాకెట్టి సందేహమునులేదు

జి. సుందరీ శంకరం.

 పొడుపు కథలకు జవాబులు:_ 1. చక్రాలం, 2. అప్పడం, 3. వంకాయ, 4. గాలిపడగ, 5. వల.

# ఆంధ్ర మహిళ

వ్యవస్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

యెం.యే., బి.యెల్.,

సంపాదకురాలు :

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

సంవత్సర చందా ఆరు రూపాయిలు

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో ముద్రితము.

# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: మార్చి 55 :: సంచిక 11





సంవత్సరచందా :: :: ఆరు రూపాయలు.




సంపుటి 11 :: మార్చి 55 :: సంచిక 11

# అఖిల భారత మహిళా సభ

ఈ మాసారంభములో ఫాల్టానులో అఖిల భారత మహిళా సభలు మామూలు ఆర్భాటోత్సాహములతో మహావైభవముగా జరిగినవి. యావద్భారత దేశమునుండేగాక సిలోను, టర్కీ, పాకిస్థాను, అమెరికా స్త్రీలును సభలలో పాల్గొనిరి. క్రొత్తగా అధ్యక్షురాలుగా నెన్నుకొనబడిన, అతి సమర్థురాలని అందరి ప్రశంసలుబడసిన, శ్రీమతి లక్ష్మీ మీనను నలుబది జతల ఎడ్లు కట్టిన రథములో ఊరేగించి గౌరవించిరి.

అథిదులందరికి చక్కని ఏర్పాట్లు ఫాల్టాను (పూనాకు షుమారు ఏబది మైళ్ళ దూరములోనున్న అతి పురాతన స్టేటు) రాజాగారి సతీమణి, శ్రీమతి లక్ష్మీబాయి నాయక్ నిమ్భాలకర్ చేసిరి. ఆమెను, ఆమె పెద్ద కోడలు శ్రీమతి నిర్మలాబాయి నాయక్ నిమ్భాలకర్ స్వయముగ అథితులందరికి ఏర్పాట్లు ఎప్పటి కప్పుడు సరిగాజరుగు చున్నదీ లేనిదీ గమనించి బహు శ్రద్ధతో అన్ని ఏర్పాట్లు చేయుచుండిరి.

సభలో చర్చించిన ముఖ్యవిషయములు : ఆఫ్రికా, ఆసియా స్త్రీల సభలు ఏర్పాటు చేయవలయుననియు, యావద్భారతములోను ఏకైక వివాహ వయఃపరిమితి ఏర్పాటుచేయవలయుననియు, ప్రతి పెళ్ళి తప్పక రిజిస్టరు కావలెననియు, వివాహ స్త్రీలను ఆడ్మినిస్ట్రేటివు సర్వీసులో నిషేధిస్తూ ప్రభుత్వము నిర్ణయించినందుకు నిరసనచేస్తూ తీర్మానములు చేయబడెను. అ. భా. మ. స. డీలిమిటేషను కమిటీలవారి అభిప్రాయము ప్రకారము కొన్ని రాష్ట్రిము లను విభజించిరి. అందు ఆంధ్ర రాష్ట్రిమును రెండు భాగములుగా విభజింపవలయునని సూచించిరి. వారి సూచన ప్రకారము నెల్లూరు నుండి ఉత్తరపు జిల్లాలు (సర్కారు జిల్లాలు) ఒక భాగముగను, దత్తమండలపు జిల్లాలు మరియొక ప్రాంతముగను విభజించమనిరి. దీనికి అసమ్మతి తెలుపుచూ ఇదివరకే ఆంధ్రరాష్ట్రి మహిళాసభ తెలియ పరిచినను తిరిగి ఈవిషయము మొన్నటి సభలో చర్చింపబడెను. ఆంధ్రరాష్ట్రి స్థాయీసంఘ సభ్యురాలీవిషయము తీవ్రముగా ప్రతిఘటించవలసివచ్చినది. మహారాష్ట్రి, గుజరాత్, బెంగాలు, పంజాబు, రాజస్థాను రాష్ట్రిముల వారును తమ తమ రాష్ట్రి విభజనలకు అసమ్మతి తెలియపరచిరి. ప్రస్తుతమునకు ఏ నిర్ణయము జరుగకుండా వాయిదా వేసిరి. ఇప్పటికి రాజకీయ వేత్తలు తెచ్చిన ప్రాంత విభజన ఆంధ్రులు సతమౌతూ వున్నది చాలక తిరిగి మహిళాసభవారును ఈ క్లిష్ట పరిస్థితులకు దోహద మివ్వబూనుట చాలా విచారకరము. ఆంధ్ర రాష్ట్రి మహిళాసభవారి సలహాను గుర్తించి మన రాష్ట్రి విభజన వరకైన పరత్యజించగలరని మనము ఆశించవలసియున్నది.



ఆంధ్ర మహిళాగాన సభ

రాజమహేంద్రవరము.

స్థాపితము 1934 సం॥

# 24 వ వార్షికోత్సవము

గానకళ కధిదేవత సరస్వతి. అది మహిళామణుల సొమ్ము. ఆంధ్రావని యందు విద్యనభ్యసించుట కనేకయవకాశము లున్నవి కాని గానకళ నభివృద్ధి పొందించుట కెట్టి యవకాశములు కానవచ్చుటలేదు. సాహిత్యమెంత యవసరమో సంగీతముకూడ నందఱికి నవసరము. కనుక సాహిత్యమునకు వలె సంగీతమున కట్టి ప్రాధాన్యమీయవలయును. ఏలనన "శిశుర్వేత్తి పశుర్వేత్తి గాన రసం ఫణిర్వేత్తి" అనుటవలననే దానియందు గల యాధిక్యత, యానందము వ్యక్త మగుచున్నది.

ఆంధ్ర దేశమున పురుషుల యాధిపత్యమున నిర్వహింపబడు గానసభలు కనబడుచున్నవి కాని మహిళల [illegible] గానరావు. ఆ కొఱతను దీర్పబూని 1934 సం॥న నాశము సుశీలమ్మగారిచే నెలకొల్ప బడినది. నాటినుండియు నెక్కడెక్కడిగాయనీమణుల నన్వేషించి, వారలకు ప్రోత్సాహ మొసంగి వారలకట్టి యవకాశమిచ్చుటయేగాక, తమశక్త్యావుటచే నెరవేరుటలేదు. కాన స్త్రీ లందఱు మెంబర్లుగజేరియు పురుషులు విరాళములొసగియు సహకరించి, సత్వరమున నయ్యెది దినదినప్రవర్ధమానమై విరాజిల్లి మా యీ యాశయముల తీర్పగలందులకు భగవంతుఁడు మాకు తోడ్పడుగాత !

ఇట్లు,

సహాయ కార్యదర్శిని

ఉ. ధా. ప్ర. వి. హేమలత

## రచయితలకు మనవి

* మాకు కథలు, గేయాలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థ

* రచనలు ప్రచురించని వానిని త్రిప్పి పంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపు, అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

* రచనలు కాగితానికి ఒకే వైపు సిరాతో వ్రాసి పంపాలి.

* రచనలు మాకుచేరిన విషయాన్ని తెలియపర్చలేము.

* సమీక్షకు గ్రంధాలు పంపేవారు రెండు ప్రతులు పంపవలసినదని మనవి.



శ్రీమతి గుంటూరు సుందరమ్మగారు మన మహిళా సభ యావజ్జీవ సభ్యురాలు 22—1—55 మరణించిరని తెలుపుటకు విచారించు చున్నాము. వారి కుటుంబమునకు మా సానుభూతి. వారి ఆత్మకు శాంతి చేకూరుగాక.

# జానపద సంగీతము

శ్రీ పప్పు సోమేశ్వరరావు బి. ఏ.

జనపద మనగా పల్లి. జానపదులనగా పల్లీయులు. వారు వాడుకొను గీతములే జానపదగీతములు. దీనినే గ్రామ్య గానమని కూడ యందురు. శాస్త్రీయ సంగీతము కొన్ని ప్రాంతములలో మాత్రమే అభివృద్ధి పొందినది. కాని ఈ జనపద సంగీతమన్ని ప్రాంతములలో ఉన్నది. ఇది ప్రాచీన సాంప్రదాయకముగా వర్ధిల్లుచున్నది ఇది శాస్త్రీయ సంగీతముకంటె పురాతనమైనది. అన్ని దేశములలోను దీని లక్షణము, సుమారు ఒకే విధముగ నుండును. దీని సాహిత్యము ద్రాక్షా పాకమున సులభ శైలిలో యుండును. కాని శాస్త్రీయ సంగీత రచనల ఇందు వాగ్గేయ కారకుల పేర్లు తెలియవు. త్యాగరాజు తన కాలములోని జానపద గేయముల లక్షణమును, తన దివ్య నామ సంకీర్తనలు, ఉత్సవ సాంప్రదాయకములైన కీర్తనలు మొదలగువానిలోని ఉపయోగించెను. దక్షిణ హిందూ దేశము ఈ జానపదగేయముల కాటపట్టు.

ఈ పాటలు సంగీత విద్యావిహీనులకు కూడ పాడుట కనుగుణముగా నుండును. వీని సాహిత్యము సర్వ సామాన్యమైన వ్యవహార విషయములతో గూడి యుండును. ఈ సంగీతము ప్రతి గ్రామమునందును, కాననగును. శాస్త్రీయ సంగీత మభ్యసించుటకు మేధా వంతులు గావలెను. కాని ఈ సంగీతమున కట్లుగాదు. పారిశ్రామికులందఱకును తమ జీవితములోని కష్టముల నన్నిటిని దొలగించి, జీవితమును ఆనందదాయకముగా జేయునవి జానపదగేయములు ఇవి భక్తిని, నీతి జ్ఞానములను కల్గించునవియై యుండును. ఇందుకొన్ని శృంగార భావ యుక్తములై కూడ యుండును,

ఈ గీతముల సంచారము ఒక స్థాయికి మించి యుండును. ఇవి శాస్త్ర బద్ధముగా ఉండవు. ఇవి అపూర్వ రాగములలో గాని, ప్రతి మధ్యమ రాగములలో గాని యుండవు. ఎల్లప్పుడును శుద్ధ మధ్యమ రాగముల యందే యుండును. ఇందు సంగీతము కొద్దిగా నుండి, సులభముగను, శ్రావ్యముగాను ఉండును. ఈ గేయములు సాధారణముగా చాల చరణములు గల్గి అన్ని చరణములకును ధాతువు ఒకే రీతిగా నుండును. పాటలలో పల్లవి, అను పల్లవి, చరణము యను భాగములు గూడ గలవు. ఈ పాటలలో సంగతులు గాని, గమకములు గాని ఎక్కువగా ఉండవు. ఇవి సాధారణముగా సులభమైన తాళములలోను, లలితమైన రాగములలోను, ఉండును. ఎక్కువగా "గపల"లో నుండును.

ఈ గ్రామ్య గీతములు రెండు విధములు:—

1 అనింద్య గ్రామ్య గీతములు. 2. అనింద్య గ్రామ్యగీతములు నింద్యా గ్రామ్య గీతములు మోటుగా ఉండును. ఈ పద్ధతి పాటలు గ్రామములలో కూలి చేసుకొనువారు పాడుదురు. ఇందు విషయము బహు మోటుగా నున్నను వినువారికింపలి సంగీతము ఇంపుగా ఉండును. అనింద్య గ్రామ్య గీతములు, నాగరికముగా నుండి, శాస్త్ర సమ్మతములగు రాగములందే యుండును. ఈ అంశములను బట్టి జానపదగీతములను ఈ క్రింది విధముగా విభజింపవచ్చును.

1, నీతిదాయకములైన పాటలు:—

ఇవి సంఘము నందలి మానవులు ప్రవర్తించవలసిన నీతులనుద్బోధించును.

ఉ॥ "అత్తమామలపట్ల— అతిభక్తి కలిగుంటె
పాటించిన దీపావళి పండుగ— పదినాళ్ళుంటె
దావామరుదుల పట్ల— భయభక్తి కలిగియుంటె
నాటికి నిన్నుతో శ్రైత్తును."

2. భక్తిరసప్రధానమైన పాటలు:—

ఇవి దైవ ప్రార్థన పాటలు, భజనపాటలు గూడ నిట్టివే.

3. వేదాంతము బోధించు పాటలు:—

ఉ॥ 1. "ఏమిజన్మం బేమిజీవనము
ఈ మాయకాయము "

2. "తారకము సూపెరుగవలెనన్న
సద్గురుని కృపచే— చేరిమోక్షము నొందవలెనన్నా"

ఇదికాక తెలుగు నుపికారముగల సామెతలతో నిండి యుండు పాటలు కలవు.

4. కరుణరస ప్రధానమైనవి:—

ఉ॥ ఓ గుత్తాల గోపిరెడ్డి
దాచేపల్లికి- దహనమైతివా

'సేరు సేరు యెండిమురుగులి- సేతులకుబెట్టుకుని
కట్టవమీద వస్త్రావుంటే-కలకశేరనుకొంటినేకొడకా
వయ్యారి కొడుకా- బంగారుకొడకా.''

5. శృంగారరస ప్రధానమైనవి: —

రసములన్నిలో శృంగారరసమే ప్రధానమనియు, సహజ మనియు, కావ్యమునకు జీవమనియు, వినుచుందుము. సంఘములో అమాయక ప్రేమ, దేశప్రేమ, మిత్ర ప్రేమ, మొదలగువానిచేత, ఉత్తేజము పొందినపుడు మానవ హృదయమునుండి వెలుపడునవే ఈ గీతములు.

ఉ॥ 1. "కళ్ళకాటుకపెట్టి కడవా చంకానుబెట్టి
కంటినీరు కడవ నిండెను గదరా
చల్ మోహనరంగా నీకునాకు జోడుకలసెను
గదరా."

2. "కొట్టకుండ తిట్టకుండ వుంచుకుంటనూ"
మరి సల్లంగ, మెల్లంగ నువ్వుంటవా"

6. వీరరసపూరితములై చరిత్రాత్మకములైనవి :—బొబ్బిలి, పల్నాటి యుద్ధములు, జంగమ కతలు, కాటమరాజు, మనుసిద్ధి మొదలగు పొంబల కథలు గొల్లసుద్దులు, వీని యందు వీరరసము దేశభక్తి, క్రోధరసము, రాజనీతి, యుద్ధనీతి మొదలగువానిని విశదీకరింపబడి యుండును. ఈ రోజులలో అట్టివి బుర్రకథల రూపకములో నున్నవి.

7. కర్షక గీతములు :— నాట్లు వేయువారు కోతలు కోయువారు, కుప్పలు నూర్చువారు, వారికాయ కష్టములను మరచి బనిచేయుటకీ పాటలను బృందగానెము సేయుదురు. వీటిలో ప్రకృతి సౌందర్యము, తమ పంట చేల వర్ణన మొదలగునవి యుండును.

ఉ॥ 1. వులితోలుతో నీకు పాన్పుగావింతునే
నాగుబాములతో నీకు వడ్డాణమేతునే
రావేరావే భామ చెంచీతా
రమణి ముద్దులగుమ్మ చెంచీతా."

2. నాటుపెట్టవె తుమ్మెదా—చేలు నవరసులు
పండాలి తుమ్మెదా.
పచ్చపచ్చనిచేలు తుమ్మెదా—మంచి పసిడి
పరవాలమ్మ తుమ్మెదా"

8. వృత్తిపాటలు :— పడవలాగువారు, రోడ్డు రోలర్లు ఈడ్చువాడు, బండివాళ్ళు, బోయిలు, బరువుమోయువారు, బట్ట లుతుకునారు, వడ్లుదంపువారు, తమ శరీరశ్రమను మఱచుటకు ఊతముగా పాడు పాటలిట్టివి.

ఉ॥ "జంబైలె—జోరులంగరు
జోరులేదు — బారూలేదు
లాగర బాయి — తెల్లవారె"

9. వినోదగీతములు :— ఇవి కేవలము కాలయాపకొరకు వినోదముగా పాడుకొను గీతములు

ఉ॥ 1. "నేరంగమెళ్ళి పోతానె—నారయణమ్మ"

2. చందమామ, చందమామ, నెలచందమామా
నీ సందెటి నెలకొన్న ఓరంగధామా"

కోలాటము పాటలు, గొబ్బిపాటలు గూడ నీ రకము పాటలే.

10. హాస్యరసయుక్తమైన పాటలు :— వీనియందు హాస్యరసము చిందులు త్రొక్కుచుండును.

ఉ॥ 1. "కూకుంటె నెగనేవు కూరకుతెపనేపు
తాత నీకెందుకురా పెళ్ళి"

2. "సోగ్గాడో నాచిన్నినాయనో సగంకాలమన్న
తీరలేదు సోగ్గాడికి
సుక్కబొట్టు బెట్టుకుని సూరుకిందికూసుంటే
సుంచుపిల్ల దన్నికెళ్ళె సోగ్గాణ్ణి"

11. పౌరాణిక గీతములు :— లంకాయాగము ఊర్మిళనిద్ర శ్రీ కృష్ణ జననము, లక్ష్మణస్వామి మూర్ఛ, పాముపాట మొదలగు ఇట్టివి.

12. క్రీడా గీతములు :— బాల బాలిక లాడుకొను నప్పుడు గీతములు ఈ జాతిలోనికి వచ్చును.

ఉ॥ 1. "కొండమీద వెండిగిన్నె కొక్కెరాయి కాలు
విరిగె"

2. "కాళ్ళగజ్జి కంకాలమ్మ.

13. సాంఘికము లైనవి :- అనగా పెండ్లిపాటలు, వరుస పాటలు, వంటపాటలు, మేజువాణిపాటలు, బంతులు పాటలు, మంగళహారతులు, తలుపుపాటలు, అప్పగింత పాటలు, మొదలగునవి ఇట్టివి.

14. గృహ గీతములు : - జోలపాటలు, లాలిపాటలు, మేలుకొలుపులు పాటలు, ఇట్టివి. ఇవి సాధారణముగా, నీలాంబరి ఆనందభైరవి, భూపలరాగములలోయుండును. ఈ పాటలు దక్షిణహిందూదేశములో ప్రతిభాషయందును కలవు.

15. కొండజాతి పాటలు : - దక్షిణ హిందూ దేశములో కొండజాతివారు వారి వారి ప్రత్యేకమైన పాటలు కల్గి

యుందురు. ఈ పాటలలో ఆ జాతివారి పూర్వులను గూర్చి వారి చరిత్రనుగూర్చి పెక్కుచరణములలో పాడుదురు. సంవత్సరాది మొదలగు పండుగులలో వారు ప్రత్యేకాభి మానముగల బృందగేయములను పాడుదురు.

16. పురాణము భగవద్గీత మొదలగు కావ్యములకుఆంధ్రీకరించిన గేయములు చాలాగలవు. ఇవి తత్వమునుగూడ బోధించును ఈ రోజులలో హరికథలిట్టివి.

17. జనసమ్మూహ కీర్తనలు :- భజన కీర్తనలు, దివ్య నామ సంకీర్తనలు కుమ్మికోలాటములు ఇట్టివి.

18. బిందుపాటలు :- అనగా సంస్కృత పదములగు చఃదస్సుకు చెందియుండును. ఈవిధమగుపాటలు పెక్కుచరణములతోకూడి, ఒకేధాతువును కలిగియుండును.

ఉ॥ "కావడి బిందు"

19. విద్యా విషయక గీతములు :- రంగు పద్యములు, సైన్సుపాటలు ఈరకమునకు చెందినవి.

ఉ॥ 1. "పార్వతీపతి తెల్పు పాలసముద్రముతెల్పు
కామధేనువుతెల్పు కంచుతెల్పు"

2. "చిన్నచిన్న ఈగలు చిట్టితెనెటీగలు
చేరిసంఘముగను చేయుతెనెపట్టును
కట్టుతెనెపట్టును"

ఇట్లు వివిధ శాఖలకు జెందిన ఈ జానపద గేయ వాఙ్మయము తెలుగువారికి గల ఒక గొప్ప వారసత్వపు ధనమని చెప్పవచ్చును. తెలుగువారి సామాన్య ప్రజా జీవిత వ్యవహార, కళ, రహస్య, వినోదాభి రుచులను, మనోహర పద్ధతులలో వెలియబుచ్చి శ్రోతలకు హాయిని గూర్చు లలిత సంగీతముతో సులభ సాహిత్యముతో అందిచ్చు ఈ గేయములు తెలుగుదేశమందంతటను అల్లి బిల్లిగ అల్లుకొని యున్నవి. అట్టివానిని వెదకి వెదకి సేకరించి భద్రపఱచుట నేటి నాగరికుల కర్తవ్యము. మూల్యమైన ఈ ప్రాచీన విజ్ఞానమునందు ఇప్పటికైనను కొంత అభిరుచి కల్గికొందఱు సేకరింప బూనుకొనుట తెలుగు దేశమునకు శుభా వహమని చెప్పవచ్చును,

కాని ఇంకనుకావలసినంత కృషిజరుగనేలేదనియు పరిశోధకులు ఇంకనూపరిశ్రమచేసి వీనిని పూర్తిగాసేకరించి పుస్తకరూపమునశాశ్వతముగా భద్రపరుపవలెననియు నా అభిప్రాయము.

# తమ్ముడా

కొట్లకుదురు
శ్రీమతి కామేశ్వరమ్మ

కొట్లకుదురు
శ్రీ రాజశేఖరరెడ్డి

రెడ్డిరాజులు ధీవిశాలురు
కొండవీటిలో కొంతకాలము
ఏలినారు ఏకధాటిక
ఎరుగవోయి తమ్ముడా !

వారుఏలిన కోటలన్నియు
నేటివరకు నిలిచి భువిని
రెడ్డివీరుల వీరశౌర్యము
చాటుచున్నది తమ్ముడా !

వారుగట్టిన కోటగోడలు
వారు నడచిన కాలిబాటలు
కొండవీటి గొప్పతనము
కోరి తెల్పును తమ్ముడా !

వారు చేసిన ఘోరయుద్ధము
నిలిచిపారెను నెత్తుటేర్లై
తలచుకుంటె గుండెపగిలి
తల్లడిల్లును తమ్ముడా !

ఎట్లనయిన హత్యచేయగ
యుక్తిపన్నిరి శత్రుమూకలు
చివరికేమొ ఖర్మకాండం
సలిపినారూ తమ్ముడా !

వండివార్చి యున్నదనియు
విందులారగించ రమ్మని
ఉక్కుకత్తుల బావికేమరి
ఒప్పజెప్పిరి తమ్ముడా !

కళకళలాడుచు కాంతులుజిందె
కోటల్లోన చీకటులాయె
పసిడిపొలాలు పాడిపంటలు
మాసిపోయెను తమ్ముడా !

వృక్షజాతులు విధినిదూరెను
ఆలమందలు గోలపెట్టెను
పుత్రహానికి పొక్కి పొక్కి
పృథివి ఏడ్చెను తమ్ముడా !

ఆంధ్ర మాతకు అనుగుబిడ్డలు
భరతమాతకు ధీరసుతులు
పృథివిమీదను పసిడితునకలు
రూపుమాసిరి తమ్ముడా !

ధరణికోట ధర్మచక్రము
దేశమేలిన రెడ్డివంశము
వారికీర్తి వసుధయందు
వాతగాంచెను తమ్ముడా !

ఆంధ్రభాషకు వెలుగునిచ్చి
ఆంధ్రజాతికి ఖ్యాతిగూర్చిన
కొండవీటి రెడ్డివీరుల
పొగడ తరమా తమ్ముడా !

కొండవీటి వీరగాథ
సూర్యచంద్రులు వెలుగుదాక
చరితయందు మాసిపోవదు
చెప్పనేటికి తమ్ముడా !



# రాజకీయాలు

శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు.

1955 జనవరి నాలుగో వారం మొదలుకుని ఫిబ్రవరి మూడో వారం వరకూ జాతీయ, అంతర్జాతీయ రాజకీయ రంగాల్లో నడిచిన ప్రముఖ సంఘటనలివి— సోవియట్ ప్రధాని మాలెంకోవ్ రాజీనామా, ఫార్మోజా ప్రాంతంలో పోరాటాలు చెలరేగటం, మధ్యప్రాచ్య దక్షిణ ఒప్పందాలకు పశ్చిమ రాజ్యమిత్రుల సన్నాహాలు, తిరుకొచ్చి రాష్ట్రంలో పి.ఎస్.పి. మంత్రివర్గ పతనం, బియ్యం ఎగుమతులను కేంద్రం స్వేచ్ఛగా అనుమతించటం,

సోవియట్ ప్రధాని మాలెంకోవ్ ఫిబ్రవరి 8 వ తేదీన తన పదవికి రాజీనామా ఇచ్చారు. వ్యవసాయ విధానంలో లోపాలకు తన అనుభవ శూన్యత కారణమని ఆయన తెలియజేశారు. ఆనాడే రక్షణ మంత్రి మార్షల్ బుల్గానిన్ ప్రధాని అయినారు. యుద్ధకాలంలో పేరుకెక్కిన ప్రసిద్ధ సేనాని మార్షల్ ఝుకోవ్ రక్షణ మంత్రి అయినారు. మాలెంకోవ్‌కు ఉపప్రధాని పదవీ, విద్యుచ్ఛక్తి శాఖా ఇవ్వబడింది. అంతర్జాతీయ వ్యవహారాల్లో తమ విధానంలో మార్పు ఉండదనీ, తమ దేశంలో భారీపరిశ్రమలకూ, వ్యవసాయానికి విశేష ప్రాధాన్యత ఇవ్వబడుతుందనీ క్రొత్త ప్రధాని ప్రకటించారు.

స్టాలిన్ మరణానంతరం సోవియట్ స్వదేశ, విదేశ విధానాల్లో కొంత మార్పు వచ్చింది. పశ్చిమరాజ్యాలతో కొంత సౌమ్యంగా వ్యవహరించటం, ఇండియావంటి తటస్థరాజ్యాల ప్రాముఖ్యతనూ. నిజాయితీని గుర్తించటమన్నది విదేశ విధానంలో కనిపించిన మార్పులు. స్వదేశంలో వ్యక్తి స్వేచ్ఛను పెంచటానికీ, సుఖజీవనానికి కావలసిన వస్తువులను సప్లయి చేయటానికీ జరిగిన ప్రయత్నాలు ముఖ్యమయినవి. విదేశీయులు సోవియట్ ప్రాంతాల్లో తిరిగి చూసేందుకు ఎక్కువ అవకాశాలు ఇవ్వబడ్డవి. విదేశీయులతో పెళ్ళిళ్ళపై ఉన్న నిర్బంధాలు సడలించబడ్డవి. మత స్వేచ్ఛకు దోహదం చేసే నిమిత్తం, మతాన్ని నిందించే ప్రచారం చేయకుండాజాగ్రత్త పడాలని కమ్యూనిస్టు పార్టీ సభ్యులకు పార్టీ హెచ్చరికచేసింది. ప్రజలకు జీవిత నిత్యావసర వస్తువులను అధికంగా సప్లయి చేసే నిమిత్తం ఆపరిశ్రమలకు ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వబడ్డది.

రష్యా, చైనాల సౌమ్యవిధానంవల్లనే ఇండోచైనా వంటి సమస్యలకు ఒక పరిష్కారం అంటూ కుదిరిందని ఆ సమస్యల్లో ఆ దేశాల వైఖరినే ఇండియావంటి తటస్థ దేశాలు హర్షించటంవల్ల చెప్పటం సాధ్యపడుతున్నది. పశ్చిమరాజ్యాల వైఖరి మాత్రం దీనికి తగినట్లు సమాధానపూర్వకంగా లేదని కొరియా మధ్యవర్తిగా ఇండియా పొందిన అనుభవం వల్లనూ, చైనామీద చాంగ్‌కైషెక్ చేత దండయాత్రలు జరిపించటంవల్లనూ, ఇరాక్, పాకీస్థాన్, సయాం వంటి దేశాలను కూడగట్టి సైనిక కూటములను ఏర్పాటు చేయటంవల్లనూ, జర్మనీని సాయుధం చేయ నిశ్చయించటంవల్లనూ, ఇండో చైనా యుద్ధవిరమణ ఒప్పందానికి విరుద్ధంగా దక్షిణ వీట్నాంవంటి దేశాలను సైనిక కూటమిలోకి మార్చ ప్రయత్నిస్తున్నందువల్లనూ నిరూపింపబడుతున్నది. పశ్చిమరాజ్యాల్లో బ్రిటన్ మొదలైనవి అమెరికా దూకుడును తగ్గించ ప్రయత్నిస్తున్నవి కాని. చివరకు దానికే లొంగిపోతున్నవి. రష్యా, చైనాలు ప్రతిపాదిస్తున్న అగ్రరాజ్య నాయకుల సమావేశాలను పశ్చిమరాజ్యాలు బుట్టదాఖలు చేస్తున్నవి.

ఈకారణాల మూలంగా కమ్యూనిస్టుదేశాలు తిరిగీ ఆత్మరక్షణకోసం అభ్యుదయాన్ని వాయిదా వేసుకోక తప్పదనే అభిప్రాయానికి వచ్చినవి. ప్రజల నిత్యావసర పదార్థాల పరిశ్రమలకు ఇస్తున్న ప్రాధాన్యతను తగ్గించుకుని భారీ పరిశ్రమలకూ, వ్యవసాయానికీ ప్రాధాన్యత

## రా జ కీ యా లు

ఇవ్వవలసివస్తున్నది. రష్యాలో వ్యవసాయోత్పత్తి ఉండవలసినంతగా లేకపోవటానికి కారణం ఉమ్మడి సాగుబడే నని చెప్పబడుతున్నది. అధికోత్పత్తి కోసం అక్కడ సహకార వ్యవసాయానికే ప్రాధాన్యత ఇవ్వటంకూడా ఇకముందు సాధ్యమే. సొంత ఆస్తి అనే భావాన్ని పూర్తిగా నిర్మూలించటానికిగాను ఉమ్మడి సాగుకే ప్రాధాన్యత ఇవ్వాలా, లేక అధికోత్పత్తికోసం పరిమిత భూస్వామ్యాన్ని అంగీకరించి సహకార సాగుబడిని కోరాలా అనే ప్రశ్నకు ఇంతవరకూ సోవియట్ నాయకులు మొదటి దారినే తొక్కుతున్నారు. పరిశ్రమల్లో ఆధునిక యంత్రాలను ప్రవేశపెట్టటంవల్ల ఉత్పత్తి పెరిగినప్పటికీ దానివల్ల వచ్చే నిరుద్యోగమనే చెడుగును తప్పించేందుకు నెహ్రూ ప్రభృతులు దానిని ప్రతిఘటిస్తున్నట్లే, సోవియట్ నాయకులుకూడా వ్యవహరిస్తున్నారు.

మాలెంకోవ్ రాజీనామా సోవియట్ నాయకుల్లో సౌమ్యవాదుల వెనుకంజ అనీ చెప్పవచ్చు ; పశ్చిమరాజ్య కూటమిలో అమెరికన్ శఠవాదుల గెలుపు అనీ చెప్పవచ్చు. విదేశదాడులవల్ల హిందూసమాజం సంకుచితం కావటం ప్రపంచ పురోభివృద్ధికి ఎంత హానికలిగిందో, ఇప్పుడు సోవియట్ సౌమ్యవాదుల వెనుకంజ అంతకన్నా ఎక్కువ హానికలిగిస్తుంది. ఎందువల్లనంటే ఇదివరకు హైడ్రోజన్ బాంబులు లేవుకనుక.

* * *

మాలెంకోవ్ రాజీనామా కేవలం సోవియట్ నాయకుల్లో అంతఃకలహంగానే జమకట్టటానికి చాలామంది వెనకాడటంలేదు. పశ్చిమరాజ్యనాయకులు చేసిన పెద్ద పొరబాటు ఇదేననీ, దీనివల్ల ప్రపంచ శాంతికి గొప్ప అవకాశాలను వాళ్ళుచేతులారా జారవిడుచుకున్నారనీ బ్రిటిష్ లేబర్‌పార్టీ వామపక్షనాయకుడు బెవాన్ విమర్శించారు.

* * *

చైనాలో అంతర్భాగమయిన ఫార్మోజానూ, దాని పరిసరదీవులనూ చేతిలోనుంచి జారిపోవటానికి అమెరికా ఇష్టపడటంలేదు. వాటి రక్షణకోసం సాయుధ బలాలను సిద్ధపరిచింది. చాంగ్‌కైషెక్ పేరుతో చైనామీద దాడులు జరుపుతున్నది. అక్కడ 'యుద్ధవిరమణ' జరిపించటానికి పశ్చిమరాజ్యాలు భద్రతామండలి ద్వారా ప్రయత్నించింది. సమితిద్వారా చర్చించేందుకు చైనా అంగీకరించలేదు. సమితితో నిమిత్తంలేకుండా అగ్రరాజ్య సమావేశం జరిపి ఈవిషయాన్ని చర్చించాలని రష్యా, చైనాలు సూచించినవి. భారతప్రధాని నెహ్రూ ఈ సూచనను సమర్థించారు.

ప్రపంచశాంతికోసం, ప్రపంచజనాభాలో నాలుగోవంతు జనాభాను ఐక్యరాజ్య సమితిలో ప్రాతినిధ్యం లభించటంకోసం, 'చాంగ్‌కైషెక్' నాటకానికి స్వస్తి చెప్పటం అవసరమని ఇండియా మొదటినుంచి గుర్తించే ఉన్నది. అయితే ఇటీవల స్వయంగా చర్యలు తీసుకొనటం ఆరంభించింది. ఆసియా ఆఫ్రికా సమావేశానికి చాంగ్ ప్రభుత్వానికి ఆహ్వానం పంపలేదు. ఇటీవల ముస్సోరీలో జరిగిన ఆసియా ప్రాంతీయ దేశ, వాతావరణ పటచిత్రణ మహాసభలో కొమింటాంగ్ ప్రతినిధులకు స్వస్తి చెప్పాలని తనకై తాను ప్రతిపాదించింది. అయితే పశ్చిమరాజ్య ప్రాబల్యంవల్ల ఫలితంలేకపోయింది.

* * *

ఇండియా చెప్పిన తటస్థ విధానాన్ని అనుసరిస్తున్న దేశాల్లో ఈజిప్టు ముఖ్యమయింది. పశ్చిమరాజ్య సమాజ పద్ధతుల్లో విశ్వాసం ఉన్నప్పటికీ, స్వదేశంలో కమ్యూనిస్టులంటే గిట్టకపోయినప్పటికీ ఈజిప్టుప్రభుత్వనాయకులు మధ్యప్రాచ్యంలో సైనిక కూటములు ఏర్పరిచేందుకు పశ్చిమరాజ్యాలు చేస్తున్న ప్రయత్నాలను తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు. టర్కీతో ఇరాక్ ఒప్పందం చేసుకుంటే అరబ్ జాతులన్నిటికీ ప్రమాదమని హెచ్చరిస్తున్నారు.

ఆగ్నేయాసియా ఒప్పందం దేశాలు ఆప్రాంతంలో ఒక స్థిర సైన్యాన్ని, విమాన బలాన్ని ఏర్పాటుచేయాలని ఆలోచిస్తున్నవి. ఈ బలాలు ఆదేశాల ఆంతరంగిక పరిస్థితుల్లోకూడా అవసరమయితే వాడబడుతవని బాహాటంగా సూచించబడుతున్నది.

ప్రధాని నెహ్రూ లండన్‌లో కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో ఫార్మోజా సమస్యపై హెచ్చరికచేశారు. ఈజిప్టులో ఆగి, ఆనాయకులతో వివిధ సమస్యలనూ చర్చించివచ్చారు.

* * *

ఫిబ్రవరి నెల 8 వ తేదీన తిరుకొచ్చి రాష్ట్రంలో పి.ఎస్.పి. ప్రభుత్వం కూలిపోయింది. ఆంధ్రాలో కాంగ్రెస్ ప్రభుత్వాన్ని పడదోసిన కె.ఎల్.పి. ఇప్పుడు తిరిగి

కాంగ్రెసుతో కలిసినట్టే, అక్కడ కాంగ్రెసు ప్రభుత్వాన్ని పడదోసిన తమిళ కాంగ్రెసు తిరిగి కాంగ్రెసులో కలవటం వల్ల కాంగ్రెసుపార్టీ తిరిగి ప్రభుత్వం ఏర్పాటుచేసింది.

తిరుకొచ్చిలో తాను పిళ్ళె మాంత్రిక వర్గం పడిపోయే ముందు కొందరు పి. ఎస్. పి. సభ్యులు పార్టీలో నుంచీ చీలిపోయినారు. ఇందులో వాళ్ళ స్వార్థం ఎంత ఉన్నదో, అంతగానే పి. ఎస్. పి. పార్టీ బలహీనతకూడా అంత ఉన్నది. శోషలిస్టు పద్ధతి సమాజాన్ని స్థాపిస్తానని కాంగ్రెస్ చేసిన తీర్మానం పి. ఎస్. పి. లోని మితవాదులకు చాలా అనుకూలించింది. కేవలం సిద్ధాంతరీత్యా చూసు కుంటే పి. ఎస్. పి. కి కాంగ్రెస్‌తో అట్టే తేడా ఏమీలే కుండా పోతున్నది. ఆపార్టీ దేశంలో ఉన్న ఇతర వామ పక్షాలు వేటి సహకారాన్ని పొందలేక పోతున్నది. ఈ పరిస్థితి పార్టీ మనుగడకే ప్రమాదకరంగాతయారయింది.

రాంమనోహర్‌లోహియా, ఆచార్య నరేంద్ర దేవ, మధులిమాయే ప్రభృతులు ఆవడి కాంగ్రెస్‌తీర్మానం లోక వంచనకే నని వాదిస్తున్నారు. అశోక్‌మెహతా ప్రభృతులు కాంగ్రెసుతో సహకరించాలని వాదిస్తున్నారు. ఈ ధోరణి చూస్తే అశోక్‌మెహతా పి. ఎస్. పి. లో నుంచి నిష్క్ర మించినా ఆశ్చర్యం ఉండనక్కర్లేదనిపిస్తున్నది,

మన పొరుగు దేశమయిన నేపాల్‌లో ప్రజాస్వామ్యం వెర్రితలలు వేస్తున్నది. ఎన్నికలు లేకుండా, నిజమయిన అధికారాలు లేకుండా, ఒక నామినేటెడ్ సలహా సమితిని ఏర్పాటుచేసి, నామినేటెడ్ మంత్రివర్గంతో నాటకం సాగు తున్నది. ఎన్నికలుజరిపి నిజమయిన అధికారాలతో శాసన సభను ఏర్పాటు చేయాలని నేపాల్ కాంగ్రెస్ వంటి సం స్థలు ఆందోళన జరుపుతున్నవి. ఇంతలోనామినేటెడ్ సభ లోనే చీలికలు ఏర్పడి కోయిరాలా ప్రభుత్వానికి ఓటమి మీద ఓటమి వచ్చింది.

నేపాల్ యువరాజు రీజంటుగా సర్వాధి కారాలనూ తీసుకుని ముందు మంత్రివర్గానికి స్వస్తి చెప్పకుండా, నామినేటెడ్ సభను రద్దుచేసారు. దేశంలో ఉన్న పార్టీలన్నీ తమ వివరాలను తనకు తెలియజేయాలనీ, అప్పుడు వాటి లో ఏవి ఉండదగినవో నిర్ణయించి, మిగిలిన వాటిని నిషే దిస్తానని ఆయనగారు ప్రకటించారు.

ఆంధ్రరాష్ట్రానికి రెండో పంచవర్ష ప్రణాలిక 324 కోట్ల ఖర్చుతో తయారయింది. ఇందులో విద్యుచ్ఛక్తికి 3246 లక్షలు, నీటి పారుదలకు 204.75 లక్షలు, వైద్యా నికి 312 లక్షలు, విద్యకు 3610 లక్షలు ప్రత్యేకించబడ్డవి.

మొదటి పంచవర్ష ప్రణాళికలో చేర్చవలసిన నంది కొండ ప్రాజక్టు నిర్మాణానికి ఈ సం॥ కేంద్ర బడ్జట్‌లో ఏర్పాటు ఉండగలదని తెలుస్తున్నది.

ఈ నెలలో 1955 - 56 రైల్వే బడ్జట్ ప్రతిపాదించ బడ్డది. అందులో 150 మైళ్ళలోపు ప్రయాణపు చార్జీలు పెంచ ప్రతిపాదించ బడ్డది. ఆంధ్ర రైల్వేల అభివృద్ధి కార్యక్రమాల్లో గూడూరు - రేణిగుంట బ్రాడ్‌గేజ్ మార్గం నిర్మాణం, బొబ్బిలి - సాలూరు మార్గాన్ని తిరిగివేయటం విజయవాడ యార్డు పునర్నిర్మాణాలకూ, గూడూరు - విజ యవాడ డబుల్‌లైన్, విశాఖ - భీమునిపట్నం - వాల్తేరు డబుల్‌లైను, నిజామాబాద్ - రామగుండం, మార్గాలసర్వే లుకూ, విశాఖ పట్టణం రేవు అభివృద్ధికీ డబ్బు కేటా యించబడ్డది,

ఫిబ్రవరి 4 వ తేదీన కేంద్రప్రభుత్వం బియ్యపు ధరలు పడిపోకుండా చేసేందుకు స్వేచ్ఛగా ఎగుమతులను అను మతిస్తూ, ఎగుమతి సుంకాన్ని మణుగు ఒకటికి 0- 2 -3 కి తగ్గించింది. కాని ఆంధ్రదేశంలో చిన్నరైతులు యావ న్మందీ జనవరి మొదటికే తమ పంటలను అమ్మివేసు కున్నారు కనుక, ఈ ఏర్పాటు వాళ్ళకేమీ లాభించకుండా పోయింది. కేంద్రప్రభుత్వం వ్యవసాయ ధరలను కాపాడే పద్ధతి ఇదే అయితే చాలా కష్టమే.



# కర్షకా

శ్రీమతి కే. శే. అయ్యగారి రాఘవమ్మ

దున్నవోయీ కర్షకా ॥నీదుక్కి॥

ఆకలితో ఈలోకమంతా
అలమటించు చున్నదోయి
సస్య శ్యామలమైన భూమిని
చల్లగా వర్ధిల్లజేసే
భోగభాగ్యాలందజేసే
భాగ్యనేతవు నీవెనోయి :

రతనాల రాజనాల
రంగైనవరిచేల
బంగారు పాడిపంటల
బిర బిర కురిపింపవోయీ
పాడిపంటల ఫలితమిచ్చే
భాగ్యనేతవు నీవెనోయి
నీసంతసమె మావంతదీర్చుము
నిలచి చల్లగ గ్రామసీమ
మబ్బులవె ఆకాశమంతా
మెరపులవిగో గాంచుమోయి
పాడుమోయి భరతవాక్యము
భారతీయుల భాగ్యనేత.

## శ్రీమతి డోరిన్ కెలోగ్ నీల్‌గారు

ఉపాధ్యక్షులు, రామక్రిష్ణా & వివేకానంద కేంద్రము, న్యూయార్కు; అమెరికా.

మొన్న 23-2-55 బుధవారము ఆంధ్ర మహిళా సభ జూచుటకు వచ్చిరి. వారు సభ అంతయు చూచిరి. సభలో జరుగుచున్న కార్యక్రమమంతను అతి శ్రద్ధతో గమనించి, ఆంధ్ర మహిళాసభవారిని అభినందించుచు సభకు రూ 95 లు వారి కానుకగా నిచ్చిరి. ఇందులో రూ 25 లు నర్సింగ్‌హోమ్‌కని ఇచ్చిరి.

ప్రేమపూర్వకముగా నిచ్చిన వారి పారితోషమునకు ఆంధ్ర మహిళా సభ్యురాండ్రు కృతజ్ఞులు.

# ★ భావసంకీర్తనము ★

కవిరాజహంస, కవికులాలంకార బాలాంత్రపు వేంకటరావు.

సీ. వలపు బుట్టిన వచ్చి వ్రాలదా యెలదేటి !
పూవు పిల్చునె తన్ను బొట్టుపెట్టి ?—
చివురు లెత్తినఁ జూచి చేరదా కోయిల !
యెలమావి పిల్చునే యాలఁగొట్టి ?—
వెన్నెలఁ గని పొంగు వెట్టదా కలశాబ్ధి !
జాబిల్లి పిల్చునే సైగఁగొట్టి ?—
మెఱుపుదోచిన వేచి పురివిప్పదా కేకి !
కేరునేమబ్బు కేకిసలుగొట్టి ?—

భక్తి భావ కీర్తనముల పట్టులరసి
ప్రేమలోవచ్చి ననుఁబల్కరింతుగాక !
కూర్మి నాతోడ నిటనాడుకొందుగాక !
పేర్మియే నిన్నురమ్మని పిలుచుట ప్రభు !

సీ. నింగి నవ్వులునించె నినుఁగాంచి కాకున్న
మిలమిల చుక్కలేమిటికిఁదోఁచు ?—
వేని పుల్కలొలయించె నినుఁగాంచికాకున్న
మృదుల తాంతఁబు లేమిటికిఁదోఁచు ?—
నీరధి మినుముట్టె నినుఁగాంచికాకున్న
పటుతరంగంబు లేమిటికిఁదోఁచు ?—
నేల పట్టముగట్టె నినుఁగాంచికాకున్న
నిటు సస్యల ఝుమ్మ లేమిటికిఁదోఁచు ?—

ప్రకృతి నిన్నుఁగాంచి భ్రమియించెఁగాబోలు !
కాకయున్నఁ బ్రణయగాథ లేల ?
విశ్వమెపుడు నిన్ను వేడుఁగాఁబోలుఁ, గా
దేని ప్రణవగానమేటికి ప్రభు !—

# అఖిల భారత మహిళా సభ

అఖిలభారత మహిళాసభ 24వ వార్షికోత్సవము ఫల్టన్‌లో ఫిబ్రవరి నెల 2వ తేదీ జయప్రదముగ జరిగినది. 250 మంది ప్రతినిధులు వివిధ రాష్ట్రముల నుండి మహాసభకు హాజరైరి. లంక, టర్కీ, పాకిస్తాను దేశములనుండి ప్రతినిధులు వచ్చిరి. అంతర్జాతీయ మహిళాశాంతి, స్వాతంత్ర్య సంస్థ కార్యదర్శిని స్విట్‌జర్లండ్‌నుంచి ఒక ప్రతినిధిని పంపెను. డాక్టర్. రాజేంద్ర ప్రసాద్, డాక్టర్ రాధాకృష్ణ, పండిట్ నెహ్రూ, అన్ని రాష్ట్రముల రాజప్రతినిధులు, ముఖ్యమంత్రులు సందేశములు పంపిరి. పాత అధ్యక్షురాలిని, క్రొత్త అధ్యక్షురాలిని, ఆహ్వాన సంఘాధ్యక్షురాలిని అలంకరింపబడిన 40 జతల ఎద్దులచే లాగబడిన బండియందు కూర్చుండబెట్టి ఉత్సవముచేసిరి.

నూతనాధ్యక్షురాలైన శ్రీమతి లక్ష్మీమీనన్ గత 50 సంవత్సరములనుండి అఖిలభారత మహిళాసంఘం, ఏ విధముగ స్త్రీల సాంఘిక ఆర్థిక, నైతికాభివృద్ధికొరకు పాటుబడుచున్నది, ఈనాడు మన రాజ్యాంగ చట్టము మనకెలా సర్వహక్కుల నిచ్చుచున్నది. ఏవిధముగ ఇంకను, దేశరక్షణ శాఖమున్నగువాటిలో స్త్రీలను తీసికొనకున్నారో, చెప్పుచు, ప్రస్తుతము మనకున్న హక్కులు పోకుండ, ఇతరులు ఉపేక్షించకుండ, ఉల్లంఘించకుండ జాగ్రత్తగ ఉండవలెనని హెచ్చరించిరి. రక్షణశాఖమున్నగు ఇతర పరిపాలనా శాఖలలో యింతకుముందు స్త్రీలకు తావు లేకున్నను, మన రాజ్యాంగ చట్టము, పురుషులతో సమముగ ఆయాశాఖలయందు పనిచేయుటకు హక్కు నిచ్చినదికాని ఈసంవత్సరం దానికి ఒక అడ్డుకలిగినది - వివాహిత స్త్రీ ఆయాసంస్థలయందు పనిచేయరాదని. ప్రతి స్త్రీ జీవితములోను వివాహమనునది తప్పనిపడికట్టు. కావున వివాహము స్త్రీ అభివృద్ధికి అడ్డురాకూడదు. ఇట్టి శాసనములు లేకుండ మనము అడ్డుపడవలెను. చట్టము నుండి తీసివేయించవలెనని చెప్పిరి.

ప్రత్యేక వివాహ చట్టము నంగీకరించి భారత ప్రభుత్వము దేశీయమైన న్యాయచట్టమునకు మార్గమేర్పరచినందుకు సంతోషించవలెనని, హిందూ వివాహ చట్టము రాజ్యసభలో పాసయి, లోకసభకు వచ్చుచున్నదని, ఇన్‌టస్టేట్ బిల్లు పార్లమెంటులో ప్రవేశపెట్టబడబోవుచున్నదని చెప్పుచు స్త్రీలలో యింకను ఎక్కువ విద్యావ్యాప్తి కావలెనని, స్త్రీల కళాశాలలు చాలతక్కువైన కారణంగా స్త్రీ ఉపాధ్యాయనులకు ఉద్యోగములు దొరుకుటలేదని, ప్రభుత్వములు, స్త్రీల విద్యవిషయమైన కార్యక్రమము తీసికొనునప్పుడు ముందుగ స్త్రీల సంస్థలసలహా తీసికొనిన బాగుండునని చెప్పిరి.

దేశభాష, దేశీయ విద్యావిధానముపై ఆధారపడివున్నదని, ఈవిషయములో అ.భా.మ.సం. ఇప్పుడు చేయుచున్న దానికన్న, ఇంకను ఎక్కువగా సహాయపడగలదని, శాంతి ప్రియురాలైన భారతదేశము తన కుమార్తెల ద్వారా శాంతి సందేశము, కరుణ, కనికరముతోనిండిన విద్యచే మూల, మూలల నింపవచ్చునని చెప్పుచు, ఆర్థికావస్థచే అంతర్జాతీయ కార్యక్రమములయందు పాల్గొనుట స్త్రీలకు కష్టముగనున్నదని, యితరదేశములయందు స్త్రీలు అంతర్జాతీయ సంస్థలలో పాల్గొనుటకు ప్రభుత్వములేవీలు కల్పించుచున్నవని, మనముకూడ, ఈవిషయమై స్త్రీలు అంతర్జాతీయ కార్యక్రమములలో పాల్గొనుట, సభ్యులగుట మనదేశ శ్రేయస్సుకేనని మన ప్రభుత్వమును నమ్మించి, ఒప్పించవలెనని చెప్పి ముగించిరి.

ముఖ్యతీర్మానములు :

1. అ.భా.మ.సం, 24 వ మహాసభ ఆఫ్రో-ఏసియన్ మహాసభ 1956 మొదటిలో జరుపునట్లు తీర్మానించి శ్రీమతి అవాబెన్‌వాడిలూను కార్యదర్శినిగా వివిధ దేశములతో సంప్రతించి, ఏర్పాట్లు చేయుటకు నియమించిరి.

2. అ భా.మ.సం. వారు గోవా ప్రజలు సంపూర్ణ స్వాతంత్ర్యమునకై జరుపు పోరాటమును హృదయపూర్వకముగ బలపరచుచున్నది.

3. అ.భా.మ.సం. కాలనీలలో నివసించు ప్రజల స్వాతంత్ర్య సమరమును పూర్తిగ బలపరచుచు, విదేశ మహిళా సంస్థలన్నియు పూర్తిసహాయమివ్వవలెనని కోరినది.

4. అ భా.మ.స. వారు, భారత ప్రభుత్వము, ఇతర విదేశ ప్రభుత్వములు తమ, విదేశాంగ రాజ్యనీతికి ప్రధానసూత్రముగ పంచసూత్రమును ఆమోదించినందుకు అభినందించిరి.

5. రాబోవు ఏప్రిల్ నెలలో, ఇండోనీసియాలో జరుగనున్న ఆఫ్రో ఏసియన్ మహాసభ జయప్రదముగ జరుగవలెనని కోరినారు.

6. అ.భా.మ.సం వారు, గ్రామాల అభివృద్ధికై, గ్రామ స్త్రీలయందు చలనము కలిగించుటకు, స్వేచ్ఛాపూర్వక మహిళాసంస్థల సభ్యుల సభ జరుపవలెనని కేంద్ర ప్రభుత్వమును ప్రోత్సాహముచేసిరి.

7. 2 వ పంచవర్ష ప్రణాళికకు సంపూర్ణమైన ప్రత్యేక కార్యక్రమమును యివ్వవలెనని, ఈవిషయమై స్వేచ్ఛాపూర్వక మహిళా సంస్థల సలహాను కేంద్ర ప్రభుతము తీసికొనవలెనని, కోరుచు తీర్మానించిరి.

8. గ్రామవాసుల గృహాభ్యుదయమునకు, మహిళా సంస్థల సలహాను సరించి, కమ్యూనిటీప్రాజెక్టు అడ్మినిస్ట్రేషనువారు కొద్ది అవధిలో తర్ఫీతునిచ్చునట్లు కనీస కార్యక్రమము నేర్పరచవలెనని, అట్టి తర్ఫీతు నిచ్చు స్వేచ్ఛాపూర్వక సంస్థలలో అ.భా.మ.సం. ఒకటని, ప్రభుత్వము గుర్తించవలెనని తీర్మానించిరి.

9. ప్రాజెక్టు ఏరియాలో పనిచేయుటకు ఈ స్కీము క్రింద శిక్షణ పొందిన స్త్రీలను వెంటనే తీసికొనుటకు ప్రభుత్వము ఏర్పాటు చేయవలెనని కోరిరి. ఈస్త్రీలకు నివసించుటకు సరియైన స్థలము దొరకనిచోట, ముఖ్యముగవారికి వర్కింగు గర్ల్సు హోము కట్టించవలెనని, అవే డిమాన్‌స్ట్రేషన్ సెంటర్లుగా పనికివచ్చునని తీర్మానించిరి.

10. అ.భా.మ.సం వారు, గ్రామ పంచాయితీలలో, ఇతరలోకల్ డెవలప్‌మెంటు ఏజన్సీలలో ప్రభుత్వము స్త్రీలకు ప్రాతినిధ్యమివ్వవలెనని తీర్మానించిరి.

11. హిందూ ఇన్‌టస్‌టేట్ సక్‌సెషన్ బిల్లు సర్వ జనులకు తెలియునట్లు పబ్లిసిటి యివ్వవలెనని, ఈవిషయములలో లీగల్ ఏయిడ్ స్త్రీలకు ఉచితముగ యివ్వవలెనని తీర్మానించిరి.

శ్రీమతి పుష్పాబెన్ మెహతా (ఢిల్లీ) ప్రధాన కార్యదర్శినిగాను, శ్రీమతి జాబ్‌వాలా (బొంబాయి) కోశాధ్యక్షిణిగాను ఏక గ్రీవముగ ఎన్నుకొనబడిరి.

ఉపాధ్యక్షులు :

1. శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారు.
2. శ్రీమతి లక్ష్మీబాయినాయిక నింబర్‌కర్‌గారు,
3. శ్రీమతి సరోజినీ మెహతాగారు.
4. శ్రీమతి హుస్సేన్ అలీఖాన్‌గారు.
5. శ్రీమతి ముజుందారుగారు.
6. శ్రీమతి ప్రభాబెనర్జీగారు.

మెంబర్సు - ఇన్ - చార్జి :

అంతర్జాతీయము - శ్రీమతి రక్షశరన్
కాన్‌స్టిట్యూషన్ - శ్రీమతి కిట్టీశివరావు
లా - శ్రీమతి మిఠన్‌లామ్
శిశుసంక్షేమము - శ్రీమతి కమలాబాయినింబ్‌కర్
ఉద్యోగములు - శ్రీమతి కుందురాణీగంధే
ఆఫ్రికా ఆసియాసభ- శ్రీమతి అవాబెన్‌వాడిలు

కుమారి సి. వి. లక్ష్మీరెడ్డి,
కార్యదర్శిని.
అ.భా.మ.స. ఆంధ్ర శాఖ.

---

## అడ్రసు మార్పు

ఆంధ్ర సంక్షేమ సంఘము ఆఫీసు, 5, సేంతోము హైరోడ్డు, మైలాపూరు, మద్రాసు 4 కు మారినది. గమనించవలయును.

---

# ఆంధ్ర మహిళ

శ్రీ తోట రామకిషన్ ఐ. ఎ. ఎస్ సి.

భారతావని కెల్లను భారమొసగ
పాప కార్యాలు సల్పిరి పాపులెల్ల
తుంచి వేయుచు వచ్చిరి తప్పులెల్ల
ఆంధ్ర నారీమరతనాలు ఆదినుండి

సుమతి సావిత్రి మున్నగు సతులు యిచట
పావనంబైన భారత ఫాలమందు
జనన మొందిరి ఎంతయో జయము గలుగ
వీర నారిమ తల్లులు వీడి రిచట

తమదు ప్రాణము లెంతయో తేజరింప
ఝాన్సి లక్ష్మీబాయాది మాజనలు లెల్ల
జనన మొందిన దయ్యె యీ జయపుగడ్డ
భరత నారీమ తల్లుల ప్రతిభ వెలుగ

భరత నారిమ తల్లుల ప్రభలు వెలుగ
పావనంబైన చరితతో ప్రతిభ గాంచి
సాటివారిలో మేటిగ సానదేలి
మెఱుగు లిచ్చిరి చరితకు మిక్కుటముగ

అందమునంది శిందికలనందీ ఘనంబున ప్రేమమీరగన్
డెందమునందు నెంతయును సందము నందము వృద్ధిపొందగన్
కందకకైవడిన్ సతులు కాంచతో భర్తలగా రవంబునన్
మెండుగ చేయుచుండిరిల మేలుగ సేవలుయల్ల వేలలన్

భారతదేశ మందెచట భాగ్యపు శీలపు మాతలుండిరో
గారము మీరగన్ మిగుల కార్యపు శీలులు ఎందరుండిరో
భారతదేశ మెంతయును భాగ్యపు కాంతుల వృద్ధినొందటన్
భారత నారులెల్లరును పాయగ వచ్చిన పాడిగాదటే

మూలం : టాల్‌స్టాయ్ !

# "దాగని సత్యం"

శ్రీ అడవి కనకరాజు

ఆక్సెనోవ్ భార్య కతడంటే ప్రాణం.

ఆక్సెనోవ్ భార్య, అతడు బూట్లుదులుపుకుంటూంటే ప్రక్కన నిలబడి అన్నది. "మీరీ వారం సంతకు వెళ్ళకండి! రేపు వలసిన సరుకులు పట్నంలో తెచ్చుకోవచ్చు. నా మాట వినండి!"

అతడామె ముఖంలో కదోలా చూశాడు. అంతవరకూ అతనిలో రేగిన ఉత్సాహం క్షణకాలం నిశ్చేష్టితమైంది.

"ఏం? ఆదేం? ప్రతివారం వెళ్తున్నానుగా! అల్లాగంటున్నావేం?" అని అడిగాడామెను.

ఆమె దీనంగా ముఖం పెట్టి అతడికేసి చూసింది. అతడు బూట్లు దులుపుకోటం క్షణం ఆపి, ఆమెముఖంలోని వేదనకుకారణం ఊహించటానికి ప్రయత్నించాడు.

"రాత్రినాకు కలవచ్చింది. అందులో మీరు నెరసినజుట్టుతో ఏదో అపదలో ఉన్నట్లు కనిపించారు. ఎందుకో నా హృదయం క్షోభిస్తోంది. ఏదో అపశకునం నా మనస్సును కలవరపెడ్తోంది. వద్దు వెళ్ళకండి!"

ఆమె ముఖంలో ఆవేదన అంతకంతకు అధిగమించి పోయింది. ఆమెవచ్చి, అతని చేతిలోని బూట్లు గట్టిగా పట్టుకుంది. ఆమె మాటలు విని కేవలంగా ఒక చిరునవ్వు నవ్వాడు.

"పిచ్చిదానా! ఈ మాత్రానికే ఇంత కలవర పడ్తావెందుకూ? కలల కర్థం పర్థం లేదని తెలుసుకో. ఏమీ బాధ పడకు. రేపు సాయంత్రాని కల్లా వచ్చేస్తాగా!" అతడు మెల్లిగా ఆమెను బుజ్జగించాడు. కాని ఆమె వేదన ఏమంతగా తగ్గలేదు.

"ఐనాఎందుకు? పోనీ మానెయ్యకూడదూ? పోనీ నామీదనన్నా కనికరం ఉంచండి! నా మాట వినండి."

"కాదు ఏదో అర్థంలేని కలల్ని ఆధారంగా చేసుకొని అపశకునం అంటావేమిటి వెర్రిదానివి! నేనీ రోజున ఎంత ఉత్సాహంగా ఉన్నానో తెలుసా! రేపు సాయంత్రానికి నీకు సిల్కుచీరా, బుజ్జిగాడికి సూటు తీసుకు వద్దామని నిన్నట్నుంచీ కలలు గంటున్నాను. బాధ పడకు!" అని భార్య నూరడించాడు. ఆమె తిరిగి మారు పలుకలేక అల్లాగే నిలబడి పోయింది.

అతడు కులాసాగా ఈలవేసుకుంటూ పనులన్నీ ముగించుకున్నాడు. కోచ్ సిద్ధం చెయ్యమని నౌకరును కేకేశాడు. క్షణంలో కోచ్ వచ్చి గుమ్మంలో నుంచుంది. అతడు భార్య సమీపంగా వెళ్ళి "ఎందుకంత బాధ చెప్పు! మరివస్తా! సంతోషంగా ఉండు!" అని ఆమె గడ్డం నిమిరాడు. ఆమె నయనాల్లో నిలచిన రెండశ్రుబిందువుల్ని అతడు కళ్ళారా చూచాడు. ఆమె బేలతనానికి విచారించాడు. ఆమె దీన వదనంతో మెట్లమీద నిలబడి కోచ్ పోయిన దిక్కుకు అది అదృశ్య మయ్యేదాకా

చూచింది. తరువాత అశ్రుపూరిత నయనాల్ని వత్తుకుంటూ మెల్లిగా అడుగులు వేస్తూ లోపలికి వెళ్ళి పోయింది. ఆక్సెనోవ్ ఆమె చర్యల్ని చూసి "పాపం ! బేల !" అనుకున్నాడు మనస్సులో.

ఆక్సెనోవ్‌కు ఆ కుగ్రామంలో రెండుభవనాలు, ఒక అంగడీ ఉన్నాయి. వాటి మీద లభించే ఆదాయంతో అతడు భార్యా బిడ్డలతో చాలా ఖులాసాకాలం గడుపుతున్నాడు. ప్రతి వారం అతడు సమీపానఉన్న పట్నపు సంతలో తన అంగడికి కావలసిన సామగ్రి ఖరీదు చేసి తెచ్చు కోవటం అలవాటు. ఈ పర్యాయం కూడా అతడట్లాగే సంతనాటికి ముందురోజు సాయంత్రం గుర్రపు బగ్గీలో ప్రయాణం అయాడు.

గుర్రపు గిట్టలు ఒక లయలో మధురంగా వినవస్తున్నాయి, ఆక్సెనోవ్ సన్నాగా ఈల వేస్తూ, మరుసటిరోజు సంతలో తను కొనబోయే జాబితా మననం చేసుకుంటున్నాడు లోలోపల.

కోచ్‌వాలా ఏదో పాట పాడుతున్నాడు. కోచ్ పచ్చటి పైరు పొలాలమధ్య తెల్ల త్రాచులా మెలికలు తిరిగిపోయే రహదారినను సరించి, సామాన్య వేగంతో సాగిపోతోంది. ఆక్సెనోవ్ హఠాత్తుగా, క్రమక్రమంగా వెనక్కు జారుకునే బాటని చూస్తూ ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు.

చీకటి పడేటప్పటికి బండి ఒకపల్లెకు చేరింది. ఆక్సెనోవ్ అక్కడ ఒక సత్రంలో బస చెయ్యదల్చుకున్నాడు. ఆ సత్రంలోనే పట్నం పోయే వర్తకులంతా బస చేసే అలవాటుంది. రాత్రి గుర్రాన్ని సావడిలో కట్టించి, తను గదిలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు. తనకి వలెనే సంతకు బయలుదేరిన మరొక వర్తకుడు తన గదిలోకి వచ్చి పలకరించాడు ఆక్సెనోవ్ అతనితో కాలక్షేపం చెయ్యాలనుకున్నాడు. రాత్రిపన్నెండైనాక. వారిద్దరూ సంభాషణ ముగించి, తమ తమ గదుల్లో నిద్రించారు.

ఇంకా తెల్లవారలేదు. మసకచీకటిలో మంచు తెరలు తేలియాడుతున్నాయి. మంచు భారానికి గడ్డి మొక్కలు కొలదిగా స్పందిస్తున్నాయి. ఆక్సెనోవ్ అలవాటు ప్రకారం వేకువనే లేచి, స్నానానంతరం బగ్గీకట్టించి, సత్రపు యజమానికి సుంకం చెల్లించి ప్రయాణమయ్యాడు.

బండీ పట్నం చేరింది. అక్కడ మరొక సత్రంలో అతడి బస ఏర్పాటైంది. ఆక్సెనోవ్ చాలా ఉత్సాహంగా ఉన్నాడు. బండి గుర్రాన్ని కట్టి కోచ్‌వాలాని పంపించి, తను కుర్చీలో కూర్చున్నాడు. కొద్ది క్షణాలు గడిచాయి. అతడి వీనులకు ఏవో బూట్ల ధ్వనులు వినవచ్చాయి. ఆ ధ్వని క్రమక్రమంగా తనగదివైపే వస్తోంది. వచ్చేసింది. ఇద్దరు పోలీసులు,మరొక అధికారి గబగబా అతడి గదిలో ప్రవేశించారు. ఆక్సెనోవ్ తెల్లబోయి నిలబడి చూస్తున్నాడు. అతడి ఉత్సాహమంతా క్షణంలో మాయమైంది.

"ఎక్కణ్ణుంచి వస్తున్నారు మీరు ?" అని అడిగాడు అధికారి. ఆక్సెనోవ్‌కి ఏమీ అర్థం కాలేదు. ప్రక్క పల్లెనించి వస్తున్నట్లుగా తెలిపాడు.

"రాత్రి మీ బసఎక్కడ?" మొదలైన ప్రశ్న పరంపరతో ఆక్సెనోవ్ తబ్బిబ్బయిపోయాడు. మెల్లిగా అన్నింటికీ సమాధానాలిచ్చాడు. అప్పుడా అధికారి చెప్పాడు.

"రాత్రి మీ ప్రక్క గదిలోని వర్తకుడొకడు హత్య చెయ్యబడ్డాడు. అతడు రాత్రి పన్నెండు గంటలవరకూ మీతో గడిపాడని సత్రపు యజ

మాని చెప్పాడు. మీ సామాను సోదా చేయాలి."

హత్య అనేటప్పటికి ఆక్సెనోవ్ ఉలికిఉడ్డాడు. తను హంతకుడా? అతడి శరీరం కంపించింది. ఒక్కసారిగా అతనే పాతాళంలోకో క్రుంగిపో తున్నట్లుగా భావించాడు. అతడి ముఖం వికారంగా తయారైంది.

"క్షమించాలి... నేనేమీ ఎరగను. అతడు రాత్రి పన్నెండు గంటలవరకూ నాతో గడపిన మాట వాస్తవమే. తరువాత నేనాతడ్ని చూడ లేదు." ఇంతలోకే ఒక రక్షకభటుడతని సంచీ పరికించాడు. అందులోనుంచి ఒక నైజారు బైటకు తీశాడు. దానిమీద రక్తపు మరకలు న్నాయి.

ఆక్సెనోవ్ చేష్టలుడిగి పోయాడు. అతని హృదయం వేగంగా కొట్టుకొంటోంది. అతడికే క్షణంలో ఏం జరగబోతుందో అంతా అయోమయంగా ఉంది. లేడి పిల్లలాగ అతడు భయ కంపితుడౌతున్నాడు. తన సంచిలోకి రుధిరమ యమైన కత్తి రావటానికి కారణమేమిటో ఊహించుకోలేనంతగా భయపడుతున్నాడతడు.

మరొక కొద్దిక్షణాలు గడిచాయి. ఆక్సెనోవ్ క్రౌర్యానికి లోనయాడు. అతని చేతుల్ని బంధించి, తమతో తెచ్చిన బండిలో కారాగారానికి తీసుకుపోయారు అధికారులు.

కొద్ది క్షణాలక్రితం అతడెక్కడున్నాడు? అప్పటి వుత్సాహం అంతా ఇప్పుడేమైపోయింది? ఆక్సెనోవ్ దీర్ఘంగా నిట్టూర్పులు విడుస్తూ ఆలోచిస్తున్నాడు. తన భార్య కండ్లలో మెరిసిన కన్నీటి చుక్కలతని నయనాలముందు తళతళలాడాయి.

న్యాయస్థానంలో విచారణ జరిపారు. నేరం దృఢపడింది. ఆక్సెనోవ్ మాట్లాడలేదు. భగవంతుడికి సత్యం తెలుసు. అతడే సత్యస్వరూపుడు. అతడాభగవంతుణ్ణి నమ్ముకున్నాడు. కాని,... అతడికి యావజ్జీవ కారాగృహవాస శిక్ష వేశారు. అతడు మెల్లిగా ప్రక్కకు తిరిగి కండ్లు వత్తుకున్నాడు. ఇంటివద్ద భార్య, బిడ్డలూ అతని కళ్ళముందు విలపిస్తూ గోచరించారు. అతడు చేయగలిగిందిలేదు. భగవంతుడు సత్య స్వరూపుడు.

అతడు కారాగృహంలో ఉండగా, సంగతి తెలిసి, భార్యా, బిడ్డలూ అతడ్ని చూచిపోవ డానికి వచ్చారు. అతడి భార్య అతడిముందు అవనత శిరస్సుతో బొట బొటా కన్నీళ్ళు రాల్చింది. కొన్ని క్షణాల తరువాత ఆమె నీరస స్వరంతో ప్రశ్నించింది.

"నిజంగా మీరా హత్య జరిపారా?"

ఆక్సెనోవ్ హృదయం తరుక్కుపోయింది. జీవితంలో సగభాగినైన భార్యకూడా తన్నను మానిస్తోందా? తను నిరపరాధియని లోకం ఎందుకు సత్యాన్ని గ్రహించలేదు? తను భగవంతుడికేం అపకారం చేశాడు? ఆక్సెనోవ్ రెండు హస్తాల్లోటీ కళ్ళని గట్టిగా కప్పుకున్నాడు. హృదయంలో మిక్కిలిగా విలపించాడు. తనేమీ సమాధానం చెప్పలేక పోయాడు.

చంటిపిల్లవాడు ఇంటికి రమ్మని మారాం చేస్తున్నాడు. తన అవయవాల్ని బంధించిన గొలుసును చూచి ఏవగించుకున్నాడు. అతడు గడ్డం రెండు చేతులమధ్యా పట్టుకుని, తదేకంగా నేలవంక చూస్తున్నాడు. భార్య కొద్ది నిముషాలు అల్లాగే నిలబడిపోయింది. తరువాత అతడి మనస్సులోని ఆవేదన గ్రహించింది. శెలవు తీసుకుని, భారమైన హృదయంతో మెల్లగా బయటకు నడిచింది.

ఆక్సెనోవ్ కొద్ది కాలంపాటు ఆ పట్టణంలోనే శిక్ష ననుభవించాడు. అతడిలో జీవం నశించింది. సతతం వేదనతో పరధ్యానంగా ఏదో యోచిస్తూ కాలం గడుపుతున్నాడు.

ఆక్సెనోవ్‌ను సైబీరియా పంపించారు. అతడు తనుచేసిన పాటుకు ప్రతిఫలంగా ముట్ట చెప్పబడిన పైకంతో "పవిత్ర సన్యాసుల జీవిత చరిత్రలు" పుస్తకం కొనుక్కున్నాడు. అప్పుడప్పుడు అందులోని చరిత్రలు పఠించి, ధ్యాన తత్పరుడైపోతుంటాడు.

సైబేరియాలో ఇతడి వైఖరి ఎల్లరను ఆశ్చర్య చకితుల్ని చేసింది. ఎవరితోటీ ప్రమేయం లేకుండా కాలం గడిపే యితడు ఒక హత్య చేయగల సమర్థుడేనా ?" అనిపించింది. కొద్ది కాలంలోనే అతడు అక్కడి జైలు అధికారుల అభిమానాన్ని చూరగొన్నాడు.

అక్కడి ఖైదీలందరూ అతడిని గౌరవించారు. తమ తమ తగాదాల నెప్పుడూ ఆక్సెనోవ్ వద్దనే తీర్చుకొనేవారు.

ఆక్సెనోవ్ అప్పుడప్పుడు చెప్పులు కుట్టేవాడు. మిగిలిన కాలంలో నిస్పృహగా, ఏదో ఆలోచిస్తూ గడిపేవడు. ఒకరోజున అక్కడికి ఒక కొత్త ఖైదీల గుంపు వచ్చింది. అందులో ఒక వింతవ్యక్తి కూడా ఉన్నాడు. పాతఖైదీలందరూ క్రొత్తవారిని పరివేష్టించి, వారు సల్పిన నేరాలను తెలుసుకుంటున్నారు. అందులోని వింత వ్యక్తినికూడా ప్రశ్నించారు. అతడిపేరు సమరిచ్. అతను చెప్పిన కథ ఇది.

* * *

"నేనొక గుఱ్ఱాన్ని ఒక బండీనుంచి విప్పి తోలుకుపోయానని నాకు శిక్ష వేశారు. ఆ గుఱ్ఱాన్ని నేను వేగంగా ఇల్లు చేరుకునే ఉద్దేశ్యంతో తోలుకు పోయాననుకోండి, కాని, తరువాత దానిని వదలివేద్దామనే అనుకున్నాను. పైగా ఆ గుఱ్ఱపు బండివాడు నేనెరిగున్నవాడే. ఆవిధంగానే నేను కోర్టులో వాదించాను. కాని, లాభం లేకపోయింది." అతడికేసి అందరూ వింతగా చూశారు. అతడు వచ్చిన గ్రామం ఆక్సెనోవ్ స్వగ్రామమేనని తెలుసుకున్నాక, ఆక్సెనోవ్ ప్రశ్నించాడు.

"ఆక్సెనోవ్ అనే వర్తకుడి కుటుంబాన్నెరుగుదువా ? వాళ్ళు కులాసాగా ఉన్నారా ?"

"అవును. అతడిప్పుడు సైబీరియాలోనే ఉన్నాడట. అతడి పుత్రులు అధికంగా ధనవంతులయారిప్పుడు."

"ఐతే అతడి నేరంలో నీ అభిప్రాయం ఏమిటి ?" అని ఆక్సెనోవ్ అడిగాడు.

సమరిచ్ సమాధాన మిచ్చాడు: "కత్తి అతని సంచీలో ఉందికనుక... అతడే... హంతకుడు. అంతే— పోనీ యితరులు అతడిసంచీలో పెట్టినా...... అదంతా అసంభవం— అతడే హంతకుడు."

తరువాత ఆక్సెనోవ్ తననెరిగించుకున్నాడు. అతడాశ్చర్యపోయి, "అరే! అప్పుడే ముసలివాడయిపోయావే!" అన్నాడు. ఇతర ఖైదీలతడిని "ఆక్సెనోవ్‌ను పూర్వం ఎరుగుదువా ?" అని అడిగారు. అతడేదో అనిశ్చితంగా ప్రత్యుత్తరమిచ్చాడు.

అతడే హంతకుడని ఆక్సెనోవ్ మనస్సులో ఒక అనుమానం జనించింది. అప్పటినుంచీ అతడి వేదన వృద్ధిపొందుతోంది.

కొంతకాలం జరిగింది. ఒకరోజు రాత్రి అతడు బల్లమీద పడుకుని నిద్రపోతున్నాడు. బల్లక్రింద ఏదో శబ్దం వినవస్తోంది. అతడు లేచి

చూచాడు. క్రింద నొక సొరంగంలో నుంచి ఒక మానవాకృతి వెలువడ్తోంది. అతడు తదేకంగా గమనించాడు. సమరిచ్ విగ్రహం అతని ముందు కనిపించింది. సమరిచ్ ఆక్సెనోవ్ గొంతు గట్టిగా పట్టుకుని అన్నాడు.

'నువ్వు గొడవ చేశావా, అధికారులు నన్ను చంపేస్తారు. యీలోగా నిన్నే హత్య చేసేస్తాను."

ఆక్సెనోవ్ సమరిచ్ పట్టు విడిపించుకుని, ప్రక్కకు నడిచాడు. "నేనిదివరకే హత్య చెయ్యబడ్డాను."

"నిన్ను కారాగారానికి పంపింది నేనే. నేనే ఆ వర్తకుణ్ణి చంపింది. కాని,... ఫరవాలేదు. నేను బయటకొక సొరంగం త్రవ్వుతున్నాను. దాని ద్వారా నువ్వుకూడా పారిపోవచ్చు. రోజూ త్రవ్విన మన్ను బూట్లలోపోసి, ప్రొద్దుటే గోడ దగ్గర పోస్తూ వచ్చాను. ఈ సంగతి అధికారుల్తో చెప్పావా, నిన్ను బతకనియ్యను."

ఆక్సెనోవ్ విషాదంగా ఇలా అన్నాడు: "నేను పారిపోను. నేను 26 సం॥ శిక్ష ననుభవించాను. నా భార్య గతించి ఉంటుంది. నన్ను నా బిడ్డలు గుర్తించలేరు. (నా జీవితాన్ని నువ్వే నాశనం చేశావు) నాకింక బాహ్య ప్రపంచంలో అడుగిడే యోచనలేదు. నువ్వు వెళ్ళిపో ఇక్కణ్ణించి" ఆక్సెనోవ్ చివరిమాటలు ఉద్రేకంగా అన్నాడు.

సమరిచ్ అతణ్ణి భయపెట్ట చూశాడు. కాని, అతడు నిశ్చలంగా జవాబిచ్చాడు. తరువాత సమరిచ్ సొరంగంద్వారా వెళ్ళిపోయాడు.

"సమరిచ్ తన జీవితాన్ని ధ్వంసంచేశాడు. తన్ను తన దారాపుత్రులనుంచి యావజ్జీవంగా ఎడబాటు కల్పించాడు. అతడ్ని తిరిగి సాధించి తీరాలి" అని అతడి ఆత్మ ఘోషించింది. అతడికి రాత్రి నిద్దరపట్టలేదు. లేచి పచార్లుచేస్తున్నాడు ఇటూ అటూ. అతడి కళ్ళముందు దుఃఖించే తన భార్యా పిల్లలూ కనిపించారు. తరువాత వరుసగా అతడు అంతిమంగా గడిసిన ఉత్సాహపు గడియలు, అతడి కఠిన శిక్ష, 26 సంవత్సరముల కారాగారశిక్ష, అన్నీ ఒక్కటొక్కటే కళ్ళకు కట్టినట్లగుపించాయి. అతడి హృదయం ఉద్రేకంతో పొంగింది. ప్రతీకారం కోసం అతడి ఆత్మ పెనగులాడింది. అతడి రుధిరంఉప్పొంగింది.

మరునాడధికారులు సొరంగం సంగతి తెలిసి విచారణ సాగించారు. కాని, ఎవ్వరూ నేరాన్ని వప్పుకొనలేదు. అధికారులు ఆక్సెనోవ్ను గారు ఆఖరు ప్రయత్నంగా "తాతా! నిజం చెప్తావు. నీకు తెలిసి ఉంటుంది చెప్పు."

అతడు జవాబిచ్చాడు "అందుకు భగవంతుడి కంగీకారంలేదు. క్షమించండి. నన్ను శిక్షించండి. పాత్రుణ్ణి."

ఆ రాత్రి ఆక్సెనోవ్ గదిలోకి మెల్లిగా నడుస్తూ సమరిచ్ వచ్చాడు. అతడ్ని చూసేటప్పటికి ఆక్సెనోవ్కు ఏవగింపు కలిగింది. వెంటనే లేచి, ఉద్రేకంగా "సమరిచ్! నన్ను పూర్వమే హత్య చేశావు. పాప ఫలం అనుభవిస్తావు. నిన్ను భగవంతుడు క్షమించడు. వెళ్ళిపో తక్షణం! లేకపోతే అధికారుల్ని పిలుస్తాను."

అతడి మనసంతా వికారం అయిపోయింది. మెదడు ఆలోచనలలో కరిగిపోయింది. అతడి ముఖంలో క్రౌర్యం స్పష్టమౌతుంది.

సమరిచ్ క్రమంగావచ్చి ఆక్సెనోవ్ పాదాలు పట్టుకున్నాడు. "ఆక్సినోవ్! క్షమించునన్ను. నువ్వింత ఉత్తముడివనుకోలేదు. అధికారులకు హత్య నేనే జరిపినట్లు తెలియజేస్తాను. వెంటనే నిన్ను విడుదల చేయిస్తాను. నన్ను క్షమించు!"

## "దాగని సత్యం"

ఆక్సెనోవ్ మనసు ఊగులాడుతోంది. తన జీవిత నాశనానికి కారకుడైన వాడినా తను క్షమించటం! అతడి ఆత్మ విలవిలా తన్నుకుంది. అతడు తన తప్పు తెలుసుకున్నాడు. కాని; తన జీవితం పూర్వం ఎంత సుఖమయం - ఇప్పుడెంత దుఃఖమయం! నా అనేవాళ్ళెవరూ అతడికీ ప్రపంచంలో లేరు. తనను ప్రాణప్రదంగా ప్రేమించిన భార్యకి దూరమయాడు. భగవంతుడు సత్యస్వరూపుడు. అతడిని నమ్మాడా క్సెనోవ్!

క్షణంలో అతడి ముఖంలో శాంతం మూర్తీభవించింది. కళ్ళు అదరణను వెదజల్లుతున్నాయి. అప్రయత్నంగా అతడి నోటినుండి యీమాటలు వెలువడ్డాయి. "భగవంతుడు నిన్ను క్షమిస్తాడు."

మరునాడతనికి విడదల చెయ్యవలసిందిగా ఉత్తరువులు జారీ అయినాయి. అధికారి ద్వారం తెరచి గదిలోకి ప్రవేశించాడావార్త అతడిచెవిని వేసి విడుదల చేద్దామని. అతడా దృశ్యంచూసి నిశ్చేష్టుడై అలాగే నిలబడిపోయాడు.

"ఆక్సెనోవ్ శరీరం నిర్జీవంగా పడిఉంది.

*************

## వారేమవుతారు?

శ్రీమతి ఎస్. కే. రాజేశ్వరీరాణి

ఒక యువకుడు — ఒక స్త్రీ దారిన పోవుచుండ ఒక ముసలావె వారిని అడ్డగించి "వారేమవుతారు?" అని అడిగిందిట. అందుకాస్త్రీ "మా మామను ఇతని మామ "మామ" అని పిలుచును" అన్నదిట! అయిన వారేమవుతారు? అన్న సమస్యని ఆంధ్ర మహిళ పాఠకులకు శ్రీమతి డాక్టరు రావుగారు చక్కని మెదడుకు మేతగా పెట్టారు! చాలామంది ఆసమస్యని ఎలాపూరించాలా? అని తికమకపడుతుంటారు, పడివుంటారు. మా అన్నయ్య నిమిషంలో విడతీసేసాడు. మీకు చెప్పనామరి?

అనుకొందాం స్త్రీ పేరు రాధమ్మ, ఆ యువకుని పేరు బాబు.

రామయ్య చెల్లెలు రాధమ్మ, సౌభాగ్యమ్మనూ. సౌభాగ్యమ్మ కొడుకు బాబు. ఒకరోజు రాధమ్మా, బాబు అలా పోతున్నారు బజారుకో, షికారుకో.

కేశవయ్యగారి కొడుకు రామయ్య, కూతుళ్ళు రాధమ్మ, సౌభాగ్యమ్మ. ఆయనగారి సతీరత్నం శ్యామలమ్మ. శ్యామలమ్మకో అన్నదమ్ముడున్నాడు సామినాధమని.

ఇప్పుడు రాధమ్మ మామ సామినాధము. బాబు మామ రామయ్య. బాబు మామ రామయ్య సామినాధాన్ని మామా అనే పిలుస్తాడు!

రాధమ్మ అన్న మాటలు మా మామని ఇతని మామ అంటే సామినాధాన్ని బాబు మామ రామయ్య "మామా" అని పిలుస్తాడు! ఇంతేనా? అక్కకొడుకని చెప్పకుండా రాధమ్మ చిత్రంగా చెప్పింది జవాబు!

# పిచ్చిపట్టు

## (జర్మను ఏకాంకిక)

రచయిత :
రోడరిక్ బెన్‌డిక్స్

అనువాదం :
శాస్త్రి వి. ఎస్. శర్మ

ఇందువచ్చే పాత్రలు :

| | |
|---|---|
| అవుస్‌దోర్ఫ్ : | భాగ్యవంతుడు, ఎమ్మా తండ్రి. |
| కాతరీనా : | అవుస్‌దోర్ఫ్ భార్య. |
| ఎమ్మా : | వాళ్ళ కూతురు |
| ఆల్‌ఫ్రెడ్ : | ఎమ్మా భర్త. |
| హైన్‌రిచ్, లిజబెత్ | ఆల్‌ఫ్రెడ్ నౌకర్లు. |

———: o :———

[ఇంతవరకూ నడిచిన కథ]

(జర్మనులు ఏపనినైనా చేసిముగిస్తే "దైవకటాక్షం వల్ల అంతా ముగించాం" అని చెప్పటం సాంప్రదాయం ఆల్‌ఫ్రిన్ ఎమ్మాను పెండ్లాడుతాడు. వీరి ఇంటిలో హైన్‌రిచ్, లిజబెత్‌లు పనిమనుషులు. హైన్‌రిచ్ లిజబెత్‌ను ప్రేమించాడు. త్వరలో ఆపిల్లను పెండ్లాడాలని వుర్రూతలాడుతూ వుంటాడు. ఆల్‌ఫ్రెడ్‌ను, ఎమ్మాను చూడడానికి ఎమ్మా తలిదండ్రులు వస్తారు. అందరికీ భోజనాన్ని అమర్చడానికి హైన్‌రిచ్, లిజబెత్‌లు బల్లను గుద్దుతుంటారు. ఆపనిని ముగించాక హైన్‌రిచ్ "దైవకటాక్షం వల్ల అంతా అమర్చాం" అని లిజబెత్‌ను అనమంటాడు. దాన్ని ససేమిరా అనవని లిజబెత్ పట్టుపట్టుతుంది. వాళ్ళ తగవును ఆల్‌ఫ్రిడ్ భోజనాలగది వెలుపలనుంచేవింటాడు. ఆ అస్త్రాన్నే తన భార్యమీద వుపయోగించడానికి భగీరథ ప్రయత్నాలు చేస్తాడు. ఎమ్మా ఈ ఆజ్ఞను ప్రతిఘటిస్తుంది. దాంతో ఆనాటి వారి సంతోషం ఈలా రభసలోకి తిరిగిపోతుంది. ఈ దృశ్యాలే మొదటి మూడురంగాల్లో చిత్రింపబడ్డాయి. ఇక నాలుగోరంగంలో ఈరభస ఏలా ఇంటినంతా చిచ్చు పెట్టుతుందో చూడవచ్చును. నాటకం పూర్తి అయ్యేటప్పటికి ఆరభసా తిరిగీ ఆనందంలోకే దోవను చూపెట్టుతుంది.)

(స్థలం : మధ్యతరగతి కుటుంబపు ఇల్లు. భోజనాలగది. ఎమ్మా, ఆల్‌ఫ్రెడ్ బల్లదగ్గర కూర్చుంటూరు. లిజబెత్ వారి వెనుక నిలుచుంటుంది.)

ఎమ్మా : (లిజబెత్ దగ్గర ఏం జరగనట్లు నటిస్తూ) వచ్చావా లిజబెత్ ! మంచి సమయానికే వచ్చావు. చేతిరుమాల్ను ఎక్కడో పడేశాను. మరోదాన్ని తెచ్చి యియ్యాలి.

లిజబెత్ : చిత్తం. (రుమాల్ను తెస్తానని వెళ్ళుతుంది)

ఆల్‌ఫ్రెడ్ : (ఇటూ అటూ చూస్తూ) ఎమ్మా ! మనకీ రభస యేమాత్రం వద్దు. ముమ్మాటికీ వద్దు. దానిమూలంగా మన ఆనందమే చెడిపోతుంది......

ఎమ్మా : (కోపంతో) మీరు చెప్పేది ఏమాత్రం బాగా లేదు...... నేను రభస చేసానని ఈ చెప్పటం మాత్రం బాగా వున్నదనుకొన్నారా మరి ?

(లిజబెత్ వస్తుంది. చేతి రుమాల్ను ఎమ్మాకు ఇస్తుంది) హైన్‌రిచ్ పాత్ర సామాన్లు తీసుకొని మరోక్షణంలో లోపలికి వస్తాడు. వాటిని మేజామీద చక్కబెట్తాడు. లిజబెత్ వెళ్ళిపోవటం చూస్తూ "నీనేసంగతిని అడగాలి" అని మూగ సంజ్ఞ చేస్తాడు. లిజబెత్ మాట్లాడదు. తనూ ఏదో సంజ్ఞ చేసి బయటికి వెళ్ళిపోతుంది)

హైన్‌రిచ్ : (తటపటాయిస్తూ ఎలిబెత్ పోవటంచూస్తూ ఆలోచనా సముద్రంలో పడిపోతాడు).

# పిచ్చిపట్టు

ఎమ్మా: (ఏం మాట్లాడకుండా ఆల్‌ఫ్రెడ్‌ను తదేక దృష్టితో చూస్తూ వుంటుంది)

ఆల్: (కూర్చున్న కుర్చీనుంచి లేస్తాడు. ప్రక్క బల్లమీద వున్న వార్తా పత్రికను తీసుకొని వస్తానికి వెళ్తాడు... హైన్‌రిచ్ బయటికి వెళ్ళినంతవరకూ పత్రికనే పార చూస్తూ వుంటాడు........ తిరిగి వచ్చి కుర్చీలో కూర్చుంది ఎమ్మా వంకే చూస్తూ) నీవూ కొంచెం ఆలోచించాలి. ఆ పాడు గభసను ఇంకని లిపివేస్తావా లేదా?

ఎమ్మా: (ఆమాటకు కోపం వస్తుంది. పుచ్చుకొన్న కాఫీ పాత్రను క్రింద పడవేస్తుంది) ఏమిటీ? ఆకోరికను చెల్లించరామరి?...... అలా మాట్లాడితే నాకేం బాగుండదు. ఇంతకు ఎవరిది ఈ పిచ్చిపట్టు? అసంగతిని ముందు చెప్పాలి మరి?...... తిరిగీ ఎందుకువచ్చింది మనకు ఈ రాద్ధాంతం? ......... ఈ నాటకం?

అల్: భేష్... ఎవరాడుతున్నారు, ఈ నాటకాన్ని, యీ పిచ్చినాటకాన్ని. నేనేం అన్నానని?...... నా కోరికను నెరవేర్చమని ప్రాధేయపడ్డందుకా... బాగానే వుంది... ఒకసారి చెప్పివేసెయి. దాంతో ఆ ఘట్టమూ ముగిసిపోతుంది... అంతే.

ఎమ్మా: అలాగామరి? మీ కోరికను కాదని ఎప్పుడూ చెప్పెరగను... లోకమంతా పెద్ద నాటకం. ఆ నాటకాన్ని ఆడితే... నన్నే ప్రేమిస్తే యీలా చెప్తారా మరి?... ఒకటే పట్టుదల. మగవాళ్ళకంతా స్త్రీలంటే ఏమిటో బొత్తిగా తెలియదు. స్త్రీలు వాళ్ళకు దాసానుదాసురాండ్రుగా వుంటే... చంకలు కొట్టుకుంటారు... ఇదే వాళ్ళ తబ్బిబ్బులు.

ఆల్: (బిగ్గరగా) ఏమిటీ ఆ పెంకిమాటలు?

ఎమ్మా: (బిగ్గరగా) అలా అంటే తప్పేముంది?... ఇంతకూ దీన్నంతా ఆరంభించినవారు మీరు! అవును. స్త్రీలు దాసానుదాసులు,.. మీరూ ఆ మగవాళ్ళంటి వారే. అందుకు సందేహమూ?... ఈ రాద్ధాంతం నాకే మాత్రం సాధ్యంకాదు.

ఆల్: ఏమిటీ ఎమ్మా! దీనికే ఇంత ఆవేశమా? నేనేం అన్నానని... తమాషాకే...

ఎమ్మా: ఇదంతా తమాషా అంటారా? (ఒక్కట్టున ఏడ్పు ప్రారంభిస్తుంది) మీరు ఎంతో మంచివారనుకున్నాను. నన్నెంతో ప్రేమిస్తున్నారని... కాని ఇప్పుడేం చూస్తున్నాను? మీకు దయా దాక్షిణ్యాలు బొత్తిగా లేవు. భర్త వేసిన అడుగులోనే నడవాలని నిర్బంధించడం...

ఆల్: (గాబరాగా) అలా ఏడవడం... ఆకళ్ళ ధారల్ని చూస్తూవుంటే...

ఎమ్మా: (వెక్కి వెక్కి ఏడుస్తుంది) మీరే ఇంత కాఠిన్యంతో ప్రవర్తిస్తే ఏలా భరిస్తాననుకొన్నారు.

ఆల్: (గాబరాగా) అయ్యో దేవుడా! ఏమిటిది? కథ యీలా తిరిగిపోతుందని కలలోకూడా... ఏడవకు! అది మనకు వద్దు. బొత్తిగా వద్దు. (చేతిరుమాలుతో కన్నీళ్ళను తుడుస్తూ) ఎమ్మా! తప్పంతా నాదే. నాదే అంతా. అనవసరంగా క్షోభ పెట్టాను... మనుష్యుణ్ణా లేక మరెవర్ని?

ఎమ్మా: (మొహం తుడుచుకుంటూ) మీరాలా బాధపడడం చూస్తే... తబ్బిబ్బై పోతాను. ప్రొద్దున ఏం అన్నారో జ్ఞాపకముందా. "నా జీవితమే మహోత్తర సుఖం" అని... ఇప్పుడో...

ఆల్: (క్రిందచూస్తూ) నిన్ను అష్టకష్టాలూ పెడుతున్నాను క్షమించాలి...

ఎమ్మా: (ఏడుపును మానదు. జవాబు చెప్పదు)

ఆల్: (తనలో) ఇంకో క్షణంలో వీళ్ళ నాయనా, అమ్మా వస్తారు. వాళ్ళే దీన్ని చూస్తేనో... (ఎమ్మాను లాలిస్తూ) ఎమ్మా! నీవీలావుండడం మంచిదికాదు. నిన్ను ప్రేమించాను. ఆ సంగతీబాగా తెలుసు. అయిపోయిందేమో అయిపోయింది. ఇక మనకీ రభసవద్దు. ఈనాటకానికి స్వస్తి చెప్పాలి...

ఎమ్మా: (గాబరాతో) అవును. స్వస్తి చెప్పడమే మంచిది. లేకపోతే శాంతివస్తుందా మరి?

ఆల్: (మందహాసంతో) అవును. మనకు కావలసిందిశాంతి. ఇవ్వాళ సుదినం, మీ నాన్నా, అమ్మా వస్తున్నారు.

ఇంత రభసచేసి ఈ శుభ దినాన్ని యీలా చెడగొట్టుకొన్నాం.

ఎమ్మా : (చిరునవ్వు నవ్వుతూ) ఆ సంగతి ఇప్పుడైనా గ్రహించారు.

ఆల్ : నాకూ ఈలా చేయటం చిరాకే. ఇక దాన్ని మరచిపోవాలి.

ఎమ్మా : కాని... ఇంత కాఠిన్యం ఎందుకు చూపాలసి వచ్చిందో... ఆ సంగతిని చెప్పాలి?

ఆల్ : ఎందుకు వచ్చిందో నాకేం తెలుసు. మరచిపోదాం. (ఎమ్మా చేతుల్ని గట్టిగా నొక్కుతాడు)

ఎమ్మా : (శిరస్సును అతని చేతుల్లో వుంచి తిరిగి వెక్కివెక్కి యేడుస్తుంది) మీరు నిజంగా... అంత కఠినత్వాన్ని చూపడం ఎందుకు?

ఆల్ : (బతిమాలుతూ) అంతా అయిపోయింది. ఆవిషయాన్ని స్మరించవద్దు... కాని ఒక సంగతి మాత్రం చెప్పి, సంతోష పెట్టాలి.

ఎమ్మా : (కోపంతో) తిరిగి ఆదోవలోనే నడుస్తున్నారా. ఏం చెప్పాలి?

ఆల్ : (ప్రాధేయపడుతూ) ఒకేమాట...

ఎమ్మా : (దీనంతో) ఏమని ?

ఆల్ : అదే నా కోరిక. దాన్నే చెల్లిస్తావా ?...

ఎమ్మా : ఏమని చెప్పేది ?... ఆనాటకాన్నేనా ?...

ఆల్ : ఊ ! ...... బాగా గ్రహించావు. దానికి స్వస్తి చెప్పవద్దూ మరి ?... ఎమ్మా! మంచిదానివి. అందు కోసమే......

ఎమ్మా : (కోపంతో) అంతా అయిపోయిందన్నావు... కాని, తిరిగి ఆమాటనే తలపెట్టున్నావు ? బాగానే వుంది.... నేను చెప్పను. ముమ్మాటికీ చెప్పను.

ఆల్ : (కోపంతో) పాపం, పాపం, అని ఇంతవరకూ వూరకున్నాను. అయితే చెప్పవా ?

ఎమ్మా : (గంభీరంగా) చెప్పను అంతే.

ఆల్ : (తీవ్రంతో) ఆ ! ... సరేలే. మంచిది. మంచిది... ఇంత ప్రేమించినా... ఆ ! తప్పంతా నాదే. నిన్ను ప్రేమిస్తూ వున్నందు నేనే ఈలా అడగటానికి సాహసం చేసాను... అయినా ఇంత పట్టుదలామరి ? నిన్ను ప్రేమించిన భర్త వాంఛ...... దాన్నే తీర్చలేక పోయావు. నిన్నంటే లాభం వుంటుందా ?... ఏం చెప్పవద్దులే.

(వచ్చే కోపాగ్నిని కట్టిపెట్టుకోలేక కుర్చీమీదనుండి లేస్తాడు. గదిలో ఇటూ అటూ తిరగమానికి ప్రారంభించాడు......)

ఎమ్మా : (అతనివంకే గాఢరాత్రో చూస్తూ తనలో) ఇవ్వాళ ఏం చూచాడో మరి ? నేనేం పల్లెత్తుమాట అనలేనే... కాదు కాదు, నాతో సరసాలాడటానికే ఈ మార్గాన్ని అవలంబించివుంటాడు......... ఊ ! తమాషాకే ఈ నాటకాన్ని ఆడటం...... కాని అలా ఆడటం మంచిదికాదు. నేనూ కొంచెం బెట్టుసరిగా వుండాలి. దాంతో అంతా సరిపడుతుంది. (తిరిగీ ఏడ్పును నటిస్తూ) పెట్టాలసిన బాధల్ని పెట్టాడు... కాని వీటితో భయపడ్డానామరి ? ఇంత నిర్దాక్షిణ్యం మాత్రం మీవంటికి వారికి తగదు... ఇంతకూ చెప్పరావి ఎవరైనా చూస్తే......... దాన్నయినా తెలుసుకోవాలి.........

(హైన్‌రిచ్ నెమ్మదిగా లోపలికి వస్తాడు)

(స్థలం : భోజనాలగదిలో)

హైన్‌రిచ్ : (గంభీరంతో) వాళ్ళొచ్చారు.

(మెల్లగా ఆల్‌ఫ్రెడ్ వెనుక నిలుచుంటాడు)

ఆల్ : (మెల్లగా ఎమ్మాతో) ఇక వారు లోపలికివస్తారు. మనవైఖర్ని చూస్తే వారూ నవ్విపోతారు.

ఎమ్మా : (తీవ్రంగా) ఫరవాలేదు. వాళ్ళేమనుకున్నా ఫరవాలేదు. ఇంతకూ తప్పెవరిదో దాన్నీ వాళ్ళు తెలుసుకుంటారు......

ఆల్ : ఆదంతా మరచిపోవాలి. ఇంటి పెత్తనం నీది. దాన్ని ఇప్పుడు నిర్వహించాలి. వాళ్ళు నిన్ను చూచాక ఆనందించాలి. ఆ సంగతిని మరచిపోవద్దు.

(బయట సందడి. తలుపులు దభాల్ని తెరువబడ్డాయి. ఇద్దరూ తలుపు దగ్గరకుపోయి అవుప్‌తోర్ఘ్, కతరీనాల్ని చూస్తారు. ఆ నాటకాన్ని పూర్తిగా మరచి

పోటానికి చేయాలసిన భగీరథ ప్రయత్నాలు చేస్తూ, వాళ్ళను తోడ్కొని గదిలోకి వస్తారు.)

(అదే స్థలం. అత్తమామలు వచ్చి కుర్చీలమీద కూర్చుంటారు)

అవుస్‌రోర్ఫ్ : (ఆనందంతో) మిమ్మల్ని చూడాలని ఎన్నో రోజులున్నండి... అయితేనేం, ఇవ్వాళ తీరిక కలిగింది. అదేచాలు.

ఆల్‌ఫ్రెడ్ : (ఆయన హ్యాటును, చేతికర్రను తీసుకొని ప్రక్కబల్లమీద పెట్టాడు.) మీరిద్దరూ ఇవ్వాళ రావటం మా అదృష్టం అదేచాలు.

ఎమ్మా : (అమ్మను ఆలింగనము చేస్తూ) అమ్మా! ఇవ్వాళ రావటానికి తీరిక వుంటుందో వుండదో అని గాభరా పడ్డాను......... ఇంతకూ వచ్చావు అదే సంతోషం.

కాతరీనా : (విచారంతో) ఎన్నాళ్ళనుండి యీ ప్రయాణ సన్నాహం! ఆయనకు తీరిక వుంటేకదా? ఏలాగయితే నేం, మా బిడ్డల్ని చూడ్డానికి వచ్చాం...... (ఎమ్మా వైపు ఎగాదిగా చూస్తూ) కాని ఆ మొహం ఆలా వాడిపోయిందే ఎమ్మా. (నవ్వుతూ) దానికేంలే!

కాత : పాపం, ఇంటిపనినంతా నీవే సర్దుకోవాలికదూ? ప్రారంభంలో ఆ పనిని చక్కబెట్టుకోవడం కష్టమే. అయినా ఫరవాలేదులే. క్రమేణా దానికి అలవాటు పడిపోతావు.

అవు : (హాస్యంగా) అన్ని పనులున్నా మనల్ని మరచిపో లేదులే. అదే మనకు కావలసింది.

ఎమ్మా : నాన్నా! నీవు ఆలా అనటం మంచిదికాదు. నాన్ననూ, అమ్మనూ మరిచిపోవడమా మరి?

ఆల్ : (ఎమ్మావంక చూస్తాడు. ఎమ్మా అతని చూపును తప్పించుకోటానికి ప్రయత్నిస్తుంది...) ఇక భోజనం ప్రారంభిస్తామా?

అవు : తప్పక... ఇంక ఆలస్యం చేయడమెందుకుమరి? నీవున్నావు. ఆ బిడ్డను జాగ్రత్తగా చూడాలసిన బాధ్యతంతా ఇక నీదేకదూ? మిమ్మల్ని చూడడానికి అంత దూరాన్నుంచి ప్రయాణంచేసి వచ్చాం. కాని మిమ్మల్ని చూచాక ఆ అలసటంతా మటుమాయమై పోయింది.

ఆల్ : (ఎమ్మావంక చూస్తాడు)

ఎమ్మా : (అతడు తన్ను చూస్తున్నాడని తెలుసుకొన్నా పరధ్యానంలో వుంటుంది)

(ఆల్‌ఫ్రెడ్, ఎమ్మాల ఈ దృశ్యాల్ని హైన్‌రిచ్ లిజబెత్ చూస్తూ స్తంభించిపోతారు. కాని దాన్ని వారికి చూపకుండానే తమ పనిని చక్కబెడుతూ వుంటారు)

అవు : (ఆ దృశ్యాన్ని చూస్తూ విభ్రాంతుడవుతాడు. కాని దాన్ని కప్పిపుస్తూ) నా బిడ్డ మంచిది. భర్త అంటే ఎంతో ప్రేమ. ఇదంతా మా అదృష్టం కాక మరేం అనాలి?

ఆల్ : (ఏం మాట్లాడక కాఫీని పుచ్చుకుంటాడు)

ఎమ్మా : (దీనన్నంతా చూస్తూ, వాళ్ళకు తెలియకుండానే కారిపోతూవున్న కన్నీటి ధారలను తుడుచుకుంటూ వుంటుంది)

అవు : (దీనన్నంతాచూచి ఓపిక పట్టుకోలేక) ఏం జరిగింది? ఇద్దరూ మాట్లాడటం లేదెందుకు?...... అబ్బాయి! ఆ వోర చూపుల్తో అమ్మాయిని ఆలా చూస్తావెందుకు? పిల్ల ఎందుకిలావుంది? (హాస్యంతో) తగవులాడు కొన్నారా మరి?

ఆల్ : (హైన్‌రిచ్ వంక చూస్తాడు. వాహూ ఏం మాట్లాడక వెలుపలకి వెళ్తాడు)

కాత : (భర్తతో) నీవాళ్ళను అంటే వాళ్ళకు కష్టంగా వుండదూ? తగాదాలు వుంటే... వాళ్ళనే సరిపెట్టు కోనీయాలి.

ఆల్ : (ధైర్యంతో) ఏమీలేదు...... ఒక తమాషాను పొరపాటున చేసాను...... అది దాన్ని అర్థంచేసు కోలేదు. అంతే. మరేంలేదు.

ఎమ్మా : (బొట బొట నీటిని కారుస్తూ) ఆ! తప్పంతా నాదే. ఆయన ఆలాగే అంటారు......

ఆల్ : (మెల్లగా) నీవు ఆలా అనటం మంచిదామరీ. వారేం అనుకొంటారో దాన్ని తెలుసుకోవాలికదూ?

[ఇంకావున్నది]




# Variation (మార్పులు) అనగానేమి ?

కుమారి కె. టి. బా. జయంతీదేవి, B.Sc. (Hons)

మనము అనేక రకములగు జంతువులను, వృక్షములను చూచుచున్నాము. ఉదా- వరిపైరు మనదేశమందంతటను పండింపబడుచున్నది. కాని అన్ని ప్రాంతములలో ఒకే రకమగు విత్తు చల్లబడుటలేదు. అక్కుళ్లు, నెంబర్లు, కృష్ణకాటుకలు, వంకసన్నములు ఇంకా ఎన్నో రకములగు విత్తులున్నవి. రైతులు తమ భూములనుబట్టి, అభిరుచినిబట్టి ఎవరి యిష్టము వచ్చినట్లు వారు వేసుకొనుచున్నారు. అట్లే పసుపు, చెఱకు ఇత్యాది పంటలలోకూడ అనేక రకములున్నవి. ఇంకా కూరకాయలలో ఉదా- టమాటీలలో ఎన్నోరకములున్నవి. గింజలున్నవి, గింజలులేనివి. ఎర్రనివి, పచ్చనివి, గుండ్రనివి, పొడగైనవి, చిన్నవి, పెద్దవి. అట్లే పండ్లలోను ఎన్నో రకములున్నవి. పూలమొక్కల సంగతి చెప్పనవసరములేదు. ఒక్క గులాబీపూలలోనే వేలకు వేల రకములు బల్గేరియాలో యున్నవట. మందార, చామంతి, బంతి మున్నగువానిలో మన మెన్నోరకములు చూచుచున్నాము.

ఈవిధముగా జంతువులలోకూడ మనకు జాతులు కన్పించును. ఉదా. కోళ్ళు, పావురములు, ఆవులు, గేదెలు కుక్కలు, మున్నగు వానిలో ఎన్నోరకములున్నవి. ఇక మానవులను చూతము. వీరిలోకూడ పలురకములున్నవి. నీగ్రోలు, ఆర్యులు, ద్రావిడులు, చైనావారు ఇత్యాదులు.

ఈవిధముగా జాతులు (genera) ఉపజాతులు (species) రకములు (variety) ఎట్లేర్పడినవి. ఇవన్నియు పూర్వము నుండి యున్నవనిన మనము నమ్మజాలము. ఏలనన మన కండ్ల ఎదుటనే ఎన్నో క్రొత్త రకములు దిన దినము పుట్టుచున్నవి. కోయంబత్తూరులో శ్రీ టి. ఎస్. వెంకట్రామనుగారు సృష్టించిన చెఱకు రకములు జగత్ప్రసిద్ధములు. ఇట్లు జాతులు వుపజాతులెట్లేర్పడుచున్నవి ?

భూమి పుట్టినప్పుడు నేడున్నన్ని జీవులులేవు. కాలక్రమేణా వీని సంఖ్య పెరిగిపోయినవి. ఒక్క వేపచెట్టు ఒక సంవత్సరములో వేనకు వేలు కాయలు కాచును. ఇవన్ని తిరిగి చెట్లయినచో భూమంతయు వేపచెట్లమయముగా బహు కొద్దికాలములో జరుగవచ్చును. కాని సృష్టి వైపరీత్యము చాలవరకు అవి పుట్టగనే చచ్చును. మొలకెత్తిన వానిలో వానిలో వానికి చాలపోటీ (struggle for existence) యుండును. ఈపోటీలో గెలుపొందుటకు వానిలో కొన్నిటి కెక్కువ శక్తి యుండవచ్చును. లేదా చిన్న భేదములుండవచ్చును. ఈ చిన్నమార్పులు కలిగియుండుటవలననే కొన్ని మొక్కలు మాత్రమే బ్రతుక కలుగుచున్నవి. ఇవి లేనివి చనిపోవుచున్నవి. ఇట్లు చిన్న చిన్న మార్పులనేకములు చేరి కాలక్రమేణ

# (మార్పులు) అనగానేమి ?

ఒక పెద్ద మార్పయి వేరొక జాతి ఏర్పడును. అని డార్విను భావము.

లామార్కు అను వేరొక శాస్త్రవేత్త "aquired characters are inherited" అనగా జీవి తన జీవిత కాలములో కొన్ని గుణములను అలవాటు చేసికొనినచో అవి వాని బిడ్డలకు కూడ సంక్రమించునని చెప్పెను. జిరాఫీకి ఎంతో పెద్ద మెడయున్నది. దీనిపూర్వీకులకంత పొడుపైన మెడ లేదట. కాని చెట్లపై ఆకులు తినుటకై మెడను ఎత్తుచు జాపుచు యుండుటచే దాని మెడ సాగినదట. వీరి అభిప్రాయము ప్రకారము కొన్ని అవయవములు (orgus) ఎక్కువగా పనికివచ్చుటచే అవి ఎక్కువగా అభివృద్ధి చెందినవి. అవసరములేని అవయవములు క్రమేపీ నామమాత్రముగానో లేక పూర్తిగానో లేకుండ పోవుట జరుగుచున్నది. కనుక use and disuse అనగా ఉపయోగించుట, ఉపయోగములేకపోవుట. అను విషయమును బట్టి క్రొత్త లక్షణములేర్పడును. వీనిలో ఉపయోగకరమైన మార్పులు (variations)వారి బిడ్డలకు కూడ సంక్రమించునని వీరు చెప్పెదరు.

డివ్రిసు అను శాస్త్రజ్ఞుడు ఈ మార్పులు నెమ్మదిగా సంక్రమింపవనియు అవి తలవని తలంపుగా ఏదో మనకు గోచరముకాని కారణమువలన మార్పుచెందునని, ఈ మార్పు వంశపారంపర్యముగా వచ్చునని చెప్పెను. వీనినే మ్యూటేషను (mutation) అని అందురు. ఈ మ్యూటేషను ద్వారా కొత్త రకము లేర్పడినవని వీరి నమ్మకము.

ఈ మ్యూటేషను జీవి యొక్క ఏదశలోనైనను, లేక ఏభాగమందయినను ఏర్పడవచ్చును. కొన్ని చంద్రకాంత చెట్లు(Miralitsదీనినే 4o clock plant అంటారులెండి) ఎల్లప్పుడూ తెల్లని పూవులనె పూయును. కాని ఉన్నట్లుండి ఒక సాయంత్రము దాని ఒక కొమ్మను ఎర్రని పూలు కనబడును. కొన్ని బంతి, జాజి, మందార మున్నగు వానిలో ఒంటిరెక్క పూల చెట్లు కపుడపుడు ముద్ద పూలు పూయును. ఈ మార్పులకు కారణమేమి ? ఈ మ్యూటేషను germinal material(తలిదండ్రులనుండి బిడ్డలకు సంక్రమించు జీవ పదార్థము)లో ఏర్పడిననేగాని ఆ మార్పు వంశపారం పర్యముగారాదు. మిగిలిన ఏభాగములోవచ్చినను అవి బిడ్డలకు సంక్రమింపవట.

ఈ మ్యూటేషనులు సృష్టిలో చాల మనకు కన్పించుచున్నవి. కొందరు కృత్రిమముగా మ్యూటేషనులు తయారు చేసి తమ యిచ్చవచ్చిన రకములగు జంతు వృక్షములను తయారు చేసుకొనుచున్నారు.

మన పరిసరముల వలన ఏర్పడి మార్పులు మన బిడ్డలకు సంక్రమింపని వైసుమానువాదము. ఈ వాదము నేడు చాలమందిచే అంగీకరింపబడినది.

కాని రష్యాదేశములోని మేటి శాస్త్రవేత్తలగు లిసెంకో, మిచురిన్, మున్నగువారీ వాదమును తీవ్రముగా ఖండించుచున్నారు. వీరు మన పరిసరములను బట్టియే మనలో మార్పులు గలుగుచుండునుగాని తలిదండ్రుల నుండి మనకేమియు సంక్రమింపదనియు, ఏ పరిసరము లయిన ఒక జీవికి అనుగుణ్యముగా నున్నచో ఆ పరిసరములకు సరిపడు మార్పులు వానికి కల్గునని నమ్ముదురు. ఇట్టి మార్పుల వలననే కొత్తజాతులేర్పడునట, అంతేకాని garn plasm లో ఏమార్పులు రానవసరములేదట. వీరి వాదము రష్యాలోతప్ప మరి ఏ యితర దేశములలో ప్రాబల్యమునకు రాలేదు.

ఎవరివాదము లెట్లున్నను, వారిలోవారు నిరంతరము అహమహమికతో శాస్త్రవేత్తలు పోట్లాడుకొనుచున్నను భగవంతుడింకను రోజు రోజునకు కొత్తలను పుట్టించుచునేయున్నాడు. వారి తికమకలనింకను ద్విగుణీకృతము చేయుచున్నాడు.



# "ప్రథమ చికిత్స"

డాక్టర్ ఎన్. హనుమంతరావు.

## "అంతరంగములనుండి రక్తము కారుట"

అంతరంగములకు దెబ్బ తగులుటవలన నాపశక్యము కాని రక్తము వెడలును. అందువలన నీక్రింద వ్రాయబడిన గుణములు గాన్పించును. కారణమేమి గనబడని ఎడల రక్తము దమనులనుండి యంగములలో నొకదాని లోనికిగాని యెదలోనికిగాని యుదరములోనికిగాని కారుచున్నదని యూహింపవచ్చును.

1. ముఖ్యముగా నిలువబడియుండినప్పుడు బలము త్వరలో తగ్గుట తలతిరుగుట మూర్ఛిల్లుటగల్గును.

2. ముఖమును పెదవులును తెల్లబారుట, శరీరము చల్లబడుటయు సంభవించును.

3. శ్వాస అధికముగాను కష్టతరముగాను వచ్చుటయేగాక యావలింతలతోను నిట్టూర్పులతోను కూడియుండును.

4. చేతిమణి కట్టుదగ్గరనాడి కొట్టుకొనుట యాగిపోయి ఒకవేళ సంపూర్ణముగా కనబడకుండపోవచ్చును.

5. రోగి కాళ్ళుచేతులను కొట్టుకొనును మెడచుట్టునున్న వస్త్రములను లాగుకొనును గాలికొఱకు నల్లాడును.

6. తుదకు రోగిపూర్తిగా స్మారకము తప్పిపోవును.

### "చికిత్స"

1. సాధ్యమైనంత త్వరలో వైద్యసహాయముకొరకు పంపుము.

2. రోగినివెల్లికలగా పరుండబెట్టి శిరస్సును క్రిందిగా నొక ప్రక్కకువాల్చి పెట్టుము.

3. బిగువుగానున్న వస్త్రములనన్నింటిని వదలు చేయుము.

4. ఎక్కువగాలి దొఱకునట్లు చేయుము.

5. ముఖముమీద చల్లనినీళ్ళను చల్లిముక్కు దగ్గర పీల్చుస్మెల్లింగు సాల్ట్‌ను ఉంచుము.

6. మంచుగడ్డను చప్పరించుటకిమ్ము. చల్లనినీళ్ళను త్రాగుటకీయవచ్చునుగాని యుద్రేకమును గల్గించుపదార్థముల నెంతమాత్రము నియ్యకూడదు.

7. రక్తమెచ్చోటినుండి కారుచున్నది తెలిసిన ఎడల ఆస్థలమందు మంచుగడ్డ సంచినిగాని, చల్లనినీళ్ళతో దడిపిన బట్టనుగాని యుంచుము.

8. రోగియొక్క కాళ్లుచేతులు చల్లబడినఎడల కాళ్లను పైకెత్తిపట్టి కట్టుబట్టతో బొటనవ్రేలినుండి చప్పవఱకును, చేతివ్రేళ్ళనుండి భుజమువరకును బిగించికట్టుము.

## "బెణుకులు"

అకస్మికముగా తిరుగుటవలనగాని మెలిబడుటవలనగాని కీలుచుట్టు ప్రక్కలనున్న నరములు, కీలుచుట్టునున్న తదితరమైన కండరములు సాగిచినిగిన ఎడల కీలుబెణికినదని చెప్పుదురు.

### గుణలక్షణములు

1. కీలువద్ద నొప్పి.

2. కాలుపయోగించుటలో నొప్పి అధికమగుట.

3. వాచుటయు, రంగుమారుటయు.

### "చికిత్స"

1. అవయవమును సుఖకరమైన స్థితిలోనుంచుటకు ప్రయత్నించుము.

2. కీలునకు మంచుగడ్డగాని, చల్లనినీళ్ళతో ముంచిన బట్టనుగాని కట్టుము.

3. చల్లదనమువలన నొప్పి తగ్గనిఎడల వేడినీళ్ళతో కాచుము.

4. బోరిక్‌పౌడరును ఒక గుడ్డలో పొట్లముకట్టి వేడినీళ్ళద్వార దానిని కాపుము.

## "మూత్రపిండములు"

మూత్రపిండములు. 11, 12, ప్రక్కటెము కలువిరుగుటవలననేగాక, చితుకగొట్టుటవలనను, గ్రుద్దుటవలనను గల్గును.

మూత్రముద్వారా రక్తము వెడలవచ్చును, దెబ్బతగిలిన మూత్రపిండమునకును వాపును, నొప్పియు, కలుగును. మూత్రకోశమునకు ఉపస్థాశయము విరుగుట

వలన, దెబ్బ తగులుటవలన, మూత్రము సరిగా రాకుండుట, మూత్ర మురక్తము గలిసివచ్చుటయు సంభవించును.

"చికిత్స"

1. దెబ్బతగిలి నొప్పిగానున్న స్థళమున మంచుగడ్డను గాని, స్పిరిటునుగాని, లేక తడిబట్టనుగాని వేయుము.

2. ప్రేగులుగాని, ఇతర అవయవములుగాని, గాయముగుండా వెలుపలికివచ్చిన ఎడల :—

3. రోగిని వెల్లికలగా పరుండబెట్టుము మోకాళ్ళను ముడిచి, మీదికిలాగి, శిరస్సును, భుజములను పైకెత్తి పెట్టుము.

4. మెత్తని తువాలు, లేక లింటు, లేక శుభ్రమైన సన్ననిబట్టను సహింపతగినంత వేడినీళ్ళతో ముంచి చుట్టుము. లభించిన ఎడల ఆ నీళ్ళతో ఒక టీగరిటెడు ఉప్పును, ఒక పైంటునీళ్ళను కలుపుము.

5. దూదితోగాని, మెత్తని శుభ్రమైన ఉన్నిబట్టతో గాని కప్పుము.

6 రోగియొక్క దేహమున కిరుప్రక్కలను, వేడి నీటి సీసాలనుపెట్టి, రోగిని వేడిగానుంచుము. ఉదరము పై బరువు పెట్టవలదు.

7. నోటిగుండా తినుటకుగాని త్రాగుటకుగాని ఆహారము ఏమియు నియ్యవలదు.

8. వైధ్యుని సాధ్యమైనంత త్వరలో పిలువనంపుము. వైధ్యుడు త్వరలో దొరుకనిఎడలపై పైనచెప్పిన రీతి వేడినీళ్ళతో కాపుము. ఆ నీళ్ళను అర్ధగంటకు ఒకమారు మార్చుము.

**అవయవములు గాయముగుండా బయటకు రానప్పుడు ?**

గాయము తిన్నగానున్న ఎడల, రోగిని వీపుపై పరుండబెట్టి, కాళ్ళను చక్కగా చాపుము.

2. ఒకవేళ గాయము అడ్డముగానున్న ఎడల, రోగిని తన వీపుపై పరుండబెట్టి, మొకాళ్ళనుముడిచి, పైకిలాగి శిరస్సును, భుజములను, నెత్తిపెట్టుము. పొడికట్టుబట్టలను కట్టుము.

3. పైకట్టుబట్టలను, వెడల్పు కట్టుగుడ్డతో బిగుతుగా కట్టుము.

4. రోగిని వేడిగానుంచుము

5. నోటిగుండా నేమియు నివ్వగూడదు.

6 వైధ్యుని బిలువనంపుము.

"ఉడుకు బొబ్బలు కాలుట"

ఉడుకు బొబ్బలు తారువలనగాని, ఉడుకు నూనెవలన గాని, పొంగుచున్న నీళ్ళవలనగాని, యావిరి వలనగాని కలుగుచున్నవి.

కాలుట వలన బొబ్బలెక్కిన భాగము మీదనున్న వస్త్రములను జాగ్రత్తగా తీసివేయుము. గాయమునకు వస్త్రము అంటుకొనిన ఎడల కత్తెరతో దానిని కత్తిరించుము.

2. ఉడుకు బొబ్బలరు చితుక వలదు

3. వెంటనే గాలి తగులకుండ చేయుము.

4. గాయపడిన భాగమును దేహోష్ణమునకు సమానమైన వేడినీళ్ళలో నుంచవలయును. ఒక చిన్న గరిటెను వంట సోడాను, ఒక గ్లాసు వేడినీళ్ళలో వేసి కలిపి గాయముపై తడుపుము. వెంటనే మంట చల్లారును. గాయమునకు అంటుకొనిన బట్టలను తడిపి తీసివేయుటకు సహాయపడును.

5. గాయపర్చబడిన భాగమును దూదితోగాని, ఉన్నితోగాని, కట్టు గుడ్డలతోగాని వదలుగా కట్టుము.

"పసిబిడ్డ కాలినచో ?"

"చికిత్స"

పసిబిడ్డ అధికముగా కాలి బొబ్బలు నొందిన ఎడల వైద్యుడు వచ్చువరకు గుడ్డలను తీయకయే దేహము యొక్క ఉష్ణముతో సమానమైన వేడినీళ్ళతో తడుపుచుండవలయును. ఇటుల చేయుటవలన అదురు, నొప్పియును తగ్గును. ముఖము కాలినఎడల కండ్లకును, నోటికిని, రంధ్రములను విడిచి ముఖమునకొక ముసుగు సిద్దము చేసి దానిని వంట సోడా ద్రావకముతో తడిపి కట్టుము. తరువాత దానిని తడుపుచునే ఉండవలయును.

"మనుష్యుని బట్టలకు నిప్పంటుకొనినచో ?"

1. సహాయము చేయుటకు వెళ్ళువారు తనకు ముందుగా దుప్పటిగాని, కోటునుగాని పట్టుకొని వెళ్ళవలయును.

# "ప్రథమ చికిత్స"

2. ధరించియున్న వస్త్రములను నిప్పంటు కొన్న భాగమును పైకుండునట్లు పరుండ బెట్టుము. అనగా ముందు భాగమునందు నిప్పంటుకొనినఎడల రోగిని వెల్లికిలగా పరుండ బెట్టవలయును. కారణమేమనగా మంటలెప్పుడును ఊర్ధ్వ ముఖముగా లేచును. వెనుక భాగమందు నిప్పంటుకొనిన ఎడల, రోగిని బోరిగిల పరుండబెట్టుము. నిలువబడి యుండినఎడల మంటలు తక్షణమే మెడకు, ముఖమునకు, తల వెండ్రుకలకును వ్యాపించును. కనుక మంటలు ఎప్పుడును పైకుండునట్లు పరుండబెట్టుము.

3. వెంటనే రోగిని, దుప్పటి మొదలగువానితో కప్పి మంటలనార్పవలయును.

4. ఎవరు దగ్గరలేని సమయమందొకరి దుస్తులు నిప్పంటుకొనిన ఎడల వెంటనే మంటలు పైభాగమునం దుండునట్లు పండుకొని, చేతికి చిక్కినదానితో, మంటల నలిపివేయుటకు ప్రయత్నము చేయవలయును. సహాయము కొరకు కేకవిడవలయును. కాని గాలిలోని కెంత మాత్రము పరుగిడరాదు.

5. కాలిన భాగమును ఆల్కాలీ నీటితో అనగా ఒక పైంటు వేడినీళ్ళతో ఒక పెద్ద గరిటెడు వంట సోడాను గాని, బట్టలు ఉతుకు సోడాగాని కలిపి ఆ నీళ్ళతో తడుప వలయును. ఇది దొరకని ఎడల కాలిన భాగముమీద విరామము లేకుండ వేడినీళ్ళను పోయవలయును.

6. త్వరలో లభించిన ఎడల నిమ్మరసమును సమపరిమాణమైన ఉడుకు నీళ్ళతో కలిపి ఆ నీళ్ళతో గాయమును తడుపవలయును.

"విష జంతువుల వలన కలుగు గాయములకు ?"

పాము, తేలు, పిచ్చికుక్క, నక్క పిల్లి తోడేలు మొదలైనవి కరచుటవలన సంభవించును.

" చికిత్స "

1. రక్తము విషమును శరీరమంతటికిని తీసికొని పోకుండునట్లు, గాయమునకును, గుండెకును నడుమ త్రాటితోనైనను, పట్టితోనైనను చేతిరుమాలుతోనైనను, గట్టిగాకట్టుము.

2. యువకులైన ఎడల రెండుగరిటెల బ్రాందినొక గ్లాసు నీళలోకలిపి, త్రాగుటకిమ్ము.

3. దిగువచెప్పిన రీతి, రక్తప్రవాహమును వృద్ధి చేయుము. అట్లుచేయుటవలన లోపలినుండివచ్చు రక్తమును గాయమును శుద్ధిచేయును.

1. గాయమును వేడినీళ్ళతో కడుగుము.

2. గాయపడిన భాగమును క్రిందికి యుంచవలయును. చేతికి గాయము తగిలిన ఆచేతిని క్రిందికి వ్రేలాడ వేయుము. కాలైనచో, కాలిని భూమిమీదనే పెట్టియుంచ వలయును.

4. చికిత్సకుని సహాయము దుర్లభమైన ఎడల, నిర్మలమైన కార్బాలిక్ మొదలగువానితో జేసిన ద్రావకమును, సన్ననిపుల్లతో గాయమునకు పూయవలయును. ఒకవేళ గాయము విషసర్పమువలన గల్గినదైన ఎడల, ఆ ద్రావకమును వాడక, గాయముచుట్టునున్న చర్మమును గోసి, పొటాస్ పర్మాంగనేటు, చూర్ణముచేసి, గాయముపై రుద్దవలయును. ఇది లభించని ఎడల, టింక్చర్ అయోడీనునుగాని, స్పిరిటునుగాని, విస్తారముగా బూయవలయును.

5. తదుపరికట్టిన కట్టును తీసివేయవలయును.

6. రక్తము కారుట నిలిచిన తరువాత మందుబట్టలను వేసికట్టుము.

7. గాయపడిన భాగమునకు సాధారము గలుగ జేయుము.

" చలికాటు "

అతిశీతలకాలములో దేహము, సాధారణముగా పాదముల వ్రేళ్ళు, ముక్కు, చెవులు మొదలగునవి స్పర్శ జ్ఞానములేక మొద్దుబారి, తరువాత రక్తము పేరుకొని, ఊధారంగునకు మారును. స్పర్శజ్ఞానము తప్పి పోవుటవలన నితరులుచెప్పుట ద్వారా చలికరిచినట్లు రోగికిదెలియవచ్చును.

" చికిత్స "

మెల్లని రాపిడి ద్వారాను, కొంచెము వేడిని జూపుట వలనను; స్మృతియు, రక్తప్రవాహము సరిపడువరకు రోగిని, వేడిగదిలోనికి దీసికొనిపోగూడదు. దీని నలక్ష పెట్టుటవలన. చలికాటు గలిగిన స్థలమందశికండరములు, చచ్చుపడును. తడిసేవిధముగనైనను తగులనీయకుము.

### "చర్మము క్రిందికి సూది గ్రుచ్చుకొనినచో ?"

సూది గ్రుచ్చుకొని, విరిగి, చర్మము క్రింద కనుపించకుండగనున్న ఎడల రోగిని విరిగిన సూది ముక్కను, వైద్యుని యొద్దకు తీసికొనివెళ్ళుము. ఒకవేళ, సూది కీలునకు దగ్గరగావిరిగిన ఎడల కీలు కదలకుండ కట్టుబద్దను వేసికట్టుము. టించర్ అయోడిన్‌ను రాసి పట్టి కట్టుము.

### " కంటిలోని యన్యపధార్థము "

1. రోగి కన్నులు నలుపకుండునటు ప్రయత్నము చేయుము. చిన్నపిల్లలైన చేతులను కట్టివేయుము.

2. కంటియొక్క క్రింది రెప్పను క్రిందికిలాగుము. కంటిలోని యన్యపధార్థము కనుపడుచున్న ఎడల, ఒంటె వెంట్రుకలతోగాని శుభ్రమైన చేరుమాలుయొక్క కొనను గాని వడిత్రిప్పి స్వచ్ఛమైన నీళ్ళలోముంచి, కంటిలోని పదార్థమును తీసివేయవలయును.

3. అన్యపదార్థముపై కనురెప్ప క్రిందయుండిన ఎడల, పైకను రెప్పను పైకెత్తి, క్రింది కనురెప్పను లోపలికి వదలి దానిమీద పైరెప్పనుంచుము. యిటుల చేయుటవల క్రింది కనురెప్పమీది వెంట్రుకలన్యపధార్థమును దీసివేయగల్గును. ఈప్రయత్నమువలన లాభము కలుగని ఎడల, ఆప్రకారమే మరికొన్నిసార్లు ప్రయత్నము చేయుము. అప్పటికి నన్యపదార్థము బయటికిరాని ఎడల.

4. రోగిని వెలుతురుకు ఎదురుగా కూర్చుండబెట్టుము. తదుపరి రోగితలను వెనుకకువంచి నీరొమ్ముపై నానించుకొనుము.

5. నన్యపధార్థముకంటె గ్రుడ్డులో జేరుకొనిన ఎడల దానిని తీయుటకు ప్రయత్నము చేయకుము నూనెనైనను, ఆముదమునైనను, కొన్నిచుక్కలు కంటిలో పోసిరెప్పలను మూయుము. తదుపరి దూదితో చేయబడిన మెత్తను కన్నుమీద పెట్టి కట్టుగుడ్డతో కట్టి వైద్యునియొద్దకు తీసికొని వెళ్ళుము.

పై విషయములందు పాఠకులకు ఏవేని సందేహాము లున్న మాకు వ్రాసిన పత్రికా ముఖమున తిరిగి జవాబు లివ్వబడును.

—సంపాదకురాలు.

# సంక్షేమం



"ఆకసం వాత్సల్య పూరితం కాకపోతే ఈ ప్రపంచంలో ఎవడు బ్రతికి బట్ట కట్ట కలడు ?

పిల్లలు దుమ్ములో తిరగడం ఇష్టపడతారు ; పువ్వులలాగే పిల్లలు కూడా ఎండలోనూ, గాలిలోనూ ఆడుకోడం కోసం ఉబలాట పడతారు. ప్రకృతితో కలసి మెలసి వుండాలనే వాళ్ళ ఆకాంక్ష; తదనుగుణ్యంగా చేతులెత్తి పిలిచే ప్రకృతి ఆహ్వానం ఎప్పటికీ వారు తిరస్కరించలేరు !

లోకంలో పాతుకు పోయిన ఆచార వ్యవహారాలూ, సాంఘిక వ్యవస్థా, వీరిని కృత్రిమ ప్రపంచంలో బంధించాయి.

ఎక్కువగా స్వేచ్ఛ వుండేదీ, ఉండవలసిందీ బాల్యంలో మాత్రమే !

ఈ వయస్సులోనే పరిమిత పరిధులలో పరిభ్రమించే పాతకాలపు సామాజిక విధానాలనుండి విడదీసి స్వేచ్ఛా వాయువులను పీల్చే అవకాశం కల్పించాలి మన పిల్లలకు."

— రవీంద్రనాథ్ టాగూర్



## వెల్ఫేర్ బోర్డు యిన్‌స్పెక్టర్ డైరీనుంచి

....సగం వంగిన అతని శరీరం, దిక్కూ మొక్కూ
లేనట్లు దీనంగా చూచే అతని చూపూ, ఏ రైల్వే
స్టేషనులోనైనా నన్ను వెన్నంటుతూనే వుంటుంది....

రైలు కదలడానికి ఇంక పదిహేను నిమిషాలు మాత్రమే వుంది. టిక్కెట్టు కొనడానికి నా దగ్గరవున్న చిల్లర లెక్కపెట్టుకుంటున్నాను. ఇంతట్లోనూ నా వెనుక నుంచి ఎవరిదో ధ్వని వినపడి ఆవైపు తిరిగి చూచాను. వంగి నడుస్తూన్న ఒక చిన్న పిల్లవాడు చెయ్యి చాచి "బాబూ, ఒక్క పైసా ధర్మం చేయండి! బాబూ" అంటూ చెయ్యి చాపేడు— ఆ కుర్రాడు అలా వంగి నిల్చోవడం తెచ్చిపెట్టుకుని నటిస్తున్నాడనే విషయం ఆక్షణంలోనే కనిపెట్టాను. మొహం అదోలా అసహ్యంగా పెట్టి మెడ ఒక వైపుకి వంచి, ఈగలూ అవీ ముసిరేలా పళ్ళు పైకి పెట్టి, దిక్కులేని వాడిలా అందరి దృష్టినీ ఆకర్షించడానికి తంటాలు పడుతున్నాడు! వాడి కాళ్ళు వంకరగానూ, నడుం గూనిగానూ పెట్టి, చేతులు పెనవేసుకుని, చాపలేక చాపి ముష్టెత్తుతున్నాడా కుర్రాడు. ఇదంతా చూస్తే, వాడు నిజంగా కుంటివాడు కాదనీ, ముష్టెత్తుకోడానికి అలా తయారయాడనీ తేలింది!

రైలు కదలడానికి ఇంక కొద్ది నిమిషాలే వ్యవధి వున్నా ఆకుర్రవాణ్ణి వదిలి వెళ్ళిపోవడానికి మనస్కరించ లేదు నాకు!

"చూడోస్తే తెలివైనవాడిలా వున్నావే! ముష్టెత్తుతున్నావేం?" అని ప్రశ్నించాను.

"బాబూ, ఒక్క పైసా ధర్మం చేయండి" అని జవాబు!

"నీలాంటి కుర్రాళ్ళు ముష్టెత్తకూడదు. తక్కిన కుర్రాళ్ళలా స్కూలుకి వెళ్ళి, చక్కగా చదువుకొని, పెద్దయాక హాయిగా సంపాదించుకోవాలి ఒకళ్ళమీద ఆధారపడకుండా; అంతేకాని ఒకళ్ళదగ్గిర డబ్బుకోసం చెయి చాపకూడదు" అన్నాను.

ఈమాటలు వినడంతోటే ఆ కుర్రాడు బిత్తర పోయాడు. నోటమ్మట మాటలేకుండా నా వైపు అలాగే చూడ్డం మొదలు పెట్టాడు.

ఇంతట్లోనూ నా సూట్‌కేసు వాడి చేతికిచ్చి "ఇదిగో ఇది తీసుకురా నాతో— అందరి కుర్రాళ్ళలా నువ్వుకూడా ఎందుకు నడవలేవో చూస్తాను" అన్నాను.

అనుకోకుండానే నా పెట్టె తీసుకొని కొంచెం నిలబడ్డాడా కుర్రాడు!

"చూశావా నాలాగే నువుకూడా ఎలా నిలబడగలిగావో, నీకసలు గూనూ లేదు ఏమీ లేదు! నువ్వుకూడా అందరిలాగే పనిచేయగలవు. అందుచేత ఇకమీదట ముష్టి ఎత్తకు!" అని నా పెట్టె తీసుకుని డబ్బేమీ ఇవ్వకుండా నే వెళ్ళిపోయాను—

రైలు వేళ అయిపోయిందాయెను మరి! వెళుతూ వెళుతూ వెనక్కి తిరిగి చూస్తినిగదా ఆకుర్రాడు మళ్ళీ యథాప్రకారంగా సగం వంగి, మూగివాడిలా కళ్ళప్పగించి నా వైపే చూస్తూ వుండిపోయాడు!

   

రైల్లో కూర్చున్నప్పటినుంచీ ఆ కుర్రవాడి విషయమే నా మనస్సుని కలతపెట్ట సాగింది. అకుర్రవాని ద్వారా తమ పొట్ట పోసుకొనే కొందరు స్వార్థపరుల బారినుండి, వాణ్ణి రక్షించలేకపోయానే అనే విచారం నన్ను వేధించసాగింది. స్కూలుకి పోయి, సంతోషంగా కాలం గడిపే ఇతర పిల్లలలాగే తనుకూడా వుండవచ్చు ననీ, కుంటివానిలా, రోగిష్టివానిలా నటిస్తూ పొట్టకూటికి ముష్టెత్తుకొనే అవసరం తనకు లేదనే విషయం అకుర్రవానికి తెలియజేయడం భావ్యంకాదూ?— అలాంటి ఆశా, కోరికా నా మాటలవల్ల ఆ కుర్రవానికి కొద్ది క్షణాలు కలిగివుండవచ్చు బహుశా; కాని దానిని కార్యరూపంలో పెట్టివుండటం నా బాధ్యతకాదూ! పొట్టకోసం ముష్టెత్తుకోడానికి బదులు అకుర్రాడు ఏబాధలూ లేకుండా హాయిగా ఆడుకోడానికీ, చదువుకోడానికీ ఒక ఇల్లంటూవుంటే ఎంతగా సంతోషించేవాడో! అలాంటి తెలివైన పిల్లలకి భారత దేశంలో సంరక్షణాలయాలు ఇతోధికంగా ఉండాలికాదూ!

— ఖటూన్ క్వమెరిన్



# ఆణిముత్యాలు

ప్రతి శిశువుకీ గృహమూ, తద్వారా లభించే ప్రేమా, సంతృప్తి వుండితీరాలి - ఇట్టి గృహములులేని పిల్లల విషయంలో వాటిస్థానే శిశు సంరక్షణాలయములు తగిన శ్రద్ధవహించాలి.

"శిశువు మానవుని తండ్రి" అనే సూక్తి ఆధునిక మనస్తత్వ పరీక్షకి నిలువబడగలిగింది. శిశువుకివర్తించే ప్రతి సమస్యా ఆ కుటుంబానికంతటికీ వర్తించి తీరుతుంది. శిశువు దేశానికీ, దేశాభివృద్ధికీ అతిముఖ్యమైన వ్యక్తి అనే సంగతి విస్మరిస్తూవుంటాము. శిశుసంక్షేమం మీదనే దేశపు ఆరోగ్య ఐశ్వర్యాలేకాక, ఒకజాతి మనుగడే ఆధారపడివుంటుందనే సత్యాన్ని మనం మరువరాదు. పురోగతి చెందిన పెక్కుదేశాల్లో 'శిశుసంరక్షణ'కు అన్నిటికంటె ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది.

శిశు మనస్తత్వ శాస్త్ర రీత్యా శిశువుయొక్క శారీరక, మానసిక, పరిసరాది అవసరాలకి గృహమే తగిన స్థలమని చెప్పబడింది. మనజీవితంలో చాలాభాగం ఇంటిలోనే గడుపుతాం — ఇంటియొక్క ప్రభావంమనలో అను గడుగునా కానవస్తూనేవుంటుంది.

శిశువుల అభివృద్ధీ, సంక్షేమం ఎంత ముఖ్యమైన విషయాలో వేరే చెప్పనవసరంలేదు. "ప్రాక్పశ్చిమాల గృహమే మహోత్కృష్టమైనది" అన్న సూక్తి పిల్లల విషయంలో చక్కగా వర్తిస్తుంది. అందుచేత మనం పిల్లల ప్రాథమికావసరాలని బాగా అవగాహన చేసికొని వీటిని సాధించే మార్గాలని అనుసరింపవలసివుంటుంది.

## శిశు సంక్షేమం

# శిశుసంక్షేమం

ఎమ్. బి. సెయెల్స్ "ప్రోబ్లమ్ ఛైల్డ్ ఎట్ హోమ్" అనే గ్రంథంలో పిల్లల ఉద్రిక్తావసరాలనిగూర్చి ప్రస్తావిస్తూ "శైశవంలో పిల్లల మానసికోద్రేకాలనీ, వాంఛలనీ తగువిధంగా తీర్చకపోవడం వల్లనే అనేకమంది మనోవ్యాధులకి లోనవుతున్నారు" అనివ్రాశారు.

పిల్లల అవసరాలలో అంత్యంతముఖ్యమైనది 'రక్షణ'. పిల్లల ఆరోగ్యాన్ని కాపాడటం ఎంత ముఖ్యమో, ఆప్యాయంతో, ప్రేమతో వారినిలాలించడం, పోషించడం అంతే ముఖ్యం. పిల్లల రక్షణకి తల్లిదండ్రుల 'ప్రేమ' ప్రాథమికావసరం. భార్యాభర్తలు కీచులాడుకోవడం, తల్లిదండ్రులు చనిపోవడం, విడిపోయిన తల్లిదండ్రుల కుటుంబంలో పెరగడం, తల్లిదండ్రులనుండి వేరుచేయబడి దూరపుబంధువుల ఇండ్లలో పెరగవలసిరావడం — యిటువంటి పరిస్థితులే పిల్లలను నేరస్థులుగా (క్రిమినల్స్) తయారుచేయడానికి తోడ్పడుతాయి.

పిల్లల సంరక్షణ విషయంలో 'ప్రేమ' ప్రథమస్థానం వహిస్తుంది. ఈ ప్రేమ పిల్లలకు తమ ఇళ్ళలో తల్లిదండ్రుల వల్లనే లభిస్తుంది ముఖ్యంగా. ఒక కుటుంబము యొక్క ఆర్థిక స్తోమత ఏవిధంగావున్నా, పిల్లలకు ముఖ్యంగా కావలసింది తమ తల్లిదండ్రుల ప్రేమ; ప్రత్యేక శ్రద్ధ. ఇది లభించనినాడు పిల్లలు ఇతర ఉద్రిక్తతలకిలోనై, సంఘంతో సహకరించనివారుగా తయారవుతారు. పిల్లలు పరిపూర్ణమైన వ్యక్తిత్వాన్ని పొందాలంటే—సమగ్రమైన ప్రశాంతమైన గృహజీవనం గడపాలి. ఉదాహరణకి తల్లిని తండ్రి అస్తమానమూ తిడుతూ వుంటే, స్త్రీలంటే అసహ్యభావం చిన్నప్పటినుంచీ పిల్లలలో ఏర్పడి పెద్దయిన తరువాత తమ భార్యల యెడలకూడా అదేభావంతో వాళ్ళు ప్రవర్తిస్తారు. అందుచేత తల్లిదండ్రులు తమ పిల్లలను ఇలాంటి ఉద్రేకాలకి లోనుకాకుండా ప్రశాంతమైన జీవితం గడిపేటట్లు చూడాలి.

శారీరకావసరాల దృష్ట్యా చూస్తే, ఇంటి పరిసరాలు ఎలావున్నదీ మనం చూడాలి. పల్లెలలో, సువిశాలమైన ప్రదేశాలలో నివసించే ప్రజలు సాధారణంగా ఉదార స్వభావులుగాను, నిరాడంబరులుగానూ వుంటారు. పట్టణాలలో క్రిక్కిరిసిన ప్రదేశాలలో నివసించే పిల్లలు అనారోగ్యవంతులుగాను, అస్వాభావికమైన నడవడికగలవారుగానూ వుంటారు. వీరికి ఆహారవిహారాదులలో తగిన సౌకర్యాలులేక, ఆవింతపరిసరాలలో అనేక దురలవాట్లకిలోనౌతారు.

ఇంటియొక్క పరిసరాలు ఎంతముఖ్యమో, ఇంటిలో వల వస్తువుల అమరికకూడా అంతముఖ్యమే. ఇంటిలో వల పరిశుభ్రత, ఎక్కడివస్తువులను అక్కడఅమర్చడం, ఆరోగ్యవిధులు, మొదలైనవి పిల్లల శారీరక, మానసిక ఆరోగ్యానికి ఎంతోముఖ్యం.

గృహ జీవనానికీ పిల్లల విద్యకూ ఎంతదగ్గర సంబంధం వుందో ఇప్పుడు పరిశీలిద్దాం. పిల్లలకు విద్యగరపే బాధ్యత తల్లిదండ్రులమీదనేవుంది. పిల్లల తొలిచదువు ఆ కుటుంబంలోవుండే సభ్యులమీదనే ఆధారపడివుంటుంది. చిన్నప్పుడు పిల్లలకు అలవడిన అలవాటులే జీవితాంతం వరకూ వుండిపోతాయి. ఒకరిపైన చెడ్డ అభిప్రాయం వుందంటే అలాంటిది తమ ఇండ్లలోనే అలవడుతుందని మనస్తత్వ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఇంటిలో మంచి అలవాట్లు అలవడకపోతే పాఠశాల చదువంతా వ్యర్థమే!

మతవిషయికంగా, కుటుంబము యొక్క ప్రభావము ఎంతగానో వ్యక్తిపైన పడుతుంది. తల్లితండ్రుల మతాచారాలనే మనం సాధారణంగా అనుకరిస్తూ వుంటాం.

మనస్తత్వ శాస్త్రజ్ఞుల అభిప్రాయంప్రకారం ఇంటినుండి వేరుచేయబడి, రక్షణాలయాలలోనూ, వసతిగృహాలలోనూ పిల్లలు గడపవలసివస్తే శారీరకంగానూ, మానసికంగానూ అంతగా అభివృద్ధి చెందలేరు.

ఇలాంటి సంస్థలలో పెరిగే పిల్లలు శారీరకంగా ఆరోగ్యవంతంగావున్నా మానసికంగా వారికి 'నా' అనే వస్తువులేక, తల్లిదండ్రుల వాత్సల్యం లభింపక, ఒకవిధమైన మానసిక ఉద్రిక్తతకి లోనవుతారు. ఈవిధమైన సంస్థలనుండి బయటికి వచ్చిన యువతీ యువకుల జీవితము ప్రారంభదశలో ఒక సమస్యగా పరిణమిస్తుంది. గృహజీవనభాగ్యం వారికి లభించకపోవడమే దీనికి కారణం. అందుచేత సంస్థలు, గృహజీవనానికి సమానము ఎన్నటికీ కాలేవు!

శిశుజీవితాన్ని అలక్ష్యం చేయడం దేశానికే అరిష్టదాయకం. ఇట్టి పరిస్థితివలన ఎక్కువగా శిశుసంరక్షణాలయాలను నెలకొల్పే అవసరం ఏర్పడటం, తద్వారా జాతీయధనం, శక్తి, వీటికే వినియోగింపబడటం జరుగుతుంది. ఎంతో అవసరం కలిగితేతప్ప పిల్లలను శిశు

సంస్థలకు పంపే అలవాటు తగ్గిపోవాలి. తాత్కాలికంగానైనా పిల్లలు గృహాన్నుంచి వేరుచేయబడటం అరిష్టదాయకమని గ్రహించాలి. అందుచేతనే గృహం అత్యంత ముఖ్యమైనది. గృహానికి సంరక్షకులైన తల్లులు తమ పిల్లల అవసరాలని విధిగా తీర్చాలి. ఇతరత్రా ఉద్యోగాలు చేసే తల్లులైనా, ఇంటివద్ద తాము లేకపోవడంవల్ల పిల్లలకు ఏవిధంగా నష్టమో గ్రహించి, ఈ గృహజీవనం విషయములో తగు ఏర్పాటులు చేసుకోవాలి. ఆకర్షవంతమైన గృహపరిసరాలను సృష్టించి, పిల్లల సర్వతోముఖాభివృద్ధికి తల్లులు ఎంతగానో కృషిచేయాలి. ఈవిధంగా తయారయే పిల్లలు దేశసౌభాగ్యానికీ, దేశనిర్మాణానికీ ఎంతగానో తోడ్పడినవారవుతారు. పిల్లలే నవభారత సౌధనిర్మాణానికి మూలస్తంభాల వంటివారు. రమణీయమైన గృహపరిసరాలు, సౌకర్యాల ద్వారా, పిల్లలను పైకి తీసుకొనిరావలసిన బాధ్యత మన తల్లులపైన ఎంతైనా వుంది.





పసిడి మెరుగులు

కృష్ణా హతీసింగ్ — విజయలక్ష్మి పండిట్

# "శ్రేయోరాజ్య నిర్మాణానికి సంఘ సంక్షేమ కార్యక్రమము ప్రాతిపదిక"

ఈ సత్యాన్ని ఆంధ్ర దేశంలోని సంక్షేమ కార్యకర్తలందరు గ్రహించారు. గత సంవత్సరం ఆగస్టు 15 న స్థాపింపబడిన సంక్షేమ కేంద్రాలతోపాటు ప్రతీ జిల్లాలోను ఈ మధ్య చాలా సంక్షేమ కేంద్రాలు స్థాపితమవుతున్నవి. గడచిన నాలుగు మాసాలలోను ఆంధ్ర దేశంలో ప్రారంభించబడిన సంక్షేమ కేంద్రాల గురించిన వివరాలు జిల్లాల వారీగా ఈ దిగువ క్లుప్తంగా ఇస్తున్నాము.

తూర్పుగోదావరి జిల్లా: డిసెంబరు 25 వ తేదీన, ధవళేశ్వరంలో జిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ కృష్ణమూర్తిగారి అధ్యక్షతను, పి. డబ్ల్యు. డి. ఇంజనీరు శ్రీ శివసుబ్రహ్మణ్యంగారు బాల విహార కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. అధ్యక్షులు వుపన్యసిస్తూ, జపాను, అమెరికా దేశాలలోని పిల్లలకున్న సౌకర్యాలను వివరిస్తూ, మన బాలురను కూడా ఆస్థాయికి తీసుకుపోవలసిన అవసరం వుంది అన్నారు. శ్రీ శివసుబ్రహ్మణ్యంగారు, పిల్లల మనస్తత్వాన్ని సమగ్రంగా చర్చిస్తూ, గాంధీ సిద్ధాంతాలను పిల్లలకు ఆచరణలో నేర్పవలసి వున్నదని, దానికి ఇటువంటి కేంద్రాలు ఎన్నో ఏర్పాటు చేయవలసి వుంటుందని, చెప్పారు. ఆటలపోటీలలో గెలిచిన బాలురకు, శ్రీమతి ధనలక్ష్మి సుబ్రహ్మణ్యంగారు బహుమతులు పంచిపెట్టారు. జిల్లా కన్వీనరు శ్రీ ముత్తంగి అయ్యన్నగారు, సభికులకు వందన సమర్పణ చేశారు. శ్రీ డి. అచ్యుతరావుగారు సూర్యనమస్కారములు, యోగాసనముల ప్రదర్శన, నివేదితా కిశోర్ విహార్ పిల్లలచే భరతమాత టాబ్లో (tableau) శ్రీ రేణుకా ప్రసాద్ గారిచే వివిధరకములైన కవాతు ప్రదర్శనలు, బడి పిల్లలచే ఏకపాత్రాభినయములు మొదలైనవి జరిగినవి.

పశ్చిమగోదావరి జిల్లా: జనవరి 24 వ తేదీన నరసాపురం తాలూకా తుందుర్రు గ్రామంలో డి.ఎం ఓ. శ్రీ ఎత్తిరాజ్ గారి అధ్యక్షతను జిల్లా కలక్టరు శ్రీ జి. సింహాద్రిగారు, మాతా శిశు సంరక్షణాలయమునకు ప్రారంభోత్సవం చేశారు. ఈ కేంద్రానికి తుందుర్రు సహకార సంఘంవారు, రూ 250 లు, బేతపూడి గ్రామస్థులు రూ 100 లు విరాళంగా ఇచ్చారు. తుందుర్రు పంచాయితీ బోర్డు, బేతపూడి పంచాయతీబోర్డు, తుందుర్రు గ్రామస్థులు పెదగరువు, చినగరువు వుప్పరిగూడెం గ్రామ హరిజన పేట, జొన్నలగరువు, కంసాలి బేతపూడి, పెదగరువు క్షత్రియులు, ప్రజలు విరాళాలను ఇచ్చుటకు వాగ్దానం చేశారు. శ్రీ ఆర్. టి. చంద్రరావుగారు కేంద్ర స్థాపనకు చాల కృషిచేసినవారిలో ఒకరు.

కృష్ణా జిల్లా: జనవరి 19 వ తేదీన ఉప్పలూరు గ్రామంలో గవర్నరు సతి శ్రీమతి కుసుమ్ త్రివేది, మాతా శిశు సంరక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవంచేశారు. గవర్నరు శ్రీ త్రివేది ప్రసంగిస్తూ, ఇటువంటి సంస్థలు, కేంద్రాలు ప్రజా సహకారంమీద ముఖ్యంగా ఆధారపడి వుండునని ప్రజా సహకారం కోసం కార్యకర్తలు పాటు పడవలసివుండునని హెచ్చరించారు.

గుంటూరు జిల్లా: జగ్గాపురం, నాదెండ్ల, మురికిపూడి గన్నవరం గ్రామాలలో మాతా శిశు సంరక్షణ కేంద్రాలు స్థాపించబడినవి. జగ్గాపురం గ్రామంలో శ్రీ పోపూరి బసవయ్యగారు కేంద్ర భవన నిర్మాణానికి ఎంతో తోడ్పడుతున్నారు. మురికిపూడి గ్రామంలో శ్రీ బుచ్చయ్యగారు అనేక విధాల సహకరిస్తున్నారు. పై అన్నిగ్రామాలలోను ప్రజలు కేంద్రాల అభివృద్ధికి పాటుపడుతున్నారు. డిసెంబరు 19 వ తేదీన వలపర్ల గ్రామంలో ఆంధ్రరాష్ట్ర సంఘ సంక్షేమ సలహా సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి చెన్నఘంటమ్మ కృష్ణారావుగారు మాతా శిశు సంక్షేమ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. గ్రామ ప్రజలు కేంద్రానికి ఉచిత భవనాన్ని, కావలసిన పరికరాలను ఇచ్చారు.

నెల్లూరు జిల్లా: డిసెంబరు మాసంలో చెన్నూరు గ్రామంలో మాతా శిశుసంరక్షణాలయము, తెరువబడినది.

కర్నూలు జిల్లా: నవంబరు 4 వ తేదీన గోరంట్ల గ్రామంలో మాతా శిశు సంరక్షణకేంద్రం ప్రారంభించబడినది. గోరంట్ల గ్రామం జానాభా 2000. చుట్టు ప్రక్కల గ్రామముల ప్రజలు 2000. మొత్తం 4000 మందికి ఏవిధమైన వైద్య సహాయము అందుబాటులో లేదు. సంఘ సంక్షేమ సంస్థ స్థాపించిన ప్రసూతి కేంద్రం

వలన, స్త్రీలకు చక్కని సౌకర్యాలు ఏర్పాటు అయినవి. రోజుకు 35 మందికి స్నానం, తలదువ్వి, ఆరోగ్య విధులు నేర్పుట, పిల్లలకు, అశక్తులయిన తల్లులకు పాలు పోయుట, మొదలైన కార్యక్రమం జరుగుతున్నది. మంత్రసాని చుట్టుపక్కలలోకూడా గ్రామాలన్నీ తిరిగి, నెలకు, రమారమి 15 పురిటి కేసులను నిర్వహిస్తున్నది. జనవరి 14, 15 తేదీలలో డాక్టరు నటరాజన్ కోడుమూరు, యెమ్మిగనూరు గ్రామాలలో, మాతా శిశు సంరక్షణ కేంద్రాలకు ప్రారంభోత్సవం జరిపించారు. ఈ రెండు కేంద్రాలలోనుకూడా, ప్రజాసహకారం బాగున్నదని, కార్యకలాపాలు చురుకుగా జరుగుచున్నవి అని తెలుస్తున్నది.

కడపజిల్లా : డిసెంబరు 31 వ తేదీన సంఘ సంక్షేమ సంస్థ సభ్యురాలు శ్రీమతి కడప. రామసుబ్బమ్మగారి అధ్యక్షతను, నీలం సంజీవరెడ్డిగారు, నందిమండలం గ్రామ మాతా శిశు సంరక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపారు. ప్రజా సహకారావశ్యకతను గురించి శ్రీ సంజీవరెడ్డిగారు ఉపన్యసించారు. శ్రీ సి. కొండారెడ్డిగారు వందన సమర్పణచేశారు.

అనంతపురం జిల్లా : ధర్మవరం తాలూకా, కుంటిమద్ది గ్రామంలో డిసెంబరు 25 వ తేదీన మాతా శిశు సంరక్షణ కేంద్ర ప్రారంభోత్సవం, జిల్లా కలక్టరు శ్రీ కె. కొండలరావుగారి అధ్యక్షతను, దిగ్విజయంగా జరిగింది. రెవన్యూ డివిజనల్ ఆఫీసరు, ధర్మవరం తహసీలుదారు, తదితర పెద్దలు, నాటి కార్యక్రమంలో ఉత్సాహంగా పాల్గొన్నారు. జిల్లా కలక్టరు, ధర్మవరంలోని లేడీడాక్టరు శ్రీమతి యశోదమ్మ, మేడాచిన కొండయ్యగారలు, ఈ కేంద్రస్థాపన ప్రభుత్వ కృషి, ప్రజల సహకారం గురించి వివరంగా ఉపన్యసించారు. జిల్లా కలక్టరు ఈ కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపిన సందర్భంలో "జిల్లా రెడ్ క్రాస్ సంఘం" వారు ఈ కేంద్రానికి తగిన మంచం, వుయ్యాల మొదలగు పరికరాలకుగాను రు. 150 విరాళం ఇచ్చారు. వారే ఈ కేంద్రానికి అవసరమైన మందులు, మొదలైనవికూడా ఇచ్చారు. ఈ కేంద్రంలో పిల్లలకు, అశక్తులైన తల్లులకు పాలు, విటమిన్ మాత్రలు, షార్క్ లివర్ నూనె, మొదలైనవి ఇచ్చుటకు ఏర్పాట్లు జరిగినవి. గ్రామ ప్రజలు ఈ కేంద్ర స్థాపనకు రు. 1000 ను విరాళంగా ఇచ్చారు.

జనవరి 13 భోగి పండుగనాడు, గుత్తి తాలుకా క్రిష్టిపాడు గ్రామంలో జిల్లా కలక్టరు శ్రీ కె. కొండలరావుగారు, మాతా శిశుసంరక్షణ కేంద్రానికి, ప్రారంభోత్సవం చేశారు. వివిధ గ్రామాలలోని 13397 ప్రజలకు ప్రసూతి సౌకర్యం కలుగచేసే నిమిత్తమై ఈ కేంద్ర స్థాపన జరిగింది. జిల్లా మెడికల్ ఆఫీసర్, డిప్యూటీ కలక్టరు, తహసీలుదారు, శ్రీమతి మోహన్‌రావు, విదురాజ్, నాయక్‌గారలు, గుత్తి పట్టణప్రముఖులు, అడ్వకేట్లు, ప్రారంభోత్సవంనాడు పాల్గొన్నారు.

జిల్లా కలక్టరు సమావేశానికి అధ్యక్షత వహిస్తూ, సంక్షేమ సంస్థయొక్క కార్యక్రమాలను, ఆచరణను, వివరించారు. గ్రామ ప్రజల సహకారం ఏవిధంగా అవసరమో, కేంద్ర నిర్వహణలో సగభాగం వారు ఏవిధంగా వహించాలో, నిర్వచించారు. గుత్తి పట్టణములో ప్రముఖన్యాయవాదులలో ఒకరైన శ్రీ సేతురావుగారు, జిల్లా మెడికల్ ఆఫీసర్, శ్రీమతి నాయక్, డిప్యూటీ కలక్టరు, ఉపన్యసించారు. గ్రామపంచాయితీ, ప్రజలు కేంద్ర స్థాపనకు రు. 1200 లు విరాళం ఇచ్చినందుకు వారిని అభినందించారు. జిల్లా కలక్టరు కేంద్రమును తెరుస్తూ రిబ్బన్ కత్తిరించుటకు ఉపయోగించేసే కత్తిరను, వేలంవేయగా, రు 8 లు వచ్చినవి. మరొకపెద్ద, రు 8 లు విరాళం ఇచ్చారు. ఈధనంతో చక్కని మంచం కొనదానికి నిశ్చయించారు. శ్రీ కృష్ణమూర్తి రావుగారి వందన సమర్పణతో, సభ దిగ్విజయంగా ముగిసింది.

ప్రసూతి సౌకర్యాలతోబాటు, ఈకేంద్రంలో డాక్టరు రంగయ్య సెట్టిగారి సహకారంవల్ల, మామూలువ్యాధులకు కూడా మందులు ఇవ్వబడుతున్నవి.

జిల్లా కన్వీనరు శ్రీమతి కొండలరావు, సభ్యులు, గ్రామంలోని స్త్రీలనందరను వ్యక్తిగతంగా కలుసుకొని ఈకేంద్రంవల్ల జరిగే సహాయాన్ని సద్వినియోగం చేసుకోమని హెచ్చరించారు.

### వార్తలు - విశేషాలు.

శ్రీకాకుళం జిల్లా కన్వీనరు శ్రీమతి పొన్నమ్మ కరియప్ప స్థానే శ్రీమతి ప్రమీల భగవాన్‌దాస్, కన్వీనరుగా నియమితులయినారు.

## కార్యక్రమము ప్రాతిపదిక

కర్నూలు జిల్లా కన్వీనరు శ్రీమతి బి. నటరాజన్‌స్థానే శ్రీమతి కె. కె. రెడ్డిగారు కన్వీనరుగా నియమితులయినారు.

అనంతపురం జిల్లా కన్వీనరు, శ్రీమతి వెంకటస్వామి నాయుడు స్థానే శ్రీమతి కొండలరావుగారు కన్వీనరుగా వున్నారు.

ఆంధ్ర మహిళాసభ ప్రణాళిక కన్వీనరు, శ్రీమతి హైమవతిగారు స్థానే శ్రీమతి న్యాయపతి కామేశ్వరమ్మ గారు కన్వీనరుగా వుంటున్నారు.

ఈ నెల మొదటి వారంలో శ్రీకాకుళంకు కూడా జీప్‌ను పంపివేయుటతో, ప్రస్తుతం ఆంధ్ర దేశంలో పన్నెండు ప్రాజెక్టులకు కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ జీపులను సరఫరా చేసింది.

కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ సహాయముతో మద్రాస్ స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్, నిర్వహిస్తున్న గ్రామీణ సంక్షేమ శిక్షణ తరగతులలో, ఆంధ్ర దేశంలోని వివిధ జిల్లాల కన్వీనర్లు పంపిన విద్యార్థులు పదిమంది శిక్షణ పొందుతున్నారు. వీరందరు శిక్షణ పొందిన తరువాత ఆ యా జిల్లాలలో సంక్షేమ విస్తారణ ప్రణాళికలో తమ విధులను నిర్వహించుటకు ఈ శిక్షణ ఇవ్వబడుతున్నది.

ఆంధ్ర రాష్ట్రీ సంఘ సంక్షేమ సలహా సంస్థ కార్యాలయం ఫిబ్రవరి 1 వ తేదీన నెం. 5 సేన్‌థోమ్ హైరోడ్డు, మద్రాసు 4 కు మార్చబడమయినది.



డిసెంబరు 31 వ తేదీన కడప జిల్లా నందిమండలం గ్రామంలో మాతా శిశు సంరక్షణ, కేంద్రం ప్రారంభమునాటి దృశ్యం. ఈ చిత్రంలో కేంద్ర ప్రారంభోత్సవం జరిపిన శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు, కడప జిల్లా కన్వీనరు శ్రీమతి సరళారెడ్డి తదితర పెద్దలను చూడవచ్చును.

# 'సన్ ఫీల్డ్'

మానసికంగా వెనుక బడివున్న దురదృష్టవంతులగు బాలలకు ప్రేమాదరాల ద్వారా ఆనందం వర్షించే స్వర్గధామం యీ సంస్థ.

● ఫిల్లిస్ డేవిస్ ●

విద్యాబోధన ఒక ఉపయోగకరమైన విధానమేకాని అదిఒక వృత్తి కానేరదనే విషయం మానసికంగా వెనుకబడి వున్న పిల్లల శిక్షణ విషయంలో అక్షరాల నిజం. ఈ మహత్తర కార్యం నిర్వహించే స్త్రీ పురుషులలో విద్యను గరపే నైపుణ్యమే కాక ఓరిమి సానుభూతి ప్రేమఅనే సద్గుణాలు వుండాలి. మానసికముగా వెనుక బడియున్న పిల్లల విషయంలో గడచిన 50 సంవత్సరాలలోనూ ఎంతో శ్రద్ధవహింప బడింది. ఎంతోమంది స్త్రీ పురుషులు ఈ సేవలో నిమగ్నులై అనేక పద్ధతులు కనిపెట్టి, మేధాశక్తి కొరతవడిన పిల్లల శిక్షణ విషయంలో అకుంఠితమైన సేవ చేశారు.

నేడు బ్రిటన్ దేశపు విద్యామంత్రిత్వ శాఖ అధ్వర్యాన విద్యా విషయికముగా వెనుక బడిన 4-19 సంవత్సరముల వయసు కగ్గిన బాల బాలికలు 19,459మంది, విద్యాధికారులచే స్థానికంగా నడుప బడుతున్న శరణాలయాలలో శిక్షణ పొందుతున్నారు. ఈ విధంగా నడుప బడుతూన్న పాఠశాలలు 217 వున్నాయి. ఇదిగాక ప్రభుత్వముచే పరిగణింప బడి, సహాయాన్ని పొందుతూన్న 37 బాల గృహాలున్నాయి. వీటిలో శిక్షణ పొందే ప్రతిబాలునికీ సంవత్సరానికి దాదాపు 200 నుండి 300 పౌనులు ఖర్చు అవుతుంది.

పైన చెప్పబడిన సంస్థలలో వార్సెస్టర్ షైర్ లోని కెంట్ హిల్స్‌పై నిర్మింపబడిన సన్ ఫీల్డ్ హోమ్ ప్రసిద్ధి చెందినది. తొలుదొల్తగా ఇది 1930 వ సంవత్సరంలో ప్రారంభింప బడినది. అస్ట్రియిన్ సాంఘిక సిద్ధాంతవేత్త డాక్టర్ స్టైనర్ ప్రచారము గావించిన సిద్ధాంతముల ప్రకారం పిల్లలకు ఇందులో శిక్షణ ఇవ్వబడు తూంది. ఈయన 1925 వ సంవత్సరంలో తన 64వ యేట చనిపోయాడు. డాక్టర్ స్టైనర్ విద్యారంగంలో అనేకశాఖలలో విశేష కృషిసల్పాడు. అందులో మానసిక వికాసము పొందని బాలుర శిక్షణ ఒకటి. 1919 లో స్టట్‌గర్ట్‌లో పిల్లలకు ప్రారంభించిన పాఠశాల ఇతర దేశముల లోని అనేకులకు మార్గదర్శకమై, మనోవికాసము చెందని బాలురను శిక్షణ చేయుటలో ఆచరణలో పెట్టిన సిద్ధాంతాలు ఎంతో ఉపయోగించాయి.

డాక్టర్ స్టైనర్ ప్రవేశపెట్టిన "యాంథ్రోపోసాఫీ" అనే సిద్ధాంతం యొక్క ఆదర్శం సాధారణ మానవులలో నిద్రాణముగా వున్న "గుర్తింపు" అనేశక్తి ఈరకం మానవులలో లోపించడంచేత తిరిగీ ఆధ్యాత్మిక యథార్థాన్ని గుర్తింప కలిగే శక్తి వీరిలో కలిగించడమే! ఈసిద్ధాంతమును వైద్య, విద్యా, సాంఘిక రంగాలలో ప్రవేశపెట్టడం ద్వారా తత్ఫలితాలను, పరిణామాలను తెలిసికోవాలని ఆశించాడు డాక్టర్ స్టైనర్.

రూడాల్ఫ్‌స్టైనర్ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టే సంస్థ బ్రిటన్‌లో సన్ ఫీల్డ్ సంస్థ ఒక్కటే కాదు. అలాంటి సంస్థలలో ఇది అగ్రగామిసంస్థ

మాత్రమే! తొలుదొల్త బ్రిటన్‌లో పారిశ్రామిక కేంద్రమైన బర్మింగ్ హామ్‌లో ఈ విధానం ప్రవేశ పెట్టబడింది. ఇది ప్రవేశపెట్టిన రెండేండ్లలోనే, అనగా 1932 లో దేశములోని వివిధ ప్రాంతములకు వ్యాప్తి చెంది, ఈ మహా సంస్థ ఇప్పుడు స్టోన్‌బ్రిడ్జ్‌లోని క్లెంట్‌గ్రోవ్‌లో స్థాపింపబడినది.

శారీరక, మానసిక, కష్టాలవలన బాధపడుతూన్న పిల్లలకు మామూలు పాఠశాలలు, గృహాలు ఇవ్వలేని మానసిక శాంతిని ప్రత్యేక శ్రద్ధతో వీరికివ్వడమే ఈ సంస్థముఖ్యోద్దేశము.

దీనిద్వారా ఇతరులకంటె తామేదో తక్కువనే భావం వారినుండి తొలగించి, ఆ పిల్లలలో నిబిడీకృతమైన శక్తులను పైకితీసికొని రావడమే ఈ సంస్థ ఉద్దేశ్యం.- మనోవ్యాధితో బాధపడే పిల్లలని పూర్తిగా మార్చడం సాధ్యం కాక పోయినా, వ్యక్తిగతంగా తీసుకునే శ్రద్ధద్వారా వీరిని ఇతరులతో బాటు సాధారణ జీవితాన్ని గడపగల పౌరులుగా తయారుచేయడమే ఈ సంస్థ ఆదర్శం—ఈ పిల్లల పాఠశాల జీవితము యొక్క ప్రభావం ఇంటిలో ఎంతగనో కనబడుతుంది—కాని ఈ పాఠశాలలో నడపబడే తరగతుల పాఠాల ముఖ్యోద్దేశ్యం, మానసిక వికాసంలేని ఈ పిల్లలను సాధారణ జీవితం గడపగలిగే పౌరులుగా తయారు చేయడమే కాని, వారిని మహా మేధావంతులుగా తయారు చేయడం కాదనే విషయం మనం జ్ఞాపకం వుంచుకోవాలి.

ఈ పద్ధతిలో మామూలుగా పాఠశాలలలో గరపే విద్యయే కాకుండా 'క్ర్యేటివ్' పద్ధతులమీద శిక్షణ ఇవ్వబడుతుంది. "సెయింట్ రాఫేల్" అని పిలువబడే ఈ పాఠశాలలో అతిచిన్న పిల్లలకు 'కిండర్‌గార్టెన్ తరగతి, ఏడేండ్ల నుండి పదహైదుగేండ్ల పిల్లలకు మొదటి తరగతి, పదీ, పదహైదుగేండ్ల వయస్సు పిల్లలకు రెండవ తరగతీ, ఇంకా పెద్ద పిల్లలకి బట్టల నేత శిల్పము మొదలైనవి నేర్పడానికి ప్రత్యేక ఏర్పాటులు వుంటాయి. ఈ సెయింట్ రాఫేల్ గృహంలో 72 మందికి వసతివుంది- ఇంకా కొంతమంది చేర్చుకొనబడటానికి 'వెయిటింగ్ లిస్ట్‌లో' వున్నారు.

సన్‌ఫీల్డ్ సంస్థలో ప్రధానమైన పై తరగతులే కాక ఆయా బాలుర మనస్తత్వానికీ, సరిపడే విధంగా 'యూరిధ్మి' చిత్రలేఖనం, సంగీతం, ఆ బాలురకు ప్రత్యేకముగా వ్రాయబడిన నాటికల ప్రదర్శనం ప్రవేశ పెట్టబడ్డాయి. వీటివలన ఆ బాలుర వ్యాధి నిర్మూలనకు ఎంతో తోడ్పడుతూంది ఈ సంస్థ! ఈ నూతన పద్ధతివలన ఎన్నో లాభాలు చేకూరాయి కూడా!

ఏడాది పొడుగునా ఏవిధమైన అంతరాయం లేకుండా పిల్లలకు అనుకూలముగా వుండేటట్లు ఈ సంస్థపని చేస్తూనేవుంటుంది. పిల్లల మనో వికాసానికీ, వ్యక్తిత్వాభి వృద్ధికీ వివిధ వర్ణములు ఎంతగానో తోడ్పడతాయి! సన్‌ఫీల్డ్ గృహము లోని గోడలకీ, తెరలకీ, పుష్పట్లకీ, పింగాణీ పాత్రలకీ ముదురు రంగులను ఉపయోగించటం వలన అక్కడ శిక్షణ పొందుతూన్న బాలురు ఎంతో ఉత్సాహాన్ని ప్రకటించారు. ఈముదురు రంగులకు అందరూ అలవాటు పడ్డారుకూడా!

సన్‌ఫీల్డ్‌లో "మూడురోజాలు" అనే సంఘం స్థాపింపబడింది. ఈ సంస్థ స్థాపింపబడిన తొలి రోజులలో ప్రదర్శింపబడ్డ ఒక నాటికపేరే ఈ "మూడురోజాలు"! ఈ శిక్షణాలయంలో శిక్షణ పొందుతూన్న పిల్లల తల్లిదండ్రులేకాక- అనేక మంది శ్రేయోభిలాషులు ఈ సంఘ సభ్యులుగా

చేరారు. ఈ సంఘం ప్రదర్శనాల ద్వారానూ విరాళాల ద్వారాను నిధిని వసూలు చేసి ఈ సంస్థ కార్యాలను నిర్వర్తించడానికీ, అభివృద్ధి పరచడానికీ, కొందరు పిల్లల తల్లిదండ్రుల జీవనానికీ కూడా సహాయపడుతూంది. దీనిద్వారా ఈ సంస్థకి కాని, యిలాంటి యితర సంస్థలకు కాని తల్లిదండ్రులు తమ పిల్లలను అత్యంత ఉత్సాహంతో పంపడానికి ఈ నిధి తోడ్పడుతూంది- సన్‌ఫీల్డ్ సంస్థ ప్రాథమిక సూత్రాలతో ఏకీభవించినా ఏకీభవించకపోయినా ఈ సంస్థను దర్శించిన ప్రతి ఒక్కరూ ఇక్కడి కార్యకర్తల కార్య దీక్షనూ, ఇక్కడ శిక్షణ పొందుతూన్న వారిని మామూలు మానవులతో సమానముగా చేయవలెననే పట్టుదలనూ హర్షించి తీరుతారు !

ఇచ్చట పనిచేసే ప్రతి ఒక్కరిలోనూ సేవా నిరతీ, ఆధ్యాత్మిక చింతనా ద్యోతక మవుతూ వుంటాయి ; అన్నిటినీ మించి ఇక్కడ జరిగే ప్రతి పనిలోనూ ప్రయోజనము వుండితీరుతుంది! ఈ సంస్థ ఏనాడో ప్రవేశపెట్టబడిన సిద్ధాంతాలనే గ్రుడ్డిగా అనుసరింపక అనేక క్రొత్త పద్ధతులను ప్రవేశపెట్టి ఫలితాలను పరీక్షిస్తూంది.

ప్రపంచాన్నించి వేరై అంధకారంలో జీవితాలని గడపవలసి వచ్చే దురదృష్టవంతులకి, ప్రేమాదరాల ద్వారా ఆనందం వర్షించే స్వర్గ ధామం ఈ సంస్థ !

---



డిల్లీ పోలీస్
సంక్షేమ కేంద్రంలో
బుల్లి పోలీసులు



స్వతంత్రభారత్ లో

# పోలీసు సంక్షేమ కృషి

రత్నప్రభా రాయ్.

మన స్వాతంత్ర్య సమరంలో లాటీ ఛార్జీలు, బాష్పవాయు ప్రయోగం మొదలైన వాటి నెన్నిటినో సహించ వలసివచ్చింది. ఈ చర్యలన్నిటిని చేసినది పోలీసులు కావడంవల్ల వారిపట్ల మనలో ఒక విధమైన క్రోధభావం ప్రబలింది. స్వాతంత్ర్యం సిద్ధించిన పిదప వారి దృక్పథమే మారింది. వారి లక్ష్యం ప్రజాసేవ కావడంలో ప్రజలలో పోలీసు దళంపట్ల విశ్వాసం నెలకొన్నది.

"నేను నీకు సాయపడుదునా" అనే నినాదం గల ఒక "ఆరమ్ బాండ్"ను (Arm band) వారు యిటీవల ధరింపసాగారు. ఇది మీ సమస్యలను పోలీసులు సహృదయంతో గ్రహించగలరనే ధైర్యాన్ని మీలో తప్పక సంపాదించగలదు. నిజానికి వారు ప్రజల సమస్యలను గ్రహించి తోడ్పడుతున్నారు.

ఇదివరలో పోలీసు తన ఉదర పోషణకే ఉద్యోగధర్మం చేపట్టాడు. ఇప్పుడలాకాదు. అతని భార్య, పిల్లల శ్రేయస్సుకోసం తగు ఏర్పాట్లు జరిగినవి. ఇది తన విధి ప్రజాసేవయేననే భావాన్ని పోలీసు హృదయంలో బలీయం చేసింది. ఈ దృక్పథం పోలీసుల హృదయాలలో 1949 లో శ్రీమతి శాంతచౌదరి ఢిల్లీలో చేసిన కృషి ఫలితంగా రూపొందింది. పోలీస్ వెల్ఫేర్ అమెనిటీస్ (Amenities) ఫండ్ నుంచి లభించిన ద్రవ్య సహాయంతో ఢిల్లీ పోలీస్ సంక్షేమ కేంద్రం ఏర్పాటు చేయబడింది. ఇప్పుడు శ్రీమతి పి. ఎల్. మెహతా (ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు భార్య) ఆధ్వర్యంలో కేంద్రం ఎంతో అభివృద్ధిపొందింది.

పోలీసువారి భార్యలకోసం కేంద్రంలో ఒక మెటిర్నిటీ వార్డు పదిమందికి సరిపడేటట్లు ఏర్పాటు చేయబడింది. ఒక లేడీ డాక్టరు యిద్దరు నర్సులు వీరిని చూస్తూవుంటారు. ఉచితంగా మందులిచ్చే ఔట్ పేషెంట్స్ డిపార్టుమెంటు కూడా దీనికి చేర్చబడింది. గర్భవతులకు రెండుపూటలు ఉచితంగా పాలు సప్లయి చేస్తారు. బిడ్డలకు నాలుగేళ్ళు వచ్చే వరకు వారి ఆరోగ్యపోషణలకు తోడ్పడుతూవుంటారు.

ఆ తర్వాత బిడ్డల విద్యాభివృద్ధికి తోడ్పడుటకు కిండర్ గార్టెన్, ప్రాథమిక తరగతుల పాఠశాల నెలకొల్పబడ్డాయి. వ్యాయామ బోధకుడు అతిశ్రద్ధతో వారికి వ్యాయామం నేర్పుతాడు. డ్రిల్లు, పోలీసు శిక్షణ పిల్లలకు ఎంతో వినోదంగా వుంటాయి. ఆ పిల్లలలోనే ఒకరు మిగిలిన వారిచే డ్రిల్లు చేయిస్తువుండడం చూస్తే ఎంతో సంతోషంగా, ఎంతో ముద్దుగా వుంటుంది! బిడ్డలు బడిలో గాని, క్రీడా కేంద్రంలోగాని వున్నపుడు, భర్తలు డ్యూటీకి వెళ్ళినపుడు పోలీసుల భార్యలు కేంద్రంలోని వయోజన విద్యాలయంలో తమ కాలాన్ని గడుపుతారు. కొందరు స్త్రీలు నూలు వడకడం తరగతులలో పాల్గొంటారు. నూలు వడకడంలో అప్పుడప్పుడు పోటీలు నిర్వహించబడుతూ వుంటాయి. ఎంత సన్నని నూలును ఎంత తక్కువ కాలంలో వడికేది టైమ్ చూసుకొంటూ వుంటారు.

కేంద్రంలో ఒక కుట్టుపని తరగతి కూడా వుంది. కుట్టుపని నేర్చుకొనగోరే స్త్రీల సంఖ్య హెచ్చడంతో ఇంకా మరికొన్ని కుట్టు మిషనులను కొనడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

కేంద్రంలోని చేతిపనులశాఖ రెండులక్ష్యాలను నెరవేరుస్తూవుంది. స్త్రీలకు ఒక కాలక్షేపాన్నే గాక వారికి ఆదాయంకూడా కల్పిస్తోంది. సబ్బులు, అల్లికలుకల గుడ్డలు విక్రయించబడుతూ వుంటాయి.

పోలీసు లైన్ల సంక్షేమ కేంద్రంలో నాటకాలు ప్రదర్శించబడుతూ వుంటాయి. పోలీసు కుటుంబాలకు చెందిన వారే వీటిలో పాల్గొంటూవుంటారు. ఈ నాటకాలకు యితివృత్తాలు లంచగొండితనం అవినీతి, నిర్మూలన నేరస్తులను పట్టుకొనడం వంటివి. ఈవిధంగా చేతిపనులు, చదువు నేర్చుకొనడానికి, పిల్లలు విద్యనభ్యసించి పురోభివృద్ధి నొందడానికి పోలీసుల భార్యలకు, బిడ్డలకు అపూర్వమైన అవకాశం కలిగించబడింది.

# NURSING HOME ANDHRA MAHILA SABHA

## REPORT FOR JANUARY 1955

### OUT PATIENT DEPARTMENT:

| | | |
|---|---|---|
| Medical | ... | 726 |
| Surgical | ... | 65 |
| E. E. N. T. | ... | 47 |
| Gynecological | ... | 86 |
| Ante - Natal | ... | 166 |
| Post - Natal | ... | 93 |
| Total No of New Patients: | ... | 1183 |
| Total No of old Patients: | ... | 856 |
| Total No of New & Old Patients: | ... | 2039 |

### ADMISSION REGISTER:

| | | |
|---|---|---|
| Total No of Patients Admitted | ... | 150 |
| Total No of Patients Admitted for delivery | ... | 65 |
| Total No of babies admitted | ... | 63 |
| No of Anti-Natal cases treated | ... | 14 |
| No of Medical cases treated | ... | 1 |
| No of Abortions | ... | 7 |
| Total | ... | 150 |

### IN PATIENT MATERNITY REGISTER:

| | | |
|---|---|---|
| Total No of Patients delivered in January, '55 | ... | 63 |
| Normal deliveries | ... | 57 |
| Abnormal cases | ... | 6 |
| Total | ... | 63 |

| | | |
|---|---|---|
| Number of Students undergoing Training as Auxiliary Nurses and Midwives | ... | 42 |



# పసిబిడ్డకు ఆహారం

—గ్వెండోవిన్ హెచ్. మాథ్యూస్, డాక్టర్ పి. ఎస్. తనేజా—

| పదార్థము | తొలిసారిగా యిచ్చేకాలం | ఇవ్వవలసిన పరిమితి |
|---|---|---|
| ఫలరసం | 3-వ వారం | 1 టీచంచానిండుగా అరటీ చంచావంతున 1, $1\frac{1}{2}$ ఔ. వరకు 6-వ నెలనాటికి త్రాగించాలి. (నీళ్ళుకలిపి) |
| పళ్ళు అరటి,మామిడి,యాపిల్, ముక్కలు చేసిగాని, ఒలిచిగాని. | 4, 6 వారాలు | $\frac{1}{4}$ ఔన్సు, రోజూ, వారం విడిచి వారం $\frac{1}{4}$ ఔన్సు వంతున హెచ్చించాలి. |
| కాడ్ లివర్ ఆయిల్ లేక ప్రత్యామ్నాయమైనవి. | 6, 8 వారాలు | బత్తాయరసంతో ఒక టీ చంచాడువరకు, లేదా 400 ఐ. యూనిట్లువరకు క్రమంగా హెచ్చించాలి. |
| కోడి గ్రుడ్డు | 3, 4 మాసాలు | ముందు కొంచెం కొంచెంగా వండి ఆ తర్వాత మొత్తం గ్రుడ్డువరకు 5, 6 మాసాల్లో హెచ్చించవచ్చు. |
| ధాన్యాలు | 4, 6 మాసాలు | 1-$1\frac{1}{2}$ఔన్సులు ద్రవరూపంలో క్రమేపీ వండిన పప్పులు లేక అన్నం. |
| కాయగూరలు కారట్,బంగాళాదుంప, యామ్స్, ఆకుకూరలు, బీట్ రూట్ మొదలైనవి. | 4, 6 మాసాలు | వండి, ఉడికించి 1 టీ చంచా నుంచి $1\frac{1}{2}$, 2 ఔ. వరకు 6, 8 మాసాలలో హెచ్చించాలి. |
| పప్పులు | 4, 6 మాసాలు | బాగా వండినవి టీ చంచాడు అన్నంతో కలిపిపెట్టాలి. |

## ఆహార విషయంలో బిడ్డల మనఃపరిణామం.

15, 21 మాసాలు : 'అది నాకు కావాలి' ఘట్టం. బిడ్డ ఆహారం కోసం కలియబడతాడు. ఆకలి రకరకాలుగా వుంటుంది. భిన్నరుచులను గ్రహిస్తాడు.

2 ఏళ్ళు : వద్దని నిరాకరిస్తూ వుంటాడు. రంగుకోసం, తీపికోసం కారెట్, బీట్రూట్ వంటి వాటికి యిష్టపడతాడు.

$2\frac{1}{2}$ ఏళ్ళు : నమలడం అలవడుతుంది.

3 ఏళ్ళు : కొత్తకూరలు, మిఠాయిలు యిష్టపడతాయి.

4 ఏళ్ళు : అన్నం తిననని మారాం పెట్టడం కద్దు. అటువంటివి లెఖచెయ్యరాదు.

5 ఏళ్ళు : అన్నీ తింటారు.

6 ఏళ్ళు : ఒక్కొక్కసారి తిననని బిడ్డలు పోరుపెడుతూవుంటారు.

7 ఏళ్ళు : తొందరగా ఆహారం తిని, ఆటలకు పరుగెడుతూ వుంటాడు. అన్నం దగ్గర ఎక్కడలేని తొందర వస్తుంది.

దక్షిణ భారతదేశంలోని గ్రామాలలో టొమాటాలు, బత్తాయిపళ్ళు సులభంగా దొరకవు కనక ఆకు కూరలను ఉడికించి 'సి' విటమిన్ సమకూర్చడానికి ఆ నీరు త్రాగించవచ్చు. గంజి మున్నగువాటికి మనకు ఈవిధంగా ప్రత్యామ్నాయమైన పదార్థాలు వుంటాయి. పాలు మంచివి దొరక్కపోతే గ్రామాలలో కాఫీలు మానివేస్తారు. అలాంటప్పుడు బిడ్డలకు అరటిపండు గుజ్జు పాలలో కలిపి యివ్వడం బిడ్డలకు ఆరోగ్యకరం. గ్రామాలలో మనం కృషి చేసేటప్పుడు ఆ ప్రజలకు ఒక్కసారిగానే ఈపద్ధతం వర్తింపచేయ చూడక, క్రమేపీ వారు ఈపద్ధతిని అవలంబించేటట్లు చూడాలి. వారి అలవాట్లను మనం గ్రహించే వర్తించాలి.



అంగరక్ష - ఆదిరక్ష
దివ్యరక్ష - దీపరక్ష
చిన్ని నా అబ్బాయికి
శ్రీరామ రక్ష




# జుట్టు - 2

శ్రీమతి సువేణికాశ్యప్

జుట్టు కేవలం అందాన్ని మాత్రమేకాక మానవ జీవితానికి ప్రధానమైన మెదడును కాపాడడానికి కల్పించినట్లుంది. జుట్టు ఒత్తుగా లేని వాళ్ళకు కండ్ల జబ్బులు ఎక్కువగా ఉంటాయి. బట్టతల వాళ్ళకు శరీరంతో వేడి ఎక్కువైకండ్లమంటలు మొదలైనవి వస్తాయి. అందుకనే జుట్టును ఆరోగ్య విషయంతో కూడ జాగ్రత్తగా చూసుకోవాలి

ఆరోగ్యంగాఉన్న జుట్టుబాగ ఒత్తుగ, మెత్తగ, ఊడకుండా ఉంటుంది. ఈ కాలంలో జుట్టునూడకుండా రక్షించుకోవట మెలాగా అనే సమస్య ప్రతి ఒక్కరికి కలుగు తుంది. మెదడునకు ఎక్కువ పనికల్పించినా, జ్వరము పడి లేచినా, నీళ్ళుమారినా, పేనులున్నా, రకరకాలనూనెలు వాడినా జుట్టు పొట్టుపొట్టుగా రాలి పోతుంది. వీటిబారినుండి సాధ్యమైనంత వరకు తప్పించుకొన్నేందుకు ప్రయత్నించాలి. చిక్కుతో గట్టిగా దువ్వినప్పుడు కూడ జుట్టూడి పోతుంది.

కుదులు నీరసించినప్పుడు జుట్టు ఎక్కువగా ఊడుతుంది. ఈ కుదులను బలంగా పెరిగేట్లు చేసేది (ఎ). ఈవిటమిను ఎంత సమృద్ధిగాఉంటే జుట్టు అంతబాగా ఉంటుంది. తర్వాత జుట్టును సునితంగా చూడాలి. తలదువ్వ కొనేటప్పుడు జాగ్రత్తగా ముందు చిక్కునంతా తీసి తర్వాత నెమ్మదిగా దువ్వకోవాలి. రోజూ ప్రొద్దునా సాయత్రము పావుగంటసేపు మెల్లిగా దువ్వటం వలనకూడ వెంట్రుకలు పెరుగుతాయి. స్వచ్ఛమైన కొబ్బరినూనె ఒకసారి ఇంత రాసేదానికి బదులు రెండుపూటల కొద్ది కొద్దిగా రాయటం వలన ఉపయోగ మెక్కువ. తర్వాత జుట్టుపెరగటానికి కొబ్బరిపాలు కూడ మంచివి. కొబ్బరికోరి (తురిమి) రుబ్బి దానివడియగట్టి ఆ వచ్చిన పాలతో తలచర్మమంతా బాగా అంటుకొనేట్లు రుద్దుకొని తలంటు పోసుకోవటం వలన జుట్టు ఊడదు. బాగా పెరుగుతుంది.

పేను ఉంటే వెంటనే అది పొయ్యేందుకు ప్రయత్నించాలి. నిమ్మకాయ రసము తలంటి

ముందు రాసుకొంటే పేను పోతుంది. జుట్టు ఊడదు అంటారు. పేను కోసం ఎన్నో రకాలు చెప్తూ తారు. చెప్పినదల్లా, చూసినదల్లా చేయ టం మంచిదికాదు. ఒకొక్కసారి కండ్లకపా యము కలుగుతుంది.

ఇంక రంగు విషయము చూదాము. జుట్టు నల్లగా ఉంటే అందం. ఆనలుపు నిలుపుకోవటా నికి చాలమంది కనీవినీ ఎరుగని నూనెలన్ని రాస్తారు. ఇది ఆలోచన తక్కువపని. నిజానికి స్వచ్ఛమైన కొబ్బరినూనె వలన జుట్టు నల్లగా ఉంటుంది. ఈ రోజులలో ఐదేండ్ల పిల్ల దగ్గర నుంచి జుట్టు నెరవటమే. దీనికి కారణం విట మిను "బి" లేకపోవట మంటున్నారు. ఈ విట మిను నెక్కువగా తీసికొంటే తెల్ల పడిన జుట్టు నల్లపడుతుందిట. ఈ విటమిన్ను ఎందులో ఉం డేవి పూర్వం ఒక సారిచెప్పాను.

నల్లపడేందుకు గోరింటాకు నూనెకూడ ఉప యోగించవచ్చు. దీనివలన చాల త్వరగనలుపు వస్తుంది. గోరింటాకును చెక్కా పక్కాగా నలగకొట్టి నూనెతో వేసికాచి వడియకట్టివాడితే నెల తిరగకుండా నల్లపడుతుంది.

నలుపు అందానిచ్చినట్లే ఎర్రవాగుకూడ తెల్ల నిశరీర చ్ఛాయ ఉన్నవాళ్ళకి అందంగా ఉం టుంది. షాంపూ ఉపయోగించటం వలన ఈ ఎరవాగును పొందవచ్చు. షాంపూల ఉపయో గం వలన జుట్టు మెత్తగ పట్టుకుచ్చులాగ ఉం టుంది. అయితే విపరీతంగా వాడటం వలన నలుపురంగు కావాలనుకొన్నవాళ్ళని సంతోష పరచలేక పోతుంది.

కానిసోపు విషయంలో అలాగకాదు. సోపు (శీకాయసోపు) వెంట్రుకను వెంట్రుకను విడదీసి అందంగా ఆకర్షనీయంగా ఉండేటట్లు చేస్తుంది. దీని వలన జుట్టురంగు ఏమార్పు చెందదు.

నిజం చెప్పాలంటే మన సీకాయవలన చలవ కూడా చేస్తుంది. సీకాయపొడి గామంచాల పొడి వేసి రుద్దుకొంటే సువాసనగా ఉంటుంది. వారాని కొకసారి ఆముదంతో తలంటిపోసుకో వటం జుట్టు ఎదగటానికి కూడ మంచిది.

ఇకపోతే తలచుండు. ఈ చుండు వలన తల దురదగా ఉంటుంది. ఎక్కువగా గోకటం వలన జుట్టు తెగిపోతుంది. అందువలన ఇది పోగొట్టు కోవాలి. కుంకుడి కాయతో రుద్దుకొంటే పోతుందంటారు. లేకపోతే సీకాయతో చిక్కని మజ్జిగ (నీళ్ళకు బదులు) పోసి నాలుగైదుగం టలు నానబెట్టి దానితో తలరుద్దుకొంటే చుండు నిమిషాలమీద పోతుంది.

ఇలా ఎప్పటికప్పుడు శ్రద్ధగా చూసుకొం టుంటే జుట్టు అందంగా ఆకర్షణీయంగా ఉండి చూచేవాళ్ళను ఆనంద పరుస్తుంది.

## స్వవిషయము

ఆంధ్ర మహిళకు సహాయ సంపాదకురాలిగా సుమారు ఆరుమాసములనుండి ఆంధ్ర మహిళకు రూపురేఖలు దిద్దుచున్న శ్రీమతి కె. సుగుణమణిగారు కడపకు వెళ్ళ వలసి వచ్చి నందులకు మేము చాల విచారించు చున్నాము.

కె. ల. ర.

# పూజ్యదంపతుల సంస్మరణ

[మార్చి 12 వ తేదీన కీ. శే. శ్రీ డాక్టరు కేసరి గారి సహధర్మచారిణి పూజ్యురాలు శ్రీమతి కనకమ్మగారి మృతి వార్షిక పర్వదినం. ఈ సందర్భము పురస్కరించుకొని ఈ వ్యాసము ప్రకటించుచున్నాము. సం॥]

ఆమె పరలోకమేగి సంవత్సరాలు గడిచిపోయినవి. ఆయన నిర్యాణము జెందిఒక సంవత్సరమయింది. వీరిద్దరు పూజ్యదంపతులు — శ్రీ కేసరి, కనకమ్మగారలు.

పూజ్యురాలు కనకమ్మ పవిత్ర జీవితం సద్గతిని ప్రసాదించింది. శ్రీ కేసరిగారి ఉదారహృదయం తన మన అనే విచక్షణ లేకుండా అనేకులయొక్క, అనేక సంస్థలయొక్క పురోభివృద్ధిని ప్రోత్సహించింది.

శ్రీ కేసరిగారి మహోన్నతమయిన జీవిత చరిత్రకు ఆయన ఆత్మ విశ్వాసం, బలం, కార్యశూరత అని అనేకులంటారు. కాని వానితో బాటు వారి సతీమణి దాన ధర్మ సౌశీల్యాలు, దయార్ద్రహృదయము కేసరి కుటీరమును శుక్ల చంద్రునివలె దినదిన ప్రవర్ధమాన మగుటకు తోడ్పడినవి.

వెనుకకు తిరిగి చూచినచో అప్పట్లో అదియొక సంస్థానము. అనుదినము ఆయింట పూజలు వ్రతాలు, పండుగలు, అన్నప్రదానము, పండిత విద్వాంసులకు సత్కార సన్మానములు ఇవి యవి అననేల నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఆ సంస్థానము విలసిల్లింది.

ప్రేమానురాగాలతో ఆమహాతల్లి ఆదర సత్కారములను చవిచూచిన వారనేకులు. ఆయన దయానుగ్రహాల ఫలితంగా తమ జీవితాలను తీర్చిదిద్దుకొని ఆనాటి గర్భదరిద్రులు యీనాడు మహోన్నతస్థాయిలో జీవయాత్ర సాగిస్తున్న వారనేకులు గలరు.

ఆయన కోపిష్టిగా కనిపించిన రోజులున్నవి. వాటితోటే ఉదారహృదయంతో అనేకమంది వ్యక్తుల, సంస్థల ఉద్ధరణకు అనన్యంగా తోడ్పడ్డారు. ఆయన చేసిన దాన ధర్మములు అవసరాన్నిబట్టి, ఒకరి ప్రోద్బలము వలనగాని జరిగినవికావు. తానుచేయదలచుకొనిన వానిని స్వేచ్ఛా వాతావరణంలో చేశారు. ఆయన చేసిన ప్రతిప్రజాహిత కార్యములోను తనవ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటూ నిర్వహించి గమ్యతకు వచ్చాడు.

ఆమె రోగిష్టి, పూర్వాచార పరాయణ. అవి స్వాభావికంగా ఏర్పడినవి కాబట్టి మానవ మాత్రుడు మార్పుచేయలేక పోయాడు. ఇవి భగవత్కల్పితములు. కాని ఆమె అమాయకత్వము, పూర్వాచార పరాయణత్వము నిరపాయకరములే కాక స్వార్థరహితములు. అవి ప్రపంచ కల్యాణానికని ఉద్దేశించినవి కాబట్టితన భర్తకు ధనకనక వస్తువాహనములు పుష్కలంగా సమకూరడం, అవి ప్రజాహిత కార్యాలకు వినియోగ పడటం జరిగిందా, అయినవారూ, కానివారూ సుఖ సంపదలతో తుల తూగుతున్నారు. పరోపకారాన్ని, పరులశ్రేయస్సును ఉద్దేశించి ఆమె చేసిన త్యాగము మరపుకు రానట్టిది.

వీనితోబాటుకీర్తికాముకుడు, భోగిపూజ్యులు

కేసరిగారు. కళాపిపాస, కళారాధన - రెండూ ఆయనలో యిమిడియుండినవి. ఆయన చేసిన ప్రజాహిత కార్యాలు ఆయనకు విశేష కీర్తిని సమకూర్చినవి. రాజులు, రారాజుల సరసన భోగించిన దశపురుషుడు. కళారాధకుడుగా, పిపాసిగా చిత్రకారులను, సంగీతవిద్వాంసులను, పండితులను, కవులను, కవయిత్రులను ప్రోత్స హించి, ఆదరించి సత్కరించారు. ఆయననిర్మిం చిన భవనాలు, ఉద్యానవనములు ఆయన కళా రాధనకు నిదర్శనములు. ప్రతియొక్కటి రాజ ఫోకడలను మరపించునవిగా నొప్పుచుండును.

కాని విలాసలోలుడు, ఆడంబరి మాత్రము కాడు. పిలైనంత వరకు స్వకార్యాలను తనపర్య వేక్షణ క్రింద అజమాయిషీలో జరిగేలాగ చూచేవాడు. తన్ను అనుసరించి యున్నవారు సయితం తనవలె ఆసక్తితో ఎవరిపనివారు చేసి కోవాలనేది ఆయన విశ్వాసం.

ఆయన జీవిత ఆదర్శం "కర్మణ్యేఫలే" దానికి తగిన ఆత్మవిశ్వాసం, బలం ఆయన కున్నవికా బట్టే సిరుపేదగా కుగ్రామము నుండి షుమారు 70 సంవత్సరాలకు ముందు 200 మైళ్ళు కాలి నడకన బయలుదేరి మద్రాసు నగరం చే తనరి జీవిత పురోభివృద్ధిని మహోన్నత స్థాయికితీర్చి దిద్దుకోకలిగారు. వానితోబాటు క్రమ పద్ధతి ఆయన జీవయాత్రను రాజబాటలో నడిపించి విజయిగా నొప్పించినవి. అట్టివానినే మిమ్ములను కూడ అలవరచుకొనమని నిరంతరము బోధి స్తుండేవారు శ్రీ కేసరిగారు.

అందరు మహిళలతో బాటు యీ పుణ్య దంపతులను స్మరిస్తూ శ్రద్ధాభక్తులతో శక్త్యాను సారం పూజా పుష్పాలు సమర్పిస్తూ ముకుళిత హస్తాలతో అంజలి ఘటిస్తున్నాను.

శ్రీమతి లక్ష్మీపున్నయ్యగారు.

# ఆంధ్రరాష్ట్ర శిశు సంక్షేమ కవున్సిల్

ఈ కవున్సిల్ క్రింద పేర్కొనబడ్డ వారితో క్రొత్తగా ఏర్పడినది.

అధ్యక్షులు :- శ్రీమతి. లేడీ, వెంకటసుబ్బారావుగారు.

ఉపాధ్యక్షులు :- శ్రీమతి. వి. లక్ష్మిపార్వతిగారు.
శ్రీమతి. కె. లక్ష్మిరఘురామ్‌గారు.

కార్య దర్శులు :- శ్రీ P. S.R. అంజనేయులుగారు
కుమారి. సి. వి. లక్ష్మిరెడ్డిగారు.

కోశాధికారి :- శ్రీ. పి. ఎల్. నారాయణరావుగారు

ముప్పదిమంది మేనేజింగు కమిటీ సభ్యుల నెన్నుకొన బడిరి. బాల బాలికల సంక్షేమ రక్షణే ఈ కవున్సిల్ ముఖ్యోద్దేశము. ఈ సంస్థ భారత దేశ శిశు సంక్షేమ కవున్సిలుకు రాష్ట్ర అనుబంధ శాఖగా యుండగలదు. భారతదేశ కవున్సిల్ అంతర్జాతీయ శిశు సంక్షేమ కవున్సిలు అనుబంధ శాఖయే. ఆంధ్ర దేశమంతటను జిల్లాశాఖలు త్వరలో ఏర్పడగలవు.

ఆంధ్ర శిశు సంక్షేమ కవున్సిలుకు ఈ క్రింద పేర్కొన బడినవారు కార్య వర్గ సభ్యులుగా ఎన్నుకొనబడినారు,

శ్రీమతి లేడీ. వెంకటసుబ్బారావుగారు, శ్రీమతులు కె. లక్ష్మి రఘురామ్‌గారు, వి. లక్ష్మిపార్వతిగారు, ఎ. చెన్నఘంటమ్మగారు, ఆర్. రత్నాబాయిగారు, కె. రాధాకృష్ణమ్మగారు, శ్రీ అంజనేయులుగారు, పి. ఎల్. నారాయణరావుగారు, శ్రీ న్యాపతి రాఘవరావుగారు, బి.యస్. రాజారావుగారు, కుమారి. సి వి. లక్ష్మిరెడ్డిగారు.



ఉత్తమ గ్రంధరచన పోటీలలో శ్రీ గొల్లపల్లి. వెంకటేశ్వరరావు (విజయవాడ) గారికి గృహాలంకరణ — ముగ్గులు" అను తెనుగు గ్రంధమునకు బహుమతి భారత ప్రభుత్వము వారిచే రిపబ్లిక్ ధినమున ఇవ్వబడినది. రూ 1000 — బహుమతిగా ఇవ్వబడినది.



# పూలతోటలో

శ్రీ బాబూ

అమ్మమీద కోపగించి
బొమ్మలన్నీ విసరికొట్టి
చెల్లాయినేడిపించి
పూలతోట కరిగినాను

నాన్న పెంచే తోటలో
చిన్న చిన్న మొక్కల
పచ్చటాకులన్నీ చేరి
పలికెనిట్లు నాతో

"ఆకులం మేము
అన్నయ్యలం మేము
చెట్టునకు ముందుగా
పుట్టాము మేము

మొగ్గలన్నీ మాకు
ముద్దు పాపాయిలు
పూలు అన్నీమాకు
చెల్లాయి లోయి

చిన్ని మొగ్గలకేమి
హాని లేకుండాను
అన్నలం మేమంత
కనిపెట్టి ఉంటాము

ఎండవస్తే మేము
నీడగా ఉంటాము
వానవస్తే మేము
చినుకు పడనీయం

గాలివస్తే మేము
ఉయ్యాలలో బుల్లి

చెల్లాయి లందరిని
మెల్లగా ఊపెదం

మంచి రంగులు ఏరి
మంచి రేకులు చేసి
పూల చెల్లెళ్ళకు
కొల్లలుగ యిస్తాము

అన్నలం మేమంత
ఆకుపచ్చ ధరిస్తాం
ఆడంబరం లేకుండ
ఆనందంగా ఉంటాం

ఎంతో సంపాదించి
అంతా అమ్మకిస్తాం
స్వార్థం లేదుమాకు
సంతోషంగా ఉంటాం

నాల్గు రోజులు బ్రతుకు
నవ్వుతూ జీవిస్తాం
చెల్లితో పోట్లాడం
తల్లిమీద కోపగించం"

అంటూ నవ్వాయి
అందాల ఆకులన్నీ
ఆకులకున్న బుద్ధి
నాకు లేకపోయింది.

అని తలచి మదిలో
అమ్మకడకు పరుగెత్తి
చెల్లమ్మను చేరదీసి
చెప్పుకొంటి "క్షమాపణ"




# శకునాలు

శ్రీ నందివాద కామేశ్వరరావు

పూర్వం ఒక వూళ్ళో ఒక వైదీకపు బ్రాహ్మణుడుండేవాడు. అతనికి గొప్పచాదస్తం. యేపని చేసినా వారాలు, నక్షత్రాలు, తిథులు లెక్క పెడుతూవుంటాడు.

యిలావుంటూ వుండగా ఒకమాటు అతని కూతురి పెళ్ళి మాట్లకని పొరుగూరు వెళ్ళవలసి వచ్చింది. ఆరోజు తిథివారాలు చూదామని పంచాంగం తీసేడు. మధ్యాహ్నం ఒంటి గంటకు మంచి ముహూర్తం వుంది. యీ ముహూర్తం చాలా బాగుంది! హాయిగా భోజనంచేసి బయలుదేరి సాయంత్రానికల్లా, పెళ్ళివారి గ్రామం చేరుకోవచ్చును అనుకున్నాడు. మధ్యాహ్నం భోజనాలు అయినాక భార్య దిబ్బరొట్టె కాల్చి మూటకట్టి యిచ్చింది. మార్గమధ్యంలో నున్న చెరువు గట్టుమీద కూర్చొని ఆరొట్టె ముక్క తిని కృష్ణా రామా అంటూ చల్లబాటు వేళ హాయిగా యిల్లు చేరుకోవచ్చు కదా అనీ. ఆ కాలంలో కాఫీ దుకాణాలు లేవు కదూ! అందు కని. మన బ్రాహ్మణుడు మూట చంకను పెట్టుకుని గుమ్మంమెట్లు దిగేడు. నాలుగు అడుగులు వేసాడో లేదో "నూనమ్మా, నువ్వుం, నూనె" అని కేక వినిపించింది. ఛీ! తెలికలివెధవ! సరిగా వేళకి వస్తున్నాడు అనుకొని తిన్నగా యింట్లోకి పోయి కాళ్ళు చేతులు కడుక్కొని కాస్సేపు కూర్చొని మళ్ళా బయలుదేరేడు. యీ సారి గుమ్మంలో వుండగానే కనిపించింది. యింకెవరో కాదు సుమండీ! మనవారే! మనదొడ్డమ్మగారు. చచ్చేనురా! భగవంతుడా! యిదేమిటి?

'ఒట్టికుండకన్న, యేకాకిగన్న,

విధవకన్న, హానితప్ప దెంతవానికైనా, అని లోపుకు పోయేడు. రామరామ శుభసమయం దాటి పోతూంది. బాగా వచ్చి పడ్డాయి యీ అపశకునాలు అనుకుంటూ విసనకర్ర పట్టుకుని విసురుకుంటూ నులక మంచంమీద చతికిల బడ్డాడు. మళ్ళా బయలు దేరుదామా అనుకునే సరికల్లా మనవాడు తయారు. "భిక్షాందేహి మాతా అన్నపూర్ణేశ్వరి" అంటూ ఆయవారపు బ్రాహ్మడు గుమ్మంలోనిలబడ్డాడు. బాగుందిరా నాయనా! నువ్వు ఒక్కడివే తక్కువైనా వనుకున్నాను. వచ్చావ్! ఛా ఛా! మరేం పనిలేక పోతేసరి అని తిడుతూ పైమీద గామంచా

పరుచుకుని పడుకున్నాడు. విసుగ్గా యేమండీ ! పడుకున్నారూ ! అని అడిగింది భార్య. మరి పొగలు ప్రయాణాలు లాభంలేదే ! రాత్రి పన్నెండు గంటలకయితే మరిజన సంచారం వుండదు. హాయిగా పోవచ్చునన్నాడు. ఆవిడ పాపం ఆ రొట్టెమూట భద్రంగా దాచింది రాత్రి భర్త ప్రయాణ మయేటప్పుడు తిరిగి యివ్వాలని.

మెల్లిగా అపూట గడిపిన తరువాత రాత్రి పన్నెండు గంటలయింది. హరేరామ రామ రామహారే అంటూ మూట చంకను పెట్టుకుని మన బ్రాహ్మడు బయలు దేరేడు. చీకటిలో గుమ్మందిగి రోడ్డు మధ్యకు వెళ్ళేడు. ! యెదురు గుండా నెత్తి మీద మూటపెట్టుకుని వస్తున్నాడు యెవరో మహానుభావుడు. మనవాడికి అప్పుడే చెమటలు పోసేసి కాళ్ళువణుకు తున్నాయి. యీ చ్ఛాన్సు కూడా తప్పిపోతుందేమోనని. యెందుకేనా మంచిదని పోతూవున్న వాడిని పోనియ్యకుండా దగ్గరసా పిలచి అడిగేడు. యేమయ్యా ! నీకేం బుద్ధిలేదూ ! యీ నిశిరాత్రి పూట యెక్కడికి బయలు దేరావు? నీ నెత్తి మీద మూటయేమిటి? అని. ఓయి! వెర్రివాడా నన్ను తెలీదా ! నే నింకెవరో కాదు ! మీ పొరుగు నున్న బుచ్చయ్య శాస్త్రిని. మా యింట్లో పిల్లులభాధ చాలా జోరుగా వుంది. ఆ సంగతి నీకు తెలిసిందే కదా ! పగలు యెక్కడైనా వదిలేస్తే యిల్లు పసిగట్టి వచ్చేస్తాయి కదా అని వీటినన్నింటిని బస్తాలో కుక్కి యీ రాత్రిపూట పట్టుకు పోతున్నాను. యీ పిల్లులబస్తా అయ్యకోనేరు గట్టుఅవతల వదిలేసి తిరిగివచ్చేస్తాను యిద్దరంకలిసి తోడుగాయింటికి పోవచ్చు. అందాకా వెంకమ్మ కోవెల గట్టు మీద కూర్చో అన్నాడు. బాగుంది యీవేళా కోళాం! నాపిల్ల పెళ్ళికని నేను బయలు దేరితే నువ్వు ఒక్కడివి చాలేవు కదా ! పిల్లులనికూడా మోసుకు వచ్చావు. ఛీ పో. అని వానిని గసురుతూ మరి యీ నెలలో మంచిముహూర్తాలు లేవు వచ్చేనెల చూసుకుందాం అనుకుంటూ చక్కా యింట్లోకి పోయేడు.

యేమండీ ! అప్పుడే వచ్చేసేరు అని అడిగింది భార్య. ఆ ! నాకు ప్రయాణము లేదు. పిల్లకి పెళ్ళీలేదు, ఆ విసనికర్ర యిలాపడేసి పడుకోవే అంటూనే నులక మంచంమీద నడుంవాల్చేడు మనచాదస్తపు బ్రాహ్మడు.



# 'దవనం'

శ్రీ పిల్లా సుబ్బారావు శాస్త్రి

అనేక సంవత్సరాలకి పూర్వం సాత్వికుడు అనేరాజు ఓఢ్ర దేశాన్ని పరిపాలిస్తూ వుండే వాడు. సాత్యకి గొప్ప భక్తుడు. ఆయన ప్రతీ రోజూ మహానివేదన సమయానికి - పాదచారి అయి, జగన్నాథ స్వామి ఆలయానికి వెళ్ళే వాడు.

నివేదన అయిన తర్వాత భగవంతుణ్ని దర్శించుకొని ప్రసాదాన్ని తీసుకు వెళ్ళిపోయే వాడు.

ఒకరోజు రాజుగారు వచ్చేసరికి నివేదన, నీరాజనాలు అవీ ముగియటానికి కొంతసేపు పడుతుందని తెలిసింది. శాత్యకి సరేనంటూ మండపం ప్రవేశించాడు.

మండపంలో అదే వేళకి కొందరు యాత్రికులు పాచికలు పెట్టి జూదం ఆడుకొంటున్నారు.—వాళ్ళని రాజభటులు "లెండయ్యా! రాజుగారు వస్తున్నారు!!" అని లేపుతోవుంటే- "అబ్బే! వాళ్ళని ఆడుకోనివ్వండి!" అంటూ రాజుగారు కూడా వచ్చి అక్కణ్ణే కూర్చున్నారు.

ఆట చూస్తూవుంటే రాజుగారికికూడా ఆడాలని బుద్ధిపుట్టింది.- రాజుగారు తలుచుకొంటే కొండమీద కోతన్నా తేవాల్సిందే...! రాజుగారు ఆటలో ప్రవేశించారు. ఆట హుషారుగా సాగుతోంది.

కొంతసేపటికి గర్భగుడి తలుపులు తెరిచారు. స్వామి దర్శనం చేసుకోవచ్చునని కబురుమీద కబురు వచ్చింది.

ఆట మంచి పట్టుత్వంలో వుండటం మూలాన్న రాజుగారు తాను వచ్చిన పనే మర్చిపోయారు.- దేవుడి ప్రసాదం ముందుగా రాజు గారికి యిచ్చి తర్వాత భక్తులకి యివ్వడం మామూలు.

అర్చకులు భక్తులకి ఆలస్యమవుతోందని మండపం దగ్గరికే తీసుకువచ్చారు ప్రసాదాన్ని. జూదంలో పడ్డ రాజు "ప్రభూ...! భగవత్ప్రసాదం...!" అనగానే కుడిచేత్తో పాచికలు వేస్తూ, ఎడం చెయ్యి జాచారు. ఎడం చేతిలో ప్రసాదం పెట్టడం చాలా అపచారమని, అర్చకులు ప్రసాదం యివ్వకుండానే వెళ్ళిపోయారు.

రాజుగారికి ఆడిఆడి దానిమీద విసుగొచ్చింది.- అప్పుడు తెలిసింది. తాను స్వామి దర్శనం కోసం వచ్చానని.

"మంత్రి! ఇంకా మహానివేదన కాలేదూ?" అని ప్రశ్నించాడు రాజు.

"ప్రభూ! మహా నివేదనయ్యి, తలుపులు తీసి చాలా సేపయ్యింది!" అంటూ మంత్రి జరిగినది చెప్పాడు.

ఇది వినగానే రాజుగారు కలలోనుంచి మేల్కొన్నట్టు లేచి "అయ్యో...! ఎంతపని చేశాను...? పరమపవిత్రమయిన భగవత్ప్రసాదం కోసం ఎడంచెయ్యి పట్టానా...!" అంటూ కళ్ళ వెంట నీళ్ళు కార్చేడు.

తర్వాత రాజుగారు స్వామి దర్శనం చేసుకొని రాజమహాల్ చేరుకున్నారు.

మహారాజు స్వామి దర్శనం చేసుకున్నారే గాని అతని మనసు మనసులాలేదు! అతని హృదయం వేగంగా కొట్టుకోసాగింది. పెద్ద అగ్ని పర్వతం బ్రద్దలయినట్లయింది.

"నేను స్వామికి పెద్ద అపరాధం చేశాను...! ఆయన్ని అవమానించాను.!! పరమ పవిత్ర

మయిన ప్రసాదం కోసం తుచ్ఛమయిన ఎడమ చేతిని జాచేను.!!!- నాకు శిక్ష ?— ఎడమ చేతిని జాచానుకాబట్టి దానిని నఱికేయటమే!" మహారాజు తనలో తానే దుఃఖించి, చెయ్యి నరుక్కోటానికి సిద్ధమయ్యారు !

తనచెయ్యి తానే నరుక్కో-వటం కష్టం. అంచేత మంత్రిని పిలిచి యిలా చెప్పారు. "మంత్రీ ! ప్రతీరోజూ నా పడకగది దగ్గరికి ఒక దెయ్యమో,భూతమో వచ్చి కిటికీలోనుంచి చెయ్యి జాచి నానా గొడవా చేస్తోంది! ఈ రోజు నువ్వువుండి రాత్రి చెయ్యి పెట్టగానే నఱికేశయ్!" మంత్రి సరే నని వెళ్ళిపోయాడు.

ఆరాత్రి రాజు కిటికీలోనుంచి తన ఎడం చేతిని జాచేడు— సమయం కోసం కాసుకూర్చున్న మంత్రి గభాలున కత్తి దూసినరికేశాడు.

తర్వాత రాజని తెలుసుకొని "ప్రభూ ! నా చేత ఎంత క్రూరమయిన పని చేయించారూ అని దుఃఖించాడు.

మర్నాడు జగన్నాథ ఆలయానికి అతని చెయ్యి పల్లకీలో ఊరేగించి, భగవంతునిముందు వుంచారు.

సాత్వికి బయటనే నుంచోని, ప్రసాదంకోసం అలవాటుప్రకారం కుడిచెయ్యితో పాటు మొండి చెయ్యి జాచేడు— ఆశ్చర్యం మొండిచెయ్యి మాయమై, మామూలుగా చెయ్యివచ్చి చోసిలి ఏర్పడింది !

అంతా జయజయ ధ్వనులు చేసారు.

లోపల దుర్గంధం వేయవలసిన చేయి ఒక మొక్క-గా మారింది. అదే 'దవనం మొక్క-' దానిని నందనవనంలో పాతేరు.

తర్వాత అదె అంతటా వ్యాపించింది. అందుకే జగన్నాథ పూజావస్తువుల్లో దవనం ప్రథమస్థానం అలంకరిస్తుంది.



# చిలుకా, గోరింకలు

శ్రీ సి. సి. పున్నయ్య

బ్రహ్మయ్యగారు ఒకప్పుడు మా గ్రామంలో మంచి స్థితిమంతుడు. కాని గంపెడు సంతానం—అందులో ఒకడుతప్ప ఆడపిల్లలుగల కుటుంబము కావడమువలన సంసారభారం అధికమయే కొలది ఆస్థిపాస్తులు క్రమంగా కరిగిపోసాగినవి. నలుగురు ఆడపిల్లలకు వైభవంగా పెళ్ళిచేసి అత్తగారి యిండ్లకు పంపేశాడు చిట్టచివర కుమార్తె యింకా పెళ్ళికుంది. ఆమె పెండ్లి వయస్సుకు వచ్చేసరికి బ్రహ్మయ్యగారి ఆర్థిక వ్యవస్థ తారుమారైంది. అయినా ముందు కుమార్తెలకు జరిగిన వివాహాలు లాగానే ఆడంబరంగా వివాహం చెయ్యాలని బ్రహ్మయ్యగారి కుతూహలం.

"పాపా ! రేపటినుండి బడికి వెళ్ళవాకమ్మా - యింత వరకు చదివింది చాలులే" అన్నది తల్లి.

తర్డుఫారం పాసయి అప్పుడే నాల్గవఫారంలో ప్రవేశించిన పాప "ఎందకనమ్మా ! నాకు బి.ఏ.దాక చదువుకోవాలనియుంది'' అన్నది.

"కాదులే తల్లీ ! యీడువచ్చిన పిల్లవు—యింకా చదువేమిటి ? పెళ్ళిచేసికొని కాపరంచే యాల్సిదానివి''

తల్లి ఆమాటలనేసరికి పాప ఏమిమాట్లాడలేక పోయింది. చదువుకోడమునకు తనకు యీడురావడం ఏమడ్డమా అనే ఆలోచనతో నిలుచున్నది నిలుచున్నట్లుగా బొమ్మలానిశ్చలమైపోయింది. రాబోయే సంబంధమువారు మంచివారైతే, భర్తవిద్యాధికుడై అభ్యుదయభావాలు కలవాడైతే అత్తవారింట్లోనయినా చదువుకో వచ్చుననుకున్నది.

బ్రహ్మయ్య విశ్వప్రయత్నముచేసి పాపకు తగిన సంబంధముగానెంచి కట్నకానుకలు, లాంఛనాలతోసహా మనుముస్థిరము చేశాడు, ఆయన భార్య "ఏమండీ ! యీ సంబంధము ఎక్కడ దొరకిందండీ !— యీ కట్నకానుకలు, అయిదు రోజుల పెండ్లి— యీ ఆర్భాటానికంతా డబ్బు ఎక్కడతెస్తారు ?''

"సంబంధమునకేం — నిక్షేపంలాంటిది పిల్లవాడు చిన్నవాడు. బి. ఎ. చదువుకొంటున్నాడు. అందచందాలలో మన పాపకు యీడుజోడైనవాడు - పెండ్లికి మహా అయితే నాలుగువేల రూపాయలగుతవి — అయితే ఏం ! కడపటిపిల్ల — ఏకారణంలేకుండా అత్తగారింటికి పంపిన వారమగుతాం."

"అంటే ఆవున్న రెండెకరాలు పొలం అమ్మి అమ్మాయి పెళ్ళిచేసి మనం బొచ్చ ఎత్తుకొనిపోవాలనా మీ ఉద్దేశం.''

"తప్పేదేమున్నది విధి నిర్ణయమైతే" అని బ్రహ్మయ్య లేచిపోయాడు.

బ్రహ్మయ్య పాప పెండ్లి రెండెకరాల పొలం అమ్మి వైభవోపేతంగాచేశాడు. కూతుర్ని కాపరానికి పంపించాడు. ఇక యింటిదగ్గరనో - బ్రహ్మయ్యగారి భార్యన్నట్లు కొడుకు ఏదో గుమాస్తాగిరిచేస్తుండకపోతే యిాళ్ళో భిక్షాటనానికే బయలుదేరవలసివచ్చేదే.

పాప అత్తగారి యింటికి పోయేముందటి యూహాలు అక్కడికి పోగానే గాలిమేడలయినవి. మామధర్మరాజు లాంటివాడుగాని అత్తగారు రాక్షసిలాంటిదయింది ఇంట్లో వెట్టిచాకిరంతా పాపనెత్తిన వదిలేసి కాలుమీద కాలేసుకొని పెత్తనంచలాయించసాగింది. ఇక భర్తయింట్లో ఎప్పుడూ యుండడు. పూటకూలియింటికి వచ్చిపోయినట్లు నాలుగుమెతుకులు తినిపోతుండేవాడు. తల్లిదండ్రుల మాటలు లెక్కజేసేవాడుకాడు. ఎక్కడ తిరుగుతుంటాడో, ఎక్కడ యుంటుంటాడో తనకు చెప్పేవారు లేరు అడిగినా. కాపరానికి వచ్చిన తరువాత ఒక్క రోజైన భర్తకన్నెత్తి తనతో మాట్లాడి ఎరుగడు. క్రమంగా ఆయన వేశ్యాలోలుడై తల్లిదండ్రుల వార్ధక్యమును అవకాశముగా తీసికొని అదిరించి, బెదిరించి డబ్బు తగలేస్తున్నాడని తెలిసికోగలిగింది. అతని మనసు మార్చి ప్రేమానురాగాలకు పాత్రురాలు కావాలని అనేక సార్లు ప్రయత్నించింది. కాని యింటికి అసలు ఎప్పుడు

వస్తాడో !— ఎప్పుడు వెళ్తాడో !— వచ్చినప్పుడైనా రెండు నిమిషాలుంటే జాస్తి; ఒక నిముషముంటే తక్కువ. చివరకు కొంతకాలానికి యింటికి రావడమే మానేశాడు.

పాప రోజుల పర్యంతం తన జీవితమును పర్యవేక్షణ చేసికుంది. భర్తతో ఒక్కరోజైనా సుఖమనేది ఎరుగక పోగా. ప్రొద్దస్తమానముగాడిద చాకిరిచేస్తూ భర్తయుండని కొంపలో తానెవరితో కాపరం చెయ్యాలో అర్థమయ్యేదికాదు.

ఒక రోజున ధైర్యముచేసి మూటముల్లె సర్దుకొని గుర్రపుబండిని పిలిపించింది. అత్తగారు బండిని, మూటముల్లెనుచూచి "ఎక్కడికి బయలుదేరావు - చెప్పడం, చెయ్యడంకూడ ఆవసరము లేనట్లున్నదే" అన్నది.

"ఎవరితో చెప్పాలి? నేనొచ్చింది మీతో కాపరం చెయ్యడానికా లేక నీకొడుకుతో కాపుం చెయ్యడానికా? నీకొడుకూ యింట్లో యుండక మీ యింట్లో వెట్టి చాకిరి చేయడానికి రాలేదునేను. మీకుమారుని అయోగ్యతను, మీకుటుంబబండారాన్ని ప్రజానీకానికి చాటిసోదరనారీలోకం యికముందైనా పెండ్లి చేసికొనబోయే ముందు మంచి చెడ్డలు తెలిసికోకుండా మోసపోవద్దని ప్రచారంచేసి సేవ చేయడానికి బయలుదేరాను'' అంటూ ముందుకుసాగింది మూటముల్లెతో.

"ఆ — ఆ — ఎంత ఉపన్యాసమిచ్చావే - జంకుగొంకు లేకుండా — యిదుగో! గడపకదిలావంటే ..."

"చూద్దాంలేండి" అంటూ బండిలో ఎక్కికూర్చుంది— బండి కదిలింది.

రైలు బయలుదేరడానికి యింకా అయిదు నిముషాలుంది. ప్లాటుఫారంమీద వచ్చేజనం, ప్రయాణం చేసే వారికి వీడ్కోలివ్వడానికి వచ్చినవారు, అవియివీ అమ్మకాలుకోలాహలంగా నున్నది. పాప ఆడవాళ్ళ పెట్టెలో కిటికీదగ్గర కూర్చొనియున్నది. ఆపెట్టెలో యింకా యిద్దరో ముగ్గురో కూర్చొనియున్నారు. పాప తలవంచుకొని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్నది.

చేతులు చేతులు పట్టుకొని ఒక పురుషుడు, స్త్రీ ప్లాటుఫారంమీద నడుస్తూ పాపయున్న పెట్టెదగ్గర అధాటుగా ఆగారు. ఆపురుషుడు పాపను తేరిపారచూచాడు. పాప పరధ్యాన్నంలో అతనిని గుర్తించనుకూడలేదు. అతడు దగ్గరకువచ్చి "పాప! ఎక్కడికీ ప్రయాణం? ఒంటరిగానే!— చెప్పనైనాలేదేం?" అన్నాడు.

"ఒకప్పుడు ఒంటరితనం లేకుంటేకదా!— ఎవరితో చెప్పి రమ్మంటారు. నేను చెప్పవలసిన ప్రభువుకంటికి కనుపిస్తేకదా."

"పద దిగు యింటికి పోదాం"

"ఎవరింటికి? — మీకు యిల్లు, వాకిలి, భార్యపట్టక పోయ - మీరులేని కొంపనాకెందుకు? ఏదో మీపుణ్యమా అంటూ పుట్టింట్లోనే పడియుంటాను. మీరు ఎప్పటియట్ల సుఖంగానుండండి" అన్నది అశ్రునయనాలతో.

"ఏమిటి పాపా! యిది....క్షమించు యింతవరకు నీపట్లచూసిన నిరాదరణకు నా నీతిమాలిన ప్రవర్తనకు" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

ఆయనతోనున్న స్త్రీ యిదంతాచూచి మెల్లగా జారుకుంది. పాప, ఆమె భర్తమూట, ముల్లెదించుకొని యింటికి చేరారు. భర్తలో విప్లవాత్మికమైన మానసిక పరివర్తనున తెచ్చి మంచి మార్గంలోకి తెచ్చినందుకు పాపఅత్త. మామలు సంతోషించారు. పాప, ఆమె భర్త చిలుకా, గోరింకలు లాగ అన్యోన్యంగా ఆదర్శ దంపతులయ్యారు.



# ★ మేఘాలలో మెఱుపు ★

శ్రీ డి. వి. ఆర్. ప్రభాకరశాస్త్రి, బి.ఏ., బి.ఇ.డి.

శారదకు నిద్రపట్టలేదు. కొంచెం తల ఎత్తి అటూ ఇటూ చూసింది. బుడ్డి దీపం సన్నగా వెలుగుతోంది గడపమీద. ప్రక్కనే నాలుగు గజాల దూరంలో తల్లి పడుకొని ఉంది నిశ్శబ్దముగా. తల్లికి ఇంకా నిద్ర పట్టిందో లేదో! ఔను! ఆమెకు మాత్రం నిద్ర ఎట్లా పట్టుంది? తనే ఇంత బాధ పడుతుంటే తనను కన్న తల్లి కళ్ళారా తను పడే ఇడుములు చూసి నిద్ర పోగలదా అనుకుంది శారద. తన తండ్రే బ్రతికి ఉన్నట్లయితే, ఎంత బాధ పడేవాడో తన్ను చూసి అనివిలపించింది శారద మనస్సులో. కాని అటువంటివేమీ లేకుండానే. ఆయన తన పెండ్లి అయిన ఏడాదికే చనిపోయినందుకు మరుక్షణమే ఒక విధంగా సంతోషించిందామె.

బయట ఏదో చప్పుడైంది. శారదకు భయం వేసింది. తన భర్త ఏమైన దొంగతనానికి వచ్చాడేమోనని! ఔను. లంజలకోసం గోడలురికేవాడు, దొంగతనానికిమాత్రం ఎందుకు బయలుదేరకూడదు? అందులోను తనదగ్గర రెండు జతలగాజులు, గొలుసు, మంగళసూత్రాలు ఉన్న సంగతి తన మొగుడికి తెలుసు. భార్యనైతే ఏలుకోక పోవచ్చుకాని, ఆమె నగలమీదే ఉంది వాడి దృష్టి. వాటి కోసం వాడు ఎప్పుడు వచ్చినా రావచ్చు, ఎట్లావచ్చినా రావచ్చు! శారద అతనటువంటి వాడేనని తన రెండేళ్ళ కాపురంలోను గ్రహించింది.

అది ఒకటేగాదు. రావు యొక్క పూర్వచరిత్ర అంతా కూడా ఆమె గ్రహించింది, కాపురానికి వెళ్ళేక. అతను ఇంటరు చదివేరోజులలోంచికూడా, చంచల మనస్కుడవటంచేత ఇంటరు ప్యాసవడానికి ఆరు సంవత్సరాలు పట్టిందట. సహజమైన కామవికాస వేగానికి రావు తట్టుకో లేకపోయినాడని కొద్దిరోజులలోనే తెలుసుకుంది. కొడుకు యొక్క కామ వాంఛలకు శాస్త్ర బద్ధమైన మార్గమును చూపుదామనే ఉద్దేశంతోటే కాబోలు నాడు రావు తండ్రి కొడుకుకు పెండ్లి చేశాడు. పెళ్ళి చూపులనాడే సంగతులన్ని తెలిసిఉంటే శారద అతన్ని పెళ్ళిచేసికునేదికానేకాదు.

## 2

శారద తండ్రి బడిపంతులుగా కష్టపడి సంపాదించిన నాల్గువేల రూకలు గల గల పళ్ళెంలో పోసి వరకట్నంగా ఇచ్చి, తన ముద్దుల కూతుర్నిచ్చి, సుఖపడుతుందనే ఉద్దేశంతో రావు కిచ్చి పెండ్లి చేశాడు. ఆ పళ్లెం, ఆనందంతో, కళ్ళు పెద్దవి చేసికుని చూస్తూ, దేవేంద్రుడిలాగ తీసుకున్నాడు రావు తండ్రి. కాని పెండ్లయి, భార్య కాపురానికి వచ్చాకకూడ, రావు తన వెనుకటి గుణాలు మాన లేదు, శారద ముసి ముసి నవ్వులు నవ్వినా, ఒయ్యారంగా సయ్యాటలాడినా, చమత్కరించినా, మరెన్ని విధాల ప్రయత్నించినా శారద విఫల అయిపోయింది, రావు మనస్సు నరికట్టడంలో. తనను తాను అద్దంలో చూసుకునేది శారద, తానేమైనా కురూపి యేమోనని. కాని మరుక్షణంలో, తనకు ఫిఫ్త్ ఫారం చదివే రోజులలో వస్తుండే ప్రేమలేఖలు జ్ఞాపకం వచ్చేవి. అన్నీ చదువుకొని, తన అందానికి గర్విస్తూ, ఆలేఖలను తునియలుగా చింపి పారవేసేది శారద ఆనాడు. ఆప్రేమికులను నిరాశపరచినందుకే గాబోలు నేడు భర్త తనవైపు చూడకుండా పోతున్నాడు, అని శారద మధ్య మధ్య బాధ పడుతూండేది!

శారద కాపురానికి వెళ్ళేక ఏ నెల్లాళ్ళు భర్తచే సుఖపడ్డదో అంతే. పై పెచ్చు అత్తారింటి చాకిరీ, కసుర్లు మరీ పీల్చి పిప్పిచేశాయి. ఎంత కోడండ్రికమైన, ఎంత చాకిరీ అయినా భర్త అనువుగా ఉండి ఆదరిస్తేకదా ఆమె భరించేది! భర్త విముఖుడై సందులు గొందులు పట్టి చెడిపోతుంటే, ఎంత వారించినా వినక తనను ఉపేక్ష చేస్తుంటే, ఆమె మాత్రం ఎట్లా సైరించగలదు? తన భర్తవంటి దుశ్శీలురకు బుద్ధి చెప్పలేని తనలాంటి స్త్రీలను తలుచుకుంటే మరీ తలవంపుగా భావించేది శారద. తన అశక్తతకు మధ్య మధ్య తనను తానే నిందించుకునేది!

దీనికి సాయం, రావు మంచో చెడో ఇంటరు ప్యాసయినాడు మార్చిలో. ఫలితాలు వచ్చిందే తడవుగా "నేను చదువుకు సీట్లకోసం పోవాలి— ఒక ఐదు వందలియ్యి నాన్నా!" అని అడిగేడు తండ్రిని. "ఇక్కడనుంచి దరఖాస్తులు పడవెయ్యిరా, చాలులే!" అన్నాడాయన. "అట్లా కాదు నాన్నా! వాళ్ళదగ్గరకుపోయి 'ట్రై' చేస్తే, ఆశ్రయిస్తే కాని సీటు ఇవ్వరు" ఏమనుకున్నాడో ఏమో తండ్రి మారు మాటాడక జేరడానికి కావలసిన డబ్బిచ్చి పంపించివేశాడు కొడుకును.

## 3

రావు ఊరు విడిచి వెళ్ళినదే తడవుగా రావు తండ్రి యొక్క తలలో తెలివితేటలు వెఱ్ఱి తలలు వేయనారంభించేయి. నెరసిన అతని తలవెంట్రుకల కుదుళ్ళతో చీడ పురుగులు చిమ చిమ లాడటం ప్రారంభించేయి. "ఆమధ్య అమ్మాయిగారింటికి వెడతానన్నావు వెళ్ళవే! అమ్మాయికి కాస్త నలతగాకూడా ఉందట." అని ముసలాయన భార్యను కూతురుగారింటికి పంపివేశేడు. ముసలావిడ కూతుర్ని చూద్దామనే కుతూహలంతో హడావిడిగా వెళ్ళిపోయింది కూతురిగారింటికి. ముసలాయన పుఱ్ఱెలో పుచ్చు బుద్ధులు పుట్టుకువచ్చేయి.

శారద తన మామగారంతటి దుర్మార్గానికి ఒడిగడ్తాడని కలలోకూడా అనుకోలేదు. పశుప్రాయుడని ఎన్నడూ ఊహించలేదు. మనువు చెప్పినట్లు అది ఏకాంతంయొక్క దుశ్శక్తియో, లేక ముసలాయనలోని అసంతృప్తి కామవాంఛల విజృంభణయో కాని శారదయందు కామవాంఛలను వెలిబుచ్చేడు! శారద నివ్వెరబోయింది! "తండ్రి వంటివారు— మీకీబుద్ధి భావ్యంగాదు" అంది. "తండ్రి కూతుర్ని ముద్దుకోడూ?" అన్నాడు, పితృప్రేమ, భర్తృ ప్రేమల తారతమ్యం గుర్తించలేని ఆ పశువు. శారద ఈసంగతి తెలియపరుస్తూ భర్తకు తంతి ఇద్దామనుకుంది. కాని తనమాట నమ్మి, సెలవిచ్చి, ఆదరించే భర్త కాదుకదాతన భర్త. అని విలపించింది ఆ అసహాయ స్త్రీ. పైగా తనమాట నమ్మేదెవరు? ముసలాయన వాలకంచూసి, 'గోవు' అనుకునేవాళ్ళే కాని, లోనున్న శునకలక్షణాలసంగతి నమ్మేవారెవరు? విన్నవాళ్ళు పైపెచ్చు తననే దూషిస్తారని మథన పడింది శారద. ఎటూ పాలుపోలేదు. ఆ మృగం దగ్గరఉంటే, ఏ క్షణంలో అది తనపైబడి బాధిస్తుందోనని భయపడింది ఆమె— ముసలాయన తన కోసం మల్లెపూలు తీసికొని రావడానికని వెళ్ళేడు బజారుకి! వెంటనే బ్రదుకు జీవుడా అని తక్షణమే ఆ ఇల్లు విడిచిపెట్టివేసి పుట్టింటికి కట్టుబట్టలతో వచ్చేసింది శారద.

## 4

తల్లి కంగారు పడింది కూతురియొక్క ఈ అనుకోని రాకనుచూసి. బిడ్డ పెట్టుకన్నీరుకుంటూ భర్త పరాకుని, మామగారి పశుత్వాన్నిగూర్చి వివరిస్తుంటే తల్లి పడ్డ బాధ ఇంతా అంతా కాదు. శారద తండ్రి చనిపోవటంచేత వచ్చిన ఇన్సూరెన్సు డబ్బు పెట్టుకొని, ఇల్లు ఒక ప్రక్కనద్దెల కిచ్చుకుని, తంటాలుపడుతూ ఆవిడ కాలం వెళ్ళపుచ్చుతోంది, ఇక వేరే దిక్కులేక. కూతురుపడే బాధలు ఆమె ఎరుగున్నా, ఈవేళకాకపోతే రేపైనా అల్లుడికి కుదురు రాకపోతుందా అనే ఆశతో, కూతుర్ని అత్తవారింటనే ఉంచిందిన్నాళ్ళూను. కాని ముసలాయన సంగతి విన్నాక ఆమె హతాశురాలైంది. రావులోని నైచ్యానికి బీజం అసలు ఆభిజాత్యంలోనే ఉందన్న ఆమె గ్రహించింది. ఇక కూతుర్ని ఆమె పంపదలుచుకోలేదు! శారద వెళ్ళదలచుకోలేదు. అత్తవారి అంతు అసలేలేదు!

కాని తల్లితోపాటు మార్చుకొని తిని కూచోడమేనా, లేక మరోమార్గమేమైనా ఉందా అనే ఆలోచన శారదను బాధిస్తోంది అప్పటినుంచి. నిద్రపట్టటంలేదు రకరకాల ఆలోచనలతోటి. శారద మళ్ళీ కళ్ళుమూసింది మెలకువతోనే. తిరిగి కళ్ళు తెరిచింది. గడపమీద బుడ్డి దీపం యొక్క వెలుగుమూలాన్న గదిఅంతా కాస్త కనుచీకటిలో కనపడుతోంది. తటాలున శారదకు ఒక ఆలోచనతట్టింది. వచ్చేమార్చికి మెట్రిక్‌కు కట్టి.... ఆతర్వాత సెకండు గ్రేడు ట్రయినింగ్ అయి. ఏబడిలోనయినా జేరితే పంతులమ్మగా? వివాహం మూలంగా నాడు ఫిఫ్తు ఫారం చదువుతూ మానేసింది. కాని నేడు నిశ్చితంగా చదువుకోవచ్చు!.... తర్వాత తనపొట్ట తాను పోషించుకోవచ్చు!! విజ్ఞానం సంపాదించుకోవచ్చు!!!........ పశువులదోవ పశువులదే మానవుడిదోవ మానవుడిదే!....

పసిహృదయాలమధ్య కాలం గడుపుకుంటూ, అమాయకత్వంతో కలకలలాడుతూ కిలకిలలాడే ఆముఖాలను తన బిడ్డలలాగ ప్రేమించి, లాలించి బోధిస్తూ కాలం గడుపుకోవడంకంటే తనకు కావలసినదేముంది అనుకుంది శారద. కారుమేఘాలమధ్య మెఱపు ఒకటి మెరసింది. బుడ్డి దీపం గడపమీద మరింతకాంతితో వెలుగుతున్నట్లు కనపడింది ఆమెయొక్క విప్పారిన కండ్లకు!!

# వేదాంతగోష్టి

[పలువిధములైన సమస్యలందు నిమగ్నమైన మానవ మనస్సునకు అధ్యాత్మిక చింతకు ఆనాటి కానాటికి అవకాశమే లేకుండపోవుచున్నట్లు తోచుచున్నది. అప్పుడప్పుడు కొంతసేపైన ఆధ్యాత్మిక విషయాశక్తులై పరమార్థచింత గలిగింపవలయుననియే మా సంకల్పము. ఇట్టి సంకల్పముతో ప్రతినెలా ఈ శీర్షిక ప్రకటించ నున్నాము. సం॥]

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్
జ్ఞానయజ్ఞః పరంతప।
సర్వం కర్మాఖిలంపార్థ
జ్ఞానే పరి సమాప్యతే ॥

[శ్రీ భగవద్గీత — జ్ఞానయోగము 33.]

"ఓ పరంతపా! యజ్ఞంబులందు ఉత్తమోత్తమైనది జ్ఞానయజ్ఞము. ద్రవ్యసాధనమైన యజ్ఞంబుకంటే జ్ఞానస్వరూపమైన యజ్ఞంబు మిక్కిలి శ్రేష్ఠమైనది. ఓపార్థా! సమస్తమైన కర్మము నాశనంబు కాని దగుచు బ్రహ్మజ్ఞానమందు అంతర్భూతమగుచున్నది

తృప్తి :

"మానవుని లౌకిక వస్తుజాలములతో తృప్తిపరచడం కుందేటికొమ్ము సాధించబూనడం వంటిది. నేడు మానవ తృప్తికి చేకూర్చే ప్రాపంచిక వస్తుజాల పరిసరాలతో మరింత వానిని తృష్ణలో కూలద్రోయుచున్నవి.

నిజముగా ఏవ్యక్తినీ ఏవ్యక్తీ తృప్తి పరచలేదు. ఎవరికి వారు తృప్తులై శాంతులై జీవించాల్సిందే. కొంతవరకూ అధ్యాత్మిక తృష్ణారహిత జ్ఞానోపదేశంచేత మానవుని లౌకిక తృష్ణనుండి విముక్తిపరచి తృప్తుని చేయగలుగుదువుగాని ధన. వస్తు వాహనములతో తృష్ణనార్ప ప్రయత్నించడము, తృష్ణానందాలతో నింపచూడడం ఎంత మాటితో నెటివప్పి తీర్చినట్లే.

చేతనైతే జ్ఞానధనానందాన్ని అందించి మానవ వస్తు వాహన తీరని తృష్ణనుండీ విముక్తిపరచి తృప్తునిచేయి."

—శ్రీమతి కృష్ణమ్మ.

గీ॥ కర్మమాచరింప నీకధికారమున్న
దంతె; ఫలము నాసింప నీకైనలేదు
ఫలమునకు నీవు కారణంబగుటతగదు
సంగమును వీడి కర్మచేయంగవలయు ॥

## గూపవము శ్రీసరస్వతీ స్త్రీ సమాజము



జనవరి 26 రిపబ్లిక్ దే మొదలు సూత్రయజ్ఞముచేసి తీసిన నూలు జనవరి 30 ని గాంధీజీకి సూత్రాంజలిని సమర్పించినప్పటి ఛాయాచిత్రము.

# "శివతాండవ నృత్యం"

పి. ఎస్. గోపాల్, బి. కామ్.

నాట్యరాజు కాలి అందె ఘల్లు ఘల్లురనియె
అదియేమో తెలియని నాగుండె జల్లుమనియె!
దాక్షాయణి పాదయుగళలాక్షారుణ రాగముతో

రూక్షారుణ నేత్రయుగళ తీక్ష్ణ వీక్షణాలతో
భవుని భస్మరేఖాంకిత పాపజన్నిదమ్ములతో
శివుని శిరస్సరజ్ఝరీ వారి పూరమ్ములతో

నాట్యరాజు నృత్యసరళి వెండికొండ నిండె
నందిరాజు మోరయెత్తి ఆలకించు చుండె
గంగడోలు నింగివైపు తొంగి చూచుచుండె!

గంగవాలు పొంగి పొరలి నింగి కెగయుచుండె
కణిల్లనెడి నంది రంకె శృంగమ్ముల నిండె
భృంగిరిటుల సంఘమ్ముల కంగములుపొంగె
నింగినంటు శృంగమ్ములు వంగిచూచు చుండె

అది అంతా ఒకస్వర్గం!
మోక్షానికి అది మార్గం!

శిశువులకీ పశువులకీ
సుప్త ప్రజావళికీ
సమదృష్టిని సమకూర్చే
శివ తాండవ నృత్యం!!

# వీర నాగమ

శ్రీమతి గుడిపూడి రాజేశ్వరిదేవి.

ఉ॥ నాగమనాగుబామనుచు నాయుడుపాప ముభీతిజెందగన్
సాగదునీవులేక రణసారథిగమ్మని రాజువేడగన్
ఆగగలేక నీదుపస కానరసింహుడు కేలుమాడ్చగన్
బాగుగనేలి తమ్ము ఇల పావనిపల్నడు నాగమాంబరో.

ఉ॥ కోడికికోడికిన్ మరియు కోడిలొ గాంచెను కోడిగ్రుడ్డుకున్
వాడలవాడలన్ దిరిగి వారికిముందుగ ద్రవ్యమిచ్చుచున్
బేడకు పావలాలనిడి బేరములాడను కోడిలేదనన్
జాడలుదీసి నాయనిని జాణరొబిల్తువె పందెమాడగన్

ఉ॥ బాలుడుగాడు వీడుపసి బాలుడెపల్నడు వీరసింహుడై
కాలునిపోలె నాదుపయి క్రౌర్యము జూపుచుకాలుదువ్వనా
బేలతనాన భీతిగొన బేలగు మాంచలయంచు నెంచెనే
కాలము తీరినాపయిని క్రౌర్యము బూనెనటంచు బల్కవే

చం॥ సరసముగాదు సానికడ సారెకు జూదములాను కొంటకున్
సరసముగాదు వేశ్యకడ సాధననేర్వను మారుక్రీడలన్
సరసముగాదు బొంగరము సారెకు ద్రిప్పను వీధులందునన్
సరసము జూప యుద్ధమున సాగితిమేటినటంచు బల్కవే

ఉ॥ మీసము నీదుమూతిపయి మీసము నాదగు ముంజెతందునన్
రోసముగ్రానేని భళి రోజుచు కానల కేగుటెందుకో
వేసమువేసి తంతెముగ వేసము మీసములేలనాయుడా
నాసము లేరులేరనుచు నాడట చేటవె నాగమాంబరో

ఉ॥ ఓడిరినీదు తెల్వికిటు ఓడిరి ఓడిరి రాజులందరున్
పాడిరి పాడిరమ్మ బలెపాడిరె నీదగు కీర్తిగాథలన్
వాడెనువాడెనమ్మ పసివాడెనె నాయని మోము వాడెనే
చేడెల మేలుబంతివయి చేరితి వీరుల గుండెలందునన్

# తీయని కోరిక

కొల్లూరు

శ్రీరామమూర్తి

పార్కులో చుట్టు పక్కల ప్రజలంతా పలచ బడుతున్నారు. కాని ఆ పలకమీద పరధ్యానంలో వున్న పరోపకార శీలుడు మాత్రం పగటి పోకడను పసికట్టలేను. తల చేతులలో దూర్చి తరుగులేని తలంపులతో. తగాదాలాడుతున్నాడా- తన్మయుని అంతరాత్మ.

సుమారు 7 గంటలయింది. ఆ విహ్వాలుని ఆత్మ, ఆతనికీలా, సమాధానం చెప్పింది "ఇంతవరకూ వెలుగు ఇప్పటినుండి చీకటి. మళ్ళా వెలుగు రాకపోదు. ఇది ప్రకృతి పరివర్తన. విజ్ఞానులగు నీలాంటివాళ్ళు ఈ చిన్న విషయానికీలా గిజగిజలాడడం. ఉచితంకాదు" అని; అసలు తీయనికోరిక తీగల్లో తగుల్కొన్న. తరుణులకు ఈలాటిబాధ సహజమే అనుకొన్నాడా నవీన జ్ఞాని. (ప్రక్కనపరికించి) ఆహాఁ ఎంతహాయిగా పవ్వళించావయ్యా పుణ్యాత్మ. అన్నాడు. (పరవశంలో నిద్రిస్తున్న ప్రాణమిత్రుణ్ణి నిర్దేశించి) కాని అతనిమాటలు విన్న దెవరు. ఈలోకంతో సంమ్మంధంలేని నిద్రలో వున్నాడు "గోపి". పడుకొన్న నిన్నులేపి నేనేంచెయ్యాలి; నువ్వేనాసుఖపడు. అనుకొన్నాడా అభిజ్ఞుడు. ఆతని ఆలోచనతోపాటు కాలం కూడా తిరిగిపోతోంది 12 గంటలయింది. "టంగ్‌టంగ్" మంటూ శబ్దం చెవిలో ప్రవేశించింది. అరే చాలా కాలమయిందే. అనుకొని గోపీనిలేపి పోదాంపదా! (అన్నాడా వ్యక్తి). గోపీ (లేచి కళ్ళునులుము కొంటూ కూర్చుని.) ఇంతవరకు లేపలేదేం మోహన్ (ఆతనివైపుచూసి) అసలునువ్వేదో ఆలోచిస్తూన్నట్టూంది, నాకుకూడా చెప్పరానిది గాబోలా విషయం (అన్నాడు.) ఆఁ ఏంలేదు. (అన్నాడు) మోహన్.

అసలు ఏమని చెప్పగలడు. గోపీతో స్నేహంముదిరిననాటినుండి, వాళ్ళయింటికి పోవడం ఆరంభించిన నాటినుండి, మోహన్‌లో తీయనికోరిక తలయెత్తింది. తను యదార్థంగా ఉత్తమవ్యక్తిత్వం గల యువకుఁడు దానికి సాయం. బి. ఏ. ప్యాసయిన విద్యావంతుడు. తల్లిదండ్రులు చిన్ననాడే, విడిచారా అభాగ్యుణ్ణి. నాటినుండి తనగోల ఆలించినా. లాలించినా, గోపీ తలిదండ్రులే, అటువంటి వ్యక్తులకు వనకోరిక, కోపకారి కావచ్చు. ఆకోరిక మరేంకాదు, గోపిచెల్లి "రాధ" ఆతని ఆత్మప్రియ. ఆమెను పరిణయ మాడాలని ఆరనియాతన. అది అంత సమంజసం కాదేమోనని అతని వితర్కం. ఇటువంటి విషయం, గోపీతో. తానెలా చెప్పగలడు. అందుకనే ఆతని ఆందోళన, అంతేకాదు. ఆతని తీయనికోరిక తీరని కోరికగా పరిణమిస్తోంది కొద్దిదినాల్లోనే. అందుకని ఆ ఆవేదన అనుక్షణం అభివృద్ధవుతోంది అమాయకుని హృదయంలో.

అసలు ఈమధ్య 15 రోజులనుంచి చూస్తున్నాను. నువ్వేదో విచారంగానేవున్నావు. పోనీ, ఇంటికి పోదాం (అన్నాడు గోపి నిల్చుని.)

ప్రజలంతా పరవశులై పవ్వళించారు. ప్రకృతంతా ప్రశాన్తంగావుంది. ప్రధానవాటలో ప్రాణస్నేహితు లిద్దరు ప్రజారాజ్య విషయాల్ని పరిష్కరిస్తూ నిష్క్రమిస్తున్నారు. ఆసమయంలో ఆ ఆర్తబాంధవులకేమో ఆర్తనాదం అందొచ్చింది. మోహన్ (అదిరిపడి) గోపీ! ఏదో అత్యాచారం జరగబోతున్నట్లుంది. పద అడ్డుపడదాం, (అనిచలాకిగా ఆధ్వని వచ్చినచోటుకి పోసాగాడు)

సరాసరి భవిష్యద్భావగారి భవనాన్ని చేరారా చెలికాండ్రు. అసలాయింట్లోంచే వస్తోందాధ్వని. గోపి-(బాగా పరికించి) అరే ఎవరో స్త్రీకంఠం లాగుందే. (ఆలోచించి) పరిచిత కంఠమే మోహన్! ఉండుతలుపు తట్టిచూద్దాం, ఎవరూ పల్కలేదే ఏంచెయ్యడం మోహన్ అన్నాడు.

ఎందుకలా బెగులు పడతావు. కానివల్ల నెదురుకోడానికి మనకి కండబలం కావసినంత వుందిగా, చిటికెలో తలుపులు చెదరగొట్టి చేయవల్సిందుంటే ....

బోడిపులుల రెంట పడ్డ లేడిపిల్లలాగ వుందా అబల, నేను మింగుతానంటే నేను పీలుస్తానన్నట్లా పిల్లమీదకురుకుతున్నాయి. ఆపులులు. పాపం పక్కనున్న సింగప్పిల్లల్ని చూసుకోక పోయాయి ఆతృతచే. ఆదుర్వార కార్య

క్రమంనుండి ఆపగలిగారా నీచకీచకుల్ని. గోపీ (ఆవ్యక్తుల్ని పరికించిచూసి) ఆపిల్లను తనచెల్లి రాధగాను ఆ వ్యక్తులలో నొకణ్ణి తనకు కాబోయే బావగాను తెలుసుకొన్నాడు. ఆ సమయంలో అన్నగారైన ఆ ఆత్మాభిమాని అంతరాత్మ ఎంతప్రశాన్తంగా వుంటుందో రసికులకుచెప్పనక్కరలేదుగదా! వివాహం కాకుండానే నీ విక్రమాన్ని ప్రదర్శించడానికి ఉపక్రమించావే శంకర్, ఛీ అన్నాడు. [కోపంసూచిస్తూ మోహన్] ఏదో పెడసర సమాధానం చెప్పబోయేడు శంకర్. ఛీ సిగ్గులేకుండా ఇంకా సమాధానంకూడానా? అన్నాడు మండిపడుతూ గోపి. శంకర్! నీ అభిమానం అంతనిశితమైందైతే ఇలాంటి దగ్గరకూడా నీకుసహాయకుడుండాలా? ఏంపనిచేస్తున్నావు అన్నాడు (ఏవగిస్తూ శాన్తమూర్తి మోహన్). ఆఁ. నా భార్య నా సొత్తు. నా ఆస్తిని నాతోబాటు నా అనుయాయులు అనుభవించాలి: ఇది నాసిద్ధాన్తం. నా అనుయాయులు ఆనందించాలి ఇది నారాద్ధాన్తం, అన్నాడు. సగర్వంగా శంకర్.

పవిత్రమైన భారతనారిని, కాకుండానే తన భార్యగా ఆరోపించి, అవినీతి పాటించకుండా మహిళనో ఆటవస్తువుగా ఎంచి చిందులాడుతూన్న ఆ అభినవ క్రూరుణ్ణి హతమార్చేద్దామన్నంత ఆవేశం వచ్చిందా అభ్యుదయకాంక్షి మోహన్‌కు. కాని అస్వంతంత్రుడైన తానేమీ చేయలేకపోయాడు, కాని గోపికి మాత్రం పరవశం వచ్చింది కోపంవల్ల. ప్రధానమయినంత మాత్రాన ప్రేయసి అయిందిరా! అన్నాడు.

నువ్వెవడివిరా! నన్నెదుర్కోడానికి ముందిక్కణ్ణుంచి పోతావా పోవా (అన్నాడు శంకర్). ఆనిశబ్దసమయంలో "చెడేల్" మని శబ్దం, అవ్యక్తఘోష బ్రహ్మాండమయిన ధ్వని, బయలుదేరాయా భవనంలోంచి. అనుదిన శిక్షిత శరీరదార్ఢ్యంగల ఆసింగపు కొదమల క్రోధాగ్నిని, బక్కచిక్కిన నక్కలెన్ని వచ్చి ఆర్పగలవు. ఆ జిత్తులమారి శంకర్ రాధమీద కాంక్షకొద్దీ అత్యాచారం చేయకపోలేదు అది ప్రమాదకరం కాకపోయినా బాధాకరం మాత్రంకాకపోలేదు. ఆకుక్క లెక్కడపట్టి లాగాయో అక్కడే జరిగిందా ఆసినిపాతం. పవిత్రమైన ఆంధ్రమహిళా పరాభవాన్ని ఆ పరమేశ్వరుడు కూడా సహించలేక పోయాడు గాబోలు. అందుకనే ఆ సన్మార్గయాయులకా నిసీధ సమయంలో రక్షకభట సహాయాన్ని కలుగజేసాడు,

రాత్రి సుమారు 1 గంటఅయింది. గోపీ ఇంటిదగ్గర ఆందోళన అధిక మయింది. తల్లిదండ్రులు గాబరా పడుతున్నారు. పాపం సినీమాహాలునుండి వారికన్నా ముందు బయల్దేరా రాధవిష్యద్భార్యాభర్తలు. ఇంకారాక పోవడం చూస్తే ఆశ్చర్యంగా వుందా ముసలిదంపతులకు. ఏంతోచలేదు. పోనీ ఎదురు పంపుదామంటే గోపీ ఐనాలేడు ఇంటిదగ్గర. ఈలా "లజాగుజీ" పడుతూండగనే జట్కాబండీవచ్చి వీధివాకిట్లో నిల్చింది.

అరే! రిక్షాఎక్కి జట్కా దిగుతున్నారే? అన్నాడు, చిరునవ్వు నవ్వుతూ జరిగిన గొడవెరుగని జనకుడు.

హాఁ తెల్లవారేక అనంతశయనం ఎక్కించు నీ అందాల ముద్దుబిడ్డని. (అన్నాడు కోపపారవశ్యంలో ఒళ్ళెరుగని గోపి) ఆ మాటలు వినేసరికి ఆందోళన బయలుదేరిందా ముసలి హృదయాల్లో. దీపం తెచ్చి పరికించి చూసేసరికి హృదయకంపంకలిగించే భయంకరవ్రణంతో బాధపడుతున్న బాల రాధ కనిపించింది. ఆరాత్రిసీమలో పెద్ద ఆందోళన చెలరేగింది. ఇరుగు పొరుగు వారంతా వచ్చి జరిగిందంతా తెల్సుకొని ఆ ముసలాయన్ని పిల్చి "ఏమయ్యా! ఎంత మేనల్లుడయినా ఎంత కావల్సినవాడయినా ఇంతలాగ చొరవా యిస్తావా? వీల్లే అడ్డుతగలకపోతే ఆ అమాయకురాలి అగచాట్లు ఏమని చెప్పాలి?" అంటూ తలోమాట నోటి కొచ్చినట్లల్లా ఆడి పోసి పోయారు. ఆత్మకృతాపరాధం, ఏంచెయ్యలేక వూరుకొన్నాడా ముసలి.

తెల్లవారుతోంది. రాధ మనసొత్తు కావచ్చు నన్నాశ, తలిదండ్రాదుల కప్పుడప్పుడే కల్గుతోంది. మోహన్ — [మొగం తుడుచుకొంటూ] తాతయ్యగారూ! అసలురాధ అర్ధరాత్రి వాళ్ళకేలా చిక్కిందో ఆమేడ కేలావెళ్ళిందో— ఎందుకు వెళ్ళిందో కాస్త మీరుతెలిస్తే?....

నేనేనాయనా ఈ కథకుకారకుణ్ణి మా అవిడనోట్లో శనున్నట్లు కాదంది. అయినా ఆదౌర్భాగ్యుడీలా మానవత్వంలేని వాడని నేనెరుగుదునా? నిన్న సాయింత్రం వచ్చాడు. రాధతో కలిసి తనకి సినీమా చూడాలని వున్నాదన్నాడు. కొత్తగా కాబోయే అల్లుడుకోరిన ఈ చిన్న కోరికని శివామని కాదంటే ఏమనుకొంటాడో అని సరే మేము కూడా వస్తామని చెప్పాను. సినిమా వదిలేసినతరవాత వాళ్ళిద్దరూ రిక్షాలో వస్తామన్నారు. రాధ మాతోనే

వస్తానంది, అయినా బలవంత పెట్టాము అందరమూ. ఆ రిక్షాని తిన్నగా వాళ్ళింటికి తిప్పించాడు. రిక్షావాడు అరెండోవాడట. పెళ్ళిపిలుపుల కోసం మాచెల్లి బావ చుట్టాల్ని పక్కాల్ని పిలవడానికనిపోయారు. మో.... అంతేనాజరిగింది.

నిశాసమయంలో ప్రకృతిని ఆనందింప జేయడానికి వచ్చిన నవదుందుభిధ్వానాల్లాగ, ఆ వైక్లబ్యహృదయాల్ని ఉయ్యాలలూగిస్తూ, స్మృతిలేని మాటలా పీడితురాలి వదనారవిందంనుండి వెలువడు తున్నాయి. వాటిభావం పరికిస్తే ఆమె మోహాన్ని గాఢంగా ప్రేమించినట్లు అర్ధమయింపచటి ఆప్తబాంధవులకు, మనస్విని ఐన మహిళ ఐహికానందాని కన్నా ఆముష్మికానందాన్నే ఆశిస్తుంది. అట్టివారికి రెండూ అభిస్తవి.

గాయపడ్డ పువ్వు ఘుమ ఘుమలాడి పరిమళిస్తూ వికసించింది. వాడిపోయిన తుమ్మెద వెల వెల బోయింది. తీయనికోరిక తీరె సూచనలు బయలుద్దేరాయా స్థిర సంకల్పుని హృదయ కమలంలో. ఆ పూవు తుమ్మెదల్ని చూసి ప్రకృతంతా పరవశం పాలయింది. అభినవ యువకలోకానికా సంఘటన అవశ్య ప్రాయమయింది.

---

## ఉరుములు—మెరపులు

ప్రతి స్థానంలో పోటీ చేస్తున్న అభ్యర్థులను సమావేశపరచాలని
—శ్రీసేన్ సలహా.

జాగ్రత్త సుమండీ ! మా సలహా

*  ♦

ఫజల్ఆలీ కమిషన్ నివేదిక ప్రకటనలో విలంభన సంభవము —
పండిట పంత్ సూచన

విలంభన మాత్రమే అయితే ఫరువాలేదు.

*  *

బహు భార్యాత్వము నిషేదించాలి. బహు భర్తృత్వాన్ని నిర్ణయించాలి. అదే విరుగుడు.
పాకిస్తానులో మహిళల కొత్త ఉద్యమము— పత్రికా వార్త.

దెబ్బకు దెబ్బ ! విరుగుళ్ళు ఒక్కొక్కసారి పనిచేయవు.

*  *

"అందాల సీమలో అందం కరవు." తమ సౌందర్య ప్రదర్శనకు కేరళ మహిళల నిరాకరణ—

అందాల పోటీలు విరమించటానికి ఇదే విరుగుడు.

*  *

యువకులకు నాయకత్వంలో తగిన శిక్షణ నివ్వడమే కర్తవ్యము.
వీలైనంతవరకు నాయకులసంఖ్య హెచ్చకుండా చూడటమే.

*  *

ఉపాధ్యాయులకు విద్యార్థుల హితవు
"పొగ తాగవద్దు" వారి హితవు. గుడ్డొచ్చి పిల్లనెక్కిరించిందా !

# బిడ్డలు - తలిదండ్రులు

శ్రీ కె. వెంకట్రామయ్య

**బిడ్డప్రక్కపై పరుండుట :**

బిడ్డను ప్రక్కపై పరుండబెట్టిన పిదప ఒంటరిగా వదలి పెట్టవలెను. తల్లిని దగ్గరకు రమ్మని బిడ్డ మాటి మాటికి పిలుచుచుండవచ్చును. రానియెడల ఏడ్వవచ్చును. తల్లి వీనినేమియు పాటింపక ఊరకుండిన బిడ్డ రెండు మూడుదినములలో పిలుచుటయు, ఏడ్చుటయు మాని ఒంటరిగా పరుండుట కలవాటు పడును. లేనియెడల తల్లి దగ్గరనున్నగాని నిద్రింపక బాధించుచుండును.

బిడ్డలు జబ్బుపడినప్పుడు తల్లిదగ్గర నుండుట అవసరమగును. అప్పుడామె మెలకువతో మసలుకొనకుండిన తల్లి తనతోనుండినగాని నిద్రింప కుండుట బిడ్డ కలవాటగును.

ఇరువది నెలల బిడ్డ దొకడు కోరింతదగ్గుతో బాధపడుచుండెను. అతడు దగ్గినపుడెల తల్లి దగ్గరకుదోయి అతనినెత్తి కూర్చుండ బెట్టుచుండెను. కొన్నాళ్ళకా జబ్బు తగ్గెను. కాని దగ్గుటమాత్రము బిడ్డ మానలేదు. ఆదగ్గుట తన్ను దగ్గరకు రప్పించుటకే యని తల్లిగ్రహించి దగ్గరకు బోవుట మానెను. బిడ్డయు దగ్గుట మానెను.

ఒకే వయస్సుగల బిడ్డలిరువురు ఒకేస్థలమున పరుండవలసినయెడల ఒకరివెనుక నొకరు నిద్రించు నేర్పాటును చేయవలెను. ఇద్దరు నొకేసమయమున పరుండిన మాటలాడుచు నిద్రింపకుందురు.

**నిద్రకు సిద్ధపరచుట :**

బిడ్డల నిద్రకై ఇంటిలోని వారందరు నిశ్శబ్దముగా నుండజాలరు. పశితనమునుండియు బిడ్డ లింటి యందలి సామాన్య పరిస్థితియందే నిద్రింప నలవాటు పడవలెను. ఐనను వారికా నిద్రించెడి యలవాట్లు సరిగా నేర్పవలెననిన నిద్రను జెరచు ఆకర్షణ లంతగా నుండరాదు.

బిడ్డలు సహజముగా నిద్రించుట కలవాటు పడవలెను. తల్లిదగ్గర నుండుట, జోగొట్టుట, జోలపాటలు పాడుట, పనికిరాదు, ఇట్టివానిచే వారు తల్లిపై నాధారపడు స్వభావము నలవరచుకొనుటయును ఆమెను తమ యధీనము నందుంచు కొన ప్రయత్నించుటయును జరుగును.

బిడ్డలు పగలంతయు తమ శక్తికొలదియు క్రీడింపవచ్చును. కాని రాత్రి పరుండుటకు ముందు గంతులు వేయుచు గోలచేయుచు అట్టహాసముగా నాడుకొనుచుండరాదు. అట్టి సమయములందు వారు ఉల్లాసకరమగు కథలనుగాని చల్లని సంగీతమునుగాని వినవచ్చును. లేదా ప్రశాంతముగ బొమ్మలను చూచుకొన వచ్చును. విన్న కథలు భయయోద్రేకములను గలిగించునవిగా నుండరాదు. అట్లుండినచో వారికి భయంకర మైనట్టియు బాధాకరమైనట్టియు కలలువచ్చి నిద్రాభంగము కలుగుచుండును.

పెద్దవారివలె బిడ్డలును మనశ్శాంతి లేనిచో సరిగా నిద్రింపజాలరు. వారు పరుండునపుడు మనోవ్యాకులత లేకయుండవలెను. పగలంతయు వారెంత దుడుకుగా ప్రవర్తించినను రాత్రియగు సరికి వారదియంతయు మరచి ఇక మరునాడు సరిగా ప్రవర్తింప గలమను భావముతో పరుండ వలెను. ప్రతిదినమును బిడ్డలేలో కొన్ని తప్పులను చేయుచునే యుందురు. అందుచే వారు మనమున వ్యాకులత పడుచు హాయిగా నిద్రింప జాలకుందురు. తలిదండ్రులిది గ్రహించి బిడ్డలు రాత్రి, పరుండుసమయమున వారితో నేకాంతముగ మాట్లాడుచు కొలదికాలము గడుపవలెను. అప్పుడు బిడ్డలు తమకుగల బాధలను తల్లికిగాని తండ్రికిగాని చెప్పుకొని కొంతబరువు దీరి సంతోషముగా పరుండగలరు. బిడ్డలు తమతప్పులను చెప్పుకొనునప్పుడు తలిదండ్రులు వారియెడ సానుభూతిని జూపుచు, తగిన సలహానిచ్చి, శాంతి పరచుట మంచిది. దానివలన బిడ్డలు తామిక మంచిగా మెలగ గలమను నాశతో హాయిగా నిద్రింప గలరు. మరియు నీవిధముగ తల్లిదండ్రులు ప్రతిదినమును తమ బిడ్డల బాధలను, కష్టములను కనుగొనుచు వారితోసంభాషించుచుండుటచే పరస్పరానుబంధములేర్పడి భావిజీవితమున కెంతయు శ్రేయోదాయకముకాగలదు.

బిడ్డలు అతిమృదువైన పరుపులపై పరుండరాదు, అట్లు పరుండిన మెలకువ వచ్చియు లేవకుండుట వారి కలవాటు కాగలదు. వారు చదునైన స్థలముపై పరుండవలెను. చాలపలుచని దిండ్లను వాడవలెను.

మొదటినుండియు బిడ్డలు ఒంటరిగా పరుండుటకే అలవాటు పడవలెను. ఏడాది గడచినది మొదలు వారును

తలిదండ్రులును ఒకే గదియందు పరుండుట యోగ్యము కాదు. చిన్నతనమున నీ విధముగ తలిదండ్రులతో కలసి పరుండుటచే బిడ్డలెదిగిన పిదప నాడీవ్యాధులతో బాధపడు చుందురు.

మగపిల్లలు మగపిల్లలతోను, ఆడుపిల్ల లాడుపిల్లల తోను కలసి పరుండ వగునని మనము కొనవచ్చును. కాని అది మంచిది కాదు. ఇక మగపిల్లలును ఆడుపిల్ల లును కలిసి పరుండుట ఎన్నటికి పనికిరాదు.

బిడ్డలందరు నొకేగదియందు పరుండినను వేరువేరుగా పరుండవలెను. లేనిచో వారు సరిగా నిద్రింప కుండుటయే గాక శరీరసంబంధమగు కొన్ని దురలవాట్లకు లోనగు చుందురు.

బిడ్డల మానసికారోగ్యమునకు సహవాసమెంత యవ సరమో ఏకాంతతయు నంతే యవసరమగును. పెద్దవారి వలెనే పిల్లలును కొన్ని సమయములందేకాంతతను మరు గును, కోరుచుందురు. బిడ్డలేకాంతముగ నుండుటకును పరుండుటకును వేరుగా గదులుండుట మంచిదే. కాని అది వలను పడనిచో కొంత ప్రత్యేక స్థలమైనను, వారికని వేరుగా నేర్పాటు చేయవలెను.

లేచెడి వేళ:—

బిడ్డలు సరియైన వేళకు పరుండి సరియైన వేళకు లేచు చుండవలెను. ఒకవేళ వారందరికంటెను ముందుగా లేచుట తటస్థించినయెడల పడకయందే యుండి ప్రశాంత ముగా నాడుకొనుచుండవలెను. లేదా సడిచప్పుడు చేయక తమ పనులను తాము చేసికొనుచుండవలెను. ఇటు నటు పరుగిడుచు, కేకలు వేయుచు ఇతరుల నిద్రను చెరచుట పనికిరాదు. ఈ విషయమునందు బిడ్డలకు తగిన శిక్షణ నొసగుట యవసరము. అందుచే వారికి ఒరుల సంగతి గమనించి మెలగుచుండుట అలవాటగును.

బడికిపోవు పిల్లలు వేళకు సరిగా లేచుట కలవాటు పడ వలెను. అందులకై వారిని సరిగా వేళకుగాక ఐదు నిమి షములు ముందుగనే లేపుచుండవలెను. అందుచే వారికా యైదు నిమిషములలో తమ బద్ధకమును దీర్చుకొనుట కవ కాశముండి, వేళకు సరిగా లేచుచుందురు.

బిడ్డలను వేళకు బడికి పంపుట తల్లి దండ్రుల కొక పెద్ద సమస్య యగుచుండును. అట్టి సమస్య లేకుండ జేసి కొనుటకు వారొక విధానమునను సరించుట మంచిది. బిడ్డ ఎప్పుడు లేవవలెనో, ఎప్పుడు స్నానము చేయవలెనో దుస్తులనెప్పుడు ధరించవలెనో యను విషయములను గూర్చి అతనితో ముందుగనే యాలోచించి నిర్ణయించ వలెను. ఇక బిడ్డ సదుపాయమునకై ఒక గడియారము నతని గదియందుంచవలెను. పిదప ప్రతి దినమును కాల నిర్ణయ ప్రకారము అతని నాయా వేళలందాయా కార్య ములను చేయ పిలుచుచుండవలెను. అతడు వచ్చినను రాకున్నను వేళకు సరిగా అన్నము వడ్డింపవలెను. అన్నము చల్లారిన అతనిదే తప్పు. బడికి వేళకు బోకున్న అతనిదే తప్పు. ఇట్లు బిడ్డను పెద్దజేసి అతని తప్పుల కతనినే బాధ్యుని జేసిన తల్లిని బాధింపజాలరు.

బిడ్డలు నిద్రనుండి లేచినపుడు తరచుగ చిరాకు జూపు నెడ వారి నిద్రను జెరచు ప్రబల కారణమేదో యుండు నని గ్రహింపవలెను.

పెద్దవారి మనోభావములు :

నిద్రకుజెందిన విషయము లందు బిడ్డలు తమ్మెంత కష్టపెట్టుచున్నను తల్లిదండ్రులు శాంతిని సహనమును జూపుచునే యుండవలెను. ఉద్రేకపడరాదు. వారుద్రేక పడినకొలదియు బిడ్డలు వారిని బాధించు చుందురు.

బిడ్డల నిద్ర సమస్యలను వారియెదుట చర్చింపరాదు. మావాడు సరిగా నిద్రింపడని తలిదండ్రులు చెప్పుచుండుట బిడ్డ విన్నచో అదియేదో ఘనత యనుకొని అతడట్లే నిద్రింపక వారిని బాధించుచుండును. బిడ్డల ప్రవర్తనలను సరిదిద్దవలెనన్న వారిచెడ్డయలవాట్లను గమనించినట్లు కన బడకుండుటయు, వారియెడ నుద్రేకము జూపకుండుటయు నవసరమని ఇదివరకే గ్రహించితిమి. రెండేండ్ల బిడ్డ యొకడు మాటిమాటికి ప్రక్కనుండి దుముకుటయు, వంట శాలకు పరుగెత్తుటయు నొకయాటగా నారంభించెను. వల దని తల్లియతనిని బ్రతిమాలెను. తిట్టెను. కొట్టెను కాని యతడట్లే తనయాటను సాగించెను. అప్పుడు తల్లి ఉద్రే కము జూపుటమాని బిడ్డలేచి వచ్చినప్పుడెల్ల అతనిని పట్టుకొని, నెమ్మదిగా ప్రక్కవద్దకు నడిపించి, ప్రక్కపై నెక్కించు చుండెను. ఇట్లామె ప్రశాంతముగా ప్రవర్తించు టచే బిడ్డతన యలవాటును రెండుమూడు దినములలో మానగలిగెను. తల్లి తనయుద్రేకము నట్లే ప్రకటించుచుం డినయెడల, బిడ్డయు తనయలవాటును మానక ఇంకను

చాలకాలమట్లే ప్రవర్తించు చుండెడివాడు. తలి దండ్రులు శాంతి, సహనములను జూపుటవలన బిడ్డలకిట్టి యలవాట్లు మూడుదినములలో బోగలవు. కొందరి విషయములో నొకవారము పట్టవచ్చును.

బిడ్డలలసియు, ఉద్రేకపడియు, తల్లిపై తమయధికారమును చూపగోరియు, ఎట్లునిద్రింప కుందురో తెలిసికొంటిమి. వారు నిద్రింపకుండుట కింకను కొన్నికారణములు గలవు. వాని నిట పరిశీలింతము (ఎ) బిడ్డలు సరిగా నిద్రింప కుండుటకు వారియనారోగ్య మొక ప్రబలకారణ మగుచున్నది. మలబద్ధము, అజీర్ణము, నులిపురుగుల బాధలచే బిడ్డలు సరిగా నిద్రింపక పోవచ్చును. పురుగులబాధ యున్నప్పుడు వారు పండ్లను కొరుకుచుందురు. అతి చిరాకుగా నుందురు. ఎడినాయిడ్సు, టాన్సిల్సు ఎదిగి యున్నచో వానినిగూర్చి తల్లి దండ్రులు తగుశ్రద్ధదీసికొని జాగ్రత్త పడవలెను. లేనిచో బిడ్డలు సరిగా నిద్రింపజాలరు.

(బి) దండనలు, చివాట్లచేతను, మనో వ్యాకులత చేతను, బిడ్డలు పరుండుటకు పూర్వము ఉద్రేకపడి యుండిన సరిగా నిద్రింపజాలరు. వారు పరుండుటకు ముందు శాంతిగను, సంతోషముగను ఉండవలెనేగాని విచారముతో నుండరాదు.

(సి) చెడ్డ కలలవలన గూడ బిడ్డలు సరిగా నిద్రింప కుందురు. అజీర్ణము వలనను, నులిపురుగుల వలనను బిడ్డ లిట్టి కలలను గనుచుందురు. కఠిన దండనవలన గలిగిన బాధ, భయము, మానిసిక ఆందోళన చెడ్డ కలలకు కారణములగు చుండును. మరియు బడిలో నుపాధ్యాయు డన్ననో, ఇతర పిల్లలెవరన్ననో బిడ్డకెక్కుడు భయ ముండిన నిట్టి కలలు రావచ్చును.

చీకటి యన్న భయపడుట:—

బిడ్డలు చీకటిలో నొంటరిగా పరుండుటకు భయపడు చుందురు. చీకటియన్న భయపడుట బిడ్డలకు పుట్టుకతో వచ్చు గుణముకాదు. అది కొన్ని పరిస్థితులలో వారి కబ్బును. చిన్న బిడ్డలకు అనుభవ జ్ఞానము తక్కువ. ఏది సంభవమో ఏది యసంభవమో నిజమేదో అబద్ధమేదో తెలిసికొనగల శక్తి వారికంతగా యుండదు. చీకటిలో నేమున్నదో వారు చూడలేరు. అందుచే చీకటియన్న వారెక్కువగా భయపడుచుందురు. తల్లి దండ్రులిది గ్రహించి బిడ్డలకు చీకటియెడ భయమును గలిగించు పరిస్థితులేర్పడకుండ చూచుకొనుచుండవలెను. చీకటి మన విశ్రాంతికేగాక చెట్లు చేమల విశ్రాంతికి గూడ ఎట్లు ముఖ్యమో బిడ్డలకు చెప్పుచున్నయెడల వారికి చీకటియెడ వ్యతిరేక భావమేర్పడకుండును. మరియు వారికి చంద్రుని నక్షత్రములను జూపించుచు రాత్రులందు వారు జూచు విషయములను గూర్చి కథలను జెప్పుచుండవలెను. ఈ విధమున జేయుటచే చీకటి భయము వారినంతగా బాధింప కుండును.

మొదటినుండియు బిడ్డలు చీకటిలో పరుండుటకలవాటు పడవలెను. అందుచే తలిదండ్రులు తమ సంభాషణ వలన గాని, ప్రవర్తనల వలనగాని బిడ్డలకు చీకటి యెడ భయమును గలుగజేయరాదు. తల్లికి చీకటియన్న భయమున్నను బిడ్డ యెదుట దానిని ప్రకటింపరాదు. పెద్దవారు తామొంటరిగా పరుండలేమనుచుందురు. దొంగలను గూర్చియు, నిప్పంటుకొనుటను గూర్చియు ప్రసంగించు చుందురు. ఇవి యన్నియు బిడ్డల చెవిని బడిన చీకటిలో పరుండుటకు వారెంతయు భయపడుచుందురు.

చెడ్డ కలలను గనుట వలనగూడ చీకటి భయమేర్పడు చుండును. రాత్రులందు బిడ్డలేవో కలలుగని మిక్కిలి భయముతో లేచుట తటస్థించును. చీకటియందే వారట్టి యనుభవములను పొందుటచే చీకటియన్న భయపడు చుందురు. ఈ విధమగు భయము కలిగినప్పుడు వారు గదిలో దీపము లేక పరుండమని యనగలరు. అప్పుడు మనము వారితో వాదింపక ఒక దీపమును వారి గదిలో తగ్గించి యుంచుట మంచిది. అట్లుగానిచో హాలు దీపపు వెలుగువారి గదిలో పడునట్లు తలుపులను కొంచెము తెరచి యుంచవచ్చును. కొన్నాళ్ళీవిధముగ జరిగినయెడల బిడ్డలకు కొంత భయముతీరును. అప్పుడు మనము ఎదిగిన బిడ్డలు దీపము లేకయే పరుందురని సూచించిన వారు దీపములేకయే పరుండుటకు ప్రయత్నింతురు.

కొందరు బిడ్డలకు "టార్చి" నిచ్చినచీకటి భయము లేక పరుండగలరు. మొదటవారా "టార్చిని" చీకటి భయము లేకుండుటకై తరచుగ వాడవచ్చును. కాని కొన్నాళ్ళకు టార్చి దగ్గరనున్నదను ధైర్యముతో దానిని వాడకయే నిద్రింపగలరు.

ఒక్కొక్కప్పుడు బిడ్డ లెక్కువగా భయపడుటచే ఎవరైనను వారియొద్ద నుండినగాని నిద్రింపకుందురు. ఈ యలవాటును తప్పింప వలెననిన వారివద్దనే కూర్చుండక

గదిలో నిటునటు తిరుగు చుండుటమంచిది. ఈ విధముగ రెండు మూడుదినములు గడచినపిదప గదిలోనే యుండుట మాని రెండుమూడు నిముషములేదో పనిమీద గదియవతలకు బోయి తిరిగివచ్చు చుండవలెను, ఈ బయటకు బోవుకాలమునే దినదినము నెక్కువ చేయుచు వచ్చిన బిడ్డ ప్రక్కగూర్చుండ వలసిన ఆవశ్యకతయే లేకుండును. బిడ్డల భయమును బోగొట్ట వలెనన్న వారా భయమును గూర్చి తలపకుండ జేయుటకే సర్వవిధముల ప్రయత్నింప వలెను. మరియు వారు మన ప్రయత్నముల యెడ వ్యతిరేక భావమును జూపకుండ జూచుకొనవలెను.

విసర్జనము—తదితరతొలియలవాట్లు :

విసర్జన వ్యాపారములు బిడ్డల యారోగ్యమున కవసరమగు సహజకార్యములేగాని అసహ్యకరములును, సిగ్గుకరములును నగు పనులుగావు. తల్లులిది గుర్తించుట చాల ముఖ్యము. మరియు నీవిషయములందు సరియగు నలవాట్లనేర్పరుప వలెనని తొందర పడుటయు ఆత్రతజూపుటయు పనికిరాదు.

తనబిడ్డకు మొదటి నుండియు పరిశుభ్రత నేర్చు కొనవలెనను యావేదనచే తల్లియతనిని తరచుగ మలమూత్ర విసర్జనలకై బయటకు దీసికొనిపోవుచున్న దనుకొనుడు, దానివలన బిడ్డకు మల మూత్రాశయములు నిండి నపుడు గలుగు సంవేదనానుభవము లేక నిగ్రహాశక్తి నలవరచు కొను యవకాశముండదు. అందుచే అతడెదిగియు విసర్జనయవసరములు గలుగుచుండుట గుర్తింపజాలక బట్టలు పాడుజెసికొను చుండుట తటస్థింపవచ్చును. దీనిని బట్టి బిడ్డడెన్నటికిని నిగ్రహాశక్తి నలవరచు కొనజాలడని యనుకొనరాదు. కానియది నేర్చుకొనుట కాలస్యము పట్టునని తెలిసికొనవలెను.

ఒక్కొక్కప్పుడు తల్లి యాందోళన బిడ్డనుగూడ బాధింప వచ్చును, అట్టియెడ తానపరిశుభ్రమగుదు నను భయముచే నతనికి మలవిసర్జన వ్యాపారము సరిగా జరుగక మలబద్ధ మేర్పడ గలదు.

విసర్జన వ్యాపారమునెడ బిడ్డకెట్టి యసహ్యతయు నుండదు. అది యతనికెంతో ముచ్చగను ఘనతగను దోచును. తానేదో యుద్భవింపగలిగితి నన్నయానందము నతడు పొందుచుండును. ఇది గ్రహించి తల్లి తనబిడ్డడు మలమూత్ర విసర్జనలను సరిగా జరుపునట్లు ప్రోత్సహింప వలెను. విసర్జన కార్యమన్న నేదో తప్పుగను అసహ్యకరముగను సూచింపరాదు. అట్లు సూచించుకొలది బిడ్డకా కార్యమునెడ కౌతుకము మెండై దీర్ఘకాలము వరకును నశింపకయుండును. లేనిచో నది కొలదికాలములోనే తగ్గి నశింపగలదు. పశితనమున బిడ్డకు సహజమగు నీకుతూహలము నెట్లో యణచియుంచినను అదియతడెదిగి పెద్దవాడైనప్పుడు తిరిగి పొడసూపుచుండును. అందులకే కొందరు పెద్దవారికి విసర్జన విషయములను గూర్చిన హాస్యమెంతయు నానందకరముగ దోచుచుండును,

బిడ్డడర్థము చేసికొనగలడని మనకుతోచి నంతనే అతనికి విసర్జన వ్యాపారములగూర్చి సామాన్యముగ జెప్పుచుండ వలెను. ఆహారమంతయు శరీర నిర్మాణమునకే వినియోగ పడుటలేదు. కొంత పనికిరానిదై యుండును. ఇంటియందలి చెత్తను మనమెట్లు పారవేయు చుందుమో అదేవిధముగ శరీరమును పనికిరాని యాహారపదార్థములను విసర్జించు చుండును. శరీర పరిశుభ్రతకీ విసర్జనకార్య మెంతయు నవసరము. ఇదిసరిగా జరుగకున్న జబ్బులు వచ్చుచుండును. ఈ విషయములన్నియు బిడ్డకు బోధింప వలయును. ఇంతేగాక అతడు ప్రతిదినమును తన విసర్జన వ్యాపారములు సరిగా జరుగుటయు, జరుగకుండుటయు గమనించుచు తల్లికి చెప్పుచుండ వలెను. బిడ్డడెదిగి యౌవనుడగుతరి విసర్జనవిషయములను సరిగా గమనింపక నశ్రద్ధజూపుటచే నారోగ్యము చెడి యెన్నో వ్యాధులకు గురియగుచుండును.

మలాశయ నిగ్రహము (Bowel Control) :

మూత్రాశయ నిగ్రహముకన్న (Bladder Control) మలాశయ నిగ్రహమునకే (Bowel Control) ముందుగ నభ్యాసమిచ్చుట కారంభింప వచ్చును. కారణమేమన మలవిసర్జన యలవాట్లు చాలవరకు బిడ్డ భుజించెడి యాహారములను బట్టియు, వేళలను బట్టియు నేర్పడుచుండును. సరియగు నాహారమును సమయానుసారముగ బెట్టుచుండుటచే బిడ్డకు క్రమమగు మలవిసర్జన యలవాట్లేర్పడి మలాశయ నిగ్రహ మలవడు టెంతయు సుకరమగును. బిడ్డడారోగ్య వంతుడైనచో పుట్టిన యారువారములనుండియు మలాశయ నిగ్రహమున కభ్యాసమీయ మొదలిడ వచ్చును. వేళకు సరిగా మలవిసర్జన జేయుట శరీరారోగ్యమున కెంతయు నవసరము. బిడ్డ కట్టి యలవాటు తప్పక ఏర్పడవలెను. [సశేషం]



మహిళలో మహిళమాట

# దుమ్ము - దుమారము

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

ఎవరినీ దుమ్మెత్తి పోద్దామనే వుద్దేశము మాత్రము లేదు. కొన్ని వూళ్ళల్లో ప్రాంతాలలో గాలికాలము, దుమ్ముకాలమని మిగిలిన కాలాలలో పాటున్నవి. సాధారణముగా ఈ కాలము వేసవి కాలము ఆరంభించే ముందు వస్తుంది. కాలల్ని, ఋతువులని, కోయిలలను వర్ణించాలనే ధోరణిలేదు. కానిప్పుడు చెప్పబోయేది మొన్న కడపలో కాఫీ కప్పులో బయలు దేరిన దుమారము విషయము - ఒక పత్రికలో (ఆంధ్రపత్రిక) కడపలో ఒక మహిళాసభ జరిగినట్లు, రాత్రిచాలా ఆలస్యంగా స్త్రీలు ఇళ్ళకు చేరటంవల్ల పురుషులకు అసౌకర్యము కలిగినట్లు చాలా ఇళ్ళల్లో టీ కప్పులో తుపాను లాంటివి" చెలరేగినట్లు చెప్పుకుంటున్నారని ప్రకటించారు. తుపానులకి దుమారాలకు కొద్దిగానే బేధముగనుక టీ కప్పులో బయలు దేరినది తుఫానో దుమారమో యని మనము తర్జనభర్జనలు చేయవలసిన పనిలేదు. పత్రిక స్వకీయ విలేఖరి గారు "చెప్పుకుంటున్నారని" వ్రాసి కప్పుగంతువేశారు. నిప్పులేనిదే పొగ వుండదు కదా! ఇలా టీ కప్పులలో తుఫాను లేచిన మాట నిజమేనాని నిలువదీసి అడిగితే "అబ్బే మా ఇంట్లో ఇల్లాలికి సంపూర్ణ స్వాతంత్ర్యము ఇచ్చేశాముగా" యని భర్తగారు, "వారుచెప్పిన మాట నిజమేనని" భార్యాగారు సంజాయిషీ ఇవ్వగలరు. మరి ఇంటిగుట్టు రచ్చకెట్లా ఎక్కిందో! గోడలకు చెవులున్నాయో లేక విలేఖరి గారు...?...

పాపము ఉదయమునుండీ కష్టపడి భర్త రాత్రింటికి వచ్చేవరకు చిరునవ్వుతో (ప్రొద్దుటి నుంచీ ఇంటిపనితో సతమత మైనా) స్వాగత మిచ్చే గృహలక్ష్మి ఇంటి యందు లేకపోతే కొంత చిరాకు కలుగవచ్చు. ఆకలి రగులుతూ వుండవచ్చు. చెవులు చిల్లులు పడేటట్లు పిల్లలు సొద చేస్తుండవచ్చు. కాని అంత మాత్రము చేతనే తుఫాను చెలరేగ వలసిన అవసరమేమో దురూహ్యము కేవలము కడప పురుషులకే అసహనమని అనజాలము. అది ఆ పురుషజాతికి సంక్రమించిన విభూషణమనే చెప్పాలి.

ఒకపూట అసౌకర్యము కలిగినంత మాత్రమున విరుచుకు పడవలసినంత ముప్పేమిటి! ఒక రోజు వూరుకుంటే అదే అలవాటు కాగలదని భయమా? క్లబ్బునుండి షికార్లనుండి, ఆఫీసుల

నుండి, సినిమాహాళ్ళ నుండి, సభావేదికలనుండి రోజూ ఆలస్యంగా భర్తలు ఇండ్లకు వస్తుంటే కాఫీ కప్పులలో తుఫాను లాంటివి వినబడకపోవటానికి కారణము?

మాటవరసకు విలేఖరిగారు టీ కప్పుఅన్నా ఆవేళ తుఫాను భోజనాల పళ్ళెములలో బయలుదేరినవన్న మాట ఆ తుఫాను ఉదయము కాఫీ కప్పుతో సమసిపోయి వుండవచ్చు. లేదు టీ కప్పు వరకూ వుంటే ఆసంక్షోభ పడ్డ జీవులకును సంపూర్ణ సానుభూతి. పాపము రాత్రి బుద్ధి గడ్డితిని మీటింగుకు వెళ్ళిన మహిళలు, చిందులు శివాలుద్రొక్కే భర్తలను చూచి శనివారము ఒంటిపూట మహాత్యము చెప్పుకొంటూ నిదురపోయి వుండాలి.

ఉదయము పాచిపని చేసేదాని తిప్పలు వేరే చెప్పాలా? చెంబులు తపాళేలు, పళ్ళేలు వుండవలసిన చోట వుండక పోవుటచే వెతుక్కొనేటప్పటికి వేసారిపోయి వుండాలి. సతీమణిగారు సభలో నున్నప్పుడు పతిగారు ఆమెకు ఏవిధముగా స్వాగత మివ్వాలని ఆలోచిస్తూ కాల్చిన డబ్బాడు సిగిరెట్టు తుంపులు, ఒక నిప్పుపెట్టెడు గీచిన పుల్లలు చిమ్మి ఎత్తివేయటము సులభమే! అయినా దానికేమి? ఒకరి భోజనము మిగులున్నదీ పూట.

పాపము ఇల్లాలు! దాసుని తప్పు దండముతో పోదూ? దాసా? దాసీ?

ఏమో "సాసీ" ల భేదమెవరికి తెలుసు. తెల్లారి లేచినప్పటి నుంచీ అన్నీ వె... సమస్యలే (పాపము శమించుగాక) అన్నీ సంసార సమస్యలే.

మర్చిపోయేరు ఇవన్నీ మనలోమనమాటలే సుమండీ.



## చౌక బేరపు లడ్లు:-

1 పడి ఉప్పుడు బియ్యము.
2 పళ్ళు వేరుశనగ కాయలు.
½ పడి వేయించిన శనగపప్పు.
చారెడు నువ్వు పప్పు.
½ పడి పెసరపప్పు.
1 వీశె బెల్లము.

పెసరపప్పు, ఉప్పుడు బియ్యము వేరువేరుగా వేయించి పిండిచేసి కలుపవలయును వేరుశనగపప్పు (వేయించినవి). శనగపప్పు, నువ్వుపప్పు అన్నీ కలిపివేయవలయును. బెల్లము పాకము పట్టి ఈ మిశ్రమ మంతా అందులో వేడివేడిగా నుండగనే లడ్లు కట్టవలయును. లడ్లు కట్టునప్పుడు చేతికి బియ్యపుపిండి అద్దుకొనవచ్చును. పాకము:— 1 వీశెడు బెల్లము, కొంచెము నీళ్ళు- పాకము ఉండపాకము. నీటిలో పాకపు చుక్క వేస్తే అది మెత్తటి ఉండ కావలయును.

## వేరుశనగ డీలక్సు:-

2 శేర్లు వేరుశనగ కాయలు.
1 శేరు పంచదార.
1 శేరు పాలు.
కొద్దిగా యాలక్కాయలు.

వేరుశనగ కాయలు వేయించి, వలచి, పప్పుతీసి నాన బెట్టి మెత్తగా రుబ్బవలయును. పాలను వొయ్యిమీద పాత్రలో పోసి చిక్కగా అగువరకు కాగబెట్టవలయును. అప్పుడు వేరుశనగపప్పు రుబ్బినపిండి, పంచదారను పాలలో వేసి గరిటతో కలపుచుండవలయును. బాగా చిక్కగానైన తరువాత గట్టిపడబోవుచున్నప్పుడు యేలక్కుల పొడి అందులోవేసి దించి నెయ్యి రాసిన పళ్ళెములో పోయవలయును. వలయ ఆకారములో బిళ్ళలగా కోసికొనవలయును. బహు రుచిగా నుండును.

వేరుశనగపప్పు చాల పుష్టిగల ఆహారము. దానిలో చాలా ఎక్కువ ప్రోటీనులున్నవి. మాంసాహారముకన్న దినము వేరుశనగపప్పు కొద్దిగా తినిన అది ఎక్కువ ప్రోటీను లివ్వగలదు. మన దేశములో సమృద్ధిగా దొరకు ఆహారము. చాలా చౌకగా లభించు పదార్థము గనుక బీదలకు, ధనికులకు తగిన ఆహారము. పైగా చాల రుచియైనది కూడాను. కాని రుచియైన వస్తువులను ఎక్కువ భుజించరాదు.

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్





# గ్రంథసమీక్ష

## ప్రగతి

ఆంధ్రప్రభనుండి సంస్కృతి ప్రచురణవారిచే పునర్ముద్రితము. వెల నాలుగణాలు. దొరకుచోటు. కల్చరల్ బుక్స్ లిమిటెడ్, 31 మిరాన్‌సాహెబ్ వీధి, మౌంటు రోడ్డు — మద్రాసు - 2.

ఆంధ్రప్రభ దినపత్రికలో 'ప్రగతి' అన్న శీర్షికను ప్రచురింపబడిన సంపాదకీయములనే కూర్చి చిన్న పుస్తకముగా ప్రచురించారు ప్రకాశకులు — తేటతెల్లమగుభాషలో చక్కగా చురుకుగా అనుదినము కనబడు ఆంధ్రప్రభ సంపాదకీయములు ఆంధ్ర పాఠకలోకమునకు చిరపరిచితములే —

కమ్యూనిజము, గాంధీయిజములను చక్కగా విమర్శించిన వ్యాసముల సంపుటిది. ఒకదానిని పొగడుట మరియొక దానిని తెగడుటగాక చక్కగా సాకల్యంగా విమర్శన జరిగింది. భారతీయ తకేది అనుకూలమో, రాగద్వేషాలకు ప్రధానంగాక సత్వగుణాన్ని అంతర్భూతము చేసికొనగల 'ప్రగతి' ఏదో చక్కగా నిరూపించారు. అందరూ అన్ని పక్షములవారు తప్పక చదువవలసిన పుస్తకము.

## గీతాదండకము - గీతాసారదండకము

రచయిత-క. అశ్వత్థరావు. కలుగోడు గ్రామకరణము.
ప్రాప్తిస్థానం - రాయదుర్గం తాలూకా, అనంతపురం జిల్లా.

గీతాదండకం, గీతాసారదండకం అనే యీ రెండు పుస్తకాలు కలుగోడు గ్రామకరణము, కవిరాజ బిరుదాంకితుడు భక్తుడు పరమభాగవతోత్తముడు అయిన అశ్వత్థరావుగారు వ్రాశారు.

వాఙ్మయమునందు గద్యపద్య రచనలు ఒక యెత్తు. భావనా ప్రపంచములో కొన్ని నియతి నియమములతో సాధించునది పద్యరచన. భగవత్సాక్షాత్కార సమయమున భక్త్యావేశముతో తాదాత్మ్యమును బొందియద్భుత రసావిష్కృతమై యాశువుగా వెలువడునది దండకము. బంగారము స్వర్ణకారుని నైపుణ్యముచే వివిధ వస్తురిణామములను బొందినప్పటికిని సర్వజన సమాదరణపమైనదేయగునుగదా! అటులనే తత్త్వబోధకూడ వివిధ రీతుల భక్తజనులకందించుట యవసరమే. అందుచేత అశ్వత్థరావుగారి దండకములు అనన్యసామాన్యముగా నుండెననుట యతిశయోక్తికాదు. నిత్యము భగవద్గీతను పారాయణచేయు భక్తులకు గీతాసారమను రెండవ పుస్తకము మరియు ననువుగ నున్నది—

—గాడేపల్లి సుందరీశంకరం.

## మతం అంటే...?

శ్రీముక్తివి ఉడయవర్ విరచితము. వెల రూ. 0-8-0
దొరకుచోటు : శేషీప్రచురణలు, పవరుపేట, ఏలూరు.

## ముముక్షువు

'ముముక్షువు' అను అధ్యాత్మిక మాసపత్రిక సంపాదకులు శ్రీముక్తి. ఉదయవర్‌గారు ఈ మతం అంటే...." అను చిన్న పొత్తంలో జనసామాన్యానికి అర్థమయే విధానంలో సాకల్యంగా చర్చించి విశ్వకల్యాణము మతము ఏవిధముగా సాధించగలదో నిరూపించారు — ఈరోజులలో ఈవిధమైన పుస్తకముల అవసరమెంతేని కలదు. బహుప్రచారము కలగదగిన పుస్తకము. బిడ్డలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు పండితులు, పామరులు చదువదగినది.

## 'భగవంతుడు నూతనుడా సనాతనుడా ?'

సత్యసందేశములు (రెండుభాగములు) శ్రీమతి కృష్ణమ్మ విరచితము. దొరకు స్థలము, చిత్తూరు శ్రీ వేదవ్యాసము ద్రాక్షరశాల, చిత్తూరు. వెల 2-8-0 ; రూ. 3-4-0 (రెండు భాగములు)

శ్రీమతి కృష్ణమ్మగారు అద్యాత్మిక చింతయందు బహుకాలము పరిశ్రమచేసి ఆత్మోత్తేజముతో తోటిసోదరీమణులకై వ్రాసిన పుస్తకములివి. సామాన్య సంసారములో స్త్రీలు అటుసంసారము దిద్దుకొనుచూ ఇటు అద్యాత్మిక జీవితమెట్లు గడపగలరో, ఇహ పరసుఖములెట్లు సాధించగలరో వీరు చక్కగా సూచించినారు— స్త్రీలెల్లరు చదువదగిన పుస్తకములు. సులభమైన శైలి. ★

# కచేరీ చావిడి

——— :o. ———

వచ్చే నెలనుండి ఆంధ్ర మహిళలో మగవారికోసము కచేరీ చావిడి యుండగలదు.

కచేరీ చావిడి కబుర్లు ప్రత్యేకంగా పురుషులకే—

**వారి అలవాట్లు! వారి పాట్లు!!**

**వారి సమస్యలు! వారికి సలహాలు!!**

**వారి హక్కులు! వారి ధర్మములు!!**

రాజకీయ వేత్తల గుసగుసలు, — సంఘ సంస్కర్తల సమస్యలు,

పట్టణ వాసపువారి పోకళ్ళు, — గ్రామస్థుల గ్రహపాట్లు.

(ఈ శీర్షికకు తమతమ రచనలను పంపగోరుచున్నాము.)

# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర లోకంతో సన్నిహితానుబంధం ఏర్పరచుకొని, మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ తరపున "ఆంధ్ర మహిళ" పత్రిక 11 సం॥రములనుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు బాలానందం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ పరిశ్రమలు మున్నగు వానిని గూర్చి మాసామాసము యిందు ప్రకటింపబడును.

వార్షిక సంచిక, తపాలా ఖర్చులతోసహా

**సంవత్సర చందా 6-0-0**

సేవాసంస్థలకు, గ్రంథాలయములకు, కళాశాల, పాఠశాలలకు,

సంవత్సర చందా రూ. 4-8-0 మాత్రమే.

వివరములకు :

మేనేజరు
'ఆంధ్ర మహిళ'

ఆంధ్ర మహిళా సభ,
24-ఎ. లజ్ చర్చిరోడ్డు, మైలాపూర్, మద్రాసు.

"To train women workers and harness their services in the building up of the future of our Nation and Womanhood"

## మార్చి 1955

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| • | • | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | 31 | | |

7,8 మాసిమఖం. 8 పౌర్ణమి, 23 అమావాస్య. 25 తెనుగు సంవత్సరాది. 27 కృత్తిక.

Edited by Mrs. K. Lakshmi Raghuram, B.A.,
Printed & Published by Mrs. A. C. Krishna Rao, M.A., L.T.,
at the Andhra Mahila Press, Mylapore, Madras 4.

వస్తోంది!





శ్రీమతి శ్రీ పార్థసారథుల గార్లచే నడుపబడుచున్న మద్రాసు సంగీత కళాశాల (గోపాల పురము) తొమ్మిదవ వార్షికోత్సవము నాఁడు కుమారి. లక్ష్మీపున్నమ్మ (శ్రీ. ప. బ్రహ్మయ్యగారి కుమార్తె) నాట్యప్రదర్శనము.

## టైపు రైటింగు క్లాసులు

ఆంధ్రమహిళాసభలో టైపురైటింగుక్లాసులు ఏప్రిల్ పదవ తేదీనుండి తెరువబడును. ప్రస్తుతము సభ్యురాండ్రకు వుచితముగా నేర్పబడును. సంయుక్త కార్యదర్శినినుండి వివరములు తెలుసుకొనవచ్చును.

బి. తిమ్మాబాయి

సంయుక్త కార్యదర్శిని

# విజయము

డిసెంబరు 1954 లో గవర్నమెంటు టెక్నికల్ పరీక్షలకు వెళ్ళిన మా పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థినుల పరీక్షా ఫలితములు ప్రకటితమైనవి. విజయము పొందినవారి పేర్లు, శ్రేణులు సూచిస్తూ యిందు ప్రకటించుచున్నాము.

## కుటుపని హయ్యర్ గ్రేడ్

పరీక్షకు వెళ్ళిన తొమ్మండుగురు కృతార్థులైనారు. వారిలో యిద్దరు ప్రథమశ్రేణిలో విజయం పొందారు.

ప్రథమశ్రేణి : శ్రీమతి ఏ. విమల  సి. పర్వతము.

ద్వితీయశ్రేణి :

| | | |
|---|---|---|
| ఏ. రుక్మిణి | ఏ. కమల | ఆర్. సరస్వతి. |
| కె. సీతమ్మ | ఎల్. జోసప్ | ఆర్. మీనాక్షి. |
| | వి. ఎస్. సంపూర్ణం. | |

## కుట్టుపని లోయర్ గ్రేడ్

పరీక్షవ్రాసిన 27 గురులోను 23 ముగ్గురు ద్వితీయ శ్రేణిలో కృతార్థులైరి.

ద్వితీయశ్రేణి :

| | | |
|---|---|---|
| జి. రాజ్యలక్ష్మి | సి. ఆర్. భామ. | ఎ. బాలంబాల్ |
| కె. వి. రంగమణి | ఎన్. శారదాదేవి | కె. సావిత్రి |
| టి. ఆర్. సుబ్బలక్ష్మి | ఎస్. కల్పకం | ఎస్. రాజ్యలక్ష్మి |
| ఎస్. సుబ్బలక్ష్మి | ఎస్. సుందరి | కె. అమృతవల్లి |
| ఆర్. ఇందిర | సి. నాగలక్ష్మి | ఎమ్. నారాయణి |
| రమణిశంకర్ | ఎ. పుష్ప | ఎన్. అలిమేలు |
| ఎమ్. ఎ. ఇందిర | ఎన్. కల్పకం | వి. గౌరి |
| జి. మీనాక్షి | జి. కుంతల | |

## ఎంబ్రాయిడరీ లోయర్ గ్రేడ్

పరీక్ష వ్రాసినవారు 5 గురులో 4 గురు ద్వితీయ శ్రేణిలో కృతార్థులైరి.

ద్వితీయశ్రేణి :

| | |
|---|---|
| ఆర్. సరస్వతి | ఎస్. సుందరి |
| కె. సావిత్రి | ఎ. బాలంబాల్ |

కృతార్థులైన విద్యార్థినులందరకు మా అభివందనములు. వీరి విజయమునకు తోడ్పడ్డ ఉపాధ్యాయినీ వర్గమునకు మా కృతజ్ఞతాభివందనములు.

ఆంధ్ర మహిళా సభ.



పూజ కొరకు

## కృతజ్ఞత

శ్రీమతి. బి. తిమ్మాబాయమ్మగారు రూ 100/- ఇచ్చి యావజ్జీవ సభ్యురాలైనందుకు ఆంధ్రమహిళాసభవారు కృతజ్ఞులు.



దైవానుగ్రహము వల్ల ఉన్మత్తుని కత్తిబారినుండి సంరక్షింపబడినారు.
ఆసియాజ్యోతి నిరంతరము ప్రకాశించుగాక !

# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: ఏప్రిల్ 56 :: సంచిక 12



ఇంకా వెల్‌ఫేర్, బాలానందం, పాకకళ తదితర విషయములు.

సంవత్సరచందా :: :: ఆరు రూపాయలు.

వ్యవస్థాపకురాలు
శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపాదకురాలు :
లక్ష్మి రఘురామ్

ముద్రణ :
ఆంధ్ర మహిళా ప్రెస్.




సంపుటి 11 :: ఏప్రిల్ 55 :: సంచిక 12

# పచ్చతోరణము.

ఇంటింటా పచ్చతోరణము. ఎన్నికల సంరంభము ముగిసింది. ఆంధ్రలో ఆబాలగోపాలము మూడు నెలలనుండీ ఈ సంరంభముతో అలమటించిపోయారు. ప్రజాస్వామ్యజయముతో దిక్కులు పిక్కటిల్లు జయ జయ ధ్వనులతో ఎన్నికలు సలక్షణంగానే జరిగిన వని చెప్పుకోవాలి.

ఈ ఎన్నికలలో ఆంధ్రమహిళ విద్యుక్త ధర్మనిర్వహణ గర్వించతగ్గది. ప్రతివయోజనమహిళ ఎంతో కష్టనష్టములకు ఓర్చి తన ఓటును ఉపయోగించుకున్నందుకు అభివందనీయురాలు. మహిళల ఓట్లే ఆంధ్రరాజకీయ స్థాయికి చిహ్నము కాగలవు! అభ్యర్థులేమి, నాయకులేమి, ప్రజలేమి, పత్రికలేమి, ఆమెలో కలిగిన చైతన్యమును చూచి ఆశ్చర్యపడి చకితులై పోయారు. భళిరా! ఆంధ్రమహిళ, నీకు నీవేసాటి.

మెడలమీద కాడివేసికొని పొలముదున్నవలసిన అగత్యము లేకుండ నీ గృహకృత్యములను చక్కదిద్దు కొనుటకు అనుకూలవాతావరణము ఎర్పరుచు కొన్నందుకు అభివందనములు.

ఆంధ్రుల ఉద్రేకతత్వము ఇంతటితో ఆగవలసియున్నది, ఆంధ్ర దేశసంరక్షణాది కారము వహించవలసిన మంత్రిసత్తముల ఎన్నికలు జరుగవలసి యున్నది. అవియును ఎన్నికల వలనే జయప్రదముగా జరుగ గలవని ఆశించుచున్నాము,

ఇంతటితో రాజకీయరంగాలలో పచ్చ తోరణము.

మరి మన్మథ సంవత్సర ఆగమనముతో ఇంటింటా పచ్చతోరణమే. ఆంధ్ర దేశ చరిత్రలో నూత్న అధ్యాయము. ఆంధ్ర గృహాల్లో నూత్న జీవితము.

నూత్నత్వానికే సుస్వాగతము!

———:o:———



# రాజకీయాలు

శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు

ఫిబ్రవరి నాలుగో వారం మొదలుకుని మార్చి మూడో వారం వరకూ మన దేశంలోనూ, ఇతర దేశాల్లోనూ జరిగిన ప్రముఖ సంఘటనలు ఇవి— ఆంధ్ర ఎన్నికల్లో ఐక్యకాంగ్రెస్ గెలుపు, నందికొండ ప్రాజక్టుకు పంచవర్ష ప్రణాళికలో స్థానం రావటం, పన్నుల విచారణ సంఘ నివేదిక ప్రకటన కావటం, హిందూ వారసత్వ బిల్లుపై రాజ్యసభ చర్చ ప్రారంభించటం, బ్రిటన్ హైడ్రొజన్ బాంబు నిర్మాణానికి పూనుకొనటం, దూరప్రాచ్యంలో పరిస్థితులు కదలబారటం, రష్యా తన వ్యవసాయ విధానం విషయమై ఆత్మ విమర్శ చేసుకొనటం.

*   *   *

ఫిబ్రవరి నెలలో ఆంధ్ర శాసన సభ ఎన్నికల్లో ఐక్య కాంగ్రెస్ ఘన విజయాన్ని సాధించింది. మొత్తం 196 స్థానాల్లో 146 ఈ కాంగ్రెస్ ఫ్రంటుకే వచ్చినవి. కమ్యూనిస్టులకు 15, ప్రజాసోషలిస్టులకు 13, స్వతంత్రులకు 22 స్థానాలు వచ్చినవి. స్వతంత్రుల్లో చాలామంది కాంగ్రెస్ అనుకూలురేనని చెప్పవచ్చు.

దేశంలో కమ్యూనిస్టు పార్టీ స్థావరాల్లో ముఖ్యమయిన ఆంధ్రలో ఆ పార్టీ ఓడిపోవటానికి కారణాలు ఏమిటో కాంగ్రెస్ తరపున ఎన్నికల ప్రచారాన్ని నడిపించిన ఎస్. కె. పాటిల్‌గారు బొంబాయి కార్పొరేషన్ కాంగ్రెస్ పార్టీ చేసిన సన్మానంలో వివరించారు. అవి ఈ విధంగా ఉన్నవి.

1. కమ్యూనిస్టు నాయకుల దౌర్జన్య ప్రసంగాలు, చర్చలు, చవకబారు ప్రచారాలు వాళ్ళకు ఎక్కువ వోట్లను సంపాదించటానికి బదులుగా, వాళ్ళకు రావలసిన లక్షల కొద్ది వోట్లను రాకుండా చేసినవి,

2. కమ్యూనిస్టు సానుభూతి పరుల్లో కూడా నూటికి పది, పదిహేనుమంది పోలింగ్ కేంద్రాల్లోకి వచ్చిన తరవాత మనసు మార్చుకున్నారు.

4. కాంగ్రెస్ ప్రచారంలో ఎటువంటి వాగ్దానాలు, సమస్యా పరిష్కారాలు చెప్పలేదు. ప్రజలకు కావలసింది ప్రజాస్వామ్యమా, నియంతృత్వమా అని ప్రశ్నించటమే జరిగింది.

5. కాంగ్రెస్ సంస్థ మీదనూ, నెహ్రూవంటి అఖిల భారత కాంగ్రెస్ నాయకుల మీదనూ ప్రజలకుగల నమ్మకం.

6. విద్యార్థుల్లో కాంగ్రెస్‌పట్ల ఏర్పడ్డ ఆదరణ.

ఆవడి సమావేశంలో సోషలిస్టు పద్ధతి ప్రజాస్వామ్యాన్ని నిర్మిస్తానని కాంగ్రెస్ చేసిన తీర్మానం తమ గెలుపుకు ముఖ్య కారణాల్లో ఒకటని పాటిల్ అన్నారు.

కమ్యూనిస్టులు చెపుతున్న కారణాలు ఇవి—

1. కమ్యూనిస్టు పార్టీ శాసన సభలో కాంగ్రెసుకు ప్రతికూల పక్షంగా ఉండాలనే మధ్య తరగతి ప్రజలు కోరుతున్నారు. కాని ప్రభుత్వం నడపాలని కోరేందుకు సిద్ధపడలేదు.

2. ధనిక, భూస్వామ్య వర్గాలు తమ పలుకుబడి, పెత్తనాలను ఉపయోగించి కమ్యూనిస్టులకు పడే వోట్లను కొంత అడ్డగించారు.

ప్రజల అభిమానంపట్ల తాము వేసుకున్న అంచనాలు తప్పని కమ్యూనిస్టు నాయకులు ప్రకటించారు. ఇంతే కాదు. కాంగ్రెసేతరులను చేరదీయవలసిందిపోయి, ప్రజా సోషలిస్టుల సహకారాన్ని — ఆంధ్ర పి. ఎస్. పి.

నాయకులు సుముఖంగానే ఉన్నారు కనుక — తీసుకోవలసిందియు. కమ్యూనిస్టే తిరుగు కలుగుకను సాగనివ్వారు. మ బలాన్ని గురించి అపోహ పడటమే వాళ్ళ ఈ పొరపాట్లు చేసేట్లు చేసింది. ఈ అపోహ దురహంకారానికి దారి తీసింది. కమ్యూనిజం అంటే భూలోక నరకం అని ఇతరులు చేసే ప్రచారాన్ని అరికట్టి ప్రజల భయాన్ని పోగొట్టి వాళ్ళ విశ్వాసాన్ని సంపాదించే ఓర్పు కమ్యూనిస్టు నాయకులకు లేకపోయింది.

ఎన్నికలద్వారా ఎవరు అధికారంలోకి రాదలచుకున్నా, మధ్యతరగతుల ఆదరాన్ని సంపాదించ వలసివుంటుంది. కమ్యూనిస్టుల ఎన్నికల ప్రణాళిక మధ్య తరగతులకు కూడా ఆకర్షణీయంగానే ఉన్నప్పటికీ, వాళ్ళ వోట్లు కమ్యూనిస్టులకు పడలేదు. మధ్య తరగతి ప్రజల్లో వాళ్ళు చెప్పుకో తగ్గ పని చేయలేదు. ఇటువంటి పొరపాట్లను సర్దుకుంటూ కమ్యూనిస్టు నాయకులు తమ విధానాన్ని మార్చుకుంటారో. లేక నాయకత్వంలోనే మార్పు చేసుకుంటారో, చూడవలసియుంది. లేకపోతే- ఐదేళ్ళ తరవాత కూడా పరిస్థితి ఇట్లాగే ఉంటుంది.

* * *

నాయకత్వంలో లోపాలను సర్దుబాటు చేసుకొనటం ఐక్య కాంగ్రెస్ వర్గాలు ఎన్నికలముందు ప్రారంభించారు ఎన్నికలయిన తరవాత కూడా దీనిని కొనసాగించు కుంటున్నారు. కృషికార్ లోక్ పార్టీ కాంగ్రెసులో కలిసిపోయింది. ప్రజాపార్టీ కలిసి పోనప్పటికీ, పూర్తి సహకారాన్ని ఇస్తున్నది. అందువల్లనే మార్చి 20 వ తేదీన ఎసెంబ్లీ యునైటెడ్ కాంగ్రెస్‌పార్టీకి బెజవాడ గోపాల రెడ్డిగారి ఎన్నిక ఏకగ్రీవంగా జరిగింది. ఏప్రిల్ నుంచీ కొత్త పభుత్వం పనిప్రారంభిస్తుందనిచెప్పవచ్చు.

* * *

నందికొండ ప్రాజక్టును మొదటి అయిదేళ్ళ ప్రణాళికలో చేర్చేందుకు కేంద్ర ప్రభుత్వం అంగీకరించినట్లే అని గవర్నర్ త్రివేదీగారు వెల్లడించారు. మాచర్లనుంచి డాం స్థలం వరకూ రోడ్డువేయ బడుతుంది. ఈ ప్రాజక్టుకు సంబంధించిన కొంత ఖర్చును హైద్రాబాద్ ఈ ఏడాది బడ్జట్‌లో కేటాయించటం కూడా జరిగింది.

ఈ ప్రాజక్టు నిర్మాణం సందర్భంలో కొన్ని అంశాలను గమనించటం అవసరంగా తోస్తున్నది. తుంగభద్ర ఆనకట్టు పూర్తిగా వినియోగంలోకి రాకముందే దేశంలో ఆధిక్యం మిగిలి పోవటం ధరలు తగ్గిపోవటం జరుగుతున్నది. వ్యవసాయ సరుకుల ధరలు పడిపోకుండా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని ఆందోళన జరుగుతున్నది. ధరలను కాపాడాలంటే, ప్రభుత్వం ఏయేపంటలను ఎంత వరకువేయాలి అన్నివిషయాలలో కంట్రోలు అధికారాన్ని, ఏదో ఒక ఘట్టంలో తీసుకోవలసివుంటుంది. లేకపోతే, రైతులు తమ ఇష్టం వచ్చిన పంటలు వేసి వాటి ధరలను కాపాడమని ప్రభుత్వాన్ని కోరితే, ప్రభుత్వం దివాలా తీయక తప్పదు. అందువల్ల నందికొండ ప్రాజక్టుకింద ఎంత వరి పండించేది మిగతా పంటలు ఎంత పండించేదీ మొదలైన సమస్యలు ముందే తేల్చుకుని, వాటికి తగిన ఖర్చునే పెట్టుకొనడం అవసరమవుతుంది.

* * *

ఏయే పంటలను ఎంతెంతవేయాలో ప్రభుత్వం నిర్ణయించటం అన్న ప్రసక్తి వచ్చినప్పుడు, ఇటీవల తమ సమిష్టి వ్యవసాయ విధానాన్ని గురించి రష్యా ప్రభుత్వం చేసుకున్న ఆత్మ విమర్శను పరిశీలించటం అవసరం. సమిష్టి వ్యవసాయంలో ఏ పంటలను ఎంతెంత వేయాలో నిర్ణయించటం మొదలైన కంట్రోలు కట్టుదిట్టాల వల్ల ఉత్పత్తి తగ్గిపోయిందని రష్యా ప్రభుత్వం ప్రకటించింది. రష్యా ప్రభుత్వం అధికోత్పత్తినే ప్రధానలక్ష్యంగా పెట్టుకున్నందువల్ల, ఈ కట్టుదిట్టాలను సడలించ నిశ్చయించుకున్నదేకాని, వ్యవసాయార్థికవ్యవస్థలో కట్టుదిట్టాలు అనవసరం అన్న ఉద్దేశంతోకాదు. శాంతి అవకాశాలు తగ్గిపోవటంవల్ల, ఇతర కమ్యూనిస్టు దేశాలన్నిటినీ కూడా బలపరచవలసిన బాధ్యత రష్యామీద పడ్డది. అందువల్ల ఆ దేశానికి అధికోత్పత్తి అవసరమయింది అందువల్లనే తన వ్యవస్థలో అవసరమయిన కట్టుదిట్టాలను సడలించటానికి నిశ్చయించుకున్నది.

ధరలను ప్రభుత్వం నిలబెట్టాలని అని ఉత్పత్తి దారులు ఆందోళనచేసే పరిస్థితి వచ్చిందీ అంటే, ఆయా ఉత్పత్తి రంగాల్లో ప్రభుత్వ జోక్యం తప్పనిసరి అయిన పరిస్థితి ఏర్పడ్డదన్నమాటే. లేకపోతే స్వేచ్ఛపేరుతో ఆర్థికవ్యవస్థలో అరాచకాన్ని ప్రోత్సాహించటం జరుగుతుంది. అంటే కొన్నాళ్ళపాటు ఆర్థికమాంద్యం, కొన్నాళ్ళపాటు వస్తు కాటకం ఈ విధంగా ఒడుదుడుకులు వస్తూనే ఉంటవన్న మాట. ఒక్కొక్క దానికీ జనం అల్లాడిపోతూ ఉంటారన్న మాట.

ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకుంటే, సమిష్టి సాగుబడికి ప్రతికూలమయిన అంశం. ఉత్పత్తి తగినంతఉండకపోవటమే నని చెప్ప వలసివుంటుంది. అయితే దీనికి కూడా కొన్ని పరిమితులు ఉన్నవి. ఆయాదేశాల ఉత్పత్తి స్థాయిని పట్టికూడా ఆహెచ్చుదల, తగ్గుదల ఆధారపడి ఉంటవి. విశాల క్షేత్రాలున్న రష్యా పరిస్థితులకూ వ్యక్తిగతంగా తరతరానికీ తగ్గిపోయే ఇండియా పొలాలకూ తేడా ఉన్నది, అందువల్లనే అయిఉంటుంది. మద్రాసు ప్రభుత్వం కూడా సమిష్టి సాగుబడి క్షేత్రాలను పరీక్షించ నిశ్చయించింది. తిరునల్వేలి జిల్లా శ్రీ వైకుంఠం తాలూకా మనక అనే గ్రామంలో సమిష్టి సాగుపథకాన్ని ప్రవేశ పెట్టాలని ప్రయత్నిస్తున్నది. భూస్వాముల దగ్గర మొత్తం 800 ఎకరాలను 20 సం॥ల పాటు కౌలుకు తీసుకుని, వాళ్ళ చేతనే సహకార సంఘం ఏర్పాటు చేసి ఆ సంఘంద్వారా సమిష్టి సాగు జరిపిస్తుంది. దీనిమీద వ్యష్టి సాగుమీద కన్నా ఎక్కువ ఉత్పత్తి, ఆదాయాలు ఉండగలవని మద్రాస్‌ప్రభుత్వం భావిస్తున్నది.

* * *

సమిష్టి సాగు సాధకబాధకాలు ఇట్లా ఉన్నవి. దీనికి తోడు సోషలిస్టు పద్ధతి సమాజాన్ని స్థాపించటానికి కాంగ్రెస్ ఆవడి సభలో నిశ్చయించింది. కాని కాంగ్రెస్ సమిష్టి సాగుబడి విధానాన్ని వ్యతిరేకిస్తుందని అధ్యక్షుడు ఢేబార్‌గారు ఫిబ్రవరి 13 న కాన్పూర్ విద్యార్థి సభలో ప్రసంగిస్తూ ప్రకటించారు. ఇనుము, బొగ్గు, విద్యుచ్ఛక్తి యంత్రాలు, వాడకం వస్తువుల అవసరమయే యంత్రాలు మినహా మిగిలిన పరిశ్రమలన్నిటిలోనూ సొంత పెట్టుబడి దారులకు అవకాశం ఉంటుందని ప్రకటించారు.

* * *

దేశంలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల, స్థానిక సంస్థల పన్నులను పరిశీలించటానికి ప్రభుత్వం నెలకొల్పిన సంఘం నివేదిక ఫిబ్రవరి 28 న ప్రకటించబడ్డది. అందులో ముఖ్యాంశాలు కొన్ని ఇవి—

1. అభివృద్ధి కార్య క్రమాలను లోటు ఖజానా పద్ధతి పెట్టుబడితో నడపటం మంచిదికాదు. అనుకున్న ఖర్చులు పెరగటం, అనుకున్నంతగా అనుకున్న వేళకు ప్రతిఫలం రాకపోవటం కారణాలు. ఎక్కువపన్నులు వేయటం, అప్పులు చేయటం ద్వారా అభివృద్ధి కార్య క్రమాలు అమలు జరగాలి. 2. అవసర వస్తువుల మీద పన్నుల హెచ్చింపు తప్పనిసరి. 3. పెద్ద రాబడులమీద పన్నులు కూడా హెచ్చించవచ్చు. 4. కొన్ని ప్రత్యేక పరిశ్రమల అభివృద్ధికోసం దాదాపు 25% వరకూ ముదరా ఇవ్వవచ్చు.

ఈ సూత్రాల ప్రకారం ఈ ఏడాదికి కొత్తబడ్జట్‌ను ఆర్థికమంత్రి దేశముఖ్ ప్రతిపాదించారు. దీనివల్ల పంచదార, గుడ్డలు, కుట్టుమిషన్లు మొదలైన వాటిమీద పన్నులు పెరిగినవి, పార్లమెంటులోనూ, ఇతరత్రా కూడా నిరసనలు రావటాన ఇవి కొంత తగ్గించటానికి ఆర్థికమంత్రి ఒప్పుకున్నారు.

* * *

ఈతడవ అన్ని రాష్ట్రాల బడ్జట్‌లలోనూ మద్రాస్ బడ్జట్ రెండు అంశాల్లో చెప్పదగి ఉన్నది. 3 వ ఫారం వరకూ బీద విద్యార్థులందరికీ కులమత వివక్షత లేకుండా ఉచితంగా చదువు చెప్పే ఏర్పాటు జరిగింది. నెలకు 100 రూపాయలకు మించని ఆదాయం ఉన్నవాళ్ళ పిల్లలందరికి ఇదివర్తిస్తుంది. ఎలిమెంటరీ స్కూళ్ళ ఉపాధ్యాయులకు పెన్షన్ ఏర్పాటు చేయబడ్డది.

* *

మార్చి 22 తేదీన రాజ్యసభ హిందూ వారసత్వపు బిల్లుపై చర్చ ప్రారంభించింది. తండ్రిఆస్తిలో కుమార్తెకు భాగం ఇవ్వాలన్నది ఈ బిల్లులో ముఖ్యాంశం. ఇది అవిభక్త హిందూ కుటుంబాలకీ, అళియసంతానం, మారుమకుతాయం సాంప్రదాయాలననుసరించే కుటుంబాలకూ వర్తించదు. వితంతువుకు ఆస్తిలో హక్కును నిర్దేశించటంకూడా ఈ బిల్లులో మరొకముఖ్యాంశం. భర్తఆస్తిలో భార్యకు హక్కు ఇచ్చినట్లే, భార్య ఆస్తిలో భర్తకు హక్కుఇచ్చే ఏర్పాటులేదు కనుక ఈ బిల్లు కొడుకులకు అన్యాయం కలగ జేస్తుందని కొందరు వాదిస్తున్నారు. అవిభక్త హిందూ కుటుంబాలకు కూడా దీనిని వర్తింప జేయాలనీ, విడాకులు పుచ్చుకున్న కుమార్తెలకుకూడా వర్తింప జేయాలనీ, కుమార్తెకు కుమారుడితోపాటు సమానవాటా ఇవ్వాలనీ మరికొందరు వాదిస్తున్నారు.

* * *

బ్రిటన్‌కూడా హైడ్రోజన్ బాంబుల్ని తయారు చేయటం ప్రారంభించింది. ప్రధాని చర్చిల్ మార్చి 1 వ తేదీన పార్లమెంటులో ఈ విషయాన్ని ప్రకటించారు. అమెరికా, రష్యాలకు ప్రస్తుతం ఉన్న అణుఅస్త్రాలముందు, బ్రిటన్ కొత్తగా తయారు చేసేవాటి లెక్కఉండదనీ, ఈ ఉభయ వర్గాలనూ కాదని నిలిచే మూడో వర్గాన్ని బ్రిటన్ బలపరచటం వల్లనే ప్రపంచ శాంతిని కాపాడగలదనీ బ్రిటీష్ లేబర్‌పార్టీలో కొందరు హెచ్చరిస్తున్నారు.

దూరప్రాచ్యంలో మళ్ళీ కదలిక మొదలయింది. ఫిబ్రవరి చివరలో బాంకాక్‌లో ఆగ్నేయాసియా ఒప్పందందేశాలసమావేశం జరిగినప్పటినుంచీ ఇదిబాగా ఎక్కువయింది. కొరియా యుద్ధవిరమణ పర్యవేక్షక సంఘాన్నిరద్దు చేయాలని అమెరికా ప్రచారం మొదలు పెట్టింది. కాంబోడియా, దక్షిణ వియత్నాంలలో కూడా తటస్థ పర్యవేక్షణ సంఘాల మీద వ్యతిరేక ప్రచారం ఎక్కువయింది. మలయాలో ఆస్ట్రేలియన్ సేనల్ని ఉంచటానికి ఏర్పాటు జరిగింది. ఫార్మోజాలో అమెరికన్ నౌకాదళానికి అణ్వస్త్రాలు సప్లయి చేయబడుతున్నవి. రష్యాకన్నా చైనా కర్జాకోరు అనీ, చైనా త్వరపడితే ఆసియాలో యుద్ధం తప్పదని అమెరికా విదేశాంగమంత్రి డలెస్ ప్రచారంసాగిస్తున్నారు.

ఇవిఇట్లా ఉండగా, మరొకవైపు ఆగ్నేయాసియా రాజ్యాలు ప్రతిపాదించిన ఆసియా ఆఫ్రికా సమావేశానికి పరిస్థితులు అనుకూలంగా పరిణమిస్తున్నవి. ఒక్క మధ్య ఆఫ్రికా ఫెడరేషన్ మినహా ఇతరదేశాలేవీ అహ్వానాన్ని నిరాకరించలేదు.

మధ్య ప్రాచ్యంలో టర్కీ, ఇరాన్ ఒప్పందానికి ప్రతిగా వేరొక అరబ్ రక్షణ వ్యవస్థను ఈజిప్టు తయారు చేస్తున్నది, సిరియా, అరేబియా, లెబనాన్, యోమెన్‌లు సుముఖత చూపించినవి.





# ఉగాది

శ్రీ జూలూరి హనుమంతరావు

విరిసిన వేపపూవు లరవిచ్చిన మామిడిపూలు క్రొత్తగా
మురిసిన లేత జొంపములు ముద్దుగుల్క వసంతవేళలో
సరసములాడఁజొచ్చిన వసంతుఁడు చెక్కిలిగిరి రాగసుం
దరుల మొగాంలో కలహతమ్ములఁ దేఁటులు చిక్క నవ్వుచున్

పూలుహసించె మాతృభువి పొంగగ తుమ్మెదరాజు విశ్వగీ
తాల స్వనించి తేనెలనుద్రావి రజమ్ములు పువ్వు పువ్వులో
రాలిచి కాయకాయ వివరాంకు దోహదమిచ్చె శాంతి గీ
తాలు పఠించి విశ్వజనతా హృదయాలకు హాయిగొల్పుచున్



మనతెలుఁగమ్మకీ మధురమంజుల రాగవసంతవేళ శాం
తినిఁ గలిగింపఁజేసి తియ్యతియ్యగ కోకిల గోరువంక చి
ల్క నెమలి పాలపిట్ట గిజిగాని శుభోదయ నవ్యమంగళ
ధ్వనుల ధ్వనింపఁజేసే చలువల్ మధువుల్ సుఖశోభ లిచ్చుచున్

ఏ చైతన్య వికాశమార్గములలో నేతెంచెనోగాని, యే
రోచిస్సాంద్ర కళాపథాలజననా లోచించెనోగాని. యే
ప్రాచీన ప్రతిభా విభాసితముగా రాజించెనోగాని, యీ
ప్రాచీదిక్పతి జిహ్వా అంధ్రరమ దివ్యత్వమ్ముతో నిల్చెడున్.

తెలుఁగునిసుంగు పచ్చియెద దిద్దిన శౌర్యదయా ప్రశాంతరే
ఖలు కొనసాగి యల్లికలుగా పెనగొంచును శాంతివృక్ష శా
ఖల కెగప్రాకి ప్రాకిచనగా నదెచూడు చిటారు కొమ్మపై
నిలచి వెలుంగుజిమ్ము రమణీయ దినమ్ములు వచ్చుచుండెరా !



అదెభానూదయమయ్యె నల్లవె వసంతానందపుంస్కోకిలల్
ముదముల్ మూటలుగట్టి మావిపయి కాలున్ మోపి ఆ దారిలో
పదసంచారుల పిల్చె గానముల "నోపాంథా యివే కొమ్మ సం
పద లీవేళ బహూకృతుల్ కొనుము రమ్మా" యంచు గొంతెత్తుచున్.

ఏవో యీ యుదయమ్ములోఁ గళలలో నెగ్గెత్తి యీ విశ్వమం
దేవో తియ్యని మాటలాడినవి యేయే నవ్యభావాల క్రొం
దీవల్ ప్రాకునో ! ఐక్యకంఠమున ప్రార్థించెన్ కోట్లకంఠాలు ప్రో
గై విశ్వమ్మున విశ్వమానవుల కళ్యాణమ్ముకై వింటిరా ?



తెలుగుపెడెంద గొజ్జిగుల తియ్యదనాలను బోలి మెత్తనై
చిలికిన తేనెయింకక కృశింపక జారక నిల్చిసర్వధా
తెలిపిజగాన ప్రాణులకుఁ దియ్యదనమ్ములనిచ్చి శాంతి కా
ములయటచేతి పంటయయి పొంగులువారుచు నెప్పుడుండునో !

ఈ యుగాది యుదయమున హృదయమిచ్చి
శాంతి నెలకొల్పు కొనగ దీక్షను వహించి
పూజవిడువుము తేనేల పూలతోడ
నిలచినది రండుప్రజలార ! తెలుగుతల్లి.



## మనలో మనమాట

# అమూల్యమైన సలహాలు

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

"టింగు ! టింగు ! టింగు ! "

"హలో ! హలో !"

నేను జానకిని. లక్ష్మేనా మాట్లాడేది ?

"ఆహా లక్ష్మే. ఏమిటి అర్ధరాత్రప్పుడు హడావిడి."

"ఏం!సుఖస్వప్నాలకేమైనా అంతరాయముకలిగిందా?"

"ఇంకా నిద్రపోలేదు. చదువు కుంటున్నాను"

"ఏమి చదువు కుంటున్నావు? "

"Oscar wilde నాటకాలుగాని, ఇంతకీ నీవిప్పుడు ఫోను చేసిందెందుకు ? ఈ ఇష్టాగోష్టికేనా?"

"ఏమి నిద్ర వస్తున్నదా?"

"నిదురాలేదు, గిదురాలేదు. ఇంటిల్లపాది నిదురపోతున్నారు. మనసంభాషణతో వాళ్ళకి నిద్రాభంగము కలుగవచ్చు గనుక నీవు చెప్పదలచుకొన్న దేదో తొందరగా చెప్పు. "

"ఏమీలేదు. చాల ముఖ్యమైన విషయముమీద అవసరముగా నీ అమూల్య సలహా కావలసి వచ్చింది. పెళ్ళి చేసుకుంటే కలిగే లాభాలేమిటో చెప్తావా ? "

"ఇందుకేనా ఫోను చేసిందీ ? దేనికైనా వేళా పాళా వుండాలి. ఆలోచించి రేప్రొద్దున్నే చెబుతానులే. పోయి పడుకో. అర్ధరాత్రప్పుడు ఇప్పుడేమి తలపు కొచ్చినట్లు ? మేల్కొని వున్నావా ? లేక నిద్రలో ఏమైన లేచి మాట్లాడుతున్నావా ? "

"ఇదుగోలక్ష్మీ ! నీకున్న బుద్ధేఇది. అడిగి నప్పుడు సలహా చెప్పవు. తరువాత చీవాట్లు పెడ్తావు. నీ అమూల్య సలహాలు ఫీజు లేకుండా చెప్పవా ? "

"సాధారణంగా ఫీజులేకుండాచెప్పననుకో. ప్రస్తుతము నీ విషయములో ఆహ్వాన పత్రికతోనే తృప్తిపడగలను."

"సరే అడిగిన దానికి జవాబుచెప్పు"

"ఇన్నాళ్ళు ఆగినదానివి రేపుదయమువరకు ఆగవచ్చు ఇంతలో మునిగిపోయేదేమీ లేదు. "

"నేను వేళాకోళానికి అడుగుతున్నానని అనుకుంటున్నావేమో ! రేపుదయము నేను ఏదో ఒక సమాధానము మా అమ్మకు ఇవ్వక తప్పదు. కాబట్టి నిద్రపోయేముందే నా జవాబు నిర్ణయించుకోవాలి. "

"ఓహో ! అదాసంగతి ! అయితే ఆ యింజినీరు అబ్బాయికేదో జవాబు చెప్పాలి కాబోలు మీ అమ్మగారు."

"అవును. ఆ అబ్బా........ఆయన విషయమే. "

"అతను నీకునచ్చాడా? నిన్న వకీలుగారింటి విందుకు ఆయనా వచ్చారు. కాబోలు? "

"ఏమో ! నచ్చాడో లేదో చెప్పలేను. నచ్చకుండా వుండలేదు, మూతి వంకరా, ముక్కువంకరా లేదు. "

"అమ్మయ్య లేదుకదా ! అయితే తప్పకుండా పెళ్ళి చేసుకో. "

# అమూల్య మైన సలహాలు

"నిన్ను నేను అడిగింది నీ తీర్పు ఇవ్వమని కాదు. పెళ్ళి చేసుకుంటే కలిగే లాభాలేమిటో తెలిస్తే చెప్పితే సంతోషిస్తాము."

"హరే! రామచంద్రా! మీ అమ్మనే అడుగక పోయి నావా?"

"అడిగాను. ఆమె నిన్ను అడగమని సలహా ఇచ్చింది."

"ఏమో లాభాలూ నష్టాలూ నాకవన్నీ తెలియవే."

"నేను నీవంత minus I.Q వనుకోలేదే?"

"ఇదిగో జానకీ! నేను minus I. Qనో plus I.Q నోగాని నేనెప్పుడు నీ వడుగుతున్న విషయము ఆలోచించలేదు. ఇప్పుడాలోచించాలంటే ఇరువై ఏళ్ళనాటి నుంచీ నాజీవితాన్ని పర్యావలోకించు కోవాలి. అయినా ఈ ప్రశ్న అడిగే వాళ్ళకే minus I. Q వున్నట్లు నాకు తోస్తున్నది."

"నీవు జవాబు చెప్పదలచుకో లేదన్నమాట."

"చెప్ప దలచుకోక పోవడమేమిటి తెలిస్తే కదా చెప్పేది. నీ నిర్బంధముతో బలే బాదపెట్టుతున్నావే నన్ను ......... చూచావు బందరులో మనతోపాటు ఫస్టుఫారము నుంచీ ఆరవఫారము వరకూ చదువుకుంది, కమలన్న అమ్మాయి. ఆ అమ్మాయికి క్రిందటి వారమే పెళ్ళయింది. పాపము ఆహ్వానము పంపింది. నేను నా శుభాశీస్సులు బంపుతూ ఒక చిన్న జాబుకూడా వ్రాశాను. దానికి జవాబు మొన్నే వచ్చింది. అది ఏమంటే — వైవాహిక జీవితము బాగానే వుంది. కాని అ వైవాహిక జీవితము ఇంకాబాగున్నది. మా ఆయన మంచివానిలాగానే వున్నారు. అయినా అప్పుడే ఏమితెలుస్తుంది!" కాబట్టి జానకీ నీవే బాగా ఆలోచించుకో. ఈ విషయము ఇతరులు నిర్ణయించి పెట్టేదికాదు. అది నీయంతట నీవు స్వతంత్రముగా ఆలోచించి తేల్చుకొనవలసిన విషయమే. పైగా నీ వేమైనా చిన్న పిల్లవా? ముప్పదేండ్లు పైబడ్డవి. ఇంకానీవే ఆలోచుంకోలేక పోతే ఎట్లా."

"సరేగాని నీసోది నీకుకనపడే లాభాలేమైనావున్నవా?"

"లాభాలా!"

"పోనీ నష్టా లున్నవా?"

"నష్టాలా?"

"ఊ! అవే లాభనష్టాలు."

"ఏమోనబ్బ నాకునష్టాలు కనబడటములేదు. లాభాలు కనబడటము లేదు. చూడు మొన్న ఆ డాక్టరు. కుమారి. ప్రేమామణి. ఏబదవఏట పెళ్ళి చేసుకుందే! ఆమే అందరితో. ఇంటికి వచ్చిన వాళ్ళందరితో అంటున్నదట — నాకిదివరకు అవివాహితగా నున్నప్పుడు వివాహము చేసుకోక పోవడమువల్ల ఎంత జీవితానుభవము నష్టపడ్డానో తెలియలేదు. ఇప్పుడు తెలిసింది. ఎవరూ అవివాహితలుగా వుండకూడదు. అందరు వివాహము చేసుకొనవలసిందే." ఆమె చాలా తెలివిగలామె. ఆమెకు చాలా హై I. Q వున్నది. కాబట్టి ఆమె జవాబే నా జవాబు. నీ ప్రశ్నకు జవాబిచ్చినట్లే. తెల్లవారగానె మీ అమ్మగారికి నీ వివాహ సమ్మతి తెలుపు. పెళ్ళి చెసుకోక తప్పదు."

"అయితే పెళ్ళి చేసుకోకతప్పదుగా అంటున్నావేమిటి ఎందుకు తప్పదు?"

"మళ్ళీ ఏదో పేచీ వచ్చిందే. నాదుంపతెంపేస్తున్నావు జానకీ. ఎదో అన్నాననుకో అట్లా సాంఘికముగా, మానసికముగా. శారీరకముగా వివాహము అవసరముగా."

"సరే. తేంక్సు నీ అమూల్య సలహాలకు."

"ఫీజు మరచిపోయేవు. ఇంకోమాట. నీ వివాహమైన కొన్నాళ్ళకు — వివాహము వల్ల కలిగే లాభనష్టాలు తెలుపుతూ జాబు వ్రాస్తావుకదూ?"

"ఇదిగో లక్ష్మి! ఈ సంభాషణ విషయాలు ఎవరితోనైనాచెప్పేవు. ఇది అంతా మనలో మనమాటలే."

"అబ్బే. అంతేలే."

"గుడ్‌నైట్"

"గుడ్‌నైట్."



# మహిళల ఆరోగ్యరక్షణకు

## లోధ్ర

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూలాలు, బహిష్టు కాకుండుట, అకాలబహిష్టు, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్ళనొప్పులు, అరికాళ్ళు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0     6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్ళు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరల గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరు చేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పైజబ్బులు రాకుండుటయేగాక ప్రసవించు వరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండు మాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0     6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాతవ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయ వ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

### బాలింతలేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియువస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయమునుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీజాతియందు యీ జబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనతసంభవించును.

బుడ్డి రు. 4-0-0

## కేసరికుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు

(ఉపన్యాసం)

# ఉన్మత్తుడు

శ్రీ గాదేపల్లి శంకరముగారు

కష్టపడి సాధించిన స్వాతంత్ర్యం కాలదన్నుకోవడం :

గాఢాంధకార బంధురమైన కాళరాత్రి - మన్నెవో మిన్నెవో తెలియని మాయలోకం గాఢ నిద్రలో కన్ను మూసిందే! ఉచ్ఛ్వాస నిశ్వాసాలైనా వినబడటంలేదు. నోరు తెరచినవారు- అయోమయమైనవారు - అందరెరియని వాట — నేనైనా సజీవుడనై యున్నానో లేనో—ఏది వుంటే - పరప్రభుత్వ దాస్యశృంఖలాలలో చిక్కి రెండు వందల సంవత్సరాలుగా ఇనుప పాదాలక్రింద నలిగి నాశనమై శల్యావశిష్టమైన భరతమాత నీకు కనబడలేదూ? అదిగో అలాగ ఒక్కసారిచూడు—మరి ఆ వోళ్ళ దోపిడి చూడు—ఆ దొంగవేషధారుల ధాటిచూడు—ఆ స్వార్థపరుల సాహసంచూడు—ఆ కులతత్వవాదుల కుతంత్రాలు పరికించిచూడు ఆ బుర్రలేని గొర్రెల మందనీ, ఆ నోరు లేని పశువుల గుంపునీ చూడు—ఆ బక్క చిక్కిన రైతులచూచావా? బ్రతుకు తెరువులేని యువకుల పరికించావా?

కుక్కల గూళ్ళలోను, నక్కల బొరియలలోను నివసిస్తున్నారు. చేతిపనులు నశించిపోయాయి—వృత్తిపనులు వచ్చిపడ్డాయి—చదువు సంధ్యలు సన్నగిల్లి పోయాయి చావుబ్రతుకులు సిద్ధమైనాయి. చింపిరి జుట్టులతో, చినిగి మాసిన దుస్తులతో- నిలువడానికి నీడలేక. వుండటానికి తావులేక - పగలంతా శ్రమపడి పనిచేసినా పొట్టనింపుకోడానికి పట్టెడన్నమేనా లేని గర్భ దరిద్రుల చూస్తే నీకు గర్భనిర్భేదం కావడంలేదూ? నీ గుండెల బ్రద్దలుకావడం లేదూ? దొప్పలతో తెచ్చినకూడును దోసిట్లోనే తింటూ ఏ అరుగు పంచనో- ఏ కాలిబాటనో నిదురించే నిత్యదరిద్రులు నీకు కనబడటంలేదూ? శుచి శుభ్రతలు లేవు-క్రమ పద్ధతులు కానరావు - అసహ్యం అనారోగ్యం - అవిద్య అజ్ఞానం తాండవిస్తున్నాయి- సాంఘిక పరిజ్ఞాన శూన్యత సహకార భావనాలేమి తాళంవేస్తున్నాయి. నవ నాగరికపు దొంగలు తిండిపోతురాయుళ్ళు చూసి ఆనందిస్తున్నారు- అహ్హహ్హహ్హా !

నాటకమాడిన నాయన్యా నాటకం- అవును నాటకమే ప్రపంచ చరిత్రలో మనం ఆడిన నాటకంకంటే గొప్ప నాటకం మరెవ్వరూ ఆడలేదంటే అతిశయోక్తి కాదు - పిండారీ పికారీలో పిడుగులు పడితే సిపాయీల కలహంలో పిసిండ్రీలు రాలాయి- ఝాన్సీరాయమ్మ ఝాంకారానికి సాహేబ్ నానా గారి సహకారం తోడైంది-ఇప్పటి నాయింటంటే నాటించుకున్నారు — ఖడ్గము దొరగారి గొప్పని పేరుతో వంగరాజ్యంలో వందేమాతరం మార్మోగింది మూలించి— దేశంగా వుండుకున్నాం - భాయికి తాళలేకపోతే బ్రిటిష్ బలాయిలో ధాయీ ధాయీ అన్నాముకాదూ? ధాయీధాయీ అంటూనే ధావిధారబరాజ్యాంగ సౌధానికి పునాదిరాళ్ళు వేశారుకాదూ? వివిధ మార్గాల్లో విజృంభించియున్న జాతీయతనం మీద నిప్పుకత్తులు దూసి వనాదలేదూ! రాజారామ్మోహనుడు సహగమనం మీద దెబ్బకొట్టితే - దయానందుడు. పరమత వ్యాపకాన్ని పక్కాడ కొట్టాడు — మతసంరక్షణ కోసం మరణమే స్వీకరించిన మన శ్రద్ధానందునికి శ్రద్ధాంజలి సమర్పించకుండా వుండగలమా? అనిబిసెంటమ్మ అడయారులోనూ రాధాస్వామిగారు దయాల్‌బాగులోను - రమణ మహర్షి తిరువణ్ణామలైలోనూ ఊరికే కూర్చున్నారా? అరవిందుని కలం పాండిచ్చేరినుంచి అగ్నికణాలు కక్కితే - రవీంద్రుని వాఙ్మయం వంగదేశంనుంచి రణబీజాలు నాటింది. లాల్—బాల్—పాల్ ప్రభృతుల కాలంలో—పట్టణ ప్రాంతాల్లోనేవీచిన స్వాతంత్ర్యోద్యమ పిల్లవాయువులు మహాత్ముని సారధ్యంకారణంగా మహోజ్వల ప్రళయ ఝంఝామారుతమై పల్లెపల్లెకూ ప్రాకిపోయింది—మొదటిఢమఢమాలో నమ్మించి స్వామిద్రోహం చేసిన ముండావాళ్ళు — పంజాబులో డయ్యరుచేత పాతకాలు చేయిస్తే ఉప్పు సత్యాగ్రహంలో— ఉగ్రనరసింహ స్వరూపందాల్చి — ధాం ధూం నాటికి—పప్పు సత్యాగ్రహంలో—ప్రభుత్వ భవనాలు, తంతి తపాలాలు - రైలు పట్టాలు పప్పు పప్పు అయినాయి— అహ్హహ్హహ్హా - దాంతో శంఖాలుకొట్టిన. బ్రిటిషు ప్రభుత్వం దాసోహం మహాప్రభో అనవలసి వచ్చింది—హి హి హి. అతిరథులు మహారథులు అయిన సత్యాగ్రహ సమర యోధుల్ని విప్లవోద్యమ వీరుల్ని పొట్ట పెట్టు కొనడమే కాకుండా ఈ మహాసంగ్రామాధి నేతలైన మహాత్ములను కూడా బలిగొన్నదిగా! ఆహా. విచారించ నవసరంలేదు. విచారించి ప్రయోజనంలేదు. ఈ ప్రపంచం క్షణక్షణమూ

పరిణామాన్ని పొందుతూవుండటం—సహజం—మరి- మతి పోయిన ముండావాణ్ణి ఒక్క—మాటమనవిచేసి మరిపోతాను గండాలు గడిచి పిండాలు బయటపడేసరికి బ్రహ్మాండాలు బ్రద్దలయ్యాయి— ఆడపిల్లాకాదు — మగపిల్లాకాదు —కవల పిల్లలు—మీసాల పెళ్ళివారి పందిట్లోను గడ్డాలపెళ్ళివారా పందిట్లోను - సరేకానీయండి — ఇది ఒకందుకు మంచి దేమో ! ఒక్క—మాట అనేక కష్టనష్టాలకు లోనై తుదకు సంపాదించిన ఈ స్వాతంత్ర్యాన్ని— సద్వినియోగపరచి సకల సౌభాగ్యవంతమైన భారతదేశాన్ని సృష్టించ వలసిన బాధ్యత భారత ప్రజలమైన మనది.

యే ఇజములైనా రానీయండి— రాకపోనీయండి— ఇది ప్రజారాజ్యం యుక్తవయస్సు వచ్చిన ప్రతి స్త్రీ పురుషుడికీ తన ప్రతినిధినెన్నుకునే హక్కు—ందికాదూ ! "మీ వోటును విక్రయించి దుర్వినియోగ పరచకండి" కులమత తత్వాలు పాటించకండి అలాగచేస్తే—పర్వత శిఖరాగ్రం చూసినమీరు మళ్ళీ పాతాళలోకంలోకి పడిపోతారు — అవతార పురుషు డెవడైన రావలసి వస్తుంది. జీవితావసరములైన తిండి— బట్ట—ఇల్లు మెదడుకి విజ్ఞానము సమకూర్చితే చాలు "మిట్టపల్లాలు యేకంచెయ్యనక్క—రలేదు" మంచిచెడుగులు కష్టసుఖాలు— ప్రతిభాశాలురు — పరమదుర్మార్గులు — త్యాగ మూర్తులు—స్వార్థమూర్తులు—ఈ ప్రపంచంలో ఉండతగిన వారే యెప్పుడూ వుంటారు—అందరూ యెప్పుడూ ఒక్క— టేకాలేదు- దామాషాయిాని ప్రతి ఒక్క—రికీ సమానప్రతి పత్తిగల జీవన పరిణామాన్ని పెంపొందించటమే తన పరమ లక్ష్యంగా పెట్టుకొని- యే ప్రజా ప్రభుత్వమైనా సహస్ర శక్తులాపని చేయవలసివుంది- ప్రజలు తోడ్పాటు లేనిదే ప్రభుత్వం చేసే యేర్పాటుల ప్రయోజనం వుండదు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను- స్వసుఖానికి— స్వప్రయోజనానికే కాకుండా- మత - కుల - ప్రాంతీయ విభేధాలు, మరచి పోయి త్రికరణ శుద్ధితో - ప్రజానీకమునకంతకీశ్రేయస్సు చేకూర్చే మార్గాలన్వేషించండి - ఆ మార్గాలనుసరించండి- ఆనాడుగాని మనము నిజమైన స్వతంత్రులమని అనుకో లేము - అప్పుడుగాని మనము కష్టపడి సాధించిన స్వాతంత్ర్యము సార్ధకము కాబోదు - "దేశమంటే మట్టి కాదోయి దేశమంటే మనుషులోయ్" అన్నాడు మన గుర జాడ మహాకవి జ్ఞాపకంలేదూ? దేశం బాగుపడాలన్నా - ఉన్నత శిఖరాలందుకోవాలన్నా - దేశప్రజలమైన మనం బాగుపడాలి -

ఏపదిమంది పెద్దలో కోటానుకోట్ల ప్రజల రక్తం పీల్చుకుతినే రోజులు పోయాయి జాగ్రత్త ! - ఈ రాజ్యం కార్మికులది - కర్షకులది - ఈ రాజ్యం రామ రాజ్యం - ప్రజలది - ఏ ఒక్క—రి అబ్బ సొత్తు కాదు - లక్షలాది ప్రాణాలు - వంద సంవత్సరాలుగా(18575to1950) బలి యిస్తే వచ్చిన స్వాతంత్ర్యం - ప్రజలే ప్రభువులు - కుల మత ప్రాంతీయ విభేధాలులేని స్వేచ్ఛాజీవులే - స్వాతంత్ర్య భారత నవరాజ్యాంగ నిర్మాణానికర్తలు సుమా జాగ్రత్త! జై స్వతంత్ర భారత్‌కి జై !! జై స్వాతంత్ర్య సమర యోధులకీ జై ! జై సర్వమానవ సమత్వాభి లాషులకీ జై !



కథానిక :

# "ఆడపిల్ల"

శ్రీ ఆయపిళ్ళ సత్యనారాయణమూర్తి

తొలిసారిగా ఆడపిల్ల పుట్టినట్టు అత్తవారి ఊరినుంచి ఉత్తరం వచ్చింది.

అమ్మమ్మ మొహం చేటంత వెడల్పయ్యింది. "సంచీ జాగ్రత్త చెయ్యరా కూతురు పెళ్ళికి"— అని హుషారిచ్చింది.

నాకు తప్పకండా ఆడపిల్లే కలగాలని ఆమెకు మొదట్నుంచీ కోరిక.

ఆడపిల్ల కలిగితేనేగాని కష్టాలు తెలుసుకురావనీ— అప్పటితోగాని బుద్ధిమంతుడనయి కాస్త జాగ్రత్తగా సంసారాన్ని సాగించనని ఆమె భావం.

అయితే సంసారము చేయడములో విరుద్ధం యేమీ నాలో లేదు. పోతే- నేను స్వయానా మార్కెట్టుకు వెళ్ళడమూ, కానీ—పరక దగ్గరనుండి కూరలు బేరమాడి అవన్నీ భుజంమీద వేసుకురావటమూ నాకు తెలియదు.

కావలసిన దినుసులుగాని, కాయగూరలుగాని— పద్దులు వ్రాసి దుకాణానికి యిచ్చేస్తే, సామానులు సురక్షితంగా యింటికి వచ్చేస్తవి. ఒక అణా-బేడ కూలి కోసం- స్వయంగా మార్కెట్టుకు వెళ్ళడమూ- అనవసరంగా గంటా- గంటన్నర కాలం బేరసారములతో వృధాపరచడమూ నాకు సమ్మతం కావు. ఈ కాస్త వ్యవధియే నా సారస్వత సేవకు అమూల్య అవకాశం.

ఈ విషయంలో శ్రీమతి కూడ నాతో ఏకీభవించినందుకు నేను ధన్యుడననే చెప్పాలి.

"ఏమి బేరములులెస్తురూ— కానీ పరక డబ్బులు కోసం. ఈ కాస్త టైములో కూడ మీరు ఇంటిపట్టున ఉండకపోతే వీలులేదు" అంటుంది.

ఇట్లా సంసారము సాగించడములో నా అజాగ్రతకు శ్రీమతికూడ ఓకారణమని అమ్మమ్మ మా ఇద్దరిపైనా ఏవిధముగానైనా శిక్షవిధించాలనే కోరికతో చాల కాలం నుండి కాచుకునివుంది.

ఆమె దీర్ఘకాలపు వాంఛ కొనసాగింది. ఆమె కోరిక ఫలించింది. అందుకనే ఆమె మొహం పొంగి చాటంత వెడల్పయింది.

చాలసారెకు ప్రయాణం అయి వెళ్ళబోతూవుంటే— అమ్మమ్మ తను చేయించిన "సిగ్గుబిళ్ళ" ఒకటి యిచ్చింది. "ఇది పిల్ల మొలకు కట్టు— పేరు పెట్టేటప్పుడు ఏ అమ్మమ్మను మరిచిపోకు !" అంది.

మా ఇంటి ఆశాజ్యోతి పాపాయిని చూచాను. పసిడి బొమ్మల్లెవున్నది ! నన్ను చూచి చక్కటి నవ్వు నవ్వింది. తొలిసారిగా ఆ చిన్నినోటిలో నా నోరు పెట్టి ముద్దాడాను. నా హృదయం ఉప్పొంగింది. పురిటాలి కళ్ళు ఆనంద జలమయమయినాయి.

"ఎంత బావుందేం !" అన్నాను.

"తీసికోండి !"

"మరి నీకు ?"

"పాపాయికి దాదిగా వచ్చివుంటాను"—

ఇద్దరమూ నవ్వుకొన్నాం.

తిరిగి ఊరికి చేరుకున్నాం. దిష్టితీర్చి అమ్మమ్మ ముని మనుమరాల్ని ఎత్తుకుంది. "పేరు ఏమి పెట్టినార్రా ?" అని ప్రశ్నించింది.

"ప్రస్తుతం పేరు పాపాయి"—

"పాపాయి పేరేమిట్రా ! ఛఛ !.... బాగోలేదు" అంది.

"మాకు పాపాయే ! నీకు నీ యిష్టమొచ్చింది పెట్టి పిలుచుకో"

"బాగున్నదర్రా- ఎవరి ఇష్టమొచ్చినట్లు వాళ్ళు పిలుచుకుంటే- పెళ్ళినాడు మొగుడు యేమని పిలుస్తాడు ?—

"తనిష్ట మొచ్చింది పిలుచుకుంటాడు"—

అమ్మమ్మకు ఓ విధంగా మా మీద మంచి కోపం వచ్చింది.

"మన యింట ఇలాటి అపచారాలు ఎప్పుడూ చేయ లేదండి— సలక్షణంగా పిల్లలకు బాలసారనాడు పేరు పెట్టుకోవడమూ, ముద్దుగా పిలుచుకోవడ మేగాని- ఇలాటి ఓఘాయిత్యం ఎప్పుడూ జరగలేదు— జరుగకూడదు కూడాను. మా అమ్మ పేరు పేరమ్మ. నాపేరు పేరిందేవి. మా అమ్మ నెరుగవుగాని- నూరేళ్ళు బ్రతికింది. పిల్లలకు పెద్దల పేర్లు ఎందుకు పెడతారు. వచ్చే ఏకాదశికి సత్య నారాయణ వ్రతం చేసుకుని పిల్లలకు నిక్షేపంలా పేరు పెట్టండి"— అని లెక్చరిచ్చింది.

ఏమయినా, పాపాయి- పాపాయి పేరుతోనే వుండి పోయింది.

అమ్మమ్మ కోరినట్టుగ పాపాయి పుట్టుకతో నాకేమీ నష్టి విరగలేదు.

ఆఫీసు పని తెరిపి చేసుకుని— ఇంకా కొస్త పెందరాళే యింటికిచేరుకుంటున్నాను పాపాయితో ఆడుకునేందుకు. ఇంక- ఆఫీసుకు టైముకు వెళ్ళనీయకుండా అయస్కాంతం మల్లే పట్టుకునేది పాపాయి.

పాపాయి బహు ముద్దుగా పెరుగుతూంది. ఆడపిల్ల పుట్టిన వలననే అమ్మమ్మ కోరిక మాత్రం చెల్లిందిగాని- ఆమె ఆశించినట్టు కష్టాలేమీ నా మీద విరుచుకుపడలేదు.

కూరలూ, దినుసు సామాన్లకు వెళ్ళే అరువు చీటీలతో పాటు అధికంగా మెడికల్ షాపుకు మరో ఒక నెలవారీ చీటీ వెళ్తూంది పాపాయి చిట్టి మందులకు.

పాపాయి దిన దిన ప్రవర్ధమాన మవుతూనేవున్నది. బంగరడాలు, చిట్టి చిట్టి నడకలు,— లేతనవ్వులు, పాల బుగ్గల ఎరుపులూ- చిలుక పలుకులూ- ఎదిగి - ఎదిగి పాపాయి ఎనిమిది సంవత్సరాల అమ్మాయి అయ్యింది.

ఈ ఎనిమిది సంవత్సరాలకే అమ్మాయి నా నుండి తను వేరు అయ్యింది. అప్పుడే ఆ పసి అమ్మాయి తన సామానులూ అన్నీ వేరు వేరుగా చేసుకుంది. వేరుగా పెట్టి- పెట్టిలో తన బట్టలూ పుస్తకాలూ, తనకో చిట్టి కంచమూ, చిట్టి మంచమూ, ఇట్టా అమ్మాయి, నానుండి- తన తల్లి నుండి అన్నీ వేరు వేరుగా చేసుకున్నది. ఎందుకని?— అమ్మ ప్రక్కమీద తను పడుకొక్కనే జాగాలో క్రొత్తగా వచ్చిన తమ్ముని చూచి- ఏమని అను కుందో ఏమో ఆ లేతహృదయం! దగ్గరకు రావటమే మానుకుంది. ఎల్లప్పుడూ తన చదువూ, ఆటలూ, పాటలూ ఇంకా టైము మిగిలితే తమ్ముని ఆడించటమూ- అమ్మకు ఇక్కడా- అక్కడా పని సాయం చేయటమూ. ఒక్క నిముషమన్నా తీరికలేకపోయింది అమ్మాయికి నావద్దకు వచ్చేందుకు.

ఇదివరలో నేను బజారుకు వెళ్తున్నప్పుడు ఎన్నో పురమాయించేది తనకు అది కావాలని- ఇది కావాలనీ-

ఇప్పుడు నేను పిలిచి అడిగినా— "అబ్బే ఏంకావాలి? ఏమీ అక్కర్లేదూ!" అనేస్తుంది. వెర్రి తల్లి.... ఎంత మార్పు!

బిస్కత్తులు బజారునుండి తెచ్చి- నీవు సగము తీసుకుని తమ్మునికి సగము యియ్యవమ్మా అలాగే అని పుచ్చుకుని రెండువంతులూ తమ్మునికి బుజ్జగించి మేపుతుంది ఎక్కడనుంచి వచ్చిందో ఈ ఆడపిల్లకి ఆజ్ఞానం!

స్కూలులో అన్నీ ఫస్టుమార్కులేనట! మొగకుర్ర వాళ్ళను మించి చదువుతుందట!—

"మీ అమ్మాయి యెడల మీరు చాల శ్రద్ధ తీసుకుంటారండీ. అందుకనే ఫస్టు మార్కులు వస్తాయి" అని టీచర్లు సహితమూ అంటారు.

నిజానికి అమ్మాయి నాదరికేరాదు—

ఎప్పుడయినా దగ్గరకు తీసుకోబోతే సిగ్గుపడిపోతుంది వెర్రి పిల్ల!— నాదగ్గరనే రాత్రిం పగళ్ళు వుండి- నేను ఇంటిదగ్గరవున్న కాలంలో క్షణంకూడ నన్ను విడచి వుండని చిట్టి అమ్మాయి- తన తమ్ముని పుట్టుకతో దూర మయిపోయింది!—

తనకూ, తన మాతా పితలకూ ఆ మగకుర్రవాడే అడ్డుగోడ అనుకున్నదో యేమో!—

ఆమె నాదగ్గరకు రాకపోవడము- భయమో- కోపమో మరేమో అనుకున్నాను.

ఏమీలేదు. ఓనాడు ఆమె క్లాసు మాస్టరు దారిలో కని పించి అమ్మాయి "తలిదండ్రుల"గురించి వ్రాసిన వ్యాసం చూపించారు. క్లాసులో ప్రథమబహుమానం పొందినదట

ముత్యాల కోవల్లె అక్షరాలు- తండ్రిని గురించి ఆమె వ్రాసింది: "తండ్రి దైవము- ప్రత్యక్ష దైవము నిత్య

ముగా మనము చూసు మన తలి దండ్రులే. ఇంటికి పెద్ద తండ్రి, ఇంటి వెన్నెముక తండ్రి. ఇంటి గౌరవము తండ్రి. తండ్రి కష్టించి అర్జనచేస్తే— తల్లి ప్రేమ పూర్వకముగ పొంచి పెడుతుంది".... వ్యాసం చదువుతుంటె కళ్ళు జలమయ మయినాయి. కాగితం మడిచి మేష్టరు చేతికిచ్చాను. నా వెర్రి తల్లికి తండ్రి అంటే అంత గౌరవమా! తండ్రినయి వుండీ ఆమెకు అవన్నీ నేను చేశానా.... పాపిని.... ఈమధ్య ఒక్కనాడూ ఆ చిట్టి అమ్మాయిని హృదయం దగ్గరగానైనా తీసుకు ఎరుగను. ఆ చిన్ని హృదయం ఎంత విశాలమో.... నాతప్పులన్నీ కప్పిపుచ్చి నాకు లేని గౌరవాన్ని తెచ్చిపెట్టి ఏవేవో వ్రాసింది.

దారిలో పోతూనే అమ్మాయికి ఓ సిల్కు పరికిణీ— జాకెట్టు కొని తొందరగా యింటికి వెళ్ళాను. నా చిట్టి పిల్లను దగ్గరగా తీసికోవాలని.

"పాపాయి ఇట్లా రావమ్మా" అన్నాను.

పాప దూరంగా వచ్చి నించుంది.

"వ్యాస రచనలో ఫస్టు ప్రయిజు వచ్చిందట!"

పాప నవ్వి ఊరుకుంది.... నిండుకుండ నా పాపా!

"చెప్పవమ్మా! పోనయితే— ఇదిగో నీకు నేనూ ఓ బహుమానం తెచ్చాను."

పరికిణీ - జాకెట్టు చూపాను. "రా.... ఇట్లా రాతల్లీ! నే తొడిగిస్తాను"

"ఇట్లా యిచ్చేయండి— నేనే తొడుక్కుంటాను"

అమ్మాయి దగ్గరగా రాలేదు ... నా హృదయంలో కోరిక తీరలేదు. గుండె వేగం ఆగలేదు.

గట్టిగా ఆ చిట్టి బట్టలను హృదయానికి నొక్కుగుని మంచముమీద ఎంతసేపో హాయిగా నిద్రించాను....

* * *

అమ్మాయి స్కూలు ఫైనలుకు వెళ్ళింది. "అమ్మాయి మాట ఏం చేశారు?.... వొంటికి పద్నాలుగేళ్ళు వస్తున్నాయి" అని నా బుర్రమీద మొట్టి నా అర్ధాంగిగారు తెలియచేసేవరకూ అమ్మాయి వయస్సు నాకు తెలియనే లేదు.

"పద్నాలుగు ఏళ్ళేకదూ" అన్నాను.

"పద్నాలుగు రాకపోతే పాతికేళ్ళు రావాల్నేం— మీదగ్గరకు నేను నా పద్నాలుగో యేటే వస్త! అప్పటికే నావయస్సు మీరందని మీ వాళ్ళు అనుకోలా? అప్పుడే జిడ్డు వోడక తగిన ప్రయత్నాలు చేయండి. లేకపోతే- ఆడదాన్ని నేను భరించడం కష్టం" ఇట్లా ఆమెగారు నాకు సాధక బాధకాలు విశద పరిచారు.

"స్కూలు ఫైనలు అవనీ!"

"ఈలోగా ప్రయత్నాలు చేయండీ!"

నాకు ఎరికలో ఉన్న నాలుగు సంబంధాలకూ ఉత్తరాలు వ్రాశాను.

నలుగురూ వచ్చి చూసుకున్నారు.

అమ్మాయికి నచ్చిన సంబంధమే వొప్పుకున్నాను.

అమ్మాయి పేరకట్టిన పెళ్ళి భీమా సొమ్ము సరిఅయిన టైములో అందింది.

పెళ్ళి వైభవంగా జరిగిపోయింది.

అమ్మాయి పెళ్ళి జరగటంలో ఇసుమంతయినా నాకు కష్టం జరుగలేదు.

అమ్మాయి వెళ్ళిపోయిన లోటు మట్టుకు నన్ను వేధించింది. అమ్మాయి ఇంట్లో తిరుగుతూవుంటే యిల్లు నిండుగా కనుల పండువుగా వుండేది.

ఒక్క నగ పెట్టుకుంటే లక్ష్మీదేవి అనిపించింది.

లక్ష్మిలేని నా యిల్లు అంధకార మయమయింది, నా హృదయంలో ఈ అజ్ఞాత అంధకారం వారులు గ్రహించలేరు.

నా లక్ష్మి వేరొక ఇల్లు కూడ చూచుకుంది. వేరొక ఇంట్లో నా లక్ష్మి కాపరం చేస్తోంది. వారి యిల్లు నిత్య కల్యాణమై — పచ్చతోరణమై ఉండుగాక—



# మార్గాన్వేషణ

శ్రీ యన్. సుబ్బారావు చౌదరి

ముందుకే
ముందుకే
ఆంధ్రమహిళ
నీ నడక

గతాన్ని చూచి
గర్వించకు
భవిష్యత్తును చూచి
భయపడకు

ఆధునికం
ఆయోమయంమని
అనుమానించకు
నీ దేశం కోసం
నీ సంఘం కోసం
మా మహిళాభ్యుదయం కోసం

ఏదైనా, ఏమైనా
చేసేదుంటే
నడుంకట్టు నీవీనాడు
తెచ్చుకో గుర్తుకు

భారతమాత
బానిస విముక్తికై
ఝాన్సీని, సరోజ
నమ్మలు చేసినత్యాగం
కూపస్త మండూక
ములా క్రుంగి పోతున్న
స్త్రీ సమాజాన్ని

నిద్దుర మేల్కొలుపు
పెట్టు పొలికేక
పురుషునితో పాటు
స్త్రీకి కూడా సమానత్వం
కావాలని, రావాలని

చాటూ స్వార్థంతో
కరుడు కట్టిన సంఘానికి
స్త్రీ అబలకాదు
ఆదిశక్తని

పెకలించు కూకటివేళ్ళతో
సమాజంలో కూడివున్న
కల్మషం, కాఠిన్యం

అప్పుడే అప్పుడే
నీవు నీసంఘం
నీ దేశం, నీ సంసారం
బాగుపడే రోజులు

అప్పుడే అప్పుడే
నీకూ - నీ సంఘానికి
విజ్ఞానం ప్రజాస్వామ్యం
శాంతి అభ్యుదయం

ముందుకే
ముందుకే
ఆంధ్ర మహిళ
నీ నడక





# ఒంటిమిట్ట

శ్రీమతి కె. సుగుణమణి.

"పోయి సేవింపలేకున్న పుణ్యతీర్థమహిమ వినుటయు
సఖిల కల్మషహరంబు."

ఆంధ్రవాఙ్మయములో అపూర్వస్థానము నధిష్టించిన భాగవతమును చదువని ఆంధ్రులుండరు.

"ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహ
నంబులున్
సొమ్ములుగొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరమువాసి,
కాలుచే
సమ్మెటపోటులంబడక సమ్మతితో హరికిచ్చిచెప్పె నీ
బమ్మెరపోతరాజొకడు భాగవతమ్ము జగద్ధితమ్ముగన్"

అని ప్రభువుల ప్రాపునూ, వారిచ్చెడి ధన-కనక-వస్తు-వాహనాదులనూ నిరసించి, ఈసువర్ణాక్షరములను లిఖించీ, ప్రత్యక్షముగా ఆచరించీ చూపిన ఆ పోతన మహాకవిని గూర్చి వినని తెలుగువారూ ఉండరు.

ఈకవి 1400 సం॥ ప్రాంతమువాడు ; జన్మస్థానము ఒంటిమిట్ట యని చెప్పుదురు. ఒంటిమిట్ట 'కడప' పట్నమునకు 14 ½ మైళ్ళ దూరములో నున్నది. మేము ఇటీవల దీనిని దర్శించితిమి. ఒంటిమిట్ట ఒక చిన్న గ్రామము. మనోహరమైన నొక చెరువుగట్టుననున్నది. రాళ్ళసీమయైన రాయలసీమలో చిన్నరత్నాల సీమవలెను, పర్వతారణ్యమయమైన పరిసరములలో (పైనదెల్పిన తటాకము, పచ్చని సేద్యభూములుగలిగి) ఎడారి సీమలో 'ఒయాసిస్సు' వలెను దోచినది.

చెరువు ఒడ్డున కోదండరామాలయము తూర్పు ముఖముగా నున్నది. ప్రవేశ గోపురములు తాడిప్రమాణమున మూడు దిక్కులను మాత్రమున్నవి ; పశ్చిమదిశను ప్రాకారమంటప కుడ్యము మాత్రమున్నది. ప్రధానగోపుర ద్వారమున కొన్ని యినుప గడ్డర్ల బోటు తప్ప, యీ పురాతనాలాయ శిఖరములు మరమ్మతులకు— పురాతన వస్తు సంరక్ష (**Archelogy**) శాఖవారి యొక్కయు, రెలిజియస్ ఎండోమెంటువారి యొక్కయు, ఆంధ్ర ప్రజానీకము యొక్కయు సహకార సాహాయ్యములను కోరుచున్నవి.

ఈ ఆలయమును నిర్మించినవారు శ్రీ విద్యానగర సంస్థానాధీశ్వరులగు శ్రీ సదాశివ దేవరాయలట. వీరు శ్రీ స్వామివారి నిత్యనైవేద్య దీపారాధనలకు, నిత్యోత్సవ- పక్షోత్సవ- బ్రహ్మోత్సవాదులకు, పరిచారకులకు, తక్కిన అన్నివైభవములకు ఏ కొరతయు రాకుండా ఒంటిమిట్ట చతుస్సీమలయందుండెడి భూములనేగాక, పులపత్తూరు ఆదిగాగల 54 గ్రామములను దేవాదాయమునకై యిచ్చినట్లు ఆ యాలయమునగల శాసనమున నున్నది. కాని యీనాడు ఈ మాన్యములేవియు దేవస్థానపు టధీనమునలేవు. ప్రభుత్వమువారు సాలుకు 280 రూ॥ మాత్రము యిచ్చుచున్నారట. అందుచేత ఈ ఆలయ ధర్మకర్తలు, నిర్వాహకులు, ప్రస్తుతము నిత్యపూజానిధి అధ్యక్షులు (శ్రీ పుట్టంరెడ్డి రమణారెడ్డిగారు) విరాళములివ్వగల దాతలకొరకు వెదుకులాడవలసిన శోచనీయ పరిస్థితులేర్పడినవి.

ఆలయ ప్రాకారములో ఉత్తర దిశనొక గది వంటి కట్టడమున్నది. శ్రీ బమ్మెర పోతనామాత్యుడు (భాగవత రచనకుముందు "గంగకున్ జని గ్రుంకులిడి........") ధ్యానమున కుపవిష్టుడైన ప్రదేశమదియేనని చెప్పుదురు. కొన్ని శతాబ్దములకు పూర్వమున్న వారి స్వగృహము యొక్క స్థానమిదియని యిదమిత్థమని ఎవరును చెప్పలేకున్నారు. గర్భాలయముననున్న విగ్రహములు కోదండపాణియగు శ్రీరాముడును, పార్శ్వములందు సీతాలక్ష్మణులును గలిగి నిలువు పెత్తున నున్నవి. "మెరుపు చెంగట నున్న మేఘంబుకైవడి యువిద చెంగటనుండ నొప్పువాడు, వల్లీయుతతమాల వసుమతీజముభంగి బలువిల్లు మోపున బరుగువాడు............" అన్న శ్రీ పోతనామాత్యుని వర్ణనకు సరిగా వర్తించునట్లున్నవి. ఈ విగ్ర

హాముడు మూడును స్వస్థానమునగల పర్వతశిఖరమున “ఏకశిల” నుండియే సాకారముదాల్చిన వగుటచేత ఆ గ్రామమునకు ఏకశిలానగరమని పేరుపెట్టియుండవచ్చు ననిరి. ఉత్సవవిగ్రహములు, ఇంకను శంఖ చక్రాది వస్తుజాలమును, (శ్రీ వావికొలను సుబ్బారావుగారి చేయించి యిచ్చినవి) గర్భాలయ విగ్రహముల కిరుపైపులను పెట్టియుంచిరి. శ్రీ కోదండ రామాలయమున కెదురుగా శ్రీ ఆంజనేయాలయమును, దాని సామ్యమున (తటాకము నుండి ఊరిన నిర్మల జలముతో) నిత్యపుష్కరిణివలె ప్రవహించు చిన్న ప్రవాహమును ఉన్నవి. ఈ సెలయేరు దాటిన వెనుక నొక ఎత్తగు కొండయు, దానిప్రక్కను చిన్న కోనేరును, మండపమును ఉన్నవి. చుట్టునూ చాల దూరమున పర్వతపంక్తియు, మధ్యను ఒంటరిగా నీ మిట్టయును నుండుటచేగాబోలు గ్రామమునకు “ఒంటిమిట్ట” యని మరొక నామధేయము వచ్చియున్నది, ఈ కొండ శిఖరమున శ్రీ వావికొలను సుబ్బారావుగారు నిర్మించుకొన్న చిన్న ఆశ్రమమువంటి కట్టడమున్నది. ఇది కూడా శిథిలావస్థలో ప్రవేశించినది. ఇందుగూర్చుండి శ్రీ సుబ్బారావుగారు, శ్రీమద్రామాయణమును, యథామూలముగా సప్తకాండములు సాంతముగ, నిర్వచన కావ్యముగ, “శ్రీ మదాంధ్ర వాల్మీక రామాయణము”ను పేర తెనుగించిరట. వీరిట్లు తెనుగించి, శ్రీబమ్మెరపోతనామాత్య నిలయమైన ఏకశిలానగరమను ఒంటిమిట్ట యందు వేంచేసిన శ్రీ కోదండరామస్వామివారికి, దశసహస్ర జనసన్నిధిని, నానాగత పండితోత్తమ పూర్వక సమ్మతిని అంకితమిచ్చియుండిరని కోదండరామాలయమున నుంచిన శిలాక్షరములు చెప్పుచున్నవి. శ్రీ సుబ్బారావుగారు, పైనదెల్పిన ఆలయప్రాకారపు ప్రక్కగదిలో నుండియున్న శ్రీ బమ్మెర పోతనామాత్యుని శిలావిగ్రహమును గర్భాలయ ముఖద్వారముననుంపించి, దానిక్రింద “ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి....” యన్న పోతనగారి కృత పద్య రాజమును చెక్కించిరి.

శ్రీ కోదండ రామాలయమునను, ఒంటిమిట్ట పరిసర ప్రాంతమునను తిరుగాడుచున్నప్పుడు మీకేదియైన అవ్యక్తమైన పవిత్రవాతావరణ మొకటి ఉన్నట్లు దోచుచుండును. పోతనామాత్యుని హృదయము భగవదాయత్తమైనప్పుడు అంకురించిన భక్తిపారవశ్యపు తరంగములో లేక ఆ మహామహుని సంకల్పములో ఆ ప్రాంతమున నింకను విహరించుచు, (రేడియో ప్రసారము అవ్యక్తమయ్యును. రేడియోలో సువ్యక్తమగు చందమున) మీ హృదయములను స్పందింపజేయుచున్నట్లు దోచును. కాలగర్భమున లీనమైన మహామహుల పటుతర సంకల్పములన్నియు ఎన్నిశతాబ్దములైనను యిట్లే ప్రజలహృదయములను స్పందింపజేయుచుండునేమో ఎవరు చెప్పగలరు!

“ముద్దులుగారు భాగవతమున్ రచియించుచు
పంచదారలో
నద్దితివేమొగంటము! మహాకవిశేఖర, మధ్య
మధ్య; నట్లద్దక తాటియాకులో నట్టిటుగీచిన
పద్యములందు నీమధురభావములెచ్చటినుండివచ్చె ?”

నని ఒక ప్రఖ్యాత మహాకవి వాక్రుచ్చినట్లు—— పెద్దల భావములు, రచనలు, పుట్టిపెరిగిన ప్రాంతములు, ఇట్టి అపూర్వ సామర్థ్యములుగలవై, (విను వీధిలో విచిత్ర రేడియో బ్రాడ్‌కాష్టింగు స్టేషనులవలె సూక్ష్మతమతరంగముల రూపమున) నా మహామహుల సందేశములను అవిచ్ఛిన్నముగా తరతరముల వారికందించుచు వారి మనస్సులను స్పందింపజేయుచు మార్గదర్శకములగుచుండునేమో ఎట్లునిరూపించగలము!



# పిచ్చిపట్టు

(జర్మను ఏకాంకిక)

రచయిత :
రోడరిక్ బెన్‌డిక్స్

అనువాదం :
డాక్టరు వి. ఎస్. శర్మ

ఇందు వచ్చే పాత్రలు

| | | |
|---|---|---|
| అవుస్‌డోర్ఫ్ | : | భాగ్యవంతుడు ఎమ్మా తండ్రి. |
| కాతరీనా | : | అవుస్‌డోర్ఫ్ భార్య. |
| ఎమ్మా | : | వాళ్ళ కూతురు. |
| ఆల్‌ఫ్రెడ్ | : | ఎమ్మా భర్త. |
| హైన్‌రిచ్ / లిజబెత్ | : | ఆల్‌ఫ్రెడ్ నౌకర్లు. |

———:o:———

## తొలిపరిచయం

జర్మను జాతిలో, ఏపనినైనా చేసిముగిస్తే "దైవకటాక్షంవల్ల అంతా ముగించాం" అని లాంఛన పూర్వకంగా అనడం వాళ్ళ అనాది సాంప్రదాయం. ఈలాంచన వాక్యాన్నే తన నాటకానికి మూలసూత్రంగా తీసుకొని రచయిత ఈకథానికను చక్కగా నడపాడు. ఈవిషయంలో మొట్టమొదట పనిమనుషుల్లో పేచీవచ్చింది. ఆగాలి క్రమేణ ఇంటి యజమాన్లమీద వీచింది....అంతటితో ఆసుడిగాలి ఆగిపోయిందామరి? కూతుర్నీ, అల్లుడ్నీ చూడడానికి వచ్చినవాళ్ళమీదా పడి వాళ్ళను పీల్చి పిప్పిచేసింది. యుద్ధం. హోరా హోరిగా ఆ యుద్ధ జ్వాలలూ కొంతకాలం వాళ్ళ ఇంటినే కప్పివేస్తాయి....ఆ పిచ్చిపట్టుదల ఇంత దారుణ రూపాన్ని పొందాక అందరూ విభ్రాంతులవుతారు. దాన్నే వాళ్ళు ప్రశాంతంగా గుర్తిస్తారు. రాజీకి వస్తారు. యుద్ధం దాంతో సమాప్తి అయిపోతుంది. మానవులు, అందుముఖ్యంగా దంపతులు జీవితంలో వుర్రూతలాడుతూ వాంఛించే సంతోషం, ఆనందం, ఈరాజీ ద్వారా ప్రసాదించబడుతుంది. ఎగుడు దిగుళ్ళు అనేవి అమాంతంగా మటుమాయమైపోతాయి. జీవితం మధురం. దాన్నే అందరూ గ్రహిస్తారు.

ఈ తత్త్వాన్నే ఈరచయిత తన రచనలో అతికోమలత్వంతో అనేక రూపాలతో చిత్రించాడు.

కాత : అబ్బాయి! దాన్ని ఆలా గాభారా పెట్టడం సబబుకాదు. ఏదో అయిపోయింది. ఆ సంగతిని మరచిపోవాలి...... లేకపోతే దాని మనస్సు శాంతంగా వుంటుందా?

ఎమ్మా : అమ్మా! ఆయన్నేమీ అనవద్దు. తప్పంతా నాదే...... కాని యీ బాధను ఎలా దిగమ్రింగుకోనేది?......

కాత : (ఎమ్మాను సమర్థించుతూ) అబ్బాయీ! ఇంతకూ ఏం జరిగింది?...

అవు : మనకెందుకువచ్చింది ఇందులో జోక్యం... అది వాళ్ళ సంగతి...అంతే...

ఆల్ : (కోపంతో) ఎమ్మా మాటనే వినండి... ఊ! దీనికంతా బాధ్యుడ్ని నేనే. ఆ సంగతినే చెప్తాను... దీన్ని విన్నాక తప్పెవరిదో మీకే తెలుస్తుంది...

అవు : మీ తగవులాట మీది. మేమెందుకు అందులో జోక్యం కలుగచేసుకోవాలి? (అంటూ కాఫీని పుచ్చుకొంటాడు)

ఆల్ : ......కాని, కాని, జరిగినదంతా చెప్పకపోతే—

అటుతర్వాతే దీనికంతా బాధ్యులు ఎవరో మీకే తెలుసుకొంటారు.

అవు : అదంతా అవసరమా ?

ఆల్ : లేకపోతే...

అవు : (భోజనం చేస్తూ) ఇందులో ఎవరిదీ తప్పులేదు.

కాత : అతన్నే చెప్పనీయాలి. దాంతో రాజీ కుదుర్తుంది. (వాత్సల్యంతో) ఏం జరిగిందో చెప్పు?

ఆల్ : (వుత్సాహంతో) ఇవ్వాళ ప్రొద్దున్న ఇక్కడికి వచ్చేటప్పుడు నౌకర్లు తగవులాడుకోటం విన్నాను. అంతకూ కారణం హైనిరిచ్ ! పాపం, లిజబెత్ తప్పుని సరిగా చెప్పివేయాలట : "దైవసహాయాన పనినంతా చక్కబెట్టుకొన్నాం" అని. ఆలా అనడానికి లిజబెత్ వొప్పుకొన్నదికాదు. దానిమీద ఇద్దరూ రేగారు. దీన్నంతా విన్నాను. దీన్నే ఎమ్మాకు చెప్పాను. వాళ్ళకు అంత పిచ్చిపట్టు వున్నా, మనకు సరసంగానే వుంటుందని అన్నాను. హైన్రిచ్ లిజబెత్‌ను చెప్పమని సాధించిన మాటనే ఎమ్మాను అడిగాను. ఆమాటను చెప్పి నా కోరిక తీర్చివేయాలని ప్రాధేయపడ్డాను. ఎమ్మా వింటేకదూ ? గడుసుది. తనెందుకు ఆలా చెప్పాలని నన్నే ప్రశ్నించడానికి వచ్చింది. దాంతోనే ఇంత రాద్ధాంతాన్ని చేసింది......

ఎమ్మా : (ఏడుస్తూ) వింటున్నారుకదూ, ఆయన ప్రారంభించిన కథను ? సరసం, సరసం...ఇదేనా సరసం... అంత పట్టుదల ఎందుకోసం ? నా స్వభావాన్ని తెలుసుకోలేదు. తప్పంతా నాదే అని అంటారు. నాన్నా, నీకు నా సంగతి తెలుసుకదూ ? ఇంత పిచ్చిపట్టు నాకు వుందా ? ఆ సంగతినే ఆయనకు చెప్పివేయాలి...

అవు : (నవ్వుతూ) ఇంతేనా... అమ్మాయి నీవు ఆయన కోరికను నెరవేర్చాలి...

కాత : (భర్తవంక వురిమిచూస్తూ) మన అమ్మాయిని ఆలా అనవచ్చునా ? అది మంచిది. దానికి జన్మరీత్యా ఇంత పిచ్చిపట్టుదలలేదు... అమ్మాయి ! నీవిలా ఏడ్వటం మంచిదికాదు... కాని అదంతా మీది. మీరే దానిని సర్దుకొనిపోవాలి...

ఎమ్మా : ఆయన ఆలా అడగవచ్చునామరి ? తన పట్టును నెరవేర్చుకోవాలట... ఏంచెయ్యాలిమరి ?

కాత : అబ్బాయీ ! నీకింత పట్టుదల ఎందుకు ?

ఆల్ : (కోపంతో) మీరు అడ్డురాకూడదు. అది పరిష్కారం కావాలి. అప్పుడే...

అవు : (హాస్యంగా) ఈలోపుగా నా భోజనాన్ని ముగించాలి... అయినా, అమ్మాయి ! నీకాపిచ్చిపట్టు మాత్రం వద్దు...అబ్బాయి ! నీవూ బిడ్డను ఆలా కష్టపెట్టడం మంచిదికాదు. మీరే దాన్ని సర్దుకోవాలి... నా భార్య సంగతి చూడు ! నేనేం అడిగినా అదితప్పక నెరవేరుస్తుంది. ఆమాటనే నేనూ దాన్ని అడిగితే నిరాక్షేపంగా ఆమాటను మక్కికి మక్కిగా అంటుంది.

కాత : (కోపంతో) మీరు అంత మంచివారైనా...ఆలా అంటాననుకొన్నారామరి ?

అవు : ఎందుకు చెప్పకూడదు ?

కాత : (కోపంతో) మనకెందుకు ఈరభస ?

అవు : (ప్రుద్రేకంతో) సరసంకాదు. అది సాంప్రదాయం. దాన్నే అడుగుతున్నాను.

కాత : బాగానేవుంది... ఆలా అడిగితే నేను చెప్తానామరి ?

అవు : (కోపంతో) తప్పక చెప్పాలి. నేను భర్తను. భర్త ఆలా ఆజ్ఞాపిస్తే, భార్య దాన్ని తటపటాయించక నెరవేర్చాలి.

కాత : ఆజ్ఞ మంచిదయితే... తప్పక నెరవేరుస్తాను.. కాని దీన్నిమాత్రం చెప్పను. ఎన్నటికి చెప్పను.

ఆల్ : (నవ్వుతూ) మీరు పెద్దవారు. ఈ తగువు మీకెందుకు వచ్చిందిమరి ?... ఇంకే సంగతినైనా చెప్పుకొందాం...

అవు : (కంపంతో) దీన్నే ముందు పరిష్కరించాలి. అటు తరువాతే ఇతర కబుర్లు...(కాతరీనాను వేడుతూ) కాతరీనా ! మంచిదానివి. ఒకసారి తప్పునిసరిగా అనాలి "దైవసహాయం మూలకంగా ఈబల్లను చక్కగా అమర్చాం" అని.

కాత : (కోపంతో) నేను అనను.

అవు : (కోపంతో) నా మర్యాదను వీళ్ళదగ్గర నిలపాలి.

కాత : ఆమాటను మాత్రం చెప్పను. యెమ్మాటికీ...

అవు : (ఉద్రేకంతో) నీవీలా రాద్ధాంతం చేయడం ఏ మాత్రం సబబుగా లేదు...మన ఇంట్లో అంటున్నాం కదూ ? దాన్నే ఇప్పుడు చెబితే తప్పేముంది ?

కాత : (వుద్రేకంతో) ఆలా ఇక్కడ పట్టుపట్టడమా ?... ఏం బాగాలేదు.

ఎమ్మా : (ఏడుస్తూ) నాన్నను ఆలా బాధపెట్టడం బాగా లేదు

అవు : (ప్రాధేయతతో) కాతరీనా ! ఈ కోరికను తప్పనిసరిగా చెల్లించాలి...

కాత : (పట్టుదలతో) నేను దీన్ని చెల్లించను...

అవు : (తీవ్రకోపంతో) ఆలా జవాబిస్తావా ?...

కాత : జవాబిస్తే ?

అవు : అంత రభసవద్దు...కాని యీ బిడ్డల ముందర ఈ నాటకాన్ని ఆడటమా ? ఆలా చేస్తే వాళ్ళు ఏమను కొంటారో...దాన్ని అర్థం చేసుకోవాలి...

ఆల్ : (లేస్తూ) మీరంత బాధపడనక్కరలేదు. ఏదో అయిపోయింది. దాని విషయం తిరిగి తలంచటం ఎందుకు ?

కాత : (వుద్రేకంతో) లోకం లోకం ! ఈలాగే వుంటుంది. అంతా మగవాళ్ళ పెత్తనం మీదే నడిచిపోవాలని రాద్ధాంతాన్ని చేస్తారు. వారికి కావలసింది ఒకటే. స్త్రీలు కాలాంతకు రాండ్రు. వాళ్ళను అణగి త్రొక్కి-వేయాలనే మగవాళ్ళందరి పట్టు. ఎమ్మా ! మనం వాళ్ళత్రోవను అర్థంచేసుకోవాలి. లేకపోతే నా మన మర్యాద మట్టుమణిగిపోతుంది... మీ ఆయనేకాదు ! మీ నాన్నా ఆయనపక్షం చేరి తన కూతుర్ని ఈలా బాధపెట్టడంచూస్తే...

అవు : (కోపంతో) అంతా నామీదే పెట్టేసేయి. నాదే తప్పు. కూతురూ, అల్లుడూ ఏం అనుకొన్నారో ? ఆ సంగతి నాకెందుకు ? నాపనిని చూచుకొంటే... అదేచాలు. నీవు మాత్రం ఈలా గొంతు చేసుకోవడం మాత్రం సబబుగాలేదు.

కాత : ఆకోపాన్నంతా నామీదేనా చూపెట్టడం ?... ఛేమ్, ఛేమ్...మీరేం రాద్ధాంతం చేసినా సరే... ఆ మాటను మాత్రం అనను. అంతే...

అవు : (విచారంతో) ఈ రాద్ధాంతానికి నేనే కారణం... కాని మన మర్యాదను మర్యాదను, మర్యాదను మన్ను పాలు చేసుకోవాలామరి ?... ఆలా అనటం మర్యాద. దానినిపట్టే మనం ఎటువంటివాళ్ళమో లోకం గుర్తిస్తుంది... అందులో తప్పేమీలేదు. ఒకసారి దాన్ని చెప్పేసాయాలి. అంతే. అంతకన్నా నేను కోరేది మరేంలేదు !

కాత : అదంతా మూర్ఖం. దాన్ని మనం అంతగా నొక్కి-చెప్పటం మంచిదికాదు.

ఎమ్మా ! బాగా అన్నావు. మనం దీనికి ఏమాత్రం ఒప్పుకోకూడదు.

కాత : తప్పక దాన్ని నిరోధించాలి...పురుషులకు బుద్ధి చెప్పాలి...

ఎమ్మా : నిజం. నిజం. మనం స్త్రీలం. మన వాళ్ళకన్నా ధైర్యసాహసాలు మనకూ ఎక్కువగానే వున్నాయి. మనం వాళ్ళు అనుకొన్నట్లు బొమ్మలంకాం. ఆట సామాన్లంకాం.

కాత : బాగా అన్నావు. మనం బానిసలంకాం. మన జన్మహక్కుల్ని నిలువబెట్టుకోవాలి.

ఎమ్మా : (తటపటాయిస్తు) కాని...వాళ్ళ మనోభావాల్ని తెలుసుకోవాలికదూ ?

కాత : అయినా...వాళ్ళూ మన మనోభావాల్ని తెలుసు కోవాలి. వాటిని కొనసాగించటానికీ వాళ్ళు తటపటాయించక ముందుకు రావాలి...

ఎమ్మా : (నవ్వుతూ) అదే. అదే. అందులోనే వుంది జీవిత రహస్యమంతా...

కాత : నిజం, నిజం. చక్కగా జవాబిచ్చావు (ఎమ్మా, కాతరీనా లేస్తారు. ఒకమూలలో నిలుచుండి గుసగుస లాడుకొంటారు). (ఆల్‌ఫ్రెడ్, అవుస్‌డోర్ఫు అదే ప్రకారం ఇంకోమూలకు నడుస్తారు. వుద్రేకంతో

ఏవో అంటారు. ఒకరిమాటను మరొకరు వినుపించు కోరు. తరువాత ఇరుపక్షాల్లో మౌనం.)

అవు : (మెల్లగా ఆల్ ఫ్రెడ్ తో) ఈనాటకమంతా ఏలా నడుస్తున్నదో చూస్తున్నావుకదూ ? తల్లీ కూతురు ఒకటై మనమీదికే దండయాత్ర చేస్తారుకాబోలు

ఆల్ : (మెల్లగా) అంతా విషమించింది... ఇంకేం చేయాలి మరి ?

అవు : (మెల్లగా) ఏంచేయాలా ?... కాని ఈరోజున, భోజనాల దగ్గర... హాయిగా భోజనం చేయాలి .. దాంతో అంతా చక్కబడిపోతుంది...

ఆల్ : కాని .. వాళ్ళ రాద్ధాంతాన్ని చూచి ఈలా వూరకుంటే...

అవు : యుద్ధం ప్రారంభమయిందా... ...ఏ మార్గాన నడుస్తుందో... దాన్ని శాంతంగా తెలుసుకోవాలి... వాళ్ళది పెడసరితనం... కాని...

ఎమ్మా : (మెల్లగా అమ్మతో) ఇలా పరిణమిస్తుందని ఎప్పుడూ అనుకోలేదు... ప్రేమట ! హాస్యమట ! దానికీ హద్దనేది ఒకటి వుండాలికదూ ?...

కాత : (మెల్లగా) కాని... కాని అమ్మాయి ! వాళ్ళను మనం క్షోభపెట్టడం మంచిదామరి ?

ఎమ్మా : (మెల్లగా) దానికి వొప్పుకొంటాను. కాని ఆయన నన్ను అర్థం చేసుకోవాలి... ఇక నాన్న సంగతో ? మనం ఈలా రభస చేస్తూవుంటే ఆయన బాధపడడూమరి ?...

(వీరిద్దరూ వాళ్ళిద్దరి వంకచూస్తూ వుంటారు...)

అవు : (మెల్లగా) వాళ్ళ వైఖర్నిచూస్తే... సంధికే వస్తున్నారు.

ఆల్ : (మెల్లగా) తప్పంతా మనదే... మనం సంధి చేసుకోవాలి.

అవు : (మెల్లగా) కొంచెం బెట్టుసరిగా వున్నట్లు నటిం చాలి... రాజీ చేసుకోడం మంచిదే. కాని మన మర్యాదో ? హాస్యం! లోకమంతా హాస్యరంగం... దాంతో నే పనిని చక్కబెట్టుకోవాలి.

ఆల్ : (మెల్లగా) తప్పక. ఆ వజ్రాయుధాన్నే తప్పని సరిగా వాడాలి. దాంతో అంతా చక్కబడిపోతుంది.

అవు : (స్త్రీలవంక చూస్తూ) ఇదంతా మనకు ఎందుకు వచ్చింది ? రాజీ చేసుకోవడం ఉత్తమోత్తమం... కాని ముందు భోజనాల్ని ముగించాలి. దాంతో బలం వస్తుంది. అప్పుడే అన్నీ చక్కబడిపోతాయి...

(ఇద్దరూ బల్లదగ్గరకు వచ్చి కూర్చుంటారు. భోజనాన్ని ప్రారంభిస్తారు)

ఎమ్మా : (మెల్లగా) వాళ్ళు భోజనం చేస్తున్నారు. మనమూ వెళ్ళొద్దూ ?...

కాత : (మెల్లగా) తప్పక ! భోజనాన్ని పూర్తిచేసు కొన్నాక...

(ఎమ్మా, కాతరీనా వచ్చి కూర్చుంటారు)

ఆల్ : (మందహాసం చేస్తూ ఎమ్మాతో) ఇక ఈ తగవు మనకు వద్దు. నీవు మంచిదానివి. ఆసంగతి నాకు తెలుసు. ఇక సమాధానం చేసుకోవాలి. ఈపాప పరిహారార్థం దీన్ని పుచ్చుకోవాలి.

(బల్ల డ్రాయరులో దాచివుంచిన శాలువాను తీసి ఎమ్మాకు ఇస్తాడు)

ఎమ్మా : (తటపటాయిస్తూ) నాకేంవద్దు...

ఆల్ : (ప్రాధేయపడుతూ) దీన్ని తప్పనిసరిగా తీసు కోవాలి... దాంతో...

ఎమ్మా : (బెట్టుసరిచేస్తూ) నాకేం వద్దు...

ఆల్ : (బతిమాలుకొంటూ) ఈలాచేస్తే వాళ్ళేం అను కొంటారో... తప్పక తీసుకోవాలి.

(ఎమ్మామీద కప్పుతాడు)

ఎమ్మా : (సిగ్గుతో తలవంచుకొంటుంది)

ఆల్ : (నవ్వుతూ) ఇది చాలా బాగావుంది... ఆసంగతినే మరచిపోదాం... తప్పక...

ఎమ్మా : (మందహాసంతో) మీకోరిక "దైవకటాక్షంవల్ల అంతా చక్కబడిపోయింది" అనే కదూ ?

ఆల్ : (సిగ్గుతో మాట్లాడడు.)

(ఇంతలో హైన్ రిచ్ కొత్త వంటకాల్ని తీసుకొని లోపలికి వస్తాడు. వాటిని వారికి వడ్డిస్తాడు)

అవు : (హాయిగా భోజనంచేస్తూ) జీవితరథాన్ని నడపడమంటే అంతసులభసాధ్యమామరి? దోవలో ఎగుడు దిగుళ్ళను అవలీలగా దాటాలి. అలా చేయడంలోనే వీరత్వం అనేది బయటికి వుబికి వుబికి వస్తుంది. అంత వరకు కష్టం. చాలా కష్టం... హమ్మా! సుడిగాలిమటుమాయమైపోతున్నది. ఇక ప్రశాంతం, ప్రశాంతం, తప్పక ప్రశాంతమే...

ఆల్ : (ఎమ్మా వైపు చూస్తూ, చిరునవ్వు నవ్వుతూ) తుఫాను నిలిచిపోయింది. దాంతో ఈనాటకమూ ముగిసిపోయినట్లే...

ఎమ్మా : (ఆనందంతో) ఆ!...దానికోసమే ఇంతసరకూ వుద్రూతలాడుతున్నాం. అది ఇంక మనకువద్దు.

ఆల్ : ఔను. ఎప్పటికీ అదివద్దు.

ఎమ్మా : (వినయంతో) ఇకముందు అలా క్షోభపెట్టవు కదూ ?

అల్ : (మెల్లగా) అలా అనవద్దు...మనకి రభస కలలో కూడావద్దు...

అవు : (భోంచేస్తూనే) భేష్, భేష్. మీరే వీరానవీరులు... రాజీపడింది. అదే మాకూ కావాలసింది.

(లిజబెత్ పండ్లబుట్టను తెచ్చి బల్లమీద పెట్టుతుంది... తటపటాయిస్తూ హైన్‌రిచ్ దగ్గరకు వెళ్ళి నిలుచుంటుంది).

ఆల్ : (బుడ్లను తెరిచి పానీయాల్ని గ్లాసుల్లో నింపుతాడు)

కాత : (భర్తభుజాన్ని తట్టుతూ) అబ్బాయీ మంచివాడే. ఆ ఘట్టాన్ని పూర్తిగా మరిచిపోయాడు. బహుమానాన్ని ఇచ్చాడు. పిల్లవంక ఒకసారి చూడాలి.

అవు : భోజనాన్ని ముగించాలి. తర్వాత ఆసంగతిని ఆలోచిస్తానులే.

కాత : ఆబండిని కొంచెం ఆపాలి. అబ్బాయి దానికిచ్చిన శాలువను చూడాలి...

అవు : (ఎమ్మా శాలువను చూస్తూ) చాలా బాగుంది.

కాత : నాకు అట్టి బహుమానాన్నే ఇయ్యాలి.

అవు : బాగానేవుంది...అంత డబ్బును ఖర్చుపెట్టడమా మరి?

కాత : ఫర్వాలేదు. దాంతోనే మన.....దాన్ని నాకూ కొనాలి.

అవు : కాని...వాళ్ళు రాజీపడ్డారు. ఇక నీవో...ఆ సంగతి తేల్చాలి. అప్పుడే బహుమానం సంగతి ఆలోచిస్తాను.

కాత : (కోపంతో)ఏమిటూ హాస్యం...వాళ్ళు ఏంటేనో...

ఎమ్మా, ఆల్ : (వాళ్ళ వంక చూస్తారు. మాట్లాడరు. తరువాత హైన్‌రిచ్, లిజబెత్తుల్ని రమ్మని పిలుస్తారు. ఇద్దరూవచ్చి వాళ్ళవెనుక నిలువబడ్తారు.)

ఆల్ : హైన్‌రిచ్! మేం రాజీపడ్డాం. మీరిద్దరూ సంధి చేసుకోవాలి... నీ రభస మూలకంగా లిజబెత్ బాధ పడుతున్నది. ఆ సంగతి తెలుసుకోవాలి.

ఎమ్మా : (లిజబెత్ వంక చూస్తూ) హైన్‌రిచ్ అంతబెట్టు సరిగా వున్నా... నీకుమాత్రం ఆ పిచ్చిపట్టువద్దు.

లిజ : (సిగ్గుతో) మీకాగుట్టు ఏలా తెలిసిపోయింది...

ఎమ్మా : (నవ్వుతూ) అసంగతి తెలియదామరి?... ఒకసారి ఆ మాటను అను...ఫరవాలేదులే.

లిజ : (మాట్లాడదు)

అవు : లిజబెత్! నీవు ఆమాటను చెప్పాలి. ఈ రభసకంతా నీవే కారణం కదూ ?

కాత : (కోపంతో) ఆయన అన్నది నిజం. మీవల్లే ఇవ్వాళ ఇంత నాటకం సాగాలసివచ్చింది... ఎందుకువచ్చింది యింత బెట్టుసరి?...అందులో తప్పేంలేదు. అను ఒకసారి. అనాలి దైవకటాక్షం వల్ల అంతాచక్కబడిపోయింది."

(అవుస్‌డోర్ఫు నవ్వుతాడు. అందరూ చప్పట్లు కొట్టారు)

కాత : (ఆశ్చర్యంతో) ఎందుకీలా హాస్యం చేస్తారు?

అవు : (చప్పట్లుకొట్టుతూ) ఎందుకా?... నీవే ఆ మాటను అన్నావు... నాకోరికనూ పూర్తిగా తీర్చివేశావు...

కాత : (నవ్వుతూ) ఆమాటను అన్నానా... పొరపాటు జరిగిపోతుంది... అయితేనేం? ఆయనమాట కొనసాగిపోయింది.

ఆల్ : లిజబెత్! నీవుమాత్రం దాన్ని అంటివా ఈనాటకానికే స్వస్తి చెప్పవచ్చు.

లిజ: (సిగ్గుతో) నేనుమాత్రం అంటానా...

ఎమ్మా: (కోపంతో) అలా అంటే హైన్‌రిచ్ ఏం అనుకొంటాడో పాపం! మీరిద్దరూ మంచివారు. త్వరలో హైన్‌రిచ్‌ను పెండ్లాడుతావుకదూ?

లిజ: (సంతోషంతో) మీ ఆశీర్వచనం వుంటే అదీ దైవకటాక్షం వల్ల...

అందరూ: దాన్ని పూర్తి చెయ్యాలిమరి?

లిజ: దేన్ని?

అం: నీవు ప్రారంభించిన వాక్యాన్ని...

లిజ: (గాభరాపడుతూ) ఏవాక్యాన్ని?

హైన్: (వేడుతూ) దాన్నే...దైవకటాక్షం వల్ల...

లిజ: (తాను చేసిన తప్పును తెలుసుకోంటుంది. అందరి వంకా చూస్తుంది)

అందరు: అలా తటపటాయించటమా...

లిజ: (గంభీరంగా) "బల్లను పూర్తిగా అమర్చాం."
(తలవంచుకొని వెలుపలికి వెళ్ళుతుంది. హైన్‌రిచ్ నవ్వుతూ లిజబెత్ వెంటవెళ్తాడు.)

అందరు: వీళ్ళిద్దరూ గెలిచారు. యుద్ధం దాంతో సమాప్తి అయిపోయింది. ఇక అందరం ఆనందంగా వుండవచ్చు. అదే మనకు కావాలసింది. వాళ్ళకూ అదే కావాలి.

[సమాప్తము]

# బిడ్డలు - తలిదండ్రులు

శ్రీ కె. వెంకట్రామయ్య

[మలాశయ నిగ్రహము - తరువాయి]

ఆహార మిచ్చినపుడెల్ల అతనిని బయటకు దీసికొని పోవుచున్నచో అతడు సహజముగా నెంతకాలమున కొకమారు మల విసర్జనమును చేయుచుండునదియును తెలియగలదు. దానినిబట్టి మనమతని నేయేవేళలందు మలవిసర్జనమునకై బయటకు దీసికొనిపోవలసినదియును నిర్ణయించుకొనవలెను. శిశు దశ యందు రెండుమూడు మారులు మలవిసర్జనమును చేయుట బిడ్డలకు సహజమే యగును. చాలమంది తల్లులీ విషయమును గుర్తింపక తమబిడ్డ కేడాది నిండగనే దినమున కొకమారే మలవిసర్జనమును చేయునలవాటు నేర్పరుప ప్రయత్నింతురు. దీనివలన బిడ్డ యారోగ్యము చెడును.

పశిబిడ్డలకిచ్చెడి శిక్షణ కఠినము కారాదు. మలవిసర్జనకై యతని నెక్కువ కాలము బయట నిలబెట్టుచున్న యెడల అతనికి విసుగును, చిరాకును గలిగి తత్సంబంధమగు నలవాటేర్పడుట కాలస్యమగును. బిడ్డ డెదిగి మల విసర్జనకై కూర్చుండ శక్తిగల వాడైనను, 10—20 నిమిషములకుపైగా కూర్చుండబెట్టరాదు. ఇంకను విసర్జనము గాకున్న లేవదీయుట మంచిది. మల విసర్జనమును చేయలేదని దండించుటయు, తిట్టుటయు పనికిరాదు. ఆందోళనమును జూపకుండుట యవసరము. ఈ విషయమై తల్లి యావేదన పడుటను బిడ్డను గమనించనిచో తానిక విసర్జన కార్యమును సరిగా జరుపనపుడెల్ల ఆమె దృష్టి నాకర్షింపనగునని గ్రహించును.

బిడ్డ యారోగ్యవంతుడై సరియగు నాహారమును దీసికొను చున్నయెడల శిక్షణ నారంభించుట సులభమగును. శిక్షణ నొసగుటలో బిడ్డ కొక్కొక్కప్పుడేవో కొన్ని దురలవాట్లేర్పడుట జరుగవచ్చును. అట్టియెడ ఆ యలవాట్లను మాన్ప ప్రయత్నించుటకన్న నొక క్రొత్త క్రమవిధానము నేర్పరచి దానికి బిడ్డ నలవాటు చేయుట మంచిది.

శిక్షణ నొసగుటలో సాధ్యమగు నంతవరకు దేశకాల పరిస్థితు లొకేరీతిగ నుండునట్లు చూడవలెను. బిడ్డల వ్యక్తిగత భేదములను పాటింపవలెను.

బిడ్డ తనంతటతాను కూర్చుండి మల విసర్జన జేయ గలిగినంతనే అందుల కేర్పాటైన కుర్చీపైగాని, గది యందుగాని అతనిని కూర్చుండబెట్టవలెను. అట్టి సమయమున అతని మనస్సు నాకర్షించు ఇతరములేవియు నచటలేకుండ జూడవలెను. తల్లి అతనిపద్దనే యుండక గది వదలి పోవుట మంచిది. అప్పుడప్పుడు వచ్చి బిడ్డ నామె గమనించిన చాలును. ముఖ్యవిషయమేమన బిడ్డ మలవిసర్జనమునుగూర్చి తా నావేదపడురీతిగ నగుపడరాదు. బిడ్డకు విసుగు కలుగకుండ నొక యాటవస్తువును చేతికిచ్చుట ఎల్లప్పుడును మంచిదని చెప్పజాలము. కారణమేమన ఆటవస్తువు ఆకర్షణ ఎక్కువై అసలు ప్రయత్నమున కాటంకము కలుగవచ్చును. బిడ్డ సరిగా మలవిసర్జనమును చేసినప్పుడెల్ల తల్లి తన సమ్మతిని జూపుచు పొగడుచుండుట మంచిది. కాని ఆ కార్యము నతడు సరిగా జేయనపుడు గమనింపని విధమున నూరకుండవలెను.

ఒక్కొక్కప్పుడు పది పన్నెండు నెలల బిడ్డ నియమిత స్థలమున మలవిసర్జన జేయనిచ్చగింపక మొల గుడ్డను పాడుచేయుచుండును. దీనికి తల్లి యాతురతయే కారణమగుచుండును. కారణమేదైనను బిడ్డ కాగుణము మాన్పవలెనన్న ఒక వారము దినములతనిని నియమిత స్థలమున గూర్చుండబెట్టుటమాని గుడ్డను పాడుజేయనీయవలెను. అది బిడ్డకు కూడ బాధాకరమై నియమిత స్థలమున గూర్చుండ నిచ్చగింపగలడు. ఎదిగిన బిడ్డడు గూడ నేకారణముచేతనైనను ఇట్లే నిగ్రహము జూపకుండిన నిదేవిధానము ననుసరింపవలెను.

సరియగు నాహారము వలనను, దేహాభ్యాసముపలనను మలవిసర్జనము జరుగునట్లు చూచుకొనవలెను. దానికై మందులు సేవించుట మంచిదిగాదు. బిడ్డ డారోగ్యవంతుడై నీరు, పండ్లరసములు, కాయగూరలు, ధాన్యాదులు అందలి ముతక పదార్థములు (Roughage) గల సక్రమాహారమును దీసికొనుచున్న యెడల మలబద్ధమేర్పడుట కెట్టి భౌతిక కారణము నుండజాలదు. బిడ్డ కాళ్ళ నొకటి వెనుక నొకటి ఉదరముపై యామమార్లు మోపి యణచుచుండుటచేతను, దినమున కొకమారు

ఉదరమును పట్టి నెమ్మదిగా నొక్కుచుండుట చేతను, (Massage) మలాశయ చలనమునకు మంచి యభ్యాసము గలుగుచుండును.

## మూత్రాశయ నిగ్రహము. (Bladder Control)

బిడ్డడు దాదాపు పన్నెండు నెలల వాడగుసరికి మూత్రాశయ నిగ్రహమునకు అభ్యాసమునీయ నారంభింప వచ్చును. మొదట కొన్నాళ్ళ వరకును అతడేయే సమయములందు మూత్ర విసర్జన చేయుచుండునో గమనించవలెను. ఇక నటుపై అతని నాయా వేళలందు బయటకు దీసికొనిపోవుటయో ఏర్పాటైన "పాత్ర"పై కూర్చుండ బెట్టుటయో చేయవలెను. దాని వలన మూత్రాశయము నిండినపుడెటులుండునదియు నతడు గమనించుట కలవాటు పడును.

బిడ్డ మూత్రాశయ నిగ్రహమును జూపువరకును క్రింది విధానము ననుసరించుట చాలమంచి నిద్రించుటకు పూర్వమును, నిద్రించిన తరువాతయును. భోజనానంతరమును బిడ్డను మూత్ర విసర్జనకై కూర్చుండబెట్టుచుండవలెను. విసర్జన కార్యము జరుగనిచో, బిడ్డ నేమియు ననక లేవదీయవలెను, ఇక నైదు నిమిషములలో నతడు బట్ట తడుపుట తటస్థించినను ఏమియు ననక ప్రాశాంతముగ బట్టను మార్చవలెనేగాని ఎట్టి భావములను ప్రకటింపరాదు.

పై విధానమునకు బిడ్డ యలవాటైనంతనే ప్రొద్దుటి యాట తర్వాతను మధ్యాహ్నపు క్రీడ యనంతరమును గూడ ఒకటికి గొనిపోవుచుండవలెను. అతడు మూత్ర విసర్జన చేసినను చేయకున్నను వేళకు సరిగా నాకార్యమునకై గొనిపోవుట తప్పకజరుగుచుండవలెను. మరియు నాసమయములందు మూత్ర విసర్జన వేళయైనదని అతనికి తెలుపగల నొక మాటతో సంజ్ఞ చేయవలెను.

పగటిపూటకన్న రాత్రి వేళల మూత్రాశయ నిగ్రహమును జూపుట బిడ్డ కెక్కువ కష్టమగును, అందుచే పగటిపూట నిగ్రహశక్తిని జూపుటకు బిడ్డ డలవాటైన వెనుకనే రాత్రి వేళల నిగ్రహము జూపుట కభ్యాసమీయవలెను. ప్రతి దినమును బిడ్డను రాత్రి పది యగుసరికి మూత్ర విసర్జనమునకు గొనిపోవుచుండవలెను. ఆవేళ చాల ఆలస్యమగుచో నొక గంట ముందుగనే— అనగా తొమ్మిది గంటలకే తీసికొని పోవుచుండవలెను. అంతకు ముందుగనే మూత్ర విసర్జనకు దీసికొని పోరాదు. బిడ్డను లేవదీయు సమయమున మూత్రవిసర్జనకని అతడు తెలిసికొనునట్లు ఒక మాటతో సంజ్ఞ చేయవలెను. అతడా కార్యమును చేయకున్నను. అందులకై యిష్టము జూపకున్నను ఏమియుననక తిరిగి పరుండబెట్టవలెను.

"నేను పెద్దవాడ నగుచున్నా"నని భావించుట బిడ్డ కెంతయు సంతోషకరమైయుండును. అతనికి ముందుగనే షరాయిని తొడుగుచున్న తాను పెద్దవాడనగుచున్నానను భావము గలిగి మూత్రాశయ నిగ్రహమును జూప ప్రయత్నింపవచ్చును. బిడ్డకు పరుగిడెడి వయస్సు వచ్చినపిదప గూడ లంగోటీ కట్టుచుండుట మంచిదికాదు. దాని వలన అతని కాళ్ళ నడుమ ఎడమెక్కువై స్వేచ్ఛాచలనమున కంతరాయము కలుగుచుండును, మరియు బిడ్డడు తానింకను పసివాడనేయని తలంచుచుండును.

బిడ్డకు నిగ్రహ మలవడినంతనే తల్లి తన పని ముగిసెనని తలంపరాదు. అతడలసినను ఉద్రేకపడినను, వాతావరణ పరిస్థితులయందేమైన మార్పులు గలుగుచున్నను నిగ్రహమును గోల్పోవుచుండవచ్చును. అప్పుడు తల్లి యతనిపై చిరాకును, కోపమును జూపరాదు. ధైర్యమును, నమ్మికను జూపుచు అతడు తిరిగి నిగ్రహమును బొంద ప్రయత్నించుటకు ప్రోత్సహింపవలెను. తల్లి చిరాకును, కోపమును జూపునెడ బిడ్డ కొక విధమగు భయముగలిగి, ఆత్మవిశ్వాసము చెడి నిగ్రహమునకై ప్రయత్నింపజాలడు. బిడ్డకు మూత్ర విసర్జన యలవాట్లు దృఢముగ నేర్పడువరకును ఒక క్రమ విధానము (Routine) ననుసరించుటయు, ప్రయత్నమునకు పురికొల్పుటయు, చిన్న చిన్న యవాంతరములను (Mishaps) పాటింపక శాంతము వహించుటయును చాల యవసరము.

(సశేషం)

# ఉరుములు - మెరుములు

శ్రీ వేమరాజు భానుమూర్తి.

ఒకనాడు చూస్తుండగా మబ్బులు కమ్ముకు వచ్చేసాయి. అంతవరకు ఆకాశం స్వచ్ఛంగా నీలంగా, చక్కగావుంది. అంతలో ఒకమూల చిన్న మబ్బుతునక కనపడింది. చూస్తుండగా అదిఆకాశమంతా దట్టంగాకమ్మేసింది ఉరుములు మెరుములు అట్టహాసం ఎక్కువయింది. మట్టి వాసన వేయడం మొదలుపెట్టింది. వర్షం ముంచుకొచ్చింది. ఎక్కడివారు అక్కడ చెల్లాచెదురై పోయారు. దూరాన ఉన్నట్టుండి కనులు మిరుమిట్లు గొలుపుతూ మెరుపు మెరిసి పోయింది. ఆ వెను వెంటనే ఫెళా ఫెళార్భటులు వినిపించాయి.

"ఎక్కడో పిడుగు పడినట్టుంది." అన్నాడు రాజు!"

"అమ్మో నాకు పిడుగు అంటేనే భయం బాబు!" అంది సుభద్ర.

"ఇంతలో మా గుంపులో ఒకమూలనుంచి అర్జునః పార్థివః కిరీటః శ్వేతవాహనః ధనంజయః ... అంటూ అర్జునస్తవం వినిపించింది. ఎవరా అనిచూస్తే అది మా సుబ్బారావు.

"ఏమిటోయ్ అలా ముడుచుకు పోయావు?" అలా అనేటప్పటికి "అదికాదండీ పంతులుగారు! పిడుగులు పడేటప్పుడు ఈ మంత్రం జపిస్తే ఆ



వచ్చే పిడుగు మనమీద పడదని, మనకేమీ భయం అక్కరలేదని మా తాతగారు చాలా సార్లు చెప్పారండీ" అన్నాడు.

"ఏమోనబ్బా! మంత్రాలకి పిడుగులు పడటం మానేస్తాయంటే నాకేమీ నమ్మకంలేదు. ఈ సుబ్బారావు ఎప్పుడూ ఈలాంటి కబుర్లే చెపుతాడండి" అన్నాడు రాజు.

"అయితే సుబ్బారావూ, అర్జునస్త్ర వానికీ పిడుగు పాటుకి సంబంధంఏమిటోయి" అని నిగ్గ తీసింది. సుభద్ర. "అంటే మరినాకు ఈ లాంటి సందేహమే వచ్చినప్పుడు మా తాత నడిగితే ఏమని చెప్పాడంటే, ఇంద్రుడు తనరథం ఎక్కి వెళ్ళుతున్నప్పుడు దాని చీల చక్రాలు చేసే చప్పుడే ఉరుముని, ఈ మెరుపనేది ఇంద్రుని ఆయుధమని, దానిని ఝుళిపించినప్పుడు మెరుపులు కనబడుతాయని, విసిరినప్పుడు పిడుగు పడుతుందనీను!" అన్నాడు సుబ్బారావు.

"ఓహో అలాగా" అన్నాడు రాజు

"ఏమండీ పంతులుగారు, మీ సుబ్బారావు ఏమిటో మహా చెప్పేస్తున్నాడు. మీ సైన్సు కులంవాళ్ళు అన్నింటికీ ఏదో సంజాయిషీ చెప్పుతూవుంటారు, మీరేమంటారు?" అని అడిగింది సుభద్ర. ఉభయుల వాదాలలోని మంచి చెడ్డలను విని తీర్పుచెప్పే జడ్జిలాగ మాట్లాడింది. ఆమె.

"అయితే వినండి మరి. మావాళ్ళ లెక్క ప్రకారంఇదిఇంద్రుని రథమూకాదు. దానిచక్రాలబరిపిడీకాదు. ఆయుధం యొక్క తళతళాకాదు ఏమీ తెలియనిరోజులలో ఆదిమమానవులు పిడుగులుపడ్డా, నడగళ్ళ వాన కురిసినా, దేవతలకు కోపం వచ్చిందని భయపడి పోయేవారు. మెరుపును చూసి దాని రహస్యం ఏమిటో తెలుసు



కోవాలనేకోరిక ఊహ తెలిసినప్పటినుంచి మానవులకు కలుగుతుందని చెప్పడానికి అతి ప్రాచీనమైన ఆధారాలు చాలా వున్నాయి. క్రీస్తుకు పూర్వం 23 శతాబ్దంలోనే ప్లినే అనే ఆయన పిడుగులను గురించి పెద్దచాట భారతం వ్రాశాడు.

"ఆలాగండీ!" అన్నాడు సుబ్బారావు

"అదికూడా సెలవియ్యండీ" అన్నాడు రాజు

"కానీయమన్నట్టు చూసింది"

"ఆయనఏమి వ్రాశాడంటే వినండి"పిడుగులు అనేక రకాలు. పొడి మెరుపుతో వచ్చే వాటి వల్ల నిప్పు పుట్టదు. కాని బ్రహ్మాండంగా ప్రేలుడు శబ్దము వినపడుతుంది. వాగ పిడుగు వల్ల మంటలు బయలుదేరవు. కాని అంతా నల్లగా మాడిపోతుంది. ఇవి కాకుండా ప్రకాశ

మానమైన పిడుగు యింకొకటి యుంది. దీని లక్షణం ఏమిటంటే అది పడినప్పుడు మూతలు మూతలుగా ఉన్నప్పుడే డబ్బాలలో నీళ్ళు ఇగిరి పోతాయి. చడిచప్పుడూ కాకుండా సంచులలో దాచినబంగారం, వెండి, రాగివగైరా, లోహాలన్ని కరిగిపోతాయి, విజ్ఞుల్లో యీపిడుగులను గురించి తెలుసు కోవాలనే కుతుహలము ఉన్నప్పటికీ, సామాన్యులలో మాత్రం కినులు మిరు మిట్లు గొలుపుతూ వుండే పిడుగులు, మెరుములు కనపడి భయము, మూఢ విశ్వాసం కలిగేవి. బెంజిమన్ ఫ్రాంక్లిన్ గాలిపటముతో చేసిన ప్రయోగము వల్ల విద్యుచ్ఛక్తి లక్షణాలను తెలుసుకోవాలనే కుతుహలం మాత్రం విజ్ఞానులకు కలిగింది. ఏమయినప్పటికి మెరుపు రహస్యం మాత్రం అలాగే అభేద్యంగా నిలిచి పోయింది. దాదాపు 150 సంవత్సరాల క్రితం వరకు యిదే పరిస్థితి. ఆ తరువాత మాత్రం కొంతమంది లేబరేటరీలో కృతకంగా మెరుపుని సృష్టించారు.



"ఆఁ!" అన్నారు అంతమంది ఒక్కసారిగా.

"ఇలాంటి జోకో చెపుతారనుకున్నాను లెండి," అంది సుభద్ర.

"అసలు ఈ ఘనుడెవరండీ?" అన్నాడు సుబ్బారావు.

"తొందరపడితే ఎలాగండి విను, ఈ పెద్ద మనిషి పేరు డాక్టరు ఛార్లెస్ స్టీన్‌మెట్స్ అని. ఈయన లెఖ్ఖలలో నిధి. విద్యుచ్ఛక్తి వ్యవహారాలలో పెద్ద పండితుడు. ఒకనాడు ఈయన ఒకఅసిస్టెంటుతోకలిసి వేసవి మకాంకు వెళ్ళు తున్నాడు. అది 1920 సంవత్సరం అగస్టు నెల. సమయం మధ్యాహ్నం. గాలి, వాన ముంచుకు రావడంతో వారు వేళకు అనుకున్న చోటకు వెళ్ళడానికి లేకపోయింది. ఏలాగో చచ్చిచెడి కాసేపటికి అక్కడికి చేరుకునే సరికి పెద్దపిడుగు పడింది అని తెలుసు కున్నాడు.

"అప్పుడు ఏమయిందండీ" అన్నాడు రాజు ఆదుర్దాగా.

"అప్పుడు అక్కడ దృశ్యముంది బాబూ, ఏమని చెప్పమంటారు. చెట్లన్నీ ముక్కలు చెక్కలయి పోయాయి. స్తంభాలుకూలిపోయాయి. తీగలు కరిగి పోయాయి. దీపాలు మాడిపోయాయి. అద్దం బద్దలయింది. యివిఅంతా చూచి మెరుపు లక్షణం ఏమిటో తెలుసుకోవటం కోసం స్టీన్ మెట్స్ గట్టిగా పట్టుదలగా పరిశోధనలు సాగించాడు. ఆచోట అంతాకూడా పత్తేదారువలె అణువణువు శోధించాడు. ఈ పిడుగు మొట్ట మొదట కిటికీకి అడుగు దూరములో వున్న ఒక చెట్టుమీద పడిందని, అక్కడనుంచి కిటికీని బ్రద్దలుకొట్టి, యింట్లోకి దూరి బల్లమీద పడి, చిందులు తొక్కి, రెండవ చివరకుగెంతి అక్కడున్న అద్దాన్ని వెయ్యిముక్కలు చేసేసిందని

తెలుసుకున్నాడు. అంతేకాదు ఈ పగిలిన అద్దం ముక్కలన్నిటినీ పోగుచేసి వాటిని రెండు గాజుపలకల మధ్య పెట్టి వరసగా అతికి చూచాడు. "అవి ఎందుకండీ! ఎక్కడో పిచ్చి వాడులాగున్నాడే!" అన్నాడు సుబ్బారావు.

"అబ్బే అడ్డు సవాళ్ళు వేయకండా వినండి మరి" అని హెచ్చరించింది సుభద్ర.

"ఇవి ఎందుకంటే ఈ పిడుగు పడినప్పుడు వచ్చిన మెరుపు ఏవిధంగా ఏదోవను పారిపోయిందో తెలుసుకోవడానికి చాలా ఉపకరించింది. బహుశా మనకు తెలిసినంతవరకూ మెరుపు పడ్డప్పుడు కలిగే ఫలితాలు తెలియపర్చే మొదటి బొమ్మ యిదే అని చెప్పాలి. యీవిధంగా మెరుపులు గురించిన వైజ్ఞానిక పరిశోధన ప్రారంభమయింది. తాను సాగిస్తున్న పరిశోధనల ఫలితం ఎంత విలువయిందో స్టైన్ మెట్స్‌కు బాగా తెలుసు. ఏటా అనేక వేలమంది పిడుగుదెబ్బలు తింటూవున్నారు. విద్యుచ్ఛక్తి తీగలమీద, పిడుగులుపడటంవల్ల దేశానికికోట్ల కొలది ఆస్తి నష్టమయిపోతున్నదనీ అతనికి తెలుసు. అంచేత పిడుగు స్వరూప స్వభావాలను అవగాహనచేసుకుంటే అందువల్ల అటు ఆస్తి నష్టం, యిటు ప్రాణ నష్టం కలుగకుండా రక్షణోపాయాలు కనిపెట్టవచ్చునని ఆలోచించాడు.

"అబ్బో అబ్బాయిగారిదృష్టి చాలా దూరం పోయిందే!" అని వెంటనే మెచ్చుకున్నాడు సుబ్బారావు.

"అందుకనే చెప్పేదంతా విని మరీమాట్లాడాలి" అన్నాడు రాజు.

"ఇంతకీ అందుకోసం ఆయన ఏమిచేసాడట ?" అంది సుభద్ర.



"అదేగా, నేను చెప్పబోతున్నదీని, వినండి అప్పుడు ఏమయిందంటే మెరుపు సంగతి తెలుసుకోవాలని అనుకున్నవారందరు ఎదుర్కోవలసిన సమస్యను ఈయనా ఎదుర్కోవలసివచ్చింది. మెరుపు సంగతి తెలుసుకోవాలంటే అందుకు మెరుపు కావాలిగా ! అస్తమానూ ఎక్కడినుంచి వస్తుంది? ఒకవేళ వచ్చినా అది ఎపుడు ఎక్కడ లభిస్తుందో ముందుగా ఎలా తెలుస్తుంది? అప్పుడు ఆయన ఆలోచించాడు మనిషి ఎందుకు మెరుపును సృష్టించి దాని లక్షణాలను తెలుసుకొని, ఎందుకు అదుపులో పెట్టలేడు! అని పట్టుదల పట్టాడు. కృత్రిమంగా మెరుపునుసృష్టించడం కోసం ఒక చిన్న యంత్రాన్ని నిర్మించాడు. చివరకు అసలు మెరుపులో అయిదువందలో వంతు శక్తిగల మెరుపును కృత్రిమంగా సృష్టించాడు. ప్రపంచములో మానవుడు కృత్రిమంగా సృష్టించిన తొలి మెరుపు యిదే. ..."

"అయితే మీరు అసలు మెరుపు శక్తి చెప్పకుండా అందులో అయిదువందలోవంతు

(మిగతా 76-వ పేజీలో)

# కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ

## ఆంధ్ర దేశంలోని వివిధ స్వచ్ఛంద సంక్షేమ సంస్థలకు గ్రాంటులు

కేంద్రసంఘ సంక్షేమ సంస్థ ఫిబ్రవరి సమావేశంలో కొన్ని ముఖ్యమైన క్రొత్త గ్రాంటులను చేసింది. దీనివలన ఇదివరకు వలె కేవలం సంస్థల నిర్వాహణకు అవసరమైన ఆర్థిక సహాయం మాత్రమేగాక, వివిధసంస్థల గృహనిర్మాణానికి, మరమ్మతులకు అవసరమైన గ్రాంటులను వాన్, నిమిత్తమైన గ్రాంటులను మంజూరు చేసింది.

ఈ సమావేశంలో ఆంధ్ర దేశానికి సంబంధించినంతవరకు 42 సంస్థలకు మొత్తం రూ॥ 2,07,925 ల సహాయం లభించింది. వీటిలో 18 సంస్థలకు స్త్రీసంక్షేమం నిమిత్తమై [రు.51,550], 10 సంస్థలకు శిశు సంక్షేమ నిమిత్తమై (రు. 32, 500) 14 సంస్థలకు వివిధ సంక్షేమ కార్యక్రమాలకు (రు. 51,125), ఈయబడినవి. ఈ మొత్తం 42సంస్థలలోను 6సంస్థలకు గృహనిర్మాణానికి గాను రు॥ 23, 250లు, 3సంస్థలకు వాన్, నిమిత్తమై రు॥ 40,000 లు, 2 సంస్థలకు నేరస్థుల సంస్కరణకై రు॥ 9, 500 మంజూరు చేయబడింది.

కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ ప్రారంభమైన నాటినుండి నేటివరకు ఆంధ్ర దేశంలో రమారమి 116 సంస్థలకు మొత్తం రు॥ 4, 48, 425 గ్రాంటుగా లభించినవి. వీటిలో స్త్రీ సంక్షేమ నిమిత్తమై 49 సంస్థలకు, శిశుసంక్షేమానికి 24 సంస్థలకు, వివిధ సంక్షేమాలకు 43 సంస్థలకు ఈ గ్రాంటులు ఈయబడినవి.



టెక్స్టైల్ మిల్లుల వంటి భారీ పరిశ్రమలలో పనిచేస్తున్న స్త్రీల సహాయంకోసం కొన్ని శాసనాలు యేర్పడ్డాయి. కాని 'కంట్రాక్టు' పనులలో వున్న కార్మికుల గతి దుర్భరం.

మునిసిపాలిటీలలో

# స్త్రీ కార్మికులు

1953 లో గోదావరి జిల్లాలో వరదబాధిత ప్రాంతాలను, ప్రభుత్వోద్యోగులు ఏర్పాటు చేసిన పునర్నిర్మాణ కార్యక్రమాన్ని చూసి వచ్చిన సంగతి యింకా జ్ఞాపకముంది. మూడు అంతస్తుల ఎత్తుగలగట్లు వరదల ఉధృతానికి కొట్టుకుపోయినవి. అయినప్పటికీ నష్టపడ్డ ప్రాంతాలలో ప్రజలు అచంచల ధైర్యంతో గట్ల నిర్మాణానికి పూనుకొన్నారు. వారిపాటు లిప్పటికీ నా చెవులలో మార్మ్రోగుతునే వున్నాయి. వారిలో సగం మంది స్త్రీలు. ఇసుకబస్తాలు, మన్ను తీసుకుపోయి గట్లు పూడ్చుతున్నారు. ఎంతో ఉత్సాహం, కార్య వ్యగ్రత వారిలో కనిపించినవి. ఈ ఆంధ్ర స్త్రీలు యింతటి మహోత్సాహంతో పని చేశారుకనకనే జిల్లా అంత త్వరితంగా కోలుకొన్నది. నదులగట్లపైన, రోడ్లు గండ్లుపడ్డ చోట మాత్రమేగాక, సమస్తం వరదలలో కొట్టుకు పోయిన గ్రామాలలోకూడా ప్రభుత్వం సమ కూర్చిన సౌకర్యాలతో తమ పూరిళ్ళను, పాకలను తిరిగి నిర్మించుకొంటున్న స్త్రీలను అనేక మందిని చూశాను. ఇంతనష్టపడి, విచారంపాలైనా, గృహాలంకరణ పట్లవారి మోజు తగ్గకపోవడం నాకు ఎంతో సంతోషం కలిగించింది. వాకిళ్ళలోను, గదులలోను చక్కని ముగ్గులు, గడపలకు, ద్వారబంధాలకు పసుపు కుంకుమల బొట్టీలు ఎంత చక్కగా వున్నాయి ? అటువంటి ఉత్సాహమే దేశంలో అందరికీవుండాలి.

పనిపాటులవల్లనే పొట్టపోసుకొనే స్త్రీలలో చాలామంది రోడ్లమరమ్మతు, క్వారీలలో రాళ్ళు పగలకొట్టడం, నదిలోయ ప్రాజెక్టులు, అత్యవసర సహాయ కార్యక్రమాలు వంటి వాటిలో కంట్రాక్టరులచే తాత్కాలికంగా పనులలో నియమించబడినవారు. వారికి పని విషయంలో ఏవిధమైన హామీలేదు. కనీసపు జీవన ప్రమాణం కలుగజేసే శాశ్వతపు పనులుకావు యివి తాత్కాలికంగా కొంత కాలం మాత్రమే లభించే యీపనులవల్ల వీరు ఒకొక్కపుడు విషాదకరమైన పరిస్థితిలోపడుతూ వుంటారు. అయినప్పటికీ వీరు పనిపాటులు కొనసాగిస్తూనే వుంటారు. వీరికి విశ్రాంతికి చోటు, స్నాన సౌకర్యాలు, క్రీషీల సహాయం అరుదు. ఒక ఆసుపత్రి, లేక ఫలహారశాల వుంటె ఎక్కడైన వుండవచ్చు. తాత్కాలికంగా పనులకు నియమించబడేవారికి యిటువంటి సదుపాయాలు చెయ్యడమంటే వ్యయభారంతో కూడినదనే అయినప్పటికీ, యిట్టి మానవావసరాలను పూర్తిగా త్రోసివేయతగదు.

"కనీసం రెండు సంవత్సరాలు పనివుండే సందర్భాలలో పనివారికి వసతి, ఆరోగ్యం, జబ్బుపడితే వైద్య చికిత్స, అంటు వ్యాధులకు గురియైనవారికి ప్రత్యేక వసతి సమ కూర్చాలని కంట్రాక్టరులను నిర్బంధించే నిబంధనలు నిర్ణయించబడాలి" (శ్రీ రాధాకమల్ ముఖర్జీ రచించిన ఇండియన్ వర్కింగ్ క్లాస్- పుట 91)

పద్మిని సేన్‌గుప్త



"కాంట్రాక్టరులు సమకూర్చే కార్మికజనం కంట్రోలు సమస్యను ఒక క్రమవిధానంలో పరిష్కరించడం అవసరం." అనికూడా శ్రీ రాధాకమల్ ముఖర్జీ తన గ్రంథంలో సూచించారు. కాంట్రాక్టు పద్ధతిలో కూడా కొన్ని వృత్తులు కనీసవేతనాల శాసనానికి లోబడివున్నప్పటికీ, సర్దారుల ఎత్తులవల్ల అనేక మంది పనివారు తమకు నిర్ణయించబడిన కనీసపు వేతనాలనుగాని, అధికార పూర్వకంగా లభించవలసిన వేతనాలనుగాని పొందలేక పోతున్నారు. కొన్ని సంవత్సరాల క్రితం ఒక నదీ లోయ ప్రాజెక్టు కార్మికులు తమ ఉద్యోగులు కార్మికుల మజూరీలలో కొంత భాగం మినహాయించుకొంటూ వుంటారని నాతో చెప్పిన సంగతి యింకా జ్ఞాపకం వుంది. కార్మికులకు వారి కష్టార్జితమైన వేతనాలు ముట్టకుండాపోయే యిటువంటి దుర్గతికి స్వస్తి చెప్పడానికై తగు చర్యలు తీసుకొనబడాలి. ప్రభుత్వం, మునిసిపాలిటీలు, జిల్లా బోర్డులు, యితర స్థానిక సంస్థలు పనులను కంట్రాక్టరుల ద్వారా జరిపించుకొనే సందర్భాలలో వారు సమకూర్చే కార్మిక జనం వేతనాది విషయాలలో తనిఖీకి తగు ఏర్పాట్లువుండాలి.

"కేంద్ర ప్రభుత్వానికి, లేదా రాష్ట్రీయ ప్రభుత్వాలకు, లేక స్థానిక సంస్థలకు సంబంధించిన పెద్ద ప్రాజెక్టులు, ఇరిగేషన్ కాలువలు, చెరువులు, గొట్టంబావులు, రోడ్లు, ప్రభుత్వ భవనాలు అన్నీ కంట్రాక్టరుల ద్వారనే నిర్మించబడుతూవుంటాయి. దేశం అంతట మట్టి త్రవ్వే వారిని, రాళ్ళు పగలగొట్టేవారిని, రోడ్లు బాగు చేసేవారిని కంట్రాక్టరులే నియమిస్తు వుంటారు. ప్రభుత్వాలకు, స్థానిక సంస్థలకు టెండరు లందజేసి, పనులు పూర్తిచేసి కొంత లాభం మిగుల్చుకొంటూ వుంటారు. స్థానిక సంస్థలు గాని, ప్రభుత్వంగాని ఈపనులు స్వయంగా

జరిపించవు." (శ్రీ రాధాకమల్ ముఖర్జీ ఇండియన్ వర్కింగ్ క్లాస్-88 పుట)

1951 లో కొన్ని ముఖ్యమైన మునిసిపాలిటీలలో సేకరించిన అంకెలనుబట్టి మొత్తం 1,18,647 మంది పనివారిలో 28,269 మంది అంటే నూరింట 23.7 వంతులు స్త్రీలు అన్నమాట. వీరిలో చాలా మంది కన్సర్వెన్సీ శాఖలోనే పనిచేస్తున్నారు. 1951 లో పెక్కు మునిసిపాలిటీలలో వీరి కనీసపు నెలవారి వేతనం 30 నుంచి 80 రూపాయలవరకు వుంది. ఊడ్పుపని చేసే స్త్రీల వేతనాలుకూడా పురుషుల వేతనాల ప్రమాణంలోనే వున్నాయి. కొన్ని రాష్ట్రాలలోని పరిస్థితిని ఈ క్రిందిపట్టీ సుమారుగా సూచిస్తుంది.*

పెక్కు మునిసిపాలిటీలు కరువు భత్తం యిస్తాయి. ఇవి జీవన వ్యయ ప్రమాణాన్ని సంబంధించి గాక. స్థానిక ప్రభుత్వాలు నిర్ణయించిన ప్రమాణంలో వుంటాయి మునిసిపాలిటీల పనివారికి జీవన పరిస్థితులలో ఒక ప్రమాణమనేది లేదు. ఈపనివారిలో కొందరికి మాత్రమే, ముఖ్యంగా కన్సర్వెన్సీ శాఖవారికి, వసతి సౌకర్యం సమ కూర్చబడుతున్నట్లు తెలుస్తున్నది. పెక్కు సందర్భాలలో యింటి అద్దె అలవెన్సు వుంటుంది. పనివారి సంక్షేమానికి పాటుపడే మునిసిపాలిటీల సంఖ్య తక్కువ. కొన్ని మునిసిపాలిటీలకు సహకార పరపతి సంఘాలున్నాయి.

మునిసిపాలిటీలు పనివారి సంక్షేమంకోసం చేస్తున్నకృషివిషయంలో నేను సేకరించినభోగట్టా యిది: బొంబాయి మునిసిపాలిటీలో ఒకప్రత్యేక సంక్షేమ శాఖవున్నది. ఈ శాఖ 15 సంక్షేమ కేంద్రాలను ఏర్పాటుచేసింది. మునిసిపాలిటీ పనివారికి ఆటపాటలు, వినోదాలు, ఫిలిం ప్రదర్శనలు,విద్యాబోధనమున్నగు సౌకర్యాలను ఈకేంద్రాలు కలిగిస్తాయి. ఒక నర్సరీస్కూలు, ఒక ప్రసూతి కేంద్రంకూడా వున్నాయి. బెంగుళూర్‌లోను మద్రాస్‌లోను ప్రసూతి కేంద్రాలున్నాయి. మద్రాసు కార్పొరేషన్ వయోజనులకోసం పెక్కు రాత్రి పాఠశాలలు నిర్వహిస్తుంది. కార్పొరేషన్ పాఠశాలలోని పేద బాలబాలికలకు మధ్యాహ్నం వేళలలో ఉచితంగా భోజనం పెట్టబడుతుంది. కలకత్తా కార్పొరేషన్‌కూడా రాత్రి పాఠశాలలు నిర్వహిస్తున్నది. మద్రాసు, హైదరాబాద్ బొంబాయి, ఢిల్లీలలో క్రీచీల ఏర్పాటుకూడా వుంది. ఇంచుమించుగా అన్ని మునిసిపాలిటీలలోను ప్రావిడెంటుఫండు సౌకర్యంవుంది.

ఊడ్చే స్త్రీల పిల్లలకోసం క్రీచీలు లేక

| | బేసిక్ జీతం రు. అ. | కరువు భత్తం రు. అ. | యింటి అద్దె రు. అ. | యితర అలవెన్సులు రు. అ. | మొత్తం రు. అ. |
|---|---|---|---|---|---|
| బొంబాయి | 35-0 | 36-0 | 6-0 | ... | 77-0 |
| మద్రాసు | 15-0 | 18-0 | 4-0 పైన | 2-0 | 39-0 |
| ఢిల్లీ | 30-0 | 40-0 | 7-0 పైన | 3-0 | 80-0 |
| లక్నో | 25-0 | 6-4 | 0-8 పైన | 2-0 | 33-12 |
| కలకత్తా | 25-0 | 25-0 | 1-8 పైన | 3-8 | 55-0 |

పోవడం పెక్కు మునిసిపాలిటీలలో ఒక పెద్ద లోపంగావుంది. వీధులు, పాయఖానాలు ఊడ్చ్చడానికి వెళ్ళే స్త్రీల బిడ్డలకు క్రీచీల ఏర్పాటు లేదు.

ప్రయివేటు కట్టడాలలో ఎంత మంది స్త్రీలు సాధారణంగా నియమించబడుతూ వుండేదీ తెలుసుకొనడానికి తగిన భోగట్టాలభించలేదు. కాని అనేకమంది భవన నిర్మాణంలో పాల్గొంటూ వున్నమాట నిజం. భవన నిర్మాణంలో స్త్రీలు వరుసను నిలబడి యిటుకలు అందిస్తువుంటారు. సున్నం, సిమెంటూ తట్టలతో మోసుకువెళ్ళి అందిస్తువుంటారు. అయితే వీరు ఎలా జీవిస్తున్నారు, ఏపరిస్థితిలో కాలం గడుపుతున్నారనే అజమాయిషి బహు తక్కువ. డార్జిలింగ్ వెడితే పెద్దమూటలను నెత్తినపెట్టుకొని, కొండలపైకి పోతూవుండే స్త్రీలను చూడగలం. స్త్రీలు మోయదగిన బరువులను నిర్ణయించే చట్టాలుకూడా వున్నాయి. ఫ్యాక్టరీలు, గనుల చట్టం. స్త్రీలు మోయదగు బరువు ప్రమాణాన్ని నిర్ణయించడానికి ప్రభుత్వాలకు అధికారంవుంది. అయినప్పటికీ ప్రయివేటు భవన నిర్మాణాది కార్యాలలో యీ ప్రమాణం పరిగణించబడడం అరుదు.

పబ్లిక్-వర్క్సు, నది ప్రాజెక్టులలో 1951 లో బీహార్, బొంబాయి, మధ్యప్రదేశ్, మద్రాసు, ఉత్తరప్రదేశ్, హైదరాబాద్, పెప్సు, రాజస్థాన్, తిరువాన్కూర్-కొచ్చిన్ లలో 3,48,303 మంది స్త్రీలు- అంటే మొత్తం కార్మిక జనంలో నూరింట 21.703 వంతున పనిచేస్తున్నారని విదితమాతున్నది. దామోదర్, కారికుడు, తుంగభద్ర, తపతి నది లోయ ప్రాజెక్టులలో 26,469 మంది స్త్రీలు-మొత్తం కార్మికులలో నూరింట 22.275 వంతున పనిచేస్తున్నారు. వీరిలో దాదాపు మూడింట రెండువంతుల మంది స్త్రీలు కంట్రాక్టరులచే నియమించబడినవారు. పబ్లిక్ వర్క్సులో పనులు- నియామకం ఆ కార్యక్రమం తరహాపై ఆధారపడివుంటాయి. అలా అని పనివారి ముఖ్యమైన హక్కులు, సౌకర్యాల విషయంలో ఒక స్థిర ప్రమాణం వుండరాదనడం సమంజసమైనవాదం కానేరదు.

ప్రతీనగరానికీ, పెద్ద పట్టణానికీకూడా ప్రభుత్వమో, మునిసిపాలిటీలో లేక కార్పొరేషనులో నిర్వహించే క్రీచీ ఒకటివుండాలి. పగలంతా పనులకు పోయే స్త్రీలు తమబిడ్డలను యిక్కడ అట్టే పెట్టవచ్చు. రోడ్లప్రక్క క్వారీలలో పనిచేసే స్త్రీలు తమ బిడ్డలను వీపులకు కట్టుకొని, మైళ్ళ కొలదీ నడిచి తమ పనులకు వెళ్ళవలసివుంటుంది. పనిచేస్తున్న సమయంలో ఒక గుడ్డను ఏ చెట్టుకో ఊయలలా కట్టి, సాయంత్రందాకా బిడ్డను దానిలో వుంచుతూవుంటారు. సాయంకాలం తిరిగి బిడ్డలతో తమ యిళ్ళను చేరుకొంటూవుంటారు. ఇది నిజంగా కష్టపరిస్థితే. నగరాలలోను, పెద్ద పట్టణాలలోను క్రీచీలుంటే స్త్రీలు తమ బిడ్డలను అక్కడ వదిలిపెట్టి, ఆ స్త్రీలు నిశ్చింతగా తమ పనులకు పోతూవుండవచ్చు. పనులకు వచ్చే స్త్రీల బిడ్డలను అట్టే పెట్టే సదుపాయం ఏర్పాటు చెయ్యవలసినదిగా కంట్రాక్టరులను కోరాలి. భావిభారత పౌరులు కాగల స్త్రీ కార్మికుల బిడ్డల విషయంలో ఎక్కువ శ్రద్ధ చూపడం చాలా అవసరం.

# నీలగిరిలో నివసించే తోడాలు

శ్రీమతి పి. పారిజాతంనాయుడు

తోడాలు అసలు "ఒల్లు" లని పిలవబడే వారు. మద్రాసు రాష్ట్రంలోని సుందరమైన నీలగిరులపైన వీరు నివసిస్తున్నారు. ప్రతి ఒక పర్వతాగ్రమునా పది గుడిశలకి మించకుండా ఒక గూడెము వుంటుంది. ఈ గూడెములోనే ఒక దేవాలయమూ, పశుశాల వుంటాయి. ఇలాంటి గుంపుని 'ముండ్' అంటారు.

18 అడుగుల పొడుగూ, 9 అడుగుల వెడల్పూ, 10 అడుగుల ఎత్తూ వుండే ప్రతి గుడిశ, సగం చీల్చిన గొట్టం ఆకారంలో వుంటుంది. 3 అడుగుల ఎత్తు, 1½ అడుగుల వెడల్పూ వుండే ద్వారం గుండా వీరు ఈ గుడిశలలో ప్రవేశించడానికీ, బయటికి రావడానికీ ప్రాకవలసివస్తుంది! 4 మొదలు 6 అంగుళాల దళసరిగల పలక ఈద్వారానికి తలుపుగా ఉపయోగిస్తారు. లోనికి గాలి రావడానికి మార్గం కాని, లోపల విభాగాలు కాని ఏమీ ఉండవు— ఈగుడిశలకు! రెండు మూడు అడుగుల ఎత్తుసవుండే మట్టితో కట్టిన వేదికమీద చాపగాని, గేదె చర్మంగాని పరచుకొని నిద్రపోతారు- దీనికి ఎదురుగా ఒక ఎత్తైన ప్రదేశంలో ఇంట్లో వాడుకునే సామాను వుంచుకుంటారు. దీనికి సమీపంలోనే పొయ్యి వుంటుంది. మొత్తం మీద వీరి ఇళ్ళు చాలా బలిష్ఠంగానూ, చూడ ముచ్చటగానూ వుంటాయి!

తోడాలలో పురుషులూ, స్త్రీలూ, పొడవుగానూ, అందంగానూ, బలిష్టంగానూ, ఆరోగ్య



తోడాజవ్వని

వంతమైన పలువరుసతోనూవుంటారు. పురుషులు తీక్ష్ణంగా హుందాతనం వుట్టిపడుతూనూ వుంటారు. బాగా ఒత్తుగా పెరిగిన గడ్డాలూ, ఉంగరాలుతిరిగిన జుట్టూ, వీరి విశిష్టతను చెప్పకుండానేచెప్తాయి. వీరి నుదురు విశాలంగానూ, కనుబొమలు ఒత్తుగా ఒకే రేఖలో వుంటాయి. స్త్రీలు అందంగానూ, చలాకీగానూవుండి విపరీతంగా నవ్వుతారు! వీరు జుట్టుముడి వేయకుండా ఉంగరాలు తిరిగివుంటుంది. గేదెనెయ్యి రాయడం ద్వారా దీనిని అదుపులో పెడతారు. స్త్రీలూ, పురుషులూ ఒకే మాదిరిగా బట్టలు కడతారు. తెల్లటి దట్టమైన పొడుగుపాటి బట్టతో శరీరాన్ని కప్పుకుంటారు. పల్చని ఎరుపు లేక నలుపు అంచుతో 'టోగా' మాదిరిగా, పురుషులైతే మెడదగ్గరనుంచి మోకాళ్ళవరకూ స్త్రీలైతే పాదాలవరకూ దీనిని ధరిస్తారు. ఈరకం ఉడుపులకి 'పుత్తుకుళి' అంటారు. ఈ దుస్తులను వీరు ఎప్పుడూ ఉతికిన పాపానపోరు-- మొత్తం మీద చెప్పాలంటే తోడాలజాతి చాలా అపరిశుభ్రమైన జాతి అని చెప్పాలి. బహుశా ఈ ప్రాంతంలోని చలి వీరు బట్టలు ఉతుక్కోకుండా వుండడానికి కారణమేమో! తోడాలు మాయా, మర్మం ఎరుగని, నిరాడంబరులు; వీరి ఆహార విహారాలు, ఆచార వ్యవహారాలు చాలా సాధారణమైనవి—

సాధారణంగా పురుషులకంటె స్త్రీలే చాలా కష్టించి పనిచేస్తారు. ప్రతిరోజు చాలాభాగం ఆరుబయట బరువైన తెల్లటి బట్టలమీద అలంకారాలతో కుట్టుపని చేస్తూ కాలం గడుపుతారు. వీటినే తరువాత తమ ఉడుపులుగా ధరిస్తారు.

వ్యవసాయపు సమయం వచ్చేదాకా పురుషులు ఏ పనీ లేకుండానే సంతృప్తిచెంది, తమ బర్రెలను మేపు కుటూవుంటాంరు.

తోడాలు శాఖాహారాన్ని నియమంగా పాటిస్తారు. కాఫీ, రొట్టె తినడం ఈమధ్యనే అలవాటు చేసుకున్నారు. వరి అన్నం, కూరగాయలు వీరి ముఖ్యాహారాలు. పెరుగు, మజ్జిగ అధికంగా సేవిస్తారు.

ఎంబ్రాయిడరీ, కుట్టుపనులలో తోడా స్త్రీలు ఆరితేరినవారు. సులువు పద్ధతులు, క్రొత్త నమూనాలు వీరికి నేర్పినట్లయితే వీరి ద్వారా బ్రహ్మాండమైన పని చేయించవచ్చును క్లిష్టమైన నమూనాలను అతి చాకచక్యంతో అల్లడానికి తోడా స్త్రీల వేళ్ళు అతి చురుకుగా పనిచేస్తాయి. వీరు తయారుచేసిన మేజాగుడ్డలు, దుప్పట్లు, తలగడాగలేబులు మొదలైన వాటికి బజారులో ఎంతైనా గిరాకీవుంది. ఆయా చేతిపనులు క్రమపద్ధతులలో నిర్వహించినట్లయితే, వారెంతైనా దీని ద్వారా లాభం పొందుతారు.

మద్రాసురాష్ట్ర స్త్రీ సంక్షేమశాఖద్వారా మేము ఈ తోడాలతో పనిచేసినప్పుడు వీరి విజ్ఞానాభివృద్ధికి కృషిచేయడమేకాకుండా, లేసు పని, జల్తారుపని, కుట్టుపని, నూలు వడకడం నేర్పాము— వీటిని నేర్చుకొనడంలో తోడాస్త్రీలు ఎంతో కుతూహలాన్ని చూపారు- ఆయా పనులలో పైనుంచి వచ్చే పురమాయింపుల ద్వారా నెలకు దాదాపు మనిషి ఒకటికి 20 రూ॥ పైగా వీరు సంపాదించేవారు— ఈ మొత్తం ఆప్రాంతాలలో పెద్ద సంపాదన అనే చెప్పాలి!

వీళ్ళలో అక్షరాస్యతకూడా వ్యాప్తి చెందింది. చదవడం, వ్రాయడం నేర్చుకునేటప్పుడు వారి ముఖాలలో ఎంతో ఉత్సాహం కనబడింది.

తమిళం ధారాళంగా చదవనూ, వ్రాయనూ నేర్చుకున్నారు. స్త్రీలు నూలు వడకడంలో వేగం, నేర్పూ అలవరచుకున్నారు. వాళ్ళు నివసించే గుడిశల మాదిరిగానే ఒక దానిని నిర్మించి దానిలో ఒక "సామాజిక కేంద్రం" నెలకొల్పబడింది. కాని చాలా భాగం కార్య కలాపాలు ఆరుబయటనే జరిగేవి. తోడా స్త్రీలు ఇక్కడి పరికరాలు, పుస్తకాలు చాలా జాగ్రత్తగా కాపాడేవారు. ఈ పద్ధతులవలన తోడా స్త్రీలలో శుచీ, శుభ్రమూ, వ్యాపించ డమే కాకుండా, పొగాకు నమలడం, తలకి గేదెనెయ్యి రాసుకోవడం మానేశారు. ప్రతిదినం స్నానం చేయడం, ఆరోగ్య పరీక్షకీ, రక్త పరీక్షకీ, ప్రసూతి సంబంధమైన చికిత్సలకీ వీరు ఆస్పత్రులకి వెళ్ళడం నేర్చుకున్నారు—

తోడా స్త్రీలు ప్రప్రథమంగా 1950 సంవత్సరం నవంబర్ నెలలో జరిగిన ఒక ప్రదర్శనంలో పాల్గొని, ఇతర ప్రజలతో స్వేచ్ఛగా తిరగడమే కాకుండా 200 రూ॥ ఖరీదైన పారితోషికాన్నికూడా పొందారు. ఈ సమయం లోనే సంక్షేమ కార్యకర్తలనుండి నేర్చుకున్న కుమ్మి, జానపద నృత్యాలని ప్రదర్శించారు. ఈ ప్రదర్శనం ఎంతో విజయవంతమైంది. తరువాత సంవత్సరంలో తోడా స్త్రీలలో అన్ని రంగాలలోనూ విశేష ప్రతిభను ప్రకటించిన స్త్రీకి బొంబాయి గవర్నరుచే రజత పాత్ర బహూకరింపబడింది.

తోడా స్త్రీల కోసం వారిలో పనిచేయడం మాకు ఎంతో ఉత్సాహాన్ని ఇచ్చింది. స్త్రీ పురుషులు వృద్ధులతోసహా ఎంతో సుహృద్భావంతో మాతో సహకరించారు. వారు అతి సామాన్యంగానూ, అమాయకులు గానూ వుంటారు. కొత్తగా వచ్చిన వారితో ఎంతో ఆప్యాయంగా స్నేహం చేస్తారు. స్త్రీలు దుస్తులన్నా, ఆభరణాలన్నా ఎంతో ఇష్టపడతారు. చూడ్డానికి వచ్చినవారి దగ్గరనుంచి బంగారు గాజులు, నగలూ అడిగి తీసుకుని ముచ్చటగా అలంకరించుకుంటారు— ఫొటో తీయించుకోడమంటేకూడా వారికిష్టం కాని ఆఖరున మాత్రం కొంత ముడుపు వారికి చెల్లించవలసివుంటుంది- కెమేరాముందు నిలుచున్నందుకు ! వీరి సంగీతం దీర్ఘాలుతీస్తూ చదివే మంత్రాలలా వుంటుంది మనకి! వీళ్ళని పాటలు పాడమని అడిగితే అందరూ గుండ్రంగా కూర్చొని తలలు ముందుకి వంచి ఒక ముక్కు రంధ్రాన్ని మూసి, విసుగెత్తేలా దీర్ఘాలుతీస్తారు— ముక్కుతోనే ; ఇదే వీరికి సంగీతం ! వారంతట వారికి వేరే ఒక భాష ఉన్నా- దానికి లిపిలేదు. వీరి భాషకీ 'హీబ్రూ' కీ సంబంధంవున్నట్టు చెప్పినా, దీని మూలం జాయిష్ భాషేమో ననిపిస్తుంది.

విద్యావిషయికంగా తోడాలు చాలా వెనుకబడి వున్నారు. తోడా పిల్లలకు ప్రత్యేక పాఠశాల "సర్కట్జీముండ్" అనే ప్రదేశంలో 1952 సంవత్సరంలో ప్రారంభింప బడింది. ఇది వారి చరిత్రలో చాల ప్రసిద్ధమైనదనే చెప్పాలి- ఇక్కడనే ఒక వైద్యశాలకూడా స్థాపింపబడింది. తోడాలు నివసించే ప్రదేశాలకి కేంద్రంలో ఇది వుండటంచేత అందరికీ అందుబాటులోవుంది. తోడాలలో చాలమంది శరీరపరీక్షకీ చికిత్సకీ, ఈ వైద్యశాలకి వస్తూంటారు. తమ పిల్లల్ని కూడా ఈ పాఠశాలకి పంపడానికి సదుపాయంగా వుంది.

తోడాల ప్రధాన సమస్య ఆర్థిక సమస్య. మద్రాస్ ప్రభుత్వంవారు వీరికి భూములు కేటాయించి, వీరిని వ్యవసాయదారులుగా మార్చడానికి ప్రయత్నిస్తున్నారు; కాని ఈ ప్రయత్నం

పూర్తిగా సఫల మయినదని చెప్పలేము. స్వతహాగా తోడాలు పశువులమందలను పెంచుకుని పాడిపరిశ్రమ ద్వారా జీవించడానికి అలవాటు పడ్డవారు. పాడిపరిశ్రమతో పోల్చి చూస్తే వ్యవసాయం ఉన్నతస్థాయికి చెందిన నాగరికవృత్తి అని చెప్పడం సరియైనది కాదు. వాస్తవంగా మానవ చరిత్ర కారుల దృష్టిలో పశువుల పెంపకం, వ్యవసాయంనించే వృద్ధిపొందిందని చెప్తారు——

తరతరాలుగా వస్తున్న ఈ వృత్తిని వదిలిపెట్టడానికి తోడాలు ఇష్టపడటం లేదుకనక వారిని వ్యవసాయదారులుగా మార్చే ప్రయత్నం విరమించడమే మంచిది. ఇటీవల నీలగిరులలో వీరికి కేటాయించిన భూమిని వీరు అదే ప్రదేశములో నివసిస్తూన్న 'బడగా'లకు కవులుకి ఇచ్చేయడానికి ప్రధానకారణం - వ్యవసాయం యెడలవీరి విముఖతని నిరూపిస్తుంది. కాని, వారంతటవారే వ్యవసాయదారులు కావడానికి ఇష్టపడితే తప్పక వీరికి వ్యవసాయపు పరికరాలు, మున్నగునవి సరాఫరాచేయవచ్చు. పాడిపరిశ్రమ, పశువర్ధకప్రణాళికల ద్వారాను, సహకారసంఘాల ద్వారాను వృద్ధిచేసి వారి ఆర్థిక పరిస్థితిని బాగుచేయాలి. తోడాలవంటి వెనుకబడ్డ జాతివారు మనదేశం నలుమూలలా యెంతో మందివున్నారు. వారిపురోభివృద్ధికి కృషిచేయడం మన నిర్మాణ కార్యక్రమంలో ముఖ్యాంశంగా గుర్తించాలి.

---

# కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ

## క్రొత్త ప్రణాళికలోని ముఖ్యాంశాలు

"......విద్యాపీఠ్" అన్న అక్షరాలతో పాతపడిపోయిన బోర్డుని దాదాపు రెండు దశాబ్దాలనుంచి చూస్తున్నాను బీహారులోని ఆ మారుమూల గ్రామంలో! ఆ విద్యాపీఠ నిర్వాహకులు ఉత్సాహవంతులైన యువకులు. తరతరాలుగావస్తూన్న సంఘసేవలో వారు నిమగ్నులై యున్నారు.

ఆ పల్లెటూరిలో జనానికి ఆచిన్న సంస్థచే నడుపబడే వైద్యాలయం ఉచితంగా మందుల నిస్తుంది. కాని దూరపు గ్రామాలలోవున్న ప్రజలకి ఈసౌకర్యం లభించేదెట్లా?

ఈవిషయంలో విద్యాపీఠ నిర్వాహకులు తమకేమో కాదన్నట్లు వూరుకోలేదు; అయినా దూరప్రాంతాలకి మందులు సరఫరాచేయడానికి కావలసిన మోటారు వ్యానుకొనే తాహతు వారికి లేకపోయింది. ఏం చేయాలో ఏమీ పాలుపోలేదువారికి! చూడండి తమాషా!—మర్నాడే వార్తాపత్రికల్లో "సంచారవైద్య సహాయకదళాలకి మోటారు వ్యానులు కొనేటందుకు కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ కొన్నినియమాలకు లోబడి ఆర్థిక సహాయంచేయడానికి నిర్ణయించినది" అన్న ప్రకటన చూడగానే ఆ విద్యాపీఠ నిర్వాహకుల సంతోషానికి మేరలేకపోయింది! త్వరలోనే వీరిసంచారక వైద్యదళానికి ధనసహాయంలభిస్తుంది. వ్యానుకూడా కొంటారు. దూరాలనున్న గ్రామవాసులకి వైద్యసదుపాయాలు కల్పించడానికి ఇంతకన్నా కావలసిందేమిటి వీరికి?



ఇది ఇలావుండగా నానాటికీ పెరిగిపోతూన్న వారి విద్యాశాఖలో విద్యార్థులకు వృత్తి విద్యా సౌకర్యాలు కల్పించడం వీరికి కష్టమౌతూంది.

ప్రస్తుతం ఒక నలభైమంది విద్యార్థులు పనిచేయడానికి మాత్రమే ఒక శాలవుంది. కాని తక్కిన విద్యార్థులు (వీరిలో ఎక్కువమంది బాలికలు!) కూర్చుని పనిచేయడానికి తగిన వసతి ఏదీ? ఏడాదిపొడుగునా ఎదురయే ధనాభావమే ఈపనులు నిర్వహించడానికి ఆటంకమవుతూంది! కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ ఇలాంటివాటికి ధనసహాయం చేయదని వారికి తెలుసు. వాళ్ళు ధనసహాయంకోసం చేయవలసిన ప్రయత్నాలన్నీ చేశారు. ఒక శాల నిర్మించడానికి కావలసిన డబ్బు ఇస్తానని ఆ గ్రామంలో ఒక పెద్దమనిషి మాట ఇచ్చినా, ఆఖరికి తన వాగ్దానాన్ని నిలబెట్టుకోలేదు! విద్యాపీఠ నిర్వాహకులు ఎంతో నిరుత్సాహపడ్డారు. ఇంక కర్తవ్యం?—ఇంతలోకే సంతోషకరమైన వార్తవచ్చింది—ఇప్పుడు కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థవారు కొన్ని సందర్భాలలో నిజంగా అర్హమైన సంస్థలకి భవన నిర్మాణానికికూడా ధనసహాయం చేస్తారు! ఎంత మంచి వార్త! వాళ్ళకష్టాలు గట్టెక్కినట్టే, ఈసమస్య తీరినట్టే!



* * *

"ధైర్యంగా ఎదుర్కొనేవాళ్ళని కష్టాలేమీ చేయలేవు-" అని మన పెద్దలు చెప్తూంటారు. మాతా శిశు సంరక్షణ కేంద్రం లేనంతసేపూ సుశిక్షితులైన 'నర్సు'ల అవసరం వారికి లేకపోయింది — కాని ఇప్పుడో దీని

## కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ

ఆవశ్యకత ఎంతగానోవుంది — ఈకేంద్రంలో శిక్షణ పొందిన మంత్రసానికోసమూ, నర్సుకోసమూ ఎంతగానో అన్వేషించారు — కాని లాభంలేకపోయింది !



ఈసంస్థ నిర్వాహకులు తమ రాష్ట్రపు ఆరోగ్యశాఖ డైరక్టరును కలసికొని తమ కేంద్రంలో పనిచేయడానికి సిద్ధంగావున్న స్త్రీలకు శిక్షణ ఇచ్చే ఏర్పాటు చేయవలసిందిగా కోరేరు ; కాని దీనికే కావలసినధనమో ? ఇక్కడే కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ తక్షణం వీరిని ఆదుకొని కొందరు స్త్రీలను శిక్షణ నిమిత్తం పంపడానికీ, ఈలోపుగా శిక్షితులైన నర్సులను నియమించడానికీ, తగిన ధనసహాయం చేయడానికి ముందుకు వచ్చింది ! విద్యాపీఠం కన్నకలలు నిజమవుతూన్నాయి కదూ !

ఇక వృత్తి విద్యల విషయం చూస్తే ఈవిద్యాపీఠంలో — రంగులువేయడం, అచ్చుపని, ఆటబొమ్మలు, చాపలు అల్లడం, నేతపని, కుట్టుపని — ఒకటేమిటి ఎన్నో నిర్వహింపబడుతున్నాయి ఇవన్నీ తయారుచేసే పిల్లలకి తగినంత శిక్షణ, పర్యవేక్షణావుంటే బజారులో అమ్మేవస్తువులతో పోటీకి సందేహంలేకుండా ఇవి నిలబడతాయి. దురదృష్టవశాత్తు ఈ రెండేళ్ళనుంచీ తయారయినవస్తువులన్నీ విద్యాపీఠంలోనే ఒకగదిలో ప్రదర్శనార్థం వుంచినవాటిలా వుండిపోయాయి ! వీటిని అమ్మడానికి తగిన అవకాశాలుగాని, వీటిని తయారుచేయడానికి కావలసిన ముడివస్తువులను కొనే ఆర్థికస్తోమతగాని వీరికి లేకపోయింది. ప్రోత్సాహం లేకుండా నిరుత్సాహంతోవున్న సమయంలో ఒకనాటి ఉదయం "చేతిపనులూ, కుటీరపరిశ్రమలూ నిర్వహిస్తున్న కేంద్రాలకి, అఖిలభారత చేతిపనుల సంస్థ అధ్యక్షులు కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ వారిద్వారా తగు సహాయాన్ని చేయగలరనే వార్త ఆల్ ఇండియా రేడియోవారు ప్రసారంచేశారు.



ఇప్పుడు తమ విద్యార్థులకు కావలసిన ముడిపదార్థాలు కొనడానికీ, బజారులో తమ వస్తువులు ఇతర వస్తువులతో పోటీకి నిలవడానికీ తగిన మేలిరకపు వస్తువులను ఉత్పత్తిచేయడానికీ విద్యాపీఠానికి తగుసహాయం లభించగలదు ! ఇక్కడ తయారయిన వస్తువులు చేతిపనుల సంస్థవారి వివిధ విక్రయశాలల ద్వారా విక్రయించడానికి తగినసదుపాయంకూడా లభించింది.——విద్యాపీఠానికి చుట్టుప్రక్కల కాపురంవున్న మధ్యతరగతి స్త్రీలు విరామ సమయంలో చేతిపనుల కేంద్రంలో పనిచేసి తమ రాబడిని వృద్ధిచేసుకుంటారు. విద్యాపీఠానికీ, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థకీ వీరు ఎంతగానో ఋణబడివున్నారు !

* * *

దక్షిణభారతంలో 'లేమల్లె' అనే గ్రామం వుంది. అంటే మల్లెమొగ్గ అని అర్థం ఆవూరుపేరు ! ఎంత చక్కటిపేరు ! సంఘసేవాశక్తులైన యువకులు అర్ధదశాబ్దం క్రితం ఇక్కడ ఒక 'గ్రామ సేవాసమితి'ని స్థాపించారు.

ఇప్పుడు ఈసమితివారు తమ సేవాకార్యక్రమాన్ని విస్తృతపరచి పిల్లలకోసం ఒక 'క్రెచ్'ని ప్రారంభించడానికి నిశ్చయించుకున్నారు.

వాళ్ళుచేసినదేమంటే - దీనికోసం ప్రత్యేకింపబడిన ఒక దరఖాస్తు ఫారాన్ని పూర్తిచేసి ఆంధ్ర రాష్ట్ర సాంఘిక సంక్షేమ సంస్థ అధ్యక్షురాలికి పంపించారు — వారు ఈదరఖాస్తుని పరీక్షించి ; ఈసమితికి ధనసహాయం చేయవలసినదిగా సిఫారసుచేస్తూ కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థకి ఈ దరఖాస్తుని పంపించారు — కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థవారు దీనిని పరిశీలించి, లేమల్లెసమితికి తామిచ్చే గ్రాంటుతో సరితూగే మొత్తాన్ని వసూలు చేయగలిగే

# కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ

పక్షంలో తదనుగుణ్యంగా సొమ్ముమంజూరు చేయబడిందని తెలియపరిచారు - కాని, వచ్చిన చిక్కేమిటంటే" తదనుగుణంగా సొమ్మును వసూలుచేయడం" అన్నచోటే ! ఈ సమితివారుకూడా కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థవారు మంజూరుచేసిన సొమ్ముకి సరిపోయే మొత్తాన్ని వసూలు చేయాలి !



మరి ! ! ఇక్కడకూడా స్వార్థరహితంగా పనిచేసే స్వచ్ఛంద సంఘ సేవకుల సహాయార్థం కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థవారు "కమ్యూనిటీ చెస్ట్"లను స్థాపించి ఎంతగానో సహాయపడుతున్నారు. గ్రామ స్వచ్ఛంద సేవకులకు ఇది ఎంతగానో ప్రోత్సాహం ఇచ్చాయి. కాని ఈ కమ్యూనిటీ చెస్ట్‌ల ఉద్దేశ్యం గ్రామీణ ప్రజలకి బోధపడేటట్టు చేయాలి ! అప్పుడే ప్రజలు హృదయపూర్వకంగా వీటితో సహకరిస్తారు.— సామూహికంగా చందాలూ విరాళాలు ఇవ్వడం భారత గ్రామవాసులకి కొత్తేమీకాదు ! కాని తరతరాలుగా వస్తూన్న ఈ మహత్కార్యాలని ఆధునికపద్ధతులతో సమన్వయ పరచటమే 'కమ్యూనిటీ చెస్ట్'లయొక్క అంతరార్థం !

"ఐచ్ఛికంగా ఇచ్చిన విరాళాలని అందరి ఉపయోగం కోసం నిధిగా ఏర్పరచడమే" ఈ 'కమ్యూనిటీ చెస్ట్' ఉద్దేశ్యం అని ఈసమితివారు అందరికీ తెలియజెప్పారు ఆ ప్రాంతంలోవున్న స్వచ్ఛంద సంస్థలన్నీ చేరి ఈనిధిని సేకరించడానికి నడుంకట్టాయి. ఈవిధంగా చందాలు వసూలు చేయడంలో పొరపాటులు జరగకుండాను, వెళ్ళినవారి దగ్గరకే ఇంకొకరు పోకుండానూ, అందరూ కలిసి, చర్చించి, ఒక నిర్ణీతకార్యక్రమం ప్రకారం ప్రజల దగ్గరకువెళ్ళి ధనాన్ని సేకరించుతారు. ఈకార్యక్రమంలో పాల్గొన్న సంస్థలకి ఈరూపకంగా వసూలైన ధనం కేటాయించ బడుతుంది. ఈచందాలు వసూలుచేయడానికి అనువైన సమయం ఏది అని చర్చించి ; 'పంటనూర్పిడి' కాలమే దీనికి అనువైన సమయమని నిర్ణయించి, ప్రజల దగ్గరకి విరాళాలకి వెళ్ళేరు — ప్రతి ఒక్కరూ ఈ ఉద్యమాన్ని హర్షించడమేకాక, ఉదారంగా ధనసహాయంచేశారు. తత్ఫలితంగా 'లేమల్లె' గ్రామంలోని సమితివారు "కేంద్ర సంస్థతో సరితూగే మొత్తాన్ని" సమీకరించి, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థవారి ధనసహాయాన్ని పొందగల్గేరు.—

విద్యాపీఠం, లేమల్లె సమితివారు సాంఘికరంగంలో విజయవంతంగా ఎలాంటివిప్లవం నడపగలిగారో అన్నిరంగాలలోనూ విశేషకృషిచేసి, స్థానిక ప్రజల ఆదరాభిమానాల్నీ, కృతజ్ఞతనీ చూరగొన్నారు !

———:o:———

సేవాకార్యక్రమంలో నిమగ్నమైన సంస్థలు కేంద్ర సంఘ సంక్షేమ సంస్థనుండి ప్రత్యేక ఆర్థిక సహాయాన్ని పొందాలంటే రాష్ట్ర సంఘ సంక్షేమ సలహా సంఘ అధ్యక్షురాలి ద్వారా దరఖాస్తు చేసుకోవాలి. ఆంధ్ర రాష్ట్ర సంఘ సంక్షేమ సలహా సంఘం (సాంతోమ్, మైలాపూరు, మద్రాసు) నుండిగాని కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ కార్యాలయం, 10, కిచనర్ రోడ్, న్యూఢిల్లీ నుండిగాని వివరములు తెలుసుకోవచ్చు.

—పతంజలి వాద్రేవు.

# 'సెనగలమ్మే కుర్రాడు'

అది అక్టోబరు మాసంలో ఒకనాటి సాయంత్రం: నే నెక్కిన రైలు నెమ్మదిగా కదులుతూంది. ఫ్లాట్ ఫారమ్మీద నిలబడి ఎవరోగాని కిటికీగుండా లోనికి చూస్తున్నాడు మాట్లాడకుండా. పెట్టె తలుపులు తీయవలసిందిగా ప్రాధేయపడుతూన్నట్టు అతని చూపులే చెప్తున్నాయి — తలుపుకి దగ్గరగా నేను కూర్చోడంచేత తలుపు తెరిచాను. ఒక పన్నెండేళ్ళ కుర్రాడు బుజాన ఒక చిన్న డబ్బాతో రైలు పెట్టెలో ప్రవేశించి తలుపు వేశాడు. తరువాత ఆ డబ్బా మెల్లిగా ప్రక్కన పెట్టుకుని క్రింద చతికిలబడ్డాడు.

అందరిలాగే ఆ కుర్రాడు బెంచీమీద ఎందుకో కూర్చోలేదు! టిక్కెట్టు లేనిదే రైలులో విశాలంగా సదుపాయంగా కూర్చోడానికి తనకి హక్కు లేదని బహుశా అనుకొని వుంటాడు! ఆ డబ్బాలోని పోపు సెనగలు అమ్ముడు కానివి కొంచెమే వున్నా, అతని వాలకం చూస్తే రోజల్లా కష్టపడిన బడలికా, మిగిలినవి అమ్ముడు కాలేదనే బెంగా అతని కళ్ళలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ కుర్రాణ్ణి గురించి కొంచెం తెలుసుకోవాలని నాకనిపించింది.

"నువ్వేమి అమ్ముతావు?" అన్నాను.

"రైల్లో ప్రయాణం చేసేవారికి పోపు సెనగలమ్ముతాను" అని చెప్పేడా కుర్రాడు.

"ఇంటిదగ్గర నుంచి ఎన్ని గంటలకు బయలు దేరుతావు?"

"మా అమ్మ ఈ సెనగలు తయారుచేసి నాకివ్వగానే ఉదయం 6 గంటలకి బయలుదేరుతాను."

"తిరిగి ఇంటికి చేరడం?"

"రాత్రి 9 గంటలకి పైగా అవుతూంటుంది"

"రోజుకు ఏమాత్రం కిట్టుతుంది?"

"ముప్పావలా, రూపాయికీ మధ్య వుంటుంది"

"ఇంకా మీ యింట ఎంతమంది వున్నారు?"

"మా తమ్ముడూ, చెల్లెలూ"

"మరి మీ నాన్న?"

"మతకలహాల్లో చనిపోయాడు"

"నువ్వు స్కూలుకి ఎందుకు వెళ్ళకూడదు?"

"నేను స్కూలుకి వెళితే మరి మా కుటుంబాన్ని పోషించేవారెవరు?" అన్నాడు- ఎవరూ తప్పించుకోలేని సత్యాన్ని నిరూపిస్తూ—

ఇంకా వాళ్ళ కుటుంబపరిస్థితుల్నీ, వాళ్ళ సాంఘిక ఆర్థిక స్థితిగతులనీ తెలిసికోవాలని నేనెంతగా ప్రయత్నించినా ఆ కుర్రాడు సమాధానం చెప్పడానికి ఇష్టపడలేదు — మగ్నాడు సెనగలమ్మడానికి పొట్లాల కోసం కాగితాలు సిద్ధం చేసుకుంటున్నాడు. వాటిని వృధా కాకుండా ఎలా ఉపయోగించాలో, ఆ చింపే పద్ధతి నేర్పడానికి నేను ప్రయత్నించాను. కాని నా సహాయాన్ని ఆ కుర్రాడు నిరాకరించాడు — బహుశా ఈ ప్రపంచంలో తనలాంటివాళ్ళకి ఎవరూ సహాయం చేసేవాళ్ళు లేరనే నిర్ణయానికి అతను వచ్చివుంటాడు!

ఢిల్లీ-అమృతసర్ రైలు మార్గంలో ప్రయాణం చేస్తూంటే, రైలు టిక్కెట్టు లేకుండా, ప్రభుత్వ అనుమతిలేకుండా తమ తల్లులు తయారు చేసిన తినుబండారాలు రైళ్ళలో అమ్మే శరణార్థి బాల బాలికలని ఎంతోమందిని మనం చూడవచ్చు! దైవోపహతులైన శరణార్థులు తమ పొట్ట పోసుకోడానికి ఇలా రైళ్ళలో ప్రయాణించడం జరుగుతూంది.

టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేయడం తప్పేకావచ్చు! కాని, యీ పసివాడు రైల్లో సెనగలు అమ్మకపోతే... "మరి, అమ్మని, తమ్ముడ్ని, చెల్లెల్నీ పోషించడం యెట్లా?"

డి. పాల్ చౌదరీ.

# ఆంధ్ర సంఘ సంక్షేమ కార్యకర్తలకు డాక్టర్ హెలెన్ కెల్లర్ ఆశీస్సులు

1955 సంవత్సరములో భారత దేశంలో జరిగిన చరిత్రాత్మక సంఘటనలలో డాక్టర్ (మిస్) హెలెన్ కెల్లర్ రాక ప్రముఖమైన వాటిలో ఒకటి. ఆమె మద్రాసు వచ్చినపుడు మద్రాసు ప్రభుత్వం, వివిధ సంఘాలు, సమాజాలు ఆమె పట్ల తమ భక్తి గౌరవాలను వెల్లడించినవి.

ఐతే 40,000 మైళ్ళు ప్రయాణం చెయ్యడానికి నిశ్చయించుకున్న ఆమె కార్యక్రమంలో ఆంధ్రదేశ పర్యటన లేదు. అందువల్ల మద్రాసులోని ఆంధ్ర సంఘసేవా కార్యకర్తలు ప్రత్యేకంగా ఆమెను కలుసుకుందుకు అత్యంత ప్రయాసతో ఏర్పాటు చేసుకున్నారు.

గవర్నర్ నివాసస్థలమైన రాజభవనంలో ఏర్పాటైన ఈ సమావేశంలో తెలుగు సంఘ సేవకులు డాక్టర్ కెల్లర్‌ను సన్మానిస్తూ గౌరవ పత్రం సమర్పించారు. (ఆ గౌరవ పత్రం వేరుగా ముద్రిస్తున్నాము)

డాక్టర్ కెల్లర్ సమాధానం చెప్తూ "మీరు నన్ను గౌరవిస్తూ చెప్పిన ప్రశంసావాక్యాలకు ముందుగా నా కృతజ్ఞత వెల్లడిస్తున్నాను. సంఘ సేవలో నూతన కార్యక్రమాలను నిర్వహించటానికి మీరు పూనుకోవటం నిజంగా నాకు చాలా సంతోషంగాయుంది. చిన్నవిత్తనం నుండి ఉద్భవించే మఱ్ఱి చెట్టు వలె, దురదృష్టవంతులకు, గ్రుడ్డి, మూగ, చెవిటివారికీ మీ సత్సేవాకార్యక్రమం మహోన్నతంగా ఉద్భవించగలదు. మీకు నా ఆశీర్వాదాలు

గ్రుడ్డి తనం నిర్మూలనకు, గ్రుడ్డి, మూగ, చెవిటి వారి పునరావాస కార్యక్రమ నిర్వహణలోను మీరు అత్యధికమైన సేవ చేయుదురు గాక! ఈవిధంగా మీ వివిధ సంఘసేవ కార్యక్రమాలకు, అనేకుల ఆశీర్వచనాలను పొందండి, మిమ్ములను అందరను అభినందిస్తున్నాను"

డాక్టర్ కెల్లర్‌ను, ఆమె కార్యదర్శి పాలీ థాంప్సన్‌ను సందర్శించినవారిలో శ్రీమతి ఎ. సి. కృష్ణారావు (అధ్యక్షురాలు, ఆంధ్రరాష్ట్ర సంఘ సంక్షేమసలహాసంస్థ) జె. జమునాబాయి, (స్త్రీ సంక్షేమ ఆఫీసరు), లక్ష్మీరఘురామ్, లక్ష్మీపార్వతి (శిశు సంక్షేమసంస్థ- ఆంధ్రశాఖ ఉపాధ్యక్షులు), శ్రీమతి రంగనాయకమ్మ (సంయుక్త కార్యదర్శి, ఆంధ్ర మహిళాసభ) డాక్టర్ పావనాబాయి, లక్షులమ్మ, కమలాబాయి, టి. జి. హైమవతి (మహిళల సేవింగ్స ప్రచారశాఖ) డాక్టర్ శర్మ (చిల్డ్రెన్ గార్డెన్ స్కూలు), రాఘవరావు దంపతులు (ఆంధ్ర బాలానంద సంఘం) ఉన్నారు.



# హెలెన్‌కెల్లర్ ! జోహార్ !

డాక్టర్ (మిస్) హెలెన్ కెల్లర్‌కు ఆంధ్రరాష్ట్ర సంఘ సంక్షేమ సలహా సంస్థ, ఆంధ్రరాష్ట్ర సంఘ సేవకుల తరపున సమర్పింపబడిన గౌరవపత్రం.

జ్ఞానేంద్రియాలోపాలను అధిగమించి, మనో నిశ్చయం పట్టుదల, ఏకాగ్రతలకు చక్కని ఉదాహరణంగా ఉంటున్న మీకు ఆంధ్ర దేశం లోని సంక్షేమ కార్యక్రమాల తరఫున, కార్య కర్తల తరఫున గౌరవపూర్వక నమస్కారములు అందజేస్తున్నాము. కళ్ళుండే చూడలేనివారు, చెవులుండే వినలేనివారు" అని యేసుక్రీస్తు చెప్పిన ప్రజలతోనిండిన ఈ ప్రపంచంలో మీరు మీ మెరిసే "నేత్రాల" తోను అమృత "వాక్కు" తోను, దీన ప్రజలను ఉద్ధరించుటకు కంకణం కట్టుకున్నారు. మీ సేవాశంఖారావం విని ఉత్తేజులైనాము. మానవ క్లేశాన్ని నిర్మూలిం చటంలో మీ అడుగుజాడల్లో నడిచి, మా శక్తి వంచన లేకుండా పాటుపడగలము.

భారతీయ వేదాంతం భగవద్గీతలో ప్రవ చించినట్లు "ఎప్పుడెప్పుడు మానవులకు భగవం తుని అవశ్యకత ఉంటుందో అప్పుడు భగవం తుడు వివిధ స్వరూపాలలో సాక్షాత్కరించి ప్రజాసౌఖ్యానికి, తోడ్పడుతాడని" చెప్పుతు న్నది. అటువంటప్పుడు, డాక్టర్ కెల్లర్ ! భగ వంతుడు మిమ్ములను ఒక ప్రత్యేక సత్కార్య నిర్వహణార్థం జన్మింప చేశాడని యావత్తు మానవ జాతికి అవసరమైన ఈ కార్యక్రమ నిర్వహణ మీపై ఉన్నదని చెప్పటంలో అతి శయోక్తి లేదు.

మావంటి యువహృదయాలలో మీరు సంఘసేవ జ్యోతిని వెలిగించారు. మూగ, బధిర, అంధుల హృదయాలలో ఆశాజ్యోతు లను నెలకొల్పారు. కాంతివంతంగా వెలుగు తున్న ఈ ఆశాజ్యోతిని చూచి తాము చేయని పాపాలకు శిక్షపొందుతున్న ఈ దీనులంతా తిరిగి చిరునవ్వులను వెలయింపవచ్చును.

నూతనంగా ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రంలో చెవిటి, మూగ, గుడ్డివారి విద్యకు, ఉద్యోగా లకు అవకాశాలు లేనే లేవని చెప్ప వచ్చును. అందువల్ల చెవిటి, మూగ, గుడ్డివారి విద్యావ కాశాలకుగాను, రాష్ట్రానికంతకు ఒక కేంద్ర పాఠశాలను త్వరలోనే ప్రారంభించుటకు అవి రామ కృషి జరుపుతామని మీకు వాగ్దానమి స్తున్నాము. మేము దీనిని సాధించ గలిగిననాడు ఈఉద్యమాన్ని దశదిశలకు వ్యాపింప జేయుట సాధ్యపడగలదు. ఈకార్యక్రమం దిగ్విజయంగా ఆంధ్రలో వ్యాపించుటకు గాను మీ శుభాశీ స్సులు అత్యంత మూల్యమైనవిగా మేము భావి స్తున్నాము.

"నడిపించు, దయాజ్యోతీ, నడిపించు"

# "ప్రథమ చికిత్స"

డాక్టరు ఎన్. హనుమంతరావు

### జలుబు చేసిందా ?

రస్కులు (టోసుచేసిన రొట్టె ముక్కలు) తినండి. కేకులు, పలావులు. మిఠాయిలు. నూనె వేపుడులు కొంత కాలము ఆపితే మంచిది. ఫలములు, కూరగాయలు. అధికంగా వాడాలి. ప్రతి భోజనానంతరం. ఎండు రేగిపండ్లు. వెరుశనగలు కలిపితింటే కఫము తెగిపోయి. దేహారోగ్యం పెంపొందుతుంది. ఇలా ఒక నెల రోజులు వాడి చూడండి వ్యత్యాసము మీకె తెలుస్తుంది అన్నము అసలే యివ్వకూడదు. పాలలో సమభాగము నీళ్ళకలిపి బాగా మరగించి యివ్వవలయును. సోడాపాల్తు పౌడరును తల్లి పాలలో కలిపి త్రాగించ వలయును.

### "మూత్రపిండములలో శ్రమా ?"

మూత్రపిండముల ఆరోగ్యము కొద్దిగా తగ్గినదనుకుంటే. ద్రవ పదార్థము ఎక్కువగా వాడుటద్వారా వీటికి శ్రమ తగ్గించడం ద్రవపదార్థము తగ్గించి వేయాలి. దాహమైతే పండ్లరసాలు వాడండి. టమాట్. పుచ్చ, ఏపిల్సు వంటివి మంచివి.

### "ద్రాక్షచికిత్స"

అంతర్ శుద్ధికీ, రూమటిజ్మ్ కలవారికీ అమోఘమైనవి, రోజుకొక పౌను చొప్పున మొదలుపెట్టి క్రమేపి రోజుకు రెండుపౌన్సుల చొప్పున వృద్ధి చేస్తూ విసిగెత్తె వరకూ తినండి. తరువాత క్రమేపి తగ్గిస్తూ వుండాలి. ఈ మొత్తాన్ని భోజనాల సమయంలోనే తినాలి వీటికి తోడు యితర పదార్థాలు కొద్దిగా తినండి. కొంచెము దాల్చెన పొడి వేసుకొని ద్రాక్షారసము త్రాగండి.

### "ముఖముపై మొటిమలు"

బాలికలు. క్రొవ్వు పదార్థాలు, నూనె

వేపుడులు, చాకిలేటు, కొక్కో, ఆపివేస్తే చాలు, మొటిమలు తగ్గిపోతవి. ఫలములు ఎక్కువగా వాడుతూ వుండాలి. ముఖానికి ఎండతగులనిస్తే చాలు మొటిమలు మాయమవుతవి.

### "అతిగా అలసిపోయిన?"

ఆకలి వుండిగాని, తినుబుద్ధికాలేదా? ఒక కోడిగ్రుడ్డు కొట్టి, లేదా ఒక కప్పుపాలు, ఒక నారింజకాయ రసం' ఒక గరిటెడు బాదామిపొడి చేర్చి త్రాగండి. మీ దేహానికి అవసరమైన పోషక పదార్థం లభిస్తుంది. త్వరగా జీర్ణమవుతుంది,

### "చీముతో కలిసి విరోచనాలైతే?"

చీముతో కలిసి విరోచనాలైతే చింత గింజలపై పొట్టును తీసి చూర్ణముచేసి తేనెతో కలిపి దినమునకు రెండు పర్యాయములు నాకించవలయును. వెంటనే తగ్గిపోవును.

### "సున్నము కంటిలో పడినఎడల"

సాధ్యమైనంత వరకు తుడిచివేయుము. ఒకటింట నాలుగవ భాగము చిరకాను వేడినీళ్ళలో కలిపి కంటిలో పోయుము అన్యపదార్థము కంటిలో నున్నప్పుడు చేయు చికిత్స చేయుము చిరకాను దొరకని ఎడల వేడి నీళ్ళతో కడుగుము.

### "మైలతుత్తము నూనె కంటిలో పడిన?"

వేడి నీళ్ళలో వంటసోడాను కలిపి ఆ నీళ్ళతో కడుగుము. తరువాత పై విధముగనే చికిత్స చేయుము.

### "ముక్కులో నన్య పదార్థము పడిన?"

బాగుగా నున్న ముక్కు రంధ్రమును మూసి రోగిని చీదునట్లు చేయుము నస్యము మొదలైన వాటిద్వారా తుమ్మించుటకు ప్రయత్నించుము ఇట్టి ప్రయత్నములు కొనసాగని ఎడల వైద్యుని సలహాను పొందుము.

### "చెవిలో నేమైన పడినచో?"

చెవిలో నేమైన కీటకముండినచో చెవిని ఓలీవనూనెతో నింపుము. కీటకముమీద తేలిన ఎడల తీసి వేయుము. చిన్న బిడ్డలను చెవిలో వ్రేల్లు వేయకుండా చేతులను కట్టి వేయుము. అట్లు చేయనిఎడల నన్యపదార్థముల లోపలికి

నెట్టబడును. చెవిని కదుగుటచుగాని పుల్లతో తీయుటకు గాని ప్రయత్నించకుము బోరికుపౌడరును వేసి కొన్ని కొబ్బరినూనె చుక్కలను విడువుము. లేదా జిందా తిల స్మార్ను రెండుమూడు బిందువులను వేయుము.

### "నీటిలో మునిగిపోయినచో? "

కృత్రిమ సాధనమైన యూపిరినిబోవుచుండగా ప్రక్కన నిలువబడి యున్నవారు తడిబట్టలను దీసి పొడి బట్టలను కప్పుటకు ప్రయత్నించుము.

### "ఉరివేసుకొనినచో"?

మెడచుట్టునున్న త్రాటిని కోసివేయుము. త్రాగుటకు వేడి పానీయము నిమ్ము.

### "గొంతుకలో నడ్డుపడినచో? "

నోరు బాగుగా తెరచి గొంతుకలో అడ్డుపడిన దానిని బైటికి లాగుము. వాంతికలుగ జేసినను, లేదా, తల బాగుగా వంచి మెడమీద గ్రుద్ధుము.

### "గొంతుక వాపునకు?"

సాధ్యమైన ఎడల రోగిని వేడిగలచోటు కూర్చుండ బెట్టుము బోరికు పౌడరును కలిపిన వేడినీళ్ళలో పిండిన బట్టను గొంతుక ఎదుటి భాగముమీద గదువ దగ్గరనుండి రొమ్ముపై భాగము వరకు కాచుము. ఊపిరినిలువని ఎడల లేక ఊపిరి యాడుటకు మొదలిడిన ఎడల మంచు గడ్డను చప్పరించుటకిమ్ము. లేక త్రాగుటకు చల్లని నీటి నిమ్ము, తేనెతోగాని లేక బెల్లముతోగాని నొప్పిగలచోట పూసి నిప్పుతో కాపుము.

### "విధ్యుశ్ఛక్తి వలన కలిగెడు అపాయం? ".

సాధారణముగా విధ్యుశ్ఛక్తి యొక్క ప్రవాహము నాపుట యతికష్టమై నందున మరి వేరుపాయము చేయుటకు ప్రయత్నించ వలయును. జాగ్రత్తగా పని చేయని ఎడల సహాయము చేయువారికి అదురుతాకి ప్రాణ అపాయము సంభవించ వచ్చును. కు పనిచేయువారు ఇండియా రబ్బరు మీదను లేక లోహముతో చేయబడని వస్తువుల మీదను. నిలుచుట వలన తనప్రాణమును కాపాడు కొన వచ్చును.

రాను తన చేతులనుకూడ లోహముతో చేయబడని వస్తువులనగా ఇండియా రబ్బరుతో చేయబడిన చేతి మేజోళ్ళు, పొగాకు సంచులు. మైనపు గుడ్డ తదితరమైన పొడిబట్ట మొదలగు వానితో కాపాడుకొన వలయును సహాయము సమీపములో లేనిఎడల రోగిని దూరపర్చుటకు ప్రయత్నించుము. అట్లు చేయుటకు గాను తాడు యొక్క జారుముడినిగాని, వంకర కర్రైనుగాని ఉపయోగించుము. గొడుగును మాత్రము ఉపయోగించకుము. ఏలయన దానియందు యినుప యూచలున్నందువల్ల వాని ద్వారా విధ్యుశ్ఛక్తి మనకు తాకును. బాధపడుచున్న వాని చేతితో నంటుకొనకుండ జూచుకొనుము.

కాలుటలుండినఎడలవానికికొబ్బరినూనెనుపూయుము. లేదా వ్యాసులేను గాని లేక పచ్చివెన్ననుగాని పూయుము.

### "స్మారకము తప్పిన : "

1. రోగిని వెల్లికిలా తలను నొకప్రక్కకు త్రిప్పి పరుండ బెట్టుము.

2. ఒకవేళ ముఖము ఎఱ్ఱబారి యుండినఎడల తలను భుజములను పైకెత్తుము.

3. ముఖము పాలిపోయిన ఎడల తలనుక్రిందికివంచి కాళ్ళను పైకెత్తుము

4. మెడ, రొమ్ము, నడుము, దగ్గర వస్త్రములు బిగుతుగా నుండిన ఎడల వానిని తీసివేయుము.

5. కావలసినంత శుభ్రమైన గాలిని తగులనిమ్ము. తలుపులను కిటికీలను దెరువుము. జనమును దగ్గరకు రానీయకుము. దుర్వాయువుల నుండి దూరపర్చుము.

6. దుప్పటి, యున్ని వస్త్రములు మొదలగు వానితో కప్పి దేహమునకు ఉష్ణము చేయుము

7. స్మృతి తప్పిన వారికి నోటిద్వారా ఏ ఆహారమును గాని ద్రవపదార్థములగాని యివ్వకుము.

8. స్మారకము తప్పినవారిని ఒంటరిగా విడిచిపోగూడదు.

9. స్మారకము తిరిగి వచ్చిన తరువాత కొద్ది కొద్దిగా నీటి నీయవచ్చును. నాడి బలహీనముగా నుండిన ఎడల లోపలగాని బయటగాని రక్తపు వెల్లువ లేదని నిష్కర్ష

చేసుకొని వేడినీటిని గాని, కాఫిని గాని, యిమ్ము. రోగి యొక్క స్థితి చేష్టలద్వారాను, కనుపాప ముడుచుకొని యుండుట ద్వారాను, నిదుర కలుగజేసెడి విషములంటు తప్ప రోగిని నిద్రపోవుటకు పురికొల్ప వలెను. చేతి విసనకర్రతో రోగికి గాలి విసురుము. విద్యుచ్ఛక్తి పంకాల గాలి అంత ఆరోగ్యకరమైనదిరాదు.

## "విషము తినినచో"

1. మసిడి సత్తు

2. ప్రూసిక్ ద్రావకము

3. పుట్టకొక్కు మరియు పండివిషము.

పై విధముగా స్మృతి తప్పుట నానావిధ కారణముల వలన గల్గి తక్షణమే ఒకదానినుండి మరియొక దానిని గుర్తుపట్టుటకు వీలులేక యుండును. కనుక సామాన్య పద్ధతులను నెరవేర్చు దానికితోడు సరియైన మరియొక చికిత్స యవసరమో లేదో? తెలిసి కొనుటకు రోగినిపరీక్షించుట అత్యవసరము. సంపూర్తిగానీ సొంతగమనింపు శక్తిమీదనే యాధారపడును. ఎందుకనగా రోగి స్మృతి తప్పియున్నందున ఏ సమాచారము తెలుపలేడు. ఒకవేళ తెలపినా సరియైనవి కావు.

1. మణికట్టు యొద్దను, కణత యొద్దను. మెడయొద్దను, నాడి యాడుచున్నది లేనిది కనుగొనుము. నాడి కొన్ని సమయములందు నాడకయే యుండ వచ్చును. కొన్ని సమయములందు మెల్లగాను, లేక త్వరగాను లేక బలముగాను కూడ నడవ వచ్చును. నాడి చిక్కని ఎడల గుండెలమీద చేయివేసి చూడుము.

2. ఊపిరి బలముగాను లేక త్వరగాను లేదా ఆలస్యముగాను లేక, గురకతోకూడి యున్నదో గమనించుము.

ఊపిరియొక్క వాసన చూడుము నోరు సారాయ వాసన కొట్టునంత మాత్రముననే రోగి స్మారకము తప్పినాడని తలంపరాదు. కొన్నిసమయములందు, మనుష్యులు జబ్బుగా వుండిన ఎడల కల్లుత్రాగుట కిచ్చెదరు. త్రాగినందువల్లనో లేక ఇతర కారణాల వల్లనో మూర్ఛ పడవచ్చును. కనుక జాగ్రత్తగా పరీక్షించి చికిత్సచేయడము అవసరము.

## "ఎండదెబ్బ"

ఎండదెబ్బలో చాలాదూరము నెండలో నడచినయెడల గల్గుచున్నది. ఇది ఉష్ణప్రదేశము లందు ముఖ్యముగా కలుగును.

"చికిత్స"

1. రోగిని చల్లని నీడగల స్థలమునకు తీసికొని వెళ్ళుము. నడుమున బట్టలు లేకుండ చేయుము.

2. విసనకర్రతో బలము కొద్దిగా విసరుము.

3. మంచుగడ్డ. లేక చల్లనీళ్ళను తలపై మెడకు, వెన్నుపూసకు రోగచిహ్నములు అణగిపోవు సంతవరకు నంటించు చుండుము.

"కాకిసొమ్మ"

ఈ రోగమేవయస్సునందైనను సంభవించును గాని సాధారణముగా వయసువారికి కల్గును. అకస్మికముగా స్మృతి పూర్తిగా తగ్గిపోవును.

రోగి భూమిమీదపడి యొకానొకప్పుడు మూల్గుచు ఏదుస్థితిలో ప్రవేశించి కాళ్ళు చేతులను మాత్రమేగాకుండా దేహమును కూడ కొట్టుకొనును. ఇందు వలన చుట్టు ప్రక్కలనున్న వస్తువుల మీద పడి దేహమునకు దెబ్బలు కూడ తగులవచ్చును. ముఖము పొంగును. తదుపరి నోటినుండి నురుగుకారును. అట్టి సమయములో నాలుక గూడకరచు కొనవచ్చును.

"చికిత్స"

1. రోగిని అపాయము లేని స్థలమునకు దీసికొని పొమ్ము.

2. రోగియొక్క శిరస్సు నాధార పర్చుము. నాలుక కర్చుకొనకుండ నొక పెన్సలుగాని లేక మరియేవస్తువు నైనను చేరుమాలులేక నొక బట్టచుట్టి నోటిలో నుంచుము అనగా పండ్ల మధ్య వుంచవలయును.

3. నిద్ర రప్పించుటకు ప్రయత్నించుము ఊపిరియాడుటను జాగ్రత్తగా గమనించుము.

"సూతికావాయువు"

ఈ రోగము సాధారణముగా వడుచుస్త్రీలకు మాత్రమే కలుగును. దీనికి ఉద్రేకము, దుఃఖము, అమితమైన సం

తోషము కారణములు. రోగి పడక మీదపడి పండ్లు కొరకుచు చేతులనుబిగించి దగ్గరనున్నవారిని పట్టుకొనుటయు నొకప్పుడు నవ్వుచు ఒకప్పుడు ఏడ్చుటయు. కండ్లగ్రుడ్లు మీదికి తిరిగి కనురెప్పలను త్వరితముగా కొట్టుకొనుటయు మొదలగు నవి ఉండును.

పెదవులపై నురుగు కాన్పించును. స్మృతి మాత్రము పూర్తిగా తప్పదు.

"చికిత్స"

1. రోగికి కనికరము చూపకుండ కఠినముగా మాట్లాడుము.

2. ముఖముపై చల్లని నీళ్ళను చల్లుము.

3. ఆవాలపట్టి మెడమీద వేయుము.

"ఏండ్లసందు"

ఈ వ్యాది పసిబిడ్డలకు కలుగును.

1. బిడ్డను పదిహేను లేక ఇరువది నిముషములవరకు వేడినీళ్ళలో కూర్చుండ బెట్టుము.

2. చల్లటినీళ్ళలో గాని లేక మంచుగడ్డతో గాని ముంచిన గుడ్డను బిడ్డ వేడి నీళ్ళలో నున్నప్పుడు శిరస్సుపై నుంచుము.

3. బిడ్డను వేడి నీళ్ళనుండి తీసిన తరువాత దుప్పటి కప్పుము. తలమీద మాత్రము తడిబట్ట వేయవద్దు.

4. అవసరమైన మంచి వైద్యుని కడకు తీసికెళ్ళి పసిబిడ్డను చూపించుము.

# ది వింటర్స్ టేల్

శ్రీ అడవి కనకరాజు

సిసీలియా దేశాధిపతి లియాంటెస్, బొహీమియా దేశపు చక్రవర్తి పోలిక్సినీస్, యిరువురూకూడా బాల్యంనుంచీ ఒకేచోట పెరిగారు. ఒకేచోట విద్యగరపారు. వారి సఖ్యత అవధుల్నంటింది. తమ తమ దేశాల్ని పరిపాలించుకుంటూ మిత్రులిరువురూ సన్నిహితంగా మెలగుతున్నారు.

ఒకసారి పోలిక్సినీస్ మిత్రుణ్ణీ, అతనిభార్యనీ చూట్టానికి సిసిలీ వెళ్ళాడు. లియాంటెస్ భార్య పేరు హెర్మియానీ. కొద్దిరోజులు సిసిలీలో ఉండి, తన దేశానికి పయనమయాడు పోలిక్సినీస్. మిత్రుడు లియాంటెస్ ఇంకా కొద్దిరోజులుండమని ప్రాధేయపడ్డా తన వ్యవహారాసక్తి చేత, మిత్రుడిమాట త్రోసివేసినా, ఆతని భార్య హెర్మియానీ అతణ్ని కొద్దిరోజులుండేందుకు ఒడంబరచగలిగింది. పోలిక్సినీస్ హెర్మియానీతో తన బాల్యంనుంచీ తన జీవితాన్ని ఏకరువు పెడుతూంటే లియాంటెస్‌కి హృదయంలో ఈర్ష్య జనించింది. తనమాట త్రోసిపుచ్చి, తన భార్యకు లొంగటం ఆమెమీద అతనికున్న ప్రేమ అనుకున్నాడు లియాంటెస్. అతడి యీర్ష్య చివరకవధుల్నతిక్రమించింది. ఒకప్పుడు ప్రశాంతత, సౌజన్యము, మిత్ర ప్రేమలకాలవాలమైన అతని నెమ్మది, అనుమానము, క్రౌర్యము, ఈర్ష్యలకు స్థానమైనదీనాడు. వెంటనే అతడు తన ఆస్థానంలోని కామిలో అనే ఉద్యోగిని, పోలిక్సినీస్‌ను విషమిచ్చి చంపవలసిందిగా ఆజ్ఞాపించాడు. కామిలో కది అయిష్టమైనపని. అతడు వెళ్ళి పోలిక్సినీస్‌తో విషయం అంతా వివరించాడు. పర్యవసానంగా ఇరువురూ బొహీమియాకు పలాయనం సాగించారు.

లియాంటెస్‌కు అతిప్రియమైన మామిలస్ అనే పుత్రుడున్నాడు. అతడిని తల్లివద్దనుండి వేరుచేసి, భార్యను చెరలో ఉంచాడు. లియాంటెస్ ఆస్థానోద్యోగులంతా పట్టుబట్టి, రాణీ నిర్దోషియని, లియాంటెస్‌చే, దేవదూతనుండి విషయ సంగ్రహణంకోసం ఒప్పించారు.

రాణీ హెర్మియానీ చెరసాలలో ప్రసవించి ఒక ముద్దులొలికే అందమైన బాలికనుకన్నది. రాణీని చెరనుంచి విడిపించే ప్రయత్నం ఆమె సఖురాలు పాలినా విఫలురాలైంది. లియాంటెస్ ఆ పసిబిడ్డ తన బిడ్డకాదనీ, పోలిక్సినీస్, బిడ్డయనీ, ఆ పసిపాపను తన రాజ్యానికి దూరమైన ప్రదేశంలో విడిచిపుచ్చుమని ఆజ్ఞాపించాడు.

దేవదూతనుంచి సత్యం వినవచ్చింది. సభాసదులంతా ఆలకిస్తూండగా చదువబడిందది. "రాణీ నిర్దోషి. రాజు కౄరుడు. ఆ పసిపాప తప్పితే అతనికి వారసు లెవ్వరూ ఉండబోరు." ఇంతలో యువరాజు గతించినట్లు వార్తవచ్చింది. అతడు తన తల్లితో యెడబాటుకు బెంగతో చనిపోయాడు. పుత్రుని మరణవార్త వినగానే రాణికి తెలివితప్పింది. ఆమె సఖి పాలినా ఆమెను అంతఃపురంలోకి గొనిపోయింది. కొద్ది క్షణాల అనంతరం పాలినా దుఃఖిస్తూవచ్చి, రాజుకు రాణి మరణవార్త తెలియచేసింది. దానికంతకూ కారణభూతుడతడేనని రాజును నిందించింది. రాజుకూడా విచారించాడు. నాటి నుంచీ రాజు తిరిగి వివాహం చేసుకోకుండా విచారంతో కాలం గడుపుతున్నాడు.

క్రూరసత్త్వ నిలయమైన ఒక అరణ్యంలో విడువబడిన రాకుమార్తె ఒక గొర్రెలకాపరి దృష్టిపడింది. ప్రక్కనే ఉన్న అమూల్యకనకాభరణాలనుకూడా గ్రహించి అతడు సంతోషంతో పసిబిడ్డను పెంచుకుంటున్నాడు.

పదహారు వసంతాలు గడిచాయి. పెర్డిటా యని పిలువబడే లియాంటెస్ కుమార్తె యవ్వనపు బిగువుల్లో అందాల్ని వెదజల్లుతోంది. ఆమె ఇప్పుడు బొహీమియా దేశంలో ఉంది. బొహీమియా యువరాజు ఫ్లొరిజిల్ (పోలిక్సినీస్ కుమారుడు) వేటనిమిత్తం బైలుదేరి, అరణ్యమార్గంలో గొర్రెలను కాచుకునే పెర్డిటా సౌందర్యాన్ని తిలకించి ముగ్ధుడయాడు. ఆ క్షణంనుంచీ ఆతడామె సౌందర్యానికి దాసుడు. ఆమె మాధుర్య మొలికించే మృదుల సంభాషణలకు కట్టుబడిపోయాడు.

పెర్డిటా ఫ్లొరిజిల్‌ను ప్రేమించింది. ఇరువురూ వివాహానికి వాగ్దానాలిచ్చుకున్నారు. ఇంక ఆమెను చూడకుండా యువరాజొక్కక్షణంకూడా గడపలేదు. యువరాజు రాజభవనాన్ని పరిత్యజించి గొర్రెలకాపరి కుటీరావాసానికి అలవాటుపడ్డాడు.

పెర్డిటాను పెంచే గొర్రెలకాపరి ఇప్పుడు గొప్పధనవంతుడు. గొర్రెలకు ఉన్ని కత్తిరించే ఋతువులో అతని యింటిలో ఒకఘనమైన విందు జరుగబోతూంది. పెర్డిటా విందుకువలసిన సంరంభం సమకూర్చటంలో మునిగిపోయింది.

యువరాజు రాజభవనంలో కనపడక, రాజు-పోలిక్సినీస్ వ్యధచెందాడు. కామిలో అతడి వృత్తాంతం కొంతవరకూ రాజుకు విన్నవించాడు. 'అతడొక గొల్లవాని యింటిదగ్గర కానవస్తూంటాడు. అక్కడ విశేషమైన సౌందర్యవతి-గొల్లకులంలో కానరానిది ఉన్నది. ఆమె పై యువరాజు మనసునిలగ్నమైంది.' రాజు విచారించాడు. అక్కడొక విందుకూడా జరుగబోతూంది. రాజు, మిత్రుడు కామిలోతో మారువేషంలో విందుకు హాజరయాడు. పెర్డిటా అందరితోపాటు ఈక్రొత్తవారిరువురకూ కూడా ఘనస్వాగతమిచ్చింది.

విందు ఘనంగా జరుగుతోంది. యువరాజు మారుపేరుతో విందులో హాజరయాడు. విందులో పెర్డిటాతో అతడు నాట్యంచేశాడు. నాట్యానంతరం వారిరువురూ చేతులుకలిపి, తమ వివాహానికి ఈ క్రొత్తవారిరువురి (రాజు, కామిలో) సాక్ష్యాన్ని కోరాడు. రాజు-పోలిక్సినీస్ అతణ్ణి వారించాడు. 'నీ తండ్రితో చెప్పకుండా యీ వివాహం అసందర్భం! అని ఖండించాడు. కాని, యువరాజు ఆ మాటను త్రోసిపుచ్చాడు. ఇక రాజు ఉండబట్టలేకపోయాడు. కోపోద్దీపితుడై తన మారు వేషాన్ని తొలగించి, యువరాజా గొర్రెలకాపరి కుమార్తెను వివాహమాడితే ఇక యావ రాజ్యానిక నర్హుడని చెప్పి, చరచరా విందు వదలి వెళ్ళిపోయాడు.

విందుభగ్నమై పోయింది. గొర్రెలకాపరి కంపించిపోయాడు. తనకు ముమ్మందు ముప్పు రావచ్చు. ఇక అతడు రహస్యాన్ని వెల్లడించే నిశ్చయంచేసుకున్నాడు. పసిబిడ్డతో దొరకిన నగలన్నీ రాజుగారి సమక్షంలో ఉంచదల్చుకున్నాడు.

కాని, యువరాజు తన ప్రేయసికోసం రాజ్యాన్ని త్యాగం చెయ్యదల్చుకున్నాడు. రాజ్యాన్ని విడిచి వెళ్ళిపోయే ప్రయత్నంలో ఉన్నాడు.

# ది వింటర్స్ టేల్

కామిలోకు మాతృభూమికి తరలిపోవాలనే కాంక్ష ప్రబలిపోయి చిరకాలంనుంచీ అతణ్ణి వేధిస్తోంది. కాని, రాజు-పోలిక్సినీస్ నిరాకరణను కాదనలేకపోయాడు. ఇప్పుడతడి కనువుదొరికింది. వెంటనే పన్నాగం పన్నాడు. అతడు యువరాజును సిసిలీకి పంపి, తన తండ్రి సిసిలీ రాజును (లియాంటెస్) అభినందనలందజేస్తున్నట్లు తెలుపమన్నాడు. వెంటనే తమ రాజువద్దకు వెళ్ళి, యువరాజు సిసిలీకు తన ప్రేయసితో పలాయితుడైనాడనీ, వెంటనే నౌక మీదపోయి ఆతడిని చేరవచ్చునీ చెప్పాడు. పోలిక్సినీస్ కామిలోను వెంటపెట్టుకొని, నౌక మీద సిసిలీకి బైలుదేరాడు.

మిత్రుడు తన కుమారుడిద్వారా అభినందించినందుకు లియాంటెస్ సంతోషించాడు. తానిదివరకతనిని వంచించినందుకు సిగ్గిలాడు. అతడి ఆస్థానంలోని వారంతా పెర్డిటా సౌందర్యాన్ని తిలకించి విస్తుపోయారు. కొద్దిక్షణాలకు పోలిక్సినీస్ కామిలోతో సిసిలీ రాజప్రాసాదం చేరుకున్నాడు. వెనుకనే గొర్రెలకాపరి, పెర్డిటాతో దొరకిన ఆభరణాలతో లియాంటెస్ రాజదర్బారు చేరాడు.

దర్బారులో తర్కం జరిగింది. ఆభరణాలలో సిసిలీ మహారాణి, హెర్మియానీ, కంఠాభరణం ఉంది. అవి రాణీసఖి పాలినా పసిబిడ్డతో పంపినవే. కనుక పెర్డిటా సిసిలీరాజు లియాంటెస్ పుత్రిక. తన కుమార్తెను కలుసుకున్నందుకు లియాంటెస్ విచారాన్ని వదలి, అమితంగా సంతోషించాడు. ఆమెను తన మిత్రుడు పోలిక్సినీస్ పుత్రుడు ఫ్లోరిజెల్‌కుఇచ్చి వివాహం నిశ్చయించాడు.

మహారాణి సఖి పాలినా తను మహారాణి ప్రతిమ నొకదాన్ని తయారు చేయించాననీ, దానినికని, సంతృప్తి చెందవచ్చుననీ, దర్బారు నంతనూ అచ్చట కాహ్వానించింది. అందరూ మహారాణి ప్రతిమను చూచారు. పాలినా మహారాణి పలుకులనుకూడా ఆలకించమని సభవారిని కోరింది. మహారాణి హెర్మియానీ గతించలేదు. జీవించియే ఉంది. ప్రతిమ ఆత్రంతో ముందుకడుగిడి, కుమార్తెనూ భర్తనూ కౌగలించుకుంది.

పెర్డిటాను బాల్యంలో మహారణ్యంలో వదలినప్పుడు క్రూరమృగాల బారినపడి, పాలినా భర్తమరణించాడని అందరూ వకసారి జ్ఞప్తికి తెచ్చుకుని విచారించారు. ఆమె సాహసానికీ, తెలివితేటలకూ అందరూ హర్షించారు.

అనంతరం ఫ్లోరిజెల్ పెర్డిటాలకును, పాలినా కామిలోలకును వైభవోపేతంగా కల్యాణం జరిగింది.



# హాస్యానందం

## యమునికొలువు

శ్రీ భీమవరపు సత్యనారాయణమూర్తి.

పాపం భయంకరం పుణ్యం లావణ్యం అంటారు.

పుణ్యాత్ములు స్వర్గం. పాపాత్ములు నరకం సామాన్యంగా పొందుతూ వుంటారు. మొదట్లో కొంచెం పుణ్యం చేసినవారికి కాసేపు స్వర్గం యిచ్చి, తరువాత బాధ పొందటం కోసం నరకానికిపంపుతూ వుండేవారుట. ఒకరోజున ఒక పాపాత్ముడు మహాశివరాత్రినాడు ప్రాణాలు విడిచాడుట. వాడు చస్తూ,చస్తూ'శివశివా'యనేసరికి వాడికోసం శివభటులు వచ్చారు. కాసేపు స్వర్గ సుఖం అనుభవించు యోగం యిచ్చారు. వాడు హాయిగా కూర్చున్నాడు. ఒక దేవత వచ్చి అతనికి కావలసినవి ఏర్పాటు చేస్తున్నదట. అతనికి ఒక ఆలోచన తట్టింది. ఆమెను పిలిచి ఒక తెల్ల కాగితం తెమ్మన్నాడు. ఆమె యిచ్చింది. దాని అడుగున త్రిమూర్తుల సంతకాలు నేర్పుగా పెట్టించుకు రమ్మన్నాడు. ఆమె యెల్లాగా అనుకుంటూ నెమ్మదిగా సృష్టికర్తని సమీపించి, అతని కాసేపు పొగిడింది. మీ చేవ్రాలు చక్కని సుందరాక్షరాలుతో వుంటాయి. కాస్త చూపించండి అని నెమ్మదిగా ఆకాగితంమీద పెట్టించింది. ఎలాగో అలాగు తతిమా యిద్దరి వ్రాతలు కాజేసింది. తీసుకొచ్చి యితని కిచ్చింది. అతను చాల సంతోషించి, ఆకాగితంపైన ఏవో చాలఅక్షరాలు వ్రాసేడు. తరువాత ఆదేవత యికఅతను యమలోకానికి వెళ్ళవలసిన సమయం వచ్చిందన్నది. అతను విచారపడలేదు. ధైర్యంగా వెళ్ళాడు. యముడు అతని పాపాలను చదువమని చిత్రగుప్తుడుని అడిగాడు. చిత్రగుప్తుడు వరుసగా చదువుతున్నాడు. యముడు మండిపడుతూ, ఆ దుర్మార్గుణ్ణి బంధించి బాధించ మన్నాడు.

తో అతను పళ్ళు పటపటా కొరుకుతూ, యముడ్నిధిక్కరించి "ఓరి దుర్మార్గుడా, దుర్ముఖి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, అక్షయా" అని గటగటా యీ అరవై తెలుగు సంవత్సరాలలోవిచదివి, "నిన్నుయిప్పుడు యేమి చేస్తానో చూడు. నీ వుద్యోగం వూడ గొట్టాను. చూసుకో నీ కర్మ" అంటూ అతని చేతిలోని కాగితాన్ని విసిరి కొట్టాడు యముని ముఖాన. అంతా నిశ్చేష్టితులయ్యారు. చిత్రగ్రుప్తుడు చిత్రంగా చూస్తున్నాడు. యముడు వైచిత్రంగా ఆశ్చర్యపడి, ఆ కాగితాన్ని గబగబా విప్పి చదివి. దిగాలుపడిన మొహంతో యీతనికి నమస్కరించి గద్గద స్వరంతో అక్కడినుంచి వెళ్ళిపోతూ, "వీరుకొత్త యమధర్మరాజులు. నేను కాను అతి విచిత్రముగదా విధి విలాసము" అని లోపలికి వెళ్ళి పోయాడు.

క్రొత్త యమధర్మరాజు సగర్వంగాసింహాసనం అధిష్ఠించాడు. అక్కడ నిప్పుస్తంభాలకు కట్టబడివున్నవారందరిని విడిపించాడు. పాపాత్ములకు తగిన శిక్షలు యివ్వనీయడం లేదు. చిత్రగుప్తుడు తనపదవికి రాజీనామా యిచ్చాడు. ఈలోగా పాతయముడు, బ్రహ్మ దగ్గరకెళ్ళాడు. తనని పదవినుండి తొలగించిన కారణం చెప్పమని దీనంగా అడిగాడు. బ్రహ్మ ఆశ్చర్య పడ్డాడు. ఎవరు తీసివేశారని అడిగాడు. యముడు ఆకాగితంపైన వున్న బ్రహ్మ సంతకం చూపాడు. ఈలోగా, పరమేశ్వరుడు, విష్ణుమూర్తి, వచ్చారు. యముడు తన తప్పిదం యేదో చూపించమని ప్రాధేయపడ్డాడు. వారు ఆశ్చర్య పడ్డారు. ఆ కాగితం తీసుకొని విష్ణువు యిల్లా చదివాడు.

"ఓయీ యమధర్మరాజా! నేటినుండి యీ నరకబాధ వ్యవహారాలు యీ క్రొత్తయముడు, చూడగలవాడు ఉచిత మర్యాదలతో వీరిని గౌరవించుము. నీవు తొలగుము."

ఇల్లా చదివి విష్ణుక్రిందనున్న తన సంతకం చూచి. "అరెరే, యీ విడివిడి అక్షరాల సంతకం నాదేనే" అన్నాడు. బ్రహ్మ ముడిముడి అక్షరాల సంతకం తనదే నన్నాడు. మహేశ్వరుడు అగొలుసు కట్టు సంతకం తనదే నన్నాడు ఇదిజరిగిన విధంతెలియక విస్తుపోయి క్రొత్త యముని సమీపించి అడిగారు. అతను నవ్వుతూ, పొరపాటునైనా మీ సంతకాలు యిష్టంవచ్చినట్లు పెట్టకండి పెడితే యింతేనని జరిగింది చెప్పాడు. అతని తెలివికి మెచ్చుకుని తిరిగి మామూలుగా యముని ధర్మరాజుగా చేశారు త్రిమూర్తులు. క్రొత్త యముని తన భటుడుగా వుంచుకొన్నాడు శివుడు, "శివప్రసాదం" అంటూ అతన్ని కొలిచాడతను. అనాటినుంచి ముందు నరకం తరువాత స్వర్గం యిస్తూ వచ్చారు.

కాబట్టి యిష్టంవచ్చినట్లు యెక్కడ పడితే అక్కడ మీ చేవ్రాలును బయట పెట్టకుండా, దాని విలువను గుర్తించటం చాల అవసరం.



## — అ నా ధ —

శ్రీ రామ శేషాద్రి

శీతాకాలం. రాత్రి కాబోతున్నది. చలి మిక్కుటంగా ఉంది. చీకటికూడా దట్టంగా వ్యాపించుతూంది. మరునాడే క్రొత్త సంవత్సరం. ఈ వాతావరణంలో ఒక బీదపిల్ల ఇంకా రోడ్డుమీద తిరుగుతున్నాది. గుడిసెనుండి బయలు దేరి నప్పట్లో ఆమె పాదాలకు తాతలనాటి పాదరక్షలు బహుశా తనతల్లివి కాబోలు - ఉన్నాయి. ఇంతలో రోడ్డుకు అడ్డంగా తన కిరువైపులా రెండు కార్లు వస్తున్నాయి. భయంతో, ఇటూ, అటూ, పరుగెత్తింది. ఆ అనాథ కాలి జోళ్ళు చాలా వదులుగా ఉండటంచేత జారిపడ్డది. ఒక జోడు ఆమె అందు కొనేలోపుగా ఒక పెంకి కుర్రవాడు ఎగరేసుకు పోయాడు. రెండవది ఆమె దృష్టిపథంనుంచి జారిపోయింది, బిక్కమొహంతో తిరిగి నడక ప్రారంభించింది.

చీకటి పడకముందు ఆమె దగ్గర కట్టెలమోపు కొనే ధర్మాత్ములు ఎవరూ కనబడలేదు. చేతిలో దమ్మిడికూడా లేదు. ఇంటికి వట్టి చేతులతో, వెళ్ళితే తండ్రితగిలేస్తాడు. ఇంకా ఆ చెట్టుకిందే నయం అని తలపోసింది,

ఒక కట్టెపుల్ల వెలిగించితే, ఆ నిప్పుదగ్గర చలికాచుకో వచ్చుననుకుంది. మెల్లగా ఆ ఎదురుగాఉన్న ఇంటివరకు వెళ్ళింది. అక్కడ తనదగ్గర ఉన్న మోపులోనుంచి ఒక పుల్ల తీసి గోడతో రాపిడి కలిగించింది. కొంత సేపట్లో పుల్ల అంటుకొంది. ఆ వెలుతురుగుండా లోనికిచూడగ ల్గింది, అదిఒకధనిక వర్గపు సంసారం. మరునాటి పండగ సంబరం మూర్తీభవించి ఉంది ఆఇంట్లో. లోపల రెండు మూడు మేజాబల్లలు, వాటిమీదుగా వెండిసామానులు, గదినిండా దీపాలు, పట్టుబట్టలు, ఎక్కడచూసినా ఇంట్లో తేజోవంతమైనదీపాలు, కాని ఇంతలో అగ్గిఆరిపోయింది.

ఈ ఇంటి సౌభాగ్యాన్ని చూచి మైమరచింది బీదపిల్ల, తిరిగి అనుకోకుండానే రాపిడితో మరికొన్ని పుల్లలను వెలిగించింది, ఆ పిల్లకు నిద్రవస్తున్నది పాపం! సగం రాత్రి దాటిపోయింది. ఆ ఎదురింటిలో దీపాలు కూడా ఆరిపోయాయి. పాపం! ఆ అనాధకుకూడా అంతా అంధకారంగా ఉంది. చాలా భయం వేసింది. ఇంతసేపూ ఆ ఇంట్లో దీపాల్నే నక్షత్రాలనుకొని ఊహించుకొంది. ఆ గదిలో ఆ టేబిల్ దీపాన్నే చంద్రుడనుకొంది. అయ్యో! ఆ టేబిల్ దీపంతప్ప మిగతావన్నీ ఆరిపోయాయి. ఏదో అనర్థం రాబోతున్నదని పరితపించ సాగింది,

ఈ విధంగా తలపోస్తూ చెట్టును కౌగలించుకొని నిద్రపోయింది. ఆ చలిలోనే. రాత్రి భయంకరంగా ఉంది. ఈ సమయంలో తన అవ్వ. రెండేండ్ల క్రిందట చనిపోయిన తన అవ్వ. తెల్లారితే క్రొత్తసంవత్సర మనగా ఆమెను నిద్రనుంచిలేపింది. "అవ్వా! ఆ దీపాలవెలుగులో నిన్ను చూశాను. నీవు నాకు తోడుగా వస్తావని అనుకున్నా. ఇంతలో ఆ నక్షత్రాలు అంతరించేయి. కాని నీ వెలుగు నా దగ్గర కొచ్చింది" అని సంతోషించింది పిల్ల. ఆమెను తీసుకుపోయి మరునాటి పండుగ వేడుకలన్నీ చూపించింది అవ్వ

తెల్లవారింది. ఊరల్లా సందడిగా ఉంది. పాపం! చలితో ఇంకా ఆ బీదపిల్ల సగం నవ్వుతో చెట్టును కౌగలించుకొని "అవ్వా నన్ను విడిచిపోకుమా!" అని పలవరిస్తున్నాది. జాలిచూపని ఈ లోకం "పిచ్చిపిల్ల" అన సాగింది.

# బండరాయి

శ్రీ బాబా

కృష్ణానదీ తీరాన
కొండ శిఖరాన్నుండి
బండ రాయొకటి
బడ బడ మంటూ
పడి దొర్లింది.
దొర్లిన బండరాయి
కొండ ప్రక్క బాటలో
చెట్టు తగిలి ఆగింది.
కొండ ప్రక్క కాలిబాట
కొండ చుట్టి లోయదాటి
లోయ చివర మలుపు తిరిగి
నది ప్రక్కన పల్లెకడకు
వంకరగా పోతుంది.
పల్లెలోని ప్రజలంతా
ఆ బాటనె ఎల్లప్పుడు
నడిచి పోవుచుండిరి.
బాటలోన అడ్డముగ
పడిన బండరాయిని
పనికిపోవు ప్రజలంత
తిట్టి తిట్టి కడకు దాన్ని
చెట్టు మొదట చేర్చినారు.

*  *  *

వేసవిలో ఒకరోజున
మధ్యాహ్న కాలమందు
శిల్పి యొకడు యెండలోన
ఆబాటను పోవుచుండ
చెట్టు నీడ చూసి తాను
రాతిమీద కూర్చొనెను.

అరిగి అరిగి ఆ రాయి
అందముగా నునుపు దేరి
ఉన్నందున ఆ శిల్పి
రాతినంతం జూసెను.
సుత్తి తీసి వెంటనే
శిల్పి చెక్కె నొక్క
చక్కనైన శిల్పము.
బొమ్మ చాల బరువైనది
తానొక్కడు మోయలేక
పనివారిని తీసుకొచ్చి
మరునాటి ప్రొద్దుటనే
తీసికెళ్ళ దలచినాడు
విడువలేక విడువలేక
బొమ్మ నచట చెట్టుక్రింద
విడిచి కడకు యింటికేగె.

*  *  *

కృష్ణానది నాటి రాత్రి
పొంగి పొరలి ప్రవహించెను



# బండరాయి

తెల్లవారి చూడగానె
వెల్లువొచ్చి బాటప్రక్క
చెట్టు కూలిపోయెను
చెట్టు మొదట బొమ్మకూడ
నదిలోకి దొర్లిపోయె.
శిల్పి కెందు ఆశిల్పము
కన్పించక మనునాడు
కొండ కోనలన్ని వెదకి
దుఃఖముతో తిరిగినాడు.

*　　*　　*

కొన్నేళ్ళకు ఒకరాజు
కోటనొకటి కట్టదలచి
కృష్ణానది యిసుకతిన్నె
త్రవ్వించగ అందులోన
కనిపించెను రాతిబొమ్మ
దేవతామూర్తి మనకు
దొరికింది యిసుకలోన

అని తలచి ప్రజలంత
అందమైన మందిరాన్ని
కొండమీద కట్టినారు.
నాటినుండి పల్లె ప్రజలు
ప్రతిరోజు పూజచేయ
మందిరాన రాతి బొమ్మ
మనసులోన నవ్వుకొంది
"ఆహాహా ! ఏమిటి ?
ఈమానవు లెటువంటివారు !
త్రోవలోన ఉన్నప్పుడు
తిట్టి తిట్టి తొక్కి తొక్కి
విసుక్కుంటు వెళ్ళువారు
ఈరోజు నన్ను వీరు
పూలు తెచ్చి భక్తితోడ
పూజచేయు చున్నారుగ
అనుకొంటూ నవ్వుకొంది
ఆ బండరాయి మనసులోన.



# నా కిష్టమయిన స్త్రీ పాత్ర

శ్రీమతి గాడిచర్ల సుబ్బాయమ్మ

నేను కోరు పాత్రధారిణి, సమోన్నతమైన శరీరముకలిగి, అణకువ, నెమ్మది, పతిభక్తి, అత్త మామలసేవ, ఇతరులయందు గౌరవ ప్రేమలు, ధైర్య సాహసములు కలిగి యుండవలెనని నా అభిప్రాయము. యిదియేగాక, నేనెక్కువగా ప్రేమించు భక్తితోగూడిన గాన, నృత్యములుగూడ వుంటే నాకు పూర్తి సంతుష్టి అన్నమాట. అనగా ఆమె తీరిక సమయములోను, కాలక్షేపము లేని సమయములోను, భగవంతుని గురించి, తాను భక్తి కీర్తనలు పాడుకుంటూ, తన్మయం పొందాలని నా ఉద్దేశ్యం. ఇట్టిదే నే కోరు పాత్ర. అయితే యీ విషయములకు సరిపోలు సతీ సావిత్రి పాత్ర నాకు నచ్చినది. సావిత్రి కథ అందరికు తెలిసినదే. ఈమె అశ్వపతి, మాళవి, అనే రాజదంపతులకు, సావిత్రీ దేవి వరప్రసాదంబున కలుగుట సంభవించినది.

అశ్వపతి, సావిత్రిని అల్లారుముద్దుగా సకల విద్యా ప్రవీణురాలినిగా జేసెను. యుక్తవయస్సు రాగానే ఆమెకు తగిన వరుని కొరకు అన్వేషించుచుండెను. సావిత్రి అదివరకే సత్యవంతుని గుణవిశేషములు విని, అతనిని వరించియుండెను. అశ్వపతి, తన కుమార్తె అభీష్టమును తెలిసికొని సత్యవంతుని మంచిచెడ్డలు విచారించుచుండగా, వివాహమైన సంవత్సరమునకే, సత్యవంతుడు మృతి జెందునని నారదునివలన దెలుసుకొనెను. "అల్పాయుష్యవంతుడైన సత్యవంతునికంటె, అతనితో సమానులైన ఇతర రాజకుమారులెవరినైనా వరింపు"మని తండ్రి కుమార్తెను చాల ప్రతిమాలెను. మనోవాక్కాయముల మూడింటిలో ప్రధానమైన మనస్సుచే గాఢముగా వరించి కోరుకొనిన ఆ సత్యవంతునితప్ప ఇతరులను వివాహమాడనని చెప్పెను. ఈ మనో నిబ్బరములో చాల ఘనతయున్నది. ఈవిషయము నాకు చాల నచ్చినది.

అప్పుడు అశ్వపతి, నారదుని సలహావల్ల తన ప్రియకుమార్తె కోరినట్లు సత్యవంతునికిచ్చి, వివాహముచేయక తప్పినదికాదు. ఒక స్త్రీ పాత్ర రాణించవలెనంటే, ఆమెకు జతపరచిన పురుషపాత్రకూడా అన్ని విషయములలోను, ఆమెకు సమానముగాగాని, అంతకంటె మిన్నగాని యుండవలెను. సావిత్రికి అందచందములలోను, అన్ని గుణములలోను, నచ్చిన తన భర్త సత్యవంతుని, అనురాగమును సంపాదించుకొనుటయేగాక, అత్త మామలకు, ఏమాత్రపులోటు లేకుండ, తృప్తిగా సేవచేయుచుండెను.

ఇదికూడా నాకు నచ్చిన విషయములలో నొకటి. వివాహమైన సరిగా ఒక సంవత్సరమునకు భర్త గతించునన్న సంగతి సావిత్రికి నారదుని వల్ల తెలిసినవిషయమే! అందుచే నిత్యకృత్యములను, నిత్య సేవలను ఏమరకుండ చేయుచూ, పతి గతించునని చెప్పిన గడువురోజువఱకు మనసునందు తన భర్త పూర్ణాయుష్యవంతునిగ జేయగలందులకు, సావిత్రీ దేవిని ధ్యానించుచుండెను. ఆరోజు దగ్గరకు వచ్చుకొలది ఈమె ఆరాటము, దేవియందు భక్తి అధికమగుచు, విషయమును సాధించుటకని ఉపవాసములు మొదలగు కర్మలు సలుపుచూ, మృత్యువును సాధించుటకు తగిన సాధన సంపత్తి సేకరించుచూ, ధైర్యము వహించి, సిద్ధపడెను. అఖ

రకు ఆరోజు వచ్చినది. ఆదినమున రాబోవు ప్రమాదము ఆమెకు దప్ప యింకెవ్వరికీ తెలియదు. అందుచే భర్తను సవినయముగా ఇట్లు కోరెను. అడవులలో కట్టెలుకొట్టి తెచ్చుటకు తనుకూడా వచ్చుటకు అనుమతి ఇవ్వవలసినదని అతిప్రాధేయంగా బ్రతిమాలెను. సత్యవంతుడు తన ప్రియ భార్యకోర్కెను కాదనక కూడా వచ్చుటకు ఒప్పుకొనెను. అంత అత్త మామల వద్ద శలవు తీసికొని మృత్యువుతో యుద్ధము సేయుటకుపోవు ఒక వీర వనితవోలె భర్తననుసరించి అడవికి పోయెను. అట్టి సమయములో ఆమెకు గల ధైర్యము, ఆదేవియందలి భక్తి, విశేషము మనము వూహించుకొనవలెను. ముందు పర్యవసానము ఏవిధముగా పూర్తి యగునో అను ఆందోళనతో, తుపానువలె అల్లకల్లోలముచేయు తన మనస్సును భర్తకు అణుమాత్రమును తెలియనీయలేదు.

ఇట్లాదంపతులు సంతోషముగా కావలసిన పుష్పములు, ఫలములు సంచీలో నింపుకొనిరి. అంత గొడ్డలి చేత పట్టుకొని, సత్యవంతుడు కట్టెలు కొట్టుటకు ప్రారంభించెను. కొద్దిసేపటికే గొడ్డలి నేల పారవైచి, శ్రమకోర్చుకోలేక, బరువైన హృదయముతో దీర్ఘ శ్వాసలు దీయుచు వివర్ణమైన ముఖముతో సావిత్రివద్దకు వచ్చి "నా శరీరము వణకుచున్నది. తలలో శూలములు గ్రుచ్చినట్లు బాధగాయున్నది" అని చెప్పుచు ఆమె ప్రక్కనే క్రింద పడిపోయెను. సావిత్రి విషయమును గ్రహించినదై, భర్త శిరమును తన తొడపై నుంచుకొనునంతలో, సత్యవంతుడు సోలిపోయి, చైతన్యమునువీడెను. సావిత్రి చేయునదిలేక నిర్జనారణ్యములో ఒంటరియై నారదుడు చెప్పినట్లు జరిగినదని ధైర్యము వీడక, కనిపెట్టియుండెను. అట్టి సమయమున నీలవర్ణముగల శరీరము, ఎర్రని కండ్లు గలిగి, ఆజానుబాహుడై చేత నొక పాశమును పట్టుకొని తన యెదుట నిలబడిన ఆకృతినిచూచి, సావిత్రి భయపడక కనిపెట్టుచుండెను. అంత ఆపురుషుడు సంతోషముతో సత్యవంతునిపై కాలపాశము వేయబోయెను. అప్పుడు సావిత్రి సత్యవంతుని శిరము నెమ్మదిగా క్రిందపెట్టి నమస్కరించి "అయ్యా మీరెవరు ? ఎందుకువచ్చారు" అని అడిగెను. అంత ఆతడు "నేను యమధర్మరాజును నీవు మహాపతివ్రతవు కాబట్టి నీకు కనబడుతున్నాను. యీ సత్యవంతుడు మహాపుణ్యాత్ముడు. యీతనికి కాలము తీరిపోయినది. కావున నా దూతలను బంపక, నేనే స్వయముగావచ్చి, యీతని ప్రాణములు తీసుకొనివెళ్లుచున్నాను" అని చెప్పి పాశమున ప్రాణములు లాగివైచి, దక్షిణ ముఖుడై పోవుచుండెను. అంత సావిత్రి చేయునదిలేక తన భర్త శరీరము నొకచోట భద్రపరచి "ధైర్యే సాహసే లక్ష్మీః" అనునట్లు మూర్తీభవించిన జగన్మోహినివోలె వెలుగొందుచు, సావిత్రీదేవిని మనమున ప్రార్థించుచూ తన భర్త ప్రాణముల ననుసరించి, యముని వెంట అడుగులు తడబడుచు ఆ ఘోరారణ్యములో వెంటాడెను. కొంతసేపటికి, యముడు, సావిత్రి వెంటాడుటచూచి, "ఓ! పుణ్యశీలా, నీవెందులకు వచ్చుచున్నావు? ఇవి నీవు రావలసిన ప్రదేశములుగావు. ముందుముందు చాల అగమ్యగోచరముగాయుండును గనుక మరలి పొమ్మనెను. ధైర్యశాలియైన సావిత్రి అతనికి యీ విధముగా జవాబు చెప్పెను. "పతులు యెచ్చటికేగిన సతులు అచ్చటికేగుట ధర్మము. ఆకారణముగా నేను రాకూడని స్థలములు లేవు. అంతేగాక, అన్నిమార్గములలోను ధర్మమార్గము ప్రధానము. ఆధర్మమునకు సజ్జనులు ఆధారభూతులని విన్నాను. అట్టి సజ్జన సందర్శనంబువలన శుభంబు కలుగకుండ ఉత్త

చేతులతో ఏలాగు వెళ్ళడం” అని అడిగింది. అప్పుడు యముడు ఆ సాధు వాక్యములకు ఆశ్చర్యపడి “నీమాటల చాతుర్యమువలన నా హృదయమునకు తృప్తి కలిగినది. నీ భర్త ప్రాణములు తప్ప ఏదైన ఒక వరమును కోరుకో యిస్తా” నన్నాడు. ఈవిధముగా సాధువాక్యములతో యముని మెప్పించి మూడు వరములు పొందినది. అంధుడైన మామగారికి దృష్టి వచ్చుట, శత్రువులచే గోల్పోయిన మామగారి రాజ్యము తిరిగి సంప్రాప్తమగుట, పుత్రసంతానములేని తన తండ్రి అశ్వపతికి, నూర్గురు కుమారులు కల్గుట, సాధించగలిగినది. ఐనప్పటికి, తనకు ప్రాణ ప్రదమైన భర్త ప్రాణములను యింతవరకు పొందలేక పోయినందులకు, వగచుచూ, యముని విడువక వెంటాడుచునేయుండెను. యముడు తనకు ఘోరపచారము చేయుచున్నాడని తెలిసియు, సామరస్యమున యెటువంటి కఠినతరమైన పనులనైన సాధించవచ్చునను గట్టి నమ్మకము గలదాటచే అనేకవినయముతో గూడిన మంచిమాటలతో యమధర్మరాజు మనస్సు సంతృప్తిపరచి, తన భర్త ప్రాణమునుకూడా పొందుటకై వెంటాడి పోవుచుండెను. అప్పుడు యముడు “ఓ సాధ్వీ! నీవిక మరలి పొమ్ము” అని చెప్పినప్పుడు సావిత్రి యిట్లనియె “ధర్మాత్ములైనవారు ఎప్పుడు వాక్కు, మనస్సు, క్రియలయందు ఎవరిని హింసించరు. ఆశ్రయించినవారి కోర్కెలను సంపూర్తిగా నెరవేర్తురు. ఓ దేవోత్తమ! మీకు ధర్మదేవత యని పేరు. సమబుద్ధితో సమస్తప్రాణులకు న్యాయాన్యాయములకు ధర్మపద్ధతిని తీర్పుచేయుదురు. నామనస్సు ఎల్లప్పుడు భర్తృచరణ పంకజాసక్తమైనది. సతులకు భర్త ఆశ్రమముగాక అన్యము ధర్మమా. ధర్మనిరతులైన పుణ్యాత్ములు యితరుల కష్టములను ఎంతమాత్రము సహింపరు గదా! సామాన్యముగా ఎవరితోనైన ఏడు మాటలు మాట్లాడినవారు బంధువులగుదురని పెద్దల వచనము. చాలా సేపటినుండి మీతో సంభాషించుటవలన నేను మీ బంధువునని వేరే చెప్పవలెనా! కావున నాకోర్కె తీర్చుట మీకు అవశ్యకర్తవ్యముగా చిన్తింపుడు” అని యింకా ఎన్నో విషయముల సంభాషించి, యముని పూర్తి ప్రసన్నుని చేసుకోగలిగినది.

అప్పుడు యముడు ప్రసన్నుడై మందహాసముతో “నీకిష్టమైన కోరికను కోరుకో యిస్తా నన్నాడు. సావిత్రి పరమానందముతో “ఇంతవరకు నీ భర్త ప్రాణములు తప్ప వేరు కోరుకొమ్మని చెప్పితిరి. యిప్పుడట్లు కానందున, నేను సంతోషముతో కోరు యీ వరమును ప్రసాదింపుడు. “భర్తలేని కాంత యీ పృథివిలో దూషితయగును. కావున నా ప్రియుడు కీర్తిశాలియైన సాళ్వసుతుడు, సజీవుడగునట్లు చేయు”మని కోరెను. అంత యమధర్మరాజు సత్యవంతునిపైనున్న కాలపాశమును తీసివైచి “యిదిగో తీసికో, నీ భర్త ప్రాణముల నిచ్చితి. సాధ్వీ! నీవు పూర్ణాయుష్యవంతుడై గొప్ప కీర్తిగలిగి, నూర్గురు కుమారులనిగని, సకల జీవరాసులయందునూ సత్యప్రేమలను జూపు భూషణాలంకృతుడై వర్ధిల్లు”నని చెప్పి అంతర్ధానుడైపోయెను. ఇక్కడ ఆమె యమునితో చేసిన సంభాషణలో చూపిన వినయ గౌరవములు, చాలా ప్రశంశింపదగినవి. సావిత్రి పరమానందముతో శీఘ్రముకాలంబునబోయి, తన భర్త శిరమును యథారీతి తన ఒడిలో బెట్టుకొని గమనించుచుండెను. అంత కొంతసేపటికి గాఢనిద్రనుండి లేచినట్లుగ లేచి సత్యవంతుడు పొద్దుపోయినదని ఖంగారుపడుచు, కట్టెలమోపులను పుష్పాలు ఫలములతో నింపిన సంచీని తీసుకొని

## సాక్షేపమయిన స్త్రీ పాత్ర

సావిత్రితో కలసి, తల్లిదండ్రులున్న ఆశ్రమము నకు చేరుకొనెను. ఇక్కడ ద్యుమత్సేనునకు వెంటనే దృష్టి రావడము, మరికొంతసేపటికే కోల్పోయిన రాజ్యము తిరిగి సంప్రాప్తమైనట్లు తెలియుట, మొదలైన ఆకస్మిక పరిణామము లకు యీ వృద్ధదంపతులు ఆశ్చర్యపడిరి. యిది అంతయు సావిత్రియొక్క అద్భుత పాతివ్రత్య కారణమని తెలిసికొని, ఆ అత్త మామలు, తల్లిదండ్రులు ఆమెను తమపాలిట భాగ్యరాశిగా ప్రశంశించిరి.

సావిత్రియందు నేనధికముగా గ్రహించిన దేమనగా, చనిపోయిన తన భర్తను తిరిగి బ్రతి కించుకోగలిగినది. ఇట్టి మహత్తర శక్తిని ఇంతకు ముందెవ్వరు చూపించకపోవుటచే యీ సావిత్రి పాత్రను అందరికంటె మిన్నగా నేను గౌరవిం చుటకు కారణమైనది.



## రచయితలకు మనవి

* మాకు కథలు, గేయాలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

* రచనలు ప్రచురించని వానిని త్రిప్పి పంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపు. అణా స్టాం పుకు తక్కువ కాకుండా పంపాలి.

* రచనలు కాగితానికి ఒకే వైపు సిరాతో వ్రాసి పంపాలి.

* రచనలు మాకుచేరిన విషయాన్ని తెలియపర్చ లేము.

* సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండు ప్రతులు పంపవలసినదని మనవి.

# డాక్టర్ హెలన్ కెల్లర్

శ్రీ పి. ఆర్. పేరరాజు

19 వ శతాబ్దంలో జగద్విఖ్యాతి చెందిన మహాపురుషుడు నెపోలియన్ బోనాపార్టే. యూరప్ ఖండమంతను అవలీలగా జయించి, తద్వారా యావత్తు ప్రపంచాన్ని తన చెప్పు చేతల్లో పెట్టుకోదలచిన యోధుడు నెపోలియన్. ఆ శతాబ్దం లోనే జన్మించి, మరొక రంగంలో అంతటి కీర్తినీ సంపాదించిన వీరవనిత హెలెన్ కెల్లర్.

అమెరికాలోని టాస్కోంబియా అనే ఒక చిన్న వూరిలో జన్మించింది హెలెన్ 1880 లో. ప్రథమ శిసువు కావడమే కాకుండా, సహజ సౌందర్య వంతురాలగుటవల్ల తలి తండ్రులు అత్యంత ప్రేమాతి శయాలతో పెంచు కుంటున్నారు. ఆరవ మాసంలో చిలక పలుకులు, ఏడాది లోపుగా తప్పటడుగులు వచ్చాయి. 18 మాసాలు నిండేవరకు అమిత ఆనంద ప్రదంగాగడిచింది. ఇంతలోనే అకస్మాత్తుగా జబ్బు చేయడం, డాక్టరు పెదవి విరచడం సంభవించింది. కాని ప్రపంచాన్ని ఉద్ధరించ వలసిన వ్యక్తి అంత సులభంగా అంతర్ధానమౌతుందా! ప్రాణహానికి బదులు ఇంద్రియ వైకల్యం కల్గింది. జబ్బు మళ్లటంలో కండ్లు, చెవులు, మాట బంధింప బడ్డాయి. బిడ్డ బ్రతికిందన్న సంతోషాన్ని లేకుండా చేశాడు భగవంతుడు. అంత వరకు సృష్టి సౌందర్యాలను చూచి ఆనందిస్తున్న ఆ



ప్రఖ్యాత మహిళామణి శ్రీ డాక్టరు హెలెను కెల్లరు, (కుడివైపునున్నామె) ఎడమ

బిడ్డకు యావత్ప్రపంచం అనంత నిశీథమైంది. మృదుమధురంగా పలుకుచున్న కోకిలస్వరాలు ఒక్కసారిగా బంధింప బడ్డాయి. శంఖారావం చేసినా వినబడని బ్రహ్మచెముడు. అప్పటిలో ఆమె తన దుస్థితిని అంతగా గుర్తించలేక పోయింది. కాని, ఆ తలితండ్రుల మనోవ్యధకు అంతులేదు. తల్లి ఆమెను ఎల్లప్పుడు తన చెంతనే బెట్టుకుని ఏలోటు రాకుండా చూచేది. హెలెన్ గుర్తులవలన సంజ్ఞలతోను తన అభిప్రాయాలను చాలవరకు తల్లికి తెలియ జేసేది. కాని ఒక్కొక్కప్పుడు, తన భావాలను ఇతరులు గ్రహించ లేకపోతే ఆమెకు అమితమైన ఆగ్రహం, నిస్పృహ కల్గేవి. వయస్సు వచ్చిన కొద్దీ, భావనాశక్తి పెరిగిన కొద్దీ, మధ్య మధ్య తన దురవస్థను గుర్తించి కంటతడి బెట్టుకునేది పాపం. కనీసం కంటిచూపైనా తిరిగి వస్తుందేమోనని తండ్రి అనేక వైద్యాలు చేయించాడు. ఫలితం లేక పోయింది. అప్పటికే ఆరేళ్లువచ్చాయి. వాషింగ్ టన్ నగరంలో డాక్టర్. బెల్ అనే ఆయన ఇట్టిస్థితిలో వున్నవారికి తగినసహాయం చేస్తాడని ఎవరో చెప్పగా ఆయన వద్దకు తీసుకువెళ్ళారు. డాక్టర్ బెల్ ఆమె దురవస్థకు జాలిచెంది తా నెరిగిన ఆనీసులేవాన్ అనునామెను హెలెన్‌కు ఉపాధ్యాయురాలుగా ఏర్పాటు చేయుటకు అంగీకరించాడు. సులేవాన్ చిన్నతనంలో అంధత్వం అనుభవించి కొంతకాలానికి తిరిగి దృష్టిని సంపాదించ కల్గింది. పరమేశ్వరుడు తనకు చేసిన ఈ మేలుకు కృతజ్ఞతా పూర్వకంగా తన జీవితాన్ని పరశేవకు అంకితం చేసిన ధన్యురాలు ఆమె

హెలెన్ ఇంటికివస్తూనే, సింహద్వారం వద్ద తనరాకకై నిరీక్షిస్తున్న ఆశిష్యురాల్ని అత్యంత ప్రాణప్రదంగా ఆలింగనం చేసుకుంది ఆనీసులేవాన్. ఈమెరాకతో హెలెన్ జీవితంలోద్వితీయ ఘట్టం ప్రారంభమైంది. వచ్చిననాటి నుండి, తాను జీవించినంత కాలం మిస్. సులేవాన్ హెలెన్‌కుఅధ్యాపకురాలుగా ఆమెతోనే కాలం గడపింది. మరునాడు విద్యాభ్యాసం ప్రారంభమైంది. ఒక బొమ్మను హెలెన్ చేతికి ఇచ్చి, దానిని ఆమె గుర్తించినపిమ్మట దానిపేరులోగల అక్షరాలను ఒక్కొక్కటే ఆమె చేతితో వ్రాసింది. హెలెన్ వాటినినేర్చుకున్న పిమ్మట తిరిగి తనవేలితో వ్రాయమన్నది. ఈ విధంగా తెలిసిన వస్తువుల అన్నింటి పేర్ల వర్ణ క్రమం నేర్పింది. క్రమేణా ప్రతివస్తువుకు, ప్రతిమనిషికి ఒక్కొక్క ప్రత్యేక నామధేయం కలదన్న జ్ఞానం ఆమె సంపాదించ కల్గింది. స్పర్శజ్ఞానంవల్ల తాను ప్రాపంచిక విజ్ఞానాన్ని సంపాదించగల నన్నధైర్యం తనలో పెంపొందినకొద్దీ హెలెనుకు జీవితంలో ఆనందం చేకూరింది.

పిల్లలు సామాన్యంగా పెద్దలాడినమాటలను విని వాటిని తిరిగి ఉచ్ఛరించడం ద్వారా భాష నేర్చుకుంటారు. భాషాభివృద్ధి కల్గినకొద్దీ తను తమ అభిప్రాయాలను స్వేచ్ఛగా వెలిబుచ్చుటకు నావకాశం కలుగుతోంది. చెవులు వినిపించక పోయినా, నోటమాట లేకపోయినా, కనీసం కంటిచూపైనా ఉన్నట్లయితే ఒక్కచూపులో అనేక ఆంతరంగిక భావాలను వ్యక్తం చేయవచ్చు. భగవంతుడు దానినికూడా ప్రసాదించని వారి దుర్భరావస్థ దురూహ్యం !

చేతితో వ్రాయడం ద్వారా కొన్నిమాటలు నేర్పిన తర్వాత అట్ట ముక్కలతో అక్షరాలు తయారుచేసి వాటిని గుర్తించడం, పిమ్మట వాటిని చిన్నచిన్న వాక్యాలుగా ఏర్పాటుచేయడం నేర్పింది ఆనీసులేవాన్.

అమెరికాలో, అంధులకుగాను, స్పర్శజ్ఞానం

వల్ల అక్షరాలను గుర్తించకగ్గే పుస్తకాలు కొన్ని తయారు చేశారు. ఆ పుస్తకాలను సంపాదించి వాటిని చదవడం నేర్చుకున్నది హెలెన్. ఆమెకు తెలియని మాటలకు అర్థం చేతిలో వ్రాసి చెప్పేది, గురువు.

హెలెన్ కిల్లర్‌కు ఎనిమిదేండ్లు రాగానే ఆమెను బోస్టన్ నగరంలోని అంధ విద్యార్థుల పాఠశాలకు పంపుటకు ఏర్పాటు చేశారు ఆమెతో మిస్. సులేవాన్ కూడా వెళ్ళింది. ఈపాఠశాలలో స్పర్శద్వారాను, చేతివేళ్ళ గుర్తులమూలంగాను భాష నేర్పుతారు. అక్కడ ఉన్న విద్యార్థులను చూచేవరకు హెలెన్‌కు తనబోటి కటిక కబోదులు ఈ ప్రపంచంలో ఇంకా అనేకులు వున్నారని తెలియదు.

బోస్టన్ విద్యాలయంలో, అంధులకు గాను ప్రత్యేక పుస్తకాలు అనేకం తయారు చేయబడ్డాయి. ఈ పుస్తకాలలోని అక్షరాలు ఎత్తుగా కర్రతో చెక్కబడినట్లు వుంటవి. వీటిని తాకుట వల్ల ఏది ఏఅక్షరమో గుర్తించ వచ్చు. అనేక కథలు, పద్యాలు ఈ పుస్తకాల సహాయంతో హెలెన్ నేర్చుకో గల్గింది. ఆమెకు తెలియని కొత్త మాటలేమైనా ఉంటే సులేవాన్ వాటి అర్థం చేతిలో వ్రాసి చెప్పేది. చరిత్ర, ఫ్రెంచి భాష, గ్రీకుభాషా కూడా అతి దీక్షతో చదివి కొద్దికాలంలోనే వాటని బాగా నేర్చుకున్నది హెలెన్.

వయస్సు వచ్చిన కొద్దీ హెలెన్‌కు విజ్ఞాన తృష్ణకూడా హెచ్చయింది. దీనితో పాటు తన ఇంద్రియ లోపాలను జయించాలనే వాంఛ మరింత పెంపొందింది. ఏవిధంగానైనా మాట్లాడగల శక్తిని సంపాదించాలని సర్వదా ప్రయత్నించేది. గొంతుకమీద చేయిపెట్టే లోపల నుండి ధ్వనిని పెకళించాలని విశ్వప్రయత్నాలు చేస్తువుండేది. మిస్. ఫుల్లర్ అనే ఆమె ఎవరికో మాటలాడటం నేర్పిందని తెలిసి ఆమె సహాయాన్ని అర్థించడానికి వెళ్ళింది.

మూగవారి పాఠశాలలో అధ్యాపకురాలైన ఆమె, హెలెన్‌కు కూడా నేర్పటానికి అంగీకరించింది. తాను మాట్లాడేటప్పుడు పెదిమెలు, నాలుక ఏ విధంగా కదులునో హెలెన్ వేళ్ళకు చూపించేది. తిరిగి తానుకూడా నాలుకను పెదిమెలను కదల్చమని బోధించింది. ఈ విధంగా ప్రతి అక్షరం తాను పల్కి దానిని హెలెన్‌చే గుర్తింపజేసి తిరిగి పలికించేది. మొదటి రోజున, రోజంతా ప్రయాస పడగా ఆరు అక్షరాలు వచ్చాయి. పదిరోజుల పాటు నిరంతర సాధనచేసి చిన్న చిన్న వాక్యాలు మాట్లాడగల శక్తిని సంపాదించింది. హాటాత్తుగా పోయిన మాట ఇన్నేళ్ళకు తిరిగి సంపాదించ కల్గటం హెలెన్‌కు అమితానందాన్ని కల్గించింది. చిరకాలం సంకెళ్ళ ననుభవిస్తున ఆత్మకు ఒక్కసారి బంధ విమోచన కల్గినట్లయింది. తోటి జీవులకు తన మనోభావాలను వెలిబుచ్చ నలవికాని అనంత నిశ్శబ్ధంలోనుండి ఒక్కసారిగా బైటకు వచ్చినట్లయింది. రాత్రింబవళ్ళు కొత్త మాటలను పఠించడమే పని. తానిక మూగకాదని గుర్తించగానే, తననూతన శక్తిని తలిదండ్రులకు చూపించాలన్న ఆతృతతో స్వగ్రామానికి బైలుదేరింది. ఆమె నోటి నుండి మధురస్వరం వినిపించగానే ఆ తల్లి తండ్రులు తమ బిడ్డకు పునఃజన్మ సంప్రాప్తించి నట్లే ఆనందించారు.

ఇంతవరకు సరియైన చదువులేదు. హెల్‌కు అప్పుడే 14 గేండ్లు వచ్చాయి. చదువు మీద ఆశక్తిమాత్రం చాలావుంది. అందు వల్ల న్యూయార్కు నగరంలోని అంధుల పాఠశాలకు ఆనీ

సులేవాన్‌తో పంపించారు. అక్కడ రెండేండ్ల పాటు లెక్కలు భూగోళం మొదలైనవి చదివింది. చదువు వస్తున్న కొద్దీ ఉన్నతవిద్య మీద అపేక్ష ఎక్కువ హెచ్చయింది. స్కూలు ఫైనలు క్లాసులలో చేరింది. కాని క్లాసులకు మాత్రం తన బదులు ఆనీ సులేవాన్ వెళ్ళి అక్కడ చెప్పినవి తిరిగి ఇంటివద్ద తనకు నేర్పడం. అది ఏర్పాటు. రెండేడ్లు ఇలాగ ప్రయాసపడి ఆ పరీక్ష ప్యాసయింది. అంతటితో అగుతుందా? మళ్ళీ ఆనర్సు పరీక్షకు కాలేజీలో ప్రవేశించింది. మూడేళ్ళ పాటు రాత్రింబవళ్ళు ప్రయాసపడి ఆనర్సు డిగ్రీ కూడా సంపాదించింది. కండ్లు లేక పోయినా, చెవులు వినబడక పోయినా, అన్నీ వున్నవాళ్ళతో సమంగా పోటీచేసి ఉత్తీర్ణురాలు కాగల అనన్య సామాన్య ప్రజ్ఞావంతురాలు.

హెలెన్ కెల్లర్ జీవిత చరిత్రి ఈ ప్రపంచంలోని అంధులకు మార్గదర్శక మైనది. దురదృష్ట వశాత్తు సంప్రాప్తించిన శారీరిక వైకల్యాలను జయించి, జీవితాన్ని ఏ విధంగా ఫలప్రదం చేసుకోవచ్చునో ఈమె చూపించింది. తనబోటి ఇతర కబోదుల బ్రతుకు ఆనందదాయకం చేయడానికి నిరంతరకృషి సాగిస్తున్నదీనాడు. ఆమె త్యాగశీలత, పరోపకార పరాయణత యావత్తు ప్రపంచం గుర్తించి గౌరవ డాక్టరు బిరుదు ప్రదానం చేశారు. ఆమె సలహాల కోసరం దేశదేశాలవారు ప్రార్థేయ పడతారు.

భారత ప్రభుత్వం ఆహ్వానంపై ఈనాడు ఈమె మనదేశంవచ్చింది, ఇచ్చటి కబోదులకు, చెముడు, మూగలతో నిరర్థక జీవనం గడుపుచున్నవారికి ప్రయోజనకరమగు మార్గాలను సూచించుటకు. ఆమె అమూల్య సలహాలను ఆచరణలో పెట్టుటవల్ల అంధుల జీవితాలలో ఒకనూతన శకం ప్రారంభించ గలదని ఆశించవచ్చు.




# వేసవిలో అందం

శ్రీమతి సువేణికాశ్యప్

"Lovely summer ........." "Beautiful spring........" అంటూ ఉత్సాహంతో ఆడుతూ పాడుతూంటారు పాశ్చాత్యులు. spring లో చక్కగా చలిపోయి, రంగురంగుల పువ్వులు వికసించి, చక్కని సువాసనలను వెదజల్లుతూంటే, చిన్ని చిన్ని పిట్టలు మధుర గానం చేస్తూంటే యువ హృదయాలు ఆనందంతో ఆటంకాలను లెక్కచేయకుండా అలా అలా ఎగిరిపోతూ అందమైన హృదయాలను వెతుకుతూ ప్రకృతి శోభను పరిపూర్ణంగా అనుభవిస్తూ వుంటాయి.

కాని మనకు ? వసంతఋతువు వేసవికాలం ఒక్కసారే వచ్చినట్లుంటుంది. మొక్కలన్నీ ఎండిపోతూ, పచ్చి గడ్డి అయినా మొలవకుండా, దాహంతో నోరు తెరుచుకొన్న పశువులు చెట్టు అయినా దిగి రాకుండా ప్రకృతిని గొడ్డుపోయిన దానిలా చేస్తాయి.

కాని ప్రకృతి సౌందర్యాన్ని, తమ సౌందర్యాన్ని నిలుపుకొనే శక్తి స్త్రీ చేతిలో ఉంది. ఎలాగో చూదాము.

ఎండా కాలంలో చాలా మందికి ఒళ్ళు ప్రేలి, సెగ్గడ్డలు లేచి, వడగొట్టి, జ్వరాలు వచ్చి చిదరగా, చిరాకుగా, బాధగా ఉంటారు. "ఈపాడు ఎండాకాలం ఎప్పుడు పోతుందో" అని విసుక్కొంటారే కాని మన జాగ్రత్తలో మన ముందామని ప్రయత్నించరు.

ఎండాకాలంలో రెండు పూటలా స్నానం చేయటం మంచిది. చన్నీళ్ళతోనో, గోరువెచ్చని నీళ్ళతోనో మంచి సోపుతో బాగా రుద్ది పోసుకొంటే హాయిగాఉంటుంది. తర్వాత వళ్లు అంతా శుభ్రంగా పౌడరు వేసుకొని దుస్తులు ధరిస్తే చమట సోయకుండా ఉంటుంది. అయితే ఎప్పుడు పడితే అప్పుడు స్నానం చేయకూడదు. ప్రొద్దుట తొమ్మిది లోపల సాయంకాలము నాలుగు తర్వాత చేయటం మంచిది.

దుస్తులు వేసుకోవటంలో కూడా శ్రద్ధ చూపాలి. వేసవిలో సన్నని నూలు బట్టలు ధరిస్తే హాయిగా ఉంటుంది. తెల్లనివి, తేలిక రంగులవి ఏరుకోవటం మంచిది. మండుటెండలో ముదురు రంగు వేసుకొంటే వంటికి మంచిది కాకపోవటమేకాక చూసేందుకు కూడ కొట్ట వచ్చినట్లుంటుంది. ఎండా కాలంలో సిల్కు వాడటం తగ్గించటం అవసరము.

# వేసవిలో అందం

తర్వాత బట్టలు ప్రొద్దుటగా, సాయంకాలము రెండు పూటల మార్చటం మంచిది. కొంచెము వదులుగా కుట్టుకొని తొడుక్కొంటే అంత చిరాకుండదు. చెమటకూడా తగ్గుతుంది.

ఇక అలంకరణ విషయము ఎలాగో చూదాము. మధ్యాహ్న పూటలు స్నో వాడటం తగ్గించాలి. ఉత్త పౌడరులో నీటిబొట్లు వేసి పల్చగచేసి స్నోలాగ రాసుకొని బాగా ఆరనిచ్చి పౌడరు పువ్వుతోనో, చేతి రుమాలుతోనో మెల్లిగా తెల్లతెల్లగా ఉన్న చోట్ల సరిచేసి, తర్వాత పౌడరును మామూలుగా వేసుకొంటే త్వరగా చమట పోయదు. ముఖం మీదికి చేతులు ఎక్కువగా పోకుండా ఉంటే చాలా సేపటి వరకు పౌడరు చెరగదు

సాయంకాలము అయితే స్నోలో రెండు మూడు చిటికెల పౌడరు వేసి నీటి బొట్లువేసి కలిపి రాసుకొని తర్వాత పౌడరు వేసుకొంటే ఎక్కువసేపు పౌడరు నిలుస్తుంది.

ఇక జడను కొంచెము ఎత్తుగా వేసికొంటే చిరాకు తగ్గుతుంది. వేసవిలో మెడ నిండా ఇన్ని నగలు వేసుకోవటం మానాలి. ఒకటి రెండు సన్నవి వేసుకొంటే మెడచుట్టు ప్రేల కుండా ఉంటుంది. మామూలుగా ఇంట్లో ఉన్న సమయాలలో జడ గట్టిగ వేసుకొని ముడి పెట్టుకోవటం మంచిది.

తర్వాత తలంటు విషయంలో శ్రద్ధగా ఉండాలి. ఎండాకాలంలో వారానికి రెండు మూడు సార్లు తలంటి పోసుకోవాలి. తలంటి ప్రొద్దుటకన్నా సాయంకాలమయితే హాయిగా ఉంటుంది.

నడిచేటప్పుడు సాధ్యమైనంతవరకు చెప్పులు వేసుకొని నడవటం మంచిది. తర్వాత గాజులు అవి ఒకటి రెండు వేసుకొంటే హాయిగా ఉంటుంది.

ఫ్రెష్‌గా ఉండాలంటే బజారులో అమ్మే సాధకాలుపయోగించవచ్చు. మంచిగంధ ముపయోగించినా హాయిగా ఉంటుంది. ఇది నీళ్ళలో కలిపి స్నానం చేస్తేకూడ బాగా ఉంటుంది.

ఆహార విషయం చూదాము. ఎండా కాలం దాహం ఎక్కువగా వేస్తుంది. కాని ప్రతీసారి మంచినీళ్ళు తాగటం మంచిదికాదు. స్ట్రాంగ్ పిప్పరమెంట్లు, అతి మధురంగా దగ్గరుంచుకొని అప్పుడప్పుడు వాటిని ఉపయోగించటము అలవాటు చేసుకోవాలి.

మధ్యాహ్నం పూట పల్చని మజ్జిగలో చక్కెర వేసుకొనో, ఉప్పు వేసుకొనో త్రాగటం మంచిది. తర్వాత కూల్‌డ్రింక్సు ఎక్కువగ తీసుకొంటూండాలి.

క్రొత్తఆవకాయ, మాగాయ తినటం బాగా తగ్గించాలి. వంకాయ, కంద మొదలైన వేడి పదార్థాలు తినటం మానితే సెగ్గడ్డలు లేవకుండా ఉంటాయి.

తర్వాత మామూలుకన్నా ఉప్పును ఎక్కువ తినటం ఎండాకాలంలో అవసరం. దీనివలన నీరసం తగ్గటమేకాకుండా, చిక్కడం కూడ ఉండదు. తర్వాత చలవచేసే ఆహారం ఎక్కువ తీసుకొంటూ విటమిన్సు ఎక్కువగ ఆహారంలో ఉండటము చూసుకోవాలి.

ఇక భోజనం ప్రొద్దుట పదిగంటలలోపల చేసి, మధ్యాహ్నపు పూట టిఫిన్ వగైరా తీసుకొని రాత్రి ఎనిమిది గంటలలోపల భోజనం, ఇంటిపనులు ముగించుకొని పడుకోవటం అవసరం. మధ్యాహ్నపూటలు కనీసం ఒక గంట అయినా నిద్దుర పోవటం ఆరోగ్యానికి ముఖ్యం. ఇలా జాగ్రత్తగ ప్రతిరోజు గడిపితే ఎండాకాలం హాయిగా గడుస్తుంది.

ఇక ఒంట్లో హాయిగా ఉన్నాక ఎన్నయినా చెయ్యొచ్చు. మధ్యాహ్న పూటలు వడగాలి తగలకుండా వట్టివేళ్ళ తడికలు వేసుకోవచ్చు.

తర్వాత రోజు ప్రొద్దుట శుభ్రంగా ఇల్లంతా కడుగుకొంటే కొంచెము చల్లగా ఉంటుంది. అలాగే సాయంకాలము తడిగుడ్డపెట్టి తుడిస్తే బాగుంటుంది.

తర్వాత రాత్రులు మంచిగాలి బాగా వచ్చే చోటులలోనో, ఆరుబయలులోనో పడుకోవటం ఉత్తమము. ఆరోగ్యకరమైనది. ఇక ఆరోగ్యంగా ఉన్నప్పుడు చెట్టు చేమలను ఎలాగైనా పోషించి ఆనందంగా ఉండవచ్చుకదూ!

ౚౚౚౚ

# పాకకళ

ఎస్. కె. రాజేశ్వరీరాజీ.

పాలకాయలు.

బియ్యం — 1 శేరు.
కందిపప్పు — పావుశేరు.
కొంకాయలు — 2 పెద్దసైజువి.
తగినంతఉప్పు. జీలకర్ర కొద్దిగ.

బియ్యం నానబెట్టి కందిపప్పు కలిపి మిషను కివ్వాలి. మెత్తటి పిండిలో తగినంతవుప్పు జీలకర్ర కొబ్బరికోరు వేసి పూరీల ముద్దలా పిసుక్కోవాలి. బియ్యాన్ని కడిగి ఎండపోస్తే ఆ పాలకాయలు వేరుగా వుంటుంది పచిలో చిన్న కుంకుడు కాయలంత వుండలుగా చేసి తడిగుడ్డ పిండి ఆరవేసి అందులో వెయ్యాలి. గచ్చకాయలంత కూడా చేసుకోవచ్చు. విడివిడిగా వేసి ఒకవాయకు ఇంపై లేక మున్నూరు కాల్చ వచ్చు. అయితే ఈ పని చాలకష్టం గావుంటుంది. చెయ్యడం అంటే నలుగురు పిల్లలున్న ఇంట్లో అయితే ఇట్టే నిముషానికి నూరు, ఇన్నూరు పాలకాయలు తయారయి పోతుంది. తింటానికి చాలా బావుంటుంది. ఇదిచాల పూర్వకాలపు పిండివంట.

తేంతిళ్ళు.

దీన్ని అరవంలో తేన్‌గొయల్ అంటారు. బహుశా ఇది పాలగాటు పిండివంట కావచ్చు.

బియ్యం — 1 శేరు
మినపప్పు — పావుశేరు
నువ్వులు — 1 చిట్టి.
తగినంతవుప్పు. నెయ్యి, 1 ప. ఇంగువపాలు.

బియ్యం మిషనుకిచ్చి మెత్తగా పిండి చేసుకోవాలి. మినపప్పు కమ్మగా వాసన వచ్చేంత వరకు వేయించు కొని బియ్యంతోకూడా మిషను కివ్వవచ్చు. నువ్వులు తెల్ల పప్పు చేసి వుంచుకోవాలి. (నువ్వులు నానపోసి ఐదునిము షాలు నానింతర్వాత నీరంతా వారిచేసి చాటలో పోసి ఎండలో పెట్టాలి. కాస్త ఎండినతర్వాత నల్లపొట్టంతా వచ్చేస్తుంది చెరిగితే)

పిండిలో నువ్వులు, తగినంత ఉప్పు, నెయ్యి, ఇంగు వపాలు గుచ్చెత్తి తగినన్ని నీరుపోసి పిండేందుకు అను వుగా కలుపుకోవాలి. మురుగు పువ్వుల గొట్టంలో కూడా పిండుకోవచ్చు. ప్రత్యేకంగా తేంతిళ్ళుబిళ్ళలని వుంటుంది అందులో పిండితేసూ ఒకటే. తేంతిళ్ళు కూడా విడిగా చేసుకొనే దానికన్నా పదింటిలో ఒకటిగా చేయవచ్చు.

పిడచకుడుములు.

బియ్యం — 1 శేరు.
కొంకాయలు — 3.
జిలకర, మిరియాలు తగినంత ఉప్పు.

బియ్యం రాయిరప్ప లేకుండా బాగుచేసుకొని కడిగి ఎండబోసి ఉప్మానూకలా విసురుకోవాలి. లేదా మిషను కివ్వవచ్చు. కొంకాయ కోరుకోవాలి. ఉప్మాకయితే ఒక తవ్వకు రెండు నీళ్ళు పొయ్యాలి. పిడచ కుడుములకు ఒక తవ్వకు ఒకటిన్నర నీళ్ళు పొయ్యాలి. నీళ్ళు తెర్లిం తరువాత జిలకర్ర, ఉప్పు, మిరియాలు పొడుంచేసి వేసి కొబ్బరికోరు పోసి తర్వాత నూకపోసి ముద్దకట్టగనే దిం పేయాలి. వేడిమీదనే పిడికిట్లో పట్టినంత తీసుకొని కోడి గుడ్డు ఆకారంతో కుడుముల్ని చెయ్యాలి,

ఇడ్లీకినీరు పెట్టినట్లు ఎసరుపెట్టి ఇడ్లీతట్టలలోనే తట్టకు ఆరు పెట్టవచ్చు. ఇవి వుడికిన తర్వాత దింపివేయాలి. ముఖ్యంగా అమ్మమ్మ,నాయనమ్మ,లు సులువుగాఫలహారం చేసుకోవచ్చు. జిలకర్ర, మిరియాలు వున్నదికాబట్టి సులు వుగా జీర్ణం అవుతుంది కూడా.

# వేదాంతగోష్ఠి

వైద్యశాస్త్రాలు- సంపూర్ణమైనవిగాని, అసంపూర్ణమైనవిగాని - అనేకము ఆయుర్వేదము, యునాని హోమియోపతి, ఎల్లోపతి, ఇంకా ఇంకా అన్నిటి ఆదర్శం ఒకటే - అనారోగ్య నిర్మూలనం, బలారోగ్యప్రదానం. ఔను, ఇంకా ఎన్ని భిన్న వైద్య శాస్త్రాలున్నా బాధలేదు. ఏశాస్త్రానికాశాస్త్రమే ఒక్కొక్క రోగానికి తన ప్రత్యేక నిదాన విధానం, చికిత్సావిధానం చెపుతుంది. ఒకే మూలికతో తయారైన ఔషదాన్నే వేర్వేరు వైద్యశాస్త్రాలు వేర్వేరు పేర్లతో, రకరకాల రూపాలతో అందిస్తే అది గుర్తించి, నిస్వార్థంగా అన్ని పద్ధతుల వైద్యులు కలసి ఐకమత్యంతో పరస్పర సహాయ సహకారాలతో పనిచేసి నప్పుడే దేశంలో ఆరోగ్య దేవత ఆనంద తాండవం చేస్తుంది.

ఆలానే మతాలుకూడా, ఒకే ఆదర్శంగలిగి ఒకే గమ్యస్థానం చేరటానికి వేర్వేరు బాటలు వేస్తే ఒకే ధర్మాన్ని వివిధ నామాలతో, విభిన్న సాధనా పద్ధతులతో ప్రబోధిస్తూఉంటే ఎన్నటికైనా అందరు మతప్రచారకులు, అందరు మతవక్తలు కలసి త్రికరణశుద్ధిగా ఐకమత్యంతో పని చేస్తేనే మానవకోటికి సౌఖ్యం.

అట్లే వివిధమతానుగాములు, వివిధ మత ప్రచారకులు, ఏకమత ప్రచారక విభిన్నసంస్థలు పై సత్యాన్ని - సర్వమత ప్రాథమిక సూత్ర ఆదర్శాల ఏకత్వాన్ని - గుర్తించి వివిధ మతాలను సమన్వయ పరచుకొని, వాట్ల సామ్యరసమును గ్రహించి సఖ్యపడి ఏకైక ఆశయసిద్ధికై భవరోగుల యోగక్షేమాలే పరమ లక్ష్యంగా పెట్టుకొని సర్వమతసంస్థలను సంఘటిత పరచి, ఐకమత్యంతో, నిస్వార్థంగా, నిష్కల్మషంగా కృషి చేసిననాడే మతాల ఆశయసిద్ధి, ఆ నాడే లోకశాంత్యానందాలు, లోకకళ్యాణం విశ్వకళ్యాణము.

[శ్రీ ముక్తేవి ఉదయవర్ విరచితము
"మతం అంటే...?" అనుపుస్తకమునుండి-]

* * *

గుణాతీతుని లక్షణము :-

మూడు గుణములు తమలోని భ్రమ ఆనందంతో చీటికి మాటికీ ప్రలోభపెట్టిన చలింపక సర్వమెరిగిన వాడై శరీరమే లేదన్నట్లు ఉన్మత్తుని పగిది నిస్పృహవహించి దేహి దైనిక కర్మలలో ఆశక్తిలేక శరీరము నిల్పుటకు మాత్రము తగినంత రాగద్వేషములు కలిగినవాడై తదితరమును త్యజించి జ్ఞానభావనలో జ్ఞానవాక్కులలో జ్ఞాన కర్మలతో పరితృప్తి చెందినవాడై చూచుటకు ఏమీ ఎరుగని పసిపిల్ల వానినిబోలి సత్కర్మల సమయము ప్రాప్తించినపుడు శక్తితో భరించి ఒనర్చువాడు గుణాతీతుడు - నిర్గుణుడు

శ్రీమతి. కృష్ణమ్మగారు.



# పరమ భక్తులు

# దమయంతి



శ్రీమతి కె. సీతాదేవి.

భక్తి అనగా భగవద్భక్తి అనిసే మనకు తోస్తుంది. భక్తిలో కూడా జ్ఞానభక్తి మూఢ భక్తి కలదు. ఏ భక్తియైనా పరసాధనకు మార్గములే. త్యాగరాజు, ధ్రువుడు, హనుమంతుడు మొదలైనవారంతా జ్ఞాన భక్తులే. మూఢ భక్తి అంటే తమకు తెలియకపోయినా ఒకరు త్రోవ చూపించగనే వారి యడుగుజాడ తూ. చ. తప్పకుండ ప్రవర్తించి, తరించినవారు. తరించుటమాత్రమేకాదు. ఇహలోకంలో వలయు విద్యాబుద్ధులుకూడా సంపాదించిన వారు. అట్టివారిలో కాళిదాసు ఒకడని చెప్పాలి. అతడు బ్రాహ్మణ వంశసంజాతుడైకూడా సహవాసదోషంవల్ల విద్యాహీనుడై మూర్ఖుడుగా వుంటాడు. రాజకుమారిమీద కోపంతో రాజగురుదువు ఆ మూర్ఖునిదెచ్చి రాకుమారికిచ్చి వివాహం చేస్తాడు. విద్యావతియైన యామె తనపతి విద్యలేని మూఢుడని యెరింగి కాళి అర్ధరాత్రివేళ సంచారానికి వెళ్ళియుంటుంది. ఆగుడిలోనికి వెళ్ళి తలుపు మూసుకుంటే ఆమె వచ్చి యేమికావాలని అడిగితే విద్య అని చెప్పమంటుంది. మూఢభక్తిగదా అలాగే చేస్తాడు. దానితో కాళీ వరప్రసాదంవల్ల కాళిదాసని సార్థక నామధేయుడైనాడని యెల్లరకు విదితము. అలాగే స్త్రీలలో కూడ సక్కుబాయి, మీరాబాయి మొదలైన భక్తురాండ్రు లేకపోలేదు. కాని స్త్రీకి పతియే దైవం. సాధ్వియై పతి భక్తిగల కాంతకు పరమదైవంతో పనిలేదు. ఆభక్తితో సాధించలేని కార్యము ఇహపరలోకాలలోకూడా లేదు. అట్టి కాంతామ తల్లిని పరమభక్తురాలనియే చెప్పాలి. అట్టి పరమ భక్తులలో దమయంతి యొకటి.

దమయంతి విదర్భాధీశుడైన భీమరాజపుత్రి పెద్దకాలము సంతానరహితుడైన యారాజునకు తొలినోము పంటగా దమనాహ్వాయుడను తపోధనుని యనుగ్రహంవలన ఆ కన్యారత్నం జన్మించింది. త్రిలోకములలోని స్త్రీల సౌందర్యాన్ని తిరస్కరించగల లావణ్యవతియైనందున ఆకాశవాణి ఆమెకు దమయంతి యను నామధేయ ముంచింది. సాధ్వీమతల్లి. పతిభక్తియే ప్రధానముగా నెంచిన స్త్రీలలాము. భట్టుల వల్ల నలుని సద్గుణాలువిని యతడే పతియని నిర్ణయించింది. ఇంద్రాగ్ని యమ వరుణులు దమను వివాహమాడమని దూతికలను బంపినప్పుడు నలుని రాయబారమునప్పుడు ఆమె సంపదల కపేక్షింపలేదు. దేవతలపంపున రాయబారానికి వచ్చిన నలుడు దమయంతి శుద్ధాంతంలోనికి వచ్చి శాంబరి ధరించి ఒకమూల యితరులకు కనపడకుండా యింద్రాగ్ని యమ వరుణులు పంపిన దూతికల సంభాషణను వినుచుంటాడు. దూతికలా నలుగురిలో నొకరిని వరించుమని చెప్పుచు,

చంచలనేత్ర దివ్యలిపిసంతతి భూజనములీపఠింపలే
రంచునుమానెగా నిన్నిఖరాగ్రమునన్ లిఖించినీకు బు
త్తెంచుజుమీమహేంద్రుడు మదీయకరంబున దేవతావనీ
కాంచన లేతకేకుసుమ గర్భదళంబున కార్యపద్ధతుల్.

దూతికలిట్లు చెప్పుచున్నప్పుడు ఆమె లోబడలేదు. నలుడు దేవేంద్రుని యభిప్రాయం చెప్పునప్పుడు,

అటు తగునే సురేశ్వరుని యంతటివాడఖిలప్సరోంగనా
విటుడొకమర్త్యభామినికి వేడుకసేయుచునున్నవాడువి
స్ఫుట బహురత్నభూషణ విభూషితులయ్యెడు
రాచవారికిన్
కటకటయారకూట కటకంబు రుచించునె కాక
యొక్కెడన్.

ఎంతటి యుపమానం రత్నభూషణములు ధరించు చక్రవర్తులకు యిత్తడి యాభరణములెట్లుతగవో యప్సరసకాంతల సేవలందు దేవేంద్రునకు, మానవకాంతను కోరుట తగని పద్ధతియని యెంత నర్మోక్తిగా చెప్పిందో చూడండి. అందరకు నలునితప్ప మరొకరిని వరించనని సమాధానమిస్తుంది. దేవతలను లెక్కింపనందున ఆమె పాతివ్రత్యము పరీక్షింపగోరి యింద్రాగ్ని యమ వరుణులు నలుగురు స్వయంవర సమయంలో నలాకారందాల్చి కూర్చుంటారు. అప్పుడు సరస్వతి నలునకు దేవతలకు

అందువల్లు నైషధు సంగతిని చూస్తుంది. అప్పుడు దమయంతి నిజమైన నలుని తెలుసుకోనలేక అది దేవతల మాయయో, నలుని విశ్వాసహీనమోయని పలువిధముల చింతిస్తూ దేవతలను వేడుకొందు ననుకుంటూ వారేం దయచలచెదరని సందేహిస్తూ వుండగా భూమికందని పాదములు, వాడని పుష్పదామములు, రెప్పపాటులేని చూపులు మొదలైనవాటివల్ల నిజమైన నలుని తెలుసు కొనునంతలో నలువపట్టపు రాణె దమయంతి మనోగతం దెరింగి ఆమె చేయి పట్టుకొని చిరునవ్వుతో సురలతో నిట్లంటుంది. "ఇంద్రాగ్ని యమవరుణులు కరుణాతరంగి తంబులగు నంతరంగంబులతో నీయింతి నను గ్రహింప వలయునంటూ"

ఎట్టువరించు సాధ్వీమియునిందఱ దేవచతుష్టయంబు నం
దెట్టుకనిందగంగవరించు, తదన్యులధిక్కరించి వే
ర్వెట్టగ నేర్చుగాపున వరించి కృతార్థత(బొందుగాకమీ
యట్టి మహానుభావు భవదంశసముద్భవునైషధాధిపున్.

అని యామె పలుకుచుండగనే యా సురలు యధా రూపములు ధరించిరి. అప్పుడు దమయంతి నలుని వరిస్తుంది. "లెక్కకు రానీయడు కార్యసాధకుడు సుఖం బున్ దుఃఖంబున్" అని భర్తృహరి చెప్పినట్లు ఎన్ని కడగండ్లకైన ఓర్చి పతివ్రతామతల్లి తన మనోభీష్టం నెరవేర్చుకొన్నది. తర్వాత కలిమాయచే రాజ్యభ్రష్టులైన నలదమయంతులు వనానికి వెళ్ళినప్పుడు నిద్రించుచున్న దమయంతిని నలుడు వదలివెళ్ళతాడు. ఒక అజగర మామెను మ్రింగబోగా ఒక బోయ దానిని సంహరించి ఆమెను చూచి లేమశరాహతుడవుతాడు.

అగ్నిశిఖయుబోలె నంటను డాయను జూడరానియట్టి శుభ చరిత్ర ఎఱుకలేని కఱుకుటిఱు కపేక్షించెగాదనక తనకు నాయువల్పమైన కాలము దాపురిస్తేనేగాని అట్టి పతివ్రతల జోలికి వెళ్ళుట సంభవించదన్నారు కవిత్రయం లోనివారు. తరువాత నామె పాతివ్రత్యప్రభావంతో వానిని దగ్ధంచేసి వృక్షముల తన పతినిగురించి యడుగుచు ఆయరణ్యంలో తిరుగుచుండగా పురాకృత పుణ్యఫలంబు వల్ల మునీశ్వరుల యాశ్రమం కనపడుతుందట. ఆతపో ధనులామెను చూచి ఆమె యెవరని యడుగ "పుణ్య శ్లోకుండన సదా యజ్ఞ నిరతుండను పేరు పొందిన నలుని భార్యనంటుంది" అరణ్యమునకుదెచ్చి నిద్రించు చుండగా పైకొంగు చించుకొని వెళ్ళిన భర్తను పుణ్యాత్ముడని చెప్పిందంటే పతివ్రత స్వభావం ఎంత కష్టాల్లో కూడా మారదుకదా. వారిని నలుని చూచారా యని యడుగ వారామెతో కొన్నిరోజులలో నలుని సందర్శన భాగ్యం కలుగగలదని యెప్పటియట్లు రాజ్యమును పొంద గలడని చెప్ప తపోధనులపలుకుల మోఘములని ధైర్యం వహించి సుబాహు పురమునకు వెళుతుంది. రాజమాత ఆమెను పిలచినప్పుడు తనవృత్తాంతమును చెప్పుకొని యామెకు సైరంధ్రిగానుండెను. పరపురుషులతో పలుకను పతిని అన్వేషించుటకు వెళ్ళు బ్రాహ్మణులతో మాత్రం పలుకుదు నంటుంది. ఆమె యట్లంటూవుండగా సుదేవుడును బ్రాహ్మణుడు దమయంతిని వెదకుటకు సుబాహు పురమునకువచ్చి దమయంతి భ్రూయుగమధ్యనున్న శుభ లక్షణాన్నిబట్టి గుర్తించి ఆయన మనస్సులో ఆమెను గూర్చి యిలా చింతిస్తాడు.

1. అనపహారంబు తేజోమయంబు సర్వగుణములకు
నలంకారంబు గురుతరంబు

భామలకు పతిభక్తియే పరమైన భూషణంబిట్టివే పెఱ భూషణముల తమతనలుని వెదుక పంపిన బ్రాహ్మణులతో నలుని తెలుసుకొను మార్గం యుక్తియుక్తంగా చెప్తుంది,

నిత్యసత్యుండవు నీసతివంచించి దానివస్త్రార్ధంబు
దఱగెనీకు
బరిధానంబుజేసి పొడియెపోవంగభార్యభర్తవ్యనా
బరగుధర్మ
మదిమిథ్యయయ్యే నీయందు నీకిట్టినిర్దయబుద్ధి
చేకొనదగునె యట్టి
సాధ్వికి ప్రసన్నుండవగుమని యెల్లచోబలికిన
నెవ్వడాని
బలుకువడనోడి ప్రతివచనంబిచ్చు నతడు నలుడుగా
బ్రియంబుతోడ.

నెఱిగి నన్ను నతని కెరిగించి తోడ్కొనిరండు రాని నాడు రండెరింగి అని చెప్పి పంపుతుంది. పూర్వంరాజాంతఃపురస్త్రీలందరు అస్త్రశస్త్ర విద్యలు రాజనీతులు నేర్చిన వారే లేని నాడింత సమయస్ఫూర్తి సామాన్యులకుసాధ్యమౌతుందా?

తరువాత దమయంతి ద్వితీయ స్వయంవర మను నెపముపెట్టి ఋతుపర్ణునికి కబురు పంపుతుంది. సారథ్య

ముచేయు బాహుకునితో ఆటలు పవర్పకురాగ కేశినియను చెలిని పంపి బాహుకుని చూచివమ్మని పంపుతుంది. ఆమె దమయంతి బిడ్డలను వెంటపెట్టుకొని వెళ్ళగా తన పిల్లలవలెనున్నారని చేర బిలుస్తాడు తరువాత నాతని వంటకమును కూడా తీసికొని వెళ్ళి దమయంతికిచ్చి యాతని యందుగల అమానుష చర్యలన్నీ చెప్తుంది. అప్పుడు దమయంతి ఆ బాహుకుడే నలుడని తీర్మానించి

సందియమేల సర్వగుణసంపద చూడగ బాహుకుండుభూ
వందితుడైన నైషధుడవశ్యము దానసు నామనంబు నా
నందము బొందుచున్నది ఘనంబుగవాడెటువచ్చువాడో
యేనందులకేగుదానవారయంబున నాతనినిశ్చయింపుమా.

మహానీయులకు భావి శుభాశుభములు ముందే గోచరిస్తాయి. లేనిచో అట్టి కష్టసముద్రంలోనున్న ఆమెకు సంతోష మేల కలుగును.

తరవాత తండ్రి ఆజ్ఞతో నలుని రావించి పతివ్రతయైన తన్ను ఘోరారణ్యంలో వదలిపోవుట న్యాయమా యని యడుగుతుంది. కలిమాయవల్ల అట్లు జరిగినదని దేవతల తిరస్కరించి తన్నువరించి పుత్రవతియైన తరువాత ద్వితీయ స్వయంవరం చాటబంపుట ధర్మమాయని నలుడడుగుతాడు. దానికామె అపర్ణాదుని వల్ల నలుని వునికి తెలుసుకొని ఋతుపర్ణునికి మాత్రమే కబురుపంపానని చెప్తుంది. శత యోజనములు ఒక్కరోజు రథంబు గడప నలుడుతప్ప మరొకడు సమర్థుడుకాడని తెలుసుకొనుటకని చెప్పె.

ఏనొకపాపభావమును నెడ్డదలంపక యుండునట్లు గా
నా నీతరివైరి నీ యడుగులంటగ నోపుదునట్టి నదైన
న్నె నరేనాస్త్రవే మనలుడీ మృగలాంఛనుడీ సురోత్త
ముల్

జానుసెదంగ నీ క్షణము చంపరె కోపపరీత చిత్తులై.

తనయందెట్టి పాపమున్న సూర్య చంద్రులు మొదలైన వారందరు తన్ను నాశనము చేయరాయని శపథము చేయుచుండగనే సకల సభా సదులు వినునట్లు ఆకాశవాణి

అమలచరిత్ర నట్లు దమయంతి పతివ్రత యబ్బదే
నృపోత్తమ వినువానియందు విదితంబగు శీల విధిన్
సుధాంశుమున్

గమల హేతుండు నేనునయి కాచితి మొక్కట
మూడువర్షముల్

గొమరుగ దీని చేకొనుము కోమల నీకనురక్త
నాపుడున్

ఆమాటలాకాశవాణి పల్కుచుండగనే సురలు పుష్పవృష్టి కురియించిరి. దేవదుందుభులు మ్రోగె. నలుండు ఆనందాంబుధిని నోలలాడి కర్కోటకుని దలంచను వాడిచ్చిన వస్త్రము ధరించగనె నిజరూపాన్ని దాల్చెను. తరవాత వారలకు రాజ్యసౌఖ్యము లెప్పటియట్లు లభ్యమయ్యెను. ఇరంతయు పతివ్రతా శిరోమణియగు దమయంతి పతిభక్తి వల్లనే కల్గినది. కాబట్టి స్త్రీలకుకావలసిన భక్తియిదే. దేవాలయములు ఉపవాసములు అవసరము లేదు. కాబట్టెకదా యెన్నో బారువుల బంగారము సత్యభామవేసినను పతిభక్తిగల రుక్మిణిచేతి తులసీ దళముతో సరితూగలేదు. పతిభక్తిగల నారీమణి వాక్యము మోఘము. కాబట్టి బోయవానిని దగ్ధుని చేయగలిగింది. దమయంతి పరమ భక్తులంటే యిలాంటివారు కాక మరెవరు.



అంటున్నారు. అసలు దాని శక్తి తెలిస్తేగదా! దీనిని ఊహించుకోగలిగేది" అంది సుభద్ర.

"బలే ప్రశ్న! విను అయితే. అసలు మెరుపులో లక్ష యిరవై వేలు వోల్టులు విద్యుచ్ఛక్తి, పదిలక్షల అశ్వ శక్తి వుంటుంది."

"అమ్మో!" అన్నది సుభద్ర.

"ఇంతకీ ఈ యంత్రం చాలా పెద్దది. చూడడానికి విచిత్రంగాకనబడింది. దీనిని 1922 లో తొలిసారిగా ప్రదర్శించారు. ఇందులో లోహపు తీగవల కప్పిన పెద్ద గాజు పలకలు బిగించారు. దీనిని ఒక చివర విద్యుత్కర్మాగారంతో కలిపారు. రెండో చివర అది బయటకు ప్రవహించి పోవడానికి చేసిన ఏర్పాటుతో కలిపారు. ఈ విధంగా విద్యుత్ప్రసారం జరిగినప్పుడు పెద్ద చప్పుడు అవడానికి ఏర్పాటుచేశారు. ఇది కృత్రిమైన ఉరుము అన్నమాట. ఈ విధంగా మానవజాతి చరిత్రలో తొలిసారిగా వైజ్ఞానికులు ఇంజనీర్లు కలిసి కృత్రకంగా ఉరుముని మెరుపుని సృష్టించగలిగారు. కావలసినప్పుడు, కావలసినచోట కావలసినంతశక్తితో పిడుగు పడేటట్టు చేయగలిగారు. అందుచేతవారికి ఈకొత్త పిడుగు ఎక్కడ, ఎప్పుడు, ఏవిధంగాపడుతుందో ముందుగా తెలుసుకో గలిగారన్నమాట."

"బాగానే వుంది. అయితే ఇలా కృతకంగా మెరుపుని పిడుగుని సృష్టించడంవల్ల కలిగే మేలు ఏమిటంటారు?" అన్నాడు సుబ్బారావు.

"నాకూ అదే సందేహం" అన్నాడు రాజు.

"అబ్బ! అడ్డు చెప్పకుండా వింటూండండి." అంది సుభద్ర. మీరు కానీయండి అన్నట్టు చూసింది.

"స్టేన్‌మెట్స్ మరణించిన అనంతరం అనేక మంది వైజ్ఞానికులు ఆయన ప్రారంభించిన కృషిని కొనసాగించారు. వీరిలో ఒకాయన కోటి వోల్టుల శక్తిమంతమైన మెరుపును కృతకంగా సృష్టించగల యంత్రాన్ని నిర్మించాడు. ఇది యెంతశక్తిమంతమైనదో తెలుసా, ఇది ఒక సెకండులో కోటోవంతు సమయంలో విడుదల చేయగల విద్యుచ్ఛక్తి ఇండియా మొత్తంమీద ఉత్పత్తి చేయబడగల దానికి నాలుగు రెట్లు గొప్పది! ఈవిధంగా మెరుపును కృతకంగా సృష్టించగలగడంవల్ల దాని రహస్యాలను అవగాహన చేసుకోవడానికి గల ఆటంకాలను లెక్కచేయకుండా ముందుకు సాగడానికి మానవునికి అవకాశం కలిగింది. దాంతో మెరుపు మెరుస్తూండగా పరిశీలించి దాని శక్తిని కొలవవచ్చు. ఇందుకోసం రెండు పెద్ద లోహగోళాలతో కూడిన ఒక పరికరాన్ని నిర్మించారు. దీనిలో ఈ లోహ గోళాలమధ్య నున్న ఖాళీలో గాలి నింపి ఉంచుతారు. దానిలోనుంచి విద్యుచ్ఛక్తిని పంపిస్తారు. ఈ సందర్భంలో ఈ విద్యుత్కణం ఎంతదూరం గెంతుతుందో దానినిబట్టి అది ఎంత శక్తిమంతమయిందో లెక్క కడతారు."

"అయితే ఇది అంతా కృతకమైన మెరుపుకు సంబంధించినది. ఇక దీనితో తృప్తి పడి ఊరుకున్నారా! లేక సహజంగావచ్చే మెరుపు సంగతికూడా తెలుసుకోవాలని ప్రయత్నం చేశారా లేదా, ఆసంగతి చెప్పండి మరి అంది సుభద్ర.

"లేకేమిటీ వాళ్ళు అక్షరాలా ఆపనికే పూనుకున్నారు. అయితే సహజంగా వచ్చే మెరుపును పట్టుకోవాలన్నా వాళ్ళకి దొరుకుతుందా ఏమన్నానా?

(సశేషం)

# కచేరీ చావిడి

—— ::: ——

ఆంధ్ర మహిళలో మగవారికోసము కచేరీ చావిడి యుండగలదు.

కచేరీ చావిడి కనుక ప్రత్యేకంగా పురుషులకే—

**వారి అలవాట్లు! వారి పాట్లు!!**

**వారి సమస్యలు! వారికి సలహాలు!!**

**వారి హక్కులు! వారి ధర్మములు!!**

రాజకీయ వేత్తల గుసగుసలు, — సంఘ సంస్కర్తల సమస్యలు,

పట్టణ వాసపువారి పోకళ్ళు, — గ్రామస్థుల గ్రహపాట్లు.

(ఈ శీర్షికకు తమతమ రచనలను పంపగోరుచున్నాము.)

# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర లోకంతో సన్నిహితానుబంధం ఏర్పరచుకొని, మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ తరఫున "ఆంధ్ర మహిళ" పత్రిక 11 సం॥రములనుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు బాలానందం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ పరిశ్రమలు మున్నగు వానిని గూర్చి మాసామాసము యిందు ప్రకటింపబడును.

వార్షిక సంచిక, తపాలా ఖర్చులతోసహా

## సంవత్సర చందా 6-0-0

సేవాసంస్థలకు, గ్రంథాలయములకు, కళాశాల, పాఠశాలలకు,

సంవత్సర చందా రూ. 4-8-0 మాత్రమే.

వివరములకు :

మేనేజరు
'ఆంధ్ర మహిళ'

ఆంధ్ర మహిళా సభ,
24-ఎ. లజ్ చర్చిరోడ్డు, మైలాపూర్, మద్రాసు.

# ఆంధ్ర మహిళ

వ్యవస్థ స్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

ఎం.ఎ., బి.ఎల్.,

సంపాదకురాలు :

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

సంవత్సర చందా ఆరు రూపాయలు

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో

ముద్రితము.

# ఆంధ్రమహిళ

సంపుటి 12 :: మే '55 :: సంచిక 1



ఇంకా సంక్షేమం, ప్రథమ చికిత్స ఇతర విషయములు.

సంవత్సరచందా :: :: ఆరు రూపాయలు.

వ్యవస్థాపకురాలు :
శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపాదకురాలు :
లక్ష్మీ రఘురామ్

ముద్రణ :
ఆంధ్ర మహిళా ప్రెస్,




సంపుటి 12 :: మే '55 :: సంచిక 1

# రభస

మొన్న ఉగాదినాడు విజయవాడ రేడియో కేంద్రములో జరిగిన సాహిత్య గోష్ఠిరభసతో మన్మథనామ సంవత్సరము పత్రికా రచయితలలో అలజడి ఆవేదన ఆరంభము చేసినది.

తెలుగు పత్రికలలో పనిచేస్తున్న వా రెవ్వరికీ తెలుగు సరిగా రాదనీ, పత్రికలభాషాప్రమాణము తక్కువగా ఉన్నదనీ, పత్రికల వలన భ్రష్టభాష ప్రచార మగుచున్నదనీ, "పాత్రికేయులను" పండిత ప్రకాండులు ఉగాది నాడు అనవసరంగా నిందించుట గర్హనీయము.

"పత్రికలవారి క్రోధానలాన్ని కార్చిచ్చువలె ప్రజ్వలింప జేయగలనని" తలచియుండక పోవుట చేతనో లేక "ఇంత విపరీతమైనగాలి దుమారము చేలరేగుతుందని రేడియోవారుగాని ప్రాసంగికులుకాని ఆ సమయంలో అనుకోక పోవుట'' చేతనో శిష్టభాష భ్రష్టభాషగా తయారగుచుండుట చూచి సహించలేకనో, సంస్కృతములో ఆలోచన సాగించి తెలుగులో వ్రాయువారికి ఆంగ్లములో ఆలోచన సాగించుట సహించరాని దగుట వల్లనో ఉగాదినాడు పండితులు పత్రికా రచయితలపై విచక్షణ లేకుండా విమర్శనలు చేశారు.

"సాహిత్య వధువును కమనీయముగ అలంకరించి కల్యాణము చేసినది పాత్రికేయులే" అనునది ఆనాటి ప్రాసంగికులకు తెలియకనో లేక అది గొంతునబడ్డ వెలగకాయవలె నుండుట వలననో?

వ్యావహారికభాష ఆదరణవల్ల పత్రికలు అశేష ప్రజానీకానికి చేయుచున్న సేవ శ్లాఘనీయము. తెలుగు దిన పత్రికల సంపాదకీయములు తెలుగుదనము తొణికిసలాడుతూ సాధారణ పాఠకుల కందరకు ఎంతో మనోరంజకముగా ఉంటూ వుంటే అవే పండితులకు కటువుగా నుండుట వారి దురదృష్టమో లేక వాటి దురదృష్టమో ! ! శిష్ట భాషలో పత్రికారచన సాగిస్తే రచయితలు తప్ప పాఠకులుండరేమో అను విషయము పండితులకు స్ఫురించక పోయి ఉండవచ్చును.

పొరపాట్లు మానవులకు నైజమే! వారు తొందరపడి ఆడినమాటలకు, జరిగిన అపచారమునకు వారు ఇప్పటికే పశ్చాత్తాప పడుచున్నారనే మా నమ్మకము. విజయవాడ రేడియోవారి అజాగ్రత్త, ప్రమత్తత గర్హనీయము. ఉగాదినాడు ఆరంభించిన బాధ్యతారహిత కార్యక్రమాలవంటివి భవిష్యత్తులో పునఃప్రసారము కాకుండ కట్టుదిట్టమైన ఏర్పాట్లు జరగ గలవని మా విశ్వాసము.

---

# కృతజ్ఞత

శ్రీమతి కందా మాణిక్యాంబగారు ఆంధ్ర మహిళా సభకు రూ 100/- లు విరాళ
మొసగినందులకు మహిళాసభవారు తమ కృతజ్ఞత తెలుపుచున్నారు.

# విజయము

ఫిబ్రవరి 1955 లో హిందీ ప్రచారసభ నిర్వహించిన హిందీ పరీక్షలకు మా మహిళా విద్యాలయము
(హిందీశాఖ) నుండి వెళ్ళిన విద్యార్థినులలో

కుమారి ఎఱ్ఱా రమాదేవి మొదటి శ్రేణిలోను
కుమారి భానుమతి రెండవ శ్రేణిలోను

ఉత్తీర్ణులయినందుకు మా సంతోషమును వెలిబుచ్చుచున్నాము.

---



# రాజకీయాలు

శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు

1955 మార్చి నాలుగోవారం మొదలుకొని ఏప్రిల్ మూడో వారం వరకూ జాతీయంగానూ అంతర్జాతీయంగానూ నడచిన ముఖ్యసంఘటనలు ఇవి - బాండుంగ్‌లో ఆసియా, ఆఫ్రికా రాజ్యాల సమావేశం, ఆస్ట్రియాతో రష్యా ఒప్పందం, పాకిస్థాన్‌లో రాజ్యాంగ ప్రతిష్టంభన భారత రాజ్యాంగానికి నాలుగో సవరణకు పార్లమెంటు నిశ్చయించటం, కాంగ్రెసు పట్ల ప్రస్తుతవైఖరినే అనుసరిస్తూ ఉండేందుకు భారత ప్రజాసోషలిస్టు పార్టీ నిశ్చయించటం.

* * *

ఇండోనీషియాలో ఉన్న బాండుంగ్ అనే పట్టణంలో ఏప్రిల్ 18 నుంచి వారంరోజులపాటు ఆసియా, ఆఫ్రికా దేశాలు 29 సమావేశమై, తమకు సంబంధించిన వివిధాంశాలమీదనూ చర్చజరిపినవి. మధ్యమధ్య తీవ్ర అభిప్రాయ భేదాలు కనిపించినప్పటికీ, మొత్తంమీద చర్చించిన అంశాలన్నిటిమీదనూ అందరికీ అంగీకార మయిన పద్ధతి కుదిరింది.

వలసరాజ్యాల పద్ధతిని అది ఏరకమయిన సరే - నిరసిస్తూ సమావేశం తీర్మానించింది. ఆసియా, ఆఫ్రికాదేశాల ఆర్థిక, పారిశ్రామిక సహకారంమీదనూ, వీటి అభివృద్ధికి ఐక్యరాజ్యసమితి, ప్రపంచబ్యాంకు మొదలైనవి తోడ్పడాలనీ మరొక తీర్మానం చేసింది. ఆటంబాంబులు, హైడ్రోజన్‌బాంబులు మొదలైన వాటి ఉత్పత్తి, ఉపయోగాలను నిషేధించాలనీ, సాధారణాయుధాలను తగ్గించుకోవాలని, మనుష్యజాతి మని ఉండాలంటే ఇది అవసరమనీ తీర్మానించింది. ఆటం ప్రయోగాలు మనుష్యులకు హానికరమేమో పరిశీలించటానికి పరిశోధన కేంద్రాలు ఆసియా, ఆఫ్రికా ప్రాంతంలో ఏర్పాటు చేయాలని కూడా ఈ సమావేశం తీర్మానించింది,

ఆసియా ఆఫ్రికా దేశాలు పరస్పర సంస్కృతులను అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలనీ, భద్రతామండలిలో ఆసియా ఆఫ్రికాలకు తగిన ప్రాతినిధ్యం ఉండాలనీ, పాలస్తీనా అరబ్ ప్రజల సమస్య పరిష్కారం కావాలనీ కోరుతూ తీర్మానాలు చేయబడ్డవి.

* * *

సమావేశానికి అరబ్‌రాజ్యాలు 8, టర్కీ, సయాం, ఫిలిప్పీన్, పర్షియా, ఆఫ్ఘనిస్థాన్, జపాన్, ఇతియోపియా, గోల్డ్‌కోస్ట్, లైబీరియా, కొలంబో సమావేశపు రాజ్యాలు 5, ఇండోచైనా రాజ్యాలు 4, చైనామొదలైన 29 రాజ్యాలు అధికార హోదాలో హాజరయినవి. ఇందులో కమ్యూనిస్టు దేశాలు రెండు - చైనా, ఉత్తర వీట్నాం. పశ్చిమ రాజ్యాలసైనిక ఒప్పందాలలో జేరిన తీవ్రకమ్యూనిస్టు వ్యతిరేక రాజ్యాలు - టర్కీ, ఇరాక్, సయాం, ఫిలిప్పీన్స్ పాకిస్థాన్‌లు. సింహళం లెబనాన్‌లు పశ్చిమ రాజ్యాల సైనిక ఒప్పందాల్లో చేరక పోయినా కమ్యూనిస్టు వ్యతిరేకత మితిమీరటాన టర్కీవర్గంతో సహకరించినవి — ఇంక మిగిలిన 20 దేశాలు పూర్తి తాటస్థ్యాన్నే అనుసరించినవి.

ఈ సమావేశం మొత్తంమీద అన్నివిధాలా మొదటి కొలంబో సమావేశం పద్ధతిలో నడిచింది. ఇండియా నాయకత్వాన తటస్థదేశాలు నిజమయిన తటస్థ మార్గాన్ని అనుసరించ ప్రయత్నించగా, టర్కీ ఇరాక్, సింహళం, పాకిస్థాన్‌లు కమ్యూనిస్టు విద్వేషాన్ని ప్రచారం చేయ ప్రయత్నించినవి. వలసవాదాన్ని గురించి చర్చిస్తుండగా సింహళప్రధాని తూర్పుయూరప్ దేశాలు రష్యా వలసలేననీ, కాబట్టిసోవియట్ వలసవాదాన్ని చర్చించాలనీ ప్రతిపాదించారు. తూర్పుయూరప్ వ్యవహారాలను ఈ సమావేశం చర్చించటం అనవసరమని తటస్థదేశాలువాదించినవి.

దానిమీద సింహళ ప్రధాని తనవాదాన్ని వదులుకున్నారు కాని, టర్కీ-వర్గంమాత్రం దానిని విడిచిపెట్టకుండా చివరి వరకూ రాద్ధాంతం చేస్తూనే వచ్చినది. వీటివల్లనే వలస వాదాన్ని నిరసించే తీర్మానంలో ఏ రకం వలసవాద మయినా అని చేర్చవలసి వచ్చింది.

నిజంగా తనదేశంలో కమ్యూనిస్టు ప్రమాదమే లేక పోయినప్పటికీ, దానిని గురించి కొలంబో సమావేశంలో రభస చేసిన సింహళ ప్రధాని యిటీవల ఈసమావేశంలో కూడా కమ్యూనిస్టు ప్రమాదంనుంచి నూత్న స్వతంత్ర దేశాలను రక్షించాలని ఆర్భాటం చేశారు. కొత్తగా స్వతంత్రం పొందిన దేశాల్లో ఆంతరంగిక విప్లవాలురాకుండాను విదేశ జోక్యం లేకుండాను 25 సం॥ లపాటు వాటిమీద అంతర్జాతీయ ధర్మకర్తృత్వం వుండాలనీ, అది సమితి అజ్మాయిషీ కింద ఉండాలనీ ఆయన ప్రతిపాదించారు. అయితే ఈ ప్రతిపాదనను ఎవ్వరూ గట్టిగా గనిమనించ నేలేదు. ఎవరికి ఇష్టం వచ్చిన పద్ధతిలో వాళ్ళు తమవ్యవస్థను ఏర్పాటు చేసుకోవచ్చునని అంతా అంగీకరించారు.

శాంతిని అడ్డగించేవి సైనిక ఒప్పందాలని తటస్థ రాజ్యాలు అభిప్రాయ పడగా పాకిస్థాన్, టర్కీ మొదలైనవి అది ఆత్మరక్షణ హక్కని వాదించినవి. పాకిస్థాన్ ప్రధాని ప్రపంచ శాంతికోసం ప్రతిపాదించిన 7 సూత్రాల్లో ఇది ఒకటిగా చెప్పబడ్డది. దీనిని నెహ్రూ ప్రతిఘటించి అట్లాంటిక్ ఒప్పందం వలసవాదాన్ని రక్షిస్తున్నదనీ. ఆ ఒప్పందమేలేకపోతే ఉత్తరాఫ్రికా ఈనాడుపరాధీనంగా ఉండేది కాదనీ, ఇటువంటి అపోహలతో టర్కీ మొదలైన దేశాలు నడవటం వల్లనే ప్రపంచానికి ఇంతచేటు వస్తున్నదన్నారు.

కమ్యూనిస్టు భయం వల్లనే రక్షణ ఒప్పందాల్లో తాము జేరామని టర్కీ-వర్గపు రాజ్యాలు చెప్పగా, చైనా ప్రధాని చౌఎన్‌లే సమాధానం ఇస్తూ, తమకు ఇతర దేశాల్లో అంగుళం మేరకూడా అవసరం లేదన్నారు. అనుమానం ఉన్న సయాం, ఫిలిప్పైన్ దేశాలు చైనా వచ్చి, పరిస్థితులను స్వయంగా పరిశీలించుకోవచ్చునని ఆహ్వానించారు. ఇతరుల వ్యవహారాల్లో తామెంత మాత్రం జోక్యం కలిగించుకోలేదని చెపుతూ, విదేశాల్లో ఉన్న చైనా జాతీయుల సమస్యను పరిష్కరించేందుకు తాను సిద్ధమని ప్రకటించారు. ఈ సమస్యమీద ఆయన ఇండోనీషియాతో ఒప్పందంకూడా చేసుకున్నారు. అందరితోనూ శాంతంగా ఉండాలని కోరుతున్నారనీ, ఫార్మోజా సమస్యమీద అమెరికాతో సంప్రదింపులకు కూడా తాము సిద్ధమేననీ ఉద్ఘాటించారు.

* * *

మొత్తంమీద బాండుంగ్ సభ ఫలితాలు ఈ విధంగా ఉన్నవి. (1) ఇండియా అనుసరిస్తున్న తటస్థ వాదాన్ని మధ్యధరా సముద్రం నుంచి పసిఫిక్ వరకూ ఉన్న దేశాల్లో అత్యధిక భాగం ఆమోదించటం జరిగింది. (2) పశ్చిమ రాజ్యాలవైపు మొగ్గటమా, తటస్థంగా ఉండటమా అని ఊగులాడుతున్న అరబ్ రాజ్యాలకు తటస్థ విధానంలో గొప్పతనం నిరూపించబడ్డది. ఇందువల్ల మధ్య ప్రాచ్యంలో యుద్ధ ప్రమాదం నివారించబడ్డదని చెప్పవచ్చు.

(3) ఫార్మోజాపై సంప్రదింపులకు చైనా సిద్ధపడటం, చైనా తన శాంతివాంఛను ప్రకటించి అనుమానం గల వాళ్ళను పరిశీలనకు ఆహ్వానించటం, విదేశాల్లో ఉండే చైనావాళ్ళ సమస్యను పరిష్కరించటానికి ఉపక్రమించటంవల్ల దూర ప్రాచ్యంలోనూ, ఆగ్నేయాసియాలోనూ యుద్ధ ప్రమాదం తప్పించబడ్డది.

* * *

దూర ప్రాచ్య, మధ్య ప్రాచ్యాల్లో యుద్ధ ప్రమాదాన్ని బాండుంగ్ సభ తొలగిస్తుండగా, దీనికి కొంచెం ముందు యూరప్‌లో యుద్ధ ప్రమాదాన్ని తగ్గించటానికి రష్యా ఒక చర్య తీసుకున్నది. ఆస్ట్రియాకు స్వాతంత్ర్యం ఇచ్చే విషయమై ఒక ఒప్పందం చేసుకున్నది. అందులో ఎంతో ఔదార్యాన్ని చూపించి ఆస్ట్రియన్ల మన్ననలనందుకొనటమే కాకుండా, తాము సైనిక ఒప్పందాల్లో జేరటం కానీ, విదేశాలకు స్థావరాలివ్వటంకానీ చేసేది లేదన్న హామీని ఆస్ట్రియన్ల దగ్గర పొందగలిగింది.

ఇందులో రష్యా చూపిన రాజనీతిని చూస్తే, వాళ్ళ పశ్చిమ జర్మనీని కూడా అట్లాంటిక్ ఒప్పందం నుంచి బయటికి లాగి తటస్థంగా ఉంచకలుగుతుందేమో ననిపిస్తున్నది. ఇందులో రష్యాకు ఫ్రాన్స్ ఏదోవిధంగా తోడ్పడుతుంది. ఫ్రాన్సుకు కావలసింది కూడా జర్మనీ తటస్థంగా ఉండి, ఆయుధాలు ధరించకపోవటమే.

# రా జ కీ యా లు

అగ్రరాజ్య సమాలోచనలకు ముందు రష్యా ఆస్ట్రియా సమస్యను పరిష్కరించాలని పశ్చిమ రాజ్యాలు వాదించినవి. రష్యా ఇప్పుడు దానిని చూపించింది. చైనా ఫార్మోజా సమస్యమీద కూడా సంప్రదింపులకు సిద్ధపడ్డది. ఇంక పశ్చిమ రాజ్యాల చిత్తశుద్ధి ఏవిధంగా ఉంటుందో చూడవలసి వుంది.

*　　　*

అన్నిచోట్లా వైరుధ్యాలను తగ్గించుకునేందుకు ప్రయత్నాలుజరుగుతున్నట్లే ఇండియా పాకిస్థానుల మధ్య కూడాప్రయత్నాలు జరుగుతున్నవి. ఆరు నెలలక్రిందట సర్వాధికారాలనూ తీసుకుని పరిపాలనమీద ఆజ్మాయిషీ చేస్తున్న పాకిస్థాన్ గవర్నర్‌జనరల్ గులాం మహమ్మద్ దీనికి చాలా వరకు బాధ్యుడని చెప్పవచ్చు. ఇటీవల ఇండియాలో పరిష్కారానికి ఆయన జరిపించిన చర్యలు ఇవి— (1) తూర్పు బెంగాల్‌నుంచి వస్తున్న హిందూ కాందిశీకులను తిరిగీ స్వీకరించడానికి అంగీకరించటం. ఉభయ ప్రభుత్వ ప్రతినిధులు ఇప్పుడు ఆ విషయమై పరిశీలన జరుపుతున్నారు. (2) ఉభయ ప్రాంతాల మధ్య రైలురవాణా తిరిగీ ప్రారంభింపచేయటం. (3)కాందిశీక సమస్యలన్నిటిపై చర్యలు జరిపించటం.

*　　　*　　　*

పాకిస్థాన్ గవర్నర్ జనరల్ ఇప్పుడు ఎదుర్కొంటున్న సమస్యలు ఈజిప్టులో ఫరూక్ ప్రభుత్వాన్ని కూలదోయటానికి ఈజిప్టు విప్లవ సంఘాన్ని ప్రేరేపించిన సమస్యలే. అసమర్థత, అవినీతి, ప్రాంతీయద్వేషాలతో ముస్లిం లీగ్ నాశనమయిపోయింది. 7 సం॥ లనాడు ఏర్పడ్డ రాజ్యాంగ పరిషత్తు కొత్త రాజ్యాంగంలో ఒక వీసం వంతుకూడా పూర్తి చెయ్యలేదు. తమ అసమర్థతను కప్పిపుచ్చుకునేందుకూ, ప్రజల దృష్టిని ఇతరత్రా మళ్ళించేందుకూ లీగ్ ప్రభుత్వం ఇండియాతో ఏ సమస్యను తేల్చకుండా ఉంచింది. తూర్పు పాకిస్థాన్‌లో పరిస్థితి మరీ విషమించటంవల్ల, అక్కడి ప్రతికూల పక్ష ప్రభుత్వాన్ని కూలదోయించింది.

ఈ లోపాలన్నిటినీ చక్కచేసేందుకు గులాం మహమ్మద్ ప్రయత్నాలు ప్రారంభించారు. విప్లవం పద్ధతిలో కాకుండా తన హోదాను ఉపయోగించాలని ఆయన ప్రయత్నించారు. రాజ్యాంగ పరిషత్తును రద్దు చేశారు. కొత్త సమ్మేళనను ఎన్నుకునేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు. పశ్చిమ పాకిస్థాన్ రాష్ట్రాలన్నిటినీ కలిపి ఒకే ఖండంగా చేశారు. ప్రజా విశ్వాసం గోల్పోయిన లీగ్ నాయకులను వదలిపెట్టి డా॥ ఖాన్ సాహెబ్, సురావర్దీ మొదలైన నాయకుల సహాయం తీసుకుంటున్నారు.

అయితే ఇన్ని చర్యలు జరిపేందుకు గవర్నర్ జనరల్‌కు 1947 ఇండియా స్వాతంత్ర్య చట్టంరీత్యా అధికారంలేదని పాకిస్థాన్ ఫెడరల్ కోర్టు నిర్ణయించింది. అందువల్ల రాజ్యాంగ ప్రతిష్టంభన ఏర్పడ్డది. అయితే సుప్రీం కోర్టు తీర్పు వ్యతిరేకంగా ఉన్నందువల్ల పార్లమెంటునే కోర్టుగా వ్యవహరించేట్లు చేసిన దక్షిణాఫ్రికా ప్రధాని మలాన్ దారిని గులాం మహమ్మద్ అనుసరించదలచలేదు. రాజ్యాంగ పద్ధతిలోనే దానిని పరిష్కరించదలుచుకున్నారు.

*　　　*　　　*

భారత పార్లమెంటు భారత రాజ్యాంగానికి 4వ సవరణ చేయటానికి నిశ్చయించింది. ఈ సవరణ ప్రకారం ప్రభుత్వం స్వాధీనం చేసుకునే ఆస్తులకు అది నిర్ణయించిన పరిహారం తప్పితే, ఆ విషయమై కోర్టులకు వెళ్ళే అవకాశం లేకుండా చేయబడ్డది. ఈ విషయంలో వ్యవసాయ ఆస్తులకు, పారిశ్రామిక ఆస్తులకూ ఇదివరకు ఉన్న తేడా ఇప్పుడు తొలగించబడ్డది. పారిశ్రామిక ఆస్తులకు పూర్తి పరిహారం ఇవ్వాలని ఇదివరకు నిర్దేశించబడ్డది. ఇప్పుడది ఉండదు.

*　　　*　　　*

సోషలిస్టు పద్ధతి సమాజ నిర్మాణానికి కాంగ్రెస్ ఆవడి సభ చేసిన తీర్మానానికి మోస పోరాదనీ, కాంగ్రెస్ పట్ల ప్రజా సోషలిస్టు పార్టీ వైఖరి అలహాబాద్ తీర్మానాన్ని అనుసరించే — ప్రస్తుతం ఉన్నట్లే — ఉంటుందనీ ఈ నెలలో అఖిల భారత ప్రజా సోషలిస్టు పార్టీ కార్యవర్గం తీర్మానించింది. పార్టీ క్రమశిక్షణను అనుసరించనందుకు డా॥ రామమనోహర్ లోహియాకు హెచ్చరిక చేసినట్లు కూడా తెలుస్తున్నది.

*　　　*　　　*

ఆంధ్రశాసనసభ రొక్కం లక్ష్మీనరసింహం దొరగారిని స్పీకరుగా ఎన్నుకున్నది. శాసనసభలో స్వతంత్ర సభ్యులు కొందరు రామకృష్ణ రాజుగారి నాయకత్వాన ఒక పార్టీని ఏర్పాటుచేశారు.

నందికొండ ప్రాజక్టు త్వరలోనే సమిష్టి కంట్రోలు బోర్డు ఆజ్మాయిషీ కింద ప్రారంభం కాబోతున్నదని గవర్నర్ త్రివేదిగారు ప్రకటించారు. జూన్‌లో మొదలవుతుందని హైదరాబాద్ ప్రభుత్వ ప్రతినిధి ప్రకటించారు.

---

# "ప్రథమ చికిత్స"

డాక్టర్ ఎన్. హనుమంతరావు.

## "విషములు" (Poisons)

సరియైన ప్రమాణమును మించి సేవించిన ఎడల ప్రాణమును దియువస్తువులు విషము లనబడును.

### 1. "కండరములను తినివేయు విషములు" (Corrosives)

ఈవిషము తగిలిన చోట కండరమును తినివేసి చాలా నొప్పి కలిగించును. నోటిని, గొంతుకను తిని వేయుటవలన వాంతి వచ్చుటయు, నూపిరితీయుటలో కష్టము కలుగుటయు, సంభవించును. తుదకు కాళ్ళు చేతులు చల్లబడును. ఈవిషములేవన :—ద్రావకములును (Acids) పుండుజేసెడి క్షారములును. (Alkalies)

### 2. "మంట కలుగజేయునవి" (Irritants)

ఇవి తగిలినచోట మంటపుట్టును. త్రాగినప్పుడు గొంతుకలోను కడుపులోను మంటకలుగజేయును. వాంతి పుట్టించును. కడుపునొప్పి విరేచనములు ఆరంభించును. ఇవి విషమెక్కిన బూజు, పండ్లు, లోహములు టిన్నులో వచ్చెడునాహారములు, మొదలైనవి. చాలమంది యొక చోట గూర్చుండి భోజనముచేసిన తరువాత కడుపునొప్పి, వాంతి, విరేచనము లారంభించగానే తినిన యాహారము లోనే విష మున్నదని గ్రహింపవలయును.

### 3. "నిద్రమైకము కలుగజేసెడి విషములు" (Narcotic Poisons)

ఈవిషములు మెదడు నరములమీద బాగుగా పని చేయును. అవి ఏవనగా :—

1. మొదట నిద్రను తరువాత మతును కలుగజేయు నవి. కంటిపాపమిక్కిలి చిన్నదై గుండుసూది పరిమాణ మునకు ముడుచుకొనును. ఊపిరి దీర్ఘముగాను, గురు కలు బెట్టుచునుగాని, నెమ్మదిగాను బలహీనముగా నుండును. నల్లమందును, నల్లమందు కలిసియున్న మం దులును పైజెప్పిన లక్షణములు గలిగించును. సాధారణ ముగా నీమందులు నొప్పి తగ్గించుటకును, నిద్ర పుట్టించు టకును వాడబడును.

2. మందు సన్నిపాతమును (Delirium) గల్గించి తరువాత మత్తు కల్గించుమందులు. ఇందు కంటిపాప పెద్దదగును. నాడి త్వరితముగా కొట్టుకొనును, బెల్లకోనాస్ట్రిమోనియం, క్లోరో ఫారం, సారాయి మొదలైనవి.

3. ఈడ్పును బుట్టించిన తరువాత స్మారకము తప్పించు మందులు. ఊపిరాడకుండుట, ముఖము తెల్ల బారుట. ఈడ్పులు త్వరత్వరగా వచ్చినందున రోగి యొక్క కాళ్ళు చేతులు చల్లబడును. ఉదాహరణము స్ట్రిక్నైన్, ఎకోనైట్, ప్రూసిక్ ఆసిడ్ మొదలైనవి.

### విషములకు చేయదగు సాధారాణ "చికిత్స"

1. జరిగిన సంగతి చెప్పి వైద్యుని వెంటనే పిలువ నంపుము.

2. ఊపిరి నిలిచిపోవుచున్న ఎడల కృత్రిమ సాధక మైన యూపిరిని పోయుము.

3. కక్కిన పదార్థములను జాగ్రత్త పరుచుము. ఆహారము నితర పదార్థములను కూడ జాగ్రత్త పరుచుము.

విషమున్నదని తలంచిన పాత్రలను కడుగకుండ వానిని కూడ జాగ్రత్త పరచుము.

పెదవులు, నోరు, కాలినప్పుడు తప్ప వాంతి పుట్టించు పదార్థములనిమ్ము.

ఇట్లు చేయుట వలన తినిన విషము బయటకు వెడలి వచ్చును. వాంతి పుట్టించుటకుగాను :—

ఆవాలు పొడి ఒక పెద్ద గరిటెడు ఒక గ్లాసు వెచ్చని నీళ్ళలో కలిపి త్రాగించుము.

2. రెండు పెద్ద గరిటెల ఉప్పు నొక గ్లాసు నులి వెచ్చని నీళ్ళలో కలిపి త్రాగనిమ్ము.

ఈ వాంతి పుట్టించు పదార్థమును వాంతి యగువరకు నర్ధగంట కొక సారి త్రాగించుము. వాంతి యగుట కాలస్యమైన ఎడల గొంతులో వేళ్ళను వేసిన ఎడల వాంతి యగును.

పెదవులు, నోరు కాలియున్న ఎడల వాంతి తెమ్పు పదార్థముల నియ్యకుండగ విషమును పల్చపర్చు వస్తు వుల నిమ్ము. (సశేషము)



మనలో మన మాట

# లోకపు తీరు

శ్రీమతి కె. లక్ష్మి రఘురామ్

ఉగాదితో- మన్మథనామ సంవత్సర ఆగమనముతో- ప్రస్తుతము కొన్ని నెలలవరకూ- మళ్లీ శ్రావణము వరకూ పండుగలు లేవు, ఒక్క శ్రీరామనవమి తప్ప. అందుచేత మనకేమీ నష్టములేదు. పెండ్లిండ్ల సీజను ఆరంభమయింది. ఎక్కడ చూచినా పందిళ్లు, పచ్చతోరణాలు, మంగళ వాద్యాలు.

పెండ్లిండ్లు చేసేవాళ్ళు ఏమిపాట్లు పడుతున్నారో బ్రహ్మ కెరుక. కాని అంతకన్నా తక్కువ బాధ పడటంలేదు, పెండ్లిండ్లకు హాజరు కావలసినవాళ్ళు మాత్రము-ఎప్పుడూ Engagements వ్రాసుకోని వాళ్ళుకూడా ఇప్పుడు ఈ పెళ్లిళ్ల కార్యకలాపములు మరచిపోతామేమోననే భయముతో డైరీ లేనివాళ్ళు క్యాలండరులోనైనా ఎర్రపెన్సిలుతో గుర్తుబెట్టుకుంటూ వున్నారు. ఆపైన పెళ్లిళ్లకు వారివారి అంతస్థుకు తగిన ఫక్కీలో హాజరగుటకు కొందరు దుస్తులు తయారుచేసుకుంటూవుంటే మరి కొందరు ఆభరణాలు చేయించుకొంటున్నారు. మరి కొందరు వధూవరులకు బహుమానాలు నిర్ణయించడంలో నిమగ్నులైనారు. నావంటి వారికి కొందరికి చిత్రమైన చాల పెద్ద సమస్య లేర్పడినవి. పెండ్లిండ్లలో ఉభయ పక్షాలవారూ సమానమైన బంధువులో మిత్రులో అయినప్పుడు-ఎవరిపక్షముగా, అంటే, పెండ్లి కూతురు పార్టీలోవుంటే లాభకరమా లేక పెండ్లికొడుకు పార్టీలోవుంటే లాభకరమా అనే సమస్య తేల్చుకోలేక సతమతమవుతున్నాము. మన సాంప్రదాయములనుబట్టి ఉభయ పక్షాలకు కొన్ని కొన్ని లాభనష్టా లున్నవి. ఈ సమస్యా పరిష్కారము ఏమంత సులభము కాదని, ఇట్టి సమస్యల నెదుర్కొన్న అనుభవముగల వారికి తెలిసిన విషయమే. రాజకీయవాది ఎన్నికలముందు నిలబడవలసినది స్వతంత్ర అభ్యర్థిగానా లేక కాంగ్రెసు అభ్యర్థిగానా అని ఎంత తీవ్రముగా ఆలోచించాడో ఈ పెండ్లిండ్లముందు మేమూ అంతగా కష్టపడి ఆలోచించవలసి యున్నది. యథాప్రకారము మాకు ఏకాభిప్రాయము కుదురలేదు. మిగిలినవాళ్ళ విషయము ఎట్లావున్నా, అప్పగింతలు పెట్టించుకునే అర్హతనిచ్చే పెళ్ళికొడుకు పార్టీయే నాకు ఎక్కువ ఆకర్షణీయంగా తోచింది.

ఈ రెండు నెలలు దినమొక క్షణముగా గడుపగల అవకాశా లున్నవి. బంధుమిత్రుల

సమాగమములు, అర్థములేని ఆట పాటలు, మాటలు, విందులు వినోదములు వీనికేమీ కొదువలేదు. ఏడాది కొక్కసారివచ్చి ఆరు నెలల వరకుపోని కోపము మాత్రము ఈసమయములో దేవుని దయవల్ల ఎక్కడా ప్రత్యక్షము కాకుండావుంటే, అంతా సుఖాంతముగానే జరుగవచ్చు. దీనికి ప్రకృతి కూడా అనుగుణంగానే వున్నదని కవులు చెప్పుచున్నారు మరి.

చైత్ర వైశాఖ మాసాలలో వసంతఋతువు ఆరంభము. దీనితో ప్రకృతికంతా ఒక వింతశోభ ఏర్పడ్డదట. దానితో మానవ హృదయాలు కూడా ఎంతో ఉత్సాహ పూరితములై తైతక్కలాడుచున్నవట -, కోకిలలు కూయుచున్నవట. దానితో పాటు ఆనందోత్సాహ పూరితులమైన మనమూ 'కూ కూ' యని ప్రతిధ్వని చేయుచున్నామట!

అయితే ఒక సంగతి— మనలో మనమాట- కవులు కాని పాఠకులు మీరూ ఆలోచించండి. కోయిల కూస్తుంటే ఏమైనా హాయిగా వున్నదా? నాకు మాత్రము మా వెలగ చెట్టుమీద కూర్చుని ఉదయమే కూస్తూవుంటే, దానితో పనీపాటూ లేనివాళ్లు ప్రతిధ్వని చేస్తూఉంటే వొళ్ళు మండిపోతూ వుంటుంది. ఆ కోకిలమ్మ కూతలో (ఆకారము వికారమేకదా!) ఏమున్నదిగనుక అందరూ ముగ్ధులమైపోయామని చెప్పటానికి? కవిత్వ మల్లటానికి? నిజంగా కోయిల పాటలో ఏమి ఘనత మనోజ్ఞత కనబడుతుందో నేను ఎంత ఆలోచించినా స్ఫురించటము లేదు. రవికానినిది కవి గాంచునట! అదేమరి కవికి ఏమి కన్పడుచున్నదీ అనేదే ప్రశ్న!

ఈ కోకిలను ఏ విధముగా జూచినా ఏవగింపు కలిగించే పక్షే. కాని కవులకు మాత్రము ఇంతమోజు ఎందుకో అర్థము కావటములేదు. మా శిరీష వృక్షము మీద వ్రాలే పేరు తెలియని పక్షులు కొన్ని చేసే కిలాకిలా ధ్వనులు ఎంత బాగుంటవి. వాటిముందు ఈ 'కూకూ'లు ఎందుకు పనికొస్తవి? కాని అది ఏమి ఖర్మమో ఏ కవిగారూ ఆ పక్షుల విషయము ఈ కోయిల మీదతీసికున్నంత శ్రద్ధ తీసికోరు. కారణమేమైయుండునో?

కవిగారు తీరికగా తమలపాకులు నెమరు వేస్తూ ఈజీ చెయిరులో పండుకొని 'కూకూ' ధ్వనులు అనందిస్తూ ఆవలిస్తారు. ఈ కవిగారికి వలెనే ఆ కోయిలమ్మ గారికీ ఏమీ పనీపాటూ లేదు 'కూకూ' యని కూయటము తప్ప. గుడ్లా కాకమ్మ గూట్లో పడవేసి వచ్చెను. దాది పిల్లలను పెంచితే తల్లికెంతపనో కోకిలమ్మకూ అంతే పని. పాపము కాకమ్మ పిల్లలను పెంచిపెట్టితే విలాసవతి కోకిలాదేవిగారు సిగ్గు బొగ్గు లేకుండా చెట్టుమీద కొమ్మ కొమ్మా విహరిస్తూ చీకూ చింతా లేకుండా ముప్పొద్దులు కూయగలదు.

ఏపనీపాటూ చెయ్యనిజీవులలో ఏమి అందం కవులకు కానవస్తున్నదో! వారి సోమరితనము, విలాసప్రియత్వము అంత ఆకర్షణీయముగా నున్నవా! అంతే. లోకపు తీరేఅంత! పని లేకుండా కూర్చుని ధాటీగా మాట్లాడుతూవుంటే, వాళ్లచుట్టూ పదిమంది చేరి తల లూపుతారు.



# రమణుల రాజ్యం

భద్రశ్రీ "సవిత"

మాకే జగమున స్వేచ్ఛలభిస్తే !
మమ్మే రాజ్యశ్రీ వరించితే !
మగువల కెందుకు
మహా విద్య లను
మహా మతుండ్రను
మంచితనంబున
మతి మతాలు ఇక
మరల్చుకొంగ డని
మరలమరలమేం ప్రార్థిస్తాం!
మార్చుకొనని ఆ
మాన్యులకుర్విలో
మన్నన లేదని శాసిస్తాం !
మడతి యుంచ పర
మందయానలతో
మనసువిప్పి ఒక
మాటు హాయిగా
మాటాడుద మను
మదనుల పట్టి
మధుర రహితమా భుక్తిస్తాం !
మస్తకాసన
మ్మనేటి మందుతో
మళ్ళివారముకే రుజమాన్పుతాం !
పదు నాకేండ్లుండు
పసి పసి బుగ్గల
పడుచు కన్నెలను
పట్టి ధనాశతో
పౌరుష హీనుల
పా లొనరించే
పరమ కర్కశుల కరిగిస్తాం !
పతిచనిపోయిన
పయ్యెదవల దను
పక్షపాతులను ఎదిరిస్తాం !
బాటన పోయే
భాసుర కాంతల
భంగుల చూచుచు
భ్రాంతితో స్త్రైగియ్
బాగు చేసికొను
బ్రహ్మచారులను
బంధించెద మని భయపెడ్తాం !
భామాజాడ్యవి
బాధితు చరిత్ర
భంగము లన్నిటి బోధిస్తాం !
అనాథ కెందుకు
అలంకరణమని
పాన్పుల పైనను
పరుండవలదని
విడెములనగవుల
పీడ వలయునని
ఇంక ఎన్నియో
ఇడుములపెట్టే
సూత్ర సూత్రముల
సుడివడ జేయుచు
పలువుర అతివల
ప్రాణాల్ తీసే
పండితప్రవరుల తగ్గిస్తాం !
సాహసు డెవడేన్
సవాలు చేసితె
సరి జవాబుతో శిక్షిస్తాం !
నరిసిన మిసాల
నల్ల జేసికొని
బంకతో వానిని
బింక జేసికొని
రబ్బరుదాడల

# రమణుల రాజ్యం

ఉబ్బు చెంపలతో
ధగ ధగ మెరిసే
దంత శ్రేణితో
అద్దె కు తెచ్చిన
అంబరాలతో
వింత వింతగా
వివిధ విటులవలె
వచ్చి చౌ పథిలో
విచ్చలవిడిగా
సంధ్యా వేళలో
సంచ రించుచు
చెలువలు పోగా
చేదుగ జూచే
చిలిపి కోడెలను పట్టేస్తాం !
ప్రతిదిన భాసుర
ప్రణామకృషి అను
ప్రబలౌషధముతో పిచ్చితీస్తాం !
హృదయము కరుగగ
మెదడు తిరుగగా
కని విని ఎరుగని
కమ్మని ఇమ్మగు
చిత్ర విచిత్రపు
కృత్రిమ వస్తుల
తరుణులకొరకై
తయారు చేసిన
పురుషుల హృది అను
సారము మేమా
వస్తు లనాడగ
వహారె కలియుగం
అయ్యారె రమణుల
ఒయ్యార మిదియా !
అని పలు విధముల
అబ్బుర మందుచు
మాపై హసించె
మగాళ్ళ మనముల
మలిన నయనముల కడిగేస్తాం !

అప్పుడు ఎవ్వరి
అపరాధంబో
అడుగ అతివుడని అంటాం !
అతివ నిజముగా
అబలరా! అని
ఆటకత్తె అని
అనుభ వింపనని
సంతానమునకు
సస్యభూమి అని
వరునికి మాత్రం
వండి పెట్టనని
మ మ్మరికట్టి
మా కురిపెట్టి
ఎన్నడో కూటిలో
ఏరలేని ఒక
ఇసుక రాయిరాన్
విసిగి బుస్సుమని
ఈడ్చికొట్టి మము
ఏడ్పించే ఈ
మగవాళ్ళను మీ
యుగముకా దనీ
ఝాన్సీరాణులమై అలరేం !
రుద్రమాంబలం
గార్గేయులం
కస్తూరి బాయులమై వెలసేం !
అన్నికళలలో
ఆరితేరి మేం
పండితుండ్రతో
పందెము గెలిచి
కవయిత్రులమై
కావ్య లోపముగు
పురుష వర్ణనను పూరిస్తాం !
జగతి చరిత్రలో
చానల పేర్లను
స్వర్ణ పదాలతో వఱలిస్తాం !

# క్లియోపాత్రా

శ్రీమతి కె. రామలక్ష్మి.

ఏదేశ చరిత్ర చూసినా, ఏమున్నది గర్వకారణం--ఈ రాణీ ప్రేమ పురాణం, ఆ ముట్టడికయిన ఖర్చులూ: అంటూ మహాకవి రాశాడు. కాని, దేశ చరిత్రలు సరదాకి చదువుకొనే వాళ్లకి ఆకర్షణ అవే. దేశచరిత్రల్లో మహారాణీల ప్రేమ పురాణాలు లేనినాడు, అవి ఒక్క విద్యార్థులకే పఠనయోగ్యం అవుతాయి. రాజ్యాల పునాదుల దగ్గిరనుంచీ కదలించిన సుందరాంగులు ఎప్పుడో ఒకప్పుడు ప్రతిదేశంలోనూ వెలిసేవుంటారు. అలాంటి వాళ్లలో క్రీస్తు పూర్వం 69 వ సంవత్సరంలో యీజిప్టు దేశంలో టోలమీ రాజ్యవంశంలో జన్మించింది ఒక ఆడపిల్ల. తరువాత కాలంలో, యీ పసిపిల్లే- రోమను, గ్రీకు రాజ్యాల పునాదులను సహితం కదల్చివేసింది. అలాంటి క్లియోపాత్రా సౌందర్యం గురించి కొంచం కొంచం ఆలోచించి వూరుకోలేం. తీగ కదిలిస్తే డొంకంతా కదులుతుందన్నట్లు, క్లియోపాత్రా పేరు అనగానే ఆలోచనలు ప్రవాహంగా బయలుదేరి ముంచెత్తుతాయి. క్లియోపాత్రా యుగయుగాలుగా వస్తూన్న స్త్రీత్వపు లోతుపాతుల పొందిక. ఆడవాళ్లి, మనస్తత్వం- చరిత్రకెక్కని కాలం నుండి యీనాటివరకూ దరిదాపు ఒకే రీతిని నడిచిందనడానికి నిలచిన నిదర్శనమే క్లియోపాత్రా. క్లియోపాత్రా అందచందాలు, రాగద్వేషాలూ తిలకించితే, ప్రతి స్త్రీలోనూ ఓ క్లియోపాత్రా మీకు దర్శనం యిస్తుంది.

టోలమీ రాజ్యవంశంలోని చాలా మంది రాజకుమార్తెలకి క్లియోపాత్రా నామధేయం వుండేది. క్రీస్తు పూర్వం 69 లో టోలమీ అలేటస్‌కి జన్మించిన క్లియోపాత్రాయే యీ రాచవంశానికి ఖ్యాతి గణించిపెట్టి, చరిత్ర గతినే మార్చివేసిన క్లియోపాత్రా. క్లియోపాత్రాకి పదిహేడు సంవత్సరాల ప్రాయం అప్పుడు, ఈజిప్షియన్ ఆచారాల ప్రకారం, చిన్నతమ్మునితో వివాహం జరిపించి రాజ్యాన్ని వారిద్దరికీ వదలి పెట్టాడు టోలమీ అలేటస్. కాని తండ్రి గతించిన కొద్ది సంవత్సరాలలోనే, తమ్ముడు టోలమీ డైనిసస్ యీమెను మోసగించి రాజ్యాధిపతి అయాడు. క్లియోపాత్రా, సిరియాకు పోయి, యుద్ధసన్నాహాలు చేస్తూంది తిరిగి తన హక్కులను పొందడానికి. ఈ సమయంలో, దిగ్విజయ పరంపరతో అన్ని హక్కులనీపొందిన అధినేత, సీజర్, పోంపేను తరుముకొనివస్తూ ఈజిప్టు ప్రవేశించాడు. అరాచకంలో మునిగివున్న ఈజిప్టు రాజ్య వ్యవహారాలని సరిదిద్ది పోదామని సీజరు అనుకొన్నాడు. తన అందచందాలతో సీజరు దృష్టిని పూర్తిగా తనవైపు మళ్ళించుకోడంలో క్లియోపాత్రా విజయం గాంచింది. అప్పటిదాకా, న్యాయంగా వ్యవహారాలు పరిష్కరిద్దామనుకొంటున్న సీజరు, పూర్తిగా క్లియోపాత్రా పక్షం అయిపోయాడు. అంతేకాదు, ఆమెకోసం, ఆమె పోయిన ప్రతిష్టను పునరుద్ధరించడంకోసం, సీజరు, టోలమీమీద దండయాత్రను సాగించాడు. ఆ యుద్ధంలో టోలమీ, క్లియోపాత్రా భర్త, ప్రాణాలు పోగొట్టుకున్నాడు. యీ టోలమీ తమ్ముని చేపట్టి క్లియోపాత్రా తిరిగి రాజ్యానికి వచ్చింది. టోలమీ వంశీయుని భార్య అన్నమాటేగాని, క్లియోపాత్రా సీజరును పూర్తిగా ప్రేమించింది. ఏమాత్రం రహస్యం లేకుండానే అతని జీవితాన్ని పంచుకొంది. వారిరువురినీ గురించి ప్రజలు వింతగా చెప్పుకొనేవారు. ఈజిప్టులో సీజరు వున్నంతకాలం హాయిగా జరిగిపోయింది. సీజరు తిరిగి రోమ్‌కు వెళ్ళిపోయిన కొద్ది రోజులలోనే, తనకంటె చాలా చిన్నవాడైన భర్త టోలమీని తీసుకొని క్లియోపాత్రా రోముకి ప్రయాణం అయింది. రోము జేరగానే, సీజరును చూసుకొని తన భర్తకి విషం యిచ్చి, తనదారినుండి తొలగించింది కాని, క్లియోపాత్రా రోమను ప్రేమికునితోగడిపే జీవిత విధానం

సీజరుని రోమనులమధ్య, కించపరచింది. క్లియోపాత్రా అందకత్తెయేగాని, ఆ అందానికి గౌరవంలేకుండాపోయింది రోములో. అందుకే, సీజరు హత్య అనంతరం, రోములో తనకి గౌరవనీయమైన స్థానం లేదని క్లియోపాత్రా యీజిప్టు తిరిగి వచ్చేసింది.

క్లియోపాత్రా తండ్రి బ్రతికివున్న రోజులలో అతని సహాయార్థం రోమునుండి ఆంటోనీ యీజిప్టు వచ్చాడు. ఆరోజులలోనే, క్లియోపాత్రా అతన్ని చూసి వలచింది. ఇప్పుడు, రోములో ప్రజాయుద్ధాలు బయలుదేరి, నాయకులు పోట్లాడుకొంటున్న సమయంలో, చక్కని అవకాశం లభించిందని, క్లియోపాత్రా ఆంటోనీ పక్షాన్ని చేరి సహాయం చేసింది. తన సహజసౌందర్యాన్ని వెయ్యిరెట్లు అతిశయింప చేసేటట్లు అద్భుతంగా అలంకరింపబడిన ఓడలో, ఎన్నో ఓడలు వెన్నంటిరాగా, పనికట్టుకొని, ఆంటోనీని సైలీసియాలో చూడడానికి వెళ్ళింది. ఆ క్షణం నుండే, ఆంటోనీ ఆమె అందచందాలకు సమ్మోహితుడై, ఆమె బానిస అయాడు. ఆమెతోబాటు యీజిప్టు వెళ్ళి అక్కడ మదించినట్లు ఐశ్వర్యంలో తులతూగుతూ, నిర్వ్యాపారిగా కాలం గడపడం మొదలుపెట్టాడు. ఆంటోనీ ఆసిరిస్ అనీ, క్లియోపాత్రా ఐసిస్ అనీ, పిలుచుకొంటూ, తాము దైవాంశ సంభూతులమని అనుకొనే వారు. ఈ బలవత్తర ప్రేమవాహినిని కొద్దికాలంపాటు ఆక్టేవియా అరికట్టింది. పనిమీద రోము వచ్చిన ఆంటోనీ తన గౌరవప్రతిపత్తులను కాపాడుకోడం కోసం ఆక్టేవియస్ సీజరు చెల్లెలైన ఆక్టేవియాను వివాహం ఆడక తప్పలేదు. కాని కొద్ది కాలంలోనే ఆంటోనీ తిరిగి ఈజిప్టు వచ్చేయడమూ, ఆక్టేవియాను నిర్లక్ష్యం చేయడమూ జరిగింది. ఈ పరిస్థితుల ప్రాబల్యంవల్లా, తన చెల్లెలికి జరిగిన అవమానంవల్లా ఉద్రిక్తుడై, ఆక్టేవియస్ సీజరు, క్లియోపాత్రా మీద యుద్ధప్రకటన చేశాడు. చరిత్ర ప్రసిద్ధిగాంచిన ఆక్టియమ్ నౌకా యుద్ధంలో ఆక్టేవియస్ సీజరు, క్లియోపాత్రా తరఫున వచ్చిన ఆంటోనీ కలుసుకొన్నారు. ఆఖరుకి యిది బావమరదుల మధ్య యుద్ధంగా తయారయింది. ఈ యుద్ధరంగానికి ఒక యీజిప్షియన్ నౌకా సమూహంతో క్లియోపాత్రాకూడా వచ్చింది. కాని, పరిస్థితులు తన కనుకూలంగా లేవని తెలియగానే, రంగంనుండి పారిపోయింది. ఆక్టేవియస్ సీజరు, తరుముకొనిరాగా, ప్రాణాలు గుప్పెట పెట్టుకొని అలగ్జాండ్రియాలో తలదాచుకొంది— ఆంటోనీ కూడా ఆమెను చేరాడు. ఆంటోనీ సర్వవిధాలా నాశనం అయాడని, తన ప్రయత్నాలు అన్నీ రోమను విజేతముందు నిష్ఫలమయాయనీ, తెలుసుకున్న క్లియోపాత్రా, ఆక్టేవియస్ సీజరుకి లొంగిపోవాలని నిశ్చయించుకొంది. తన సమ్మతి యివ్వడానికి షరతుగా, ఆక్టేవియస్ సీజరు, ఆంటోనీని హత్య గావించాలన్నాడు. ఈ షరతు నచ్చినట్లే అనిపించింది క్లియోపాత్రాకి. మసోలియమ్‌కి ఆంటోనీని రప్పించి ఆపని కాస్తా చేద్దామనే తలంపు క్లియోపాత్రాకు వున్నదేమో. మసోలియమ్‌కు రమ్మని కబురంపగానే ఆంటోనీకి విపరీతమైన వూహలు కలిగాయి. తాము హాయిగా వుండే రోజులలో ఒకసారి క్లియోపాత్రా, "ఈ మసోలియం ఎందుకు కట్టిస్తున్నానో తెలుసా? మరణంలోకూడా మనిద్దరం విడిపోకుండా వుండడానికి. మనిద్దరం, యిందులో నిద్రిస్తూ హాయిగా చనిపోదాం" అంది. ఆమాటలు ఆ క్షణాన జ్ఞాపకంవచ్చి, క్లియోపాత్రా మరణించిందని నిర్ణయించుకొని ఆంటోనీ ఆత్మహత్య చేసుకొన్నాడు. కాని సీజరునీ, ఆంటోనీనీ యిట్టే సమ్మోహితులను చేసి, తన పాదాక్రాంతులను చేసిన క్లియోపాత్రా అందచందాలు ఆక్టేవియస్ సీజరును ఏమాత్రం కదల్చలేకపోయాయి. ఖైదీగా రోము ప్రవేశించడంకంటే ప్రాణత్యాగమే నయం అని నిశ్చయించుకొని ఈజిప్టులో దారుణ విషసర్పంగా ఎంచబడే "ఏస్ప్" (Asp)చేత కరిపించుకొని క్లియోపాత్రా మరణించింది. క్లియోపాత్రా మరణించేసరికి ఆమె వయస్సు 39 సం ఆమెతోపాటే ఈజిప్టు టోలమీ రాజ్యవంశం అంతరించింది.

ఇది సూక్ష్మంలో క్లియోపాత్రా జీవితచరిత్ర. రోమను అధినేతలలో ప్రముఖులైన ముగ్గురి జీవితాలని ఈమె తనకు నచ్చినట్లు తీర్చిదిద్దిందంటే అతిశయోక్తి కాదు. జూలియస్ సీజరు, అతని కుడిభుజంగా వుండే ఆంటోనీ, సీజరు కుమా

రుడూ, తరువాత ప్రప్రథమ రోమను రాజు అయిన ఆక్టేవియస్ సీజరు - ఈ ముగ్గురు రోమను రాజ్య సంరక్షణ విషయంలో కంటే, దృష్టిని ఎక్కువగా క్లియోపాత్రామీద కేంద్రీకరించారు. అందుకే చాలామంది చరిత్ర కారులు, రోమనురాజ్య పతన కారణాలలో క్లియోపాత్రా కూడా ఒకటిగా భావిస్తారు.

సీజరు పాంపేని తరుముకొని యీజిప్టు వచ్చినప్పటికి క్లియోపాత్రా నవయౌవని. క్లియోపాత్రా "నైలునది పుత్రిక" అనీ, ఆమెని సంతోష పరచకపోతే, నైలునది జలాలు పొలాలు పండించవనీ, యీజిప్షియనులు నమ్మేవారు. అందుకే సామాన్యుల కామె ఆరాధ్యమైంది. ఈ నమ్మికకి తోడు, ఆమె అందం అందరినీ సమ్మోహితులను చేసేది. క్లియోపాత్రకి యిది తెలుసు. అందుకే, తన అందాన్ని అన్ని విధాలా తన పరిస్థితుల అనుకూలానికి ఉపయోగించుకొంటూ - మానవహృదయ దేవత అయింది. అలాంటి వనితా రత్నం ముందు సీజరంతటివాడు కూడా తల ఒగ్గ వలసి వచ్చింది. అసలే సీజరు స్త్రీత్వాన్ని ప్రేమిస్తాడన్న పేరు గాంచాడు. సీజరు ఆంతరంగిక మిత్రులంతా స్త్రీలే అంటారు. అందుకే, "ఆడదాని పాలన ఈ జిప్టు వినాశనానిని దారితీస్తుం"దని భయపడే వారున్నా. వారిని లెక్క చేసేవారు లేకుండ పోయారు ఆరోజులలో. సీజరు యీజిప్టు వచ్చేసరికి - క్లియోపాత్రా ప్రౌఢకాదు, ప్రజ్ఞావంతురాలు కాదు అయినా, అప్పుడే విజ్ఞానవంతులైన మొగవాళ్ళని అజ్ఞానులుగా చేయడం ప్రారంభించింది క్లియోపాత్రా సహజ సౌందర్యం. క్లియోపాత్రని చూడగానే "ఇదికలా ? నిజమా ? ఇదికలే అయితే ఎంత అద్భుతంగా వుంది ! ఇది కలేఅయితే, నాకు మెలుకువరాకుండావుండాలి. ఈకల తుదివరకూ సాగడానికి కావలిస్తే పది ఖండాలు గెలిచి, అర్పిస్తాను !" అనుకుంటాడు సీజరు. "నీమాటలు వింటుంటే, నువ్వు నిజంగా లేవు. ఇది నిజంకాదు. కలలో కన్పించే, నిజమనిపించే మాయవి నువ్వు" అంటాడు. రోమను అనగానే భయపడ్డ క్లియోపాత్రను చూసి "సీజరు స్త్రీ భక్షకుడుకాడు. స్త్రీలు అతన్ని యిట్టే మోసగించుతారు. వారికళ్ళు అతన్ని మిరుమిట్లు కొల్పిస్తాయి. వారున్నట్లుగా కాక, వారెలావుంటే తనకిష్టమో. అలాగే వాళ్ళని చూస్తాడు సీజరు. తెలుసా" అంటాడు. "నువ్వు పెద్దవాడివి. నీముఖం ముడుతలుపడి వుంది." అని నవ్వుతూ క్లియోపాత్ర అంటే, ఖిన్నుడైనా సీజరు అంటాడు. ... "సీజరు దిగ్విజయాలన్నిటిలోనూ ప్రమాదభరితమైనది నువ్వే" సీజరుని అంతగా సమ్మోహితుణ్ణి చేసింది క్లియోపాత్రా.

సీజరు ఎంత సమ్మోహితుడయ్యాడో, అతన్ని చూసి క్లియోపాత్రా కూడా అంతా సమ్మోహితురాలైంది. సీజరుతో నున్న కొద్దిమాసాలలోనే ఆమెలో ఎంతో మార్పు వచ్చింది. అయినా ఆమెకి తెలుసు, అతన్నితను ప్రేమించలేదని. "దేవుణ్ణి ఎవరైనా ప్రేమించగలరా?" అంటుంది. "అంతేకాదు, నే యింకో రోమనుని ప్రేమించాను; అతను దైవంకాదు; మానవుడు: ప్రేమించ కలిగే, ద్వేషింప కలిగే వ్యక్తి అతను: అతని నేన్నె బాధించినా అతను నన్ను బాధించ కలడు. అలాంటి రోమనుని నే ప్రేమించాను" అంటుంది. ఆ రోమనే ఆంటోనీ. ఆంటోనీని పూర్తిగా ప్రేమించింది క్లియోపాత్రా. అంటోనీతో యీజిప్టు వచ్చిన ఎనోబార్బస్ తిరిగి రోము వచ్చి క్లియోపాత్రని వర్ణిస్తాడు తన స్నేహితులకి. దాన్ని వింటే క్లియోపాత్ర వర్ణనే కాకుండా ఆమె ఆంటోనీపై ప్రసరించిన మత్తుకూడా అర్థం అవుతుంది- "ఆమె కూర్చున్న ఓడ మేలిమి బంగారంలా మెరిసింది. తెరచాపలు గాలిపోసుకుని, అందంగా వున్నాయి. ఆ దృశ్యం చూస్తే ...గాలులే ప్రేమాగ్నితో బాధపడు తున్నాయా అన్నట్లుంది. క్లియోపాత్రాని వర్ణించడానికి మాటల్లేవు. వాలుగా, ఉల్లిపొర బంగారు వన్నె వస్త్రాలు ధరించి. కూర్చున్న ఆమె - వీనస్ వన్నెలూ, ప్రకృతిశోభా మిళితం చేసుకొని మానవకోటిని మభ్యపెట్టడానికి కూర్చున్నట్లుంది" అంటూ, "అందరు స్త్రీలూ ప్రేమ దాహాన్ని తనియింప చేస్తారు. కాని క్లియోపాత్రా తనియింపచేస్తూనే దాహాన్ని పెంపొందిస్తుంది. యుగయుగాలు గడిచినా ఆమె విసుగెత్తించదు." చెప్తాడు. విచ్చిన కత్తిలా, సంధించిన మన్మథ బాణంలా నిల్చిన క్లియోపాత్రా ముందు సర్వం మరిచిపోయాడు ఆంటోని.

ఆంటోనీని మనసారా ప్రేమించిన క్లియోపాత్రకి ఆక్టేవియాని (ఆంటోని భార్య) గురించి విన్నప్పుడు స్త్రీ సహజమైన అసూయ జనిస్తుంది. రోములో ఆక్టేవియాని చూచి వచ్చిన సేవకుణ్ణి తరిచితరిచి అడుగుతుంది, అంతేకాదు.

అంటోనీని గురించి మంచిమాటలు చెప్తే "రారాజులు సహితం చుంబించడానికివణికిన నా చేయిని నీకందిస్తాను." అంటుంది. తన సౌందర్యంలో అంత నమ్మకం క్లియోపాత్రకి. "నా అంత పొడుగువుందా? అందంగా నడుస్తుందా? కంఠస్వరం బాగుందా? తెలివి తేటలు ఉట్టిపడేలా మాట్లాడగలదా?" అన్న ప్రశ్న పరంపరకి "నడకలో గాంభీర్యం లేదు. శరీరంలో చైతన్యం కనబడదు; వూపిరిపీల్చే శిలాప్రతిమ" అని సమాధానం చెప్తాడు. అదివిని పరితృప్తి చెందుతుంది క్లియోపాత్ర. ఆంటోనీ తిరిగి త్వరలోనె ఆమెను చేరుకుంటాడు. కానిపరిస్థితులు ఎదురు తిరగడంవల్ల... క్లియోపాత్రా అవకాశవాదంవల్లా ఆత్మహత్య చేసుకుంటాడు. ఆక్టేవియస్ సీజరుని కూడా ఒకవిధంగా సమ్మోహనపరిచింది క్లియోపాత్ర. కాని ఆక్టేవియస్ సీజరు, తండ్రి జూలియస్ సీజరులా స్త్రీ హృదయానికి దాస్యం చెయ్యలేదు. అందుకే, క్లియోపాత్రని ఖైదీచేయ నిశ్చయించుకొన్నాడు. పరిస్థితులు పూర్తిగా విషమించగనే "కాటుకి ఎదురులేని, మనిషికి నెప్పిలేని, నైలువదీ జీవి-యాస్ప్"ని తీసుకు రమ్మంటుంది. దానిచే హృదయంపై కరిపించుకొని దీర్ఘ నిద్రకి స్థిమిత పడుతుంది. చనిపోయిన ఆమెను చూడవచ్చిన ఆక్టేవియస్ సీజరు - అప్పుడూ ఆమె అందానికి ముగ్ధుడవుతాడు. "చివరివరకూ తన యిష్టానుసారంగా జరిపించుకొన్న క్లియోపాత్రా తనకి తగిన మరణాన్నే పొందింది. విషంతిందా? పొడుచుకుందా? రక్తం కనిపించదే! విషంతింటే వికృతంగా ముఖం కనిపించదా?" అలా ఏంలేదు ఎంతో ప్రశాంతంగా నిద్రిస్తూన్నట్లుంది, ఇంకో అంటోనీని యిట్టే ముగ్ధుణ్ణిచేసేటట్టుంది.." అంటాడు.

బ్రతికి వున్నంతకాలం క్లియోపాత్రా ఎలా అందరినీ సమ్మోహితులనుచేసిందో, చనిపోయిన తరువాతకూడా, ఆమె మూర్తి మానవకోటిని వెన్నంటేవుంది. లేకుంటే ఏనాటి క్లియోపాత్రా? ఏనాటి ఈజిప్టు? ఏనాటి సీజరు? అయినా, యీనాటికీ ఈజిప్టూ, క్లియోపాత్రా సీజరూ, ఆంటోనీ- అందరూ మనకి పరిచయమే. దానికి కారణం ఏమిటి? క్లియోపాత్రా జగద్విఖ్యాతి గాంచిన సౌందర్యవతి కావడమే. తన సౌందర్యంలో నమ్మకం వుండీకూడా దానిని తగినవిధంగా పోషించి ఆయుధంలా ఉపయోగించుకోకల్గింది క్లియోపాత్రా. క్లియోపాత్రా తన ప్రేమికుల్ని మంత్రముగ్ధులని చేసింది. అంటోనీ వ్యక్తిత్వానికే వన్నెతెచ్చింది. అతని పంచేంద్రియాలనీ పరవశత్వంలో ముంచెత్తింది. ఆమె కోపతాపాలు, వేళాకోళాలూ ఆమె చిరునవ్వు, కన్నీరూ- అతన్ని మంత్రించివేస్తాయి. అతని హృదయపు కోరికల మూర్తి ఆమె. ఆమెను ప్రేమించడం కోసమే అతను పుట్టాడు. స్వర్గంలో దేవతలకి దానికి ఎదురుచెప్పడానికేముంది? స్వర్గాన్ని ఊహించుకోవడం ఆమెని ఊహించుకోడం- చనిపోవడంఅంటే- ఆమె సన్నిధి చేరడం. అతని హృదయపు ప్రతి అణువూ ఆమెకి అర్పించాడు. చివరికి ఆమె అతన్ని నాశనం చేసింది. అదీ ప్రేమతోనే, అదీ అతని కోరికపైనే అనిపిస్తుంది— మనకి. యిలా అనిపించడానికి కారణం ఆమె ముగ్ధమోహన సౌందర్యమే.

ఆమె సౌందర్యంలో మృదుత్వంతోపాటు కఠినత్వం కూడా కలిసివుంది. ఎదుటి వ్యక్తి కోసం నవనీతంలా కరిగిన హృదయాన్ని ఆ మరుక్షణమె వజ్రంలా చేసుకోకలదు క్లియోపాత్రా. ఇందువల్లే ఆమె అందం అందరినీ ఆకర్షించింది. ఈ ప్రపంచంలో స్త్రీ పురుషులు ఉన్నంతకాలం క్లియోపాత్రా ప్రభావం ఉండనే వుంటుంది. బ్లెసీ పాస్కల్ అంటాడు: క్లియోపాత్రా నాసిక కొంచం పొడుగైనా కొద్ది పొట్టి అయినా చరిత్ర గతే మారిపోయేది!

---

# ఉరుములు - మెరుములు

శ్రీ వేమరాజు భానుమూర్తి.

(గత సంచికలో పిడుగుయొక్క స్వభావస్వరూపాలూ, ఉరుములూ మెరుములూ వాని వల్ల కలిగే ఫలితాలను తెలుసుకోడానికి విజ్ఞానవేత్తలు సాగించిన పరిశోధనలూ చర్చించబడ్డాయి.)

(గతసంచిక తరువాయి)

మళ్ళీ వెనకటిసమస్యే సిద్ధమయింది. అందుకోసం మెరుపు ఏలాగా దొరకదు కనుక కనీసం దాన్ని ఫోటో తీసిచూస్తే మన పరిశోధకుల కేమైనా ఉపకరిస్తుందేమో అని ఒక బుద్ధిమంతునకు తట్టింది. సరే అంటే సరే అనుకున్నారు.

“ఇంతకీ ఈమెరుపుని మామూలు కెమెరాతోనే ఫోటో తీశారా” అని అడిగాడు రాజు.

మంచి సందేహమేనే! రాదగిందే. ఇందుకోసం మామూలు కెమేరా ఎందుకు ఉపయోగించ కూడదు? ఎందుకంటే, మామూలు కెమేరాను ఉపయోగించడం వలన మెరుపు ఎంత కాలం మెరిసిందో, ఎన్ని ఎన్ని మెరుపులు వచ్చాయో, ఇది మన్నులో బయలు దేరిందో మిన్నులో బయలుదేరిందో, ఆ వివరాలు ఏమీ తెలియవు. అందుకోసమని ప్రత్యేకంగా ఒక కెమేరాను నిర్మించారు. ఇందులో ఫిల్మ్ గబగబా కదులుతుంది. కనుక కాల ప్రమాణాన్ని కూడా తెలుసుకోడానికి వీలుంటుంది. ఈ కెమేరాలో ఫిల్మ్ ఎంతవేగంగా కదులుతుందో తెలుసా? నిమిషానికి ఒకమైలు. ఇవన్నీ సిద్ధం చేసుకున్న తరువాత తరుచుగా పిడుగులు పడే చోటు కోసం వెతకడం ప్రారంభించారు. విచిత్రం ఏమిటంటే న్యూయార్కులో అన్నిటికంటే చాలా ఎత్తయిన ‘ఎమ్‌పైర్ స్టేటు భవనం’ మీద ఇవి పడుతుండడం దానిని వారు తొలిసారిగా కనుగొన్నారు. ఇది చాలా ఎత్తుగా ఉండడం మూలాన్ని ఆ చుట్టుపక్కల పడవలసిన మెరుపులన్నీ దీని మీదికే ఆకర్షింపబడుతూండేవి. ఎప్పటి కప్పుడు మెరుపులను నమోదు చేసే యంత్రాలను ఇందులో అమర్చారు. దానికి ఆ రిల్లు అవతల ఉన్న మరియొక పొడుగాటి భవనం మీద ఈ మెరుపులను ఫోటో తీసే కెమేరాలను ఇక్కడ పెట్టారు. వీటి సాయంతో ప్రపంచములో కల్లా అతి ఎత్తయిన భవనం మీద పడుతున్న మెరుపులన్నింటినీ ఫోటో తీశారు. అసలు ఈ మెరుపులు పడుతున్న సంగతి 1200 అడుగులు దిగువనున్న రోడ్డుమీద నడిచిపోయే వారికి తెలియనే తెలియదు. ఎందుకంటే ఇందులో ఏవో కొన్ని తప్ప మిగతావి ఎవరి కంటా పడవు కనుక. మరికొంత మంది పరిశోధకులు నాక్స్‌విలీ దగ్గర టెన్నెసీ పర్వతాల సమీపంలో ఒక శిబిరాన్ని ఏర్పాటు చేసుకొని అహోరాత్రాలు మెరుపు ఎప్పుడు వస్తుందాయని ఓపికగా కాచుకుని కూర్చున్నారట. ముఖ్యంగా ఎంతో శక్తిమంత మైన విద్యుచ్ఛక్తి తీగలు ఉండే దోవ పొడుక్కీ యంత్రాలన్నీ అమర్చి ఉండగా వేసవికాలం అంతా అయ్యేసరికి ఈ తీగలమీద పెద్ద పిడుగు పడినప్పటి బొమ్మని సంపాదించగలిగారు. ఇందుకోసం జీతాలనిమిత్తమయితేనేమి, యంత్రాల నిమిత్త మైతేనేమి యితరత్రా అయిన ఖర్చులంతా లెక్క చూస్తే ఆ ఒక్క ఫోటోగ్రఫు ఖరీదు లక్షా ఏభై వేల డాలర్లు, అంటే 7 లక్షల 50 వేల రూపాయిలు. ఆతరువాత మెరుపుని పట్టుకోడంకోసం ఫిట్స్‌బర్గ్‌లోనూ, మాంటెన్నాలోనూ, రెండు లేబరేటరీలు నెలకొల్పారు. ఇందులో మాంటెన్నాలో లేబరేటరీవలలో చిక్కిన పిడుగు ఎంతశక్తిమంతమయినదో అని అంచనావేసి చూచారు. అందులో తాత్కాలికంగా 250 లక్షల

కోట్ల కిలోవాట్లు విద్యుచ్ఛక్తి కలదని తేలింది. "అమ్మ బాబో!" అంటూ నమ్మలేనట్టుచూచారు అంతా. "ఏమండీ అసలు ఈ మెరుపు ఎంత శక్తి వంతమైనదో ఎలా లెక్క కడతారో చెప్పండి" అన్నాడు సుబ్బారావు. "అదా వినండి. రక రకాల కొలతలకు రక రకాల యంత్రాల నుపయోగించినట్లే దీనికీ ఒక యంత్రం ఉంది. దీనిని ఫల్‌క్రోనోగ్రాఫ్ అంటారు. ఇది లాటిన్ గ్రీక్ భాషల సమాసం. దీనికి అర్థం ఏమి టంటే పిడుగునీ అదిపడ్డ కాలాన్నీ నమోదు చేసిన చిత్రం అని. "అది ఎలా వుంటుందండీ"అని అడిగాడు రాజు. ఈ యంత్రం ఒక మోటారు వంటిది. ఒక అల్యూమినియం పళ్ళచక్రం ఉం టుంది. ఇందులో చక్రానికిఇరువైపులా మొప్ప లవలె చొచ్చుకువచ్చిన అయస్కాంతపురజను ఉం టుంది. ఇదంతా 2 తీగచుట్టలమధ్య తిరుగుతూ ఉంటుంది. మెరుపు మెరిసినప్పుడు వెలువడే విద్యుచ్ఛక్తి అంతా ఈ తీగచుట్టలద్వారా ప్రవహిస్తుంది. పిడుగు పడ్డప్పుడు ఈ తీగలలోకి విద్యుచ్ఛక్తి ప్రవహించడంవల్ల అయస్కాంతశక్తి ఏర్పడుతుంది. అందువల్ల ఈ చక్రంలో ఉండే రజనుకూడా మెరుపులో ఉండే విద్యుచ్ఛక్తి ప్రభావానికి లోనై, అయస్కాంతంగా మారి పోతుంది. అనగా ఒక సెకనులో 4 కోట్ల వంతుల సమయంలో వెలువడే విద్యుచ్ఛక్తి పరిమాణం కూడా నమోదయిపోతుంది. ఇట్టివి రెండు యంత్రాలున్నవి. ఇందులో ఒకదానిలో దాదాపు 400 మొప్పలతో కూడిన ఒక చక్రం నిమిషానికి 34 చుట్లు చొప్పున అమిత వేగంతో తిరుగుతుంది. అంటే 60 వంతు సెకనులో ఒక ఆవృత్తం పూర్తవుతుంది. ఇందులో ఈ మొప్పల ఏర్పాటూ ఈ చక్రం తిరిగే వేగమూ వీటిని బట్టి ప్రతి నలభై మైక్రో సెకనులకు ఒక బొమ్మ తయారు చేయడానికి అవకాశముంటుంది. ఆ ప్రకారంగా దీని సాయంతో మెరుపుకు సంబంధించిన అన్ని వివరాలతో కూడిన రేఖా చిత్రాలు తయారవుతాయి. ఇందులో రెండో చక్రం మెల్లిగా సెకనుకు ఒక చుట్టు చొప్పున తిరుగుతుంది. దీని సాయంతో పిడుగులు ఎప్పు డెప్పుడు పడిందీ నమోదు చేయవచ్చు. పైగా మొదటి చక్రం సాయంతో తయారు చేసిన గ్రాఫులను నెమ్మది నెమ్మదిగా పరిశీలించడానికి వీలుంది.

"ఇన్ని యంత్రాలు నిర్మించి వైజ్ఞానికులు ఇన్ని విధాల కష్టపడుతున్నారుకదా! మరివీరు ఇంతకీ మెరుపు గుణాలను గురించి ఏమయినా కనిపెట్టారా, లేదా?" అంది సుభద్ర ఆసక్తితో.

"కనిపెట్టకేం ? చాలా కనిపెట్టారు. వీరి కృషి ఫలితంగా ప్రకృతి అద్భుతలక్షణాలెన్నో అవగాహన అయ్యాయి. మెరుపు మెరిసినా, పిడుగు పడ్డా, దానికి రెండు ప్రధానలక్షణా లుంటాయని తెలుసుకున్నారు. చాలా తీవ్ర మయిన విద్యుచ్ఛక్తి కూడుకున్నప్పుడే మెరుపు మెరుస్తుందనీ అయితే అది అట్టేకాలం ఉండదనీ తెలుసుకున్నారు. అసలు పిడుగు పడినప్పుడు దాని తీవ్రతకు ఇదేకారణ మనికూడా తేలింది. అయితే ఇందువల్ల నిప్పు మాత్రం పుట్టదు. అయితే పిడుగుపడి మరుక్షణంలో రెండవదశ ప్రారంభమయినప్పుడు విద్యుచ్ఛక్తి ప్రసారం కాస్త మందకొడిగా జరుగుతుంది. అప్పుడే దాని ప్రమాదం ఎక్కువ. ఇలాంటిది ఎక్కువగా ఉన్నప్పుడే వేడిపిడుగు పడింది అంటారు. ఇలా కానివాటిని చలిపిడుగు లంటారు. ఈలాగ వేడిపిడుగు పడడం మూలంగానే అడవు లంటు కుని దవానలాలు ప్రారంభ మవుతాయి. మామూలుగా ఒకటే మెరుపుగా కనబడే వాట్లలో వాస్తవానికి అనేకం ఉండవచ్చు.

పెద్ద మెరుపు మెరిసి పోయినవెంటనే దాని వెనకాల అనేకం నీరస మయిన చిన్న మెరుపులు బయలుదేరవచ్చు. ముందుగా నిమిషానికి నూరు మైళ్ళవంతున ఒక చిన్న మెరుపు బయలుదేరింది అనుకోండి. ఆ వెనువెంటనే చూస్తుండగా అదే దోవను సెకనుకి 20 వేల మైళ్ళ వేగంతో ఇంకొకటి ముంచుకురావచ్చు. దాని అడుగుజాడలలో యింకొకటి, యింకొకటి యింకొకటి, ఈలాగ అనేకం రావచ్చు.

"రామాయణం అంతా విని రామునికి సీత ఏమవుతుందని అడుగుతున్నానని ఆక్షేపించకండేం. ఇంతకీ మెరుపు ఏలాకలుగుతుం దంటారు?" అని అడిగింది సుభద్ర.

"ఆలా అనుకోములే! ఈపాటికి నీకే తెలిసి ఉండాలి. ఇంతకీ మెరుపనేది విద్యుత్ ప్రవాహం కదా! కాని ఈ విద్యుచ్ఛక్తి భూమినుంచి వస్తుందని చాలామందికి తెలియదు."

"అలాగాండీ! ఆకాశంలో ఉండే మెరుపుకి భూమిలోంచి విద్యుచ్ఛక్తి రావడం బలే ఆశ్చర్యంగా ఉంది!" అన్నాడు సుబ్బారావు.

"ఆశ్చర్యంగా ఉంటుంది మరి తెలియనంతసేపూ. విను. మనభూమికి సహజంగా అయిదు లక్షల కూలంబుల విద్యుచ్ఛక్తి సామర్థ్యం ఉంది. ఇక్కడ "కూలంబు" అంటే ఏమిటో చెప్పాలి. ఒక్క సెకనులో ఒక్క అంపియర్‌లో ఉండే విద్యుచ్ఛక్తి మొత్తాన్ని కూలంబు అంటారు. గాలికనుక విద్యుద్వాహకం కాకుండా ఉన్నట్లయితే ఈ విద్యుచ్ఛక్తి అంతా బయటికి పోయేదికాదు. కాని గాలి అంతా ఒక్కొక్క పరిస్థితిలో అయనులతో నిండిపోతుంది. ఆవిధంగా అయనీకరణం జరిగినప్పుడు దానికి విద్యుత్తును ప్రవహింపజేసే లక్షణం కలుగుతుంది. ఆ విధంగా భూమిలోనుంచి విద్యుచ్ఛక్తి కొంచెం కొంచెంగా పరిసరాలలో నున్న మేఘాలలోకి ప్రవహించి పోతుంది. ఈ పద్ధతిని భూమినుంచి చదరపుమైలుకు అయిదు మైక్రో ఆంపియర్‌ని వంతున ఎలెక్ట్రానులు ప్రవహిస్తాయి. కాని ఆకాశం స్వచ్ఛంగా ఉన్నప్పుడు మాత్రం ఇదివేయి ఆంపియర్లదాకా ఉంటుంది. వాతావరణం బాగా ఉన్నప్పుడు ఈ విధంగా భూమినుంచి ఎలెక్ట్రాను ప్రవహిస్తూ ఉంటే దాని తాలూకు ఋణ విద్యుత్కణాలన్నీ ప్రవహించి పోవడానికి పదినిమిషాలు కూడా పట్టదు.!"

"అయితే మరి ఈవిధంగా గ్రహించిన ఎలెక్ట్రానులనీ విద్యుచ్ఛక్తినీ మెరుపు తిరిగి భూమికి ఇచ్చేస్తున్నదన్నమాట. అంతేనా?" అంది కుశాగ్రబుద్ధి అయిన సుభద్ర.

"ఆహా! సరిగ్గాజరిగే దింతే. ఈపనిపూర్తిగా జరగాలంటే భూమ్యుపరితలం మీద సెకనుకు ఏభైసార్లన్నా మెరుపు పడాలి. అంటే ఏడాదికి ఎంతో తెలుసా? కంగారు పడకండా వినండి. రెండులక్షల కోట్లసార్లు పడాలి."

"అమ్మో!" అన్నాడురాజు."అబ్బా!"అన్నాడు సుబ్బారావు. "నిజమా?" అంది సుభద్ర.

"ఇంకా వినండిమరి. అంటే నిమిషానికి ప్రతి చదరపు మైలుపైనా ఏడాదికి సగటున ఏడెనిమిది సార్లన్నా మెరుపు పడుతోందన్నమాట."

"అయితే ఇంతసేపూ మెరుపు సంగతే చెప్పారు. ఉరుముల మాటేమిటి? దీని సంగతే మరిచి పోయినట్టున్నారు!"అని జ్ఞాపకం చేసింది సుభద్ర.

"నీ అభిప్రాయం ప్రతి మెరుపుతోనూ ఉరుముకూడా వినబడుతూ ఉంటుందికదా, దాని సంగతి చెప్పరేమని. అందరూ అలాగే అను

కుంటూ ఉంటారు. కాని ఆమాట ఎల్లప్పుడూ నిజం కాదు. కొన్ని సమయాలలో ఉరుము లేకుండానే మెరుపులు వస్తూంటాయి. వాటిల్లో కొన్ని చాలా ప్రకాశంగా ఉంటాయి. అయితే వాటివల్ల అంత నష్టం కలుగదు. ఇంతకీ ఉరుము ఎలా కలుగుతుం దంటే అమిత వేగంతో విద్యుల్లత ప్రవహించడంవల్ల పుట్టిన వేడికి వాతావరణం హఠాత్తుగా వ్యాకోచం చెందు తుంది. అందువల్ల విద్యుల్లతలోని కణాలు కొంత దూరం గెంతవలసివస్తుంది. అప్పుడు చప్పుడు అవుతుంది. మెరుపులన్నీ ఒకే వేగంతో ప్రయాణం చేయవు కనుక వాతావరణంలో ఒకే రకమైన వ్యాకోచం ఉండదు. అందుచేత ఒక్కొక్కసారి ఉరుము ఉండక పోవచ్చు. మెరుపువేగంతో పోల్చి చూచినప్పుడు శబ్దం వేగం చాలా తక్కువ. కనుక కొన్ని కొన్ని సందర్భాలలో మెరుపు కనబడ్డప్పటికీ, మనకు ఉరుము వినబడకపోవచ్చు. మాట వరసకు ఒక సంగతి చెబుతాను వినండి. ఆరు సెకను లకు పూర్వం మెరుపు బయలుదేరిందనుకోండి. ఒక సెకండు క్రితమే దానిలో కొంత భాగం భూమిని సమీపించిందనుకోండి. ఆసమయంలో మనకు మొదటినుంచీ ఉరుముతున్నట్టు కనబడు తుంది. కాని ఒక్కసారే పెద్ద ప్రేలుడు జరిగిన ట్లనిపించదు."

"ఓహో! బాగుంది. అయితే మెరుపులు భూమి పైనుంచి వాతావరణంలోకి కూడా వస్తాయా ?" అంది సుభద్ర.

"ఆ! రావచ్చు. లేదా ఇవి భూమిలోపలికి చొచ్చుకు పోవచ్చుకూడా. గాలివాన సమ యంలో ఆకాశం నుంచి క్రిందికి దిగుతున్న మెరుపులో ఋణ విద్యుత్కణాలన్నీ దానితో బాటు మబ్బునుంచి నేలమీదికి దిగవచ్చు. కాని ఇవి అన్నీ భూమిని సమీపించిన కొలది ముద్దకట్టి దట్టతనం ఎక్కువవుతుంది. ఆ సమ యంలో భూమినుంచి వెలువడే ధన విద్యుత్క ణాలు కూడా అప్రకారమే కేంద్రీకరింపబడుతూ ఉంటాయి. ఈ విధంగా పైనుంచి వచ్చే మెరుపు భూమికి కొన్ని వందల అడుగుల దూరంలో ఉండగా భూమినుంచి ఆకాశంకేసి కొంత ఎత్తు వరకు విద్యుత్ప్రవాహం లేస్తుంది. అందుచేత చాలా మంది పాపం! పైనుంచి వచ్చే మెరుపు దెబ్బకి కాక, భూమినుంచి ఎగసేదాని దెబ్బకే ఆహుతులై పోతారు !"

"అయ్యో! పాపం!" అన్నారు అంతా ఒక్కసారి.

"ఇంతకీ ఈ మెరుపును గురించి ఇంత కష్టపడి తెలుసుకుంటున్నారుకదా. ఇప్పుడు మీరు చెప్పిన దానినిబట్టి మెరుపు వల్ల కలిగేది కీడే కాని మేలు ఏమీ లేదనిపిస్తుంది. నిజమేనా ? అసలు మేలు ఏమీ లేదా ?" అని రెట్టించింది సుభద్ర.

"నేనూ అదే అడుగుదామనుకున్నాను. తీరా సుభద్రగారు అడిగేశారు !" అన్నాడు సుబ్బారావు ఆశాభంగం పొందిన వాడిలా మొహం పెట్టి.

"ఎవరుఅడిగితే ఏముంది? విందాం పట్టండి." అన్నాడు రాజు కుతూహలంతో.

"అవును. లేకేమిటి ? మేలూ ఉంది. నిజం చెప్పాలంటే మెరుపు పూర్తిగా నాశనకారి కాదు. అందువల్ల వ్యవసాయానికి కొంత మేలు కలుగుతుంది. మామూలు మెరుపువల్ల భూమి ఉపరితలంపై పది లక్షల టన్నుల నత్రజని ఖచ్చితంగా చేరుతుంది. మన వాతావరణంలో ఒక వంతు ప్రాణవాయువు నాలుగు వంతులు

నత్రజని ఉంటాయి. మెరుపువల్ల వాతావరణం విశ్లేషణ చెందుతుంది. అందువల్ల వర్షంతోబాటు ఈ నత్రజని భూమికి చేరుతుంది. మామూలుగా నత్రజనిని విడదీయాలంటే 15 లేక 20 అడుగుల దూరం నుంచే విద్యుత్ స్ఫులింగాలను వినియోగిస్తారు. ఇంక మెరుపు అనేది ప్రకృతి ప్రయోగించే స్ఫులింగం. దీని పొడవు చాలా ఎక్కువ. ఈ మెరుపు మెరిసే వ్యవధి కనుక చాలా తక్కువ కానట్టయితే పంటలకు అతి ముఖ్యంగా కావలసిన ఈ నత్రజని కొల్లలు కొల్లలుగా లభించేది. కాని తమకు కావలసిన విద్యుచ్ఛక్తిని తాము సృష్టించుకోవడం ఎలాగో మానవులు తెలుసుకున్నారు కనుక మెరుపును పట్టుకొని ఉపయోగించుకోవలసిన అవసరం వారికి లేకపోయింది. అయితే దానిని మచ్చిక చేసుకోవడానికి మాత్రం మానవాళి కృతనిశ్చయమై ఉంది. ముఖ్యంగా ఈ కృషిలో వారి ప్రధాన లక్ష్యం తాము కష్టపడి కట్టుకున్న కట్టడాలు పిడుగులు పడి ధ్వంసం కాకుండా కాపాడుకోవడమే. అందుకనే ఈ నాటికీ మెరుపు వేటగాళ్ళు ప్రకృతి ఖేలనంలో ప్రయోగించబడే విద్యుల్లేఖను మచ్చిక చేసుకోవడానికి అహరహం పాటు పడుతూనే ఉన్నారు."

"ఏమంటావు సుబ్బారావు? మెరుపుకథ ఇది." అంది సుభద్ర.

"అంతేనా? అయితే మెరుపు విద్యుత్ప్రవాహం అని తేలింది మీరుచెప్పిన దానినిబట్టి. పైగా అర్జునుడు ఒకసారి పిడుగును తన గుప్పిటిలో పెట్టుకుని నలిపి పారవేస్తుంటే అది భయపడిపోయి 'దాసోహం' అందని, అప్పుడు శరణాగత రక్షణ బిరుదాంకితుడైన ఆమహావీరుడు దానిని దయతలచి వదలి పెట్టుతూ నా పేరు ఎవరు తలంచుకుంటారో వారికి ఎట్టి అపకారం చేయరాదని, ఎక్కడ తలుచుకుంటారో అక్కడ పడరాదనీ ఆజ్ఞాపించాడట. అందుచేతనే అప్పటినుంచి ఉరుములు, మెరుములు వచ్చినప్పుడల్లా అర్జునుణ్ణి ప్రజలు స్మరించి ప్రాణరక్షణ చేసుకుంటున్నారని మా తాత చెప్పినదానికి ఏమీ ఆధారం లేదనికూడా తేలింది." అన్నాడు సుబ్బారావు.

"నేను ఒకరాజీ మార్గం చెబుతాను." అంది వేళాకోళంగా సుభద్ర. పంతులుగారు చెప్పినట్లు ఎత్తయిన కట్టడాలమీద పిడుగు పడకుండా శిఖరంనుంచి నేలలోకి మెరుపు ప్రవాహం పోవడానికి లోహపు తీగను బిగింప చేద్దాం. మన తృప్తికోసం అర్జునః ఫల్గునః అంటూ కూర్చుందాం" అంది ఆవిడ.

"మీరు మాత్రం ఏమిచేసినా మా సైన్సుకులంవాళ్ళు మాత్రం ఇలాంటి తాతయ్య కథలని ఏనాటికీ నమ్మరు. మా లెక్కలలో మెరుపంటే విద్యుల్లతేకాని ఇంద్రుని ఆయుధం కాదు." అంటూండగానే వాన వెలిసింది.

"ఓరినాయనా! పిడుగుమాట ఎత్తేటప్పటికి ఎంతకథ చెప్పావురా?" అన్నాడు మొదటినుంచి ఏమీ మాట్లాడకుండా అంతావింటున్న పెద్దబావ.

## నోటిలెక్క

ఒక దిక్కులేని ఆఫీసరు వంట కోసం, ఒక వంట వాడిని రోజుకు ఒక తులం వెండి జీత మిస్తానని కుదుర్చుకున్నాడు. ఆఫీసరుగారికి వంట మనిషి అవసరం 30 రోజులు మాత్రమే. ఆయన కొంచెం ముక్కోపి. కోపం వస్తే వెంటనే పొమ్మనేటందుకు వీలుగా 30 తులాల వెండి ముందుగానే కొనేసి, ఐదు ఉంగరాలుగా చేయించి ఇంట్లో ఉంచేడు. ఆ ఉంగరాలు సమాన తూకము గలవి మాత్రముకావు. ఆ ఐదు ఉంగరాలు ఎన్నేసి తులాలో ఆంధ్ర మహిళ పాఠకు లెవరేనా చెప్పవచ్చును.

## "ఏమిటి మావయ్యా అవి ?"

"మావయ్యా !"

"ఏమిట్రా ?"

"కర్నూలులో గాడిదలు గాక చూడ వలసినవి చాలా వున్నవటకదూ ? ఏమిటి మావయ్యా అవి ?"

"కళ్లుండి చూడలేవురా నీవు ? కోట బురుజుందికదా ! అదిగాక అష్టదిగ్గజములవంటి మంత్రి సత్తములు, అతిరథులు మహారథులైన శాసన సభ్యులు ముఖ్యంగా వున్నారురా."

## రచయితలకు మనవి

* మాకు కథలు, గేయాలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

* ప్రచురించని రచనలను త్రిప్పి పంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపు, అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

* రచనలు కాగితానికి ఒకే వైపు సిరాతో వ్రాసి పంపాలి.

* రచనలు మాకుచేరిన విషయాన్ని తెలియపర్చ లేము.

* సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండు ప్రతులు పంప వలసినదని మనవి.

## స్త్రీ హితైషిణీ మండలి - బాపట్ల.

ఈ మండలికి సోషల్ వెల్‌ఫేర్ బోర్డు వారొసంగిన గ్రాంటు సహాయంతో 15—4—55 తేదీని మండలియందు సంగీతము, హిందీ, కుట్టు తరగతులను, బీద పిల్లలకు పాలు పోయుటయు ఆరంభింపబడినవి. ఈ ప్రారంభోత్సవసభకు ఈ ఊరి గవర్నమెంటు ఆసుపత్రి లేడీ డాక్టరుగారైన కుమారి ఎ. సావిత్రీదేవి ఎం.బి.బిఎస్. గారు అధ్యక్షత వహించిరి. ఆయా తరగతులకు అధ్యాపకులు నియమితులైనారు. వీనితోబాటు పేద స్త్రీలకు శిశువులకు ఉచిత వైద్య సహాయము చేయుటకుగూడ మండలివారు ప్రయత్నించుచున్నారు. పై ప్రారంభోత్సవ కార్యక్రమములో పుర స్త్రీలు ఉత్సాహంతో పాల్గొని తమ ఆమోదమును వెల్లడించిరి. అంతమున బాలికల వినోద ప్రదర్శనములతో కార్యక్రమము ముగింపబడినది.

క.. వరలక్ష్మమ్మ
కార్యదర్శిని.

# ★ ఉగాది తలపులు ★

శ్రీ మధురాంతకం రాజారాం

మకుటంలేని— కోల్పోయిన రాజు :
శ్రీ ప్రకాశం

అతిశయించు చుండ ఆయురారోగ్యాలు
చిత్తమందు శాంతి చెదరకుండ
కుషను కుర్చి మీద కునుకు దీయును గాక!
టంగుటూరితాత బెంగవదలి.

ముఖ్యమంత్రి : శ్రీ గోపాలరెడ్డి

ఉత్తరాంధ్రుల కామోద మొదవ చేసి
రాళ్ళసీమ ప్రజాళికి కళ్ళు తుడిచి
రట్టులేకుండ, చెడకుండ రాచరికము
పాలనము చేయుగాక గోపాలరెడ్డి !

ఉపముఖ్యమంత్రి : శ్రీ సంజీవరెడ్డి

పండితుని మదికి నచ్చిన దండిమగడు
చేవగలిగిన జెట్టి సంజీవరెడ్డి
వీరువా రను భేదమ్ము విస్మరించి
తెలుగు తల్లికి తిలకమ్ము దిద్దుగాక !

రెవిన్యూమంత్రి : శ్రీ వెంకట్రావు

యుక్తియంచు గాని. శక్తియందును గాని
నీకు దీటువచ్చు నిపుణమతులు
లేరటంద్రు, నీదు లీలలీ రాష్ట్రింపు
ప్రగతి పథము లగుచు నెగడ వలయు !

ప్రతిపక్ష నాయకీ నాయకులు: శ్రీమతి కుసుమ
శ్రీ రాజు

విజయనగరరాజ్య విమల వంశము మీది
మంచివారు ఆలుమగలు మీరు,
పట్టుబట్టి గట్టి ప్రతిపక్షమును నిల్పి
ఆదుకొనుడు పూజ్యపాదులార !

అందం గోల్పోయిన శ్రీ సుందరయ్య

ఆశ లన్నీ నేడు అడియాస లయ్యె, మీ
కంచుకోట నేలగలసి పోయె,
ఐన నేమిగాని, అదరవు బెదరవు
చోద్యమాయె నయ్య సుందరయ్య !

వలను తెలియని శ్రీ వావిలాల

కాంగిరేసువారు కానివారైరి ఆ
మార్క్సిజమ్మె నీకు మంచి దయ్యె
వావిలాల ! ఎర్రనావను నట్టేట
నడపవయ్య యింక నడుము గట్టి

ఫలశ్రుతి

కుటిల కులతత్వ కూటముల్ కూలుగాక !
హీనప్రాంతీయ తత్వముల్ మానుగాక !
ఆంధ్రి లోకైక పూజ్య పురంధ్రి యగుచు
వెలయుగాపుత జానకీవిభుని కృపను ;

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# వ్యసనాలు :

# ధూమపానము

(శ్రీ లుయీ. మె. మిల్లరు శ్రీజేమ్సు మోనాహన్ వ్యాసముల ఆధారముగా)

ధూమపానము వ్యసనమా కాదా అన్నది కాదిప్పటి ప్రశ్న-ధూమపానమువల్ల ఎంతనష్టము? ప్రమాదకరమైన ఊపిరితిత్తుల కేన్సరుకు ఎంతవరకు తోడ్పడుతున్నది? ఇవి ఆలోచించవలసిన విషయాలు.

ధూమపానమువల్ల నష్టమన్నదీ, దానివల్ల ఊపిరితిత్తుల కేన్సరు పెరుగుచున్నదీ వివాదాస్పదమైన విషయములు కావు. ధూమపానమువల్ల నష్టములున్నట్లు, దానివల్ల ఊపిరితిత్తులకేన్సరు ఎక్కువగుచున్నట్లు వైద్యశాస్త్రవేత్త లొప్పుకొనుచున్న విషయమే. సుప్రసిద్ధ బ్రిటిష్ మెడికల్ జర్నల్ ప్రతి మాస సంచిక యందును ఈవిషయము చర్చింపబడుతూనే వున్నది. కాని దీనిలో ఒక చిన్న చిదంబర రహస్యమున్నది. ధూమపానము నష్టమే అని ఒప్పుకొన్నా దానిని ఏలనో ఈవైద్యకోవిదులు నిషేధించమని సలహా ఇవ్వుటలేదు. బహుశా వారందరూ కూడా ఈవ్యసనమునకు దాసులేమో!

ధూమపానమువల్ల కలుగు నష్టములను శాస్త్రోక్తముగా పరీక్షిస్తూ పరిశోధనలుజరిగినవి, జరుగుతున్నవి. 1953లో శాస్త్రవేత్తలు ఊపిరితిత్తుల కేన్సరువల్ల సంభవించిన మరణములకు ధూమపానమునకు చాల సంబంధ బాంధవ్యమున్నదని బయటపెట్టారు!

ఇటీవల ఊపిరితిత్తుల కేన్సరువ్యాధి ఎక్కువైనదట. ఆజబ్బుచే మరణించినవారి సంఖ్యయు చాల విపరీతముగా పెరిగినదట కారణమేమైయుండునని వైద్యులు పరిశోధనలు ఆరంభించారు. ఊపిరితిత్తులకేన్సరు ఏదో ఊపిరి పీల్చుకొను వస్తువులచే కలుగతుందిగనుక లోనికి పీల్చుకొనే సామాన్య వాయువువల్లనే కేన్సరు ఎక్కువగుచున్న దేమోనని మొట్టమొదట్లో ఆలోచించారు. గాలిలోని పొగ, దుమ్ము, పెట్రోలు, నూనెలు కాలిన వాసనలు గాలిని చాలావరకు అశుభ్రముచేసినా అవి కేన్సరుకు కారణభూతములు కావని తేలినది. పైగా ఆడవారిలో కన్న ఈజబ్బు మగవారిలో ఎనిమిదిరెట్లు (అమెరికాలో) ఎక్కువగావున్నదని తెలిసినది. కావున ఈజబ్బు ఏదో కేవలము మగవారి అలవాట్లకు చెందినదనే తెలియవచ్చినది. పైగా సిగరెట్లు అమ్మకము హెచ్చుచున్న కొద్ది కేన్సరునూ ఎక్కువగుచున్నదట. సిగరెట్లు అమ్మకము గ్రాఫు, క్యాన్సరు గ్రాఫు పోల్చుతూ పరీక్షిస్తే రెండూ దాదాపు సమానముగానే వున్నవట!

ఊపిరి తిత్తుల కేన్సరు సాధారణముగా నలుబదైదు ఏండ్ల పురుషులలో ఎక్కువగా కనబడుచున్నది. సాధారణముగా ఈవ్యాధి వ్యాపించుటకు ఇరువదేండ్లు వ్యవధికావలయునట. 1920–30 సంవత్సరములలో సిగరెట్లు ఎక్కువగా అమ్మకమైనవి. అందుచే 1940-50 లో కేన్సరు చావులు ఎక్కువైనవి. మరల 1940-50 లో సిగిరెట్లు అమ్మకము చాల ఎక్కువగానుండెను. కావున 1960–70 లో కేన్సరు మరణములు ఎక్కువగానుండ గలవని తలంచుచున్నారు.

ఇది కేవలము దైవికము అని అనేవారు లేకపోలేదు. అందుచే ఈ విషయమును తేల్చుటకు అమెరికాలో, ఇంగ్లాండులోకూడా అనేక పరిశోధనలు చేసిరి. 1950 లో 650 సిగరెట్లు త్రాగువారిని పరీక్ష చేసిరి. వారిలో నూటికి తొంబయిఐదు మందికి కేన్సరు ఉన్నట్లుగా తేలినది! పొగత్రాగని మగవారిలో ఊపిరితిత్తుల కేన్సరు చాలా అరుదుగా కనబడినదట. అయితే సిగిరెట్లు తాగిన వారందరికీ ఎందుకు రాదని కొందరు ప్రశ్నవేయకపోలేదు. ఎవరో నూటికి ఐదుగురు అదృష్టవంతు లుంటారు. ఆ వ్యాధిని తప్పించుకోగలవారు. అది వారి అదృష్టము!

పొగాకు పొగను ఎలుకలమేనుకు పూసినంతనే వాటికి కేన్సరు వచ్చినదట!

ధూమపానమువల్ల ఊపిరితిత్తులకేన్సరు సంభవిస్తుంది. తాత్కాలిక ఆనందమునకై ఇట్టి విపత్కరమైన జబ్బును తెచ్చిపెట్టుకొనదగునా? లేక ఆ జబ్బును తప్పించుకొనుటకు కష్టపడియైన ధూమపానము మానవలయునా?

అది ఎవరికి వారు సావధానముగా ఆలోచించి తేల్చుకొనవలసిన విషయము.

[ఈ వ్యాసము ముద్రణలో నుండగనే భారతదేశములో 1954 లో ధూమపానము చాలా పెరిగినట్లు పత్రికా వార్త వచ్చినది. 1953 లో కన్న 54 లో పొగాకు సిగరెట్ల వాడకము 127 కోట్లు పెరిగినదట. ఇశాస్త్రజ్ఞుల హెచ్చరికలు నిష్ప్రయోజనము కాజాలవని ఆశిస్తున్నాము. — సం.]



# సీత

శ్రీ పిళ్కా. సుబ్బారావుశాస్త్రి

సీత చాలా మంచి అమ్మాయి. గోపాలంగారి పెద్ద కూతురు. ఆమె యిన్నాళ్ళు మద్రాసు మహిళాసంఘంలో వుండి ఎన్నో పరీక్షలలో ఉత్తీర్ణురాలయి, ఎన్నోరకరకాల విద్యలు నేర్చుకొని తిరిగివస్తోంది.

"ఏమిటమ్మా, ఆ టెలిగ్రామ్?" అని ప్రశ్నించారు గోపాలంగారు, రెండో అమ్మాయి లక్ష్మిని.

"అక్కయ్య వస్తోంది నాన్నా..." అంది ఎగిరిగెంతేసి లక్ష్మి. అంతలో సంగీతం నేర్చుకొంటున్న సీత తల్లి "ఏమిటే...! అమ్మాయి వస్తోందాం?" అంటూవచ్చింది.

ఆమె సమాధానం వినకుండానే, ఆమెమీద వచ్చి పడ్డారు మిగతా పిల్లలు "అమ్మా...! పెద్దక్క వస్తోందా? అంటే "చెల్లాయి వస్తోందా..." అంటూ.

"అమ్మా! నేను యివ్వాళ పేకాట అపీ మానేసి చెల్లాయిని వెళ్ళి తీసుకువస్తానే...!" అన్నాడు పెద్దబ్బాయి రఘూ.

"అమ్మా! నేవెళ్తానే...!" అన్నాడు తల్లి పమిట చెంగులాగుతూ బాబు. "ఎవరూ ఒద్దే...! నేవెళ్తాను అంది లక్ష్మి. "ఉండవే...! నేవెళ్ళాలి. అక్కనడిగి ఫజిల్ పూర్తి చేయించుకుంటా...! ఈసారి ఫస్టుప్రైయిజు ఐనదే...!" అన్నాడు వేణూ.

"అబ్బ...బ్బ...! మీరెవ్వరూ వెళ్ళనక్ఖర్లేదు. నేను సంగీతం మాని వెళుతాను...!" అంది తల్లి.

"మీరంతాపొండి...! రఘూ! నీవు నీ పేకాటకిపో..." –బాబూ! నీబొమ్మలో ఏవో నువ్వు చూసుకో...! లక్ష్మి! నీ స్నేహితురాళ్ల యిళ్ళకిపో...!– ఒరేయ్, వేణూ! నీ ఫజిల్స్ పోయి చూసుకో...! గోలచేయకండి!" అన్నారు గోపాలంగారు చెవులుమూసుకొని.

"అమ్మాయ్–! నీ 'నవల్స్' నువ్వు చదువుకో...!" అంది పెద్దకోడలు కమలతో, గోపాలంగారి భార్యపార్వతి.

సాయంత్రం పార్వతి కారుమీద బయలుదేరింది, స్టేషన్‌కి.

రైలు దిగి ఒక్కసారి కౌగలించుకుంది సీత తల్లిని.

"ఎన్నాళ్ళయ్యిందమ్మా, నిన్ను చూసి!" అంది పార్వతి సీతని నిమురుతూ.

"అమ్మాయ్! ఏమిటా బొట్టూ...? అసహ్యంగా...!" అంది పార్వతి.

"ఏమమ్మా! కుంకుం బొట్టు...!"

"చదువుకున్నావ్...! ఎందుకూ ఆ బొట్టు...?" అంది పార్వతి.

సీత తల్లిముఖం కేసిచూసింది. ముఖానబొట్టులేదు! సరికదా, ఆమె జడకూడా వేసుకోలేదు!

"ఏం!– ఇన్ని పుస్తకాలు చదివేనుకదా! ఒక్క పుస్తకంలోకూడా 'స్త్రీలు చదువుకుంటే బొట్టు పెట్టుకోకూడదు' అని రాసిలేదే...!" అంది సీత.

"అదేమో...! మరి, మొన్న ప్లీడర్ గారింటికి వెళ్ళాను. వాళ్ళమ్మాయి బి.ఏ. ప్యాసయిందటకదా! ఆమె చెప్పింది. బొట్టు పెట్టుకుంటే నవ్వుతారూ! కొప్పుముడుచుకుంటే నవ్వుతారు, అని. ఆవిడకూడా జుత్తుకత్తిరించేసుకుంది...!" అన్నాది పార్వతి.

"సరే! పద యింటికిపోదాం! ఎవరు యేది చెపితే అది చెయ్యడమే...!"

"సీతా! నాకేం తెలుసమ్మా...!–రేపట్నుంచీ బొట్టు పెట్టుకుంటానుగా!" అంది పార్వతి.

తర్వాత యిద్దరూ, యిల్లు చేరుకున్నారు. గుమ్మంలో అడుగు పెడుతూండగానే "సలాం, అమ్మా..." అన్నాడు సాయబు.

"ఎవరమ్మా... అ సాయబూ...?" అంది సీత.
"సంగీతం మాష్టారులే...!" అంది పార్వతి.

"లక్ష్మికా...?"

"హుఁ...! అది నేర్చుకుంటే, యింకేం మహారాజులా వుండేది...! నాకే...!" అంది పార్వతి నిట్టూర్పువిడిచి.

"నీకా...!? - సరే, లే...!" అంది సీత.

"గుడ్ నైట్...సిస్టర్...!" అన్నాడు రఘూవీధిలోకి వెళ్తూ.

"ఏమిట్రా! అది...? బరంపురం వెళ్ళి తెలుగు మరిచి పోయినట్లు...!- ఇంతకీ యింత రాత్రప్పుడు ఎక్కడికి?" అంది సీత రఘూవైపుచూసి.

"అది, మామూలే అక్కయ్యా...!- పేకాటకి వెళ్తాడు రోజూ...!" అన్నాడు బాబు.

"పేకాటా...?" అని ఆశ్చర్యపోయింది సీత. "సరే! మరి, లక్ష్మి ఏదీ...?" అంది సీత తమ్ముణ్ని చూస్తూ.

బాబు గడియారం చూసి "అబ్బో...! ఇప్పుడే రాదక్కయ్యా...! ఇంకా పదయింది! పన్నెండూ, ఒంటి గంటకి...!" అన్నాడు.

"అంతవరకూ ఎక్కడుంటుందీ...!?" సీతకి అంతా, ఆ సంసారం అయోమయంగావుంది.

"ఓహ్! నాటకాలు, సినీమాలు అన్నీ...చూసి, వస్తుంది...! అందులో వేషాలు వేస్తుందీ...!"

"వేషాలా...? సరే! నువ్వు పోయిపడుకో...!" అంది సీత బాబుని చూసి.

"అమ్మా! వేణుయేడే...?" అంది తల్లిదగ్గరకి వెళ్ళి.

"వాడా...! వాడికంతా, ఫజిల్స్, బ్రాకెట్ అవే, అర్థరాత్రియెప్పుడో యేదో నెంబరోస్తుందిట...! అది చూసుకువస్తాడు...!" అంది పార్వతి.

"అఁ...! ఫజిల్సా...?" సీత తల గిర్రున తిరిగింది. ఏమిటి, కుటుంబంలో అంతా యిలా మారేరు అని.

"అమ్మగారూ! మీ రేం తింటారూ..." అంటూ వచ్చేడు వంటవాడు సీత దగ్గరకి.

"ఏమిటి, తింటాను...! అన్నంతింటాను...!" అంది చిరాకుగా సీత.

"అదేనమ్మా...! మీకు వంకాయకూరా? బంగాళా దుంపలకూరా?-ఉహుఁ...అరిటకాయ, సొరకాయా..."

"అబ్బబ్బ...! నీముఖం...! అందరికీ వండేదేవండు...!" అంది సీత.

"అఁ...! మీరు అన్ని కూరలూ తింటారా...!?" అన్నాడు వంటవాడు.

"అదేమిట్రా...?" అంది సీత అర్థంగాక.

"ఎబ్బే...! మీకసలు బుర్రలో తల కాయలేదమ్మా! ఈయింట్లో అయ్యాగారికి ఒకరకం భోజనంకూరా! లక్ష్మి గారికి ఒక కూరా, అందరికీ ఒకొక్కరకం...!" అన్నాడు వంటబ్రాహ్మడు.

"సరే! ఇవాల్టికి నీయిష్టంవచ్చింది చేసేసెయ్! రేపు మాత్రం అందరికీ ఒకటేరకం భోజనం తయారుచెయ్యి...!" అంది సీత.

అక్కణ్నుంచి గదులోకివెళ్ళింది. అక్కడ కమల ఏదో చదువుతోంది.

"ఏమిటి, వదినా! చదువుతున్నావ్...?" అని పుస్తకంతీసి చూసింది.

సీతకి వెర్రెత్తిపోయింది— కమల ఒక సినిమా పత్రిక చదువుతోంది. అందులో అసహ్యకరమైన చిత్రాలు, వ్యాసాలు వున్నాయి- ఒక్కసారి అటు తిరిగేసరికి ఆమె మతిపోయింది.

ఒకమూల ఎవ్వరూ చదవకూడని పత్రికలు, సినిమా పత్రికలు వున్నాయి.

"వదినా! నేను నీకోసంగతి చెప్తాను...! చేస్తావా?" అని అడిగింది సీత కమలని.

"తప్పకుండా! చెప్పు అమ్మలూ...!" అంది కమల— నిజంగా ఆయింట్లో సీతమాట ఎవ్వరూ కాదనరు.

"అయితే, విను! రేపు కాగితాలు కొనేవాణ్ణి పిలచి, యివ్వన్నీ అమ్మేసెయ్...!" అంది. సరేనన్నట్లుగా తల వూపింది కమల.

తెల్లవారింది. లక్ష్మి ఎక్కడకో బయలుదేరింది. "లక్ష్మి! ఎక్కడికీ...?" అంది సీత.

లక్ష్మి టక్కున ఆగిపోయింది. నీ నడత యేమీబావు లేదు! నే చెప్పినట్లు, చేస్తానంటే నీతో మాటాడుతాను. లేదా, ఇవ్వాళనుంచీ నువ్వు నన్ను అక్కా అని పిలవకు" అంది సీత.

"క్షమించు అక్కా! నువ్వేది చెపితే అదే చేస్తాను...!" అంది లక్ష్మి.

"చూడూ...! అంత పల్చటి బట్టలు ఎవరన్నా తొడుక్కుంటారా?— మన హైందవ స్త్రీలు, అలా నడుంపైకి జాకెట్ వేసుకుంటారా? బొట్టు పెట్టుకోకుండా వుంటారా?- ఇవ్వన్నీ చదువుకున్నవాళ్ల లక్షణాలా?"

"అక్కయ్యా...!" అంటూ వచ్చి సీత వళ్ళో ఏడుస్తూ వాలిపోయింది లక్ష్మి.

"వదినా! పేపర్లు అమ్మేశావా?" అంది సీత. "అమ్మేశాను, సీతా! ఇదో, పన్నెండు రూపాయలు వచ్చాయి!" అంది కమల.

"ఆ డబ్బు యిలా యివ్వు!— ఆడవాళ్ళు చదివే పత్రికలు యివా! ఆంధ్ర మహిళ, గృహలక్ష్మి ఇవి రెండూ చదువుకో! రేపు వాటికి చందా కట్టిస్తాను!" అంది రెండు పుస్తకాలు కమలకి యిచ్చి సీత.

"వదినా! నీకు వంటవచ్చా?" అంది సీత.

"రాదమ్మా! అన్నీ మర్చిపోయాను!" అంది కమల తలవంచుకొని.

"సరే! నాతోరా! అమ్మకి ఒక విషయం చెబుదాం!" అంది సీత.

"అమ్మా! ఇవ్వాళనుంచీ ఉదయం వంట వదినెది. రాత్రి వంట లక్ష్మిది!- వంటవాణ్ణి మాన్పిస్తున్నాను! అంది సీత తల్లితో.

"సరే!" అంది తల్లి. వదినె, లక్ష్మి సీతతో వంటింట్లోకి వెళ్ళారు.

సీత లక్ష్మికి, కమలకి వంటలన్నీ చూపెట్టింది.

"అక్కా! చదువుకుందికి వెళ్లావుకదా! ఇవన్నీ ఎలా నేర్చుకున్నావు?" అంది లక్ష్మి.

"పిచ్చి పిల్లా! చదువంటే వేరేవుందా? ఇదే చదువు!" అంది సీత.

"వదినా! నేను యిచ్చానుచూడు పుస్తకాలు! అందులో కొన్ని వంట విషయాలు వుంటాయి! చదవండి!" అంది సీత.

తర్వాత సీత కుర్చీలో కూర్చొని యేదో పుస్తకం చదువుతోంది. రఘూ వచ్చాడు. గోడ గడియారం పన్నెండూ కొట్టింది. రఘూ బట్టలు చినిగిపోయాయి. అక్కడక్కడ గాయాలూ అవీను.

సీత రఘూని చూచి "అన్నయ్యా! ఏమిటిదంతా?" అని అడిగింది. అసలు సీతకి అదేమిటో తెల్సు. అన్నని మంచి దార్లోకి తేవాలని యిలా చేసింది.

"చెల్లాయ్! పేకాటలో ఓడిపోయాను! అంతా నన్ను కొట్టేరు...! డబ్బంతా లాక్కున్నారు!" అంటూ సీత ఒళ్లో తలపెట్టుకొని కన్నీళ్ళు కార్చేడు— చిన్నవాడు కాదు. పాతికేళ్ళుపైనే వున్నాయి.

"పోనీలే! వెధవ డబ్బు! రేపట్నుంచీ అక్కడికి వెళ్లకు! నేను నీకు 'టైపు' నేర్పుతాను! గవర్నమెంటు పరీక్షకట్టి ప్యాసవుదువుగాని!" అంది సీత.

"చెల్లాయీ! టైపు కొట్టడం నీకొచ్చా?" అన్నాడు రఘూ.

"వచ్చు! మహిళా సంఘంలో నేర్చుకున్నాను!" అందిసీత.

మర్నాడు ప్రొద్దుటే రఘూ లేచి, స్నానం చేసి. సీతదగ్గర కొచ్చాడు. సీత తన టైపు మెషిన్ తెచ్చింది, "అన్నయ్యా! ఇది యెవరు కనిపెట్టారో తెలుసా?— 1868 లో అమెరికా వాళ్ళు కనిపెట్టారు!" అని సీత అన్నయ్యకి టైపు కొట్టడం నేర్పింది.

సీత బజారు వెళ్ళి కుట్టుపని మెషీను కొని పట్టుకొస్తోంది— అదే దోవంట వేణూని పోలీసులు పట్టుకొని కొడ్తూ తీసుకువెళ్తున్నారు.

గబగబా సీత వెళ్ళి, వాళ్లిని ఆపి, పోలీసులికి డబ్బు యిచ్చి విడిపించింది.

అక్కా! ఎవరో మా రంగాగాడిని చంపితే, నేను చంపేను అని తీసుకుపోతున్నారు! నువ్వు రాకపోతే నన్ను ఉరితీసేవారు!" అని గోల పెట్టాడు వేణూ.

అది "సీత" ఆడుతున్న నాటకం అని ఎవరికి తెలుసూ? ఎవరూ ఎవర్నీ చంపలేదు. సీత యీపన్నాగం పన్నింది.

"సరే! మరి, నీకు చదువు చెబుతాను! రేపు S.S.L.C అక్టోబరు పరీక్షకి కూర్చో!" అని చెప్పింది.

ప్రతిరోజూ సీత వేణూకి ఇంగ్లీషు, లెక్కలు అవీ చెబుతూవుండేది.

ఒకరోజు లక్ష్మిని పిల్చింది.

"లక్ష్మీ! మిత్రులూ, అని అంతడబ్బు ఖర్చు పెడతావు కదా! ఏదీ మీ స్నేహితురాండ్రని అడిగి ఒక వంద రూపాయిలు తీసుకురా!" అంది.

"తెస్తాను! వందకాదు! వెయ్యి రూపాయిలు!" అంది లక్ష్మి.

లక్ష్మి తన స్నేహితురాండ్ర నందర్నీ అడిగింది. అందరూ ఒకొక్క సమాధానం యిచ్చారు.

లక్ష్మికి రాణి 500 రూపాయలు ఇవ్వాలి. ఆరాణీ "నాదగ్గర 100 రూపాయలు కాదు! వంద దమ్మిడీలు కూడా లేవు!" అని విసుక్కుంది. అంతా యిలానే విసుక్కున్నారు. లక్ష్మి వాళ్లిందరికీ ఎంతో డబ్బు ఖర్చు జేసింది.

లక్ష్మి సిగ్గుతో యిల్లు చేరుకుంది. —సీత లక్ష్మిని ఓదార్చి "వీళ్ళు తినటానికే, అని తెలిసిందికదా! రేపట్నుంచీ వాళ్ల దగ్గరికి వెళ్లకు! నేను నీకు కుట్టుపని నేర్పుతాను! నేర్చుకో! ఇక ముందు మాబట్టలన్నీ నువ్వే కుట్టాలి తెలుసా?" అంది.

"చెల్లీ! రాత్రీ పగలూకూడా, ఆ సాయిబూ, అమ్మా కూడా మమ్మల్ని చంపుతున్నారు! చూడూ, మా అందరి చేత అన్నీ మాన్పించావుకాని, అమ్మచేత ఆ సంగీతం మాన్పిద్దూ...!" అన్నాడు పైపు కొడుతూ రఘూ.

"తప్పకుండా...!" అంటూ మేడమీదికి వెళ్ళిందిసీత.

సాయిబు ఊరికే గాడిదలా అరుస్తున్నాడు. —పోనీ అమ్మది మంచి గొంతుక అంటే, దేవుడు కమ్మని కంఠం యివ్వలేదు.

నిజంగా ఆసాయిబుకి ఏమీరాదు! వాడికి నెలకి నూటయాభై రూపాయలు జీతం, తిండీ బట్టాను...!— ప్రతి శుక్రవారం "ఫలావ్"కి డబ్బులు!

సాయిబుకి ఒకపాట పాడి చూపించింది సీత— దాంతో వాడు బెంబేలెత్తేడు— సంగీతం వచ్చినవాళ్ల దగ్గర, తన ఆటలు సాగవని రాజీనామా యిచ్చాడు ఉద్యోగానికి.

"పోనీలే, అమ్మా! నేను వాడికంటే బాగా నేర్పుతాను...!—చూడూ...! నువ్వు పాటపాడేకంటే, వీణమీద వాయించడం నేర్చుకోడం మంచిది" అంది సీత.

మర్నాడు వీణ ఒకటి తెచ్చి తల్లికి వీణ వాయించటం నేర్పింది. తల్లికూడా దీనిలో బాగా తర్ఫీదు పొంద సాగింది.

ఒకనాడు తల్లి బాబుగాడిని స్కూల్‌కి వెళ్ళమని కొడుతోవుంటే, సీత వెళ్ళి అడ్డుకొని, "అమ్మా! పిల్లల్ని కొట్టిచెప్పిన దానికంటే, బుజ్జగించి, వాళ్ళనిపొగిడితే వాళ్ళు ఉబ్బిపోయి మనం చెప్పినట్టూ నడుస్తారు" అని చెప్పి బాబుని తన గదులోకి తీసుకుపోయింది.

బాబుకి మిఠాయిపెట్టి, వాడి పుస్తకాలు తీసి చూసింది. అందులో, ప్రతీ పుస్తకంలో గాంధీజీ, సినిమాతారలు చిత్రాలు వంకరటింకరగా వేసివున్నాయి.

"బాబూ! నీకు చదువుకోవాల్ననివుందా?— బొమ్మలు వెయ్యాల్ననివుందా?" అని అడిగింది సీత బాబుని ఒళ్ళో కూర్చోపెట్టుకుని.

బాబు స్పష్టంగా చెప్పకపోయినా, చాలామటుక్కు బొమ్మలమీదే శ్రద్ధవున్నట్లుగాకనిపించింది.

# సీత

"బాబూ! ఇవ్వాళనుంచి బడికివెళ్ళకు. రోజూ ప్రొద్దుటేలేచి, ముఖం కడుక్కొని, స్నానంచేసి ఫలహారం కాగానే నాదగ్గరకిరా...!_ ఒక గంటసేపు చదువుకో...! తర్వాత నేను మంచి మంచి ఇంగ్లీషు బొమ్మల పుస్తకాలు తెచ్చిపెడతాను. బొమ్మలుకూడా నేర్పుతాను" అంది సీత.

సాయంకాలంపోయి మంచి మంచి ఇంగ్లీషు బొమ్మల పుస్తకాలు తెచ్చింది_ బాబు ఒకరోజు పెద్ద బొమ్మ వేస్తూవుంటే సీత యిలా చెప్పింది.

"బాబూ! మెదట పెద్ద బొమ్మలు వెయ్యకూడదు. చిన్న చిన్నవి వెయ్యాలి!_ ఎందుకంటావా? నీకో బుల్లి కథ చెప్తాను_ ఒక రాజ్యాన్ని ఒక రాజు పరిపాలిస్తూ వుండేవాడు. ఆరాజు నీకిమల్లేనే పెద్ద రాజ్యం జయించటానికి వెళ్ళి, ఓడిపోయి పారిపోయాట్ట!

ఒక రోజు, రాజు ఒక అవ్వ దగ్గరకి వెళ్ళేడుట. అవ్వకి రాజు అని ఏం తెలుసూ! ఎవరో బాటసారి అనుకుందిట! రాజు ఆకలిగావున్నాదంటే, మంచి అవ్వ అవడంవల్ల ఒక రొట్టెచేసి పెట్టిందిట.

రాజు గభాలున, రొట్టెని మధ్యనుంచి విరిచి తినబోయాట్ట...! అలా మధ్య చెయ్యిబెడితే, చెయ్యికాలిందిట! అప్పుడు ఆ అవ్వ నవ్వి "పిచ్చివాడా! మా రాజుకూడా నీలాగే, పెద్ద రాజ్యంమీద వెళ్ళిపడి, ఓడిపోయాడు. మొదట, చివరలంట తింటే మిగతాది చల్లారుతుంది! చుట్టుప్రక్కల పల్లెల్ని ఆక్రమించుకొని, తర్వాత పెద్ద రాజ్యంమీదకి వెళ్ళాలి అని అన్నాదిట...! ఆలాగ్గ ముందు చిన్న బొమ్మలు వెయ్యాలి. తర్వాత పెద్దవి వాటంతటవే వస్తాయి.__నిజంగా సీత బాబుకి అటు చదువు, ఇటు చిత్రకళా నేర్పింది.

గోపాలంగారికి దగ్గూ, జలుబూ అవీను. ఆయన కదలలేకుండా ఊరిపోయారు_ సీతకి ఏమీ పాలుపోలేదు.

ఒక రోజు డాక్టర్‌ని పిల్చింది. "ఎందుకమ్మా డాక్టరూ?" అన్నారు గోపాలంగారు_ డాక్టరు పరీక్షచేసి సీతకేదో చెప్పి వెళ్ళిపోయారు.

సీత ఎవరూ వినకుండా "నాన్నా! మీరు ఎన్నాళ్ళో బ్రతకరట...!" అని చెప్పింది.

గోపాలంగారు ఎవరితో చెప్పలేదుకాని ఆయన బెంగపెట్టుకున్నారు_ రెండువారాల్లో గోపాలంగారు పూర్తిగా చిక్కిపోయారు.

ఒకరోజు "నాన్నా! మీకింకేం భయంలేదు. రోజూ సాయంత్రంపూట నాతో షికారుకి రండి...! మీశరీరం తగ్గాలనే, నేను మీతో అలా చెప్పాను. డాక్టరు ఏవో మందులు చెప్పారు. అవి మీరు వాడండి!" అంది.

గోపాలంగారు ఒక్కసారి సీతని దగ్గరకి తీసుకున్నారు._ "అమ్మా! నిజంగా నువ్వు యింత దానవవుతావనుకోలేదు...!" అన్నారు.

అంతలోనే రఘూ వచ్చి "నాన్నా! నాకు వంద రూపాయలమీద టైపిస్టు ఉద్యోగం దొరికింది!" అన్నాడు ఆనందంగా.

"నిజంగా...?" అన్నాడు తండ్రి.

"నిజంగా...!_ ఇంతకీ సీతని మెచ్చుకోవాలి...! సీతే నాకు వెలుగుబాట చూపించింది!_ సీతా! నన్ను, నా మనసు మార్చడంకోసం, రౌడీలచేత నువ్వే కొట్టించావని వాళ్ళు చెప్పారు...! నా మొదటి జీతం సీతకేసుమీ!" అన్నాడు రఘూ.

"అక్కయ్యా! నేను ప్యాసయ్యాను...! కాలేజీలో కూడా చదివి, ఇంజీనీరు కోర్సు చదువుతాను...!" అన్నాడు వేణూ.

"అక్కయ్యా! ఇవాళకదూ నాప్రయాణం...!" అంది, లక్ష్మి. లక్ష్మిని చూస్తే అసలు పోల్చుకోలేం. వాలుజడా తిలకం బొట్టు రెండుచేతులకీ గాజులూ, హైందవ స్త్రీ లక్షణాలతో కలకలలాడుతోంది.

"ఎక్కడికీ...?" అన్నారు గోపాలంగారు. "మదరాసుకి నాన్నా! అక్కడ నర్సింగ్ శిక్షణ పొంది, మాతా శిశువులకి సేవచేస్తుందిట!" అంది సీత.

పార్వతి, గోపాలంగార్ల సంతోషానికి మేరలేకపోయింది.

"నీవల్లనేనమ్మా...! యిదంతా జరిగి, ఎందుకూ పనికిరాకుండాపోతుందన్న సంసారం యిలా మారింది!" సీత తల నిమురుతూ అంది పార్వతి.

"నాలో యేముందమ్మా! అంతా భగవంతుడిదయ. మన భారతదేశంలో నన్నుమించినవాళ్ళు యెంతమందో వున్నారు...! మీరు సేవ కోరగానే, మహిళా సంఘంకి సంపేరు. అటువంటి మహిళా సంఘాలు, నెహ్రూ వంటి నాయకులూ వుండగా మనకేమీ లోపం లేదమ్మా...!" అంది సగర్వంగా సీత.

"అత్తయ్యా! మా తమ్ముడి మాటేమిటో చెప్పారు కాదు...!" అంది కోడలు కమల.

"కమలా! మీ తమ్ముడు నిజంగా అదృష్టవంతుడే!" అంది పార్వతి.

"అక్కయ్యా పెళ్ళినాటికమ్మా సిగ్గు" అంది లక్ష్మి!... నవ్వుతూ. సీత నవ్వుసుంటూ "పోవే...!" అని గదిలోకి వెళ్ళిపోయింది.

"అక్కా! పరీక్ష ప్యాసయ్యాను. మొన్న వేసిన ఝాన్సీరాణి చిత్రానికి బహుమతి వచ్చింది. ఇదో కప్పు!" అంటూ పరిగెత్తుకు వచ్చాడు బాబు.

సీత బాబుని దగ్గరకి తీసుకొని ముద్దాడింది.

"లక్ష్మీ...! పద, బజారువెళ్ళి నీకు కావలసినవి కొనాలి. మరివెళ్ళేది మద్రాసుకదా!" అంది సీత.

"నీదే ఆలస్యం...! నేను రెడీ—!" అంది లక్ష్మి. గోపాలం, పార్వతీ అలా చూస్తూ ఆనందంలో మునిగి పోయారు.





# ఏకాంత సేవ

"రోహిణి"

తులసీ దళాలలో తొలకరించినది నీ
కలికి కన్నులలోని మొలక నవ్వు,
నెమలిపింఛములోన నృత్యమాడినది నీ
వల్లవీ భామినీ ప్రణయ వీచి,
మకరకుండలములన్ మణులు తాపినది నీ
నీలంపుజునపాల నిండుసొబగు,
కస్తూరి తిలకాన కళలు గ్రుమ్మినది నీ
పూర్ణిమాశశిబోలు ముద్దు మోము

గడుసుదనమున్న పద్మాక్షికాన రాధ
పయ్యెదన్ గట్టుకొని జోలపాట పాడె,
మురిసి, ముచ్చటపడి నేన మోసపోతి ;
ఇంత యందము చూపితి వేల కృష్ణ !

ఆమని కోయిలల్, విరిఒయారపుచూపులు, గండుతుమ్మెదల్,
కాముని చైత్రయాత్రలు, చోకాటపు జాబిలినవ్వు తీవియల్
నీ మృదుముగ్ధ హాసమున నిండువసంతము లెన్నిచూపు నో
నా మనసే పురానుభవ నాట్యము సల్పెడి- విశ్వమోహనా !

## ఆంధ్ర రాష్ట్రములోని స్వచ్ఛంద సేవాసంస్థలకు 1955 ఫిబ్రవరి వరకు కేంద్ర సంక్షేమ సంస్థ మంజూరు చేసిన విరాళములు

| కార్యక్రమ వివరణ | గ్రాంటులను పొందిన సంస్థల సంఖ్య | గ్రాంటుల మొత్తం రు. | (భారతదేశం మొత్తంమీద) సంస్థల సంఖ్య | గ్రాంటు మొత్తం రు. |
|---|---|---|---|---|
| శిశు సంక్షేమం | 24 | 79,000 | 419 | 13,11,362 |
| స్త్రీజనాభ్యుదయం | 51 | 2,20,300 | 505 | 16,94,303 |
| ఇతర సంక్షేమ కార్యక్రమం | 47 | 1,49,125 | 773 | 24,63,920 |
| | 122 | 4,48,425 | 1,697 | 54,69,585 |

# సంక్షేమ విస్తరణ కార్యక్రమం

దేశం అంతటా వల అల్లినట్లు సంక్షేమ సేవా సమాజాలు విస్తరించుటకూ, ఇంతవరకూ లేని చోట్ల సేవాసంస్థలను నెలకొల్పుటకూ సంక్షేమ విస్తరణ కార్యక్రమం ప్రారంభించబడ్డది.

ఈ ప్రణాళిక కొన్ని అభివృద్ధి సంక్షేమ సంస్థలకూ, జాతీయ విస్తరణ సేవా సంస్థలకూ, అనధికార సంస్థలచే నిర్వహించబడే స్వచ్ఛంద సేవా సంస్థలకు దోహదం ఇస్తుంది.

ఈ ప్రణాళిక 1954 సం॥రం ఆగస్టు 15 వ తేదీని ప్రారంభించబడ్డది. దీని వల్ల ప్రథమ పంచవర్ష ప్రణాళికలోని 352 వివిధ సంక్షేమ కార్యక్రమాలకు సహాయం చేకూరుతూంది. దేశం మొత్తంమీద 320 జిల్లాలకు సహాయం లభిస్తూ ఉంది.

ఈ కార్యక్రమాలు ముఖ్యంగా గ్రామాభివృద్ధికే ఉద్దేశింప బడ్డవి. దేశానికి వెన్నెముక అయిన గ్రామముల అభ్యుదయానికి ఈ సంఘము వేసిన మొదటి మెట్టు అని ఈ పథకాలు రుజువుచేస్తున్నాయి.

ఆరు మాసముల స్వల్ప వ్యవధిలోనే 18 జిల్లాలలో 18 సంస్థలు నెలకొల్ప బడినవి. 811 కేంద్రములలో 3445 గ్రామాలూ అందులోని 35 లక్షల ప్రజలూ సహాయాన్ని పొందుట మిక్కిలి ప్రశంసనీయము.

ఈ కార్యక్రమాలు దేశం నలుమూలలా విస్తరించి రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా సంఘాలు సాధించిన అసాధారణ విజయాన్ని స్పష్టపరచుచున్నవి. ఇటువంటి కార్యక్రమాలు ప్రారంభించుట తేలిక అయిన కార్యంకాదు. కేంద్ర సంఘంయొక్క అనుమతికోసం విజ్ఞప్తి చేయడానికి ముందు కార్యక్రమ నిర్వహణ సంఘం ఒక దానిని నెలకొల్పవలెను. ఏ ప్రదేశంలో ఈ కార్యక్రమం నిర్వహించాలనుకుంటున్నారో ఆ ప్రదేశాన్ని పూర్తిగా పరిశీలించవలెను. గ్రామీణ ప్రజల అవసరాలూ పరిమితులూ తెలుసుకుని ఆ ప్రదేశానికి ఉచితమైన కార్యం నిర్ణయించుకోవాలి. ఈ కార్యాలన్నీ విజయవంతంగా ఆయా కేంద్రాలలోని కార్యకర్తలు నిర్వహించడం ఎన్నదగిన విషయం.

# చేనేత పరిశ్రమలో స్త్రీలు.



పద్మినీసేన్ గుప్త

## మన దేశపు పల్లె సీమలలో సామా న్యంగా కనపడే మనోహర దృశ్యాలు

మనదేశంలో పలురకాల వస్త్రాలు సుప్రసిద్ధమైన రీతులలో అతి ప్రాచీనకాలం నుంచీ తయారవుతూ ఉన్నాయి. ప్రశాంతమైన తమ కుటీరాలలో మగ్గాలపైన ఆకర్షణీయమైన వివిధవర్ణాలతో పడుగూ, పేకా వేసి నేసిన వస్త్రాలే మన జీవితావసరాలకీ, గృహాలంకరణలకీ ఉపకరిస్తున్నాయి. ఇట్టి మహత్తరమైన చేనేతపరిశ్రమ యుగయుగాలుగా సజీవపరిశ్రమగా వర్థిలుతూఉంది.

కొన్నివందల సంవత్సరాలకి పూర్వం ఒక మహారాజు ఆస్థానంలో మహాముని యాజ్ఞవల్క్యుణ్ణి సుప్రసిద్ధ భారత మహిళామణీ, వేదాంతీ, అయిన 'గార్గి' ఒక ప్రశ్న వేసింది. "మహాపర్వతాలూ, అరణ్యాలూ, పడుగూ పేకగా నేయబడిన ఈ ప్రపంచం నీటిని ఆధారంగా చేసు కొని పరిభ్రమిస్తూందికద, మరి ఆ నీటికి ఆధారమేమిటి?" అని ప్రశ్నించింది.

"గాలి" అని సమాధానం చెప్పేడు యాజ్ఞ వల్క్యుడు.

అంతటితో వూరుకొనక గార్గి "గాలితో సహా ఈ పంచభూతాలూ, వివిధగ్రహాలూ, లోకపాలకులూ వీరంతా ఎవరిపైన ఆధారపడి వున్నారు?" అని ప్రశ్నించింది.

"వీరంతా బ్రహ్మలోకంపైన ఆధారపడి వున్నారు" అన్నాడు యాజ్ఞ వల్క్యుడు.

"అలా ఐతే బ్రహ్మలోకం ఏయే పదార్థాలతో సృష్టింపబడింది?" అని ప్రశ్నించింది గార్గి.

"గార్గీ! ఇక ప్రశ్నించకు; నీవు ఏ పరబ్రహ్మాన్ని శంకించకూడదో ఆ మహాశక్తినే ప్రశ్నిస్తున్నావు— అది నీప్రాణానికే హాని కాగలదు— ఇక ప్రశ్నించకు!" అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

అంతటితో ఆమె మౌనం వహించింది.

దేవతలుకూడా అడుగుపెట్టడానికి శంకించే ప్రదేశా లలో ప్రవేశించడం మానవ ప్రకృతి! ప్రకృతిలో మహా ప్రజ్ఞావంతులైనవారికి కూడా చొరరాని రహస్యాలెన్నో వున్నాయి! ఈ రహస్యాలలోనికి మహాఋషి యాజ్ఞ వల్క్యుడు, మహావేదాంతి గార్గి కూడా వెళ్ళడానికి వెరచారు!

బృహదారణ్యకోపనిషత్తులోని పై సంఘటనవల్ల విశదమయ్యే విషయాలేమిటంటే: మహావిద్వాంసులూ, ఋషులూ, జరిపే వేదాంతగోష్ఠులలో స్త్రీలు కూడా పాల్గొనేవారు— వాస్తవంగా జనకమహారాజు ఆస్థానంలో జరిగినదే, ప్రపంచంలో మొదటి గోష్ఠి అని చెప్పవచ్చు. ఈ సమావేశాలలోనే మహావిద్వాంసులతో వాదించిన స్త్రీలు గార్గి, మైత్రేయి. ఇది మహత్తరమైన విషయం. రెండవది- ఈ చర్చలలోనే గార్గి చేనేత వస్త్రాలు 'పడుగుపేక' సిద్ధాంతంమీద ఏవిధంగా నేయబడు తున్నాయో, అలాగే ఈ ప్రపంచ నిర్మాణంకూడా జరిగిం దనే మహత్తర సత్యాన్ని నిరూపించింది! ఈనాడు భారత దేశంలో మారుమూలల తమ కుటీరాలలో వస్త్రాలు నేసే యువతులుకూడా ప్రపంచ సృష్టికీ, తమ మగ్గాల పైన సృష్టింపబడే రంగురంగుల వస్త్రాలకీ ఎంత దగ్గర సంబంధం వుందో చూస్తూ మురిసిపోతారుకదూ!

### "పల్లె ప్రాంతాల జాగృతి"

ఆసేతుహిమాచల పర్యంతం మారుమూలల గ్రామా లతోసహా ప్రతిచోటా స్త్రీలు నూలు వడికి బట్టలునేస్తారు. ఇక్కడే భారతజాతి సమైక్యత ద్యోతకమవుతుంది.

# చేనేత పరిశ్రమలో స్త్రీలు

ఈమహత్తర సత్యాన్నే మహాత్మాగాంధీ మొట్టమొదటగా గమనించి– సమైక్యత గురించి నొక్కి వక్కాణించారు. విదేశాలనుంచి దిగుమతి అయిన బట్టలు మన చేనేత పరిశ్రమని దెబ్బకొట్టడానికి ప్రయత్నించినపుడు ఈ పరిశ్రమ ప్రాధాన్యతని గురించి, ఆర్థికంగా దానిపై ఎంత మంది ఆధారపడివున్నారో మహాత్మా ప్రజలకి తెలియ జేశారు. ఈనాడు స్వాతంత్ర్యం వచ్చిన ఎనిమిది సంవ త్సరాల తరువాతకూడా ఈ చేనేత పరిశ్రమ ఎంతో ప్రాముఖ్యత వహించింది. స్త్రీలు ఈ పరిశ్రమలో నడుం కట్టి ముందుకు వచ్చారు— భారతదేశ సంస్కృతీ చిహ్నంగా, మనోహరమైన వస్త్రాల ఉత్పత్తిద్వారా స్త్రీలు పురాణకాల స్త్రీలవలెనే తమ ఆధిక్యాన్ని నిరూ పించుకున్నారు. గ్రామ జీవనానికి ఇది చిహ్నమైనది.

గడచిన కొద్దిసంవత్సరాలనుంచీ కలకత్తాలో పదిహేను మైళ్ళలో W. C. A. వారిచే స్థాపింపబడిన గ్రామీణ కేంద్రంతో నాకు పరిచయం వుంది— ఆ గ్రామంలో అడుగు పెట్టగానే మనం మొట్టమొదట వినేది చేనేత మగ్గం యొక్క 'టిక్ టాక్' ధ్వని. గడచిన 'బెంగాల్ క్షామం' రోజులలో ఇక్కడి ప్రజలకి జీవనోపాధి కల్పించడానికి ఈ గ్రామంలో చేనేత కేంద్రం స్థాపింప బడింది. ఈ గ్రామంలో స్త్రీలు ఈ కేంద్రానికివచ్చి బట్టలు నేసి తమ జీతాన్ని తీసుకుంటారు. ఇక్కడ వినిపించే రెండవది ధాన్యందంచే రోకళ్ళ చప్పుడు. ఇటు మగ్గాల ధ్వనీ, అటు రోకళ్ళ చప్పుడూ రెండూ కలిసి లయ యుక్తంగా పాడే "భారత దేశీయగీతం"లా వుంటుంది– దీనితో పోల్చిచూస్తే వందలకొలదీ సంవత్సరాలక్రితం "ఈ ప్రపంచం 'పడుగుపేక' సిద్ధాంతంతోనే నిర్మింప బడిందని" గార్గి అన్న మాటలు ఎంత సత్యమైనవో తెలియటంలేదూ!

## "వివిధ రకాల చేనేత వస్త్రాలు"

ఈమధ్యనే సంయుక్త పరగణాలు, రాజాస్థాన్, అస్సాం, మణిపూర్ ఢిల్లీ పరిసర ప్రాంతాలు నేను పర్యటించాను. ఎక్కడ చూచినా చేనేత పరిశ్రమే అత్యధికంగా నన్ను ఆకర్షించింది- స్త్రీలే దీనిలో ప్రధాన పాత్ర వహించారు- కేవలం నా దృష్టినేకాదు- ప్రపంచ



# చేనేత పరిశ్రమలో స్త్రీలు

దృష్టినే ఆకర్షించే పరిశ్రమ ఇది. కాశీ, లక్నో, ఆగ్రా నగరాలలో హోటళ్ళలోనూ, బజారులోనూ చేనేతవస్త్రాలు భుజంమీద వేసుకొని రంగురంగుల నమూనాలతో అమ్మకానికి వస్తారు. వీటితో ఆయా రాష్ట్రాల ప్రత్యేకతని సూచించే చక్కని బొమ్మలూ, పింగాణీ సామానూ అమ్మకానికి వస్తాయి. కాని అన్ని రాష్ట్రాలలోనూ ఒక విధమైన 'సారూప్యం' మనం చూస్తాము. దీనికి కారణ మేమిటంటే చేనేత పరిశ్రమయొక్క ప్రధాన సూత్రాలూ, పరిస్థితులూ దాదాపు భారత దేశమంతటా ఒకటే:— గ్రామీణ ప్రాంతాల స్త్రీలు తమ తమ మగ్గాల దగ్గర కూర్చుని బట్టలు నేస్తూ, తమకి ఉన్నదానితోనే తృప్తి చెందుతూ జీవితాలని గడుపుతారు. ఇదే భారతీయ సంప్రదాయానికి ప్రధాన సూత్రం!

అస్సాం, మణిపూర్‌లలో గ్రామ ప్రజల ప్రధానవృత్తి చేనేత. ప్రతి ఇంటికీ ఒక మగ్గం వుంది ఇక్కడ! అస్సామ్‌లో మధ్య తరగతి కుటుంబస్త్రీలు తమ బట్టలు తామే నేస్తారు. అందమైన 'మూగా' 'ఎండీ' రకపు సిల్కు బట్టలు ఈవిధంగా ఇళ్ళలో తయారయినవే! ఇక్కడ మధ్య తరగతి కుటుంబాలలో పట్టు పురుగుల పెంపకం ద్వారా నాలుగు రకాలైన పట్టువస్త్రాలు తయారవుతున్నాయి.

ఇక్కడ పట్టుపురుగులని "మల్బెరీ" వృక్షాల ద్వారా పెంచుతారు. ఈ పురుగులువిడిచే సిల్కుద్వారానే సన్నని దారాలు తీసి అందమైన వస్త్రాలు నేస్తారు. 'మగా' పట్టు పురుగు పసుపుపచ్చనిరంగు సిల్కు ఇస్తుంది. ఈ రకపు సిల్కులలో తయారుచేసిన బట్టలు ఈ రాష్ట్రంలో చాలా ప్రసిద్ధి చెందాయి. "ఎండీ" పట్టు పురుగులు ఆముదపు చెట్లపైన జీవిస్తాయి. ఈ పట్టుతో తయారు చేసిన ఖండువాలూ దుప్పట్లూ ఎంతోకాలం మన్నుతాయి.

'పత్' రకపు పట్టుబట్టలు ధనికులు ధరిస్తారు. కాని 'మూగా' 'ఎండీ' రకాలు అందరికీ అందుబాటులో వుంటాయి. పచ్చ పచ్చని పొలాలతో, కనుల పండువుగా వుండే పల్లెసీమలలో స్త్రీలు మల్బెరీ వృక్షాలమీద పట్టు పురుగులని పెంచుతూ, తామునేసిన బట్టలను అమ్ముతూ, మగ్గాలపైన రంగు రంగుల బట్టలునేస్తూ వుంటే చూడడానికి ఎంత ముచ్చటగా వుంటుంది! వడ్లు దంపడం కూడా ఇక్కడ పెద్ద పరిశ్రమే!

## దక్షిణభారతములో చేనేత పరిశ్రమ:

ప్రశాంతమైన పల్లెపట్టుల పడుచులు ధాన్యం దంపుతూ బట్టలు నేస్తుంటే చూడ్డానికి ఎంతో ముచ్చగా వుంటుంది. పాశ్చాత్య దేశాలలో స్త్రీలు పాడి పరిశ్రమలో పాల్గొనడం వింటూంటాం. భారత దేశంలో ప్రధానంగా స్త్రీలు అనేక రంగుల బట్టలను తయారుచేస్తూ చేనేత పరిశ్రమలోనే ఎక్కువమంది పాల్గొంటున్నారు. ప్రపంచవిఖ్యాతి చెందిన దక్షిణభారత చేనేత వస్త్రాలు పల్లెప్రాంతాల పడుచులచేతి చలవవల్ల తయారయినవే! కోయంబత్తూరు, సేలం, ధర్మవరం ప్రాంతాలలో తయారయినవస్త్రాలూ, అత్యంత రమణీయమైన ఉప్పాడ, వెంకటగిరి జరీచీరలూ, ఎంత చక్కగా వుంటాయి! అటు తూర్పుకి వెళ్ళినట్లయితే ఒరిస్సానుంచి భారతదేశం నలుమూలలకీ ఎగుమతయే దుప్పట్లు పర్దాగుడ్డలు రవికలగుడ్డలు, మేజా గుడ్డలు, మొదలైనవి పల్లె ప్రాంతాల మగ్గాలపై తయారయినవే! డాకామజిలినులు ఒకానొకప్పుడు మనదేశానికి గర్వకారణమైనా, ఇప్పుడు చందేరి, శాంతిపూర్, మూర్షిదాబాద్, చేనేత వస్త్రాలు అత్యున్నత శ్రేణికి చెందినవి; వీటి తరువాత బీహార్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ ప్రాంతాలకు చెందిన ప్రఖ్యాత చేనేతవస్త్రాలు. ఇవి ప్రత్యేకతకీ విశిష్టతకీ ఉదాహరణాలు-ఈవస్త్రాల వైవిధ్యంలో, భారత దేశపు చేనేత పరిశ్రమఐక్యత కూడా ద్యోతక మవుతూంటుంది.

ఇటు మలబార్, బెంగాల్, అస్సామ్ ప్రాంతాల తెల్లటి దుస్తులతో అటుమణిపురీవారి వివిధ వర్ణాల గౌనులూ, వాటిపైన వల్లెవాటుగా వేసుకొనే ఖండువాలూ ఎంతో చూడముచ్చటగా వుంటాయి. ఈ దుస్తులతో మణిపురీ వనిత మగ్గం దగ్గరకూర్చుని నేత నేస్తూంటే ఎంత అందంగా కనబడుతుంది! మణిపురవనిత కొత్తపద్ధతులలో వస్త్రాలు నేయడం నేర్చుకుంది. అస్సాములోని ఘాటియాలు, బ్రహ్మపుత్రా లోయలోని ప్రజలూ ఉపయోగించే చిన్నరకముల మగ్గాలకంటే ఎగిరే కదుళ్ళు మణిపురీవారు ఉపయోగిస్తున్నారు.

"వీరి బట్టలకి ఇంత చక్కటిరంగులు ఎక్కడనుంచి వస్తున్నాయి?"

"ఇదివరలో వీరు స్థానికంగా ఉపయోగించే రంగులకు బదులుగా ఐ. సి. ఐ. రంగులు- విదేశాల నుంచి

తెప్పించుచున్నవి — ఉపయోగిస్తున్నామనివారు నాకు చెప్పేరు.

మణిపూర్‌లో కూడా పత్, ముగా, ఎండీ రకాల పట్టు పురుగులను వీరు పెంచుతున్నారు. మణిపూరు వారు ఇతర ప్రాంతాల వనితలకంటె ఒక అడుగు ముందే వున్నారని చెప్పవచ్చు. ఎందుచేతనంటే పట్టు పురుగులని పెంచి, నూలువడికి, బట్టలునేసి, ఆ వస్త్రాలను కొన్నిమైళ్ళ దూరానవున్న సంతలకి తీసికొనివెళ్ళి అమ్మడంగాని, లేక వీటిని ఇచ్చి తమకు కావలసిన వస్తువులకు మారకం పద్ధతిలో బారిటర్ తీసికొనడంగాని చేస్తారు. ఇక్కడిసంతలకి మగవారు ఎప్పుడూ వెళ్లరు. ఇవన్నీ స్త్రీలు నడప వలసిందే. ఇక్కడ మగవారు సంతలకి వెళితే వాళ్ళకి పరువు తక్కువట !

రాజాస్థాన్‌లో పచ్చ పచ్చని చేలలో పరికిణీలు గాలికి రెపరెప లాడుతుండగా వాణీలు వేసుకున్న రాజపుత్ర కన్యలు 'గాగ్రా'లు ధరించడం మనంచూస్తున్నాం ! "సంగనర్" "బాగ్రూ" పువ్వుల గుడ్డలూ, కంటికింపైన రంగులతో నేసిన రాజాస్థాన్ చీరలూ ప్రపంచపు వింతలలో ఒకటన డానికి సందేహంలేదు.

ఈ నేసేవిధానం భారత దేశమంతటా ఒకటేనని చెప్పాలి మారు మూలల. ఒకదానికీ మరొక దానికీ సంబంధము లేని పల్లెలలో స్త్రీలు జీవితావసర వస్తువైన వస్త్రాన్ని తయారుచేస్తారు. యుగయుగాలుగా వస్తున్న ఈ పురాతన చేనేత పరిశ్రమ మన సంస్కృతికే ఒక చిహ్నంగా వుండిపోయింది ! ఈ 'పడుగుపేకల' 'టిక్-టాక్' ధ్వనే ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించింది. చేనేతపరిశ్రమ, దంపుడుపరిశ్రమ భారత దేశపు హృదయమనే చెప్పాలి.

కొన్ని వందల సంవత్సరాల క్రితం గార్గి యాజ్ఞవల్క్యుణ్ణి అడిగినట్లుగానే. ఈనాడు "మనం ఏపద్ధతుల మీద మన జీవితాన్ని నిర్మించుకుంటున్నాము" అని ప్రశ్నించుకుంటే, వచ్చే సమాధానం యాజ్ఞవల్క్యుని సమాధానంలా డొంకతిరుగుడుగా కాకుండా సూటిగా వుండగలదు. "భారత దేశంలో ఆసేతు హిమాచల పర్యంతం, చిన్నచిన్న పల్లెలలో చేనేత పరిశ్రమపై ఆధారపడి వున్న అశేష ప్రజానీకానికి ఉపకరించే విధానంలో మన జీవితావసరాలని సరిదిద్దుకోవాలనీ, తెచ్చిపెట్టుకున్న నవీన నాగరిక లక్షణాలతో పట్టణ వాసానికి అలవాటుపడి, తాము ఏదిశగా ప్రయాణం చేస్తున్నామో తమకే తెలియని "నాగరికుల" పద్ధతులలో మాత్రం కాదనీ నిస్సందేహంగా చెప్పవచ్చును. ★

# సర్. రఘుపతి వెంకటరత్నంనాయుడు

శ్రీమతి కె. సుగుణమణి.

దక్షిణ ఇండియాలో నవయుగ కర్తలు శ్రీ కె. వీరేశలింగం పంతులుగారు సర్ ఆర్. వెంకటరత్నం నాయుడుగారున్ను. వీరిద్దరినీ ప్రజలంతా ఎంతో వాత్సల్యంతో "పంతులుగారు" "నాయుడుగారు" అని పిలుస్తుండేవారు. ప్రజల సాంఘికాచారాలు, మతవిషయాలు, విద్య, విజ్ఞానము వీటి దృక్పథాల్లో పూర్తి పరిణామాన్ని తెచ్చి, వీరిద్దరూ హిందూ దేశంలోని దక్షిణ ప్రాంతాన్ని అంధకారం నుండి వెలుగు మార్గంలోకి తీసుకు వచ్చారు. ఇద్దరూ గురువులే. ఈ రోజున దక్షిణ ఇండియాలో ఉన్న ఏ నాయకుడైనా సరే వీరిద్దరికిగాని, లేదా ఏ ఒకరికో గాని, శిష్యుడో లేక భక్తుడో అయివుంటాడు. వారి శిష్యుడనేసరికి చక్కటి శీలం, సత్ప్రవర్తన, నిరాడంబర జీవనం, ఉన్నతాశయాలు అలవడి వుంటాయి. వారిద్దరూ సహచరులు. నాయుడుగారు గొప్పవక్త, పంతులుగారు గొప్పరచయిత. పంతులుగారు 27 మే 1919 లోను, తర్వాత నాయుడుగారు 26 మే 1939లోను అస్తమించారు.

రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు 1862 సం. లో మహార్నవమినాడు మచిలీ పట్నంలో జన్మించారు. మిలిటరీ కుటుంబంలో పుట్టి, 1864 సం.లో ఆ వూరినంతా ఊడ్చివేసిన తుపాను బారినుండి తప్పించుకుని నాయుడుగారు ఇతరుల దృష్టి నాకర్షించే వ్యక్తిగా తయారయ్యారు. ఆయన నేత్రాల్లో ఒక విశిష్టమైన ఆకర్షణ శక్తి ఉండేది. ఎత్తయిన ఆయననుదురు లోనున్న మేధాశక్తిని చాటుతుండేది. ఆయన చిన్నప్పటి చదువు ఉత్తర మధ్య ఇండియాల్లో జరిగింది. ఇందువల్ల అయనకు ఉర్దూ రెండో భాష అయింది. దాంట్లో అనర్గళంగా భాషించ గలిగేవారు. డా. అఘోర్ నాథ్ ఛటోపాధ్యాయ, శ్రీ ఎ. ఇ. హోమ్, ప్రఖ్యాతుడైన డా. మిల్లరు వీరి ఉపాధ్యాయులూ ప్రొఫెసర్లూను.

మద్రాసు విశ్వ విద్యాలయం నుంచి 1885 లో డిగ్రీ పట్టా పుచ్చుకొన్న వెనుక రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు మద్రాసులో "పీపుల్సుఫ్రండ్" అనే వార పత్రిక సంపాదక వర్గంలో కొన్నాళ్ళు పనిచేసి, ఆ వెనుక ఉపాధ్యాయవృత్తి నవలంబించి దాంట్లో మంచిపేరు పొందారు. మచిలీ పట్నం నోబుల్ కాలేజీలో ప్రొఫెసర్‌గా ఉంటూ ప్రయపరీ పరీక్షల బోర్డుకు చైర్మన్‌గా మూడేళ్ళు పనిచేశారు. మద్రాసు సెనేట్‌లోను, సిండికేట్‌లోను ఉంటూ ప్రప్రథమ వైస్‌చాన్సలరుగా ఎన్నికైనారు. ఉద్యోగేతరులలో ప్రప్రథమంగా వీరే సర్ బిరుదమును పొందినారు. వీరు విశ్వవిద్యాలయ పరీక్షకుల బోర్డులోను, మద్రాసువిశ్వవిద్యాలయంలో ఫెలోగాను, ఎస్.ఎస్.ఎల్.సి బోర్డులో మెంబరుగాను ఉన్నారు. 1914 లో పబ్లిక్ సర్వీసెస్ రాయల్ కమిషన్ వీరితో సంప్రతించింది. 1917 లో సెకండరీ స్కూళ్ళల్లో నైతిక విద్య గరపడానికి ఒక ప్రణాళిక తయారు చేశారు. ప్రభుత్వం నియమించిన విద్యాపునర్నిర్మాణ కమిటీలో చైర్మన్‌గా పనిచేశారు.

కాని వీరు విద్యావేత్త అని, వక్త అని, విజ్ఞానిఅని, అధమం ఒక అరడజను అఖిలభారతసంస్థలకు ప్రెసిడెంటు చైర్మన్ అని, లేక రాష్ట్రశాసన సభకు డిప్యూటీ ప్రెసిడెంటు అనీ కాదు మనం రఘుపతి వెంకటరత్నం నాయుడుగార్ని అంతగా ప్రేమించి, గౌరవించడం; దిక్కులేని అనాథ బాలల అశ్రువులు తుడిచిన సంఘ సంక్షేమకృషి సల్పిన వెంకటరత్నం నాయుడు అనే మనం ఆయన్ని ఎక్కువ హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నాం.

అనేక పంథాల్లో కృషి సల్పడానికి అనంతావకాశం యిస్తున్న సంఘ సంక్షేమ కార్యావళి ఆయన దృక్పథంలో తోచింది. చిన్నప్పటినుంచీ సంఘ సంక్షేమానికే ఆయన శక్తి సామర్థ్యాలన్నిటినీ వినియోగించి, జీవితం ధారపోశారు.

తన 27 వ యేట భార్య మరణించడంతో సంఘ సేవలో నిమగ్నుడైపోయారు. కొంతమంది "శ్రేయోభిలాషులు" ఆయనను పునర్వివాహం చేసుకొండని సలహాలిచ్చేరు. కాని, ఆయన ప్రజాశ్రేయస్సుకు కృషి సల్పడానికే కృతనిశ్చయుడయ్యేరు.

స్త్రీల సంక్షేమాన్ని గురించి ఆయన అనుక్షణం ఆలోచిస్తుండేవారు. వేశ్యల అంధకార బంధురమైన జీవితాల్ని గురించి సంఘంలో మార్పు తెచ్చి ఉద్ధరించిన వారిలో ప్రథము డీయనే. దక్షిణదేశం అంతా కూడా ఈ మహానుభావుని ప్రేమ స్వభావాన్ని గురించీ, దాతృత్వాన్ని గురించీ, విశాలహృదయాన్ని గురించీ ఆయన కాలంలో జరిగిన సంఘటనలను గురించీ ఇప్పటికీ చెప్పుకుంటూనే ఉంటారు.



# బస్ స్టాపువద్ద స్త్రీ

ఒక రోజు ఉదయం నేను బస్ కోసం చాలాసేపు నిలబడవలసి వచ్చింది. తెల్లని చీర చెరగుతో శరీరం అంతా కప్పుకుని ఒక సన్నని స్త్రీ చంటి బిడ్డను ఎత్తుకొని నా దగ్గరే నిలబడి ఉంది. ఆమె కొంగు పట్టుకొని ఇంకో పిల్లవాడు నిలబడి ఉన్నాడు. ఆమె చూడ్డానికి పని మనిషిలా కనిపించింది. కాని ఆమె ఒక చాకలి వాని భార్య అని తరువాత తెలుసుకున్నాను.

ఇంక కొంత సేపటిలో రెండేళ్ల వయసు గల ఇంకో పిల్లవాణ్ణి ఎత్తుకుని దాదాపు పదేండ్ల అమ్మాయి ఈమెను కలుసుకుంది. ఆ వెంటనే ఇంకొక నలుగురు పిల్లలు, దాదాపు ఒక సంవత్సరమైనా తేడా ఉంటుందో ఉండదో, అంతా ఇంతా వయసు వాళ్లు ఎక్కడినుంచో పరుగెత్తుకు వచ్చి వీళ్ళని చేరుకున్నారు. ఇదంతా గమనిస్తూ ఉన్న నేను ఉండబట్టలేక ఆమెను అడిగాను.

"ఏ బస్సుకోసం కనిపెట్టుకున్నావ్" అన్నాను.

"ఆసుపత్రికి వెళ్లే బస్సు కోసం! ఏబస్సో చెప్పగలరా" అని ఆమె అడిగింది. ఆమెకు బస్ నెంబరు చెప్పేను. ఆమెను గురించి తెలుసుకోవాలనే కుతూహలం ఆగింది కాదు.

"ఆసుపత్రికి ఎందుకు వెడుతున్నావ్? చంటి బిడ్డ సుస్తీగా ఉందా?" అన్నాను. "లేదండి! కొన్ని రోజులుగా నాకు జ్వరం వస్తూంది" అంటూ తలమీది ముసుగు కొంచెం తొలగించి రెండు వైపులా నరాలు పొంగిన మెడ చూపించింది. అవి క్షయ వ్యాధికి సంబంధించిన గ్రంధులు.

ముప్ఫయి సంవత్సరాలైనా ఉండని ఆ యువతి జీవితం త్వరలోనే సమాప్తం కాబోతున్నదని తెలుసుకుని, నా హృదయం ఎంతో వేధించింది. "కూడా ఉన్న పిల్లలంతా ఎవరు" అని అడిగాను. ఆమె గర్వంగా:

"నా పిల్లలే! నాకు పదిమంది పిల్లలు. పెద్ద పిల్ల ఇంటివద్ద పని చూసుకుంటూ ఉంది. అంతా పన్నెండుగురు సంతానం. కాని ఇద్దరు పోయారు." అని అన్నది.

ఆమె జీవితాన్ని సంకుచితం చేసే ఆ గ్రంధులకి కారణమేమిటో నాకు అప్పుడు అర్థమైంది. ఆసుపత్రికి పిల్లలందరినీ ఎందుకు తీసుకెడుతున్నావ్" "పిల్లలకి కూడా గ్రంధులు ఉబ్బేయేమో పరీక్షిస్తాను తీసుకురమ్మని లేడీ డాక్టరు చెప్పేరు. ఉంటే వైద్యం చేస్తానన్నారు" అని ఆమె జవాబు చెప్పింది.

కొన్ని మాసాల వయస్సు గల బిడ్డ చేతులో ఉంది. చుట్టూ ఇందరు పిల్లలున్నారు. ఇంకా ఆమెకు పిల్లలు కలగవచ్చునని భయపడి "ఇంకా నీకు సంతానం కావాలా" అని అడిగేను. "లేదండీ అక్కరలేదు. ఈ పిల్లలు నాకు చాలు. భగవంతుడు నాకు ఆరుగురు మగపిల్లల్నీ, నలుగురు ఆడ పిల్లల్నీ ఇచ్చాడు. నేను తృప్తి పడ్డాను. ఇంక నాకక్కరలేదు." అని సమాధానం చెప్పిందామె.

"అయితే లేడీ డాక్టరు దగ్గరకు వెడుతున్నావు గనక ఇంక పిల్లలు అక్కరలేదనే సంగతి ఆమెతో చెప్పరాదూ? ఆమె నీకు సహాయం చేస్తుందే. ఇంకా పిల్లలు కలిగితే నీకు జబ్బు ఎక్కువై పోతుంది. నీ బిడ్డలుకూడా బలహీనులైపోతారు" అని చెప్పేను.

తప్పక డాక్టరుని అడుగుతాను అన్నట్లు ఆమె కళ్ళు మెరిశాయి. గర్భధారణ శాస్త్ర రీత్యా ఆపు చెయ్యడాన్ని గురించి ఇదివరలో ఎవరూ ఆమెకు చెప్పి ఉండలేదని నేను భావించాను.

ముందు ఆమె ఎక్కే బస్సు వచ్చింది. నాకు నమస్కారం చేసి కూడా ఉన్న పటాలాన్నంతటినీ ఎక్కించుకు వెళ్లి పోయింది. నా మనసులో ఒక్క ఆలోచన మాత్రం నిలిచిపోయింది. "ఇటువంటి సంఘ సేవ చెయ్యవలసిన అవసరం ఎంతైనా ఉంది, అది మనం పట్టించుకోడం లేదుగాని!" అని.

జన్మ శాసనం మన దేశానికి కొత్తది. మన ప్రజల మనస్సుకి దాని నిజస్వరూపం ఎక్క లేదు. పిల్లలు కలగడం భగవంతుని ఇచ్ఛఅనీ, దాన్ని నిరోధించడం పాపం అనీ భావిస్తాం. ఇలాంటి మత సాంఘిక ఆచారాలు మనవారి మనస్సులను మబ్బుకమ్మి నట్లు క్రమ్మేయి. కేంద్ర ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రి కొన్నేండ్లుగా గృహ ప్రణాళికను గురించి చేసే విజ్ఞాపనలు వింటూనే ఉన్నాం. కాని వ్యక్తులలో చైతన్యం కలిగినప్పుడే సంస్థలు నిల కొంటాయి. సంతాననిరోధాన్ని గురించిన జ్ఞానం వ్యక్తులలో కలగజెయ్యడం కష్టసాధ్యంకాదు. ప్రతి స్త్రీ తన తోటి స్త్రీకి సహాయం చేస్తుంది. బస్‌స్టాప్‌వద్ద నిలబడిన స్త్రీ పడ్డ దుస్థితిలో పడకండా ఈ జ్ఞానం జనబాహుళ్యాలో కలగజేస్తే కుటుంబాలకి క్షేమం.

ఖటూన్ క్వమెరిన్

# సౌరాష్ట్రంలో ఒక సంక్షేమ సంస్థ కథ

డాక్టరు॥ కుమారి తారా బి. జాధవ్
గౌరవ కార్యదర్శి.

కృషివల్ల సాధింపబడని కార్యం ఉండదు. సత్కార్యం జరుగుతున్నప్పుడు ధనసహాయం, ప్రజల ప్రోత్సాహం, అన్నీ వాటంతట అవే వస్తాయి. ఎక్కడో సౌరాష్ట్రంలో ఏమూలనో పోలీసు లైనులో అవివేకమూ అశుచీ ప్రబలిఉన్న ప్రదేశం స్వర్గతుల్యంగా తయారయిందంటే ఈ వ్యాసకర్త డాక్టరు జాధవ్‌గారి నిరంతర కృషివల్లనే. అక్కడి సంక్షేమ కార్యక్రమం క్రమక్రమంగా ఎలా అభివృద్ధిపొందినదో, సామాన్య ప్రజలకు ఎంత అభ్యుదయాన్ని కలగజేసిందో, ఎందరు స్త్రీలూ, బాలలూ ఆరోగ్యాన్ని పొందేరో ఈ వ్యాసంవల్ల గోచరమవుతుంది. ఇందలి కృషి ఫలించడానికి కారణభూతురాలైన కుమారి డాక్టర్ జాధవ్ ఎంతయిన ప్రశంసనీయురాలు.

కాకీదుస్తులు ధరించిన పోలీసు కాన్స్టబుల్‌ని సాధారణంగా మనం చూస్తున్నా అతనిలో ఏదో ప్రత్యేకతఉన్నట్లు కనపడుతాడు. వీధుల్లో చూస్తుంటాం. ఏదో మూల చూస్తుంటాం. శాంతి భద్రతలు పరిరక్షించడానికి ఇటూఅటూ తిరుగుతూ అధికారం చెలాయించడం, పట్టణాలలో చేతులు ఇటూఅటూ ఊపుతూ రాకపోకలను శాసిస్తూ ఉండడం చూస్తుంటాం. అతడు వేలిసౌంజ్ఞతో చేసినఆజ్ఞలను తప్పకుండా మనం శిరసావహిస్తాం. కాని అతని గృహ జీవితం ఏలాంటిదో మనం ఎప్పుడైనా తెలుసుకోడానికి ప్రయత్నించామా? ప్రభుత్వ శాఖల్లో ఇంత కంటె తక్కువ జీతం తీసుకునేవాడు ఉండడేమో! నెలకి 55 రూపాయిలకి 80 రూపాయిలకి మధ్య ఉంటుంది అతని జీతం. కుటుంబాన్ని ఎలా పోషించుకుంటున్నాడో, పిల్లల్ని ఎలా పెంచుకుంటున్నాడో సంఘంలో అతని భార్య స్థాన మేమిటో ఎప్పుడైనా ఆలోచించామా? ఆసంగతులు ఏమంత సంతోషం కలిగించవు మనకు.

సంసారం సుఖంగా గడిపేవాడు తన విధులను సమర్థతతో నెరవేరుస్తా డనే సత్యాన్ని సౌరాష్ట్రంలోని పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్‌కి బాగా తెలుసు. ఈఅవకాశాన్ని వాళ్ళకి కల్పించి కొంత కృషి చెయ్యాలని సంకల్పించి ప్రస్తుతం ఈవ్యాస రచయిత సహాయాన్ని కోరేడు.

ప్రారంభం తక్కువ స్థాయిలోనే మొదలు పెట్టేం. మా కార్య సాధనకు అనువైన దగ్గర ప్రదేశం ఏమిటని ఆలోచించి అన్ని విధాలా పోలీసు హెడ్‌క్వార్టర్సు లైను బాగా ఉందని అక్కడ పనిసాగించడం ప్రారంభించేం. చేతిలో డబ్బు లేదు. భవనాలు లేవు. అందుచేత కార్యకలాపాలన్నీ బహిరంగంగా ఖాళీస్థలంలో జరిపేం. మొదట ఉచితవైద్యపరీక్ష చేయడం, గర్భిణీ స్త్రీలకు సలహా లివ్వడం, పురుడుపోసుకునేవాళ్ళని సక్రమమైన పద్ధతిలో పెట్టడం తరవాత పాలు ఉచితంగా పిల్లలికి పంచిపెట్టడం ఈ పనులు చేశారు. కొందరు స్వచ్ఛంద సేవకుల ఉత్సాహంవల్లా సహకారంవల్లా ఈ పిల్లల పాలు పంపకం బహు జనామోదాన్ని పొందింది క్రమంగా ప్రపంచ ఆరోగ్య సంస్థ వారి సహాయం లభించింది. పాలుతాగే బిడ్డల సంఖ్య 25 నుంచి 200 వరకూ పెరిగింది. మామూలుగా తల్లులూ,రోగులూ పొందే సహాయాలు పొందుతూనే ఉన్నారు. మూఢంగా పాత పద్ధతులనే అనుసరించే తల్లులకి ఈ సౌక

ర్యాలు వస్తు అని అన్నా కలగ జేయబడ్డాయి. ఈసదుపాయాలు గ్రహించడంతోనే సహాయం పొందేవారి సంఖ్య పెరిగి పోయింది.

తరవాత ఈ సంక్షేమ కేంద్రం యొక్క కార్య కలాపాలు విస్తృతం చెయ్యడం తగినపని అనే ఆలోచన వచ్చింది. కాని అందుకు తగిన ధనం లోపం వచ్చింది. సత్కార్యాచరణకు ధనాభావం కలగడం ఏమిటి? కేంద్ర సాంఘికసంక్షేమ సంఘం సమయానికి సహాయంచేసింది. దానితో రెండు వేర్వేరు విధాల కార్యాచరణకు పూనుకుని సేవావిధానం విస్తృతం చేశాం. ఒకటి సంఘ సంక్షేమం. రెండు ఆరోగ్యం. సంఘ సంక్షేమ కార్యక్రమంలో వయోజన విద్యాశాలలు నిర్మించ బడ్డాయి. ప్రభుత్వం నిర్వహించిన పరీక్షలలో ఇందలి విద్యార్థులు నూటికి నూరూ ఉత్తీర్ణులైయారు.

తదనంతర కార్యక్రమం ఏమిటంటే గృహ కృత్యాలన్నీ చేసుకుని ఖాళీగా ఉన్న సమయంలో ఏదైనా చేతిపనిచేసి దానివల్ల కొంత ఆదాయం చేసుకోడానికి ఆశపెట్టిఉద్బోధించడం. దీనితో ఇంకోమెట్టు పైకెక్కాం. ఒక ఎంబ్రాయిడరీ తరగతీ, ఒక కుట్టుతరగతీ స్థాపించబడినవి. ఇంకా పీచుతో తాళ్ళూ, కాళ్ళుతుడుచుకునే పీచులూ తయారు చెయ్యడం, వెదురు పేళ్ళతో బుట్టలూ, తడకలూ అల్లడం ప్రవేశపెట్ట బడింది. ఇదంతా ఎంతో ఉత్సాహంతో జరగడానికీ, కార్మిక కర్షక కుటుంబాల వారిని ఎక్కువగా ఆకర్షించడానికీ కారణం వారికి లభించే ఆదాయం. ఈ చేతిపనులకు కావలసిన ముడి వస్తువులు సంక్షేమ కేంద్రంవారు కొన్న ఖరీదుకే సప్లయి చేయడం వల్లనూ, తయారైన సామానులను అమ్మడంలో గరిష్ఠధరలు సంపాదించడానికి స్వచ్ఛంద సేవకులు శాయశక్తులా పాటుపడటం వల్లనూ, ఎక్కువ లాభకరంగా ఉండి పనిచేసే వాళ్ళకి ఉత్సాహమూ, ప్రోత్సాహమూ కలిగింది.

దీనితో సమానంగా ఆరోగ్య ప్రణాళికను అనుసరించి రోజురోజుకీ ఎక్కువరోగులు సలహాకోసం, సహాయంకోసం రావటం మొదలు పెట్టారు. పురుడు రావడానికి సిద్ధంగా ఉన్న తల్లులకి ఉచితంగా పాలూ, ఉచితంగా బలవర్ధక ఔషధాలూ, ఇంజెక్షనులూ ఇంకా ఏమి కావలిస్తే అవి ఇవ్వడం జరిగింది. ఆహారం సరిపోని బలహీనమైన పిల్లలకి పాలకేంద్రంలో ఉచితంగా పాలూ, బలం కలగజేసే ఔషధాలూ, ఇచ్చి అవసరమైతే శరీరం మర్దన చేసేవారు.

అల్ట్రా వియొలెట్ దీపం ఒకటీ, శస్త్ర చికిత్సకు అవసరమయే అన్ని పరికరాలూ కొన్నాం. ప్రసవ సమయాల్లో, దుప్పట్లూ, పరుపూ, పరిశుభ్రతకు అవసరమైన సామగ్రులతో సహా మంచమూ, ఇంకా ఇతర అవసరాలకు కావలసిన వస్తువులూ అన్నీ డబ్బు పుచ్చుకోకుండానే రోగులకు సప్లయి చేయబడుతూ ఉన్నాయి. స్వచ్ఛందంగాపనిచేసే ఒక గౌరవ లేడీడాక్టరూ, తరిఫీదు పొందిన నరుసూ పురుళ్ళు పోస్తారు.

పాల కేంద్రంలో పాలుతాగే పిల్లలందరినీ తూచి క్రమమైన తూకపు పట్టీలు తయారు చేస్తారు. దాదాపు అందరికీ బరువు హెచ్చడం గమనిస్తారు. పాల పొడుంతో తయారు చేసిన పాలల్లో వాటికి ఉండవలసిన పదార్థాలన్నీ సరిగ్గా ఉన్నాయో లేదో చిక్కదనం ఉండవలసినంత ఉందో లేదో పరీక్షించి ప్రత్యేకంగా ఈ పనికి నియమించ బడ్డ స్వచ్ఛంద సేవకులు కేంద్రంలోనే ఎవరిపాలు వారికిఇచ్చి తాగిస్తారు.

ఈపాల కేంద్రంలో జరిగే కృషి ఫలితంగా 4500 మందిజనులు (600 కుటుంబాలవారు) ప్రస్తుతం సహాయాన్ని పొందుతున్నారు.

ప్రస్తుతం ఈ సంక్షేమ కేంద్రం ఒక విశాల మైన హాలు ఉన్న గృహంలో నిర్వహింప బడుతూఉంది. ఒక గౌరవ లేడీ డాక్టరూ, దాదాపు ఇరవైమంది స్వచ్ఛంద గౌరవ సేవ కులు, తరిఫీదు పొందిన ఒక ఆరోగ్య సంరక్ష కుడూ, ఇద్దరు నరుసులూ ఇందులో పనిచేస్తు న్నారు. నారతాళ్ళ తయారీ, కుట్టుపనీ, ఇతర చేతిపనులూ అర్హత కలిగిన ఉపాధ్యాయుల పర్యవేక్షణక్రింద నడపబడుతూ ఉన్నాయి.

ఇందరూ తరుచూ ఇక్కడే ఉండి పనిచేయ డంవల్ల పోలీసులైనులోని ఇళ్ళన్నీ పరిశుభ్రంగా తయారయ్యాయి. వాకిళ్ళన్నీ చక్కగా అద్దాల్లా నిడలానుతూ ఉన్నాయి. అక్కడకాపరం చేసే కుటుంబీకుల అలవాట్లన్నీ మారిపోయాయి. బ్రహ్మచారుల భోజన శాలలుకూడా పరిశుభ్ర తలో వీటిని ఎంత మాత్రమూ తీసిపోలేదు. ఫల హారాల గదులమాట చెప్పనే అక్కర లేదు. గొప్ప ఆరోగ్యకరమైన వాతావరణం ఏర్పడింది.

ఇంక సౌరాష్ట్ర ప్రభుత్వం దగ్గిరనుంచి విరాళం వస్తుందని ఎదురు చూస్తున్నాం. వెంటనే ఒక బాలామందిరం నిర్మించి, ఇతర సాంఘిక సంక్షేమ కార్యకలాపాలు నిర్వహించాలని మా ఆశయం.





# సంక్షేమ విస్తరణలో ముందుటడుగులు

——————:o:——————

### విశాఖపట్టణం జిల్లా :

మార్చి 17 వ తేదీన "నెల్లిముక్క" గ్రామంలో మాతా శిశుసంరక్షణాలయం స్థాపింపబడినది. ఈ గ్రామంలో 5,000 జనాభా కలదు. చుట్టుప్రక్కలగ్రామాలకు యీ కేంద్రంవలన లాభము కలుగగలదు.

తెలుగు ఉగాది దినోత్సవమునాడు "నడుపూరు" గ్రామంలో మాతాశిశుసంరక్షణ కేంద్రం స్థాపింప బడినది. ఆంధ్ర మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్‌గారి సతి శ్రీమతి కమలమూర్తి యీ కేంద్రానికి ప్రారంభోత్సవము చేశారు. గ్రామ పంచాయతీ పెద్దలు పై రెండు కేంద్రాల లోను, కన్వీనరు శ్రీమతి జానకీనాయిగారితో సర్వవిధాల సహకరిస్తున్నారు.

### పశ్చిమ గోదావరిజిల్లా :

మార్చి 26 వ తేదీన "లక్ష్మణేశ్వరం" గ్రామములో శ్రీ జి. వి. రెడ్డినాయుడుగారు మాతాశిశుసంరక్షణాల యానికి ప్రారంభోత్సవము చేశారు. ఆనాటి సమావేశానికి నరసాపురం సబ్‌కలెక్టరు శ్రీ బి. యన్. జయసింహా అధ్యక్షత వహించారు. పంచాయతీబోర్డువారు రు. 500 లు విరాళముగా యిస్తామని వాగ్దానం చేశారు.

### నెల్లూరు జిల్లా :

ఫిబ్రవరి 5 వ తేదీన "పడమటి పాలెం"లో మాతా శిశుసంరక్షణ కేంద్రం స్థాపింపబడినది. ఈ కేంద్రంవల్ల 4 గ్రామాలలోని 8,000 మంది ప్రజలకు ప్రసూతిసౌకర్య ములు లభింపగలవు.

### చిత్తూరు జిల్లా :

ఫిబ్రవరి 20 వ తేదీన "గుడిపాల" గ్రామంలో మాతా శిశుసంరక్షణ కేంద్రం స్థాపింపబడినది. పిల్లలకు ఆట సౌకర్యములు, గ్రంథాలయముకూడ ఏర్పరుపబడినవి.

### కడప జిల్లా :

రాయచోటి తాలూకా "లక్కిరెడ్డిపల్లె" గ్రామంలో ఉగాది దినోత్సవంనాడు జిల్లా మెడికల్ ఆఫీసరు డాక్టరు హెచ్. ఎమ్. రావుగారు మాతా శిశుసంరక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవము చేశారు. ఆనాటి సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ ఆర్. ఎన్. రెడ్డిగారు (రాష్ట్రీ వెల్‌ఫేరు ఫండు కార్యదర్శి) ఉపన్యసిస్తూ మారుమూల గ్రామాలలో యిటువంటి సంక్షేమ కేంద్రాలు తెరువబడుట ముదావహమనీ, గ్రామస్తులు స్వయంసేవ నలవర్చుకో వాలనీ హెచ్చరించారు. జిల్లా మెడికల్ ఆఫీసరు శ్రీ హెచ్. ఎమ్. రావుగారు తమ ప్రారంభోపన్యాస ములో యిటువంటి కేంద్రాల ఆవశ్యకతను వివరిస్తూ. యీ కేంద్రాలను సద్వినియోగం చేసుకొమ్మని ప్రజలకు బోధించారు. గ్రామ ప్రజలతరఫున శ్రీ దాసిరెడ్డిగారు కృతజ్ఞత తెలియజేశారు. పిల్లలకు సేవాసమాజంవారు పాలుపంచిపెట్టారు. జిల్లా కన్వీనరు శ్రీమతి సరళారెడ్డి, జిల్లా హెల్తు ఆఫీసరు మొదలైన పెద్దలు నాటి సమా వేశంలో పాల్గొన్నారు.

మార్చి 28 వ తారీఖున రాయచోటి తాలూకా "గాది కోట" గ్రామంలో జిల్లా సేవాసమాజ కార్యదర్శి శ్రీమతి రాజం కృష్ణస్వామిగారు మాతాశిశుసంరక్షణాలయానికి ప్రారంభోత్సవం చేశారు.

గాదికోట గ్రామం చుట్టుప్రక్కల ఏవిధమైన వైద్య సహాయం లభించదు. అత్యంత చేరువలోనున్న ఆసుపత్రి ఎనిమిది మైళ్ళలో నున్నది. ఇసుకపుంతలవెంట ఎద్దుబండి ఆ గ్రామం చేరునప్పటికి వ్యయప్రయాసలు తప్ప ఫలితము శూన్యమైపోతుంది. అందువలన ఈ కేంద్ర స్థాపనకు ప్రజలు ఎంతో ఆనందిస్తున్నారు.

ఆనాటి సమావేశానికి శ్రీ ఆర్. ఎన్. రెడ్డి అధ్యక్షత వహిస్తూ ఈ కేంద్ర స్థాపనకుగాను ఒక భవనాన్ని కట్టించియిచ్చిన శ్రీ వెంగమునిరాజుగారిని అభినందిం చారు. గ్రామస్తులు యీవిధంగా ముందుకువచ్చి తమ సౌకర్యాలను తామే ఏర్పరచుకొనవలెనని ప్రోత్సహిం చారు.

ఆనాటి సమావేశములో జిల్లా కన్వీనరు శ్రీమతి సరళారెడ్డి, శ్రీ పి. జి. ఎస్. మణి (సభ్యుడు) శ్రీవెంగ మునిరాజు, శ్రీరాములురెడ్డి, సీతారామరెడ్డి మొదలైన

గ్రామప్రముఖులు పాల్గొన్నారు. సేవాసమాజమువారు పిల్లలకు పాలుపంచిపెట్టారు.

కడప తాలూకా "మాచనూరు" గ్రామంలో మార్చి 30 వ తేదీన మరొక మాతా శిశుసంరక్షణాలయం ప్రారంభింపబడినది. శ్రీమతి సుగుణమణి ("ఆంధ్ర మహిళ" మాజీ సహాయ సంపాదకురాలు) ఈ కేంద్రానికి ప్రారంభోత్సవంచేస్తూ, గాంధీ అడుగుజాడల్లో సేవాకార్య క్రమం నిర్వహించాలని గ్రామస్తులను హెచ్చరించారు. ఈ కేంద్రంవలన పొందగలిగిన లాభాన్ని గ్రామస్థులు పూర్తిగా వినియోగించుకోవాలని ఉద్బోధించారు.

శ్రీమతి పి. శకుంతలమ్మ నారాయణరెడ్డి అధ్యక్షత వహించిననాటి సమావేశంలో శ్రీ ఆర్. ఎన్. రెడ్డిగారు ఉపన్యసిస్తూ, గ్రామస్థులు సర్వోదయ సిద్ధాంతాలను అలవరచుకోవాలనీ. దేశం అభివృద్ధికోసమై శ్రమపడ వలసి ఉంటుందనీ. దేశం సంక్షేమ రాజ్యంగా మారే టందుకు కృషి చేయవలసివుంటుందనీ హెచ్చరించారు. కేంద్ర స్థాపనకు భవనము నిచ్చిన శ్రీ వీరారెడ్డిగారిని ప్రశంసించారు. జిల్లా కన్వీనరు శ్రీమతి ఎన్. సరళారెడ్డి, రాజం కృష్ణస్వామి మొదలైన పెద్దలు నాటి సమావేశంలో పాల్గొన్నారు. సమావేశానంతరం పిల్లలకు మిఠాయి, సేవాసమాజంవారిచే పాలు పంచి పెట్టబడినవి.

## అనంతపురం జిల్లా :

ఫిబ్రవరి 20 వ తేదీన గుత్తి తాలూకా "పెద్ద వడుగూరు" గ్రామంలో మాతాశిశుసంరక్షణాలయము ప్రజల ఉత్సాహ సంరంభముల మధ్యను జిల్లా కలెక్టరు శ్రీ కె. కొండలరావుగారిచే ప్రారంభోత్సవము జరుప బడినది. నాటి సమావేశంలో జిల్లా మెడికల్ ఆఫీసరు, లేడి డాక్టరు, జిల్లా అగ్రికల్చరల్ ఆఫీసరు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, జిల్లా వెల్ఫేర్ ఆఫీసరు. జిల్లా ప్లానింగు ఆఫీసరు, ప్లానింగు అసిస్టెంటు యింజనీరు, రెడ్‌క్రాస్ ప్రముఖులు, జిల్లా కమిటీ సభ్యులు అత్యంత ఉత్సాహంతో పాల్గొన్నారు.

గ్రామస్థుల తరఫున శ్రీరామరెడ్డిగారు సంక్షేమ కార్య కర్తలకు సభికులకు స్వాగతవచనాలు పలికారు. సభకు అధ్యక్షత వహించిన శ్రీ కొండలరావుగారు ప్రభుత్వం తలపెట్టిన వివిధ కార్యక్రమములతో ప్రజలు సహకరించి మేలు పొందవలెనని హెచ్చరించారు. జిల్లా పంచాయతీ ఆఫీసరు, మిసెస్ నాయక్, మెడికల్ ఆఫీసరు, అగ్రికల్చరల్ ఆఫీసరు, ప్లానింగు ఆఫీసరు, అసిస్టెంటు యింజనీరు మున్నగు పెద్దలు గ్రామస్థులకు ఈ సంక్షేమ కార్యక్రమములవలన చేకూరగల మేళ్ళను గురించి హెచ్చరించారు. గ్రామంలోని హెడ్మాష్టరుగారు, శ్రీ ముత్యాలరెడ్డి, వి సత్యనారాయణగార్లుకూడ ప్రసం గించారు.

ప్రారంభోత్సవం తరువాత జిల్లా కన్వీనరు శ్రీమతి కొండలరావు హరిజనవాడ సందర్శించి గృహాలు పరిశుభ్రంగా వుంచుకోవాలని హెచ్చరిస్తూ బీదహరిజనులకు చీరలు, చొక్కాలు, మొదలగునవి పంచి యిచ్చారు.

గ్రామస్థులు యీ కేంద్ర స్థాపనకై రూ. 1,200 లు విరాళమిచ్చారు.

ప్రారంభోత్సవం జరుగుతున్న సమయములోనే మంత్రసాని ఒకపురిటి కేసుకై వెళ్ళవలసివచ్చినది. ఈ కేంద్ర స్థాపనకు యిది శుభసూచకంకదూ!

మార్చి 7వ తేదీన 'ఎర్రతిమ్మరాజు చెర్వు' గ్రామంలో శ్రీ జిల్లా కలెక్టరు శ్రీ కె. కొండలరావుగారు మరొక మాతా శిశుసంరక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

కేంద్ర ప్రారంభోత్సవానికి ముందు జిల్లా కలెక్టరు, ఇతర ఉద్యోగస్థులు, సంక్షేమ కార్యకర్తలు హరిజన వాడను సందర్శించి పరిశుభ్రముగా వుంచబడినగృహాలకు, ఆరోగ్యమైనపిల్లలకు బహుమతు లిచ్చారు. ఆటలపోటీలు కూడ జరుపబడి బహుమతులీయబడినవి. స్నానములు చేయించి పిల్లలకు స్త్రీలకు జుట్టు దువ్వుకోవలసిన ఆవశ్య కత బోధింపబడినది. హరిజనులు గృహములు పరిశుభ్ర ముగా వుంచుకోవలెనని జిల్లాకలెక్టరుగారు హెచ్చరించారు.

తర్వాత సంక్షేమకేంద్రం ప్రారంభోత్సవం చేస్తూ శ్రీ కొండలరావుగారు గ్రామీణులు స్వయంకృషితో పొందదగు మేళ్ళను గురించి వివరించారు. జిల్లాప్రాజెక్టు కమిటీ జిల్లాలో 7 కేంద్రాలను ప్రారంభించి 6 నెలలలో చేసిన సేవను శ్లాఘించారు.

శ్రీరామాచార్యులు, జిల్లా హెల్తు ఆఫీసరు, ప్లానింగు ఆఫీసరు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, మిసెస్. నాయక్,

(తరువాయి 14-వ పేజీలో)

# ఆంధ్ర దేశంలో
# వివిధ సంక్షేమ సంస్థల కార్యకలాపాలు

## నన్నయభట్టారక గ్రంథాలయ పీఠము, తణుకు - ప. గో. జిల్లా.

బాలబాలికల ఉపయోగార్థమై పుస్తక భాండాగారము ప్రారంభించిన నాటినుండి సంఘ సంక్షేమ కార్యక్రమములు చక్కగా నెరవేరు తున్నవి. పిల్లలు పుస్తకాలను, పటములను పఠిస్తూ విజ్ఞానాన్ని పొందుతున్నారు. కేంద్ర సంఘసంక్షేమసంస్థ యిచ్చే ధనముతో ప్రారంభించబోయే వైజ్ఞానిక కార్యక్రమముల కోసమై ఆతురతతో ఎదురుచూస్తున్నారు. రేడియోద్వారాను, నాటికల ప్రదర్శన ద్వారాను వారిలోని అంతశ్శక్తులను పైకి తీసుకురావటానికి ప్రయత్నాలు జరుగు తున్నవి.

ఈసంవత్సరము మా సంస్థను ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, శ్రీ వి. ఎస్. రాజు, ఉపనిషత్ స్వామి, టి. సత్యనారాయణమూర్తి, కె. పుల్లయ్య, నల్లా రెడ్డినాయుడు, కొమ్మారెడ్డి సూర్యనారాయణ, కె. సుబ్రహ్మణ్యం. గణపతిశాస్త్రి, పేరి సూర్యనారాయణ శాస్త్రి, శతావధాని, సిహెచ్. పి. శాస్త్రి, డి. కృష్ణారావు, ఉగ్రశ్రీ. పి.ఆర్.జి. పాల్, వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి, జగద్గురు శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామి, శ్రీ సిద్ధేశ్వర పీఠాధిపతి. వి. రామశాస్త్రి మొదలైన పెద్దలు సందర్శించి సంస్థ కార్యాచరణను ప్రస్తుతించారు.

పిల్లల వైజ్ఞానిక అభివృద్ధిని మెచ్చుకుంటూ ఆస్థానకవి వ్యాస రచనలోను, వాగ్ధాటిలోను, పద్య పఠనలోను, పిల్లలకు బహుమతులు పంచారు. బాలానందం పిల్లలు చేసిన నృత్యాలు అందరినీ ఆనంద పరచినవి. పిల్లలకు విజ్ఞానదాయకమైన సినిమా చూపించబడినది.

ఈవిధంగా వివిధ ముఖ్య విషయాలలో బహుముఖమైన వైజ్ఞానిక కార్యక్రమాలు జరుపుతున్నా, ఇంతవరకూ మాకు ఆటస్థలం లేకపోవటం చాలా లోటుగా వున్నది. కేంద్ర సంఘసంక్షేమ సంస్థ మాకు యిచ్చిన ప్రోత్సాహానికి పిల్లలు, మేము కృతజ్ఞత తెలియజేస్తూ. ఈ సహాయాన్ని ఇకముందుకూడా ఎంతో అధికంగా అందజేయవలెనని ప్రార్థిస్తున్నాము.

పి. వి. రమణారావు.
కార్యదర్శి

## విద్యావనము - పామర్రు- కృష్ణా జిల్లా.

శ్రీ జనాభ్యుదయశాఖ 4—7—54 నుండి నవారు నేయుటతో ప్రారంభమై, నెమ్మదిగా చరఖాలు, కుర్చీలు, మంచములు, మగ్గములు, కుట్లు, అల్లిక, ఎంబ్రాయిడరీ మొదలైన వృత్తి విద్యలను ప్రవేశపెట్టుచున్నది.

ముప్పది నాలుగు మంది బాలికలు, కొంతమంది స్త్రీలు చుట్టుప్రక్కల గ్రామములనుండి యిచ్చటి చేతిపనులు నేర్పు ఉపాధ్యాయినివద్ద విద్య నేర్చుకొనుటకై వచ్చుచున్నారు.

శ్రీ జనాభ్యుదయ శాఖతోపాటు, పిల్లల శాఖకూడ 4—10—54 నుండి పనిచేయుచున్నది.

శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావు
అధ్యక్షుడు.

---

(13-వ పేజీ తరువాయి)

శ్రీమతి కొండలరావు మున్నగు పెద్దలు ఉపన్యసించారు.

గ్రామ పంచాయతీబోర్డు అధ్యక్షులు శ్రీవెంకట్రామయ్యా చెట్టిగారు ప్రభుత్వానికి కృతజ్ఞత తెలియజేస్తూ, గ్రామానికి రోడ్డు సౌకర్యం, పాఠశాల, మంచినీటి బావి కావాలని విన్నవించారు. సగం ఖర్చు గ్రామవాసులు భరిస్తామన్నారు. కలెక్టరుగారు తప్పక వారికోరికను ప్రభుత్వం ఆలోచించగలదని తెలియజేశారు. సభ దిగ్విజయముగా ముగిసినది.

# సంక్షేమ విస్తరణలో ముందుటడుగులు

గ్రామప్రముఖులు పాల్గొన్నారు. సేవాసమాజమువారు పిల్లలకు పాలుపంచిపెట్టారు.

కడప తాలూకా "మాచనూరు" గ్రామంలో మార్చి 30 వ తేదీన మరొక మాతా శిశుసంరక్షణాలయం ప్రారంభింపబడినది. శ్రీమతి సుగుణమణి ("ఆంధ్ర మహిళ" మాజీ సహాయ సంపాదకురాలు) ఈ కేంద్రానికి ప్రారంభోత్సవంచేస్తూ, గాంధీ అడుగుజాడల్లో సేవాకార్యక్రమం నిర్వహించాలని గ్రామస్తులను హెచ్చరించారు. ఈ కేంద్రంవలన పొందగలిగిన లాభాన్ని గ్రామస్థులు పూర్తిగా వినియోగించుకోవాలని ఉద్బోధించారు.

శ్రీమతి పి. శకుంతలమ్మ నారాయణరెడ్డి అధ్యక్షత వహించిననాటి సమావేశంలో శ్రీ ఆర్. ఎన్. రెడ్డిగారు ఉపన్యసిస్తూ, గ్రామస్థులు సర్వోదయ సిద్ధాంతాలను అలవరచుకోవాలనీ. దేశం అభివృద్ధికోసమై శ్రమపడవలసి ఉంటుందనీ. దేశం సంక్షేమ రాజ్యంగా మారేటందుకు కృషి చేయవలసివుంటుందనీ హెచ్చరించారు. కేంద్ర స్థాపనకు భవనము నిచ్చిన శ్రీ వీరారెడ్డిగారిని ప్రశంసించారు. జిల్లా కన్వీనరు శ్రీమతి ఎన్. సరళారెడ్డి, రాజం కృష్ణస్వామి మొదలైన పెద్దలు నాటి సమావేశంలో పాల్గొన్నారు. సమావేశానంతరం పిల్లలకు మిఠాయి, సేవాసమాజంవారిచే పాలు పంచి పెట్టబడినవి.

## అనంతపురం జిల్లా :

ఫిబ్రవరి 20 వ తేదీన గుత్తి తాలూకా "పెద్ద వడుగూరు" గ్రామంలో మాతాశిశుసంరక్షణాలయము ప్రజల ఉత్సాహ సంరంభముల మధ్యను జిల్లా కలెక్టరు శ్రీ కె. కొండలరావుగారిచే ప్రారంభోత్సవము జరుపబడినది. నాటి సమావేశంలో జిల్లా మెడికల్ ఆఫీసరు, లేడి డాక్టరు, జిల్లా అగ్రికల్చరల్ ఆఫీసరు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, జిల్లా వెల్ఫేర్ ఆఫీసరు, జిల్లా ప్లానింగు ఆఫీసరు, ప్లానింగు అసిస్టెంటు యింజనీరు, రెడ్‌క్రాస్ ప్రముఖులు, జిల్లా కమిటీ సభ్యులు అత్యంత ఉత్సాహంతో పాల్గొన్నారు.

గ్రామస్థుల తరఫున శ్రీరామరెడ్డిగారు సంక్షేమ కార్యకర్తలకు సభికులకు స్వాగతవచనాలు పలికారు. సభకు అధ్యక్షత వహించిన శ్రీ కొండలరావుగారు ప్రభుత్వం తలపెట్టిన వివిధ కార్యక్రమములతో ప్రజలు సహకరించి మేలు పొందవలెనని హెచ్చరించారు. జిల్లా పంచాయతీ ఆఫీసరు, మిసెస్ నాయక్, మెడికల్ ఆఫీసరు, అగ్రికల్చరల్ ఆఫీసరు, ప్లానింగు ఆఫీసరు, అసిస్టెంటు యింజినీరు మున్నగు పెద్దలు గ్రామస్థులకు ఈ సంక్షేమ కార్యక్రమములవలన చేకూరగల మేళ్ళను గురించి హెచ్చరించారు. గ్రామంలోని హెడ్మాష్టరుగారు, శ్రీ ముత్యాలరెడ్డి, వి సత్యనారాయణగార్లుకూడ ప్రసంగించారు.

ప్రారంభోత్సవం తరువాత జిల్లా కన్వీనరు శ్రీమతి కొండలరావు హరిజనవాడ సందర్శించి గృహాలు పరిశుభ్రంగా వుంచుకోవాలని హెచ్చరిస్తూ బీదహరిజనులకు చీరలు, చొక్కాలు, మొదలగునవి పంచి యిచ్చారు.

గ్రామస్థులు యీ కేంద్ర స్థాపనకై రూ. 1,200 లు విరాళమిచ్చారు.

ప్రారంభోత్సవం జరుగుతున్న సమయములోనే మంత్రసాని ఒకపురిటి కేసుకై వెళ్ళవలసివచ్చినది. ఈ కేంద్ర స్థాపనకు యిది శుభసూచకంకదూ !

మార్చి 7వ తేదీన 'ఎర్రతిమ్మరాజు చెర్వు' గ్రామంలో శ్రీ జిల్లా కలెక్టరు శ్రీ కె. కొండలరావుగారు మరొక మాతా శిశుసంరక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

కేంద్ర ప్రారంభోత్సవానికి ముందు జిల్లా కలెక్టరు, ఇతర ఉద్యోగస్థులు, సంక్షేమ కార్యకర్తలు హరిజనవాడను సందర్శించి పరిశుభ్రముగా వుంచబడినగృహాలకు, ఆరోగ్యమైనపిల్లలకు బహుమతు లిచ్చారు. ఆటలపోటీలు కూడ జరుపబడి బహుమతులీయబడినవి. స్నానములు చేయించి పిల్లలకు స్త్రీలకు జుట్టు దువ్వుకోవలసిన ఆవశ్యకత బోధింపబడినది. హరిజనులు గృహములు పరిశుభ్రముగా వుంచుకోవలెనని జిల్లాకలెక్టరుగారు హెచ్చరించారు.

తర్వాత సంక్షేమకేంద్రం ప్రారంభోత్సవం చేస్తూ శ్రీ కొండలరావుగారు గ్రామీణులు స్వయంకృషితో పొందదగు మేళ్ళను గురించి వివరించారు. జిల్లాప్రాజెక్టు కమిటీ జిల్లాలో 7 కేంద్రాలను ప్రారంభించి 6 నెలలలో చేసిన సేవను శ్లాఘించారు.

శ్రీరామాచార్యులు, జిల్లా హెల్తు ఆఫీసరు, ప్లానింగు ఆఫీసరు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, మిసెస్. నాయక్,

(తరువాయి 14-వ పేజీలో)

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME

REPORT FOR MARCH '55

### OUT - PATIENT DEPARTMENT:

| | |
|---|---|
| Surgical cases | 89 |
| Medical cases | 811 |
| Gynaecological cases | 98 |
| E. E. N. T. | 49 |
| Ante - Natal | 213 |
| Post - Natal | 63 |
| Total No. of New Patients | 1323 |
| Total No. of Old Patients | 1587 |
| Total No. of New & Old Patients | 2910 |

### ADMISSION REGISTER:

| | |
|---|---|
| No. of Patients admitted for delivery | 67 |
| No. of Babies admitted | 69 |
| No. of Ante - Natal cases treated | 13 |
| No. of Abnormal deliveries | 5 |
| No. of Medical cases treated | 13 |
| No. of Abortions | 8 |
| No. of Gynaecological cases | 1 |
| Total No. of Patients admitted | 171 |

### IN - PATIENT MATERNITY REGISTER:

| | |
|---|---|
| No. of Patients Delivered | 66 |
| Normal deliveries | 61 |
| Abnormal deliveries | 5 |

# గొప్ప ఇంటి బిడ్డ

శ్రీమతి. ఆ. జయప్రదాదేవి

"ఓడలు బళ్ళవుతాయి, బళ్ళు ఓడలవుతాయి" అన్న సామెతలో మొదటి సగాన్ని సరిగ్గా పూర్తి చేశాడు బేనీ మాధవసింహుడు. గౌరీపుర జమీందారైనప్పటికీ చాలా భాగం దానాలంటూ ఖర్చు పెట్టి చివరకు కాలమాన పరిస్థితులకులోనై సామాన్య కుటుంబ జీవితాన్ని గడపవలసి వచ్చింది. ఒకప్పుడు మహదైశ్వర్యాలతో తులదూగుతూ ఆ ఇల్లు ఎంతో కలకలలాడుతూ ఉండేది. గజ తురంగాలతో, దాసదాసీలతో అలరారే ఆ భవనం ముందు ఈ నాడు మామూలుగా ఒకానొక ముసలి గేదెను పోషించుకోవాల్సి వచ్చింది. విధికృతం. ఈ పరిస్థితుల్లో ఉన్నప్పటికీ పట్టుదలతో బి. ఏ చదివాడు ఆయన పెద్ద కుమారుడు శ్రీకంఠ సింహుడు. ఎక్కడో గుమాస్తాగిరి చేస్తూ నాలుగు రాళ్ళు సంపాదిస్తున్నాడు. రెండవ కుమారుడు లాల్ బిహారీ. చదువు అంతగా లేక పోయినప్పటికీ చక్కని శరీర సౌష్టవంతో, నియమ బద్ధమైన వ్యాయామ పరిశ్రమతో, కండలు తేలిన నిండు యవ్వనంతో చూచేవారికి వస్తాదురా అనిపించేటట్లున్నాడు. అయితే పెద్దవాడైన శ్రీకంఠ్ దీనికి సరిగ్గా వ్యతిరేకం. సన్నగా, బక్కపల్చని శరీరంతో తన అవయవ సౌష్టవమంతా బి. ఏ అనే రెండు అక్షరాలకే అంకితం చేశాడో అన్నట్లుగా ఉంటాడు. కాని అతనిలో ఉన్న సదాచారపరాయణత, బుధజనవిధేయత అతనికి ఆ ఊరి పెద్దలలో చక్కని గౌరవాన్ని సంపాదించిపెట్టాయి. అతనికి వైద్యశాస్త్రము నందు ఆసక్తి మెండు. బహుశా దానికికూడా అతని శారీరక దౌర్బల్యమేనేమో కారణం.

శ్రీకంఠుని భార్య ఆనంది. ఆమె ఒకచిన్న జమిందారీ కుటుంబములో జన్మించింది. ఆమె తండ్రి భూపసింహుడు. మంచి హోదాతోనూ, దర్జాగాను జీవితం గడిపేవాడు. భూపసింహునికి ఏడుగురూ కుమార్తెలే కావటం చొప్పున పెద్దవారి ముగ్గురికీ అట్టహాసంతో శక్తికి మించిన ఖర్చుపెట్టి వివాహాలు చేశాడు. ఆనంది అందగత్తె. చురుకైనపిల్ల. "సౌందర్యం సర్వాకర్షణీయం" అన్నట్లు ఆమె సౌందర్యం తల్లిదండ్రులను కూడా ఎక్కువగా ఆకర్షిస్తూ ఉండేది. కాని పాపం తండ్రి దగ్గరసొమ్ము తగ్గిపోయింది. ఆమె వివాహ విషయమై ఆలోచిస్తున్న రోజుల్లో శ్రీకంఠుడు ఒకానొక చందా విషయమై భూపసింహుని దగ్గరకు వెళ్ళటం తటస్థించింది. శ్రీకంఠుని గుణగణాలు చూచి ముగ్ధుడై తన కుమార్తె ఆనందినిచ్చి వివాహం చేశాడు.

అష్టైశ్వర్యాలు అనుభవిస్తున్న ఆనంది ఒక్కసారిగా ఏ ఆడంబరాలు, ఏ అట్టహాసాలు లేని ఇంటికి రావలసి వచ్చింది. పసితనంనుండి అలవాటు పడిన పట్టు స్లిప్పర్లు సైతం విడనాడవలసి వచ్చింది. తోటల్లోకి షికార్లు వెళ్ళటం కుక్కపిల్లలతో ఆటలాడటం అనే విషయాలు ఆమె మరచిపోవలసి వచ్చింది. భారత నారికి తన అత్తవారింటి ఆచారాలకు అనుగుణ్యంగా ప్రవర్తించుకోగలగటమే వైవాహిక జీవితానికి మొదటి పరీక్ష. అన్ని గుణాలూ అమరియున్న ఆనంది తాను అలాంటి విలాసాలను ఎన్నడూ చూచికూడా ఎరుగనట్లు మారిపోయింది.

ఆరోజు చాలా ప్రొద్దెక్కింది. భోజనాలు కాలేదు. మరదిగారి కొరకు వేచిఉంది ఆనంది. అప్పుడు రెండు పిట్టలను చేత్తో పట్టుకుని లాల్ బిహారీ వచ్చి "వదినా, వీటిని కూరచెయ్యవమ్మా" అని అందించాడు. సరేనని ఆనంది వంట ప్రారం

భించింది. తీరాచూస్తే నెయ్యి పావుశేరు మాత్రమే ఉంది. గొప్పఇంటి బిడ్డ, పాపం, పొదుపు ఏమి తెలుస్తుంది ? ఉన్న నెయ్యంతా పోసి చక్కగా కూర వండింది. ప్రొద్దు తిరిగి పోయింది. అప్పుడు భోజనానికి కూర్చున్నాడు లాల్ బిహారీ.

"ఏవమ్మా! పప్పులో నెయ్యి వడ్డించ లేదేం ?" అని అడిగాడు.

"పావుశేరు మాత్రమే ఉంటే కూరలో వేశాను" అంది ఆనంది

"ఎండిన కట్టెలకు, కాలే కడుపుకు మంటెక్కు" వని మనవాడికి కోపం వచ్చేసింది. వదిన గారిది కేవలం నిర్లక్ష్యం అనుకున్నాడు.

"ఓహో, పుట్టింట్లో నేతికాలువలు ప్రవహిస్తున్నాయి కాబోలు" నని వ్యంగ్యం చేశాడు కోపం కొద్దీ.

స్త్రీ దేనినైనా సహిస్తుంది గాని, పుట్టింటి వారి నిందకుమాత్రం సహించలేదు.

"ఏనుగు చచ్చినా నెయ్యి రూపాయలే" మాఇంట్లో ఇంత నెయ్యి నౌకరు చాకర్లకే ఖర్చౌతోంది" అన్నది. దాంతో బిహారీ మండి పడ్డాడు. పళ్లెం ఎత్తి పడేశాడు.

కోపోద్రేకంతో "నాలుక చీల్చివేయాలి" అన్నాడు.

ఈ అవమానంతో ఆనంది కూడా కుపితురాలైంది. స్త్రీ సహజమైన అభిమానంతో "వారున్నట్లయితే దీనికి బాగా సమాధానం చెప్పేవారు" అంది.

విద్యాగంధం లేని పల్లెటూరిమనిషి. వెనుకా ముందు ఆలోచించలేని నవయవ్వనంలోని దుడుకుతనంతో కాలి నున్న ఖడావు తీసి వదిన గారిమీద విసరివేశాడు "గర్వంతో కళ్ళు మూసుకుపోయాయి" అంటూను. సమయానికి ఆనంది దాన్ని చెయ్యి అడ్డం పెట్టుకుని ఆపక పోతే తల పగిలిపోవలసింది. చేతికి మాత్రం గట్టిదెబ్బ తగిలింది. క్రోధావేశంతో ఆనంది చకచకా తన గదిలోకి వెళ్ళిపోయింది. స్త్రీ యొక్క అంతస్తు భర్త గౌరవ మర్యాదలమీదనే ఆధారపడి ఉంటుంది.

సాధారణంగా శ్రీకంఠ్ శనివారమే ఇంటికి వస్తూఉంటాడు. బృహస్పతివారం ఈ సంఘటన జరిగింది. ఆనంది ఆరోజు నుండి పచ్చి గంగైనా ముట్టకుండా తనగదిలోనే బైఠాయించింది. శ్రీకంఠ్ వస్తాడనగానే ఆఊరి పెద్దలు అతనితో పిచ్చాపాటి మాట్లాడటానికి తయారవుతారు. సరే వాకిట్లో వారందరితో కాసేపు కాలక్షేపం చేసి భోజనం వేళకు లోపలకు వచ్చి విస్తళ్లముందు కూర్చున్నారు తండ్రీబిడ్డలు ముగ్గురూ. అప్పుడు లాల్ బిహారీ "అన్నయ్యా ! కాస్త యింట్లో సంభాళించు. లేకపోతే ఎప్పటికైనా అనర్థకమే" అన్నాడు. ఇదే అదననుకుని "ఇంటి కోడళ్ళకు మగవారితో తగవులాడటం అంత మంచిపని కాదునాయనా" అని సాక్ష్యం పలికాడు బేనీమాధవసింహుడు. శ్రీకంఠు విచారాన్ని వెలిబుచ్చుతూ "అసలు విషయం ఏమిటి ?"అని అడిగాడు. లాల్ బిహారీ ఆక్రోశం కొద్దీ "తను గొప్పఇంటి బిడ్డయితే, మనమేమీ చాకలి మంగళ్ళముకాము. పుట్టింటివారిముందు మనం ఆమెకు కన్పించటమే లేదు" అన్నాడు.

భోజనాలు పూర్తి అవగానే శ్రీకంఠు ఆనంది దగ్గరకు వెళ్ళాడు. ఆమె ఎంతో బాధగా కూర్చునిఉంది. ఆ వేదన కొద్దీ ఆనంది "సంతోషంగా ఉంటా" అని అడిగింది.

"చాలా సంతోషంగాఉంది. ఏమిటి నీవిలా అర్థంలేని గడబిడ చేసిపెట్టావ్" అన్నాడు శ్రీకంఠు.

ఈ మాటతో ఆనంది మండిపడింది. "ఈ విషయాన్ని రగుల్కొల్పినవాడు దొరికితే..."

"ఎందుకింత ఆవేశపడుతున్నావ్? అసలు విషయం ఏమిటో చెప్పరాదూ?" అని అడిగాడు.

"ఏం చెప్పను? ఇదంతా నా దురదృష్టం. లేకపోతే ఒక పల్లెటూరివెధవ నన్ను ఖడావుతో కొట్టగలడా" అని బాధపడింది ఆనంది.

"అబ్బ సరిగ్గా చెప్పవమ్మా, నాకేమీ అర్థం కావటం లేదు" అన్నాడు శ్రీకంఠు.

మొన్న మీ గారాబు తమ్ముడు కూర చెయ్యమని చెప్పాడు. సరే చేద్దాముకదా అంటే నెయ్యి తక్కువగా ఉంది. ఆ నెయ్యివేసి కూర చేశాను. భోజనందగ్గర కూర్చుని పప్పులో నెయ్యి వడ్డించలేదేమీ అంటూ దానిమీద మా పుట్టింటివారిని ఎత్తిపొడవటం మొదలు పెట్టాడు. దాంతో నేను సహించలేకపోయాను. "ఈమాత్రం నెయ్యి మా పుట్టింట్లో నౌకరు ముండాకొడుకులు త్రాగుతారు" అన్నాను.. దానికి ఆ మూర్ఖుడు ఖడావు నాపైకి విసిరాడు చేత్తో ఆపుకోకపోతే తల పగిలిపోయేది. ఇందులో ఏమైనా అబద్ధముందేమో అతన్నే అడగండి అని జరిగినదంతా పూర్తిగా చెప్పింది ఆనంది.

ఈ మాటలతో శాంత స్వభావుడైన శ్రీకంఠునకు కూడా కోపం వచ్చింది. "ఇంతదాకా అయిందా! వీడికింత సాహసమా" అంటూ కళ్ళెర్రచేశాడు. దీనికితోడు సహజసిద్ధమైన స్త్రీ స్వభావంతో ఆనంది ఏడ్చింది. స్త్రీ అశ్రుబిందువులు పురుషుని క్రోధాగ్నికి అర్ఘ్యం మాదిరిగా తోడ్పడతాయి. ఆరాత్రంతా కోపోద్రేకంతో శ్రీకంఠుకు నిద్రకూడా సరిగ్గా పట్టలేదు. ప్రొద్దున్నే లేచి తండ్రి దగ్గరకు వెళ్ళి "నాన్న గారూ, ఇంక ఈ ఇంట్లో నేనుండలేను" అన్నాడు.

ఎన్నోసార్లు ఎంతో మందికి అనేక క్లిష్ట పరిస్థితులలో ఎంతో నేర్పుగా వారివారి తగవులను తీర్చిన శ్రీకంఠుడు ఈనాడు ఈ విధంగా తానే అనటం చాలా ఆశ్చర్యకరం. ఎంతో సహనశీలుడనుకున్న శ్రీకంఠ సింహునికి కూడా ఇతరులకు చెప్పినంత సులువుగా తన విషయంలో నిర్వహించుకోలేకపోయాడు. ఇది మానవ సహజమేకాబోలు.

తండ్రి గాభరాపడుతూ "ఎందువల్ల నాయనా" అని అడిగాడు.

"ఇక్కడ నా మానమర్యాదలేమీ నిలచేటట్లు లేవు. రానురాను అన్యాయము, పట్టుదల ఎక్కువగుచున్నవి. గౌరవించవలసిన వారి నెత్తి మీదే ఎక్కి కూర్చుంటున్నారు. నాకు ఇతరుల దగ్గర నౌకరీ చేసుకోకతప్పదు. ఇంట్లో ఉండే మనిషినా కాదు. ఆడవాళ్ళను అవమానం చేస్తూఉంటే ఎలాగ సహించటం? ఏదో మాటా మాటా కాకుండా చివరకు చెప్పుదెబ్బలతోనా చెలగాటం!" అని తీవ్రంగా మాట్లాడాడు శ్రీకంఠు.

దానికి నిరుత్తరుడైనాడు బేనీమాధవ సింహుడు. ఎప్పుడూ తండ్రిని ఎంతో గౌరవించే కుమారుడు ఇలా మాట్లాడటం ఆయన్ని కలవరపరచింది. ఎలాగో చివరకు బలవంతాన "నాయనా, నీవు బుద్ధిమంతుడవు. అయినా స్త్రీలు ఇలాగే సర్వనాశనం చేస్తూఉంటారు. వాళ్ళను నెత్తికెక్కించుకోవటం మంచిపని కాదు" అని అనగలిగాడు.

"అదంతా నేనెరుగుదును. మీ ఆశీర్వాద ఫలితంగా నేను మూర్ఖుడను గాను. ఈ ఊళ్ళో ఎంతోమంది మధ్యతీర్పు చెప్పి సామరస్యం కుదర్చగలిగాను. కాని ఈ విషయం అలాంటిది కాదు. ధర్మబద్ధంగా ఆమె బాధ్యతను వహించ

వలసినవాడ్నైయుండి ఆమెతో ఈ అసభ్య ప్రవర్తనను సహించటం కష్టం. ఇది నాకు తక్కువ అవమానంకాదు లాల్‌బిహారీని క్షమించడానికి”

ఈమాటలు బేనీసింహునికి చాలా కష్టం కలిగించాయి. “లాల్‌బీహారీ నీ తమ్ముడు. అతను ఏదైనా తప్పులు చేస్తే దండించు. కాని” అని అంటూఉండగానే శ్రీకంఠు “అతడు నా సోదరుడని భావించటంలేదు” అని అన్నాడు.

“స్త్రీ తరఫుగానా ”

“కాదు, వాడి క్రూరత్వం, అవివేకమే దీనికి కారణం.”

ఈవిధంగా ఇద్దరూ కుపితులైనారు. కాని ఠాకూర్ సాహెబు తన కుమారుణ్ణి శాంత పరచాలనుకున్నాడు. తాను మాత్రం తన చిన్నకుమారుడు అనుచిత కార్యాన్ని చేశాడని ఒప్పుకోవటమూ ఇష్టంలేదు. ఈ సమయంలోనే కొంతమంది పెద్దలు నీరు, నిప్పు అంటూ వంకలు పెట్టుకుని తయారయ్యారు. కొంతమంది స్త్రీలు, శ్రీకంఠుని భార్యను వెనకవేసుకుని తండ్రితో పోట్లాడుతున్నాడని చాలా సంతోషించారు. ఊరి పెద్దల్లో, ఈ కుటుంబ అన్యోన్యతను చూచి ఈర్ష్య పడేవారుకూడా ఉన్నారు. “శ్రీకంఠు చదువుకున్నాడన్న మాటేగాని, ఒట్టి దద్దమ్మ” అనీ, “మాధవసింహుడు ఒట్టి అమాయకుడు. కొడుకు చేతిలోని కీలుబొమ్మ” అని అనుకుంటూ ఉండేవారు. ఈ మహానుభావుల కోరికలన్నీ ఈరోజు ఫలించేలాగు కన్పించాయి. హుక్కా త్రాగడానికనీ, శిస్తుకేదులు చూపడానికనీ వంకలు పెట్టుకొని వచ్చి కూర్చున్నాడు. అనుభవజ్ఞుడైన బేనీమాధవసింహుడు ఇదంతా కనిపెట్టగలిగాడు. ఏమైనాగాని ఈ దౌర్భాగ్యుల కోరికలు ఫలించే అవకాశం మాత్రం ఇవ్వకూడదనుకున్నాడు. నెమ్మదిగా “నాయనా, నేను నీకు వ్యతిరేకుణ్ని ఎప్పుడూ కాదు. నీవు ఎలా చెయ్యాలంటే అలా చెయ్యి. కుర్రవాడిదే తప్పు” అని కొడుకుతో అన్నాడు.

ఎంత చదువుకున్నా, ఎన్ని డిగ్రీలు పొందినా అనుభవంతుని మాటలను అర్థంచేసుకోలేక పోయాడు. డిబైటింగు సొసైటీలో నాదే పై చెయ్యి అని వాదించటానికి అలవాటుపడ్డ శ్రీకంఠు తండ్రి మాటలను సరిగా అర్థంచేసుకోలేకపోయాడు. “నేను లాల్‌బిహారీతో కలసి ఈ ఇంట్లో ఉండను” అన్నాడు.

“నాయినా, వివేకులు, అవివేకవంతుల మాటలను అట్టే పాటించరు. వాడు కేవలం అవివేకుడు. అతను చేసిన పొరపాటును పెద్దవాడవు గనుక నీవు క్షమించు” అన్నాడు ఠాకూర్ సాహెబు.

కాని శ్రీకంఠు “ఈ దుష్టత్వాన్ని మాత్రం నేను సహించలేను. వాడైనా ఉండాలి లేక నేనైనా ఉండాలి. మీకు వానియందు ప్రేమ ఉంటే అతన్నే ఉంచుకోండి. నాకు శెలవివ్వండి. నాదారిని నేను పోతాను. లేదా నన్ను మీ దగ్గర ఉంచుకోదలచుకుంటే వానిని వెళ్ళి పొమ్మని చెప్పండి. ఇక వాని మొఖం మాత్రం నేను చూడను. ఇది నా తుది నిర్ణయం” అని ఖచ్చితంగా చెప్పేశాడు శ్రీకంఠు.

అప్పటివరకూ ద్వారం దగ్గర నిలబడి లాల్‌బిహారీ ఈవిషయాలన్నీ వింటున్నాడు. అతడు అన్నగారిని ఎక్కువగా గౌరవిస్తాడు. ఎన్నడూ అతని ఎదురుగా కూర్చునైనా ఎరుగడు. తండ్రి కంటేకూడా అన్నగారంటేనే ఎక్కువ గౌరవం. శ్రీకంఠుకుకూడా తమ్ముడంటే చాలా ప్రేమ. అలహాబాదునుండి వచ్చేటప్పుడు, తమ్ముని కిష్టమైన వస్తువ ఏదో ఒకటి తెస్తాడు. క్రిందటి

సంవత్సరం నాగపంచమి రోజున జరిగిన వ్యాయామ ప్రదర్శనాలలో తమ్ముడు గెలిచి నప్పుడు సంతోషము పట్టలేక గోదాలోకే వెళ్ళి కౌగలించుకున్నాడు. అలాంటి అన్నగారి నోటినుండి ఇలాంటి కఠినమైన మాటలు విని బిహారీ చాల విచారపడ్డాడు. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. అన్నగారు వస్తారన్న క్రిందటి రోజునుండే "అన్న ఏమంటాడో, ఎలాగా ఆయన దగ్గరకు వెళ్ళటం'' అనే ఆలోచనలో పడ్డాడు. కాని నా తప్పైతే నన్ను పిలచి కోప్ప డతారు అనుకున్నాడు. దానికి ఇవ్వాళ విరుద్ధంగా జరిగింది. వాస్తవానికి బిహారీ మూర్ఖుడైనా అతని హృదయం మాత్రం చాలా పశ్చాత్తాపంతో బాధపడుతోంది. అన్నగారు నాలుగు దెబ్బలు కొట్టినా అతనంత బాధపడే వాడుకాడు. అన్నగారు "వీడి ముఖం చూడ ననటం'' అతన్ని కలచివేసింది. అతను ఏడుస్తూనే ఇట్లోంకి వచ్చాడు. ఎవ్వరూ ఏడుస్తున్నట్లు గుర్తించకుండా మొఖం తుడుచుకుని, బట్టలు వేసుకుని, సరాసరి వదినగారి గది గుమ్మం దగ్గర నిలబడి "వదినా, అన్నయ్య నాతో కలసి ఈ ఇంట్లో ఉండరు. ఆయన నా మొఖంకూడా చూడరు. అందుకని నేనే వెళ్ళి పోతున్నాను. ఆయనకు ఇక కన్పించను. నా తప్పులను క్షమించండి'' అని అంటుండగానే అతని గొంతుక దుఃఖంతో నిండిపోయింది.

సరిగ్గా అదేసమయంలో కోపోద్రేకంతో కళ్ళెర్రజేసుకుని శ్రీకంఠు లోపలకు వచ్చాడు. అక్కడ తమ్ముడు నిలబడి ఉండటం చూచి ఏవగింపుతో దూరంగా తొలగి లోపలకు వెళ్లాడు.

ఆనంది తన పోట్లాట విషయమైతే చెప్పింది గాని, తరువాత చాలా పశ్చాత్తాపపడింది. ఆమె స్వభావసిద్ధంగా చాలా దయార్ద్రహృదయురాలు. ఇంతదాకా వస్తుందని ఆమె అనుకోలేదు. "ఇంత కఠినమా" అని తన భర్తనే విసుక్కుంది. చివరకు తననుకూడా అలహాబాద్ తీసుకుపోతాడేమో, కుటుంబం విచ్ఛిన్నం అయిపోతుందిగదా అని భయపడింది. అదే సమయంలో మరది వచ్చి ద్వారంలో దీనంగా నిలబడి "నేను వెళ్ళుచున్నాను నాతప్పులను క్షమించ"మని అడగ్గానే ఆమె మనస్సు సాంతం కరగి నీరైపోయింది. ఆమె కళ్ళవెంట నీళ్లు కారటం మొదలుపెట్టాయి. మనోమాలిన్యాన్ని తుడిచివేయటానికి కన్నీళ్లు ఎంతతోడ్పడతాయి!

భర్తను చూచి "అబ్బాయి బైట నిలబడి ఏడుస్తున్నాడు."

"ఏం చెయ్యమంటావ్ ?"

"లోపలకు పిలవండి. నా తెలివి మండిపోను. నామూలంగా ఎంత రాద్ధాంతం జరిగింది."

"నేను పిలవను"

"తరువాత బాధపడతారు. అతను విచారంతో క్రుంగిపోతున్నాడు. మళ్ళా ఎక్కడికైనా వెళ్ళిపోతాడేమో."

అయినా శ్రీకంఠు లేవనేలేదు. లాల్ బిహారీ "వదినా ! అన్నయ్యకు నా నమస్కారాలని చెప్పు. ఆయన నన్ను చూడదల్చుకోలేదు. కాబట్టి నా మొఖం కూడా ఆయనకు చూపించలేను." అని చురుగ్గా వెళ్ళిపోతున్నాడు.

వెంటనే ఆనంది గదిలోనుండి బైటకు వచ్చి, మరది చెయ్యి పట్టుకుంది. లాల్ బిహారీ వెనక్కి తిరిగి చూచాడు. కళ్ళు అశ్రుపూరితాలవగా దీనంగా "నన్ను వెళ్ళనివ్వవమ్మా" అన్నాడు.

"ఎక్కడికి వెళతావ్ ?"

"ఎవ్వరికీ కనిపించని చోటుకు."

"నేను వెళ్ళనివ్వను."

"నేను మీతో కలిసియుండే యోగ్యుణ్ణి కాను"

"ఇక్కడనుండి ఒక్క అడుగు ముందుకు వేశారంటే, నామీద ఒట్టు," అంటూ ఆనంది అడ్డు తగిలింది.

"అన్నయ్య నన్ను క్షమించాడని తెలిసే వరకూ నేనిక్కడ ఉండలేను."

"నాయనా, ఈశ్వర సాక్షిగా చెబుతున్నాను నీమీద నాకేమీ కష్టం లేదు" అంది ఆనంది.

అప్పటికి శ్రీకంఠుని హృదయం కరిగింది. బయిటికి వచ్చి తమ్ముని కౌగిలించుకున్నాడు. అన్నదమ్ములిద్దరూ వెక్కి వెక్కి ఏడ్చుకున్నారు. లాల్ బిహారీ "అన్నయ్యా, మీ రేశిక్షవిధించినా భరించగలనుగాని, ఇకెప్పుడూ నీ మొఖం చూడవని మాత్రం అనకండి" అన్నాడు ఏడుస్తూ.

శ్రీకంఠు దుఃఖంతో నిండిన కంఠంతో "బాబూ, ఈ విషయాన్ని మరచిపో. ఇక నెప్పుడు ఇలాంటిది జరుగదు" అన్నాడు.

ఇంతలో బేనీమాధవసింహుడు బయటనుండి వచ్చాడు. కొడుకులిద్దరినీ చూచి సంతోషంతో పరవశమైపోయాడు.

"గొప్పయింటి బిడ్డలు క్లిష్ట పరిస్థితులలో చెడుతూ ఉన్నా దాన్ని సంభాళించుకుంటారు" అన్నాడు.

ఊళ్ళో ఈవార్త తెలిసి "గొప్పఇంటి బిడ్డలు ఇలాగే ఉంటారని" ఆనందిని పొగిడారు.

[ప్రేమచంద్ "బడేఘర్ కీ బేటీ" అను హిందీ కథకు స్వేచ్ఛానువాదము]. ★




# న్యాయతీర్పరి

శ్రీ సన్నాకుల సుందరరావు

పూర్వం క్రైస్తవ దేశాన్ని సాల్‌మన్ రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. అతడెంత సుందరుడో అంత మంచివాడు. అతని రాజ్యంలో ప్రజలంతా సుఖంగా జీవించేవారు. అపుడు దొంగలుండేవారుకాదు. తింటానికి తిండీ, కట్టడానికి బట్ట పుష్కలంగా ఉన్నపుడు దొంగతనా లెలాజరుగుతాయి? దొంగ లెలా ఉంటారు ? స్వయంగానే ఏమైనా నేరాలుంటే తీర్పు తీర్చేవారు. ఇతరుల రాజ్యంమీదికి అనవసరంగా దండెత్తేవారుకాదు. ఇతరులను తన రాజ్యం మీదికి రానిచ్చేవారూకాదు. పరిపాలనకు రాగానే మొట్టమొదటిగా విగ్రహారాధన ఎవరూ చెయ్యరాదని శాసించాడు. అందరూ ఒకేదేవుణ్ణి సేవించాలి. ఆయన "యెహోవా." (ఇది క్రైస్తవుల దేవుడి పేరు.) చుట్టుపక్కల రాజ్యాల రాజులంతా పరిపాలనా విషయంలో ఇతన్ని సలహాలడుగుతూయుండేవారు.

ప్రజలందరూ భగవంతుడిలా పూజించేవా రతన్ని. మా రాజుగారికి ఆయువును అధికంగా ఇయ్యమని ప్రతివారూ ప్రార్థించేవారు. ఎందరెందరో రాజులు అతనిలోని తప్పులు పట్టాలని చూచేవారు. కాని వాళ్ళు తలక్రిందులుగా తపస్సు చేసినా అతనిలో ఒక తప్పుకూడా కన్పించేదికాదు. ఇతని తండ్రికి, భగవంతుడు కలలో కన్పించి నీయొక్క కుమారునిచేత ఒక మందిరం కట్టించుకుంటానని ఇతడు పరిపాలనకు రాకముందు చెప్పాడు. ఆమాట మరువకుండా అతడు ఆలయం నిర్మించటానికి సంసిద్ధుడయ్యాడు. తానిలా ఆలయాన్ని నిర్మిస్తున్నానని. అందుకు రాజులందరు సహాయంచేయాలని ఆయా రాజ్యాల రాజుల్ని కోరాడు. అందుకు వారు కొంతమంది బంగారం, కొంతమంది వెండి. కొంతమంది 'టేకు' కొంతమంది కమ్మ కలప ఇలా ఎవరికి తోచిందివారు సహాయం చేశారు. మొత్తానికి ప్రపంచంలో ఎవరూ కట్టించలేనంతటి పెద్ద మందిరాన్ని రాజుగారు బంగారంతోనూ, వెండితోను, కలపతోను నిర్మించారు.

తెల్లవారి లేవగానే భగవంతుని స్తుతించేవాడు. ఆ తరువాత తన కార్యక్రమాలలోకి ప్రవేశించేవాడు. రాజుగారియొక్క భక్తికి భగవంతుడెంతో సంతోషించి అతన్ని అధికంగా ఆశీర్వదించేవాడు. అతడు మొదలుపెట్టిన పనల్లా విజయవంతం అయ్యేది. రాజు భక్తిగలవాడైనపుడు ప్రజలు మాత్రం ఎందుకు భక్తిగలవారుకారు? ఆరాజ్యంలో అంతా భక్తులే. అందువల్ల ఆ రాజ్యంలో ఎలాటి కష్టాలూ ఉండేవికావు.

అతనియొక్కకీర్తి దేశదేశాలా వ్యాపించింది. కొంతమంది రాజులు స్వయంగావచ్చి, ఇతనియొక్క పరిపాలనా విధానాన్ని చూసి, వేనోళ్ళ స్తుతిస్తూ వెళ్ళి తమ రాజ్యాన్ని కూడా అలాచెయ్యాలని తలచేవారు. ఎవరైనా క్రొత్తవారు తమరాజ్యంలోకివస్తే వారిని అందరూ ఆహ్వానించి ఆతిథ్యం ఇచ్చేవారు. ఆరాజ్యం వెళ్ళినవారంతా తాము వెళ్ళే ప్రదేశాలలో ఈరాజ్యాన్నిగూర్చి చెప్పేవారు.

# న్యాయ తీర్పరి

ఆరాజ్యానికి కొద్ది దూరంలో "షేబ" అనే రాజ్యం ఉండేది. ఆరాజ్యాన్ని ఒకరాణి పరిపాలిస్తూఉండేది. అతనియొక్క తెలివితేటలను స్వయంగాచూసి రావాలని ఆరాజ్యానికి బయలుదేరింది. వెళ్లేటప్పుడు చక్కటి కాన్కలు అతనికివ్వటానికి తీసుకువెళ్ళింది. రాజ్యం చేరగానే ఆమెకు ఘనమైన స్వాగతం ఇచ్చారు రాజూ ప్రజలూ ! ఆమె ఉండటానికి ప్రత్యేక భవనాన్ని ఏర్పరచి ఎలాటి లోటు లేకుండా చూశాడు రాజు. ఆ ప్రజలు ఆమె యెడల చూపుతూఉన్న గౌరవమర్యాదలకు రాణి ఎంతో ఆశ్చర్యం చెందింది. అబ్బ ! ప్రజలంటే వీళ్లేనని తలచింది. ప్రజలు రాజుగారియొక్క సేవ మనసారా చేస్తున్నందుకు సంతోషించింది.

ఇక, రాజుగారు వారానికొకసారి నేరాలన్నిటికి తీర్పు ఇస్తారు. గనుక అతని తీర్పును పరిశీలించాలని తలచింది రాణీ. వెంటనేరాణి అతని న్యాయస్థానానికి వెళ్ళింది. వెళ్ళగానే ఉచిత ఆసనాన్ని చూపించారు రాజుగారు. మంత్రులంతా ఆమెకు నమస్కరించారు. ఆవందనాలందుకుంటూ ఆసనాన్ని అలంకరించి ఆరోజు వచ్చిన నేరాలన్నీ వింటూఉంది రాణి. ఆరోజు బలే విచిత్రమైన నేరం వచ్చింది. ఇద్దరు స్త్రీలు న్యాయస్థానానికి వచ్చారు. అందులో మొదటి స్త్రీ ఇలా చెప్పింది. రాజా ! ఈస్త్రీ, నేనూ ఒకే ఇంట్లో ఉంటూ ఒకే రోజున ఇద్దరమూ మగపిల్లల్ని ప్రసవించాం. నిన్నరాత్రి ఇది నిద్రలో మంచంమీద ఇటు ప్రక్కగా ఒత్తిగిలి తన పిల్లవాడిమీద పడటంచేత పిల్లవాడు చనిపోయాడు. నేను నిద్రపోతూ ఉంటే నా పిల్లవాడిని తన పక్కలో వేసుకుని చనిపోయిన పిల్లవాడిని నాపక్కలో వేసిందని విన్నవించింది. రెండవస్త్రీ కూడా మొదటి స్త్రీ చెప్పినట్లుగానే నేరాన్ని చెప్పింది. రాజుగారి కేమిచెయ్యాలో తోచలేదు. "షేబ" రాణికూడా రాజుగారేమిచెప్తారోనని ఎదురు చూస్తూఉంది.

రాజుగారు క్షణకాలం యోచించి వారితో ఇలా అన్నారు. మీ నేరం తేలేటట్లులేదు. మీ యిద్దరికీ ఈ పిల్లవాణ్ణి కోసి చెరి ముక్కా ఇస్తానని అన్నారు. అందుకు మొదటిస్త్రీ రాజా అలా చెయ్యవద్దు. దానికే ఆ పిల్లవాణ్ణి ఇచ్చివెయ్యండి అని పార్థించింది. రెండవస్త్రీ మాత్రం అలాకాదు. రెండు ముక్కలుగా నరకాల్సిందేనని పట్టుబట్టింది. రాజుగారు పిల్లవాణ్ణి మొదటి స్త్రీకి అందించి రెండవస్త్రీని ఇరవై కొరడాదెబ్బలు కొట్టమని శాసించారు. రాణీగారికి ఇదేం అర్థంకాలేదు. మహారాజా ! ఆ స్త్రీయే దొంగ అని ఎలాతెలిసిం దని అడిగింది రాణి.

అందుకాయన నవ్వుతూ, ఏముంది ? రెండు ముక్కలుగా నరుకుతాననేసరికి కన్నకడుపు తరుక్కునిపోయి అలాచేయవద్దంది. తన పిల్లవాడు కాకపోవటంచేత రెండవస్త్రీ రెండు ముక్కలుగా చెయ్యమని కోరింది. అందువల్ల నేను నేరస్థురాల్ని కనుగొని శిక్షించానని చెప్పాడు రాజు.

రాణీ ఇది విని ఆశ్చర్యపోయింది. ఇంకా అధికంగా రాజుగారికి వజ్రాలనూ, ముత్యాలనూ బహూకరించి తన రాజ్యానికొకసారి రావలసిందిగా ప్రార్థించి తిరిగి తన రాజ్యం చేరుకుని ఆస్థానకవిచేత సాల్మన్ రాజుగారియొక్క గుణగణాలూ, న్యాయవిధానం, తెలివితేటలనుగూర్చి గ్రంథంలో వ్రాయించింది. చూశారా ! మనము దైవాన్ని సేవిస్తే అంతటిగొప్పవారమై పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తాం. ఈమాట మీరు మరువకండి. మీరిలాటి నేరాల్ని తీర్పుతీర్చవలసివచ్చినా, పేద, గొప్ప అనే తారతమ్యం మాత్రం చూపించకండి !



# బిడ్డలు - తలిదండ్రులు

శ్రీ కె. వెంకట్రామయ్య

"ప్రక్కను తడుపుట"కు కారణములు (Causes of Bed-wetting):

కొందరు బిడ్డలు సరియగు శిక్షణను బొందుచుండియును, రాత్రి ప్రక్కను తడుపునలవాటును మానకుందురు. మూడేండ్ల వయస్సు గడచినను వారట్లే చేయుచుండిన యెడల కారణమేదో తెలిసికొనుటకు ప్రయత్నించవలెను. అది భౌతికమైనచో వైద్య సహాయ మవసరమగును. ఆహారలోపములు, నరముల బలహీనత, రక్తహీనము, మూత్రమునందామ్లము మెక్కువగుట, అంగభాగములందు దురదలుండుట మొదలగునవి భౌతిక కారణములే కావచ్చును. కాని ఈ దురలవాటేర్పడుటకు కొన్ని మానసిక కారణములుగూడ నుండవచ్చును. అవి యేవన :—

1. ఆరంభదశలో సరియగు శిక్షణ నొసగకుండుట. సరియగు శిక్షణ నొసగుట సాధ్యమైనంత త్వరితముగా మొదలిడవలెను. లేనిచో బిడ్డకారంభముననే ప్రక్కను తడుపుట అలవాటై నిగ్రహమును నేర్చుకొనుట కష్టమగును. రెండేండ్లు దాటిన పిల్లలకన్న, అంతకు లోపు బిడ్డలకే నిగ్రహమెక్కువ సులభముగా పట్టువడుచుండును. ఇది గమనించినచో ముందుగనే శిక్షణ నొసగుట మంచిదని మనకు స్పష్టము కాగలదు.

2. తల్లిదండ్రులుగాని, దాదిగాని (Nurse) వ్యతిరేక భావమును (Negative attitude) జూపుట. దీనివలన బిడ్డ ఆత్మ విశ్వాసమును గోల్పోయి నిగ్రహమును జూపజాలకుండును. ఇంటియందలి ఇతర పిల్లలతో పోల్చి వారివలె నిగ్రహమును జూపుటలేదని యవమానించుకొలదియు బిడ్డ మరింత నిరుత్సాహపడుచుండును. దాని వలన సిగ్గును, విచారమును గలిగి, హీనుడనని, తలంచుచు నిస్పృహ జెందును. ఈ హీనభావమునే తాను ప్రయత్నించు ప్రతివిషయమునందును అతడు చూపుచుండును.

3. ప్రక్కనుతడుపు గుణమేర్పడుటకు భయమొక కారణమగుచుండును. కొందరు బిడ్డ లెదిగినవారయ్యును ఎల్లప్పుడు నేవో పిచ్చిభయములను గలిగియుందురు. పరీక్ష తప్పితిమనియో, తప్పుదుమనియో కలతపడుచుందురు. బడిలోనేదియో బాధకలుగుటచేతనో, ఇంటి పరిస్థితులు విచారకరములగుటచేతనో వ్యాకుల పడుచుందురు. అట్టివారికి పైయలవాటేర్పడుట కెంతయు నవకాశమున్నది.

4. బిడ్డసరిగా నిగ్రహమును జూపుటలేదని తలిదండ్రులైనను దాదియైనను (Nurse) అతనిని దండించుచున్నచో, అతనికి వారియెడవైర భావమేర్పడి ప్రక్కను తడుపుట మానకుండును. మరియు తన బిడ్డడు ప్రక్కను తడుపుట మానలేదని తల్లి యావేదన జూపుకొలదియు అతడాయలవాటును వదలక ఆమెను మరింత బాధించుచుండును. కాని ఆ యావేదనపడుట నామె మాని ఉల్లాసముగానున్నచో బిడ్డయు తన యలవాటును వదలి సరిగా నుండగలడు.

5. ఇతరుల దృష్టి నాకర్షించుటకు గూడ బిడ్డ ప్రక్కను తడుపుచుండవచ్చును. అట్టియెడ తల్లిదండ్రులు తన విషయమై ఎక్కువగా జూచుచుండుటయును, తన్ను గూర్చియే ఆలోచించుచు ఆందోళనపడుచుండుటయును అతనికెంతయు నానందకరమై ఆ యలవాటును వదలకుండును.

6. క్రొత్తగా నింకొకశిశువు జనించినపుడుగూడ బిడ్డడు ప్రక్కను తడుపనారంభించును. పూర్వమువలె తల్లి తన్ను జూచుటలేదను కోపముచే నాతడట్లు ప్రవర్తించుచు ఆమె దృష్టి నాకర్షింప ప్రయత్నించుచుండును.

7. తల్లిదండ్రులతో నొకే గదియందు పరుండుట కలవాటైన బిడ్డడు వేరుగదిలో పరుండ బెట్టినంతనే ప్రక్కను తడుపుటకారంభించును. తల్లిని తనకడకు రప్పించుకొనుటకొఱకే అతడావిధముగ జేయుచుండగలడు.

8. ఉద్రేకపడుటయో, సామాన్య జీవిత పరిస్థితులలో మార్పులు గలుగుటయోగూడ ప్రక్కను తడుపుటకు కారణములగుచుండును. అందులకే పండుగలపుడును, సెలవులు గడుపబోయినపుడును బిడ్డలు ప్రక్కను తడుపుట తటస్థించుచుండును. అప్పుడు మన మా

విషయము నెక్కువజేయక అట్లగుటకు గల కారణమేమైనదియును అతనికి జెప్పవలెను. లేనిచో అతడధైర్యము జెంది ప్రక్కను తడుపుట మానజాలకుండును.

ప్రక్కను తడుపుట మానుటకై చికిత్స :

బిడ్డ ప్రక్కను తడుపుటకు కారణమేదైనను తలిదండ్రులు అలజడిపడుటయు, అధైర్యము జూపుటయు పనికిరాదు. ఆగుణమును మాన్పుకొనుటకు బిడ్డ సమర్థుడే యనువిధమున వారుల్లాసముగనుండి అతనినుత్సాహపరుపవలెను.

బిడ్డకు తగిన విశ్రాంతి నొసగుట, ఆరోగ్యకరములగు సామాన్యాహారముల నిచ్చుచుండుట, పానీయముల నెక్కువగా నీయకుండుట, నాలుగు గంటలనుండియు బిడ్డను బాగుగ (అలయునట్లు) ఆడనిచ్చుట జరుగుచున్న యెడల నీ సమస్య సులభముగా తేలిపోగలదు. ద్రవపదార్థముల నెక్కువగా నీయరాదనిన, వాని నెక్కువగా తగ్గించవలెనని తలంపరాదు. అట్లు తగ్గించి, బిడ్డకు గల, ప్రక్కను తడిపెడి గుణమును మాన్ప ప్రయత్నించుట తగనిపని యగును. ఏలయన శరీరపోషణకెంతో నీ రవసరమగును. ఐనను బిడ్డకు కావలసిన ద్రవములను, నీటిని, పగలు నాలుగు గంటలకు పూర్వమే చాలవరకు నిచ్చుచు అటుపై తగ్గించుట మంచివిధానమగును. సాయంకాలపు భోజన సమయమున అరగ్లాసు పాలనే ఇచ్చి మిగిలిన సగమును ప్రొద్దుటి యాహారసమయమునను, మధ్యాహ్నపు భోజన సమయమునను ఈయనగును. బిడ్డ పరుండుటకు పూర్వము ఏదో కొంచము నీరు (రెండు పెద్ద స్పూనులనీరు) త్రాగుట కీయవచ్చును.

పై పద్ధతులవలన నెట్టి ప్రయోజనమును గలుగకున్న యెడల బిడ్డ శరీరమును, మూత్రమును పూర్తిగా పరీక్ష చేయింపవలెను. ఈ పరీక్షవలనగూడ నెట్టి లాభమును సిద్ధింపనిచో బిడ్డ దైనిక జీవితమునందొక క్రొత్త విధానము నేర్పరచి, "ప్రక్కను తడుప"నను విశ్వాసము నతనికి కలుగజేయ ప్రయత్నింపవలెను. అది యెట్లనగా-

1. బిడ్డ రాత్రులందు ఏయే వేళల ప్రక్కను తడుపునదియు గమనించి ఆయావేళలం దతనిని మూత్ర విసర్జనకై దీసికొనిపోవుచుండవలెను. అతడాసమయమునందు మెలకువగనుండి తానేమిచేయునదియును తెలిసియుండవలెను. బిడ్డ పసివాడైనపుడు బాగుగ నిద్రించుటయు నవసరమేయగును. అతడు రాత్రి లేచినపిదప తిరిగి సరిగా పరుండకుండినచో లేపకుండుటయే మేలగును.

2. పైవిధమున బిడ్డను లేపుచు ఒక వారముపాటు ప్రక్కను తడుపకుండ చూడవలెను. పిదప రాత్రులందు లేపెడి వేళలలో నొకటి వదలి ఇక తక్కిన వేళల మధ్య కాలము ఎక్కువచేయవలెను.

3. పైపద్ధతి ప్రకారము బిడ్డడొక వారముపాటు ప్రక్కను తడుపకున్నయెడల లేపెడి వేళలలో మరియొకటి తగ్గించి తక్కిన వేళల మధ్యకాలము నింకను ఎక్కువ చేయవలెను. బిడ్డ ప్రక్కను తడుపుట పూర్తిగా మానువరకుగాని లేదా మూత్ర విసర్జనకై స్వయముగ నతడే లేచుచుండువరకుగాని పైపద్ధతినే అతనిని లేపుట సాగింపవలెను.

పై విధానము ననుసరించుటచే బిడ్డకు మూత్రాశయ నిగ్రహము క్రమముగా నేర్పడగలదు. కాని అది నెమ్మదిగా జరుగును. మధ్య మధ్య వెనుకకు వచ్చుటయు తటస్థించును. దానిని తల్లి అంతగా లెక్కసేయక ఉల్లాసముతో బిడ్డ నుత్సాహపరుపవలెను. ప్రక్కను తడుపు నలవాటును పోనడుపు ప్రయత్నము తల్లీ బిడ్డ లిరువురకును బాధాకరమే కావచ్చును. ఐనను దానిని మాన్పుట చాల యవసరము. ఏలయన బిడ్డ దెదుగు కొలది ఆ దురలవాటుప్రభావ మతని శీలస్వభావాదులపై నెక్కువగుచుండును. ప్రక్కను, తడుపుచుంటినను విచారముచేతను, సిగ్గుచేతను అతడితరులతో సరిగా కలసి మసలకుండును.

ప్రక్కను తడుపు అలవాటేర్పడుటకు శారీరకముగు— దోషమేదియు కానకున్న, మానసికముగ నేదైన కలదా యని విచారింపవలెను. ఇది బిడ్డ నర్థము జేసికొనుచు కడునేర్పుతో జరుపవలెను. చిరాకు పడుటయు, దండించుటయు, అవమానించుటయు జరుగరాదు.

మానసిక కారణములివియని తెలిసిన పిదప వానిని తొలగింప సర్వవిధముల ప్రయత్నింపవలెను. మూడేండ్ల బిడ్డడొకడు క్రొత్తగా నింకొక శిశువు జనించినంతనే ప్రక్కను తడుపుట కారంభించెను. అట్టి పరిస్థితిలో బిడ్డ యలవాటునుగూర్చి ప్రసంగింపక, అతనినెక్కువ శ్రద్ధతో జూడవలెనని సలహా నీయగా తలిదండ్రులట్లే చేసిరి. ఒక వారము దినములలో బిడ్డ ప్రక్కను తడుపుట

మానెను. ఇదేవిధముగ ప్రక్కను తడుపు అలవాటు తొలగిపోయిన దృష్టాంతములింకను ఎన్నియోగలవు.

ప్రక్కను తడుపు అలవాటు ఏకారణముచే నేర్పడి నను దానిని తొలగింప ప్రయత్నించునపుడు కొన్ని సూత్రములను గమనించుట మంచిది. అవి యేవన :—

1. బిడ్డకు గల బలహీనతను గూర్చి అతని యెదుట ఎప్పుడును ప్రసంగింపరాదు.

2. తన బలహీనతను తొలగించుకొన గలనను విశ్వాసమును బిడ్డకు కలుగజేయవలెను.

3. తిట్టుటయు, దండించుటయు నిరుపయోగముల గును. నిగ్రహమును జూపలేనను భయమునవి యెక్కువ చేయును. తాను చేయజాలని పనినే తల్లిచేయమనుచున్న దని బిడ్డకు ఆమెయెడ కోపము జనించును. వ్యతిరేక భావమేర్పడును.

**స్నానము చేయుట, ఒడలు రుద్దుకొనుట, ముఖము రుద్దుకొనుట మొదలగు అలవాట్లు. Washing Habits)**

పరిశుభ్రత పుట్టుకతో నలవడునదికాదు. దానిని బిడ్డకు నేర్పవలెను. ఆ నేర్పుట ఎట్లు? ఏవిధముగ మొదలిడవలెను? అను విషయములను ఇట పరిశీలింతము.

బిడ్డకు పరిశుభ్రత అలవడవలెననిన అతడుండు గృహమును, అందలి వ్యక్తులును శుచిగానుండుట ప్రధానము. ప్రతి విషయమునందును తలిదండ్రులు పరిశుభ్రతను జూపుచు ఆదర్శప్రాయులుగనుండిన యెడల పరిశుద్ధజీవనము పెద్దవారికి సహజమనుభావము బిడ్డ కేర్పడగలదు. ఆరంభదశలో బిడ్డకు స్నానమునెడ ప్రత్యేకముగా నెట్టి యిష్టమును లేకున్నను తొలియౌవనము రాగానే అది సహజముగా కలుగుచుండును. కాని అతనికాకోరిక కలుగువరకును అభ్యాసమునీయక వేచియుండుట యనవసరమగును. బిడ్డ సహజముగా నీటితో నాడుటకిష్టపడును. ఏదైనను సాధింపగోరును. ఎందైనను ప్రావీణ్యతపొందుటకును, దేనినైనను స్వయముగ సాధించుటకును అతడు కుతూహలపడుచుండును. బిడ్డకు గల నీ సహజ ప్రవృత్తుల సహాయముతో స్నానముపై మక్కువ గలుగ జేయవచ్చును. తలదువ్వుకొనుట, స్నానము చేయుట ఇత్యాది పనులను బిడ్డ స్వయముగా చేసికొన గలిగినంతనే ఆయాపనుల నతడే చేసికొనుటకు ప్రోత్సహింపవలెను. అతడాపనులను చేయగోరినచో చేయువిధానమును చూపవలెను. అట్లగుటచే బిడ్డమనలను బాధింపకుండును. కిండర్‌గార్టెన్, నర్సరీ బడులకు వచ్చిన బిడ్డలు 2, 2½ ఏండ్లవారేయైనను స్వయముగ స్నానముచేయుటకెంతో శీఘ్రముగనలవాటు పడుదురు. ఇది ఇంటివద్ద నింతకుముందే నేర్చుకొనకుండుటకు కారణమేమన తల్లికి పనిగానుండుటయో, నేర్పుటకు తగిన యోర్పులేకుండుటయో కావచ్చును. లేదా సాధ్యమైనంతకాలము బిడ్డ, పసివానివలె, తనపైనాధారపడవలెనని ఆమె కోరికయగుటయే కావచ్చును.

వీలగునంతవరకు బిడ్డల పనులను బిడ్డలనే చేయనీయవలెను. ఏవిధముగ జూచినను ఇదియే మంచి విధానము. ఇందుచే బిడ్డకు స్వశక్తియందు విశ్వాసము కుదురగలదు. స్వయముగనుండవలెనను కోరికజనింపగలదు. ఇంతేగాక తల్లీ బిడ్డలిరువురును మాటిమాటికి పేచీపడుచుండుటమాని ప్రశాంతముగా నుండగలరు.

ప్రతి స్నానపు గదియందును బిడ్డకు వీలగుస్థలమున, కొంచము క్రిందుగా నొక బేసిను నేర్పాటు చేయవలెను. దగ్గరనే, బిడ్డకందుబాటులో సబ్బు, తువ్వాలు, బ్రషు, దువ్వెన మొదలగునవి అమర్చి యుంచవలెను. ఆ ప్రక్కనే బిడ్డకై క్రిందుగానొక యద్దముండవలెను. అద్దములోనతడు తన ప్రతిబింబమును జూచుకొనుచు శరీర శుభ్రత యవసరమును, ఆశుభ్రతవలని ఫలితమును కనుగొనుచుండును. సబ్బు, బ్రషు మొదలగునవి వాడెడు విధమును తలను దువ్వుకొనెడి విధానమును అతనికి కార్యరూపమున చూపిన అతడా పనులను ఆనందముతో చేయగలడు. పెద్ద పిల్లల విషయమునగూడ ఈపద్ధతినే యనుసరించి ఫలితములను పొందవచ్చును. ఇది చాల మంది తల్లులకనుభవమేయై యున్నది.

ఇష్టమున్నచో ఏదైనను సులభముగా పట్టువడును. అట్లగుటచే మంచియలవాటునెడ బిడ్డకిష్టము గలుగ జేయుటకే మనమెక్కువగా ప్రయత్నింపవలెను. బిడ్డ దేపనినైనను నేర్చుకొనునపుడు ప్రయత్నించుట ముఖ్యమగును. పెద్దలవలె నేర్పుతో చేయగలిగెనా యనునది అంత ముఖ్యముగాదు. అతడు మనవలె సరిగా స్నానము చేయలేక పోవచ్చును. ఐనను స్వయముగ స్నానము జేయుటకతడు ప్రతి దినమును ప్రయత్నించుట యవసరమే. దానికి తగినంత యవకాశమీయవలెను.

స్నానాదిక కార్యములను స్వయముగ జేసికొనుట యన్న బిడ్డకు మొదట ఎంతో ఆనందకరముగ నుండ వచ్చును. కాని కొన్నాళ్ళకా కార్యములే సామాన్యములై అతనికిగల కుతూహలము సడలి అంతయు నంతరింప వచ్చును. ఐనను ప్రతి దినమును వేళదప్పక ఆ కార్యములను జేయునలవాటునట్లే కొనసాగించవలెను. అతనికి ఉత్సాహము గలిగింప, నుపాయమునేదైన జూడనగునే గాని పరిశుభ్రతకై స్నానాదిక కృత్యములను జేయవలెనని బోధించిన నేమియు ప్రయోజనముండదు. పరిశుభ్రత యవసరము బిడ్డకు తొలియౌవన దశలో తెలియగలదు. తానందముగ నుండవలెను, ఇతరులకు తన యెడ మంచి యభిప్రాయముండవలెను, అనుయుద్దేశములా దశయందే అతనికి గలుగగలవు. స్నానాదికపు టలవాట్ల నేర్పరుచుటలో బిడ్డకు గలుగు నీయుద్దేశములెంతయు సహకరించును.

రెండు, మూడేండ్ల వయస్సు బిడ్డలుగూడ గోళ్ళను శుభ్రముగా నుంచుకొనుట నలవాటు జేసికొనవచ్చును. అంత గట్టిగాగాని మొనదేలిగాని యుండనిపండ్లు కుట్టుకొను పుల్లలను బజారులలో చౌకగా నమ్ముదురు. అవి చిన్న పిల్లల గోళ్ళను శుభ్రపరచుటకెంతయు పనికి వచ్చును. ఐదేండ్లు లేక అంతకుపైమించిన వయసు పిల్లలకు చేతులను గోళ్ళను శుభ్రముగా నుంచుకొనుటకై ప్రత్యేకముగ నేర్పరచిన "మానిక్యూర్" సెట్టునిచ్చుట మంచిది. వారికి దానివలన గోళ్ళను పరిశుభ్రముగా నుంచుకొనవలెననెడి కుతూహలము జనింపవచ్చును.

<u>వస్త్రధారణము (Dressing)</u>: దుస్తులను తానే స్వయముగ తొడుగుకొనవలెను, అనెడి కోరిక బిడ్డకు గలిగినంతనే ఆయా పనులనతడే జేసికొనుటకు ప్రోత్సహింపవలెను. ముడివేసికొనుట, విప్పుకొనుట మొదలగు పనులనతడు చేసికొనలేనపుడు మనము సహాయపడవచ్చును. కాని సాధ్యమగునంతవరకు బట్టలనతడే తొడుగుకొనుటయు విప్పుకొనుటయు మంచిది. ఈ పనులను చేయుటకతనికెక్కువ కాలముబట్టవచ్చును. ఐనను అదివృధాగాదు. దానివలన నితరులపై యాధారపడక స్వయముగ చరించుట అతనికలవడగలదు.

బిడ్డయానందముగ నుండవలెనన్న అతని యంతశ్శక్తుల సంపూర్ణాభివృద్ధికి తోడ్పడు ప్రధానజీవితపుటలవాట్ల నేర్పరచెడి పద్ధతులననుసరింపవలెను. ఈయలవాట్లు దండన భయమువలనకంటె 'సాధింపగలిగితి'నను యానందము చేతనే సులభముగా నలవడగలవు. తలిదండ్రులు తమ సౌకర్యమునకన్న బిడ్డ యభివృద్ధికే ఎక్కువ ప్రాధాన్యమీయవలెను. అందుచే వారికిని బిడ్డకునుగూడ శ్రేయస్కరమై సరియగు సన్నిహిత సంబంధము లేర్పడగలవు.





# వానా - వడిగళ్ళూ

శ్రీ దాసరి వెంకటకృష్ణయ్య

పాత్రలు :

| | | |
|---|---|---|
| రామారావు | : | విద్యావంతుడు. |
| మూర్తి | : | అతని స్నేహితుడు. |
| ప్రసాద్ | : | రామారావు తమ్ముడు. |

ఇంకా డాక్టరు, రామారావు తండ్రి, తల్లి వస్తారు.

---

(గాలీ వర్షం వస్తున్న చప్పుడు)

రామా : (తలుపు నెమ్మదిగా గడియవేసిన చప్పుడు) డాక్టర్ యింకా రాలా మూర్తీ!

మూర్తి : ఇంకా రాలా.

రా : వర్షంకూడా వస్తూంది.

మూ : వస్తూందేమిటి. ఒకటేమైన కుండపోతగా కురుస్తుంటే.

రా : వడగళ్ళుగూడా పడ్తున్నట్టున్నై.

మూ : ఆఁ. అన్నీపడ్తున్నయ్. దరిద్రుని పెండ్లికి వడిగళ్ళ వాన అన్నట్లు.

రా : కాకపోతే మరేంటి ?....మావాడు డాక్టరుదగ్గరకు పోయివుంటాడంటావా ?

మూ : ఇప్పటికి పోయివుండొచ్చు. ఇదేఁ. ఇదొకటి చుట్టుకుంది. వానా - వడిగళ్ళూ.

రా : మరి యింకారాలేదే. పిల్లోడు చూస్తే స్పృహ లేకుండా పడివున్నాడు. మనమాటామంతీలేదు.

మూ : ఎట్లాగోయ్ అంతతొందరైతే. పోయి డాక్టరును తీసుకురావాలా వద్దా.

రా : అసలు వాడి శ్వాస గంటగంటకీ ఆగిపోతుంది. గొంతేమో బొంగురుపోతుంద. కండ్లు మూతలు పడుతున్నాయ్. ఏమిటో యిదంతా చూస్తే నాకు భయమేస్తుందోయ్ మూర్తీ!

మూ : మరేం ఫర్వాలేదు. ఇప్పుడే డాక్టరొస్తాడు. చూడు తలుపెవరో తడ్తున్నారు.

(ఇద్దరూ కొంచెంసేపు నిశ్శబ్దంగా వుంటారు - గాలి జోరుగా వస్తున్న శబ్దం -)

రా : ఆఁ ... ఏమీలేదు. గాలి.

మూ : అదిగో మళ్ళీ.... (గాలివీచిన శబ్దం)

రా : (లేచినడచిన చప్పుడు) ఎవరో పక్కింటి తలుపు కొడ్తున్నారు.... అరే మూర్తీ! మాపిల్లోడి జబ్బు చూస్తే మామూలు జ్వరంలాలేదు. నువ్వుచూడు. ఎట్లా బాధపడ్తున్నాడో శ్వాసఆడక.

(గాలి జోరుగా వీస్తూ - ఉరుములు, మెరుపులు వర్షంతోకూడిన శబ్దం -)

రా : అబ్బ! చూడు మూర్తీ! ప్రకృతిగూడా మనయందు ఎంత విరోధంగా వున్నదో....

(పెద్దగా పురిమిన శబ్దం. తరువాత తలుపు తెరచిన చప్పుడు. రామారావు తల్లి ప్రవేశం.)

తల్లి : రామూ! ఇట్రా. బహుశా డాక్టరొచ్చేవుంటాడు. (తలుపువేసిన చప్పుడు. తల్లి నడచిపోయినచప్పుడు)

రా : మూర్తీ....

(ఇంతలో ప్రసాద్, డాక్టరువచ్చిన శబ్దం)

డాక్టరు : ఏడి! పిల్లవాడేడి!

రా : డాక్టర్! మావాడంతా మీకు చెప్పేవుంటాడు. నిన్న పొద్దుటినుంచి ఒకటే జ్వరం. విడుపులేదు. శ్వాస ఆడటం చాలా కష్టంగావుంది. ఏమిటో.... నాకు భయంగావుందండి డాక్టర్‌గారూ.

డా : చూద్దాం పదండి.

(అందరూ నడచిపోతున్న చప్పుడు. బయట తలుపు తట్టిన శబ్దం. తల్లి ప్రవేశం)

తల్లి: అరే.... ప్రసాద్.... (లోపలినుంచి ప్రసాద్ వచ్చిన శబ్దం)

తల్లి: చూడయ్యా ...బయట ఎవరో తలుపుకొడుతున్నారు. (సంతోషంతో) వాళ్ళే అయివుంటారు. నాకోడలు చచ్చిపోయిన తర్వాత మళ్ళీ రామారావుకి పిల్ల నివ్వటానికి....ఎంత నమ్మకమైన మనుషులు.... ఇంతలో మూర్తి త్వరగా వచ్చిన చప్పుడు.)

మూ: ప్రసాద్ ఎక్కడ?

తల్లి: ఎవరోవస్తే తలుపుతీయటానికి వెళ్ళాడు. (మూర్తి త్వరత్వరగా నడచిపోయిన శబ్దం, ప్రసాద్ వచ్చిన చప్పుడు.)

తల్లి: ఎవర్రా వాళ్ళు?

ప్రసాద్: నిజంగా వాళ్ళేనే అమ్మా! కింద కూర్చోబెట్టాను, నాన్నదగ్గరకు నీవు వెళ్ళమ్మా.

తల్లి: నేనెందుకురా.

ప్ర: వాళ్ళెమ్మటి ఒక ఆడమనిషిగూడా వుంది.

(తల్లి నడచివెళ్ళిన చప్పుడు)

(మూర్తి తలుపు కొద్దిగా తీసినశబ్దం)

మూ: ప్రసాద్!

(ప్రసాద్ వచ్చిన శబ్దం. కొద్దిక్షణాలు నిశ్శబ్దం - మళ్ళా కొంచెంసేపటికి డాక్టరు, మూర్తి, రామారావు, ప్రసాద్ అంతా బైటకు పోతున్న శబ్దం -)

రా: ప్రమాదముకాదుకదా డాక్టర్!

డా: అంతా భగవంతుని దయ. నేనేమన్నా దేవుణ్ణా బ్రతికించటానికి నాచేతనైంద నేను చేస్తాను. ఆ పిల్లవాడికి 'డెఫ్తీరియా' వ్యాధి వచ్చింది. చాలా జాగ్రత్తగా ట్రీట్‌మెంటు యివ్వాలి.

రా: మాకైతే ఏమీ తెలియదు డాక్టర్. నిన్న ప్రొద్దున వచ్చిందండీ జ్వరం — బాగా అజీర్ణంచేసింది. (కొంచెం వణుకుతాడు) అబ్బబ్బ - ఇదొక వానపట్టుకుంది. దానికి తోడు వడగళ్ళు, తుఫాన్. ఇలాంటి వర్షాన్ని నేనెప్పుడూ చూడలేదు.

డా: (ఆలోచిస్తూ) నేను యిప్పుడే యింజక్షనుయిచ్చాను. మీవాడ్ని నావెంట పంపండి. మందుచీటు రాసి యిస్తాను. అది బజార్లో కొనుక్కోవచ్చు. పావు గంటకొకసారి గొంతులో ఆ మందు రెండు మూడు చుక్కలు వేయండి. నేనుగూడా మళ్ళీ ఒక్గంటలో వచ్చిచూస్తాను. అప్పటికి గుణం ఏమీ కనిపించక పోతే మళ్ళీ వుంకోయింజక్షను చేస్తాను. 'డెఫ్తీరియా'కి ఇంజక్షనుకు మించిన వైద్యం లేదండీ రామారావు గారూ.

రా: (బొంగురుపోయిన స్వరంతో) డాక్టరుగారూ....

డా: మీరేమీ ఘాబరాపడపద్దండీ. అక్కడ కూర్చొని అమ్మాయికి సౌకర్యంగా చూడండి....అయినప్పటికీ....

రా: నేను మీకు ఏలోపమూ రానివ్వను. మీ ఫీజు మీకిచ్చుకుంటాను. (మూర్తితో) మూర్తీ! నీవు నా దగ్గరేవుండు. ఎక్కడికీ పోవద్దు. చూడూ! యీ యిల్లుందే పిల్లలపాలటి ఒక అడివి అయింది. అంతే కాదు. వాళ్ళపాలిటి ఒక నరకం....!

డా: ఏమిటండీ రామారావుగారూ! మనస్సు వూరికే పాడుజేసుకొంటారు?

రా: మీకు తెలియదండి డాక్టరుగారూ! ఈ మనుషులకి హృదయంలేదు. అసలు నేనిక్కడికి నాభార్య దహన సంస్కారము చేయటానికి వచ్చాను. కర్మపూర్తి అయీ అవక తలికే మళ్ళీ పెళ్ళికి ఆలోచన....

మూ: మరేంటనుకున్నావోయ్! ప్రపంచం పోకట!

రా: ఎంత ప్రపంచం పోకడైతేమటుకు యింత మూర్ఖమా! ఇంత నిర్దయా! ఇంత స్వార్థమా....

డా: (తొందర తొందరగా) ఆలశ్యమవుతుంది. నేను మందు పంపిస్తాను. (ప్రసాద్‌తో) ప్రసాద్! పద.

(డాక్టరు, ప్రసాద్ పోయిన శబ్దం.)

రా: మూర్తీ! ఇంకేవిటి కర్తవ్యం? వీడుకూడా దాని మోస్తరే మనల్ని వదిలిపోతాడేమో....

మూ: ఏవిటోయ్! నీ ఆలోచనలు? ఉన్నకొద్దీ పిచ్చివాడై పోతున్నావ్. ఉండు. ప్రసాద్ వస్తున్నాడేమో చూస్తాను....

(మూర్తి నడచి తలుపుదాకా వెళ్ళి తిరిగివచ్చిన చప్పుడు.)

(ఒక పక్కనుంచి తల్లివచ్చిన చప్పుడు)

తల్లి : ఎక్కడికి వెళ్ళావు మూర్తీ !

మూ : ఆఁ ప్రసాద్ వస్తున్నాడేమోనని చూద్దామని వెళ్ళాను.

తల్లి : పిల్లోడికి కాస్త ఏమన్నా నయంగావుందా ?

మూ : వ్చ్. వాడి స్థితి ఏం బావులేదు.

తల్లి : అని డాక్టరు చెప్పాడా ?

మూ : 'డెప్తీరియా' అని చెప్పాడు.

తల్లి : అంటే....

మూ : మహా ప్రమాదమైన జబ్బండీ అది ! ఎట్లాంటోళ్ళు గూడా అది వచ్చిందంటే రెండు మూడు రోజుల్లోనే 'హా' అని ఎగిరిపోతారు.

తల్లి : (పొడిదగ్గుదగ్గి) అయ్యెయ్యో ! మూర్తీ ! మర్చేపోయాను. నీవు మావాడికి ముఖ్య స్నేహితుడివి. నీవు వాడి మేలుకోరాలి.

మూ : ఏమిటో చెప్పండి.

తల్లి : మళ్ళీ వాళ్ళివాళ వచ్చారు.

మూ : ఎవరు వాళ్ళు ?

తల్లి : పట్నంలో ఒక వ్యాపారి. మావాడికి అతని కూతుర్ని యిచ్చి పెళ్ళిచేయటానికి వచ్చారు.

మూ : (ఎగతాళిగా) అదేంటండీ !

తల్లి : మీకేం తెలియదు నాయనా ! పడిపోయిన యింటి పునాదినుంచే మళ్ళీ యింటిని నిర్మించాలి....

మూ : రామారావు మళ్ళీ పెళ్ళికి వప్పుకోడు. నాకు తెలుసు.

తల్లి : సరే నీవు చెప్పింది బావుంది. కాని యిప్పుడు మనకి గొప్ప యింటివాడు దొరికాడు. ఇల్లు పెద్దది. బాగుంటది. పిల్ల రూపవతి ; గుణముల ప్రోవు.

మూ : అబ్బ ! వుండండి. పిల్లవాడి స్థితి ఎట్లావుందో చూడాలి.

తల్లి : మూర్తీ ! కాస్త ఆలోచించు - వాడిమేలుకోరి. వాళ్ళు చాలాదూరంనించివచ్చారు. ఇలాంటప్పుడు - ఈవానలో వాళ్ళకు నిరాశకల్పించేదా ?

మూ : అయితే దానికి నేనేం చేసేది ?

తల్లి : ఏం చెయ్యక్కర్లేదు. నీస్నేహితుడితో - కాదు - మావాడితో నాలుగైదు నిమిషాలు వాళ్ళతో మాట్లాడమని చెప్పు. పో ! నేను పిల్లవాడిదగ్గర కూర్చొని వుంటా.

మూ : ఇది నావల్ల కాదండి. చూద్దామా పిల్లవాడి స్థితి సరిలేదు. ఆ సంగతి మీకు తెలుసు. రామారావుకి పిల్లవాడంటే ఎంత యిష్టమో వదినెగారు పోయింతర్వాత తెలిసింది. అలాంటప్పుడు నేనీ సంగతి ఎట్లా చెప్పేది ?

(పిల్లవాని గదిలోంచి రామారావు వచ్చినచప్పుడు)

రా : మూర్తీ ! నువ్వింకా యిక్కడే వున్నావా ? ప్రసాద్ యింకా రాలా ? పిల్లోడు ఈక్షణమా ఆక్షణమా అన్నట్టున్నాడు.

మూ : అయితే ప్రసాద్ వస్తున్నాడేమో చూసొస్తాను.

(ప్రసాద్ పోయిన శబ్దం. తల్లి రామారావు దగ్గరికి వచ్చిన చప్పుడు)

తల్లి : ఎందుకురా ఘాబరాపడ్తావు ?

రా : అమ్మా ! వాడికి 'డెఫ్తీరియా' వచ్చింది.

తల్లి : అవును. మూర్తి చెప్పాడు. నువ్వు వారిని కలిసి....

రా : ఏమిటమ్మా చెప్తున్నావు ?

తల్లి : రా ! నేను చూపిస్తా. (పోతున్న చప్పుడు)

రా : (దారికి అడ్డంపోయిన చప్పుడు)

తల్లి : విను !

రా : చెప్పు !

తల్లి : .......

రా : చెప్పు ! త్వరగా చెప్పు ! నేను పోవాలి.

తల్లి : వాళ్ళు మళ్ళీ వచ్చారు.

రా : వాళ్ళంటే....

తల్లి : వాళ్ళే....ఆ పట్నంవాళ్ళే.

రా : (కోపంతో) ఎట్లా వచ్చారో అట్లాగే పొమ్మని చెప్పు. (టకటక నడచిన చప్పుడు)

తల్లి : రామూ ! నీకేమన్నా పిచ్చా !

రా : అవును. నాకు పిచ్చే. నాకేం తెదుయదు. కన పట్టంలా మీకు ? మీకేం ! మాట్లాడ్తే పెళ్ళి ! పెళ్ళి !

పెళ్ళి ! ఈ ప్రపంచంలో పెళ్ళి ఒక్కటే శాశ్వతంలా వుంది. ఒక వైపు చావులు - మరో వైపు పెళ్ళిళ్ళు !

తల్లి : ఎందుకట్లా తొందరపడ్తావు. నేను నీ మేలుకోరి చెప్తుంటే ...... సూర్యనారాయణ ...

రా : (బిగ్గరగా) వాడి సంగతి నాదెగ్గర ఎత్తవాకు. విద్యావిహీనుడు, పశువు, మూర్ఖుడు ! వాడికి హృదయం. లేదు ! వాడు మానవుడుకాదు -జంతువు !

తల్లి : నీతండ్రిగూడ మొదటిభార్య పోతే రెండో పెళ్ళి చేసుకోలా.

రా : పోమ్మా !.... నేనేం చెప్పేది ?

(రామారావు తొందర తొందరగాపోయి తలుపు గడియవేసిన చప్పుడు. రామారావుతండ్రి ప్రవేశము)

తండ్రి : ఏమిటి అబ్బాయి చెప్తున్నాడు ?

తల్లి : ఆఁ. ఏం చెప్తాడు ? మనమాట వింటేగా? పిల్లోడి స్థితి బాగులేదంట....

తం : ఆఁ. అనుమానం పెద్దరోగం. (బిగ్గరగా) రామూ! రామూ !

(రామారావు తలుపు తీసిన చప్పుడు. వస్తాడు)

రా : చిన్నగా చెప్పండి. ఏంటి అంతగలభా చేస్తున్నారు?

తం : ఇట్రా.

రా : నాకు టయమేలేదు

తం : (కోపంగా) టయమేలేదూ ?

రా : చిన్నగా చెప్పండి.

తం : వాళ్ళు చాలాదూరంనుంచి వచ్చారు. నిన్ను చూడాలంటున్నారు. పోయి నాలుగైదు నిమిషాలు మాట్లాడిరా.

రా : నేను పోను.

తం : పోవూ !

రా : పోను !

తం : (బిగ్గరగా) నేనుపోయి మాట్లాడ్తాను. ఈవర్షంలో, ఇంత చీకట్లో వాళ్ళకు నిరాశ కల్పించటము నా పని కాదు. కాళ్ళదాకా వచ్చిన లక్ష్మిని కాలదన్నటము మంచిదికాదు.

రా : (పిచ్చిగా నవ్వి) ఆఁ. తన్నవాకండి ! (దర్వాజా వేసిన చప్పుడు.) పోతాడు.

(మూర్తి, ప్రసాద్ నడచిపోయిన శబ్దం—)

తల్లి : ప్రసాద్ !.... ప్రసాద్ ....

ప్రసాద్ : ఏంటమ్మా.

(ఇంతలో మూర్తి ఆమర్దాగా)

మూ : ఇంకేముంది! నాటకమంతా అయిపోయింది. పిల్లోడు....

(తల్లి 'అయ్యో' అని కిందపడు మళ్ళీ లేచి గదివద్దకు పోయి తలుపుతడ్తూ)

తల్లి : రామూ ! .... రామూ....

రా : (లోపలినుంచి హీనస్వరంలో) ఏంటమ్మా !

తల్లి : తలుపుతియ్ (తలుపుతట్తుంది)

రా : ముందు మీరు లక్ష్మికి స్వాగతం యివ్వండి.

తల్లి : రామూ !

రా : .......

తల్లి : రామూ !

(తండ్రి గబగబా వచ్చిన శబ్దం)

తండ్రి : తలుపు తియ్యరా.

(గది తలుపు తీసిన చప్పుడు)

రా : (బిగ్గరగా) చూడండి ! అంతా చూడండి ! !

(బాలుని శవం చూస్తారు అంతా)

(మూర్తి, ప్రసాద్, తల్లి, తండ్రి అంతా ఒక్కసారే 'అయ్యో' 'అయ్యో' అంటారు).

(వర్షం వెలుస్తుంది)



లిచ్చుట, అతనిని వీణాగానము, మధురవాక్కులతో సంతోషమనస్కునిచేయుట, మొదలగు విషయములా కలభాషిణికి గల సదాచారత్వమును వెల్లడి చేయుచున్నవి.

వివేకవతి :—వివేకముతో గూడిన చతురత్వము గలది యీ కలభాషిణి. నలకూబరునిపై మనసుమరలుట, "రంభకు సవతిపోరు తప్పద"ని నారదుడు పలికి. "ఈ సంఘటనకు నీవే చాలు"నని పలుకుట. — మున్నగు విషయములు కలభాషిణిలో కొంతవివేకతను గల్గించిన పిమ్మట ఆమె నలకూబరుని చేరుటకు దోహదముగ నారదునకు శుశ్రూష చేయమొదలిడినది. అదియుగాక మఱొక విషయమున నామె తన వివేకతను ప్రదర్శించినది. నారదుని సంగీతాభ్యాసము ముగిసినపిమ్మట తనను గుఱించి అంతఃపుర స్త్రీలు తన సంగీతవిద్యకు సాటి లేదని అనుకొనుట నిజమో, కాదో, తెలిసికొనుటకు నావశ్యకత యేర్పడినది. ఈసమయమున కలభాషిణి నారదునొకవరమడిగినది. అది తన యిష్టమువచ్చిన స్త్రీ రూపము ధరించునట్లు వరమిచ్చిన నావిషయమును అంతఃపురములోని యొక స్త్రీరూపముధరించి యీమె లేని సమయములో పైప్రస్తావన తెచ్చి నిజము తెలిసికొనవచ్చునని బహిర్భావముగా నావరముగైకొనినది. కాని, నలకూబరుని దగ్గఱ రంభలేని సమయములో రంభా రూపముదాల్చి యాతనిని కలియవచ్చునని యామె అంతర్భావము. ఇట్లు పలుమారులు కలభాషిణి తన వివేకతను ప్రదర్శించుచునేయున్నది.

పతివ్రత :—నారదునకు శిష్యత్వము చేయుచున్నపుడు కలభాషిణి తన సహచరుడగు మణికంధరుని ప్రేమించినది. కాని యీ విషయము నారదునకుఁదెలిసిన ప్రమాదము సంభవించునని బయలుబ్బనీయలేదు. మణికంధరుని రూపురేఖలు నలకూబరునిలో గోచరించుటచే మణికంధర సమాగమము దుర్లభమగుటచేతను. నలకూబరునియందే తన ధ్యానమును నిలిపినది. మణిస్తంభునితో మాటలాడు సమయమునఁగూడ తాను దృష్టిలో నిలుపుకొన్న మణికంధరుని గుఱించియే యెక్కువగా ముచ్చటించినది. అతనిక్షేమమె తనక్షేమముగా భావించి ఆతని సమాగమము కొఱకై నిరీక్షించినది. దైవసంఘటనచే తనకు తెలియకుండగనే నలకూబరునివేషమందున్న మణికంధరుని మాయారంభ వేషమున కలసికొన్నది. తనకు తెలియకుండగనే తన శీలమును గాపాడుకొన్నది. మణికంధరుడు కళాపూర్ణుడుగా జన్మించిన జన్మలోగూడ కలభాషిణి మధురలాలసగా జన్మించి యాతనికి భార్యయై తన అభిలాషను నెరవేర్చుకొన్నది.

కలభాషిణి యెంత వివేకవతియైనను ఆమె కొన్ని సంధర్భములలో పరాజితయైనది. మణిస్థంభుని మాయలలోపడి, నలకూబరసమాగమ వాంఛలు ప్రబలిపోగాతన వివేకతను గోల్పోయినది. మణిస్థంభునితో నలకూబరుని దఱికనిబయలుదేరి మార్గమధ్యమందున్న కాళికాదేవికి బలి జంతువుగా సిద్ధమైనది. కాని యామె మనోనిశ్చయములు బలిష్ఠములగుట చేతనే వంచింపబడినది. చివఱకు తన తప్పిదమును తెలిసికొన్నది. మిగులచింతిల్లినది.

భక్తురాలు :—తనకు గలిగిన సంగీతము చేనెల్లప్పుడు దైవముపై భక్తిగీతములనే కలభాషిణి పాడుచుండెడిది. పెద్దలపై వినయవిధేయతలతో భక్తి చూపుచుండెడిది. మణిస్థంభుడు తనను బలియిచ్చుటకై యెత్తిన ఖడ్గశక్తి రిత్తపోకుండుటకై తాను తదుపరి జన్మలలో తనభర్తను కలసికొనుటకును, ఏవాంఛతో మణిస్థంభుడు తనను బలి రఃయబూనెనో తనను ఖండించినవారికి నావాంఛ సిద్ధించునట్లుగను, రెండు మహాత్కార్యములనాలోచించి యా కత్తితోడనే కాళికినెదురుగా మణికంధరునిచే ఖండింపబడినది. తన భక్తి ప్రకర్షను వెల్లడిచేసినది, మధురలాలసగా జన్మించినపుడు పతిభక్తి చూపుచు తొట్టతొలి నూగుకాలమునుండియు కళాపూర్ణుని గుఱించిన మాటలు, పాటలు వినుచుండెడిది. ఇట్లనన్యభక్తి ప్రపత్తులు చూపిన కలభాషిణి మహాభక్తురాలుగాక మఱేమగును ?

తేజస్వతి :—కలభాషిణి తేజోమూర్తి. చెలికత్తెలతో కలభాషిణి యుద్యానవనములో "నింపుదళుకొత్తు క్రొత్త విరిగుత్తుల" గికాకికనగుచు చిదిమినదట ! తర్వాత డోలా విహారమునకు నుద్యమించినది. పూఁదీవెల తూగుటుయ్యేలలోనూగు శోభలు, శోభలను మించిన తీవులు, తీవినిమించిన ప్రగల్భతాగరిమను జూచి మణికంధరుడు-

"తమిఁబూఁదీగెలఁ దూగుటుయ్యెలలఁ
బంతాలాడుచుం దూఁగునా
కోమరుంబ్రాయపు గబ్బిగుబ్బెతల
యంఘ్రుల్ చక్కగాఁజాగిమిం
టిమొగంబై చనుదెంచుతీవిఁ
గనుఁగొంటే దివ్యమౌనీంద్రనా

# కలభాషిణి గుణములు

కమృగినేత్రలమీద కయ్యమునకుం
గాల్దాఁచు లాగొప్పెడున్"—

అని తన గురువు నారదునితోననినాడు. ఆ మాటలకు నారదుడు—

"ఛళిరాసత్కవి వాదునిక్కము
తగన్భావించినీవన్నయా
యెలప్రాయంపు మిటారికత్తెల
బెడంగేనెందునుంగానవా
రలడోలాచలనోచ్చ లచ్చరణముల్
త్రైవిష్టప స్త్రీలయా
దలఁదన్నం జనునట్లు మించెననిసం
దప్పేమి యొప్పేయగున్"

అనినాడు. లోకసంచారియగు నారదుడు ఈమిటారికత్తె బెడంగు నేలోకమునందును గాంచలేదట! సురలోక భామినుల యౌదలలఁదన్నుటకుఁ బాదములు వెళ్ళుచున్న వనినను తప్పులేదన్నాడు. దీనినిబట్టి కలభాషిణి యెంత పవిత్రమూర్తియో తెల్లమగుచున్నది. ఆ సమయములోనే రంభా నలకూబరు లీమాటలు విని తమ విమానమును నారదునకు పరిచర్యచేసియు చితాలాపము లాడుటకై నారదునిదఱికి పోనిచ్చినారట! పోనిచ్చి నారదుని కాళ్ళ ముందు "పారిజాతకుసుమ సౌరభంబులు వెదజల్లు తమ శిరంబులల్లనల్లన నద్దినా"రట! పారిజాతకుసుమ సౌరభములవెదజల్లు నాసురనారీ మస్తకము నీపాపనమూర్తి కలభాషిణి కాళ్ళు తన్నుటకు పోవుచున్నవట! అది యునుగాక నారదుడే కలభాషిణితో "నీ సౌందర్యము ముందు రంభా సౌందర్యమెంత?" అని కలభాషిణినిఁ బొగడినాడు. ఎంత తేజస్విని యీ కలభాషిణి!

గౌరవమతి :—కలభాషిణి నారదునకు శిష్యత్వము సేయనుంకించినది. నారదుడు గానవిద్య నభ్యసించుటకు లోపలికరగుచుండ కలభాషిణి యాతని వీణెగైకొన్నది. ఈసంఘటనమును శ్రీకృష్ణుడు చూచినాడు. చూచి యూరకుండెనా? లేదు. "శిష్యత్వము చేయుటకు నిచ్చ పొడమెనా?" యని అపోకరీతిగా పలికినాడు. అట్టి సందర్భములో కలభాషిణి యేమిచేయును? ఒకరు ఏదయినను క్రొత్తపని చేయుటకు పూనుకొనిన మఱొకరు "ఏమి! నీవు దీనిని చేయదలచుకొంటివా?" యనినపుడు సిగ్గుచేత "అబ్బే యేమియులేదు" అనుటసహజము. అటులనే కలభాషిణియు "నేమియులేదని వినీతితో నిటు నటునొదిగిన"దట! ఇటునటునొదుగుటలో భావ మేమిటి? సిగ్గుచేతనా? భయముచేతనా? కాదు. పెద్దలకు వినయముచూపుట. వినయముచూపి వారి యాశీర్వచనములు పొందుటకట్లుచేసినది. అందులకు వెంటనే శ్రీకృష్ణుడు "నీకిది కడులెస్స బుద్ధి. ఇట్టి మహామహులాత్మ సేవకు హృదయమునందు నియ్య కొనుటెవ్వరికున్నది? నీవు పాటలు పాడుకొను సమయ మున కొంత నారదునకు శుశ్రూషచేసిన బాగుండునని యనుకొందును" అని చెప్పి తన వాత్సల్యముచే నంతః పురములో నామెకుగూడ గానవిద్య చెప్పుట కాజ్ఞయిచ్చి నాడు. గౌరవబుద్ధిలో కలభాషిణి నారదునేకాదు, శ్రీకృష్ణునిగూడ చూరగొన్నది. ఇంకను ఎందఱనో చూఱగొన్నది.

ధైర్యవతి :—కలభాషిణికి మనోధైర్య మెక్కువ. కొన్ని కొన్ని సందర్భములలో (అనగా మణిస్తంభుడు కాళికి బలి యీయబోవు సమయమున, కాళిచేమారముగా గాలితో విసరివేయబడినపుడు మణిస్తంభుడు తనను మద నావేశముతోఁగౌగలించినపుడు) ధైర్యమును గోల్పోయి అబలయై యున్నప్పటికిని, నెడనెడ తన ధైర్యమును ప్రదర్శించినది. నలకూబరుని సాన్నిధ్యమున మాయా రంభవేషమున సత్యరంభతో ధైర్యముగా సవతి పోరు పోరాడినది. చివరకు కాళికాలయములో మణికంధరుడు, మణిస్తంభుడు, సుముఖాసక్తి, కలభాషిణి అందఱు కలసి కొనినపుడు — ఇదివఱకు తనను ఖండించుటకు నెత్తిన ఖడ్గశక్తిరిత్తవోకుండ తనను ఖండింపుమని ధైర్యముగా మణికంధరునితోఁ జెప్పినది. తన ప్రాణములపై నాశ లేకుండ కాళికకు తన యిష్టముతోడనే బలియైనది. ఈ సందర్భమున కాళికూడ కలభాషిణి ధైర్యమునకు మెచ్చు కొని మరణింపకే తిరిగి జీవించి యామెబంధువులతో కలియునట్లు అనుగ్రహించినది.

ఈవిధముగా కలభాషిణి యనేక సద్గుణములను పొందినను. సౌందర్య గర్వమును, రంభపైనీర్ష్యను. పొందినప్పటికిని, అవి యీ సద్గుణములచే మరుగు పడినవి. కళాపూర్ణోదయమునందు కలభాషిణి ప్రధాన పాత్రయగుటచేత కావ్యమును కలభాషిణీ వర్ణనతో మొదలుపెట్టి, మధురలాలసా వివాహముతో ముగించి నాడు పింగళసూరన. పైనఁజెప్పినన్ని గుణములు ఒకే స్త్రీమూర్తిలో మూర్తీభవించుట ప్రపంచములోదుర్లభము. ఏవిషయమునఁ జూచినను కలభాషిణి యగ్రస్థానము వహించినది. ఎన్నిసారులు కలభాషిణిని కావ్యమునందు పఠించిచూచినను ఆమె పొందిన గుణములవలన మఱల మఱల కావ్యమును చదువవలెనను ఆసక్తికలుగకమానదు. ఇట్లనన్యసామాన్య గుణాన్విత యీ కలభాషిణి!

★

# భారతవాణి

శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మ

ఉ॥ వాణి విరించిరాణి- శుకవాణి వినిర్మల నీలవేణి-గీ
ర్వాణి విపంచి వాణి- నవపల్లవ కోమలపాణి నిత్య-క
ల్యాణి సుమంజువాణి- కవిరాజ విరాజితవాణి- సద్గుణ
శ్రేణి మదీయ హృత్కమల- సీమ వసింపగదమ్మ
భారతీ!

గీ॥ శ్రీల నొసగెడు పరమసౌ-శీల్యవమ్మ
వారు వీరనకుండ నెవ్వారికైన
గూర్మి నాతిథ్యమిచ్చు స- ద్ధర్మవమ్మ
వందనంబమ్మ 'గైకొమ్మ' భరతమాత।

సీ॥ స్థాపించి నారదే- శౌర్యవిస్ఫూర్తి స్వా
తంత్ర్య చిహ్న పతాక దర్పమునను
సాగించి నారదే సంఘ సంక్షేమ ప్ర
జాసంస్థలవనిని సంతసమున
వెలయించి నారదే విశ్వమానవ మైత్రి
వ్యాప్తి- జాతీయవిద్యలదలంచి
తెరపించు చుండిరదే పల్లె పల్లెల
ధర్మ ప్రసూతి కేంద్రమ్ములెలమి

గీ॥ పూజ్యులైనట్టి నీగన్న పుత్రులమ్మ
పంచవర్ష ప్రణాళిక ప్రథమమందె
పవడ పుంగోళ్ళ రతనాల పసిడిగద్దె
నెక్కి- భారత రాజ్యమ్ము నేలుకొనగ॥

సీ॥ తుంగ భద్రానదీ- రంగ భంగ తరంగ
కల్లోల వాహినీ- గర్భమందు
పశ్చిమాంతరసింధు- పవనశీతల నదీ
జలతరంగమ్ముల ఛాయలందు
వర్ధిత దాక్షిణ్య- వాహినీదివ్య- భ
వానీ నదీజల-ప్రాంతమందు
ప్రాక్ ఉత్కళావనీ- ప్రాంగణమందున్న
ప్రాజెక్టు లెలమితో ప్రబలజేయ

గీ॥ భారతావనీ భావి సౌభాగ్య మమరు
కలిమి బంగారు పంటల గ్రాలినెలమి
భరత జనయిత్రి నోముల పంటగాగ
సకలజన మోదమై ఫల సారమగుచు

సీ॥ రంగారు బంగారు రాజన భాజనల్
హాళిక జనమనో-హ్లాదమనగ
పసిడి వన్నె మెరుంగు- పచ్చపైరులు
కర్షక జనకాయ- కష్టమనగ
లలినిత్య సౌభాగ్యములు। పెంపు దిలకింపు
పంట పొలంతి- సౌభాగ్య మనగ
కలుముల భూదేవి- కడుపు చల్లగగన్న
రైతు జనమ్ముల- రాజ్యమనగ

గీ॥ సస్యశాద్వలమై సిరి సంపదలను
తరళదర హాసయై వసుందర ఫలించు
భావి భారత పౌరుల ఫలమనంగ
పంచ వర్ష ప్రణాళిక భావి కలన.

సీ॥ నవ్య భారత కళా కావ్య ఖండమ్ముల
కవితల్లజుల మేటి కలముపోటు
మధుర మంజులగాన: మాధురీవిభవమ్ము
మహిత గాయక శిఖామణి గళమ్ము
శిధిల శిల్ప కళావిశిష్ఠ బౌద్ధ వినూత్న
చిత్ర నైపుణ్యవిచిత్ర సృష్టి
రాజ్య తంత్రమ్ములన్- రమణ జర్పించెడి
దేశాభిమానుల- ధీబలమ్ము

గీ॥ దిద్ద దేశీయ భావాలు దీప్తినొంది
మేలుధర్మాల పొసగు గీతాలనెన్నొ
రమ్య చాతుర్య శిల్పకళాభ్రరుచిర
రత్న పుంభావ రాసులు రాజ్యరమకు

గీ॥ వసుధ సుందర సస్యశాద్వల మనంగ
పాడిపంటల బహుళ సంపదలు గల్గి
ప్రజలు సుఖియింప జీవనోపాధి గల్గి
రాణ నొప్పారు అలరామ రాజ్యమనగ

గీ॥ గ్రామ సంక్షేమ సంఘ సంస్కరణ విధుల
దేశ సౌభాగ్య మమరు స్వదేశలక్ష్మి
నాయురారోగ్య శుభముల నలరి ప్రజలు
విజయకేతన మెత్తరే। విశ్వమునకు



# మన నవలల్లో స్త్రీపాత్రలు

• శ్రీ మధురాంతకం రాజారాం •

కందుకూరి వీరేశలింగంగారి రాజశేఖర చరిత్ర తెలుగు సాహిత్యంలోని మొదటి నవలగా పేర్కొన బడుతున్నది. "మొదటి నవలను నేనే వ్రాసితిని" అన్న పంతులుగారి వాక్యమే అందుకుప్రమాణము. గద్యతిక్కన గారి అద్భుతలేఖినీ ముఖమున రాజశేఖర చరిత్ర నవలగా ఉద్భవించిన తర్వాతనే ఆంధ్ర వాఙ్మయలోకంలో నవలా యుగం క్రొత్తగా ప్రారంభమైనదనడం నిర్వివాదాంశం.

తెలుగువాళ్ళు ఆదినుంచీ పురాణాలు ప్రబంధాలు చదువు కోడంలో విశేషమైన ఆసక్తి కనబరిచారు. వాళ్ళదృష్టిని గద్యసాహిత్యం పైకి త్రిప్పిన ఘనతకూడా వీరేశలింగం గారికే దక్కుతుంది. వారి తర్వాత అంతటివారైన చిలక మర్తి లక్ష్మీనరసింహంగారు రామచంద్ర విజయం, కర్పూరమంజరి, హేమలత మున్నగు నవలలను తెలుగు పాఠకులకు ప్రసాదించారు.

పుంఖాను పుంఖంగా అనేక నవలలని వెలువరించి చందాదారులతోడ్పాటుతో వాటిని దేశంలో వ్యాప్తి యొనర్చిన కొన్ని గ్రంథమాలల కృషిని ఇక్కడ ఉగ్గ డించడం సమంజసం. మొదటిది విజ్ఞాన చంద్రికా గ్రంథ మాల. చనిపోయి స్వర్గలోకంలోవున్న కొమర్రాజు లక్ష్మణరావుగారి కృషి అది: రెండవది కవికులాలంకారు లైన వేంకట పార్వతీశ్వరకవుల ఆంధ్ర ప్రచారిణీ గ్రంథ మాల. ప్రమదావనం, వీరపూజలాటి అత్యుత్తమ చారిత్రిక నవలలు ఈ గ్రంథమాలనుంచే వెలువడినాయి. మూడవది అద్దేపల్లివారి సరస్వతీ గ్రంథమండలి. నూటికి పైగా మంచి నవలల్ని ఈమండలి ప్రకటించింది. ఇవిగాక నవలల్ని వెలువరించిన గ్రంథమాలల్లో దేశికవితామండలి, యువాబుక్ డిపో, ఆంధ్ర గ్రంథమాల మొదలైనవికూడా చేరుతాయి.

'నవల' మన తెనుగుభాషలో పున్నట్టుండి పుట్టింది కాదు. చమత్కారంతో కూడుకొన్న కథలే 'నవల' అన్న పేరు సార్థకమయ్యేటట్టయితే మన కళాపూర్ణోదయం కూడా నవలే ఔతుంది. ఫ్రాన్సు, ఇంగ్లండు దేశాల్లో పంతొమ్మిదో శతాబ్దంలోనే నవలలు అసంఖ్యాకంగా ఉద్భవించాయి. పాశ్చాత్యనాగరికత యొక్క ప్రభావం మన సాహిత్యంపైకి వ్యాపించిన క్రొత్తలో భారతదేశ భాషల్లోకి ఆదేశపు నవలలు అనువదించబడినాయ్. కొంత కాలం గడచిన తర్వాత రచయితలు మన చరిత్రకు, మన సంఘానికి సంబంధించిన కథావస్తువులనే తీసుకుని స్వతంత్రంగా నవలల్ని వ్రాయసాగారు.

ఆంధ్రసాహితీ కేదారంలో పురాణ, ప్రబంధ వ్యవ సాయాలు ప్రారంభమైన తర్వాత ఎన్నో శతాబ్దాలకుగానీ నవలా వ్యవసాయం ప్రారంభం కాలేదు. ఇందుచేత ఆంధ్రులకు నవలలపైన మక్కువతక్కువ అని చెప్ప డానికి వీల్లేదు. పురాణ సముదాయం 'అరముగ్గిన ముసలి ముత్తయిదువ వేదమాత'లా వారికి ప్రత్యక్షమౌతుంది. ప్రబంధ సందోహం వారికి స్వప్నసుందరి. నవలలుమాత్రం వారి నిత్యజీవితంతో అవినా భావసంబంధాన్ని ఏర్పరచు కుని నానాటికి వారి చిత్తాన్ని బలీయంగా ఆకర్షిస్తున్నాయి.

పురాణాలు తెలుగులో అవతరించి ఎన్నో శతాబ్దులు గడచిపోయినప్పటికీ, అవి యింకా నిత్యనూత్నంగానే మన దృష్టిలో భాసిస్తున్నాయి. అందుకెన్నైనా కారణా లుండవచ్చు. వాటిలో ముఖ్యమైన కారణాన్ని మాత్రం మనం ఇక్కడ మననం చేసుకోవాలి. సీత, సావిత్రి, అనసూయ, అరుంధతి, ద్రౌపది, రుక్మిణి, సత్యభామ మొదలైన అత్యుత్తమ స్త్రీ పాత్రలని అవి ప్రపంచానికి పరిచయం చేశాయి. ఆదర్శరమణీమణుల అత్యద్భుత చరిత్రల్ని అమోఘంగా చిత్రించడం వల్లనే పురాణాలు కాలప్రవాహానికి వేరొడ్డి నిశ్చలంగా నిలబడగలిగినాయ్.

మరి మన నవలాకారులు అలాటి స్త్రీపాత్రల్ని సృష్టింపగలిగారా?—ఇదీ ప్రస్తుతం మనం సమాధానం చెప్పుకోవలసిన ప్రశ్న.

ఈశతాబ్దిలో ప్రపంచ నవలా కారుల్లో అగ్రగణ్యులుగా సుస్మరించబడవలసిన శరత్‌బాబుగారి స్త్రీపాత్రలుకొన్ని భారతజాతికే గౌరవాన్ని సంపాదించి పెడుతున్న అమర సృజనలు. ఆపాత్రల్లో ముఖ్యమైనది 'దేవదాసు'లోని పార్వతి. శరత్ నవలల్లో సైతం దేవదాసి ఉత్తమమైం

దని విజ్ఞులు పేర్కొంటారు. అందుకు కారణంకూడా ఈ పార్వతి పాత్రేనని ఈవ్యాస రచయిత ఉద్దేశం. ఎలాటి ఉద్రిక్త పరిస్థితిలోనైనా మనస్సంయమనం విడనాడు కోకుండా, తనకర్తవ్యాన్ని పుట్టిల్లులోనేగాక మెట్టినింట్లోకూడా సముచితంగా నిర్వర్తించిన పార్వతి భారతీయ స్త్రీత్వానికి చక్కని ప్రతిబింబం. దేవదాసును చదివిన పాఠకులకు పార్వతి పాత్రయొక్కస్మృతి అనిర్వచనీయమైన దివ్యానుభూతిని కలిగిస్తుంది.

శరత్‌బాబు స్త్రీపాత్రలు అక్కచెల్లెళ్ళకంటే ఆత్మీయురాండ్రుగా పాఠకుల హృదయాలకు సన్నిహితులౌతారు. స్త్రీని శృంగార స్వరూపిణిగాగాక సోదరిగా, అర్ధాంగిగా మాతృదేవతగా అనేక దృక్పథాల్లో చిత్రించి శరత్‌బాబు ధన్యుడైనాడు.

తెలుగు నవలల్ని గురించి ఆలోచించడానికి ఉపక్రమించినట్టయితే మొదట మనమనో వీధిలో బంగారు సింహాసనంపైనకూచుని ప్రత్యక్షమయ్యేవారు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు. శరత్‌బాబు ఎంత గొప్ప నవలాకారుడైనప్పటికీ తెలుగువాడు మాత్రంకాదు. ఎవ్వరెంత చెప్పినప్పటికీ ఆయన నవలల్లో ఈవెలితి కనబడుతూనే వుంటుంది. ఒక విషయాన్ని గురించి ఆలోచించవలసినా, ఒకమాట చెప్పవలసివచ్చినా తెలుగువారి ధోరణి వేరు. అది విశ్వనాథకు తెలిసినట్లు మరెవరికీ తెలియదు. వేయిపడగల్లో జమీందారిణి రుక్మిణమ్మారావునుంచీ రామేశ్వర శాస్త్రిగారి నాలుగో భార్యవరకూ సుమారు ఇరవైముప్పై స్త్రీపాత్రలు అచ్చంగా ఆంధ్ర దేశానికీ సంబంధించినవి. తెలుగు జమీందారీల ధాతృత్వానికీ, దైవభక్తికి చిహ్నంగా మిగిలిన రుక్మిణమ్మారావు, పతిసేవాపరాయణ అరుంధతి, దేవదాసిగిరికీ, గణాచారి — ఈపాత్రలు మరచిపోదామన్నా మరపురానివి.

చరిత్రహీనలైన స్త్రీపాత్రల్ని చిత్రించడంలో శరత్‌బాబుకొక ప్రత్యేకతవున్నది. ఆ ప్రత్యేకత విశ్వనాథలోనూ పుష్కలంగా వున్నది. వేయిపడగల్లో మంగమ్మ, చెలియలికట్టలో రత్నావళి ఈరెండు పాత్రలూ రెండు అగ్నిజ్వాలల్లా మనకు గోచరిస్తుంటాయి. చరిత్ర హీనుల్ని సృష్టించి గాలిపాటుకు విడిచిపెట్టకుండా, వారిలో సంపూర్ణమైన మానసిక పరివర్తనాన్ని కలిగించి, వారిద్వారా లోకానికి గొప్పగుణపాఠాల్ని తెలియజెప్పడమనే ఇంద్రజాలం విశ్వనాథలేఖినికి వెన్నతో బెట్టిన విద్య.

మంగమ్మ మంచిదే. కానీ పరిస్థితుల ప్రాబల్యంవల్ల చెడిపోయింది. కానీ సాంప్రదాయకంగా సంక్రమించి ఆమెలో ప్రచ్ఛన్నంగా దాగివుండిన భారతీయ స్త్రీత్వం మాత్రం టకీమనీ చనిపోలేదు. అది ఆమె మనసులో తిరుగుబాటురేపింది. ఆమె పశ్చాత్తాపపడింది. తన జీవన విధానాన్ని సరిదిద్దుకున్నది. మళ్ళీ సంఘంలో గౌరవనీయగా మెలగింది. ఇరుగుపొరుగువారిని తల్లిలా ప్రేమించింది. కడకుచావరానివిధంగా చనిపోయింది. వేయిపడగల్లో మంగమ్మ ఉపాఖ్యానం పాఠకుడి హృదయాన్ని కదిలించేటటువంటిది.

విశ్వనాథ నవలల్లో తీవ్రమైన ఝంఝూమారుతంలా పాఠకుల్ని ఉద్విగ్నపరిచేది 'చెలియలికట్ట' నవలాశిల్పం ఈనవలలోలా మరే తెలుగు నవలలోనూ పరిణితం చెందలేదని చెప్పడం సాహసం కానేరదు.

తొలియౌవనపు పొంగులో మానసిక దౌర్బల్యంచేత రత్నావళి రంగారావు ఉపదేశ ప్రభావానికిలోనై భర్తను పరిత్యజించి పట్టణానికి వెళ్ళిపోతుంది. అప్పుడామెకు ప్రపంచం యొక్క వాస్తవ స్వరూపం ప్రత్యక్షమౌతుంది. పవిత్రమైన సాంసారిక జీవితంలో గృహిణికి కలిగే మనశ్శాంతి, విచ్చలవిడిగా నూలులేని గాలిపటంలా మెలగే దుశ్శీలకు కలుగదని ఆమె తెలుసుకుంటుంది. ఆవిషయం తెలియగానే ఆమె తుచ్ఛములైన శారీరక సౌఖ్యాలకు తిలోదకాలిచ్చి సన్యాసినిగా మారిపోతుంది ఈపరిణామాన్ని చిత్రించడంలో విశ్వనాథవారి ప్రతిభ రచనాశిల్పం యొక్క పరమావధిని అందుకున్నది.

కవిసాంమ్రాట్‌గారి నవలల్లో 'ఏకవీర'ని చాలామంది భావుకులు ప్రశంసిస్తూ వుంటారు. 'ఏకవీర'లాంటి స్త్రీపాత్రని సృష్టించగలగడం విశ్వనాథకొక్కరికి మాత్రమే సాధ్యమయ్యేపని. అలాంటి పాత్రలు సాహితీదేవతకు అమూల్యాభరణాలు.

మన నవలాకారుల్లో విశ్వనాథను సూర్యుడుగా పేర్కొన్నట్టయితే, అడివి బాపిరాజుగారిని నిస్సందేహంగా చంద్రుడితో ఉపమించవచ్చు. బాపిరాజుగారికి నారీలోకం పట్టగల భక్తి ప్రపత్తులు అసాధారణాలు. అందుకు వారి అనంతలక్ష్మి, శారదలు తార్కాణాలు.

భారతదేశపు సతీత్వమంటే కన్నీరునించడమూ, బాధల్ని భరించడమేనన్నాడు రవీంద్రకవీంద్రుడు. నిజానికి ఆమాట కొన్నిసమయాల్లో కొంతవరకూ సత్యమే అయినప్పటికీ, భారతదేశపు సతీత్వమంతా యాతనామయం మాత్రం కాదు. గృహాన్ని స్వర్గసీమగా మార్చవలసిన బాధ్యత నారీమణులది. ఆ బాధ్యతని వాళ్ళచేత గుర్తింపజేయడానికి మన తెలుగు నవలలు చాలమట్టుకు తోడ్పడుతున్నాయి.



# "నృసింహవిలాసము"

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

ఇది మూడా శ్వాసముల అముద్రిత ప్రబంధము. దీని కర్త— నల్లాన్ చక్రవర్తి నృసింహదాసు. ఇతడు వైష్ణవుడు.

ఈతడు 18 వ శతాబ్దమున ఉత్తరార్ధమున నుండెను. ఈతడీ గ్రంథమునే గాక- పద్మినీ పరిణయము, శ్రీరంగ మాహాత్మ్యమును రచియించెను.

గరుడాచలము యక్షగాన మాధారముగ నీ కావ్యమంతయు మాంచి ద్రాక్షా పాకమున నలరారుచున్నది.

ఈ అముద్రిత ప్రతి యొకటి ముప్పది సంవత్సరముల క్రిందట స్వసంఘ గ్రంథాలయము (విశాఖ పట్టణము) వారికి చేరినది. నేడిది కవితా సమితి గ్రంథావళిగా వెలువడనున్నదని చెప్పుటకు సంతసించుచున్నాను.

కవి తన కావ్యమును— నెల్లూరు నందలి మూల స్థాన నివాసియు, నాడు- సంపన్న గృహస్థుడో, చిన్న జమీనుదారుడో అయిన వెనచెర్ల సుబ్బారాయునికి అంకిత మిచ్చియున్నాడు.

ఈ పద్యములా ప్రబంధములోనివి:—)

స్థా. రు.

ఔరా ! యెక్కడి మాటలిట్టి సుకుమారాంగుండ
వీవాయ్యనఁ
దోరంబౌ విభవంబు బోవిడిచినాతోగూడి నిమ్నోన్నత
స్ఫార గ్రావము లెక్కగలవే చాపంబుల్ దొనల్
దూపులుఁ
ధీరత్వంబున బూని వేటలకు నే తేరంగ శక్తుండవే.
ఇంత ప్రయాసమేమిటి కహన మనోహర వేష !
కొండలఁ
వంతల కోనలఁ దిరిగి వానకు నెండకు గాలికగ్ని క
త్యంతముడస్సి కక్కశమృగాళులబొంచి వధించనేర్తువే
కొంతిగ దాచనేల బలుగొందులు సందులు దూరనేర్తువే.

నెర భజియింప గలవె
కరమరుదుగ దొబ్బగ్రోల గలవే మృదుతా
కరకుట్లు గుడువ గలవే
సరిచవిగన గలవె కీకసవులో రసముఁ.
సెలవుల నాకుచున్ దనదు చేరువగబ్బుకు నీగలాడ నీ
డలకడ బొంచుచుఁ ఘుటఘుట ధ్వనితోగను
చౌకలింపుచున్
చలమున వీగిపై దుముకు చారమెకంబుల నుబ్బణంగ బి
బ్బలనదలించి వాని తడబాటు మెయిన్ సడలింప నేర్తువే
పదను గల పుల్గులను- బట్టవలె గొట్టవలె
తుదమొదలు నీరముల- దూరవలె చేరవలె
ములుకులను జీవముల- మొత్తవలె నెత్తవలె
బలిసి విరి తేనియల- బాలవలె గ్రోలవలె
కొనలుగల పండులను- గోయవలె డాయవలె
నునుపుగల నివ్వరుల-నొక్కవలె మెక్కవలె
తరుచునిడు దిబ్బలను- దాటవలె బైటవలె
నిరుపుగల చట్టులకు- నెక్కవలె నిక్కవలె
కొనవెదురు బియ్యముల—గోరవలె నేరవలె
కునుకునడ నిప్పలను-కువ్వవలె బువ్వవలె
జిగురునను కండెలను—జేయవలె రోయవలె
పగలు గల జంతువులను- బాదవలె బీదవలె
నెమిలికను భూషలను- నించవలె నుంచవలె
చమురుగల పక్కిగమి— జంపవలె జింపవలె
తిరుమణిని చూర్ణమును— దిద్దవలె బెద్దవలె
హరికథలు వేణువుల- నాడవలె బాడవలె
తరుచు జిగినారలను— దట్టవలె గట్టవలె
పరువుగల వారనగ- బారవలె మీరవలె.
ఓర్మిచే జుంటుతేనియ లొడువగలవె
పారుటాకుల వల్వపై బడయగలవె
యీ పనులనెల్ల జేయగ నోపితేని
నెటినెటింగింపు మరలేక నీటుకాడ !
అని యడిగిన శ్రీవత్సలాంఛనుండిట్లనియె.



# ఆసియా వాణి



"మానవ సౌభ్రాత్రంలో నీకు
మాన్పరాని విశ్వాసంఉంది గనుక
మానవాభ్యుదయ విరోధకులను
మాటి మాటికీ ఎదిరించగలవు."




రుద్రమ్మ భుజశక్తి




# ఫ్లయింగ్ సాసర్లు

కొన్ని యేండ్లబట్టి ఫ్లయింగ్ సాసర్ల విషయమై పత్రికలలో వార్తలు ప్రకటింపబడుతున్నాయి. సాసర్ ఆకారంలో నున్న వస్తువులు విమానాలవలె ఆకాశంలో ఎగురుతున్నాయని దేశదేశాలనుండి పరిశీలకులు చెప్తున్నారు. కనిపించుతే తడవుగా మహా వేగంతో పరుగెత్తి మాయమౌచున్నందువల్ల వాటి గురించి వివరాలు సేకరించడానికి సాధ్యం కావడం లేదని వాటిని చూచినవారిలో చాలమంది నిరుత్సాహంగా ప్రకటించేరు. నార్వే, ఫ్రాన్స్, ఇంగ్లండ్, అమెరికా దేశాలలో ఫ్లయింగ్ సాసర్లు కనిపిస్తున్నాయి. ఇదమిద్ధమని నిర్ణయం కాని వాటిగురించి రక రకాల ఊహాలు బయలుదేరేయి.

మనకంటె ఎక్కువ సంస్కృతిగల పరలోకవాసులు విమానాలలో భూమిపై అవతరిస్తున్నారని భావించేవారు కొందరు ; ఎటామిక్ శక్తితో రహస్యంగా పరిశోధనలు చేస్తూన్న అమెరికా రష్యా దేశాలలో ఒక దేశంనుండి అవి ఎగురుతూన్నట్లు భావించేవారు కొందరు ; వాతావరణ వాయువు వేడెక్కినప్పుడు దానిలో కలిగే సంచలనం మూలంగా కొన్ని అనుకూల పరిస్థితులలో ఆ వాయు బొండాలే అట్టి భ్రమ కలిగిస్తున్నాయి. కాని, నిజంగా ఎగిరే వస్తువులు మాత్రం ఫ్లయింగ్ సాసర్లు కావని వాదించేవారు మరికొందరు ; ఈ విధంగా భేదాభిప్రాయాలకు అవకాశం కలిగింది.

ఈ మధ్య సంభవించిన రెండు సంఘటనలు ఫ్లయింగ్ సాసర్లపై చర్చను తీవ్రంగా రేకెత్తించేయి. ఈ సెప్టెంబరు మొదటి వారంలో నార్వే దేశమందలి ఒక గ్రామంలో ఇద్దరు యువతులు, అక్కచెల్లెండ్రు, పళ్ళను ఏరుకొనుచుండగా ఎవరో వారిని పిలిచినట్లైందిట. వారు తలెత్తి చూడగా పొట్టి మనిషి, గెడ్డాలు కలవాడొకడు వారిని పిలిచి ఒక ప్రక్క చూపించేడు. కొంత దూరంలో వారికొక పెద్ద పళ్లెం వంటి వస్తువు గోచరించింది. దాని ఉరవరమారమి 15 లేక 16 అడుగులున్నట్లు వారు అంచనా వేసేరు. బోర్లించిన పళ్లెంవలె ఉందది. ఆ పొట్టి మనిషి వారితో సంభాషించడానికి ప్రయత్నించేడు. ఆ యువతులకు వచ్చిన జర్మన్, ఫ్రెంచి మొదలగు భాషలలో సంభాషించడానికి వారు కూడా ప్రయత్నించేరు. కాని, ఆ పొట్టివానికే భాషతోను పరిచయమున్నట్లు కనిపించలేదు. ఏవోవో కొన్ని సంజ్ఞలు చేసేడు, కాని, యువతులకా సంజ్ఞలు అర్థం కాలేదు. ఈ విధంగాకొంత కాలం గడిచింది. తరువాత అతనా పళ్లెం వలెనున్న వస్తువులో దూరిపోయేడు ; వెంటనే అది పైకెగిరిపోయింది. ఆశ్చర్య చకితులైన ఆ యువతులు చూస్తూండగానే ఆ పళ్లెం పైకెగిరి వారి దృక్పథం దాటిపోయింది.

ఆవిషయంవారు ముచ్చటించగా ఆ గ్రామం పోలీసులు వారిని విడివిడిగా ప్రశ్నించి, వారు చూచిన దాన్ని యథా

శ్రీ వసంతరావు వేంకటరావు

ర్థంగా వర్ణించమన్నారు. యువతులు ప్రౌఢలూ, ప్రాజ్ఞులూను. ఇద్దరు ఒకే విధంగా వర్ణించినట్లు వార్తలు ప్రచురింప బడ్డాయి. ఆ వస్తువు ఫ్లయింగ్ సాసరై యుండ వచ్చుననుకున్నారు.

ఇది జరిగిన ఒక వారం లోపుగా ఉత్తర ఫ్రాన్సులోని క్వరౌబిల్‌లో ఒక విశేషం జరిగింది. మార్లు డివిల్డే అను కార్మికుడు ఒక శుక్రవారం (10- 9- 54) రాత్రి తన ఇంట్లో చదువుకొంటూండగా వాని కుక్క 'కి కి' మొరగడం మొదలుపెట్టింది. అటువైపు చూడగా తన తోటలో రైల్వే లైను దగ్గర నల్లగా ఏదో కనిపించింది. వెంటనే టార్చిలైటును అటు త్రిప్పేడు. సుమారు 3½ అడుగుల పొడవుగానున్న ఇద్దరు ఆ కాంతిలో కనిపించేరు. వారి భుజాలు వెడల్పుగా నున్నాయి. వారు ముఖాలు ధరించేరు. వారి తలపై పెద్ద టోపీలవంటి శీర్షకాలున్నాయి. వారి శరీరాలకు అనువైన కాళ్ళు వారికున్నాయి ; చేతులు కనిపించలేదు. వానిని హెచ్చరించడానికి డివిల్డే ప్రయత్నించగానే రైలు మార్గంపైనున్న నల్లటి వస్తువునుండి ఉజ్వలమైన ఆకుపచ్చటి కాంతి వెలువడింది. అతని కళ్ళు జిగేలుమన్నాయి ; మతి పోయినట్లనిపించింది. అతను తేరుకొని చూచేసరికి ఆ వస్తువు పైకెగురుతూంది దాని నుండి నల్లటి పొగపైకి వస్తూంది. అది పళ్లెం వలె కనిపించింది. దాని పొడవ 15, 16 అడుగులుంటుంది. దూరంగా పోతూండగా ఎర్రగా కనిపించింది ; కొద్ది కాలంలో మాయమైంది.

మార్లుడివిల్డే వయస్సు 34 సంవత్సరాలు. కార్మికుడైనప్పటికి బాధ్యతగల పౌరుడుగా ఈ విషయం ప్రకటించగా ఫ్లయింగ్ సాసర్ ఎక్కడ దిగిందో ఆ స్థలాన్ని పోలీసులు పరిశీలించేరు. అది దిగిన దగ్గర మాత్రం రాళ్ళు కాలినట్టు గుర్తులున్నాయి. అంతకంటె వేరేమీ పోలీసులకు ఆచూకీ దొరకలేదు.

కొద్ది రోజుల వ్యవధిలో జరిగిన పై రెండు సంఘటనలను సత్య విహారాలని కాని, విభ్రాంతులని కాని త్రోసివేయరాదు. పళ్ళెం ఆకారంలోనున్న విమానాలు భూలోకంలో ఇంతవరకు నిర్మింపబడినట్టు వినలేదు. నిలువుగా ఎగిరే హెలికాప్టర్లున్నాయి. అవికూడా విమానాల్లాగే నడుస్తాయి. కాని, ఫ్లయింగ్ సాసర్ వలెనున్నవి మన లోక విమానాలు కాకపోవచ్చును ; ఆ భావానికే ఎక్కువ అవకాశమున్నట్లు కనిపిస్తూంది.

అయితే, ఈ ఫ్లయింగ్ సాసర్లు ఎక్కడనుండి వచ్చేయి? కుజగ్రహంనుండి వస్తున్నాయనడమే సమంజసమేమో! ఏమంటే, చంద్రుని పరిశీలించినంతవరకు, చంద్రునిలో వాతావరణ పరిస్థితులను సమీక్షించినంతవరకూ, చంద్ర లోకంనుండి అవి వస్తున్నాయనడానికి ఆధారాలులేవు. చంద్ర గోళం మృత గ్రహమని భావించడానికే బలమైన కారణాలు కనిపిస్తున్నాయి. చంద్ర తలంపై విరివిగా నున్నది అగ్ని పర్వతాలనుండి వెలువడి, క్రమేణ చల్లారిన లావా. జీవ వికాసానికి ఏ విధంగాను అది తోడ్పడుతుందని చెప్పలేము. కాబట్టి, చంద్ర లోకంనుండి ఫ్లయింగ్ సాసర్లు వచ్చే అవకాశం లేదు.

భూమి యొక్క ఉపగ్రహమై, మనకు సమీపతమంగా నున్న చంద్రుని విడిచినట్లైతే భూమి కిరువైపులనున్న శుక్రుని విషయం, కుజుని విషయం విచారించాలి. మన కంటె సూర్యునికి దగ్గరగానుంది శుక్రగ్రహం ; మన కంటె సూర్యునికి దూరంగా నుంది కుజగ్రహం. భూమిపై పడే సూర్య రశ్మికంటె ఎక్కువగా శుక్రునిపైని, తక్కువగా కుజునిపైని పడుతుంది. సూర్యుని చుట్టు తిరుగుతూన్న నవగ్రహాలు పుట్టినప్పటినుండి వాటి వేడిమిని శూన్యాకాశంలోనికి ప్రసరిస్తూ చల్లారుతునే ఉన్నాయి. వాటికి అదనంగా లభించేశక్తి సూర్యరశ్మి మాత్రమే. గ్రహాల వేర్వేరు దూరాలచేత కుజునిపైకంటె శుక్రునిపై అధికంగా సూర్య రశ్మి పడుతుందని గమనించేము.

వేడి వస్తువు చల్లారినప్పుడు అదెంత త్వరగా చల్లారుతుంది అను విషయం దాని పరిమాణంపై ఆధారపడి ఉంటుంది. శుక్రుని వ్యాసం 7600 లక్షల మైళ్ళు ; కుజుని వ్యాసం 4200 మైళ్ళు. సూర్యుని నుండి శుక్రుని దూరం 670 లక్షల మైళ్ళు ; కుజుని దూరం 1410 మైళ్ళు. శుక్రుని కంటె కుజుడు చిన్నదౌటచేతను, సూర్యునికి దూరంగా నుండుటచేతను, సాపేక్షంగా, శుక్రకుజులలో కుజగ్రహమే వేగంగా చల్లారుతుండాలి.

శుక్రునికి మన భూమికి సామ్యముంది. వాటి పరిమాణాలు, రమారమి, ఒకటే. వాటి సాంద్రతలు, సుమారుగా, సమానమే. వాటి బరువులో సైతం అట్టే వ్యత్యాసం లేదు. కాని సూర్యునికి మన భూమికంటె శుక్రుడు 260 లక్షల మైళ్ళు దగ్గరగానుంది. కాగా, కాలపరిణామంలో గ్రహాలు చల్లారుచునప్పుడు శుక్రుని కంటె భూమి, భూమి

కంటె కుజుడు ముందుగా చల్లారి, అక్రమంలోనే వాటి తాపక్రమాలు కూడా తగ్గేయి.

జీవంతో భూమి కలకల లాడుతూంది క్రమక్రమంగా అనేక దశలు గడిచిన భూమిలో ఒకానొకప్పుడు జీవం జన్మించింది. ఎట్లు జన్మించిందో ఇదమిద్ధమని ఎవరికి తెలియదు. ఏక కణ రూపంలో జన్మించిన జీవం పరిణామం మొంది, బహుళ జీవగణాలుగా మారి, తుదకు మేధావంతుడైన మానవ రూపం ధరించింది. మన మెరిగిన జీవం కొన్ని నియత భౌతిక పరిస్థితులలో మాత్రమే వర్ధిల్ల గలదు. కేవలం అనుకూల భౌతికావస్థలే జీవోద్భవానికి కారణమైతే, అట్టి సమయమందు మన భూమిలో జనించినట్లే జీవం ఏ ఇతర గ్రహంలోనైనా జనించడానికి అభ్యంతరం లేదు.

జీవానుకూలమైన తాపక్రమం కుజునిలో మొదట కలిగి ఉండాలి; అది సూర్యునికి భూశుక్రులకంటె దూరంగా నుంది. తరువాత కొంత కాలానికి భూమిలోను, మరి కొంత కాలం పోయిన పిమ్మట శుక్రునిలోను జీవం పుట్టిందనుకొనడం సమంజసము, ఇప్పుడు శుక్రునిలో జీవం ఉన్నప్పటికి, శుక్రవాసులు భూవాసులంత మేధావంతులు కారని చెప్పవచ్చును. శుక్రునిలో జీవ పరిణామం సాగుతూంది. మానవుని వంటి బుద్ధిమంతులు ఇప్పుడు శుక్రునిలో లేకపోవచ్చును; కొన్ని లక్షల సంవత్సరాలు పోయిన తరువాత శుక్రుడు కూడా మేధావంతులైన జీవులతో కలకలలాడుతుంది. అంటే, ప్రస్తుతం శుక్రునిలో మనవంటి బుద్ధికుశలురు లేరని చెప్పడానికే అవకాశం ఎక్కువ. కాబట్టి ఫ్లయింగ్ సాసర్లు శుక్రవాసుల విమానాలు కావు.

భూమిలో కంటె కుజునిలోనే ముందుగా జీవోద్భవమై యుండాలని గమనించేము. భూమికంటె కుజుడు వేగంగా చల్లారుతూ అంతరుష్ణాన్ని కోల్పోతూంది. కుజవాసులు మనకంటె కొన్నివేల సంవత్సరాల పూర్వమే ప్రకృతి పరిశోధనకు పూనుకొని, భౌతిక విజ్ఞానాన్ని పెంపొందిస్తూ ఉండాలి. వారిలోకాన్ని విడిచి ఇతరలోకాలకు ప్రయాణం చేయడానికి వారు కూడా ప్రయత్నిస్తునే ఉండాలి. రసాయనిక శక్తి, ఎటామిక్ శక్తి సౌరశక్తి మొదలైన శక్తులను, మనవలె, వారుకూడా వినియోగిస్తూండాలి. అట్టి పరిస్థితులలో పళ్లేల వంటి విమానాలను వారు నిర్మించ కలిగేరంటే వింతకాదు. మన లోకంలోనైనా, పక్షులను పోలిన విమానాలతో ప్రారంభించేము. క్రింద పరుగెత్త నవసరం లేక నేరుగా మీదికెగిరే హెలికాప్టర్లను నిర్మించేము. విశాలమైన రెక్కల అవసరం లేని రాకెట్లను తయారు చేస్తున్నాము. అందుచేత, రెక్కల నిమిత్తం లేకుండా పళ్లెం వలెనున్న ఫ్లయింగ్ సాసర్లను కుజ శాస్త్రజ్ఞులు నిర్మించేరంటే ఆశ్చర్యం కాదు.

సూర్యుని చుట్టు గ్రహాలు నిత్య పరిభ్రమం చేస్తూన్న సందర్భంలో ఏ రెండు గ్రహాల మధ్యనున్న దూరమైన మారుతూంటుంది. కుజునికి భూమికి గల దూరం 400




లక్షలనుండి 2400 లక్షల మైళ్ళవరకు మారుతూంది. సూర్యునికి భూకుజులు ఒకే వైపున నున్నప్పుడు అవి అత్యంత సమీపంగా నుంటాయి; సూర్యునికి ఇరువైపుల నున్నప్పుడు వాటి దూరం అత్యధికం. చిత్రం 1లో అది స్పష్టమౌతుంది. భూమి కుజుడు 1, 2 స్థానాలలో నున్నప్పుడు అవి దగ్గరగాను, 3, 4 స్థానాలలో నున్నప్పు దూరంగాను ఉంటాయి.

గ్రహాలు వృత్తాకార కక్ష్యలలో సూర్యుని చుట్టు తిరుగుచుంటే ఈ సమీపతను దూరం ఎప్పుడు ఒక్కటే అవుతుంది. కాని, అవి దీర్ఘ వృత్తాకారకక్ష్యలలో తిరుగుతున్నాయి. అందుచేత, భూకుజులు సూర్యునికి ఒకేవైపున ఉన్నప్పటికి వాటి సాపేక్ష స్థానాలబట్టి వాటి దూరం మారుతుంది. చిత్రం 2 నుండి ఆ విషయం స్పష్టమౌతుంది. ఈ జూన్ (1954) నెలాఖరున భూమికి 403 లక్షలమైళ్ళ




దగ్గరగా కుజుడు వచ్చేడు. 1956లో ఈ దూరం ఇంకా తగ్గుతుంది. అప్పుడు వాటి మధ్య దూరం 366 లక్షల మైళ్ళు. దూర దర్శినితో కుజుని పరిశీలించడానికది చాల అనుకూలమైన సమయం. శాస్త్రజ్ఞుల జట్లు కొన్ని ఆ శుభ సమయానికై నిరీక్షిస్తున్నాయి. సున్నితమైన ఉపకరణాలతో కుజుని పరీక్షించి, అందులో జీవం ఉందో లేదో నిర్ణయించడానికవి సన్నద్ధమై యున్నాయి.

కుజుని సంవత్సరం మన సంవత్సరానికి సుమారు రెండు రెట్లు. ఆలోకంలో ధ్రువాలవద్ద మంచువంటి తెల్లటి పదార్థం కాలాను గుణ్యంగా ఏర్పడుతూండడం, కొంత కాలానికి అది కరగిపోయినట్లు మాయంకావడం విజ్ఞానులు చూస్తున్నారు. మన లోకంలోవలెనే అక్కడ కూడా వేసవి కాలం, వర్షకాలం మొదలైన కాలాలున్నాయనడానికి నిదర్శనాలు లేకపోలేదు. అక్కడ వ్యవసాయం సాగుతున్నట్లుంది. అందుచేత, అనుకూల పరిస్థితులలో ఆదిని కుజునిలో జీవోద్భవమై యుంటే ఆ జీవం పరిణామం చెందుచుండాలి. మనకంటె మేధావంతులక్కడ ఉండడానికే అవకాశముంది. పుట్టిన జీవం నాశనం కావడానికంగీకరించదు పరిసర పరిస్థితుల కనుగుణ్యంగా జీవిత విధానాలు మార్చుకొంటూ, ప్రకృతితో తీవ్రంగా పోరాడుతూ, ఏదో విధంగా వర్ధిల్లడానికి నిత్యం ప్రయత్నిస్తుంది.

జీవ పరిణామ విశేషం ఒక్కటుంది. పరిణామ క్రియలో జీవియొక్క శరీరం కృశిస్తూ మెదడు పెరుగుతుంది. మెదడుతో పాటు బుద్ధి కుశలత అధికమౌతుంది. దానితో ప్రకృతి పరిశీలన సాధ్యమౌతుంది. ప్రకృతిని లోబరచుకోడానికై ప్రయత్న మారంభమౌతుంది. అందుచేత, కుజలోక వాసులు సాంస్కృతికంగా మనకంటె పురోగాములని అంగీకరించాలి. ఈ సమయంలో భూమి వారికి దగ్గరగా వచ్చిందని గ్రహించి, ఫ్లయింగ్ సాసర్లలో భూముఖంగా వారు ప్రయాణం చేస్తున్నారనుకొనడం అతిశయంగాదు.

వందలకొలది పరిశీలకులు ఫ్లయింగ్ సాసర్లను చూచినట్లు ప్రకటింపబడింది, ప్రకటింపబడుతూంది. అయితే అన్ని విమానాలలో ఒక్కటైనా ప్రమాదవశాత్తు భగ్నంకాదా అను సందేహం కలుగుతుంది. ఇంతవరకు అట్టి సంఘటన జరగలేదు. దీనికి సరియైన జవాబు జర్మన్ శాస్త్రవేత్త హెర్మన్‌ఓబెర్త్ ఇచ్చాడు. 1954 అక్టోబర్ 4వ తేదీని హేంబర్గ్‌లో ఉపన్యసిస్తూ ఫ్లయింగ్ సాసర్లున్నాయని స్పష్టీకరించేడు. ఆయన రాకెట్ నిర్మాణంలో నిపుణుడు; జర్మన్ ఎస్ట్రోనాటికల్ సొసైటీయొక్క గౌరవాధ్యక్షుడు. ఆకాశ విహారం చేసే వస్తువులలో అధమం పదింట ఒక్కటి ఫ్లయింగ్ సాసరన్నాడు. వాటిలోనున్న విమాన చోదకులు మానవులవలె ఉండవచ్చునన్నాడు. వారిని "యూరెనైడ్స్" అని నామకరణం చేసేడు. సాంస్కృతికంగా మనకంటె యురెనైడ్స్ కొన్ని వేల సంవత్సరాలు ముందుండ వచ్చునని అతని అంచనా. ఒక్క ఫ్లయింగ్ సాసరైనా భూలోకంలో భగ్నం కాకపోడానికి కారణం కుజ లోకవైమానికుల అంత్యత సామర్థ్యమై యుండవచ్చునన్నాడు మన కూహాతీత మైనప్పటికి కుజలోకవైమానికులు మనతో సంప్రదించడానికై వాంఛించకపోవచ్చునన్నాడు.

విమానాలతో భౌమ్యాకర్షణ శక్తిని ప్రతిఘటించి భూమిని దాటి పోడానికి సాధ్యం కాదనుకొన్నారు. ఏమంటే గాలిలేనిదే విమానాలు ఎగరలేవు. కాని రాకెట్టుకి ఆ బాధలేదు. అది శూన్యాకాశంలో కూడ ప్రయాణం చేయగలదు. అయితే, రాకెట్టుని నడపడానికి అనువైన పదార్థం దొరకదేమో అని సందేహించేరు. పరమాణు శక్తిని విడిపించడం నేర్చుకున్నాక ఆ సందేహం తీరిపోయింది. చంద్రలోకానికి, కుజలోకానికి పోగల రాకెట్లను తయారు చేయగలమని విజ్ఞానులు ధైర్యంగా నున్నారు. పరమాణు శక్తి మన చేతజిక్కి పదేండ్లైనా కాలేదు. అప్పుడే దానిని నిర్మాణాత్మకంగా వినియోగించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

# ఫ్లయింగ్ సాసర్లు

వైజ్ఞానిక దృష్టితో ఫ్లయింగ్ సాసర్ల విషయం సమీక్షించినప్పుడు అవి మన లోకంలో తయారైనవి కావనీ, పరలోక వాసులూ, మనకంటె సాంస్కృతీ పరులూ అయిన మేధావంతులు వాటిని నిర్మించి ఆకాశ విహారం చేస్తున్నారనీ, అట్టి పరలోక వాసులలో కుజ వాసులు మాత్రమే అట్టి బుద్ధి బల సంపన్నులయే అవకాశముందనీ స్పష్టమౌతుంది. అందుచేత, అవి కుజలోక వాసుల విమానాలు; వారు మన భూమిలో జొరబడడానికి చేస్తున్న ప్రయత్న ఫలితంగా ఆకాశంలో అందంపు ఫ్లయింగ్ సాసర్లు కనిపించి మాయమౌతున్నాయి ఇదొక సిద్ధాంతం.

ఈ సిద్ధాంతాన్ని బలపరచిన హెర్మన్ ఓబెర్త్ మరొక వాదాన్ని ప్రతిపాదించేడు. క్రిందటి ప్రపంచయుద్ధం చివరని 1945 వ సంవత్సరంలో V-7 అను రాకెట్లను జర్మనులు తయారు చేయడానికి సన్నాహాలు చేసేరు. యుద్ధానంతరం ఆ రకపు రాకెట్లు రష్యావారి వశమయేయి. వాటినే సమగ్రంగా పెంపొందించి నేటి ఫ్లయింగ్ సాసర్ల రూపంలో రష్యావారు వినియోగిస్తున్నారేమో అని ఓబెర్త్ అభిప్రాయం. ఆ భావానికి తావులేదనడానికి వీలులేదు. కానీ, కొందరు జర్మన్ విజ్ఞానులు అమెరికాలో నున్నారు. V-7 రాకెట్టును ఆవిధంగా వారు మాత్రం వినియోగించలేరా? బ్రిటిష్ వైమానికులు సైతం ఫ్లయింగ్ సాసర్లను చూచినట్లు ఒప్పుకొన్నారు. వారు సైతం ఆశ్చర్య చకితులయ్యేరు. అంటే, రష్యన్లు ప్రయోగిస్తూన్న రాకెట్లే ఫ్లయింగ్ సాసర్లని భావించడానికి అవకాశం తక్కువ. అది కుజగ్రహ వాసుల విమానాలను కొనడానికే ఎక్కువ ఆధారాలున్నాయేమో!

ఫ్లయింగ్ సాసర్ల విషయమై ఈ మధ్య మరికొన్ని చిత్రమైన వార్తలు ప్రకటింపబడ్డాయి.

ఫ్రెంచ్ అట్లాంటిక్ తీరముననున్న బలొరాన్ అను ద్వీపములో ఇద్దరు కుజ వాసులను చూచినట్లు మార్విద్ అను ఉపాధ్యాయుడు ప్రకటించేడు, వారిద్దరు స్త్రీలు; పొడవు 5 అడుగుల 7 అంగుళములు. వారు తోలుశిర్షకాలు, జోళ్ళు ధరించి అందంగా నున్నారట. మార్విన్ వద్దనుండి వారు కలాన్ని పుచ్చుకొని ఏవో కొన్ని గీతలు గీసేరట. అవి మార్విన్‌కి బోధపడలేదు; కాని, వాటిని భద్రపరచేడు. వారు ఫ్లయింగ్ సాసర్లో దిగేరట.

న్యూసౌత్ వేల్స్‌లోనున్న విక్టోరియాలో ఫ్లయింగ్ సాసర్ యొక్క ఫోటోగ్రాఫు తీసేరని ఒక వార్త. ఒక గొర్రెల సంస్థలో పనిచేస్తున్న జి.జె. పోర్టర్, తను తీసిన ఫ్లయింగ్ సాసర్ యొక్క ఫొటోగ్రాఫులను సివిల్ ఏవియేషన్ శాఖకు పంపించేడు. 500 అడుగుల ఎత్తున మెల్లగా గమించుచు విపరీత ధ్వని చేస్తూన్న వస్తువు యొక్క ఫొటోలు మూడు తీసేడు. వాటిని పరీక్షించిన రీజినల్ డైరెక్టర్ హెప్‌బర్న్ ఆ ఫొటోగ్రాఫులు సత్యమైనవో కావో చెప్పలేదు. కాని, ఆ వస్తువు బోర్లించిన కప్పువలె కూడ నున్నదనీ, వాటిని చూచిన వారిలో నూటికి 99 మంది అవి నిజమైన ఫొటోలుగా భావిస్తారని అన్నాడు.

జర్మన్ విజ్ఞాని ఓబెర్త్ ఉపన్యసిస్తూ, ఫ్లయింగ్ సాసర్లు నిజమైన మూర్తులే అనీ, అవి పరలోకంనుండి వస్తున్నాయని నమ్మడానికి ఆధారం లేకపోలేదనీ అన్నాడు. అయితే, వాటిలోనుండి జీవులు పైకిరాకపోవడానికి కారణం వారికి మానవులంటే భయమైనా కావచ్చు. లేదా, వారు ఫ్లయింగ్ సాసర్‌నుండి దిగనక్కరలేకుండ భూమి విషయమై భోగట్టాలు సేకరించు యంత్రాలు సున్నితమైనవి సాసర్లో ఉండవచ్చునని అభిప్రాయపడుతున్నారు.

రహస్య బొంబాయిలోను హైదరాబాద్‌లోను కూడ ఫ్లయింగ్ సాసర్లు కనిపించినట్లు వార్తలు వచ్చేయి.






# చేతులు

**"Other parts of the body assist the speaker but the hands speak themselves — By them we ask, promise, invoke, dismiss, threaten, entreat, deprecate.— By them we express fear, joy, grief, our doubts, assent, or penitence; we show moderation or profusion, and mark number and time.—"**

అన్నాడు రోమన్ రచయిత క్వింటిలియన్. అందాక ఎందుకు? "ఆ ఇల్లాలి చేతి చలువ" అంటుంటారు మనవాళ్ళు, ఇల్లాలి సుగుణసంపదను కొనియాడేటప్పుడు. అంటే స్త్రీ గొప్ప అంతా ఆమె చేతిలోనే ఇమిడి ఉందన్నమాట. నిజానికి స్త్రీకి ముఖ్యంగా చెయ్యి, నోరు బాగుంటేనే ప్రపంచమంతా బాగుంటుంది. అటువంటి చేతిని కాపాడుకొనేందు కెంత శ్రద్ధ చూపించినా చాలదు.

కొంతమంది చేతులను చాల అశ్రద్ధగా చూస్తారు. అట్లాంటి వాళ్ళ చేతులు పాసి, తెల్లగ ఉండి చూసేందుకు రోతగ ఉంటుంది. అలాంటి చేతితో వడ్డిస్తున్నప్పుడు, వంటకాలెంత రుచికరములైన తినేవాళ్ళకు ఎప్పుడెప్పుడు విస్తరి విడిచి పారిపోదామా అనిపిస్తుంది. కనుక చేతులను చాల శ్రద్ధగా కాపాడుకోవాలి.

చాలమందికి నిప్పుబొగ్గులను ఉత్త చేతితో ఈ కుంపటిలోనుండి ఆ కుంపటిలో వేయటమలవాటు. అలాగే పొయ్యిమీద గిన్నెలను తడిచేతితో దింపుతారు. ఇలాంటి అలవాట్లవలన చేతులు కాలి నల్లని మచ్చలుగా తేలి అసహ్యంగా ఉంటాయి. ఎప్పుడు కూడ పొయ్యి దగ్గర చాల జాగ్రత్తగా ఉండాలి. తడిగుడ్డలు, పట్టకారు, నీళ్ళ గ్లాసు ఎలాంటి సమయాలలోనైనా పొయ్యిదగ్గర ఉంచుకోవట మలవాటు చేసుకోవాలి.

కూరలు తరిగేటప్పుడు కూడ అశ్రద్ధగ ఉంటారు. చేతులు కోసుకొని, కారం తగిలినప్పుడు, సెగ తగిలినప్పుడు మండుతూంటె చన్నీళ్ళలో ముంచుతూ, నోటితో ఊదుతూ మహా అవస్థ పడతారు. ఇలాంటివి జరగకుండా ముందే జాగ్రత్తగా ఉండి, ఒకవేళ ఏదైనా కర్మం చాలక జరిగితే వెంటనే సైడాల్‌లాంటి ఆయింటుమెంట్లు ఉపయోగించాలి.

ముఖ్యంగా ఈ చలికాలంలో చేతులకు ప్రత్యేక శ్రద్ధ తీసికోవాలి. చేతులు పగలకుండా నూనె, వాసలైను మొదలగునవి రాస్తూండాలి. గిన్నెలు తోమటం, నీళ్ళు తోడటం, తోటపని మొదలగువాని వలన చేతులరిగిపోయి మొద్దుబారిపోతాయి. అలాంటప్పుడు పని అయిపోగానే శుభ్రంగా మంచి సోపుతోనో, కుంకుడికాయ రసంతోనో కడుక్కొని, తడి లేకుండా తుడుచుకొని, దానిమీద **Hand cream** గాని, **Hand lotion** గాని వేసి రుద్దటము మంచిది. ఇలా వీటిని ఉపయోగించని పక్షంలో నూనెను వేసి రుద్దవచ్చును.

శ్రీమతి సువేణి కాశ్యప్

# చేతులు

చేతులను కడుగుకొనేటప్పుడు గోళ్ళను కూడ కడుగుకోవాలి. మన్ను ఏదైనా ఉంటే సోపు నురుగును అర చేతిలో ఉంచుకొని గోళ్ళను పైకి క్రిందకి ఆ నురుగుతో రుద్దుతే మన్నంతా పోతుంది. అలా మన్ను తీసివేసిన తర్వాత తడి లేకుండా తుడుచుకొని, క్యూటెక్స్‌ను వేసుకోవటం మంచిది. ఈ క్యూటెక్స్‌ను వేసే అలవాటున్నప్పుడు గోళ్ళను కాస్త పొడుగుగా పెంచి అర్ధచంద్రాకారముగా కత్తిరిస్తే బాగుంటుంది. ఇలా కత్తిరించిన గోళ్ళమీద ఎర్రని క్యూటెక్స్ వేస్తే బాగుంటుంది. ముఖ్యంగా తెల్లని వాళ్ళకు చాల బాగుంటుంది చామన ఛాయ వాళ్ళు అయితే నాచ్యురల్ కలర్ వేస్తే చూసెందుకు చక్కగ ఉంటుంది. ఈ రంగు వేసే అలవాటులేని పక్షంలో గోరింటాకును పెట్టుకోవాలి. కనీసం నెలకొకసారి అయినా ఈ గోరింటాకును పెట్టుకొని తీరాలి. గోరింటాకు కూడ క్యూటెక్స్ వలెనే పురుగులను చంపి చేతి ఆరోగ్యాన్ని కాపాడుతుంది. గోళ్ళు బాగా పెరిగేందుకు కావలసింది కాలిషియమ్. దీన్ని బాగా తీసికోవటం అవసరం. తర్వాత గోళ్ళు పెరిగేందుకు ఆనిక్సాల్ మొదలగు డ్రాప్స్ వేసుకోటం మంచిది.

తర్వాత గోళ్ళ నెక్కువగ చింతపండు పులుసులో ఎక్కువసేపుండకుండా చూసుకోవాలి. అలాంటిది జరగనప్పుడు వెంటనే కుంకుడికాయ రసంతో కడిగి తడి లేకుండా తుడిచి నూనె బొట్లు వేయటం మంచిది. గోళ్ల కొరుకటమొక దురలవాటు. దీని వలన గోటి చిగుళ్ళు లేచి పెద్ద పుండుగా అయ్యి మహా బాధ పెడుతుంది, దీని వలన గోళ్ళలోని మన్ను కడుపులోకి పోయి ఆరోగ్యం కూడ చెడుతుంది.

కొంతమందికి మెటిమలు విరవటం ఒక పెద్ద అలవాటు. దానివలన చూసేందుకెంత అసహ్యంగా ఉంటుందో గమనించరు. మనవాళ్ళు కూడా దీన్ని 'దరిద్రం' అంటూ ఆరికట్టేందుకు అనేక శతాబ్దములనుంచి ప్రయత్నిస్తున్నారు. అయినా అది మాత్రం మొండి అలవాటుగ అయిపోయింది. ఒలా చేయటం వలన వేళ్ళ కణుపులు మొద్దుబారి లావుగ అయిపోయి అసహ్యంగ ఉంటాయి. కనుక దీన్ని మానుకోవటానికి ప్రయత్నించటము చాల అవసరం. కణుపులను నాజూకుగా ఉంచాలనుకొన్నే వాళ్ళు నూనెతోనో, Cream తోనో lotion తోనో బాగా రుద్దాలి. ఇలా ఎంతసేపు రుద్దుతె అంత మంచిది.

ఇక మోచేతులను చూదాము. చలికాలములో ముందుగా మోచేతులు పగలటం అందరికి అనుభవమే. చలికాలము పోతే అదే పోతుందిలే అని వదిలివేయటం కూడా అందరికి అలవాటె. అలాంటప్పుడు ఒక స్పూన్ పంచదారను, రెండు స్పూనుల కొబ్బరినూనెను అరచేతిలో కలిపి వేసుకొని మోచేతిని గుండ్రముగ ఒక ఐదు నిమిషాలు త్రిప్పుతూ రుద్దుతే పగుళ్ళుపోయి పట్టు మాదిరి మెత్తగ ఉంటాయి. ఈ పద్ధతి చేతి కెక్కడ పగిలినా చేయవచ్చును.

తర్వాత భుజములందముగా ఉంచుకొనేందుకు ప్రయత్నించాలి. బరువుగా పొడుగుగా ఉండే ఇనప కడ్డీని రెండు చేతులతో పైకెత్తి ముందునుంచి వెనకకి గుండ్రముగ త్రిప్పుతే భుజములందముగా ఉంటాయి.

ఇలా పై పద్ధతులు చేతుల అందాన్ని కనులార చూసి ఆనందించేందుకు తోడ్పడుతాయి. కాని ఆ చేతులతో తనకున్నదాంట్లో ఇంత ఇతరులకు పెడుతున్నప్పుడు, హృదయ పుష్పమును భగవంతుని పాదపద్మముల కర్పిస్తున్నప్పుడు కలిగే చేతుల అందము మనస్ఫూర ఆనందించేట్లు చేస్తుంది. అందుకన్నే "కమలాక్షు నర్చించు కరములు కరములు" అన్నాడు పోతనామాత్యుడు.



# మహిళల ఆరోగ్యరక్షణకు

## లోధ్ర

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూల, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్ళనొప్పులు, అరికాళ్ళు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0        6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్ళు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కురు గ్మ్రతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరల గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరు చేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పైజబ్బులు రాకుండుటయేగాక ప్రసవించు వరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండు మాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0        6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాతవ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయ వ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

### బాలింతలేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును పెక్కు లేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియువస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయమునుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీజాతియందు యీ జబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనతసంభవించును.

బుడ్డి రు. 4-0-0

## కేసరికుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికెందరాబాదు



యక్షప్రతిమ— నాగనాగినీ చిత్రములు : స్తూపారాధనము (నాగార్జున కొండ)



మిధున చిత్రము— ధర్మచక్రారాధనము— నాగార్జున కొండ



యక్షప్రతిమ



బుద్ధజీవిత కథాఘట్టము (మొదటిది, చివరది) మిథున చిత్రము - (నడిమిది) గోళీ

# నాగార్జున కొండ

శ్రీ పి. వి. సత్యనారాయణ.

భారతదేశ ప్రాచీన సౌభాగ్య కళా ప్రదేశాలలో ప్రముఖత్వమొందినది నాగార్జున కొండ. ఆంధ్రులందరికి కళా నైపుణ్యతలో ప్రసిద్ధ పుణ్య స్థలమైనది అదియే. కనిష్కుడు రెండవ అశోకుడని పేరు పొందిన సుప్రసిద్ధ కుషాను రాజు. అతని మత గురువు అశ్వ ఘోషుడు. చరకుడు ఆస్థాన కవి. పండితుడు, రసవాద శాస్త్ర రసిక జ్ఞుడు, సకల శాస్త్ర పారంగతుడు మహా మనిషీ సిద్ధ నాగార్జునాచార్యుడు. అట్టి బౌద్ధ విజ్ఞాని, మహత్తరుడు మహిమోపేతుడు మన ఆంధ్రులందు పుట్టటం అదృష్టం. ఈ విషయం సాహిత్య భూషణులు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు పదే పదే వారి రచనలందు ఇట్లు పేర్కొని యున్నారు.

"పల్నాటి తాలూకా మాచర్లకు ఉత్తర దిశయందు సుమారు పదిహేను మైళ్ళ దూరాన శ్రీ పర్వత సంఘా రామమని, భ్రమరగిరియని పేరు పొందిన నాగార్జున కొండ ఈ మహనీయుని పేర నేటికిని నిలచి, చరిత్ర కారుల మానసమునందును, బౌద్ధ శాస్త్ర వేత్తల హృద యములందును అశేషభావ బృందమును బుట్టించుచు, అశేష ప్రబోధ బంధురముతో వికాసమునందిచ్చుచున్నది. మహిమోపేతుడు, మహోపాసకుడు నైన సిద్ధ నాగార్జునుడు తన యంతిమ దశను యీ పర్వత ప్రాంతమున గడపియున్నందున యీ కొండకాతని పేరు గల్గినది. ఇచ్చటి శిల్ప చాతుర్యము చూసి, పూర్వ వైభ వమును దలచి శిల్పకారులు, భావ వివేకులు, పరి జ్ఞానులు, పామరులు గూడా. ప్రాచీనాంధ్రుల భక్తి వైభవము శిల్ప నైపుణ్యము గ్రహించి ఆంధ్ర శిల్ప విభూతియు, చిత్ర రచనా చాతురియునగు ఆంధ్ర ప్రతిభా సముత్పన్నతకై శోకింపక, క్షోభనొందక మానరు." నాగార్జున కొండ విద్యార్థులకు కావలసిన విహార యాత్ర. పూర్వముకన్న ప్రస్తుతప్రయాణ సౌకర్యములు కడుంగడు సులభములు. ఆంధ్ర జనయిత్రి, తన బిడ్డలకు వీర పాయ సాన్ని పంచిబెట్టి మహత్తరమైన మనీషిగా పరిణమించిన రోజుల్లో, పల్నాటి సీమ మొదటిమెట్టుగా వుంటుంది. 'మాచర్ల' ఆ వీర పల్నాటి సీమ. నాగార్జున కొండకు మాచర్లనుంచి పోదురు. రెండు చరిత్రాత్మక ప్రదేశాలు యీ విహారం మూలంగా చూచు అదృష్టమున్నది. మాచర్లనుండి నాగార్జున కొండకు మోటారు సౌకర్య మున్నది. వేసవి కాలము కన్న ఇప్పటి రోజుల ప్రయాణం బహు రమ్యంగా వుంటుంది.

మాచర్లనుండి సైకిల్సుపై గూడా పోవచ్చును. గుట్టపు బండ్ల వసతి యెక్కువ. 'పుల్లారెడ్డిగూడెం' అనే గ్రామము నాగార్జున కొండకు ½మైలు దూరంలో వుంది. యాత్రికులు యిచ్చటగల సత్రవులలో వుంటారు. సామాగ్రి వూరికే సాయం చేస్తారు, సత్రవువారు. తదితర వంటక భక్ష్యాలు మాచెర్లనుండియే తెచ్చుకోవలయును. ఈ వూరు వచ్చే త్రోవలో రోడ్డు పెద్ద యెత్తున కొండమీదుగా దిగు తుంది. బస్సులు గాని బండ్లు గాని చాల నమ్రతగా జాగ్ర త్తగా ప్రయాణిస్తాయి. ప్రమాదకరమైన ఏటవాలుగానున్న యీ ప్రదేశాన చీకటి పడిన తరువాత ఎవరూ ప్రయాణం చేయరు. పులులూ, చిరుతలూ యిక్కడ సంచరిస్తూ వుంటాయి. రాత్రుళ్ళు పుల్లారెడ్డిగూడెం ప్రజలు గొడ్డూ-గోదాపై చాల భద్రత చూపిస్తారు. పెరుగు, పాలు దొరుకుతాయి. చీకటిపడేముందుగా గొడ్డూ, గోదాజేరితే సరే. లేకపోతే అవి ఆరోజుకు పెద్దపులికి పులిహారం అవుతాయి. భయంకర ప్రదేశముయిదొక్కటి.

నాగార్జున కొండదగ్గిర ఆఫీసర్లకోసం రెండుబంగాళా లున్నాయి. మ్యూజియం ఒకటివుంది. ఈపరిసర ప్రాం

తాల్లో దొరికిన 'చైత్యములు' అన్నీ కూడా యిందు భద్రపరచబడ్డాయి. మహత్తరమైన యిచ్చటి రమణీయ ప్రశాంత దృశ్యములు, శిల్పకళ, శిశు హృదయాల్ని కూడా పులకరింప చేస్తాయి ఎచ్చట జూచినను మ్యూజి యంనిండా రాళ్ళ మయమే, ఎందుకు పనికిరాని మొద్దు, 'రాయి' అనుకుంటాంగాని, ఆ రాతిని చక్కగా చెక్కి శిల్ప కళా చాతుర్యము దానియందిమిడింపజేసిన మేధా వంతులనెంతైనా మెచ్చవచ్చుగదా!

శాక్యవంశజుడైన శుద్ధోధనుని కుమారుడు గౌతముడు. తన ఆశయం సిద్ధించిన తరువాత సిద్ధార్థుడయ్యాడు. ఆ సిద్ధార్థుడు సమ్యక్సంబోధి యైన తరువాతనే బుద్ధుడయ్యాడు. కాశీలోని గంగానదికుత్తరమునగల అరణ్యములో జటధారులు, తపోధనులూ తిరిగెడు రోజుల్లో దాన్ని ఋషి పట్టణమన్నారు. అంత బుద్ధుడు సమ్యక్సం బోధియైన తరువాత 'మృగదావనమని' పిలిచారు. అదియే అద్భుత ప్రశాంత పరిణామమయింది. బుద్ధుని నిర్యాణ దశయందు అతడొక అరణ్య సమీప ముననుండగా, లేవసత్తువలేక, యాలగిలిపడి ప్రాణముల గోల్పోవనున్న పెద్దపులి సిద్ధార్థుని కంటబడినది. దానిని అహింసావాది సహింపలేక దానిని సమీపించాడు. కానీ, అది అతని నేమి చేయజాలక నిస్సత్తువతో బహు నిస్స హాయ కలిగియున్నదయింది. బుద్ధుడు శిరము దాని నోట బెట్టినను, అది యేమి చేయజాలకుండుటకు విచా రించి, తన స్వహస్తముతో దాని నోరును నొక్కెను.

ఆ పులి కోరలు గ్రుచ్చుకొనగా కారిన రక్తపు బొట్లను నాకుచు, సత్తువగలదై ఆ శార్దూలము ఆ మహనీయుని భక్షించెనట. ఈ కథ నిజమైనను, కాకపోయినను బుద్ధుని దయాస్వరూపము చక్కగా బోధపరుస్తున్నది. గౌతముని శిష్యులు, బుద్ధుని నిర్యాణమునకు పూర్వము తమ కర్తవ్యమును బోధచేయమని కోరగా, సిద్ధార్థుడు తన ఎముకలను రాతియందిమిడ్చి, 'జ్ఞానకుంభ'మని పిలువం దగు బుద్బుదాకార ప్రతిమను యేర్పరుపమనెనట. బుద్ధ దేవుని ఆరాధన మొదట బుద్బుదాకారమైన లింగ రూపముననే జరుగుతూ వచ్చింది. మొదటి స్థూపము 'సార నాథ' పురమునందున్నది. బుద్ధుని ఎముకలను బాగుగా చిన్న చిన్న తుంపులుగా జేసి అనేకమంది రాజులకు పంపగా, వారు ఆ ఎముకలను రాతియందుపుంచి స్థూపా కారమున స్థాపించిరని, చరిత్ర వేత్తలు చెప్పుదురు. నాగా ర్జునుని కొండయందుగల స్థూపముపైకూడా యీ విషయం స్పష్టముగా నున్నది.

"బుద్ధ భగవానుని ధాతువు యిందు సంక్షిప్తమై యుండుటం జేసి దీనిని స్థూపము లేక చైత్యము అని వాడుదురు. 'శాంతిశ్రీ' యను ఇక్ష్వాకు వంశస్థురాలు ఈ స్థూపముల అభివృద్ధి చేసియున్నది."

ప్రథమము నుండి బుద్ధుని బుద్బుదాకారములోనే పూజించెడివారు. క్రమక్రమేణ దానిపై చిత్ర చిత్ర అలం కరణములు గావించిరి. పరిపూర్ణ జ్ఞాన కుంభము బుద్ధ భగవానుడని మహాయానమువారు అర్థించిరి. సుప్రసిద్ధ బౌద్ధ విజ్ఞాని నాగార్జునుడు, ప్రథమములో హీనయాన శాఖ నవలంభించినా, ప్రజలకు సుబోధకముగా బౌద్ధ సూత్రముల బోధింప నిశ్చయించినవాడై, 'మహాయా నము' స్వీకరించి అలంకరణల అతి రమ్యముగా చెక్కిం చినాడు. బుద్ధుని శిలా స్థూపమునందతడు పరిపూర్ణ జ్ఞాన కుంభమును చెక్కించినాడు. ఆనాటి అలంకరణములతో హారముల దానిపై నుంచినాడు. అమరవేదికను ఏర్పరచి నాడు. అమరపంచకములు అను ఐదు నిలువు గీతాకార ముగ స్థూపముల నుంచినాడు. అందొకటి బుద్ధుని పుట్టుక, రెండవది పరిత్యాగము, మూడవది సమ్యక్సం బోధియైన తరువాత జ్ఞానోదయమైన నిర్వాణము, నాలుగవది మొదటి బోధ (సారనాథలో జరిగినది), ఐదవది నిర్యాణ మును సూచించు భావములను స్పష్టీకరిస్తున్నాయి. బుద్ధుని పుట్టుక ; దిక్పాలురు నలుగురు అతనిని సేవింపుచుండుట, దేవతలు పుష్పమాలికలచే ఆతనిని సమీపించుట తదితర రాజ పరిజన మాతనికి శుశ్రూష లొనర్చుట బహు రమ్య ముగా యొక శిలపై చెక్కినారు. ఈ శిల్పచాతుర్యము గాంధార శిల్పము ననుసరించి యున్నది. "మారుడు" అను భయంకర విఘ్నుడు దేవతల పనుపున బుద్ధుని దీక్షాపర తంత్రముకు క్షింభరిత్వునిగా జేయుటకు అతనిపై అనేక విధముల శిలా వర్షముల గురిపించి బాణ వరం పరలచే బాధించినాడు. అదంతయు పుష్పవృష్టిగా బుద్ధుని మీద పడింది.

లలితమైన సుందరాంగ కన్యలను బుద్ధుని పద్దకు పంపినాడు. మనః చాంచల్య మెరుగని బుద్ధుని నిర్భేద్య తపోమహిమ కావనితలు సిగ్గు జెంది ప్రక్కకు వంగుట మున్నగు మనోహర దృశ్యముల చక్కగా చిత్రించినారు. ఈ శిల్ప వైభవసారము త్రాగలేకపోవుచున్నాము గదా

యని నేటి శిల్పకారులా చాతుర్యమును జూచి వలవల యేడ్చుచుందురు. శిల్ప కళంటే యెరుగని శిశువులుకూడా విస్తుపోకమానరు. లండను మ్యూజియంలోనికి పరిపూర్ణ స్వచ్ఛ జీవకళ నుట్టిపడుచున్న శిల్పముల ఆంగ్లేయులు గొనిపోయినారట.

ఇంకనూ చాల కథలు, చరిత్రలు తెల్పుచున్న చిత్రములు నాగార్జున కొండయందున్నవి. ఆ శిల్పముల జూచి అందలి సారాంశము కనుగొనవచ్చును.

“బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి”అను బుద్ధుని త్రిరత్నములు మృగదావనమందుద్భవిల్లి ప్రశాంత పరిణామ మేర్పర్చినవి. ‘నాగముచలింద్ర’ అను నతడు బుద్ధజాతక కథలు చెక్కించినాడు. పరిపూర్ణ జ్ఞానకుంభమును ‘ద్రోణ’అను నతడు తాబేటి యాకారమున చిత్రించినాడు, ‘వజ్రపాణి’ యను ఆయుధమును చేతబూని బుద్ధుడు దుష్ట శిక్షణ మొనర్చువాడని యిందొక విగ్రహమున స్ఫురింపచున్నది. బుద్ధుని శారీరకస్థూపము, పార్యభోగికము, వుద్దేశిక స్థూపము అను మూడు రకముల స్థూపములందును జాతక కథలు కనపడుచున్నవి. శాక్యుల మత గురువు ‘అశిత మహాముని’ బుద్ధుని పుట్టుకయందు వచ్చి, ఆతడు మహాజ్ఞాని యగునని చెప్పుట; బుద్ధుడు 500 జన్మములెత్తినట్లును; శశి జన్మమున ఆతడు తన యతిథికి ఆహారమైనట్లు మున్నగు చరిత్రలు చిత్రరూపమునుండి మన కవగాహనగుచున్నవి,

ఇట్టి మహత్తర మహనీయ శిల్ప సంపద భారత దేశమునందు ప్రజ్వరిల్లుచుండ, కన్నులున్న జ్ఞానంబు మనము వృథాపుచ్చుట న్యాయముగాదు,

పలనాటి వీర చరిత్ర మన ఆంధ్రలోకానకి చాల చిరపరిచితము. గురిజాల పలనాటివారి రాజధాని. ఈ పాంత్రముల ‘పలనాడు’ అని యేల పిలుతురో నాకింకనూ గ్రాహ్యము కాలేదు. చరిత్రలను బట్టి చూస్తే, నాకు స్ఫురించినదల్లా యొక్కటే. చోళులు మన దక్షిణ దేశాన్ని పాలించుచూ, తమ రాజ్యమును, నాడులుగాను, కొట్టములుగాను విభజించినారు గనుక, యీ ప్రాంతమును ‘నాడు’లని పిలిచియుండిరేమో! మాచెర్లకు మలి దేవాదులు పారివచ్చి యిందుగల చెన్నకేశవ స్వామి యాలయమున దాగుకొనియున్నారట. ఈ ఆలయ శిలాఫలకములు పూర్వపు ఔన్నత్యాన్ని స్ఫురింప చేస్తున్నవి. ఇందుగల ఒక శిలా స్తంభము విచిత్రము. దీనిపై గోటితో కొట్టిన సప్తస్వరముల నినాదము వినవచ్చుచున్నది. కారణము తెలియరాకున్నది.

దీనికి ప్రక్కనే “చంద్రవాక” సెలయేరున్నది. దీని చరిత్ర చాల గొప్పది. బ్రహ్మనాయుడు యిందు స్నానము చేసిన తరువాత గొప్ప అదృష్టవంతుడయినట్లు పల్కుదురు. ఇది తూర్పునుండి పడమరకు ప్రవహించుచున్నది. మన ఔన్నత్య భారత దేశమున నదములకన్నా నదులు యెక్కువ. తూర్పునుండి పడమరకు పారు వాహినులు నదములు. ఈ నదము మాచెర్లగ్రామమునకు ఆరుమైళ్ళ దూరమున పెద్దయెత్తున కొండమీదనుండి క్రిందకు పడుచున్నది. “ఎత్తిపోతలు” అని దీన్ని పిలతురు. చదువుకొన్నవారు జలపాత మందురు. ఈ జలపాతము చాల అద్భుతము. అచ్చటనుండి యిది పడుచున్న దృశ్యము యించుమించు నయాగరా జలపాత దృశ్యమునకు తీసిపోదు. ఇది యెల్లరు చూడతగినది. ప్రకృతి శోభ సౌభాగ్యవతి యనుటకీ జలపాతము నిదర్శనీయము.

మాచర్లకు నాలుగు మైళ్ళ దూరాన ‘మండాది’ అరణ్యమున్నది. ఇందు పూర్వము మలి దేవాదులు అజ్ఞాతవాసులైనారట. ‘కారెమపూడి’ పలనాటి వారి కదనరంగము. మాచెర్లనుండి బస్సుపై పోవచ్చును. నాగమ్మ విగ్రహం ఒక కొండమీద ఒకకాలు, మరొక రాయిమీద మరొక కాలు వుండి, బాలచంద్రునితన కాలినుండి దూరిపొమ్మన్నట్లు, అతడు కత్తితో ఆమె కాలు తెగవేసినట్లు ఒక రాతి విగ్రహము పెద్ద యెత్తున చెక్కబడివుంది. ‘చిట్టగామాలపాడు’ నాగమ్మ; చౌదరి రామిరెడ్డికి దొరికిన వూరు. అది యీ ప్రాంతములోనే.

ఇవన్నియు వ్రాయ చాల చీదర నిచ్చును. గాన వివేకులు,విద్యార్థులు, విబుధులు, మరియు విశ్వఖ్యాతిని గోరు యెల్లరును తప్పక చూడదగిన ప్రదేశములు. నాగార్జున కొండయందు నాగార్జునుడు శిష్యులకు బౌద్ధ సూక్తులు బోధించిన ప్రదేశములు గలవు. ప్రకృతి సౌందర్య ప్రదేశములైన నదీతీరములందును, అరణ్యములందును జరిగిన చరిత్రలు మచ్చుమాయని మహత్తర యశోధురంధర ప్రకటితములైనవి. ఆధ్యాత్మిక, భౌతిక, నైతిక జీవనములందు కడుంగడు సుప్రసిద్ధములు. శాశ్వతములు. నిత్యములు. నిర్మలములు. భారత, రామాయణవేదాది గ్రంథములట్టివే. కాన యిట్టి ప్రదేశముల తనివితీర చూడవలసినదిగా వినతి చేయడమైనది.

# సంస్కృతిపరిశీలన : స్వరూపనిర్వచన

డాక్టర్ వారణాసి యశోదాదేవి M.A., M.Litt., D.Litt.

విశ్వ సంసారము యనంతకాలప్రవాహమున బడి యనేక యాటంకముల దప్పించుకొని క్రమ పరిణతి నందుచున్నది. ఆ పరిణామమే సంస్కృతి. అట్టి విశ్వ సంస్కృతి స్వరూపము ఆశ్చర్య జనకము; శుభప్రదము, ఆనంద దాయకము; సర్వకళా సంశోభితము. నానాత్వము నందేకత్వమును, పరిపూర్ణతను జూపును. అనాది నుండియు మతము, కళ, సాహిత్యము, సాంఘిక జీవితము — యివి యెటుల యుద్భవించి వృద్ధి నొందెనో, తద్పర్యావ లోకనమే సర్వ మానవ సంస్కృతి పరిశీలనము; తత్స్వరూప నిర్వచనము.

మానవుని మానసిక వికాసము రూపొందుటకు మతమే మూలము. పరిసరము లందలి పశుపక్ష్యాదులు, క్రిమి కీటకాదులు, ప్రకృతి వైవిధ్యము పైగల భీతి, ప్రేమ, వాంఛలే మత వుత్పత్తికి వుపక్రమణికలు. భక్తి, విశ్వాసములు ముప్పిరి గొన సృష్టికర్త స్వరూపములను పలు రీతుల నిర్ణయించి మానవుడు యారాధించెను. వివిధ దేశములలో ననేక మతములు యేర్పడి, అవతార మూర్తులగు మత సంస్కర్తల ప్రబోధములలో మార్పు జెందినవి.

ప్రపంచ మంతటికిని ప్రాచ్యసభ్యత ప్రాచీనమైనది. Chaungtse రచనలు చైనాలో బౌద్ధమత వ్యాప్తికి పూర్వపు వేదాంతమును దెల్పును. ఇందులోని కొన్ని చాలికలు, అనంతర మచటి బౌద్ధమతాభి వృద్ధికి యాస్పదమైనవి. చైనా సాహిత్యములోని దయ్యముల, భూతముల కథలు పురాతన చైనా మతమును దెల్పును. చైనాలో బౌద్ధమతము వ్యాప్తి జెందియున్నది, ఇటీవల క్రైస్తవ మతము వ్యాపించినది. చైనీయులు పాశ్చాత్య సభ్యతను యనుకరించు చున్నారు.

జపానీయులది బౌద్ధమే: దీనిని Zole బౌద్ధము, Shintoism అందురు. ప్రతీచ్య సభ్యతను జపాను పరిపూర్ణముగ అవలంభించి ప్రాచ్య దేశముల యింగ్లాండు అని పేరొందినది. ఈజిప్టు అరేబియా, ఆఫ్ఘనిస్థాన్, టర్కీలలోని మతము యిస్లాము. ఇపుడు యీ దేశము లన్నియు పాశ్చాత్య నాగరికతను యవలంబించి యున్నవి.

ఆర్యావర్తములో ఆర్యుల మతము, శృతిస్మృతి పురాణేతి హాసములలో వ్యక్త మగుచున్నది. అనంతుడు, సర్వ వ్యాపియగు భగవంతు డొక్కడే బహు రూపముల విశ్వ రక్ష జేయునను సిద్ధాంతమే యిందలి ముఖ్యవిషయము. కర్మ విధానము, వర్ణవ్యవస్థ నిర్ణీతమయ్యెను. అధికమగు హింసాసహిత కర్మకాండ వలన జనులలో అశాంతి ప్రబలెను: అపుడు జైన బౌద్ధ మతములు అహింస, సత్యము, ధర్మసిద్ధాంతముల బోధించెను. కాలక్రమమున, జైన, బౌద్ధ, సిక్కు మతములు హిందూమతములోలీనమైనవి, వేదాంత, భక్తి మార్గములు యనేక యాచార్యుల కృషి ఫలితముగ వ్యాప్తి జెందెను. భారత దేశములోని యితర మతములు — యిస్లాము, Zorastrianism, క్రైస్తవము.

ప్రతీచ్య దేశములలో ప్రాచీన సభ్యతగల దేశములు గ్రీసు, యిటలీ, ప్రస్తుతము పాశ్చాత్య దేశములలోని మతములు క్రైస్తవము, ఇస్లాము, వీనిలో శాఖలు, వుపశాఖలు అనేక పేర్లతో గలవు. ఇంగ్లండు, అమెరికాలు అధునాతన నాగరికత గలవి. రషియా పూర్తిగ పాశ్చాత్య సభ్యతను అనుసరించినది. "మనము విచారించి చూచిన కొలందిని వివిధ ధర్మముల యొక్క మూలస్వరూప మొక్కటియే యని తెలిసి కొందుము చూపుటకు మనకెన్ని మతములు కాన్పించు చున్నను, ఆయా మతములు దేశకాల పాత్రముల ననుసరించి యేయే మార్గముల నవలంబించి యున్నను సమస్త మతముల వారి గమ్యస్థాన మొక్కటియే. వుద్దేశము నందే విధమగు భేదము లేదు. ఒక్కడే బ్రహ్మ. వేద మొక్కటియే. ప్రతి మతమందు నుయోగము, భక్తి, పుణ్యమను నవి యొకటే విధమగు మూల పదార్థము వలన నేర్పడు చున్నవి."

# సంస్కృతి పరిశీలన

మానవ జాతికి అమరత్వము నొసగునది కళా సృష్టియే. చతుష్షష్టి కళలతో నలరారుచుండిన భరత వర్షమును "వేదాఃశాస్త్రాణిసర్వాణి, నృత్యగీతాదికఞ్చయత్.

నవిహీనంత్వయదేవి, తథామేసంతు సిద్ధయః" యని యారాధించెను రాఘవ భట్టు. వాస్తువు, శిల్పము, చిత్ర లేఖనము, నృత్తగీతములు, కవిత్వము కళలలో ప్రసిద్ధములు, వాస్తువిద్య ఆత్మకు రూపమును గల్పించును. "మానవుల చిత్తవృత్తుల బాహ్య ప్రకాశమే శిల్పము." "శిల్పం కౌశలఃశీలసమాధా" అనగా శిల్పము చిత్తవృత్తుల యేకాగ్రతాసముద్భాసిత వస్తువు అని ప్రాచీన భారతీయ సాహిత్యములో గలదు. విష్ణుధర్మోత్తరములో రేఖావిన్యాసము నార్యగణమును, వర్ణనా విన్యాసము నభిజ్ఞులును అలంకార వికాసమును రమణీమణులును, వర్ణవిన్యాసమున జనసామాన్యమును నాదరించుననియు త్రిలోకములందలి సుందర దృశ్యముల బట్టియుంచుటకే నృత్యచిత్రము లుద్భవిల్లెననియు గలదు.

ప్రాచ్యశిల్పము భావసర్వస్వ మగుటచే పాశ్చాత్య శిల్పముకంటె భిన్నము. భారత శిల్పము భరత వర్షము యొక్క నిజస్వమే. ఇచటిచారు, దారు శిల్పములు జగత్ప్రసిద్ధినందినవి. దేవాలయములు, గుహలు, చైత్య, విహారములు, విగ్రహములు వీటి శిల్పము భావోద్దీపితము. భారత శిల్పమునవిదేశీయ శిల్పముగలిసి యున్నది. పూర్తి భారతీయ శిల్పము కాంచీపుర సహస్రస్తంభ మంటపమూ, సింహాచల నృసింహాలయములలో గాననగును, మామల్ల పురమందలి సహదేవుని రథము హైందవ లక్షణములు గల సంఘారామముగ నున్నది. భీముని రథము బౌద్ధ సంప్రదాయ నిర్మితమయ్యు హిందూ శిల్పచిహ్నముల గల్గియున్నది. టాజ్‌మహాల్, ఫతేపూరు సిక్రీలలో భారత ముస్లిము శిల్పపరిణతి గాననగును. అజంతా చిత్రములలో రూపచిత్రణ కౌశలము అత్యుచ్ఛదశనందినది. మొగలు రాజపుత్ర శిల్పములలో నాకార సదృశము, లోకాతిశయత పక్వమందినవి. భారతీయ సారసనిక శిల్పము మనదేశ మందంతట గానవచ్చుచున్నది.

పాశ్చాత్య శిల్పమాకార సర్వస్వమగుట, నిందు ప్రకృతియు మానవుడును ఛాయాచిత్రము నందువలె చిత్రితమగుదురు. ప్రస్తుతము భారతీయ చిత్రలేఖన మందును పాశ్చాత్య సిద్ధాంతము అనుసరింపబడు చున్నది.

నృత్యగీతములు భారత దేశములో రాజాదరణ క్రింద వృద్ధి జెందినవి. సముద్ర గుప్తుడు, మహేంద్ర వర్మ, కృష్ణరాయలు, రఘునాథ రాయలు గొప్ప సంగీత విద్వాంసులు, వైణికులు. రఘునాథుడు సృష్టించిన రాగ విశేషము జయంతసేన ; నృత్యవిశేషము రఘునాథ విలాసము. ఇతని యాస్థానమందలి గాయినులు కర్ణాట, దేశి సంగీతము లందలి మర్మముల జెప్పగల్గినవారై, వీణ, రావణహస్తము — మొదలగు వాద్యముల వాయించుచుండిరి. విజయనగర రాకుమార్తెలు పరివాదిని వాద్యమున ప్రవీణులై యుండిరి.

పూర్వము నుండియు దేవాలయములు, రాజాస్థానములందు నృత్య ప్రదర్శనములు జరుగు చుండెను. జిన కాంచిలో వర్ధమానయర్ధమంటపమునకు యెదురుగ సంగీత మంటపము గలదు. విద్యానగరములో విరూపాక్షుని వసంతోత్సవములో కృష్ణరాయల రచిత జాంబవతీ కల్యాణము ప్రదర్శింపబడు చుండెను. అంతఃపుర వేశ్యలు ప్రశనివారము రాజ ప్రతిమముందు నాట్య మాడుచుండిరి. మకర సంక్రాంతికి వీధులలో బాలికలు కోలాటము లాడుచు దేవాలయములలో రాత్రులందు వలయాకారముగ నృత్యము జేయువారు.

విశ్వ సాహిత్యములో భారతీయ సాహిత్యము ప్రాచీనమైనది. గీర్వాణము వేదభాష, దేవభాష, రాజభాష, మధ్య యుగములో పర్షియను ప్రాముఖ్యత వహించినది. ఆధునిక భారతదేశములో ఆంగ్లేయము రాజభాష, భారత కవులకు సంస్కృతమున కావ్యరచన ముఖ్యము. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసాదుల నామములు, గ్రంథములు నాచంద్రార్కములు. కృష్ణరాయలు సంస్కృతమున కృతికర్త. రఘునాదుడు నూరు గ్రంథముల రచించెనట. వానిలో కొన్ని వాల్మీకి చరిత్ర, అచ్యుతేంద్రాభ్యుదయము, రుక్మిణీ కల్యాణము, గజేంద్ర మోక్షము. ఈ కాలములో తమిళమున చిదంబర, భాగవత, హరిశ్చంద్ర, కమలాలయ పురాణములు, కచ్చికలంబకమ్, శివ ధర్మోత్తరము, పరమునంద విలక్కమ్, సుందర పాండ్యమ్ రచింపబడెను.

ఇస్లాము, హిందూధర్మ సంఘర్షణ, సమన్వయములకు బెంగాలీ వైష్ణవ సాహిత్యములో కావ్యత్వము సిద్ధించినది. హిందూపురాణ గాథలకు ప్రతిగా రచితమైన పంఛీ సాహిత్య వీరగాథలు యిప్పటికి జానపద ప్రజలకు

ఆనందము గల్గించు చున్నవి. మధ్యయుగములో భారతీయ సంస్కృతి పరిణతి నందినది. పాత కదలు క్రొత్త ప్రాణము బోసి కొన్నవి. ప్రకృతి హైందవ సాహిత్యములో ముఖ్యస్థానము ఆక్రమించినది. కాళిదాసు, శ్రీనాధుడు, పోతన, పెద్దన, రామకృష్ణుడు, గంగను వర్ణించిరి. ఆకాశ గంగ భూలోకములో భగీరదియై, భోగవతిగా పాతాళమునకు బ్రవహించెనని లక్ష్మణకవి రచన. గేయ సాహిత్యములో "గంగమ్మ తల్లికి చెంగల్వపూ దండ" అని సత్కరింప బడినది గంగ.

ప్రాచ్య, పాశ్చాత్య వేదాంతములకు చాల తారతమ్యము గలదు. చైనావేందాంతము భారతీయ వేదాంతమును బోలి యున్నది. సాహిత్యము పై సైన్సు దండెత్తినది. 19 వ శ॥ నుండి వైజ్ఞానిక పదములు కళలకు వాడబడుచున్నవి.

చైనా సాహిత్యములో క్రీ పూ. 570 ప్రాంతమున Loutse రచిత Tao గ్రంధము ప్రాచ్యతత్వమును వ్యక్తము జేయును Chaungtse (క్రీ. పూ. 275). Chuyuan (343-290 B. C.) లు Chou రాజుల కాలమున గొప్పకవులు. చైనాసాహిత్యము, ప్రాచీనపద్ధతి T'ang కవిత్వము, జానపద సాహిత్యము అను మూడు రీతులుగ నున్నది. ప్రాచీన శైలికి యితివృత్తము యుద్ధము, ప్రేమవ్యాసంగము — యిత్యాదులు. కవిరాజు, కవి దేవుడని పేర్గన్న Lipo (701-762 A. D.), కవి ఋషి యని పిల్వబడు Tu Fu Cu T'ang కవులలో గొప్పవారు. తెలుగులో బుఱ్ఱకథ, వీరగాధ, తందానపదములతో బోల్పదగిన కథలు చైనీయ జానపద వాఙ్మయములో యిప్పటి ప్రజల యాదరణ బొందు చున్నవి. Lusin రచనలు చైనా పురాతన సిద్ధాంతముల ఖండించి, పాశ్చాత్యుల ననుకరింప వలెనని బ్రబోధించును. ప్రాచీన చైనా సాహిత్యము విషతుల్య మన్నాడు Lusin.

భారత దేశములో సంఘైక్యత గలదు. సాంఘికాచారములు, ధర్మ ప్రతిష్ట అన్ని మతములకు ముఖ్యమే. కాశ్మీరము నుండి కన్యాకుమారి వరకు భారతీ యైక్యత, యాదర్శములు, జాతీయ గీతములందు ప్రతిబింబించి యున్నది. ప్రార్ధన, దైవము, జన్మ, పునర్జన్మ, వర్ణ, ఆశ్రమ, జాతి, అస్పృశ్యత — యివియన్ని మత సంఘములలో గలవు. వైరాగ్యము, సత్యము, అహింస, గృహస్థాశ్రమము యొక్క ప్రాముఖ్యత — యివియే భారతీయ సాహిత్యమునకు యితివృత్తములు. జీవిత పద్ధతులు, దుస్తులు, రీతులు — వర్ణాశ్రమధర్మ నిర్ణీతములు మహాక ప్రపంచము యింతకంటె గొప్ప దున్నందున, యిచట మానవుడు తన జీవితమును దాని బొందుటకు తగిన రీతిని నిర్ణయించు కొనవలెనని హైందవ సంఘాభిప్రాయము. "భారతీయము లనిపించుకొను నాచారములు, సాంప్రదాయములు, సంస్థలు, శబ్దములు, అర్ధములు, యివియన్నియు వివిద స్వరముల సమ్మేళనములు: వివిధ ద్రవ్యముల పుటపాకములు మాత్రమే."

సంఘ వ్యవస్థను నిర్మించునది సభ్యత. ఆ వ్యవస్థ నుండి వికసించునది సంస్కృతి. ఏకత్వము సంస్కృతికి సామాన్య లక్షణమే. కాని యపూర్వ సంస్కార వ్యాప్తి- సంస్కృతి సాంతత్యము. భారత సంస్కృతికి విశేష లక్షణము. మానవుడు సత్పుత్రుడుగ, సహోదరుడుగ, మిత్రుడుగ, వర్తించగా. శక్తి మిగిలియున్న, గ్రంధపఠన జేయవలె నన్నాడు చైనా వేదాంతవేత్త Confucius. విద్య, కర్మ, పరిజ్ఞానము, సంగీతముల వల్ల వృద్ధి జెందు నీతి వల్ల నైతికులగు మానవులు గల్గుదురనియు, నాగరికత చివరి పరీక్ష పరుల మనసు నొప్పింపని సత్పురుషుల యభివృద్ధియే యని Confusius బోధనలు చెప్పు చున్నవి.



# ATTRACTIVE POWERFUL RELIABLE




# Royal Enfield

| | |
|---|---|
| 125 C.C. | G 350 C.C |
| ENSIGN 150 C C | BULLET 350 C C |
| 250 C.C | METEOR 700 C.C |

and other models

*Wherever Motor Cycles are You will see them most.*

EASY PAYMENTS ARRANGED
EXCHANGE CONSIDERED.

MZ-24

**THE MADRAS MOTORS LTD.,**
THE MOTOR CYCLE SPECIALISTS,
36-C, MOUNT ROAD, MADRAS-2.

కథానిక

# సరస్వతి కథ

కుమారి కె. పత్రలేఖ

ఎవరైనా సరే అందరూ నడిచిన మార్గాన కాకుండా కొత్త మార్గాన నడవబోతే — చాలు — వింతగా చెప్పుకుంటుంది లోకం. ఆ కొత్తదారి పట్టినవ్యక్తికి ఆరోజు మొదలు మనశ్శాంతి కూడ దూరం అవుతుంది. ఏంతప్పేముంది? అందరిదారీ నాకు నచ్చకపోతే — నే క్రొత్త మార్గం వెతుక్కుంటే తప్పేముంది' — అని తనను తాను ప్రశ్నించు కుంటుందేగాని — కొద్ది రోజులకే అందరిదారికీ తన నూతన మార్గం ఆహుతి కాక తీరదు. అలా కాకుండా, తనకు వచ్చిన మార్గాన్నే నడిచే ధీమంతులు వుండి, ఎన్ని అడ్డంకులు వచ్చినా నెట్టుకుపోతే — చివరకు మిగిలే దేమిటి? ఆందోళనా, అసంతృప్తీని; అపార్థం చేసుకొన్న మానవ కోటీ, అనవసరంగా అర్థం లేని బ్రతుకు బ్రతికేశామనే నిస్పృహాను. ఇలా అంటే వేదాంత ధోరణి అంటారు, కాని యీ వేదాంత ధోరణేనా యిప్పుడెందుకు? చేతులు కాలేక ఆకులు పట్టుకున్నట్లు?- జీవితపులోతుపాతులు తెలుసుకొన్న నాడే యీ వేదాంత ధోరణి అబ్బుతుంది. సుడిగాలి చిక్కినట్లు జీవితం గడిపేస్తూంటే. చివరకి ఏంమిగులు తుందన్న ఆలోచనరాదు. ఆ చివరకి ఏంమిగల నప్పుడే — ఆ గడచిన జీవితపు విలువలేని తనం బయట పడు తుంది .... ఈ అలజడి జీవితం మీదా చివరకు ఏమి మిగలని జీవితంమీదా యిన్ని వూహలు రావడానికి కారణం సరస్వతి. సరస్వతి పుట్టిన పుట్టుకా మెట్టిన యిల్లూ చివరకి నడిచిన జీవిత పథమూ తల్చుకుంటే — రాతగీతలలో నమ్మకం లేని నాకూ అనుమానం వేసింది: ఏదో కనబడని శక్తి ముందుకి నడిపించు కుంటూ వెళ్లనిదే వ్యక్తుల జీవితాలు ముళ్లుపడ్డ దారాలలా యిలా ఎందుకవుతాయి?

ఇదమిత్థంగా, యీసుఖాలు నాకు కావాలి, ఇలాంటి వాణ్ణి నేను ప్రేమిస్తాను, అని నిశ్చయించు కొనే వయస్సు రాకుండానే పెద్దలు సరస్వతికి వివాహం జరిపించారు. ఆంధ్ర దేశంలో చెప్పుకో తగ్గ పట్టణంలో పుట్టి పెరిగిన సరస్వతి తన పదహారో యేట పల్లెటూరి అత్తవారింట అడుగిడింది....

కొద్ది మాసాలలోనే పల్లెటూరి మీది మోజు తగ్గింది సరస్వతికి, తననూ అడవిమనుషుల మధ్య పడేసిన విధినీ, తల్లి తండ్రులనీ తిట్టుకుంది. అసంతృప్తి, జీవిత వృక్షానికి వేరుపురుగు పూర్తిగా నేల కొరికేదాకా విడువదు. సరస్వతి భర్తకు నివేధించింది పట్నవాసం పోదామని. భూమి పుట్రా వున్న తాతలనాటి వూరు వదలి రానన్నాడు. తనను యీనరకంనుండి రక్షించమని తల్లి తండ్రులకి ఉత్తరం వ్రాసింది. అత్తవారింట పడరాని యిక్కట్లు పడుతున్నట్లు భావించారామె తల్లి తండ్రులు. తక్షణమే తమ బిడ్డని యింటికి తెచ్చుకున్నారు.

దీనికంతటికీ కారణం ఏమిటి? సరస్వతికి అసంతృప్తే. పట్నవాసంలో తాను రాణించి నట్లు సిటీ బస్సులేనా లేని యీ పల్లెటూళ్లో తాను రాణించలేదు. చదువు సంధ్యలూ సంస్కృతీ మాట అటుంచితే — తాను అందగత్తె. తనమీద ఏమాత్రం అభిమానం వున్నా తనవెంట భర్త వచ్చేవాడు.

పట్నం వచ్చిన సరస్వతి పని బాగుంది. అత్తవారింట్లో అష్ట కష్టాలూ పడిన కూతురి మీద ఆదరణ హెచ్చింది తల్లికి. అసలే ఒకరకమైన మనస్తత్వంలో పెరిగి పెద్దదౌతూన్న సరస్వతి తెలివి యీ ఆదరణలో పెడతల పట్టింది. అస్తమానమూ ఒకటేపని: తన అందం యినుమడించేలా అలంకరించుకోవడం. ఈ వేషాలు తండ్రికి బాధగానే వున్నాయి. కాని ఏంచేస్తాడు? స్వంత కూతురు. కళ్యాణం అయి కాపరంలేని కూతురు.

తన అందం రాణించడానికి, తిరిగీ తనభర్త తనదగ్గరకి రావడానికీ, తల్లి తండ్రుల డబ్బు యిబ్బందులు తగ్గడానికీ, సర్వదా పరిష్కరణ మార్గా లన్వేషిస్తూన్న సరస్వతికి సినిమారంగం మెరుపు తీగలాగోచరించింది. అవును తను సినిమాల్లో నటించడానికి ప్రయత్నాలు చేస్తే అన్ని సమస్యలూ యిట్టే పరిష్కరింప బడతాయి. తనకి ఆత్మసంతృప్తి చేకూరు తుంది. ఈ ఆలోచన తల్లికి నచ్చింది. తనకూతురు తారకాబోతుందంటే ఆతల్లికిగర్వం

గావుంది. తండ్రి మటుకు వెధవ్వేషాలు కట్టిపెట్టి యింటి పట్టునపడివుండమన్నాడు. సరస్వతిదిఅహం దెబ్బతింది యీ నాన్నకేం తెలుసు? అమ్మనిచూడు ఎలా తయారు చేశాడో? అమ్మ కేముంది యీలోకంలో —— యీ అర డజను పిల్లలూ తప్ప, వీళ్లందరినీ ఎలా పోషిస్తాడు నాన్న? ఈ సంగతి ఎప్పుడేనా ఆలోచించు కున్నాడా నాన్న? లేదు. ఆ ఆలోచనే ఆయనకి రాదు. అందుకే ఎప్పుడూ యీ గుమస్తా గిరీదాటి ఆయనదృష్టి ప్రసరించ లేదు. ఈ బరువు భారాన్నంతా ఎలా మోస్తాడు నాన్న? ఎన్నాళ్లు మోస్తాడు? ఈ ఊహా ప్రవాహంలో కొట్టుకు పోతున్న సరస్వతికి తనకు తోచిన మార్గం సర్వసమస్యా పరిష్కారణ మార్గంగా గోచరించింది.

ఎలాగో కష్టపడి. తమ వీధి చివరనే వున్న మేస్త్రారి చుట్టాల ద్వారా, మద్రాసులో ఓప్రముఖు రాలి చిరునామా సంపాదించింది సరస్వతి. ఆవిడ పేరు శ్యామ సుందరిట. ఎవరో యీ శ్యామ సుందరి ఏ వృత్తిలో యీ సువిశాల సినిమా జగత్తులో జీవిస్తోందో ఏసంగతులూ సరస్వతికి తెలియవు. అయితేనేం —— నోట్లో నాలిక వుంటే చాల దేమిటి? .... శ్యామ సుందరిగారికి వ్రాసి తన మద్రాసు ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసుకుంది సరస్వతి. వచ్చే లక్ష్మీవారానికి, మద్రాసులో ఫలానా చిరునామాకి రావల సిందని శ్యామ సుందరిగారు వ్రాయించిన వుత్తరం చూసుకోని మురిసిపోయింది సరస్వతి. అమ్మకి ఉన్న రెండు బంగారు గాజులూ అమ్మి డబ్బు సమకూర్చు కుంది. తండ్రి శతవిధాల చెప్పిచూశాడు ఆ ఆలోచన విరమించుకోమని, కుటుంబ మర్యాద మంటకలప వద్దని. సినిమాలో చేరడం కుటుంబ మర్యాద మంట కల్పడం కాదు సరికదా, గత తరాలకి సహితం వన్నె సమ కూర్చడం అంది. అన్నానికి యిబ్బంది పడుతూ వంశ మర్యాదను గురించి మాట్లాడ్డం హాస్యాస్పదం అంది. ఎవరేమనుకున్నా, తార కాకుండా, తిరిగి మద్రాసు నుంచి రానని నిశ్చయించుకొని లక్ష్మీవారం ముందు రోజు రైలెక్కింది సరస్వతి.

సెంట్రల్‌లో రైలు దిగేసరికి చీకటి చీకటిగా వుంది. బాగా మబ్బుపట్టి వర్షంకూడా కురుస్తూంది. ఈ మహా పట్టణంలో నా అన్నవాళ్లు లేకుండా ఎలాబ్రతకడం అన్న పిరికితనంలో ఓక్షణంపాటు లోలోన ఒణికి పోయింది. ఆ మరు క్షణాన్నే తనకి తాను ధైర్యం చెప్పుకుంది. ఈ క్షణంలో ధైర్యం చిక్కపట్టుకోంటే నేసాధించలేని దంటూ వుండదు అనుకొంది. ఏంహృదయం యిది? ధైర్యంగా వుండవలసినక్షణాలలో యిలావణికిపోతుందేం? భయంచేతా? అత్యుత్సాహంచేతా?

రిక్షా బేరం చేసుకొని ఎక్కింది. కోరమీసాల ఎర్రకళ్ల రిక్షావాడు భయంకరంగా వున్నాడా చీకటి చీకటిలో. ఆలో చనలతో, ఊహాసౌధాలు కడుతూ యీ ప్రపంచంలోనే లేనట్టు కూర్చున్న సరస్వతికి రిక్షావాడి ప్రశ్నల వర్షంగుర్తే లేదు. రిక్షాలో యిలా కూర్చుని కొన్నివేల గంటలయిం దని పించింది.

"ఇంకా ఎంతదూరం? శ్యామ సుందరిగారి ఎడ్రసు నీకు బాగా తెలుసా?" అడిగింది సరస్వతి.

"సినిమాల్లో పనిచేసే శ్యామ సుందరిగారు తెలుసు. నువ్వు వెళ్లేది వారింటికా?" అడిగాడు రిక్షావాడు. ఏక వచన ప్రయోగానికి బాధపడ్డా తనకి కావలసిన వారి యిల్లు తెలిసిన రిక్షా ఎక్కినందుకు సంతోషించింది.

"ఇదిగో యీ యిల్లే నువ్వడిగినది" అని రిక్షా కిందికి దించేదాకా యిన్ని పెద్దవీధులూ వదిలి యీ చిన్న సందులోకి వచ్చానన్న సంగతి తెలియలేదు సరస్వతికి. అంత పేరు పొందిన శ్యామ సుందరి, యీ అసహ్యంగా వున్న పాత యిళ్లలో వుంటుందంటే నమ్మ లేక, రాసు కొచ్చిన ఎడ్రసు కాకితం ఓసారి చూసుకొంది. పక్కనే వున్న కిళ్లీకొట్టు వాణ్ణడిగింది, అనుమానంలేదు. ఇదేవీధి. డబ్బులిచ్చి రిక్షావాణ్ణి పంపించేసింది. అయింటి మెట్లు ఎక్కుతూంటే సరస్వతి కాళ్లు వణికాయి. ఎలాగో ధైర్యంచేసి తలుపు తట్టింది. రెండు నిముషాలపాటు ఏంసమాధానం లేదు. రెండు నిముషాలూ రెండు యుగా లుగా తోచాయి. ప్రక్కనే వున్న కిళ్లీకొట్టువాడూ, వాడి బేరగాళ్లూ లోకం అంతా ఏకమై తననే చూస్తున్నట్లనిపిం చింది ఆ రెండు నిముషాల్లోనూ.

గళ్లలుంగీ, లేసు బనీను వ్యక్తి ఒకరు తలుపుతీశాడు, "ఎవరు కావాలి?" అన్నాడు కటువుగా.

'శ్యామ సుందరిగారి యిల్లు యిదేనా?' తనకి తెలియ కుండనే ఒణికిన కంఠస్వరంతో అడిగింది సరస్వతి. అవును యిదే. కాని. ఆవిడ చచ్చిపోయి నాలుగు రోజు లయిందే. నీకు తెలియదా? లోపలికిరా ఆవిడ అక్క వుందిలే. అంటూ దారి యిచ్చాడా గళ్లలుంగీ వ్యక్తి.

ఇంతలోకే "ఎవరూ రహమాన్" అంటూ లోపలి గదిలోనుంచి ఒకావిడ వచ్చింది. తలనిండా తేనెపట్టులా పిన్నులు: ఉంగరాలుగా జుట్టు తిరగడానికి కాబోలు, "ఎవరమ్మాయి నువ్వు" సూటిగా సరస్వతిని ప్రశ్నించింది. "శ్యామ సుందరిగారు యీరోజుకు రమ్మని ఉత్తరం వ్రాయించారు .... సినిమాల్లో చేరదామని వచ్చాను," ధైర్యంగానే చెప్పింది సరస్వతి.

"ఓ సంగతి అమ్మాయి, మా చెల్లెలే శ్యామ సుందరి. మూడు రోజుల క్రితమే హాస్పటల్‌లో మరణించింది. అందుకే నేవచ్చి యిక్కడుంటున్నాను."

సరస్వతికి తన చుట్టూ ఏముందో తెలియడం లేదు. తను సినిమాల్లో చేరడానికి వస్తే, తనను రమ్మని ఆహ్వానించిన వ్యక్తి మూడునాళ్ల క్రితమే మరణించింది. ఈ మద్రాసులో ఎలాబ్రతుకుతుంది తను ? తన దగ్గర వున్న డబ్బు ఎన్నాళ్లు వస్తుంది ? తాను ధైర్యంగా నిల్చునివున్న భూమే బ్రద్దలయి తనని మింగేసినట్లు బాధపడింది సరస్వతి. సరస్వతి వూహలను మాటలలో చెప్పినంత విశదంగానూ గ్రహించింది శ్యామ సుందరి అక్క.

"నీకీ వూళ్లో ఎవరూ లేకుంటే యీ యింట్లో వుండవచ్చు. మెల్లి మెల్లిగా పని చూసుకోవచ్చు. రా స్నానం చేసి భోజనం చేద్దుగాని" అంటూ సరస్వతిని లోపలికి తీసుకువెళ్లింది శ్యామ సుందరి అక్క.

సరస్వతి మద్రాసు వచ్చి నెల రోజులు దాటింది. ఈ నెలలో సరస్వతి చాలా సంగతులు తెలుసుకొంది. ఈ నిజాలు ఆమె హృదయాన్ని క్షోభపెట్టాయి. శ్యామ సుందరి చావుతోపాటు తనకి ఒక ఎక్స్ట్రా అయే రాత కూడా లేకుండా పోయిందను కొంది సరస్వతి. కాని, అలా కాలేదు. రాత్రంతా తలనిండా నొక్కులు రాడానికి పిన్నులు పెట్టి, ఉదయాన్నే స్టూడియోలకి తీసుకు వెళ్లేది శ్యామసుందరి అక్క. ఎందరెందరినో వాళ్లు కలుసు కొన్నారు. కాని వేషం మాత్రం రాలేదు.

క్రమేణా, శ్యామసుందరి అక్క వేధించడం ప్రారంభించింది." ఎన్నాళ్ళు యిలా నిన్ను మేపడం ? ఎన్నాళ్లు నామంచి చీరలన్నీ నువ్వు కట్టుకుంటావు? నాకంటె చిన్న దానివీ అందమైన దానివీ.... నువ్వే సంపాదించుకోవచ్చునుగా ?" అంటూ ఏమేమిటో సలహాలిచ్చేది. ఆసలహాలని అర్థం చేసుకో డానికి ఎంతోకాలం పట్టలేదు సరస్వతికి.

ఆరోజు శ్యామ సుందరి అక్క చాలా హుషారుగా వుంది "నిన్ను బుక్ చెయ్యడానికి డైరెక్టరు గారు వస్తున్నారు: నీకదృష్టం అంటూ పట్టేయోగం వుంటే యీ ఛాన్సు ఒదులుకోకు" అంటూ హెచ్చరించింది సరస్వతిని.

నిజంగానే సరస్వతి ఆ ఛాన్సు వదులుకో దల్చలేదు. డైరెక్టరు తలనెరసిన వ్యక్తి.... చీరలు కొనుక్కోమని ఏభయి రూపాయలిచ్చాడు. ఆరోజున తెలిసింది — యీ ధన సంపాదన ఎంత సులభమో. కాని పుట్టిన పుట్టుక వల్ల యీ జీవితం, నీతివంతం యిలా జీవించడం తప్పు లేదు, అనితన ఆత్మను మాత్రం సంతృప్తి పరచు కోలేక పోయింది. కాని ఏంచేస్తుంది ? కొద్ది రోజులకే డైరెక్టరు గారి ధర్మమా అని ఓచిన్న వేషం దొరికింది. సినిమా ప్రపంచంలో సరస్వతి పేరు అందరికీ తెలిసింది కాని స్టూడియోకి వెళ్లినప్పుడు అలైటు బోయి లెందు కలా పళ్లికిలిస్తారు ? మేకప్ మేన్ వేళాకోళా లాడ తాడేమిట ? కవిగారి చనువుకి అంత లేదేమిటి ? .... అన్నీ తెగని సమస్యలై సరస్వతిని వేధించేవి.

మద్రాసులో జీవం సాఫీ గానే నడిచి పోతున్నట్లు కనిపిస్తున్నా సరస్వతి లోలోన కుళ్లి కృశించి పోతుంది. జీవితంలో తను మురిసిన తన అందం తనకే యింత చేటు తెస్తుందని ఎప్పుడూ అనుకో లేదు. తాను జీవితంలో కాదలచిన దేమిటి ? అయిన దేమిటి ? ఇంకెన్నాళ్ళు యిలాబ్రతికితే తను తార అవుతుంది? ఈ కోర్కెతో వచ్చిన తనలాంటి వాళ్లందరూ యిలాగే రూపాంతరం చెందుతున్నారా ? ఈ ప్రశ్నలన్నీ సమాధానం లేనిప్రశ్నలని తెలుసు తనకి కాని. యీప్రశ్నలు వేసుకోని రోజంటూ లేదు.

సంవత్సరం పూర్తి కాకుండానే సరస్వతికి యీ జీవితం మీద విసుగు వేసింది. తను మళ్లీ పోతే ; ఈ ఆలోచన కొద్ది రోజులుగా ఆమెకి నిద్రరాకుండా చేస్తూంది. అపజయాన్ని అంగీకరించి తను తిరిగి వెళ్లి పోతేనేం ?.... అరోజే తిరిగి వెళ్లి పోడానికి నిర్ణ యించుకొని శ్యామ సుందరి అక్కకి చెప్పింది సరస్వతి. తక్షణమే మెళ్లో గొలుసూ చేతిగాజులూ తీసు కొంది ఆవిడ. "ఎందుకు? యివన్నీ నావే కదూ?" అమాయికంగా అడిగింది సరస్వతి.

"నీవేం కావు ఇన్నాళ్లూ నాయింట్లో వుండి నీ ఆటలు సాగించావే. నాకేం లాభం ?" శ్యామ సుందరి అక్క యిచ్చిన సమాధానం అది.

తను వూరుకి టిక్కెట్టు కొనుక్కొని ఆడ వాళ్ల పెట్టెలో కూర్చున్న సరస్వతికి అసలు జీవితం మీదే విరక్తి కల్గింది. ఆడదిగా వున్నన్నాళ్లూ యీ లోకంలో ఏకాకిగా ఏ ఆడదీ బ్రతక లేదు. అలా బ్రతుకుతే బ్రతుక ప్రయత్నిస్తే తనకి తనే శత్రు వవుతుంది. ఈ నిజాన్ని తెలుసు కొందుకు సరస్వతికి తన జీవితాన్ని నాశనం చేసుకోవలసి వచ్చింది. కన్నీళ్లతో కూర్చున్న సరస్వతిని చూసి ఏదో కష్టం వచ్చింది కాబోలని ఓదార్చారు తోటి ప్రయాణీకులు. వారి ఓదార్పు మరీ బాధించింది సరస్వతిని.

శ్యామ సుందరి అక్క అను కుంటుంది సరస్వతి ఏ గొప్ప వాణ్ణో చూసుకొని లేచిపోయి వుంటుందని; అలా కాకుంటే రైల్లోనే ఏవ్యక్తినో చూసుకుని గమ్యం చేరకుండానే దిగిపోతుందని; లేకుంటే గమ్యంలో దిగ కుండానే అలా ఎక్కడికో వెళ్లి పోతుందని; కాని, అంత మంది మధ్య కూర్చుని ఏకాంతంగా కూర్చుని కుమిలి పోతూన్న సరస్వతి మనోభావాలని ఎవరు అర్థం చేసు కొంటారు. ఆమెలో జరుగుతున్న సంఘర్షణ, ఆమెకు మతిపోతున్న పశ్చాత్తాపం ఎవరికి అర్థం అవు తుంది ?

ఇప్పుడు, ఆడవాళ్ల పెట్టెలో కళ్ల నీళ్లతో కుములు తున్న హృదయంతో కూర్చున్న సరస్వతి ప్రాక్షిత అహల్య. ఆమెనికమీదట ఏపాపం అంటదు. ఇక ఏసైె తానూ ఆమెని భ్రమింపచేయ లేదు. ఈ ప్రపంచంలో యింకేదీ ఆమెను పాపపథాన పడవేయలేదు .... రైలు నడక తోపాటే పాప పంకిల జీవితానికి క్షణక్షణం దూర మయిపోయింది సరస్వతి. తారాపథాన్నందుకో అందించిన సరస్వతి.

సరస్వతి పరిస్థితుల బానిసగా ప్రవర్తించింది. ఆశయా నికి దాసోహంచేసింది. ఆశయాలు తారకలనంటుతే, వాటి తోపాటే తారకలను చేరలేక, అసంగతి తెలుసుకో లేక జీవితాన్ని నాశనం చేసుకొన్న వ్యక్తిని అసహ్యించు కోలేం: జాలిపడతాం. అంతే. ఆలోచించి చూస్తే యీ పట్టణంలో సరస్వతిలో పరిపక్వత రాక, అటువంటివి ఒక ఆత్మ అనేది లేక మురికి మురికిగా రోడ్లు మూసుకుని జీవితాన్ని సాగిం చేస్తూన్న సుస్వరులు ఎందరుంటారో ?

అందరూ నడిచే దారి తప్పి, కొత్తమార్గాన నడువ ప్రయత్నిస్తే అంతే అవుతుంది అంటారు కొందరు. కాని ఏమో ఆలాగనీ అనలేం, నుదుటి రాత ఎలాఘంటే అలా జరుగుతుంది. మనం ఆలా కాకూడదని అనుకొన్నా తప్పదు. వ్యక్తుల జీవితాలు ముల్లు పడ్డ దారాల్లా రాక తప్పదు — ఎంతసాఫీగా జరిపేద్దామనుకున్నా అలాకాక తప్పదు — దానికి నిదర్శనే — సరస్వతి కథనం;

# న్యాయశాస్త్రము - బాల నేరస్థులు.

శ్రీ వి. వి. శాస్త్రిగారు

న్యాయాతిక్రమణయే దుష్ప్రవర్తన. అది చట్టమునకు విరుద్ధము. అదియే సంఘ వ్యతిరేక ప్రవర్తన. బాలలట్టి దుష్ప్రవర్తన కావించినచో బాల్యనేరమందురు. ఏ వయస్సువారిని బాలనేరస్థు లనవలెనో వివిధ చట్టములు నిర్వచించినవి.

భారత నేర సంపుటి ప్రకారము 7 సం॥లో ప్రాయము వారు (నేరముచేసినను) నేరస్థులు కానేరరు. 12 సంవత్సరములోపువారిని నేరస్థులుగా ఋజువు చేయవచ్చును. సంస్కరణ పాఠశాలల చట్టము 15 సం॥ లోపు వారిని, పిల్లల చట్టములు 16 సం॥ లోపువారిని. బోర్స్టల్ పాఠశాలల చట్టము 21 సం॥ లోపువారిని, కొరడా దెబ్బల చట్టము 16 సం॥ లోపువారిని బాలనేరస్థులుగా నెంచినవి.

ముఖ్యోద్దేశము :- బాలురేనేరముచేసినను వారికందుబాటులోని వారి పరిస్థితులవల్లనేకాని వారు స్వతహాగా చేసినవికావు. వారిపెంపకము పరిసరముల యందలిలోపములు అందుకు దారితీయించినవి, కానవారిని దూషించరాదు. ఇదియే వారిప్రత్యేకశిక్షణకు ముఖ్యకారణము.

అతి గారాబము. అత్యధిక క్రమశిక్షణ, తల్లిదండ్రుల యశ్రద్ధ. కుటుంబ కలహములు, మరణమువలన లేక విడాకులవలన విచ్ఛిన్నమైన కుటుంబములు, భావ్యత లేమి, సవితితల్లి, యింటియందితర బంధువులు. తల్లిలేక, తండ్రి లేదా యిరువురిని కోల్పోవుట. కుటుంబ దారిద్ర్యము. క్రిక్కిరిసిన వసతిలేని యిండ్లు, అపరిశుభ్రత. ఆటపాటలకు సరియగు వసతులు లేకుండుట, మొదలగునన్నియు పిల్లల ప్రవర్తనలోని దోషములకు బాధ్యులగుచున్నవి. దినముయందు కొంతభాగము పాఠశాలయందు గడపినప్పటికి, విశ్రాంతి సమయము నెట్లు గడపవలెనో తగు సలహాలేని పిల్లల నడవడి మనకాశ్చర్యమును కలిగించనక్కరలేదు. చెడుసహవాసములు, చెడుమాదిరిలు పిల్లల నడవడిపై సన్నిహిత ప్రభావమును కలిగి యున్నవి. కనిపెట్టబడని అంగవైకల్యములు, వ్యాధులు, తీరని యావేశములు లేక తదితర నావశ్యకములన్నియు సంఘవ్యతిరేక ప్రవర్తనకు దారితీయుచున్నవి. నేరము చేసినను పిల్లలకు కఠినశిక్షకూడదు. అనేకసార్లు నేరములు చేసిన వయోపరాధులమధ్యనుంచనూరాదు. అటివారికికూడా రగని మనప్రస్తుతపు చెరసాలలలో యీ బాలనేరస్తులను నిర్బంధించుట వారిని బాగుచేయుటకు బదులు పాడుచేయుటకే యగుచున్నవి. ఆ భయమే వారికి ప్రత్యేక శిక్షణకు కారణము.

వారిని సన్మార్గమున పెట్టగలమన్న విశ్వాసముపైనే వీరికి ఏర్పాటుచేసిన ప్రణాళికలన్నియు ఆధారపడియున్నవి. దుష్ప్రవర్తనకూడా దేహజాడ్యమువంటిదే. శారీరక వ్యాధులను తగువారిచే బాగు చేయించుకొనునటుల పిల్లల తప్పులను కూడా తగువిధముగా సరిదిద్దుకోవలనేకాని నేరములక్రింద ఎంచరాదు. ఇట్టికారణముల వలన ప్రపంచము నందంతటను బాలనేరస్థులకు ప్రత్యేక శిక్షణ ఏర్పాటు చేయబడినది.

బాలనేరస్థులన్యాయ స్థానములు :— బాల నేరస్థుల న్యాయస్థానముల కర్తవ్యము లేవి? వాని నిర్మాణ మెట్లుండవలెను? అవి యనుసరించ వలసిన విధానమెద్ది? నేరస్తుడని నిర్ణయించిన తరువాత యాతని శిక్షయందు వీరికుండ వలసిన పాత్రఏమి? ఎంతవరకు? అను ప్రశ్నలకు సమాధానములు కావలసియున్నవి.. వారుకూడా క్రిమినలు కోర్టు విధానమునే యవలంబించి. బాల నేరస్థులకు తేలిక శిక్షలనొసగి తృప్తిచెందవలసినదేనా? లేక న్యాయస్థానములకు పంపుటకు పూర్వము బాల సంక్షేమ సంఘములకు పంపి తరితర సంస్కరణలద్వారా దిద్దేప్రయత్నముచేసి. దానికిలొంగని వారినే న్యాయస్థానమునకు పంపకూడదా యనునది పెద్ద సమస్య.

శిక్షకాదు : శిక్షణ :— ముఖ్యముగా గుర్తించ వలసిన దేమన యిందలి కర్తవ్యము శిక్షణకాని శిక్షకాదు. ఇందుకు తగిన వైద్యుడెవరనునదొకటే సరియగుప్రశ్న. నేరమును ఋజువు చేయుటకు ప్రస్తుత విధానమే ఉత్తమమైనది. నేరమును విచారించి నేరమునకు తగిన శిక్షను

విధించుటయే ముఖ్యోద్దేశమగుచో సరియగు విచారణ జరుగుటకత్యవసరమైన రక్షణలతో కూడిన ప్రస్తుత పద్ధతి త్రోసిపుచ్చరాదు. కాని మన ఆశయము వేరు — పగ తీర్చుకొనుటకాని శిక్షించుటకాని కాదు. సాధ్యమగునంతవరకు శిక్షించకనే వారి నితర పద్ధతుల సహాయముతో సన్మార్గమునకు త్రిప్పుప్రయత్నములకు న్యాయస్థానమేల? విధానమేల? బాలన్యాయస్థానములు నేరస్థులనువిచారించవచ్చును. కానినేరము చేయకున్ననూ, తప్పుదారిని నున్న పిల్లలకు తగిన వసతు లేర్పరచి అవసరమయినచో తల్లిదండ్రులను కూడ కాదని యితర యధీనమునందుంచుట ఎవరు నిర్ణయించవలెను.

ఇందుకు ప్రతి రాష్ట్రమందునూ తగినన్ని బాలన్యాయస్థానముల నెలకొల్ప వలసియున్నది. ప్రస్తుతము కొన్ని రాష్ట్రములలో పిల్లల చట్టములు అమలులో నున్నవి. ఆ చట్టములువల్లనే రాష్ట్రప్రభుత్వములు పిల్లల న్యాయస్థానములు, ప్రకటిత పాఠశాలలు, సంస్కరణ పాఠశాలలు, లేక వృత్తి పాఠశాలలు బాలనేరస్థుల నందుంచి వారికి తగుశిక్షణ నిచ్చుట కేర్పాటు చేయుచున్నవి. అంతేకాక అనేక సంస్థలను, పాఠశాలలను, చిట్టి గృహములను. ఇందుకు నియమించిరి. సాధారణముగా బాలనేరస్థులకు మరణదండన గాని ద్వీపాంతరము గాని, ఖైదుగాని విధించరాదు పిల్లల విషయమందు యిట్టి శిక్షణ అవగుణముగా, పరిగణించరాదని శాశన నందొక యంశమేర్పరచబడినది. ఇట్టిపిల్లలు చట్టములో. సంస్కరణల ద్వారా బాగుపడని, అనుజ్ఞలకు లొంగనివారికి కారాగార శిక్ష విధించుటకు కూడ నధికారమున్నది. ఈ చట్టములు విపరీతమగు పరిస్థితులలో రాష్ట్రప్రభుత్వముల దృష్టికి తెచ్చుటకు న్యాయస్థానముల కధికారమిచ్చినవి న్యాయస్థానవిచారణ మేజిస్ట్రేటులచే జరపబడుచున్నది. నేరారోపణ సాధారణముగా పోలీసులే చేయుదురు. విచారణ క్రిమినల్ ప్రొసీజరుకోడ్ ప్రకారము జరుగును. విచారణ, శిక్షణ యనుపదములు విరివిగా ఉపయోగింప బడినవి. చట్టములో సూచించిన అధిక అల్ప ప్రమాణములకు లోబడి ఎంతకాలం మీశిక్షణ యందుంచ వలసినది తీర్పులో పేర్కొన వలసియున్నది.

ప్రస్తుతము చట్టములు అన్ని రాష్ట్రములలో అమలుకు తీసికొని రాబడినట్లుగాని. అమలులోనున్న రాష్ట్రములలో, యాచట్టములు రాష్ట్ర మందన్ని భాగములకు వర్తించు చున్నట్లుగాని కనిపించుటలేదు. బాలన్యాయస్థానము విధిగా నేర్పాటు చేయవలెనని చట్టములో లేదు. మామూలు న్యాయస్థానములే పిల్లల నేరములను గూర్చి విచారణ చేయవచ్చును. బాలన్యాయస్థానము లున్నస్థలములందుకూడ. చట్టముయొక్క భాషను బట్టి మామూలు న్యాయస్థానము పిల్లల నేరముల విచారణచేయు నధికారమును తీసివేయలేదు.

పిల్లలసంస్కరణ : న్యాయస్థానము :— పిల్లల న్యాయస్థానములు మామూలు క్రిమినల్ కోర్టులవలెగాక యితర స్థలములందును, తదితర వేళలయందును, విచారణజరుపవలెను. నేరమునకు సంబంధము లేని వ్యక్తులను న్యాయస్థానము హాజరు కానీయదు. విచారణను గూర్చిన వివరములు ప్రకటించరాదు. పరిసరములలోని. శిక్షణలోని లోపములను కనిపెట్టి పిల్లలను సత్ప్రవర్తనులుగా చేయు యత్నములలో శిక్షాప్రసక్తి కూడదు. అట్టిపనికి నియమించిన న్యాయస్థానములలోను విచారణ, శిక్షయను ప్రసక్తి ఎందులకు? ఇప్పుడు ఈ న్యాయస్థానములకు మనస్తత్వవేత్తలయొక్క, శారీరతత్వ వేత్తలయొక్క సహాయము పొందుటకు అవకాశములేదు. న్యాయస్థానము లట్టి సహాయము లేకనే విచారణ జరిపి, భయము చెప్పి యింటికి పంపివేయుచున్నారు. లేదా యేదైనా ప్రకటిత పాఠశాలకు పంపుచున్నారు. ప్రతియొక్కని గురించి శ్రద్ధవహించి యాతనిలోటుపాట్లను సరిదిద్దుటకు తగిన యేర్పాట్లులేవు. తప్పుదారిలో నున్న పిల్లలను సంపూర్ణులుగా చేయుటకు, తగు సంస్థలందు నిపుణుల యాధ్వర్యమున ప్రతివారికి తగిన శిక్షణవారి కొసంగుట యత్యవసరము. బాల న్యాయస్థానములకు ప్రత్యేక శిక్షణపొందిన యనుభవజ్ఞుల యావశ్యకత యెంతయోనున్నది. ముఖ్యముగా [illegible] పరీక్షా గృహములు, పిల్లల విషయమున సలహానిచ్చు వైద్యులు, మానసిక తత్వవేత్తలు, శరీర తత్వవేత్తలున్న యెడల వారి సహాయముతో న్యాయాధికారులు బాలనేరస్థుల కెట్టి యుత్తమ శిక్షణనీయవలసినది విచారించి తగు తీర్పు నీయకలరు. ఇట్టియవకాశములేవియు ప్రస్తుతము లేవు. ఇవియన్నియు అవసరమే.

తరువాత బిడ్డకు తగిన శిక్షణ యివ్వవలసియున్నది. వదలివేసిన వారిని వారివారి యిండ్లయందే అజమాయిషీలోనుంచబడినవారిని తప్పించి, యితరులనొక సంస్థ యందుంచుట అవసరము. ఆ సంస్థలు బాలావరకు పాఠ

శాలలవలెనే వయస్సుకు తగిన విద్యగరప వలెను. శిక్షించుచున్నారన్న సంశయమేమాత్రము కల్గించకవారిని మామూలు పాఠశాలకుకూడ వెళ్ళనీయవచ్చును. శిక్షణ నొందిన వ్యక్తుల చేతులందుండి, బిడ్డ తనకుశిక్షణము నుండి వైదొలగి, త్వరలేనే ఏ సంస్థయొక్క క్రమశిక్షణ యవుసరము లేకయే, యింటియందు మామూలుగా నివసించనగునని ఆశించబడియున్నది. శిక్షణ యొక్క ఫలితమునుసరించి శిక్షయొక్క పరిమాణము నిర్ణయించ వలెను. ప్రారంభమందీ శిక్షణకాలము నిర్ణయించరాదు. అందుంచవలసినకాలము అనిర్ణయముగానేయుండిన, బిడ్డ సత్వరము స్వాతంత్ర్యముపొందుట తన చేతులందేకలదని గ్రహించి సరిగానడచుకొనును.

తల్లిదండ్రులు - బిడ్డ :—విచారణ జరుపుసమయమందు తల్లిదండ్రులను తప్పనిసరిగా హాజరు చేయించుటకు చట్టములందు అనేక నిబంధనలున్నవి. బిడ్డదుష్ప్రవర్తనకు తల్లిదండ్రుల అజాగ్రత్తయే కారణమయినచో, వారిపై జరిమానావిధించుటకుకూడా న్యాయస్థానమువారికధికారము కలదు. న్యాయాధికారి శిక్షణవిధించుటకు పూర్వము ఆ బిడ్డ తల్లిదండ్రులనిరువురిని నాలోచించవలసినట్లుగా చట్టములందేర్పాట్లు అవసరము. అంతకు పూర్వమే అట్టి దుష్ప్రవర్తన కొంతకాలమునుండి కనిపెట్టిన అట్టి దానినుండి మరలించుటకు తల్లిదండ్రులు పలు వుత్తమ ప్రయత్నములు కావించితిరనీ గ్రహించవలెను. బిడ్డలట్ల గుటయందు ప్రతి తల్లిదండ్రియూ అందు భాగస్వాములని కాని, వారి అజాగ్రత్తయే అందుకు కారణమనికాని భావించుట న్యాయముకాదు. వారి అజ్ఞానమే వారిలోప మయినచో న్యాయస్థానమువారు వారికి బిడ్డల యందెట్టి శ్రద్ధవహింపవలెనో బోధించుట వుపయోగకారిగావుండును. నిర్ణయకాలము మాత్రము సంస్థలందుగడపి, స్వగృహ మునకు తిరిగివచ్చి బిడ్డసంరక్షణ భారమువహించు తల్లి దండ్రులకు న్యాయస్థానమట్టి నిర్ణయములు చేయుపూర్వము వారినాలోచించుట, అట్టి బిడ్డలతో నడవవలసిన పద్ధతులు తెలిసికొనుటకు, అవకాశములిచ్చును. ఇందుమూలమున ఇట్టి న్యాయచట్టములు తల్లిదండ్రులకు సమ్మతముగా నుండును.

న్యాయశాస్త్రమునకు తగు గౌరవమీయవలెను. శాస నోల్లంఘముకానీయరాదు. పిల్లలెట్టి శిక్షపొందనక్కర లేకయే శాసనోల్లంఘము చేయవచ్చునన్న అభిప్రాయము కల్గచేయుట ఎంతయూ అపాయకరము. విధిగా బాల నేరస్థులెల్లరకు సాంస్కారిక విద్య గరపవలసినదే కాని నిర్వాహణ పద్ధతులలో నూతనతేజము, నమ్మకము కలుగ వలసియున్నవి. ఇట్టి పవిత్రధర్మమును నెరవేర్చుటకు నియమించిన వ్యక్తిగణముపై ఇది చాలవరకు ఆధారపడి యుండును. కాన యిందులకవసరమగు, బిడ్డలసేవయందు త్సాహముకల వ్యక్తులకీ శిక్షణ యొసగుట ప్రప్రథమమైన కార్యము.

(సోషల్ వెల్ ఫేర్ పత్రికనుండి)



# పురుషుల దృష్టిలో స్త్రీలు :

శ్రీమతి కవితిలక, కవితావిశారద, విద్వాన్,కాంచనపల్లి కనకాంబగారు.

పురుషులందు పుణ్య పురుషులు వేఱయా అని వేమన్న అన్నాడు. సామాన్య పురుషులు చెప్పుదానికన్న తత్త్వవేత్తలగుపురుషులు చెప్పుదానికే విలువయున్నది. "నాఋషిః కురుతే కావ్యమ్మ"ని కలదు కదా! ఋషి కానివాడు కావ్యము రచింపరాదు. వారు పక్షపాతరహితులు. హితమైనది యదార్థమైనది రచింతురు కాని వారి స్వాభిప్రాయమును వ్రాయరు, విశ్వ శ్రేయస్సునకై గ్రంథముల రచింతురు. ఐతే 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనుట సామాన్య కవుల విషయము. అసత్కావ్యములను రచింపనే కూడదన్నారు. మన శాస్త్రములను, పురాణములను, ఇతిహాసములను కావ్యములను గూడ ఋషులు ఋషికల్పులైనట్టి మహానుభావులైనట్టి తత్త్వవేత్తలు రచించిన వాటిచేతనే మనకవి ఆదర్శ గ్రంథములుగ నున్నవి. వేదము లపౌరుషేయములు. మన దేశము వేద ధర్మము నాధారము చేసికొని అన్ని దేశములలో ప్రశస్తిగన్నది. కాబట్టిమనం తత్త్వవేత్తలు వేదమునందు. శాస్త్రమునందు, పురాణములందు, కావ్యములందు స్త్రీలనేవిధముగ బరిగణించిరో విచారింతము. "స్త్రియస్సతీః తాఉమేపుగ్ంస ఆహుః" అని వేదమునందు కలదు, అనగా సతీత్వముగన్న స్త్రీలు పురుషులే, వారు అందఱిచేతను పూజింపదగినవారు అని యర్థము. జీవుడు అని మగవాని విషయము ఆడదాని విషయము సమముగనే వ్యవహారమున్నది. గాని ఆడజీవుడని మగజీవుడని లేదుగదా! సముద్రమువంటివాడు దేవుడనియు జీవులందఱు నదులవంటి వార



నియు నదీసముద్రములు కలిసినట్లు దేవుడు జీవుడు కలిసిన ప్పుడానందము.

ఋషులు త్రికాలజ్ఞులు, పక్షపాతరహితులు, పుణ్యమూర్తులు వారి వాక్కు సత్యము. ఉపనిషత్తులలో గార్గి, మైత్రేయి, కాత్యాయని మొదలగు బ్రహ్మవాదినులుగలరు. వారేవిధమునను పురుషులకు దీసిపోరు. ఇతరాదేవి కుమారుడు తన బ్రాహ్మణమునకు దల్లిపేరుతో ఐతరేయ బ్రాహ్మణమన్నాడు. తల్లియందెంత గౌరవమో చూచితిరా! ఉపనయనమునందు "భవతి భిక్షాందేహి"యని తల్లినే మొదటి భిక్షకధికారిణియనిరి. మాతృదేవోభవ, పితృదేవోభవ అనుటలో తల్లికెట్టి ప్రాధాన్యము గౌరవమున్నదో చూచితిరా! స్త్రీలను పురుషులను కనిపెంచువారు స్త్రీలేకదా!

మాతా మహీ మాతులానీతదా మాతుశ్చసోదరా!
శ్వశ్రూః
పితామహీ జ్యేష్ఠాధాత్రీచ గురవః స్త్రీషు....కార్మే
ఉపవిభాగే

11 వ అధ్యాయమున నున్నది.

ఈ పై జెప్పినవారు స్త్రీలయందు గురువులుగ నున్నారు. దేవీ భాగవతమందు గూడ స్త్రీలకు ప్రాముఖ్యమీయబడినది. బ్రహ్మాదులకు శ్రీదేవి నిజరూపము నిట్లు పదేశించినది.

నూనం సర్వేషు దేవేషు నానానా మధరాహ్యాహమ్. భవామి భక్తిరూపేణ కరోమిచ పరాక్రమ. గౌరీ బ్రాహ్మీ తథారౌద్రీవారాహీ వైష్ణవీ శివా వారుణీ చాథకౌబేరీ నారసింహీచ వాసవీ. ఉత్పన్నేతు సమస్తేషు కార్యేషు ప్రవిశామితాన్. కరోమి సర్వకార్యాణి నిమిత్తంతం విధాయవై. జలేషు శీతం తథావహ్నౌ వౌష్ణం జ్యోతిర్ది వాకరే నిశానాథే హిమం కామం ప్రభవామి యథాతథా, అశక్తశ్శం కరో హంతుందైత్యానిల మయోజ్ఝితః, శక్తిహీనం నరం బ్రూతేలోక శ్చైవాతి దుర్బలం, రుద్రహీనం యదా సర్వే ప్రవదంతి నరాధమమ్ అశక్తః ప్రోచ్యతేలోకే నా రుద్రః కోపి కథ్యతే॥

చూచినారా రుద్రహీనమని విష్ణుహీనమని చెప్పము శక్తిహీనమని ప్రయోగమున్నది. శక్తి హీనుడు నరాధముడుగదా! సమస్త కార్యములకు నిమిత్తము శక్తియే. స్త్రీలను పరాభవించుట ప్రకృతిని పరాభవించుట యని మఱియొక చోట చెప్పబడినది.

యోషితాముపమానేన ప్రకృతేశ్చ పరాభవః। బ్రాహ్మణీ
పూజితా
యేన పతిపుత్రవతీసతీ. ప్రకృతిః పూజితాతేన వస్త్రాలంకారచందనైః

స్త్రీలలో సత్త్వగుణ ప్రధానులుత్తమ పతివ్రతలని, రజోగుణ ప్రధానులు మధ్యములని, తమోగుణ ప్రధానులధమురాండ్రని దేవీభాగవతమందు చెప్పబడినది. మను స్మృతిలో మను వేమని చెప్పినాడో విన్నారా?

యత్ర నార్యస్తు పూజ్యంతేరమంతే తత్రదేవతాః,
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రా ఫలాఃక్రియాః॥
తస్మా దేతానిసదా పూజ్యా భూషణాచ్ఛా దనాశనైః
భూతికామైర్నరైర్నిత్యం సత్కారే షూత్సవేషుచ.

భగవద్గీతయందు గూడ "కీర్తిఃశ్రీ వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిక్షమా" అనియు "అధర్మాభి భవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః" గీత 1 వ అ, 4. కాబట్టి కులమర్యాదయు స్త్రీలవలననే నిలుచును. వారు చెడినప్పుడే వర్ణసంకరమగుననియున్నది. భాగవతమందుగూడ "విభుడు పతితుడైన వెలది పాతివ్రత్య మహిమ పుణ్యుజేసి మనుపవలయు'' నని స్త్రీ ధర్మములందున్నది. చెడిపోయిన పురుషుని స్త్రీకె బాగుచేయ శక్తిగలదు. కాని చెడిన స్త్రీని బాగుచేయు సామర్థ్యము మగవానికి లేదన్నారు.

భర్తృహరి "అమృతలతికబోలు ననురాగవతిమైన కాక యుండెనేని గరళవల్లి" యన్నారు. స్త్రీ సహజముగ మగవానికన్న తెలివికలదని కాళిదాసాదులు "స్త్రీణాము శిక్షిత పటుత్వ మమాను షీషు సందృశ్యతే'' అన్నారు. ఆ యర్థమునే నా "జీవయాత్ర" యను గ్రంథమును "చదివిన చదువక యున్నను మదిరలు విద్యాంసురాండ్రు పుట్టుక" అని వచించితిని. గారుడమందు "పుంసశ్చ నార్యశ్చ సమస్వభావాః స్వతంత్ర తామేగ బాధించతోయైశ్చ దోషైశ్చ నిపాతయంతి సదోప్యహకూలాని కులాని నార్యపి" అన్నాడు మఱియు "సదానేన సమానేన నార్జవేన నసేవయా.

సశస్త్రేణ నశాస్త్రేణసర్వదా విషమాస్త్రియః" అనియు కలదు. బ్రహ్మవైవర్తమందు స్త్రీలమనుషుము' పితారక్షతి కౌమారే భర్తారక్షతియౌవనే, పుత్రశ్చస్థావిరేరక్షేత్ నస్త్రీ

## పురుషుల దృష్టిలో స్త్రీలు :

స్వాతంత్ర్యమర్హతి. స్త్రీజాతిరబలాశశ్వద్రక్షణీయా స్వబంధుభిః జనకస్వామి పుత్రైశ్చ గర్హితాన్యైశ్చనిశ్చితం"

ఇట్లు చెప్పినను స్త్రీకి నిచ్చిన స్థానము గొప్పది. "కార్యేషుదాసీ కరణేషుమంత్రీ రూపేచలక్ష్మీ క్షమయా ధరిత్రీ" అని పురుషునికి సర్వదా తోడునీడయై సత్పథమునందు నిలిపి యానందము గూర్చునన్నాడు. భవభూతి యుత్తర రామచరిత్రలో అరుంధతి సీతనుగూర్చి చెప్పిన విధము "గుణాఃపూజాస్థానం గుణిషునచలింగం నచవయః" అనగా గుణములే పూజింప దగినవిగాని స్త్రీయని. పురుషుడనిగాని, చిన్న పెద్ద అనిగాని విచారింప నక్కర లేదని వచించినాడు.

మనదేశములో మనపూర్వులు తత్త్వవేత్తలు స్త్రీలకు నిచ్చిన గౌరవమే దేశములో నెవ్వరు నీయలేదని చెప్పవచ్చును. నామకరణము చేసిననాటిపేరు ఆజన్మాంతముండును. సీత + అమ్మ సీతమ్మయనియే మొదటినుండి చివరవరకు వ్యవహరింతుము. ఇతరదేశస్థులు అవివాహితగా నున్నప్పుడు తండ్రిపేర మిస్ జాన్ అనియు, పెండ్లి అయినతరువాత భర్తపేర మిసెస్ బ్రౌన్ అనియు వ్యవహారము. మనవారు గౌరవసూచకముగ "అమ్మ" యను పదము చివరచేర్చి చెప్పుదురు. హిందువులలో చక్కనియర్థము గలపేరుంచెదరు. "యశోదా" యశస్సు నిచ్చుచున్నది, "సుశీల" మంచి నడవడిక గలది అని యర్థము. లేదా దేవతల నామముల నుంచెదరు. సీత, పార్వతి, భవాని మొదలగునవి. యథార్థమును బల్కునట్టి మహానుభావులు శాస్త్ర పురాణములందు స్త్రీల నెట్లు పరిగణించిరో పై శ్లోకముల వలనను వాక్యముల వలనను దెలిసి కొన్నాము. నన్న యాదులు స్వతంత్రముగ గ్రంథముల రచించుటకు జంకి వ్యాసాదిఋషులు వ్రాసిన భారతాది గ్రంథములను ఆంధ్రము ననువదించిరి. అట్లు నన్నయ తిక్కన ఎఱ్ఱాప్రెగడ పోతన భాస్కరుడు పెద్దన మొదలగువారు ఋషుల అడుగు జాడలలో నడచిరి కావున ఆగ్రంథములు మనకు ఆదరణీయములు. నన్నయ భారతమునందు స్త్రీని గురించి పలుచోట్ల వర్ణింపబడినవి. "గృహనీతి విద్యకు గృహము—విమల చారిత్ర శిక్షకాచార్యకంబు—అన్వయస్థితికిమూలంబు సద్గతికినూత" అని దుష్యంతునికి శకుంతలచే జెప్పించినాడు. ద్రౌపదిచే ధర్మము చెప్పింప బడినది. ఇట్లే సంస్కృత నాటకములలో పురుషులు సంస్కృతమును స్త్రీలు ప్రాకృతమును మాట్లాడునియమమున్నను అరుంధతిఉత్తరరామచరిత్రలో సంస్కృతమందే మాట్లాడును. ఇట్లే మాళవికాగ్నిమిత్రమందు పండిత కౌశికి సంస్కృత మందే మాట్లాడును. కావున అర్హతగల స్త్రీలకు తగిన గౌరవమొసగినారు. దోషమున్నపుడు దోషములను దెలిపిరి వృక్షములందు వేపచేదు మామిడితీపి, అనుటలో వేపమీద ద్వేషములేదు. మామిడిమీద ప్రీతియులేదు. ఔచిత్యమునుబట్టి సందర్భముల ననుసరించి స్త్రీల విషయము వ్రాసిరేకాని వారికేలాటి పక్షపాతములేదు. తదితరుల వాక్యముల విషయము మనము లెక్కచేయ నక్కరలేదు, తత్వవేత్తల వాక్కులే ఎన్నదగినవి. సత్యము.

(ఆలిండియారేడియోవారి సౌజన్యమున ప్రచురింపబడినది)

# మహారాణీ సేతు పార్వతీబాయి

శ్రీమతి కె. రామలక్ష్మి

ఖ్యాతిగాంచిన మహిళలకి మన దేశం ఏ యితర దేశాలనీ తీసిపోదు. ఋగ్వేద కాలంలోనే స్త్రీలూ రచయిత్రులూ పేరుగాంచినట్లూ, ఋగ్వేదంలో కొన్ని భాగాలు రచించినది వీరేననీ అంటారు. పురాణ కాలం తీసికొంటే, సీతా, గార్గి, మైత్రేయి, సావిత్రి...ఇంకా ఎందరెందరో కానవస్తారు. చరిత్ర కెక్కిన కాలంలో పద్మిని, మీరాబాయి, నూర్జహాన్, ముంతాజ్ మహల్, ఝాన్సీరాణి, కట్నపిశాచికి తానుగా బలిఅయిన స్నేహలత, యింకా ఎందరెందరో నారీమణులు ప్రతి హిందూ గృహంలోనూ ఆరాధింపబడుతూనే వున్నారు. వీరందరూ, తమ మతం



లోని గురుత్వానికీ, రాజకీయ చతురతకీ, రాజ్య పాలనకీ వేదాంత దృష్టికీ, విషయసముపార్జనకీ, ధైర్య స్థైర్యాలకీ, నమ్రతకీ, గంభీరమైన ఆత్మబలిదానానికీ, విజ్ఞానానికీ, సౌందర్యానికీ వన్నెకెక్కినవారే. పాతకాలపు కథలు చూస్తూంటే, పాతంతా బంగారం అన్నట్లు ఆ నాటి స్త్రీలు నివశించిన స్వేచ్ఛాపూరిత వాతావరణానికి మనకే ఆశ్చర్యం వేస్తుంది. పురుషులతో సమానంగా అన్ని అవకాశాలూ వారికి వుండేవి, మహమ్మదీయులీదేశాన అడుగుపెట్టేదాకా, యీ స్వేచ్ఛ అందరికీ అందుబాటులో వుండేది. కాని మహమ్మదీయుల రాకతో స్త్రీలుస్థానపతనం గావింపబడ్డారు. పరదా పద్ధతితోపాటు స్త్రీ అన్నివిధాలా పురుషునికంటె తక్కువ అన్న అభిప్రాయానికి అంకురం ఏర్పడింది. ఈవిధమైన అంధకారంలోపడ్డ స్త్రీలుకొన్ని శతాబ్దాలు అలా అంధకారంలోనే వుండిపోయేరు. తిరిగి ఆంగ్లేయుల రాకతో కొంత మార్పువచ్చింది. వీరి పాలనక్రింద స్త్రీలలో కొంచం సంచలనం కల్గి, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలవైపు మళ్లీ పురోగమించాలనే ప్రయత్నాలు ఆరంభమయాయి.

మనదేశంలో భౌగోళికంగా ఆయా ప్రదేశాలను పట్టి అక్కడి వనితలలో చైతన్యం ప్రతిభా మారుతూ వుంటాయి. ఉదాహరణకి బీహారు, పంజాబ్, ఒరిస్సా మొదలైన ప్రాంతాలు తీసుకొంటే వేయిమందికి నల్గురేనా అక్షరాస్యులయిన స్త్రీలు వుండేవారు కాదు. అదే కాలంలో మలబారులో స్త్రీలు సర్వస్వతంత్రులు. మలబారులో తల్లిదే ప్రాముఖ్యం. ఆస్థిపాస్తుల పంపకాలు, రాజ్యపాలనలూ అన్నీ మాతృ వంశానివే. తమ భర్తలని తామే ఏరుకొని, వివాహం చేసుకొనేవారు. బాల్య వివాహాలు ఆ ప్రదేశంలో తెలియనే తెలియవు. స్త్రీలకి స్వేచ్ఛా, విజ్ఞానం మొదలైనవి వంశహక్కు అయిన మలబారులో జన్మించిన సేతు పార్వతీబాయినిగురించి తెలుసుకోడానికి ఏముంటుంది? ఆమె యితర నారీరత్నాలలా, స్వేచ్ఛకోసం, స్త్రీల హక్కులకోసం పోరాడలేదే, అంటే, ఏం చెప్పలేను కాని, సేతు పార్వతీబాయి, తిరువాన్కూరు స్త్రీలకీ, వూరికీ చేసిన సేవ అమోఘం. దానిని గురించి ముచ్చటిస్తే సేతు పార్వతి ఘనత విశదమవుతుంది; అంతేకాదు. అవకాశాలుండగానే సరికాదు. వాటిని సద్వినియోగం చేసుకోడంలోకూడా నేర్పు వుండాలి అన్న సంగతి విశదం అవుతుంది.

తిరువాన్కూరును పరిపాలిస్తున్న రాజవంశం—మను

కాలంనుండీ వస్తున్నదే అంటారు. దక్షిణాదికి ఎన్నెన్ని రాజ్యాలు ఉద్భవించి, హరించిపోయినా తిరువాన్కూరు మటుకు దరిదాపు చెక్కుచెదరక నిలచివుంది. అది అట్లా నిలచివుండడమే దాని పాలకుల ఘనతకి నిదర్శనం. మూడు వందల సంవత్సరాలక్రితం, రాజ్యానికి వచ్చిన, మహారాజా మార్తాండవర్మ తనకింది సామంతులందరినీ లోబరుచుకొని రాజ్యపాలన సాగించాడు. తిరువాన్కూరును పాలించిన రాజులు, వీరులే కాకుండా, పండితులు. సంస్కృతాన్నీ మళయాళాన్నీ శ్రద్ధాశక్తులతో పోషించారు. కళాకారులను పోషించారు. 1888 లోనే, తిరువాన్కూరులో లెజిస్‌లేటివ్ కౌన్సిలు స్థాపించారంటే, ఆ ఆ స్థానాన్ని ఎంత ఉదాత్తంగా వారు పాలించేవారో ఊహించుకోవచ్చు. 1933 లో యీ కౌన్సిలుని సరిదిద్ది, రెండు సభలుగా చేశారు: శ్రీమూలమ్ అసంబ్లీ; శ్రీచిత్ర స్టేట్ కౌన్సిలు.

సేతు పార్వతీబాయి నవంబరు 8, 1896 లో మావెలికార కుటుంబంలో పుట్టింది. ఆమెకి నాలుగు సంవత్సరాలప్పుడు, సేతు లక్ష్మీబాయితోపాటు, ఆమెనీ రాజవంశంలోకి పెంపకం యిచ్చారు. చిన్నతనంలో సంస్కృతం మళయాళం చదువుకొని తరువాత ఇంగ్లీషూ, ఫ్రెంచీ కూడా నేర్చుకొంది. కుటుంబంలో అందరిలాగే ఆమెకీ సంగీతంఅంటే యిష్టం. మన సాంప్రదాయ సంగీతాన్నే కాకుండ పాశ్చాత్య సంగీతాన్నికూడా ఆమె అకళించుకొంది.

సేతు పార్వతీబాయి ఉద్దేశ్యంలో యాత్రలు అతి ముఖ్యం. యాత్రలు విజ్ఞానసముపార్జనా ప్రయత్నంలో భాగం అని ఆమె నమ్మకం. యూరపు ఆసియా మొదలైన ఖండాలన్నీ తిరిగివచ్చింది ఆమె. పాశ్చదేశాలలో పర్యటింపబోయిన దక్షిణాది వనితల్లో మొదటి ఆమె సేతు పార్వతి. రాజ్యపాలనలోనున్న వంశీకురాలు విదేశాలను దర్శింపబోయిన తొలి సందర్భం—సేతు పార్వతి విదేశాలను దర్శింపబోయిన సందర్భం. తన ఆరోగ్య విషయంలో తొలిసారిగా సేతు పార్వతి విదేశాలకేగింది. తనతోపాటు కుమార్తెఅయిన, కార్తికతిరునాళనికూడా తీసుకొనివెళ్లింది. వంశంలోని రాకుమార్తె అతి ముఖ్యమైన వ్యక్తి. కారణం, ఆమెపుత్రసంతానమే రాబోయే రాజ్యాధిపతి అవుతాడు.

రెండవసారి యూరపుయాత్రకి తనతోకూడా తన కుమారుడు, ప్రస్తుత మహారాజుని తీసుకొనివెళ్లింది. ఈ యాత్రలన్నీ స్వదేశంమీది అభిమానాన్నీ గౌరవాన్నీ ఆమెలో పెంపొందింపచేశాయి. విదేశాలలో స్త్రీల ప్రతిపత్తి ఆమె దృష్టి నాకర్షించింది. ఆదేశాలలో, అందరూ కలిసి ఒక సత్కార్యాన్ని సాధించడంకోసం ఎలా పాటుపడతారో చూసిన సేతు పార్వతీబాయికి, మనదేశంలో కూడా అలా జరుగుతే బాగుండుననిపించింది. ప్రదేశాలని పరిశుద్ధంగా వుంచడంలో, దేశగౌరవాన్ని కాపాడడంలో విదేశీయులు చూపే శ్రద్ధాసక్తులు ఆమెకు నచ్చాయి.

మహారాణీ సేతు పార్వతీబాయి తిరువాన్కూరు మహిళలకి చేసిన సేవ అపారం. ఆమే వారికి ఒక ఉదహరణగా నిల్చింది. తన ప్రదేశ మహిళలకి తన సహాయం అంతగా అవసరంలేకపోయింది. కారణం మలబారులో స్త్రీ స్థానం ఉన్నతమయినదే. ఇతర ప్రదేశాల మహిళలకికూడా చేయూతనిస్తే, అవకాశాలిస్తే, వర్ధిల్లుతారని ఆమె తాపత్రియపడింది. కలకత్తాలో జరిగిన ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సుకి అధ్యక్షతవహించింది. యీ కాన్ఫరెన్సులలోనూ యితర చోట్లా ఆమె చేసిన ఉపన్యాసాల సారం చూస్తే—స్త్రీలు భారత భావికీ తమ భావికీ కూడా పాటుపడాలన్నది తెలుస్తుంది. స్త్రీల అండలేకుంటే యీ దేశంలో పురుషులు చేయగల్గినది ఎక్కువ లేదు; పురుషులమధ్య సౌభ్రాతృత్వాన్ని పెంపొందింపచేయడానికీ భావి భారత పౌరులని సరిదిద్దడానికీ, ప్రాచీన సంప్రదాయసిద్ధ సంసారాన్ని సరిచేయడానికీ, అన్నిటికీకూడా స్త్రీలే పూనుకోవాలి స్త్రీలే సాధించుకలరు—అన్నదే సేతు పార్వతీబాయి నమ్మకం. స్త్రీలు అక్షరజ్ఞానం లేకుండావున్నన్నాళ్లూ, పురుషులుకూడా అభ్యుదయం సాధించలేరు—అన్నది అందరూ ఒప్పుకుంటారు. తిరువాన్కూరులో, ఇద్దరు చదువుకున్న పురుషులకీ ఒక చదువుకొన్న యువతివుంది. స్త్రీ పురుషులు కలిసి చదువుకుంటే, తిరువాన్కూరువారికి అపహాస్యంలేదు. అందుకే ఆ ప్రాంతంలో విజ్ఞానవతులైన యువతుల సంఖ్య హెచ్చు. కట్నాలు, పరదా మొదలైనవి అందరూ ప్రతిఘటించవలసిన అత్యాచారాలు అని సేతు పార్వతీబాయి భావిం

చింది. ఎన్ని కష్టనష్టాలు వచ్చినా, ఆశ వదలకుండా ఉంటే, భావి భారతంలో స్త్రీల స్థానం తిరిగి గౌరవాన్ని పొందుతుందన్న నమ్మకంతో, "కారుమేఘాలు చెల్లాచెదరిపోతున్నాయి. మెల్లిగా ఉషక్కాంతి భూభాగాలని ఆక్రమించుకుంటూంది. దేవునిదయవల్ల, ఉదయభాను దర్శనం మనకి లభించాలి" అంది సేతు పార్వతీబాయి.

ప్రస్తుత తిరువాన్కూరు పరిపాలిస్తున్న శ్రీ బాలరామ వర్మ, సేతు పార్వతి కుమారుడు. రాజ్యపాలన విషయంలో తన తల్లి తన కెన్నివిధాలుగా సహాయం చేస్తూందో, తాను ఎంతగా తన తల్లికి ఋణపడివున్నాడో రాజా బాలరామ వర్మయే ఒక సందర్భంలో చెప్పారు. ఇతను రాజ్యానికి **1924** లో వచ్చాడు. బాగా చిన్నవయస్సులో వుండడం వల్ల, పెద్ద మహారాణి, సేతు లక్ష్మీబాయి రాజ్యం సరి చూసేది. 1931 లో బాలరామవర్మ పూర్తి అధికారంతో రాజ్యానికి వచ్చాడు. రాజ్యానికి వచ్చిన కొద్ది సంవత్సరాలలోనే ఎన్నో సంస్కరణలు తీసుకువచ్చాడు. అన్ని జాతులకీ దేవాలయప్రవేశార్హత యిచ్చి, ఆదరించాడు. దేశంలో నిమ్నజాతుల సమస్యాపరిష్కరణకి యిది నాందిగా ఎంతేనా పనిచేసింది.

తిరువాన్కూరు అన్ని రంగాలా అభివృద్ధికావడానికీ, అభ్యుదయ పథగమనంలో అన్నిరాష్ట్రాలకీ ముందు వుండడానికీ,.... ఎంతో కష్టపడిన ముఖ్యుల్లలో సేతు పార్వతీబాయి పేరు అగ్రగణ్యం వహిస్తుంది. స్త్రీ తలపెడితే చేయలేనిది దుండదు. స్త్రీలు చైతన్యవంతులయితే దేశం చైతన్యపూరితం అవుతుంది అన్న నిజం తిరువాన్కూరు చాటుతుంది.

అన్ని రాష్ట్రాలలోనూకూడా స్త్రీలు చైతన్యవంతులవాలి. అనడానికి కారణం—దేశ సౌభాగ్యాన్ని దృష్టిలో వుంచుకొనే. అజ్ఞానం బానిసలని తయారుచేస్తుంది. బానిస మాతలు నిస్సహాయులైన సంతానాన్ని పెంపొందిస్తారు. అజ్ఞానంలో బానిసత్వంలో అణగారిన పూర్వార్థపురోమను మాతృత్వం—రోమను రాజ్యపతనానికే కారణం అయింది. పాశ్చాత్యసూక్తి: 'స్వేచ్ఛకోసం జ్ఞానసముపార్జన.' అందుకే, జాతి పునరుజ్జీవనంకోసం, దేశ సౌభాగ్యంకోసం నిజంగా పాటుపడదల్చుకొన్నవారు—విశాల హృదయంతో స్త్రీ జనాభ్యుదయంకోసం, పాటుపడేవాళ్లే.

రామయ్య :-శాస్త్రిలుగారూ! ఇదేమిటండి విడ్డూరం? ఎండా వాన లేకుండా వాళ్లు అలా గొడుగు పట్టుకొని వెళ్తున్నారేం?

శాస్త్రిలు :-అదా! ఇంగువలో నకలు మార్కా ఇంగువలు ఎక్కువై వర్షంలా కురుస్తున్నాయి. ఆ నకలు మార్కా యింగువలు మీద పడకుండ గొడుగు పట్టుకొని వెళ్తున్నారు.

రామయ్య :-అల్లా అయితే, ఇంగువలలో అసలు మార్కా యింగువ ఏదండీ శాస్త్రిలుగారూ!






శాస్త్రిలు :-ఇది తెలియదూ! అరవై సంవత్సరాలుగా మార్కెట్టులో ప్రఖ్యాతినొంది అనన్య ప్రచారంగలది

**యల్. జి. L. G.**

మార్కా యింగువ ఒక్కటే.

అదుగో వారిని చూడండి! వారు కుటుంబసమేతంగా బజారుకు వెళ్ళి అసలుమార్కా యల్.జి. యింగువను కొనుక్కొని ఎంత ఆహ్లాదంతో వస్తున్నారో ఆ అమ్మాయిని చూడండి. ఎంత చక్కగా యల్. జి. L. G. మార్కా యింగువ సంచులను ఎంత అందంగా పట్టుకొని వెళ్తున్నది.

మనము ఇకమీదట కొనేటపుడు యల్. జి. L. G. మార్కాను చూచి లాల్‌జీ గోధు అండ్ కంపెనీవారి విలాసం వున్నదా అని పరీక్షించి కొంటే మార్కెట్టులో నున్న నకలుమార్కా యింగువలను చూచి మోసపోకుండ వుండవచ్చును.

ప్రతి చోట దొరకును లేక

## లాల్‌జీ గోధు అండ్ కంపెనీ

సాహుకారుపేట, మద్రాసు. :: హెడ్డాఫీసు : బొంబాయి.

# మెరుపు - వెలుగా

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు

మెరపో వెలుగో చూడు !
స్వరమును సవరించుక పాడు !!— మెరపో॥

మరపుముసుగుతెర యిరులనుపిడి
తూరుపుదెసలో తోచునదో !! —మెరపో॥

మెరపుజారులో విరిసిన భావము
మరియందక మాయమ్మగునో !
వెలుగునమునిగి వెడలినభావము
విశ్వమునే వెలిగించునదో !!— మెరపో॥

రాగపాత్రలో భావమధువులో
నీగళమ్ములో ఊగునదో
వనగీతమ్మది నాల్గు దిక్కులా
భువనలోకము తలలూపునదే !!— మెరపో॥

అరుణరశ్మి వికసించుకమలము
కుంకుమమ్ము శోభనకరము !
ఉషఃకాంత నెమ్మొగము శాంతిలో
రుషాద్వేషములు కనరావే !!— మెరపో॥

తెల్లవారితే లోకమ్మంతా
తీవ్రారుణమై పోవునా,
ఆకులనడుమను మంచుబిందువులు
అందమైన పూవులులేవా !!— మెరపో॥



చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీలశాఖగా 1938 సంవత్సరంలో జనన మొందింది. మాసభ పిల్లలకు సంగీతం. నాట్యం నేర్పడమే అప్పటి మా ప్రధాన కార్యక్రమం. పిల్లలతోబాటు తల్లులు "మాధవబాగ్" కు రావడంతో పెద్దలకు హిందీక్లాసులు, మెట్రిక్ క్లాసులు ఆ సంవత్సరం లోనే ప్రారంభించాము.

* * * *

'బాలికలక్లబ్బు' అనతికాలంలోనే మహిళాభ్యుదయ మహాసంస్థగా రూపొందింది. పూజ్య బాపూజీ ఆశీర్వాదములతో నిర్మింపబడిన స్వగృహములో 1945 నుండి ఆంధ్ర మహిళ సేవా జీవితం సాగిస్తోంది.

* * * *

1947 లో ప్రారంభించిన శిశు సంరక్షణ కార్యక్రమం 1952 ఆగస్టులో 'నర్సింగ్ హోమ్'గా రూపొందింది. ఈసంస్థలో దీనులకు ప్రసూతి వైద్య సౌకర్యములతోపాటు సుమారు ఏభైమంది విద్యార్థినులకు మిడ్‌వైఫరీ, నర్సింగు శిక్షణ యివ్వబడుతోంది.

* * * *

నూలు వడకడం. చాపలునేయడంతో ప్రారంభమైన మా పారిశ్రామిక శాఖ నేడు 'కంపోజింగ్, ప్రింటింగ్ నేత, అద్దకము' మొదలగు వివిధ వృత్తులలో స్త్రీలకు తర్ఫీదు యిస్తోంది.






ఆంధ్ర మహిళ



ఆంధ్ర మహిళ పురోగమనం

# అమెరికా గృహములు - నౌకరులులేని గృహములు

అనువాదం : కుమారి కె. వా. బా. దేవి

★

**అమెరికాలో గృహములలో సేవకులుండరు. అసలచ్చటి సమాజమే నౌకరులు లేని సమాజము. గృహిణిగా యుండు టచ్చట గొప్పగౌరవనీయమైనపని.**

(శ్రీ వి. పి. పి. రాజన్ గారి వ్యాసమునకు స్వేచ్ఛానువాదము).

మదరాసులోని ఇండ్లలో వలెగాక అమెరికను గృహములలో నౌకర్లుండరు. మాలిగాని, పనిపిల్లగాని, బట్లరుగాని, వంటవాడుగాని, బేరరుగాని, కనుపించరు. గృహిణి తనపనిని తానేనిర్వర్తించు కొనజూచును, ఆమె నేల శుభ్రము చేయును, పాత్ర కడుగును, బిడ్డలను పెంచును — ఇంతయేల? తన కుటుంబమునకు ఇంటిలోని సమస్తమైన పనులు తానే చేయును.

ధనికులయినను, పేదవారయినను, సమాజమునందు ఏవర్గమునకు చెందిన వారయినను ప్రతి అమెరికను గృహములోను ఈ పరిస్థితులుండును. చాల అరుదుగా ఒక దాసీనుంచు కొనుట కొన్ని గృహములలో కావచ్చును. కాని ఇట్టి గృహములు వేయికొకటి. పైగా, చాలా ధనవ్యయముతో కూడినపని.

ఇంటి పనులన్నియు స్వయముగా చేసికొనునట్లు వారు చిన్నప్పటినుండి తర్ఫీదు చేయబడి యున్నారు. అందువల్లనే ఒక ప్రఖ్యాతపండితుడు తన ఇంటితోటలో పనిచేయుట. లేక ఒక వ్యాపారి గాని ప్రభుత్వోద్యోగి గాని తన యింటికి రంగువేయుట ఇత్యాది పనులు చేసికొనుట తటస్థించును, ఇటువంటివి సర్వసామాన్యముగా, అనుదినము అమెరికాలోకనబడును.

అమెరికను సమాజము సేవకులు లేని సమాజమని చెప్పదగును. ప్రతి వ్యక్తి తన పనిని, చిన్నదయినను, పెద్ద దయినను, తానే నిర్వర్తించుకొనును. కాయకష్టముచేయుట గౌరవనీయమని యెంచుకొందురు. ఆమాటకు వస్తే నైపుణ్యముగల వడ్రంగిగాని. కట్టుబడి పనివాడుగాని, కార్మికుడుగాని, గుమాస్తాల కంటెను, విశ్వవిద్యాలయములలో పనిచేయువారి కంటెను, అధికముగానే సంపాదించును. అక్కడి జీవన ప్రమాణము (Standard of living) ఇక్కడి కంటె చాలా ఎక్కువ. అందుచేత వేతనములు కూడ ఎక్కువే అమెరికాలోని సామాన్య కుటుంబీకుడు తనకు వచ్చిన దంతయు ఖర్చుపెట్టును. మన ఖర్చులతో పోల్చి చూచిన అమెరికనులు జీవితావసరములకు చేయు ఖర్చులు కూడ చాల ఎక్కువనిపించును.



శ్రమలేకుండా వంటచేయుటకు వీలగు పరికరాలు - వంటవండుటకు, పాత్రలు సునాయాసముగా శుభ్రపరచుటకువలయు ఏర్పాట్లుగమనించదగును.

# అమెరికా గృహములు

అమెరికను గృహిణి తన ఇంటిపనులు నిర్వర్తించుట యేకాక ఆఫీసులలో గాని దుకాణములలో గాని పనిచేసి, ఇంటి ఆదాయమును పెంపొందించును. ఆ దేశములో గృహిణిగా యుండుట ఒక పెద్దపని. అందువల్లనే అచ్చటి గృహిణివాల గౌరవింప బడుచున్నది.

అచ్చటి గృహిణిలు తమ అతిథులను ఆప్యాయతతో పలుకరిస్తూనే తమపని తాము చేసికొంటూ ఉంటారు. వారి వంటయిల్లు కూడా తక్కిన ఇంటివలెనే పరిశుభ్రముగా ఉంచబడును. వారి వంటయిల్లు మన పట్టణపు భవనములలోని డ్రాయింగు రూములవలె యుండునే కాని డ్రాయింగు రూములలో ఉండే సోఫాలు తదితరములు మాత్రముండవు. ఒక రిఫ్రిజరేటరు, ఒక ఎలక్ట్రిక్ పొయ్యి, ఎలక్ట్రిసిటితో గిన్నెలుకడుగు యంత్రము, ఉండును. చక్కగా అలలో అమర్చబడిన ఆహారపదార్థములు ఉండును. పదినిముషములలో బ్రెడ్ టోస్ట్, కూరగాయలు టోమాటో ముక్కలు, వేపుడుచేసిన గ్రుడ్డు, కాఫీ, మీగడతో పీచ్ పండ్లు—వీటితో భోజనము తయారగును. ఎలక్ట్రిసిటి, మరియు యంత్ర సహాయము (Mechanical devices) వలన వీరిపని ఈ విధముగా త్వరత్వరగా ముగియును.

అచ్చటి గృహిణి బజారు పనులన్నియు తానే చేసికొనును తన యింటి తోటలో టమాటీలు మొదలయిన కూరగాయల చెట్లను పెంచును. తోటకనులకు ఇంపుగావుండును. అట్టి తోటలను మనము పెంచుటకు కనీసము ఇద్దరు తోటమాలీలు అవసరము.

భోజనానంతరము పాత్రలను పరిశుభ్రము చేయుట యందు గృహిణికి, గృహయజమానితో పాటె అతిథులు



అమెరికన్ గృహిణి సునాయాసంగా వంటచేయుటకు మరియు పరికరాల ఏర్పాటు — ఫ్రిజిడేరు, ఎలక్ట్రిక్ పొయ్యి, వంటసామగ్రి అలమారు చేరె క్రిందనే ఏర్పాటు చేయబడియున్నవి.

## అమెరికా గృహములు

కూడ తోడ్పడుదురు మనదేశమునుండి పోయిన పెద్దలు అకడి ఈపద్ధతి చూచి, ఆశ్చర్యపడుట కద్దు ఇక్కడివలె కొన్నికొన్ని పనులు చేయుట వారికి మర్యాదకు లోపమని పురుషులు తలువరు. మనదేశములో తమయిండ్లలో పని వారినిని వినియోగించినవారు లోభులనిపించబడు చున్నారు. అమెరికనులు అట్లుగాక, తమకుపనివారి నియోగించుకొను శక్తియున్నను స్వయముగా పనులు చేసికొనుటే ఉత్తమ మని నమ్మి వారు తమపనులను తామే చేసికొనుచున్నారు.

('మద్రాస్ మెయిల్' వారి అనుమతితో)

---

## ఉరుములు — మెరుపులు

"చైనా శాంతినే కోరుతున్నట్లు నాకు నమ్మకము కుదిరింది. చైనా ప్రభుత్వము చైనా ప్రజలు కూడా శాంతినే అభిలషిస్తున్నట్లు నాకు విశ్వాసం కలిగింది. కాని భవిష్యత్తులో ఏమి జరుగుతుందో నాకు తెలియదు"— నెహ్రూ అన్నట్లు పత్రికావార్త.

అంతే పాపము రాజకీయ వేత్తలు జోస్యం ఏలా చెప్పుతారు—

2. అద్యతన భావిలో తన కార్మిక విధానాన్ని సవరించుకునే పరిస్థితులో ఇండియా ప్రభుత్వము లేదని నేడు అఖిల భారత ఉత్పత్తి దారుల సంఘము కేంద్ర కమిటీ సమావేశములో మాట్లాడుతూ కేంద్ర కార్మిక శాఖా మంత్రి శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ప్రకటించారు— పత్రికావార్త.

అధికారములోనున్నవాళ్లు ఇలాంటి ప్రకటనలు చేయక తప్పదు.

3. బ్రిటన్‌లోవలె ఇండియాలో కూడా ఉద్యోగాలు చేసే తల్లుల పిల్లల నిమిత్తము సంరక్షణ కేంద్రాలను నెలకొల్పేటట్లు చెయ్యాలని తాను భావిస్తున్నట్లు కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘము అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ నేడిక్కడ వక్కాణించారు— ఢిల్లీవార్త.

తొందరగా ఏర్పాటు చేసే I.A.S, I P.S లో నున్నా స్త్రీల గందరగోళము తగ్గి శ్రీ కట్జూమహాశయునికి మన శ్శాంతి కలుగవచ్చు—

4. బంజర్లు పంపిణీ సక్రమంగా జరగడం లేదని అసెంబ్లీలో ఆరోపణలు—

నందికొండ ప్రాజెక్టును ప్రభుత్వము నిర్లక్ష్యం చేస్తున్నదని విమర్శలు. పత్రికా వార్తలు.

అన్నీ సక్రమంగా జరిగితే రాజకీయవేత్తలకు నిరుద్యోగ సమస్య ;

5. అవిశ్వాస తీర్మానాన్ని సులభంగా వోడిస్తామని మంత్రి వర్గీయుల విశ్వాసము.— కర్నూలు వార్త.

విశ్వాసము— అవిశ్వాసము రావటికుండలు వలె వుంటేనే— ప్రభుత్వము సక్రమంగా నడుస్తుంది.

6. మద్రాసుకు పెద్దమనుషులు వచ్చారు చూడాలి— సినిమా వార్త

అంటే ఇదివరకు మద్రాసులో లేనే లేరా ? ఏమో !

7. మిత్ర రాజ్యసమితిలో ఈజిప్షియన్ ప్రతినిధి వర్గ నాయకుడు డాక్టరు మహమ్మద్ అజ్మీనేడు భద్రతాసంఘ సమావేశములో వుండగా గుండె జబ్బువల్ల ఆకస్మికంగా మరణించాడు.

ఏ సమితిలలోనైనా ఇంత గడబిడ చేయకూడదు.

8. మద్రాసు—సింగపూరు నౌకాసర్వీసుకు ప్రారంభోత్సవము— పత్రికావార్త.

ఆంధ్ర కేమైనా లాభముంటుందా ?

---

# మతిమాలిన వైద్యం

శ్రీ పోతుకూచి సాంబశివరావు

డాక్టరుగారు బొజ్జనిమురుకుంటూ ఆవలించారు. భోజనం చేసి, మిట్టమధ్యాహ్నపు బయటి ఎండ మిటమిట లాడుతున్నా యింటిముందరి తాటాకులపందిరి గాలిని చల్లబరచి డాక్టరుగారికి హాయిని గలిగించింది. ముప్ఫయి సంవత్సరాలు ఆవూళ్ళో డాక్టరుగా పనిచేసి, చక్కటి ఆర్జన చేసి అందరి గౌరవం పొంది తనకుటుంబాన్ని తరతరాలవరకు సుఖంగా బ్రతకగలిగే స్థిరాస్థి సంపాదించారు. ఆయన ఈ యాభయ్యోపడిలో కొడుకకూడా యం.బి.బి.యస్. చదివి తన వృత్తిలో సహాయం చెయ్యడానికి యింటికి వచ్చాడు.

డాక్టరుగారి జీవితంలో అంతా పరిపూర్ణత ఉన్నట్లనిపించింది. కావలసినంత ధనం, చుట్టుప్రక్కల వూళ్ళలో ప్రతీచోట ఎంతో పరపతి – అణగి మణగి భయ భక్తులతో మెలగే సేవకులు, ఎదురాడి ఎరుగని సంతానం కుటుంబం– ఆదరించే బంధుజనం యివన్నీ తలుచుకోగానే డాక్టరుగారి జీవితం సార్థకం పొందినట్లయింది. ఇంతకంటె కావలసిందేముంది? ఏమీ లేదనిపించింది.

మేడమీద నుంచుని కిటికీ ఊచలమధ్య నుంచి బయటికి చూశారు డాక్టరుగారు. దూరాన నిర్మల నీరాలతో నిండుగా ఉన్న కాళింగు చెరువు– ఆ ఒడ్డునే స్వార్జితంతో కట్టిన పెద్ద ఆసుపత్రి – కనిపించాయి. తన విజయజీవితం తలుచుకోగానే డాక్టరుగారికి ఆనందాశ్రువులు రాలాయి.

నిజంగా జీవితంలో యింత సంపాదనా పరుడవటానికి కారణం డాక్టరుగారు పిచ్చివాళ్ళ వైద్యంలో చేసిన ప్రత్యేక కృషి. ఎంతోమంది పిచ్చివాళ్ళు దేశంలోని ఎన్నో ప్రాంతాలనుంచి వచ్చి ఆయన చికిత్సవల్ల నయం పొంది వెళ్ళారు. ఆయన ఖ్యాతి చాలా దూరం ప్రాకిపోయింది. జీవితానికి విలువ యిచ్చే మనస్సుకు మందుపోసి స్థిరత్వం తెప్పించే ప్రత్యేకశక్తి ఆయనకు చేతనవును ఆ శక్తికే ఆయనకు అందరూ జోహారు లర్పిస్తారు. ఎన్నో చితికిన జీవితాలకు ఆయన చికిత్సచేసి చైతన్యం కలిగించారు.

అవూళ్ళో యింకా ఎంతోమంది వైద్యులున్నారు కాని డాక్టరుగారి వృత్తితో పోటీ చెయ్యలేక పోయారు ఎవరూ. మానవ హృదయాలను స్పందింప చేయకలిగే మతి చికిత్స ఆయనకు తెలియడంవల్ల, తక్కిన తరగతుల రోగులుకూడా ఆయనలో ఏదో వింత చేతి చలవ ఉందని మందుకు వచ్చేవారు. అందుకే డాక్టరుగారి ప్రతిభ దివిటీలా వెలుగుతోంది.

తన కొడుకును కూడా తనవంటి మంచి డాక్టరుగా తయారు చెయ్యకలిగితే, తన జీవితాశయం పూర్తిగా నెరవేరినట్లే. కొడుకుమీద ఎంతో అభిమానం పుట్టుక వచ్చింది డాక్టరుగారికి

“గోపాల్” అని పిలిచారు ఆయన ఆప్యాయంతో.

వార్తా పత్రిక చదువుతున్న గోపాల్ వినయ విధేయతలతో తండ్రి ఎదురుగా వచ్చి నుంచున్నాడు. ఏమిటి అన్నట్లు ప్రశ్నార్థకంగా.

‘ఈ సాయంత్రం కాంతారావుగారిఅమ్మాయి ఆరోగ్యం ఎలావుందో చూసిరా. మొన్ననాకు టైఫాయిడని అనుమానం తట్టింది’

‘అట్లాగే నాన్నగారూ!’ ముక్తసరిగా అని గోపాల్ లోపలికి వెళ్ళిపోయాడు. ఆమాటలు అనకుండానే అతని ప్రవర్తనలో అంగీకారం కనిపిస్తుంది. పుష్టిశరీరం – పచ్చని రంగు – ప్రశాంతమైన కళ్ళలో నల్లటిపాపలు– మందస్మిత వదనం – సహజమైన ముఖభావం, అతనిలో కెమ్మది అణకువ తొణికిసలాడేస్తుంటాయి. వయస్సు ఇరవై అయిదు సంవత్సరాలున్నా, వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం మాత్రం తండ్రి ముందు, ప్రయోగించలేదు.

# మతిమాలిన వైద్యం

తన కొడుకుకూడా పిచ్చివాళ్ళ వైద్యంలో ఆరితేరిన చెయ్యిగా మారగలిగితే, డాక్టరుగారు యింక ఆశించ గలిగింది ఏమీలేదు. ఈ ఆలోచనైనా కొడుకు అభివృద్ధి కోసమే. అందరికీ తెలియని ఒకపనిలో నేర్పరితనం పొందుతే, అందుకునే కీర్తి సంపదలు అపరిమితం.

ఆలోచనల ఆనందంతో డాక్టరుగారు ఒక కునుకుతీసి లేచారు. ముఖప్రక్షాళన అనంతరం, తెల్లటిపంచ, చొక్కా తొడుక్కొని, చేతికర్ర ఊపుకుంటూ వైద్యాలయం వైపు నడిచారు.

ఆసుపత్రి జనంతో కిటకిట లాడుతోంది. జ్వరాలతో, నీరసాలతో, కళ్ళరోగాలతో, పళ్ళబాధలతో, మతి భ్రష్టత్వంతో, నలిగి కుమిలి పోతున్న జనప్రవాహానికి ఆ ఆసుపత్రి ఒక ఆనకట్టలా అడ్డుకున్నట్లు కనిపిస్తున్నది. ఆసుపత్రికి దక్షిణ భాగాన కట్టిన పాతిక గదులలో ప్రపంచ స్పృహలేక విచిత్రంగా అరుస్తూ, సణుగుకుంటూ, అల్లరి చేస్తున్న పిచ్చివాళ్ళను, అక్కడకు వచ్చిన జనమంతా, మ్యూజియంలోని వింతమృగాలను పరిక్షిస్తున్నట్లు ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసుకుని చూస్తున్నారు. వారి మతి చెడిన చేష్టలు జాలితోకూడిన ఆనందం కల్గ చేస్తున్నాయి ప్రేక్షకులకు.

డాక్టరుగారు ఆసుపత్రి ఆవరణలో అడుగు పెట్టగానే జనమంతా లేచినుంచున్నారు. దగ్గరకు రాగానే అందరూ నమస్కారాలతో ఆయన్ను ముంచేశారు. ఆనందంతో కుశల ప్రశ్నలువేస్తూ డాక్టరుగారు కుర్చీలో చేరగిలబడ్డారు. రోగులకు మందులు పంపే కార్యక్రమం చూడడానికి.

కాంపౌండరు శ్రీనివాసు రోగుల మందుల పట్టిక డాక్టరుగారి ముందు పెట్టాడు. డాక్టరుగారు రోగులను ఒకరి తర్వాత ఒకరిని పరీక్షించారు. వారు చెప్పిన విషయాలన్నీ పూర్తిగా వినకుండానే మందులు వ్రాసి పంపించేశారు. చూడగానే రోగులబాధలు తెలుసుకో గలిగే డాక్టరు గారికి, వారి విలాపాలు వినే అవసరం ఉండేదికాదు. ఆసుపత్రికి వచ్చిన రోగులంతా మందులుతీసుకుని క్రమంగా వెళ్ళిపోయారు.

సాయంత్రం ఆరుగంటలయింది. పిచ్చివాళ్ళ కేకలు డాక్టరుగారి చెవుల్లో గింగురు మంటున్నాయి. వాళ్ళందరికీ మందుయిచ్చే టైమయింది. డాక్టరుగారు యీ పని పూర్తిచేయాలని లేచారు.

ఆసుపత్రి ముందు జట్కా ఆగింది. గోపాల్ మందుల సంచీ చేత్తో పుచ్చుకుని లోపల అడుగుపెట్టాడు. వెనకాలనే పొట్టిగా బొద్దుగా ఒకాయన గోపాల్‌ను అనుసరించాడు.

"కాంతారావుగారా! ఎల్లావుంది మీ అమ్మాయికి" ఆయన్ని ఆహ్వానిస్తూ కొడుకువైపు చూశారు డాక్టరుగారు సమాధానం కోసం.

'నిన్నటి కంటె యీవేళ జ్వరం యెక్కువయింది వారి అమ్మాయికి. జ్వరతీవ్రతవల్ల స్పృహలేక ఏదో పలవరిస్తోంది. మీతో యీ సంగతి చెప్పాకగాని మందు ఏమీ యివ్వడం మంచిది కాదని వచ్చేశాను. మామూలు ధోరణిలో రోగి సంగతి వల్లించాడు గోపాల్'

"డాక్టరుగారూ! అమ్మాయికి జ్వరం అంత తీవ్రంగా వస్తుందను కోలేదు. మాకేమీ తోచటంలేదు. మీరే ఒకసారి వచ్చి చూస్తే బాగుంటుంది.' ప్రాధేయ పడ్డారు కాంతారావుగారు.

"ఇప్పుడే మావాడు చూసి వచ్చాడుగా! మందిస్తాను. రేపువచ్చి చూస్తాలెండి!" అన్నారు డాక్టరుగారు సాయంత్రం బయటికి కదిలితే ఆసుపత్రిలో యింకా చెయ్యవలసిన పనులు అడ్డిపోతాయేమోనని. అదీకాక ఆ సాయంత్రం గోపాల్‌ను పిచ్చివాళ్ళ దగ్గరికి తీసుకువెళ్ళి వాళ్ళ రోగ రహస్యాలు, వింతప్రకృతులు విపులీకరించి చెప్పి, అతనికి ఆ వైద్యంలో కొంత తర్ఫీదులు యివ్వాలని సంకల్పించుకున్నారు. ఈ సంకల్పానికి అంతరాయం కలిగింది.

"అలా అంటే కాదండి. తమరువచ్చి ఒక్కసారి చూస్తే మాకు ధైర్యం. అబ్బాయిగారు చూశారుకాని ........" అంటూ కాంతారావుగారు నమిలి వేశారు. ఆఖరి మాటలు.

డాక్టరుగారికి అర్ధమయింది. క్రొత్తగా వైద్యంలో ప్రవేశించిన కొడుకుపై, తనమీద ఉన్నంత విశ్వాసం,

కాంతారావుగారికి లేనట్లు కనిపించింది. అది సహజంకాదని ఎవరనగలరు?

'సరే పదండి! అంటూ డాక్టరుగారు ఎదురు సమాధానం మళ్ళీ చెప్పలేక, కండువా బుజాన వేసుకుని చేతికర్ర పుచ్చుకున్నారు ఉత్తగా.

కాంపౌండరు శ్రీనివాసు ఎదురుగా వచ్చాడు పిచ్చివాళ్ళకు మందు యివ్వడం సంగతి ఏమిటన్నట్లు. డాక్టరుగారంటే పిచ్చివాళ్ళకు భయం. ఆయన కేకవేసి మందు యిస్తే అందరూ తాగుతారు. లేకపోతే ఎంతో రసాభాస చేస్తారు. డాక్టరుగారికి అందరి రోగులను చూడడం ఒక ఎత్తు. పిచ్చివాళ్ళకు చికిత్స చేయడం ఒకఎత్తు. ఎందుచేతంటే, పిచ్చివాళ్ళను పరీక్షిస్తున్నప్పుడు ఆయనలో ప్రత్యేక శ్రద్ధాసక్తులు, మానవత్వ పరిశోధనాశక్తి ద్యోతకమవుతూంటాయి కాని కాంతారావుగారి అమ్మాయి పరిస్థితి ప్రమాదంగా ఉండడంవల్ల తప్పనిసరిగా డాక్టరుగారు బయటికి వెళ్ళవలసి వచ్చింది.

'గోపాల్, యీ వేళ సాయంత్రం పిచ్చి వాళ్ళందరికి మందు నువ్వుయిప్పించు. శ్రీనివాసు అన్నీ నీకు చెబుతాడు అంటూ డాక్టరుగారు జట్కాలో ఎక్కి కూర్చున్నారు. కాంతారావుగారి వదనం చాలా ప్రసన్నమయింది.

'మరేమీ అనుకోకండి. శ్రమయిచ్చాను అబ్బాయిగారికి అనుభవం కొంచెం తక్కువగాఅంటూ కాంతారావుగారు సమిలేశారు మాటలు. ఈ ఆరోపణ డాక్టరుగారికి లోపల ఒక విధంగా బాధకలిగించినా, పైకి మామూలుగా ఒక నవ్వుతో ఆసంభాషణ అంతం చేశారు. జట్కా టకటక మంటూ కదిలి పోయింది.

తనజీవితంలో మొదటిసారిగా గోపాల్‌కు, పిచ్చివాళ్ళను సముదాయించి మందు యివ్వవలసి వచ్చింది. చిన్నప్పటినుంచి పిచ్చివాళ్ళంటే గోపాల్‌కు ఒక వింత భయం, పిరికితనం కూడా. పదేళ్ళకుర్రాడుగా ఉన్నప్పుడు ఒక పిచ్చివాడు కాళ్ళ సంకెళ్ళు వదిలించుకుని ఒకరోజు గోపాల్ గదిలో చొరబడి ఆతన్ని కొట్టినంత పనిచేశాడు. అప్పటినుంచి పిచ్చి వాళ్ళంటే దూరంగా ఉండడం అలవాటైపోయింది గోపాల్‌కు. ఇంటిప్రక్కనే ఉన్న ఆసుపత్రికి కూడా ఎప్పుడూ వెళ్ళేవాడు కాదు. ఎప్పుడైనా వెళ్ళబుద్ధి కలిగినా తండ్రి 'అనవసరంగా వచ్చేవేమ'ని కేక లేస్తాడేమో అనిజంకే వాడు.

కొంచెం జ్ఞానం వచ్చాక పిచ్చివాళ్ళంటే భయంపోయి, జాలి, విచారం, కలిగేవి గోపాల్‌కు. పిచ్చివాళ్ళను గొలుసులతో కట్టి, గదిలో ఒకమూల చీకట్లమధ్య బంధించి, బలవంతాన నోరు పెకలించి మందులుపోసి, త్రాగకపోతే కొరడాలతో కొట్టి, ఆసుపత్రిలో జరిపే బీభత్సదృశ్యాలు గోపాల్‌కు చాలా హృదయవిదారకంగా ఉండేవి. ఒక్కొక్క సారి మూగ పిచ్చి వాళ్ళను బంట్రోతు సూరయ్య కొరడా చేతిలో పట్టుకుని షికారుకు తీసుకు వెడుతుంటే మేకలమందలా మందకొడిగా నడుస్తున్న పిచ్చివాళ్ళ వింత ఆకారాలు గోపాల్ హృదయాన్ని ద్రవింపజేసేవి. వారిలో మానవత్వ చైతన్యం నశించి నట్టనిపించేది. పిచ్చికి కారణమేమిటి? మనకుత్సిత సమాజంలో వీరి స్థానంఏమిటి? అనుభావాలు అతనిలో కలిగేవి. మానసిక దౌర్బల్యాల వల్ల మనస్థిమితము చెడి జీవితాలు నాశనమయిన వారి వింత ప్రకృతులు పరిశీలిస్తూంటే గోపాల్‌కు ఏదో వింత భయం జాలి, ఆవేదన కలిగేది.

డాక్టరుగారు జట్కాఎక్కి వెళ్ళిపోయాక, కాంపౌండరు శ్రీనివాసు మందుల సీసాలు సూరయ్యచే తెప్పించారు. ఆలోచనలతో ఆసుపత్రి ఆవరణలో స్తబ్దుడై నిలుచున్న గోపాల్ కాంపౌండరు శ్రీనివాసు వచ్చి పలకరించేదాకా కదలలేదు మందుల సామానుతో ప్రత్యక్షమయిన వారిద్దరినీ చూడగానే పిచ్చివాళ్ళ గదులవైపు నడిచాడు అతను.

"ఈయన అవధానిగారు. ఎలకపాడునుంచి వచ్చారు" అంటూ శ్రీనివాసు ఒక పిచ్చివానిని చూపించారు. గోపాల్ ఆయనవైపు తేరపారి చూశాడు. మాసిన గెడ్డం, వ్రేళ్ళాడే పిలక, మోకాలు దాకా అంగవస్త్రం, గదిలో ఒకమూల కూర్చుని గోళ్ళు చూసుకుంటూ తనవైపు అదో పరధ్యాన్నంగా చూసిమళ్ళీ తలదించేసుకున్నాడు.

తనముఖానికి, అవధాని మూగకి పిచ్చికి తేడా ఏమిటి? అనే ప్రశ్న గోపాల్ ముందు అవతరించింది.

# మతిమాలిన వైద్యం

"ఏమండి? ఈయనకు ఆరోగ్యం రావడానికి యింకా ఎన్నాళ్ళు పడుతుంది. ఆసుపత్రికి తీసుకువచ్చి అప్పుడే రెండు నెలలయింది" అంటూ వలవలా ఏడ్చింది ద్వారబంధం వద్ద మాసినకోకతో కంటతడి తుడుచుకుంటూ ఒక స్త్రీ.

"ఫరవాలేదమ్మా" త్వరలోనే నయమవుతుంది. అంటూ శ్రీనివాసు ఒక గ్లాసులో మందుపోసి అవధానికి అందించాడు.

శ్రీనివాసు ఇచ్చేమందు గ్లాసు అవధాని అందుకోలేదు. బలవంతాన చేతిలో గ్లాసు పెట్టి బిగబెడితే గ్లాసుపట్టుకుని ఊరుకున్నాడు. మందు త్రాగమని బలవంతాన నోటిదాక గ్లాసు పెడితే, ఏదో పరధ్యాన్నంగా శ్రీనివాసు వైపు చూస్తూ కూర్చున్నాడు. "మందు తాగవయ్యా" అంటూ శ్రీనివాసు కేకలేశాడు. అవధాని మెదలలేదు. "త్రాగు తావా తన్నమన్నావా" అంటూ చెమ్కీకర్రతో ఒక్కటి కొట్టాడు శ్రీనివాసు. ఉలిక్కిపడి చేతిలోని గ్లాసు క్రిందికు జారవిడిచాడు, అవధాని. గ్లాసు ముక్కలయింది.

శరీరంమీద తేలినట్టు బిత్తర చూపులతో చూసుకుంటూ మౌనంగా ఏడ్చాడు అవధాని. భార్య పక్కకు పోయి ఆ దృశ్యంచూడలేక ఏడ్చింది. కొట్టినా తిట్టినా అవధాని నోటివెంట "ఆ, ఉ ఓ" తప్ప ఒక్క మాటైనా రాదు.

గోపాల్‌కు అవధాని పరిస్థితి చూస్తుంటే కళ్ళవెంట నీరు కారింది. శ్రీనివాసు స్వయంగా అవధాని దగ్గరకు వెళ్ళి మందిచ్చాడు. భయపడుతూ అవధాని యీ మాటు త్రాగాడు.

గోపాల్ మరొక గదివైపు నడిచాడు.

"ఈయన శాస్త్రిగారు" బందరునుంచి వచ్చారు. మరొక పిచ్చివానిని చూపించాడు శ్రీనివాసు యథాలాపంగా.

"ఆల్ఫా బీటా గామా! నీ నెత్తిమీద ఎన్ని వెంట్రుకలున్నాయో అన్ని అంకెలు నాకు కనిపిస్తాయి. మీ కేమీ వచ్చునర్రా, వెధవల్లారా లెక్కలు! నేనా వేళ్ళు లెక్కపెట్టి నక్షత్రాల సంఖ్య ఒక్కసారిగా చెబుతాను" అంటూ తనలో నవ్వుకుంటూ అరుస్తున్నాడు శాస్త్రి.

"శాస్త్రిగారు! కొంచెం మందు తీసుకోండి" అని శ్రీనివాసు మందు అందించాడు.

"ఏడిసారు వెధవల్లారా! మందెందుకు? నాకు పిచ్చేమిటి? మీకు గాని. శివుడిలాగ గరాళంకూడా మింగేయగలను రా. ఇలాతే" అంటూ గబుక్కున మందు మింగేశాడు శాస్త్రి

గోపాల్ ఆలోచనలతో మళ్ళీ ముందడుగు వేశాడు. ఇకముందు ఈ పిచ్చివాళ్ళతో తనజీవితం గడపాలి. వారికి తన మందువల్ల మనస్థైర్యం తెప్పించాలి. ఇదేదో విచిత్రంగా తోచింది గోపాల్‌కు.

"ఈ శాస్త్రిగారికి నల్లక్షరాలున్న కాగితం కనిపించకుండా చెయ్యాలి. ఏదైనా కనిపిస్తే, అది చదువుతున్నట్లు గంటలతరబడి చేతిలో కాగితం పెట్టుకుని తల ఊగించేస్తుంటాడు. మితిమీరిన చదువువల్ల బుర్ర వేడెక్కి మనస్సు చెడింది" శ్రీనివాసు చేసిన వ్యాఖ్యానం విని తిరిగి ఆలోచనలో పడ్డాడు గోపాల్.

"ఈ అమ్మాయిపేరు లలిత, అన్నాడు శ్రీనివాసు మరొక గదిముందు. అప్పటివరకు ఏవో అరుస్తున్న ఆ అమ్మాయి ఒక్కసారిగా మాట్లాడడం మానేసి గోపాల్ వైపు తేరిపారి చూస్తోంది తీవ్రంగా. నాజూకుగా బక్కపలచగా, పెద్దపెద్ద కళ్ళతో మెరిసిపోతున్న ఆ అమ్మాయి ఒకవిధమైన అందకత్తె అని చెప్పవచ్చు. మతిస్థిరం లేనందువల్లకొంచెం శరీర పోషణ సరిగాలేకపోయినా ఆమెలో ఏమీ పెద్ద అసహ్యకర లక్షణాలు కనుపించలేదు గోపాల్‌కు.

ఒక్కసారిగా లలిత గోపాల్‌ను చూసి పెద్ద పెట్టుగా నవ్వింది "వచ్చావా! హ హ హ. రా, నీ కోసమే చూస్తున్నాను. మనిద్దరం పెళ్ళి చేసుకుందాం. నాకు మా వాళ్ళు చచ్చినా పెళ్ళి చెయ్యరుగా! మనిద్దరం పక్షుల్లాగ ఆకాశంలోకి ఎగిరి పోదాం. ఏం! హ హ హ" అంటూ వెకిలిగా నవ్వసాగింది ఆమె. గోపాల్ మొదట ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాడు కంగారుతో.

"మరేమనుకోకండి. పాతికేళ్ళు వచ్చినా, డబ్బులేక, ఆమె తల్లిదండ్రులు పెళ్ళి చెయ్యలేదీమెకు. దాని పర్యవసానం ఇది" అంటూ వాఖ్యానించాడు శ్రీనివాసు.

# మతిమాలిన వైద్యం

గ్లాసులో మందుపోసి అందించాడు శ్రీనివాసు. మందు చూడగానే వెనక్కు ముడుచుకు పోయింది లలిత. "నేను తాగనర్రోయ్, నాకు విషం యిస్తున్నార్రోయ్. నాకు పెళ్ళి చెయ్యకుండా చంపుదామనుకుంటున్నారా! అంటూ కాళ్ళూ చేతులు నేలను కొట్టుకుంటూ గల్లంతు వేసింది ఆ అమ్మాయి. శ్రీనివాసు బంట్రోతు సూరయ్య కలిసి ఆమె నోట్లో బలవంతంగా మందు పోసారు.

ఇంకా పిచ్చివాళ్ళ గదులు ఎన్నో ముందు కనిపించాయి. కేకలు, పెడబొబ్బలు, ఏడ్పులు, గుసగుసలు, వినిపిస్తున్నాయి గోపాల్‌కు. మగతనిద్రలోని కలలులా, పిచ్చివాళ్ళ స్థితులు మసకమసకగా కళ్ళముందు తిరుగుతున్నాయి.

"ఆ ముందు గదుల్లో యింకా యిద్దరుపిచ్చి వాళ్ళున్నారు. ప్రేమించిన స్త్రీ పెళ్ళి చేసుకోలేదని ఒకడికి మతి చెడింది. మరొకడు తనభార్య లేచి పోయిందనే బాధతో మతిచెడ గొట్టుకున్నాడు ఈ పిచ్చివాళ్ళంతా చాలా విచిత్రంగా ఉంటారండి. మీ నాన్నగారు కాబట్టి ఇవన్నీ కుదురుస్తూ నెగ్గుకొస్తున్నారు, గబగబా వల్లించాడు శ్రీనివాసు.

గోపాల్ ఆసుపత్రి విడిచి, కాళింగా చెరువు ఉత్తర భాగానికి పోయి ఒక పొలం గట్టుమీద కూర్చున్నాడు, మనశ్శాంతికోసం. డాక్టరు పరీక్ష చదవాలని గోపాల్‌కు స్వతహాగా యిష్టంలేదు. డాక్టరుపని తప్ప మరేదైనా సరే అతను సరదాగా చెయ్యగలడు. తన వృత్తికి ఆధారం ఒకటుండాలని తండ్రి తన్ను డాక్టరు పరీక్ష చదివించాడు. తండ్రి సంతృప్తి కోసమే తన చదువు పూర్తి చేశాడు గోపాల్.

నరకయాతన అనుభవిస్తున్న నానా రకాల రోగులు హృదయాలను ద్రవింపజేసే శోకాలతో మూర్తీభవిస్తున్న వివిధ రకాల పిచ్చివాళ్ళు, కసాయివాడిలా శరీరాలు కోసి ఆపరేషనులు చేసి, సూదులతో నిర్ధయగా పొడిచే డాక్టరు వృత్తిలోని కాఠిన్యత యివన్నిటినీ తన ప్రకృతి తట్టుకుని నిలబడ కలిగేటట్టు కనిపించడంలేదు. యింక సేవా తత్పరతలో కఠిన హృదయం ఉండాలి డాక్టరుకు. అది తనకున్నట్లు కనిపించదు.

ఎద్దులేక, పాలుయిచ్చే గేదెలను బలవంతానకట్టి అరక దున్నుతున్నాడు ప్రక్క పొలంలో ఒకరైతు సాయంత్రం పిల్లగాలుల్లో కాళింగు చెరువులోని. కలువతుండులు ఊగి సలాడుతు అల్లాలాడుతున్నాయి. సూర్యాస్తమయంతో పడమటి ఎఱుపునలుపుల కాంతిలో గంధం కుంకుమలు కగ్గిన బ్రాహ్మణుని ముఖంలా వుంది తన కిష్టంలేని వైద్యవృత్తి చేయడం ఎలా? వైద్యవృత్తిలో కనుపించే రోగులు తన హృదయాన్ని ద్రవింపజేస్తూ, శక్తిహీనుణ్ణిగా చేస్తూంటే ధైర్యంతో రోగనివారణ ఎలా చెయ్యగలను? సాయంత్రం పిచ్చివాళ్ళకు మందుయిప్పించ నందుకు తండ్రి ఏమంటాడో ఆలోచనా భారంతో ఒక నిట్టూర్పు విడిచాడు గోపాల్.

చీకట్లు కమ్ముకుంటూంటే లేచియింటికి వెళ్ళిపోయాడు గోపాల్. డాక్టరుగారు వరండాలో ఎవరితోనో మాట్లాడుతున్నారు. గోపాల్‌కేసి చూసి ముభావంగా తనప్రక్కకు త్రిప్పుకున్నారు.

వరండాలోని పెద్దమనుష్యులు వెళ్ళిపోయాక డాక్టరుగారు గోపాల్‌ను పిలిచారు అతనువచ్చి పిల్లిలా నుంచున్నాడు తండ్రి కెదురుగా.

'సాయంత్రం పిచ్చివాళ్ళకు మందులు ఇవ్వలేదుట' గోపాల్‌కు అర్థమయింది కాంపౌండరు అప్పుడే వార్త అందించినట్లు.

'మనం చేసుకునే వృత్తిలో శ్రద్ధాసక్తులు లేకపోతే, ముందు అభివృద్ధి ఉండదు.

మౌనంగా వింటూన్నాడు గోపాల్.

'నేను వైద్య వృత్తిలో సంపాదించిన పరపతి ప్రాక్టీసు నిలబెట్టుకునే భాధ్యత నీమీద ఉంది' గోపాల్ వైపు చూడకుండా కటువుగా అన్నారు డాక్టరుగారు.

జ్ఞానమెరిగిన ఎదిగిన కొడుకుకు అంతకన్నా ఎక్కువగా చెప్పనక్కర్లేదని డాక్టరుగారి ఉద్దేశ్యం, అంతటితో సంభాషణ అంతమయిందని లోపలికివెళ్ళి పోయాడు గోపాల్.

భోజనంచేసి పక్కపై మేనువాల్చాడు గోపాల్. జీవితంలోని సగంకాలంపైగా పిచ్చివాళ్ళ సహచర్యంతో గడపాలి. బాధితులను మామూలుగా చూడగానే హృద

యం భారం ఆయేవారికి బాధితుల బాధలమధ్య జీవితం గడపడం భరింపరాని విషయం. ఆవేదనలకు ఆనకట్టలు లేకపోతే అవి వారి జీవితాలనే అంతం చేస్తాయి. తలుచుకుంటుంటే పిచ్చివాళ్ళ వైద్యం చెయ్యడం తనకు చేతకానట్టు తోచింది గోపాల్‌కు.

మాట్లాడగలిగే మూగతో బిత్తర చూపులు చూసే అవధాని, ప్రపంచ స్పృహ లేకుండా అంకెలమధ్య విహరిస్తున్న శాస్త్రి కనిపించినవాడిని భర్తగా అభిలషించే లలిత – వీరి అవస్థలు చూస్తూ దుఃఖంతో కుములుతూ సేవ చేస్తున్న వారి బంధుజనం గోపాల్ మనస్సులో మెలితిరిగారు. తనేమాగవోయి అంకెలమధ్య విహరిస్తూ లలిత భర్తగా ఆ ఆసుపత్రిలో తాను విహరిస్తున్నట్లు ఏవో విచిత్ర భావాలు గోపాల్‌కు తట్టాయి. నిత్యమూ ఆసుపత్రిలో ఉంటే అంతకన్నా ఏంకనిపిస్తుంది? జ్వరాలు, నీరసాలు, దగ్గులు, కురుపులు పులు తన్నే ఆవరించినట్లు కనిపించింది గోపాల్‌కు. తనవృత్తి తలుచుకుంటూన్న కొలదీ భయం, ఆవేదన హెచ్చిపోయి తల వేడెక్కింది. ఒంటినిండా చెమటలు కమ్మాయి. తనచుట్టూ పిచ్చివాళ్ళు గంతులు వేస్తున్నట్లనిపించింది. ఇంతేనా తనముందు జీవితమంతా? భయంతో వణికిపోయి, తలగడలో తలదూర్చి కళ్ళుమూసుకు బాధ పడ్డాడు గోపాల్.

ప్రొద్దున్న పక్కమీద నుంచి లేస్తూండగానే డాక్టరుగారు గోపాల్ గదిలోకి వచ్చారు.

"నేను ఊరు వెళుతున్నా, సాయంత్రం వస్తా. శ్రీనివాసు నడిగి ఆసుపత్రి విషయాలు జాగ్రత్తగా చూసుకో. కాంతారావుగారి అమ్మాయికి యీ ఇంజక్షను యియ్యి" అంటూ గోపాల్ చేతిలో ఏవో కాగితం పెట్టి తొందరగా వెళ్ళిపోయారు డాక్టరుగారు.

గోపాల్ కాలకృత్యాలు తీర్చుకుని, దుస్తులు వేసుకుని తప్పనిసరిగా కాంతారావుగారింటికి వెళ్ళాడు. ఇంట్లో అడుగుపెట్టగానే వాళ్ళ అమ్మాయి మూల్గు వినిపించింది. జ్వరతీవ్రత చాలా ఎక్కువగా ఉంది. ఒళ్ళు సలసలా కాలిపోతూంది. మంటలో పడిన శలభంలా గిలగిలా తన్నుకుంటోంది. తడి ఆరిపోయేనోరు తపతప లాడిస్తోంది.

థర్మామీటరుతో జ్వరం చూచి, గోపాల్ యింజక్షను సిద్ధం చేశాడు. ఆ అమ్మాయి జ్వరబాధ చూస్తుంటే, ఎదురుగా నిలుచున్న తల్లిదండ్రుల కన్న అతనికి బాధ ఎక్కువైంది. ఆ అమ్మాయి సన్నటి ఎముకల శరీరం ముట్టుకోగానే అతనికాళ్ళు వణికాయి ఇంజక్షన్ ట్యూబ్ ఎత్తగానే చేతులు వణికాయి. అంతసన్నని బక్కపలచని పదేళ్ళ అమ్మాయి లేతశరీరంలోకి ఎలాగ సూదిగుచ్చడం? అది చాలా అసందర్భపు క్రూరకార్యంలా కనిపించింది,

వృత్తిధర్మాన్ని జ్ఞాపకం తెచ్చుకుని, యింజక్షను సూది ఆ అమ్మాయి చేతికండరాల్లోకి గుచ్చాడు. చేతులు వణుకుతూంటే గట్టిగా పట్టి అదిమాడు. చేతులో ట్యూబ్ బ్రద్దలయింది విరిగిన గాజుముక్కలు చేతులో గుచ్చుకున్నాయి. పైపాయిదు బాధతో అవస్థ పడుతున్న ఆ అమ్మాయికి సూదిమొన ఎక్కువ బాధపెట్టడంవల్ల అరిచింది ఆమె. తగిన అనుభవం లేదన్నట్టు గోపాల్ వైపు చిరాకుగా చూసారు ఆమె తల్లి దండ్రులు. హడావడిగా కూతురు శరీరంమీద గాజుముక్కలు తీసి శుభ్రం చేశారు. ఇంజెక్షను ట్యూబ్ పగులడం గోపాల్‌కు చాలా లజ్జాకరంగా తోచింది. బలవంతాన ఇంజెక్షను సూదిలాగి "సాయంత్రం మా నాన్నగారు వచ్చి యింజక్షను యిస్తారంటూ" కాంతారావుగారి ముఖం చూడలేక తలవంచుకునే బయటికి వచ్చేశాడు గోపాల్.

దించిన తల ఎత్తకుండా జట్కా ఎక్కి ఆసుపత్రిముందు దిగాడు గోపాల్. ఆసుపత్రిలో రోగులు కిటకిట లాడుతున్నారు. తిన్నగా చికాకుతో తండ్రి గదిలోకి పోయి కూర్చున్నాడు. తమ ఆరోగ్యాలు ఎల్లావున్నాయని పలకరిస్తాడేమోఅని గోపాల్ కేసి తేరిపార చూసి రోగులంతా ముఖాలు ముడుచుకున్నారు. "డాక్టరు గారిలా కాదు — ఈయన ఏంత టెక్కు !" గుసగుసలు వినిపించాయి.

రోగుల మాటలు వినగానే గోపాల్‌కు కోపం పెరిగింది. ఏంచెయ్యాలో తోచలేదు. శ్రీనివాసుని పిలిచాడు.

"వీళ్ళందరినీ ఏదో విధంగా మందులిచ్చి పంపించెయ్యండి.

"వాళ్ళ ఆరోగ్యం మీరు ఒకసారి పరీక్షిస్తే, వారికి సంతోషంగా ఉంటుంది"

"నేనేం చెయ్యలేనిప్పుడు"

శ్రీనివాసు అంతకన్న యింకేమీ అనలేక పోయాడు. స్వతహాగా ముభావము కావడంచే, ఏంచెప్పినా గోపాల్ దగ్గరనుంచి మరోసమాధానం రాదని శ్రీనివాసుకు తెలుసు.

రోగులు మందులు తీసుకుని వెళ్ళిపోయారు. "ఎవరో ఒకరిద్దరు బంట్రోతు సూరయ్యతో మాట్లాడు తున్నారు. కాంతారావుగారి అమ్మాయి విషయంలో జరిగినది నాన్నగారికి తెలిస్తే ఏమనుకుంటారు. ఈ రోగులను పిచ్చివాళ్ళను చూస్తుంటే తనకి అంత అశక్తి, అధైర్యం, ఎందుకు కలుగుతున్నాయి. చదువుకునే రోజుల్లో స్నేహితులతో కలిసి. నవ్వులలో, కేరింతాలలో, ఏదో ప్రయోగాలు చేసి, తర్ఫీదు పొందాడేకాని, వైద్యవృత్తి బాధ్యతతో ఎవరినీ పరీక్షించడం, చికిత్స చేయడం, గోపాల్ ఇదివరలో చేయలేదు. ఇప్పుడు యీ వైద్యవృత్తి జీవితంలో అడుగు పెడుతూంటే అంతా అయోమయంగా బాధాకరంగా ఉంది.

ఆసుపత్రి ఆవరణలో జట్కా ఆగింది. తండ్రి వచ్చాడేమో అనుకున్నాడు గోపాల్. ఒక ముసలి దంపతులు దుఃఖిస్తూ రక్తావృతమైన కుర్రాడి శరీరం జట్కాలోంచి దించారు. బంట్రోతు సూరయ్య గబగబా జట్కాదగ్గరికి వెళ్ళి సాయంచేసి అ కుర్రాడిని లోపలికి తీసుకువచ్చారు.

"మా అబ్బాయి గుర్రపుబండి కింద పడిపోయాడు. కణతలమీద గాయాలు బాగా తగిలాయి. కళ్ళకు ప్రమాదం కలుగుతుందేమో అనే భయంగా ఉంది. డాక్టరు గారూ మీరే రక్షించాలి. అంటూ ప్రాధేయపడ్డాడు ఆ ముసలాయన. కుర్రాడిని ముట్టుకోడానికి గోపాల్‌కు భయంకలుగుతున్నా, ముసలాయన ప్రార్ధనవల్ల అతనికి జాలికలిగింది.

ముఖమంతా ఎరుపురంగు పూసినట్లు రక్తపు గడ్డలతో నిండుకున్న ఆ కుర్రాడి ముఖం చూడగానే గోపాల్ ఒళ్ళు గగుర్పొడిచింది. పరీక్షించి చూస్తే గాయాలు కణతలలో బాగా తగిలాయి, కళ్ళకు నిజంగా ప్రమాదమే, అవసరమైతే అపరేషన్ చెయ్యాలేమో! ఆపరేషనంటే అతని చేతులు వణికాయి. బలవంతాన శరీరం కోసి, కండరాలు కెలికి మనిషి చావకుండా తిరిగి తగుకట్లు, కట్టి చికిత్స చేయడం ఏదో చాలా భయంకరంగా కనిపించింది గోపాల్‌కు.

తీరామనిషి చచ్చిపోతే బాధ్యత తనది! అందరూ తిడతారు. అందువల్ల కుర్రాడి ముఖం మీద గాయాలకు కట్టు కట్టి ఊరుకుందామను కున్నాడు.

అకుర్రాడి రక్తం ముఖంమీది నుంచి కడుగుతూంటే మాంసం కడుగుతున్న కసాయి వాడిలా బాధ పడ్డాడు గోపాల్. అతనికి కాళ్ళు చేతులు వణక సాగాయి. గాయాలు చూస్తుంటే ఒళ్ళంతా చెమటలు పోసింది. వాటిలోని ఆపరిశుభ్రత తీస్తుంటే అ కుర్రాడికి ఎంత బాధ కలుగుతుందో అని జాలి పడ్డాడు గోపాల్.

కట్లు కట్టడం పూర్తి అయింది.

"ప్రస్తుతం ఫర్వాలేదు. సాయంత్రం నాన్నగారు వచ్చి చూస్తారు" అన్నాడు గోపాల్. నిజంగా కుర్రవాడి పరిస్థితి గాయాలవల్ల చాలా ప్రమాదంగా వున్నా, తనేమీ యింక చెయ్యలేననే ఆధైర్యం కలిగింది గోపాల్‌కు.

సాయంత్రం డాక్టరుగారు ఊరునుంచి వచ్చారు. అయన రాకముందే కాంతారావుగారు పదిసార్లు అసుపత్రికి వచ్చి వెళ్ళారు. వారి అమ్మాయికి చెయ్యి అంతావాచి పోయింది. ఇంజెక్షను సరిగా యివ్వక పోవడంవల్ల కంగారుతో డాక్టరుగారి కోసం కాంతరావుగారు నిమిష నిమిషానికి పరుగెత్తుకు వస్తున్నారు.

ఇంటికి రాగానే డాక్టరుగారికి కొడుకు చేసినపని తెలిసింది. ఉగ్రుడై పోయాడు అయన కోపంతో, ముందు కాంతారావుగారింటికి వెళ్ళి ఆ అమ్మాయిని పరీక్షించారు. శరీరంలో ఎగస్వాస వచ్చేసింది. నాడి అందటంలేదు. ఎక్కిళ్ళు తీవ్రంగా పదే పదే వస్తున్నాయి. డాక్టరుగారికి ఆ అమ్మాయి బ్రతుకుతుందనే ఆశకలగలేదు. అధైర్యపడకుండా ఒక ఇంజక్షన్ యిచ్చి దైవాధీన మనుకుంటూ బయటికి వచ్చారు.

"ఎలావుంది డాక్టరుగారు!" ఎదురుగా తొట్రుపాటు తోనుంచున్నారు కాంతారావుగారు.

"చూద్దాం ఏమౌతుందో! అంటూ మెల్లిగా బయటికి వెళ్ళి పోయారు డాక్టరుగారు. అ సమాధానంలోని అంతరార్ధం కాంతారావుగారికి తెలిసింది. తన కూతురు చనిపోతూండడానికి కారణం గోపాల్ అ యింజక్షనే ప్రొద్దున్న

యిస్తే పిల్లకు నెమ్మదించేది. పైగా యిష్టమొచ్చినట్లు ఒంట్లో పొడిచి పోయాడు. చెయ్యివాచి పిల్లకు ప్రమాదం కలిగింది. అనుకుంటూ గోపాల్ మీద ఎక్కడలేని ఆవేశం తెచ్చుకున్నారు కాంతారావుగారు.

ఆసుపత్రిలో చేర్చిన గాయాల కుర్రాడిని పరీక్షించారు డాక్టరుగారు. కుర్రాడు తలనొప్పి అని, నరాలు లాగేస్తున్నాయని గోలచేస్తూ బాధపడుతున్నాడు. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయని అరుస్తున్నాడు. కట్లు విప్పి చూశారు డాక్టరుగారు. ఫాలంమీద తగిలిన గాయం లోతు కంటిలోకి చొచ్చుకు పోయింది. ఆపరేషను చేసి ఉండవలసింది అనుకున్నారు డాక్టరుగారు. కట్లు విప్పగానే కుర్రాడు అరిచాడు "బాబోయి కళ్ళు కనిపించడంలేదు" డాక్టరుగారు కంగారు పడ్డారు. చూస్తే పిల్లవాడి గుడ్లు లోతుకుదించుకు పోయాయి. ఇప్పుడు ఆపరేషను చేయడం అసంభవం. తెల్లబోయి నుంచున్నారు కాస్సేపు డాక్టరుగారు.

"ఏమండి! యింకమావాడికి కళ్ళు కనిపించవాండి!" అంటూ దీనంగా చేతులు నలుపుతూ నుంచున్నాడు, ఆ ముసలాయన డాక్టరుగారి ముందు.

మౌనంగా తిరిగి కట్లు కట్టేశారు డాక్టరుగారు.

ఆ మౌనంలోని అర్ధం ముసలాయనకు తెలిసింది. ముసలాయన ముసలావిడ, పొంగే దుఃఖంతో, పిల్లా ఏడ్వసాగారు.

"విచారించకండి. ప్రయత్నిద్దాం అంటూ డాక్టరు గారు యింటికి వెళ్ళి పోయారు.

రోజల్లా ప్రయాణంచేసి నంమున్నబడలిక. ఇంటికిరాగానే కొడుకు తెలివితక్కువవల్ల రెండు కేసులు ప్రమాదించడం, తన వైద్యవృత్తికే దెబ్బతగిలే లావుంది. తనగురించి నల్గురూ ఏమనుకుంటారు? కొడుకు చేసిన తెల్వితక్కువపనికి కోపంతో ఉరుముతూ యింట్లో అడుగు పెట్టారు డాక్టరుగారు.

"గోపాల్! పిడుగు పడ్డట్లు అరిచారు డాక్టరుగారు. మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఇంట్లోంచి వచ్చాడు గోపాల్.

"ఒక్కపూట ఇంట్లోలేకపోతే ధ్వంసం చేసి వదిలి పెట్టావు కేసులన్నీ"

తలవంచుకున్నాడు గోపాల్.

"పాతికేళ్ళు వచ్చి యం.బి.బి.యస్. చదివిన మనిషి యింత దద్దమ్మలా ప్రవర్తిస్తాడనుకోలేదు."

"కాంతారావుగారిఅమ్మాయి చావుబ్రతుకులమీదఉంది. ఆ గాయాలు తగిలిన కుర్రవాడికి కళ్ళుపోయాయి"

"ఇటువంటి అప్రయోజకుణ్ణి ఆధారం చేసుకోడం నాదే బుద్ధితక్కువ"

గోపాల్ తండ్రి మాటలకు ఎదురు చెప్పలేక సమాధానం ఖిన్నుడై నుంచున్నాడు. ప్రక్కగదిలో తనకోసం ఎవరో పెద్దమనుష్యులున్న సంగతి డాక్టరుగారికి తెలియదు తెలిస్తే కేకలేయక పోయేవారేమో!

ఈలోగా గదిలోంచి బయటికి వచ్చి డాక్టరుగారికి నమస్కారం పెట్టారు ఇద్దరు మనుష్యులు.

"మా అబ్బాయికి వచ్చే బుధవారం పెళ్ళి. తమరు తప్పకరావాలి ముహూర్తం వేళకు అంటూ డాక్టరుగారి చేతిలో శుభలేక పెట్టారువారు.

"తక్షణం ముఖకవళిక మార్చుకుంటూ" అలాగాండి తప్పకవస్తా అన్నారు. డాక్టరుగారు నవ్వుతూ. ఆ పెద్ద మనుష్యులు వెళ్ళిపోయారు.

ఆ పెద్దమనుష్యుల ముందు ఎదిగిన కొడుకును తిట్టినందుకు లోపల బాధపడ్డారు డాక్టరుగారు ఎందుచేతంటే, ఆ పెద్దమనుష్యులు కాంతారావుగారి స్నేహితులు కూడా! పైగా ఆ రెండుకేసులు, గోపాల్ అజాగ్రత్తకన్న రోగలక్షణాలు విషమించే చెడిపోయాయి. అందువల్ల పూర్తిగా గోపాల్ బాధ్యుడు కాదని డాక్టరుగారికి తెలుసు. కాని కేసులు చెడిపోవడం వల్ల, పరపతి పోతుందనే, కోపంతో డాక్టరుగారు కొడుకుపై కేకలేశారు.

ఒంట్లో సరిగాలేదని గోపాల్ ఆరోజురాత్రి భోజనం చేయలేదు

"ఇటువంటి అప్రయోజకులు ఒకపూటభోజనం చెయ్యకపోతే వచ్చిన నష్టంలేదు" అంటూ చిందులు త్రొక్కారు డాక్టరుగారు.

గోపాల్ ఆనాటిరాత్రి నిశ్చయించుకున్నాడు. ఇకనుంచి జాగ్రత్తగా వైద్యవృత్తి చేసుకోవాలి. కొడుకుమీద కోపం

# మతిమాలిన వైద్యం



వచ్చి, డాక్టరుగారు అతనిని ఆసుపత్రికి రమ్మని పిలవటం లేదు కాని గోపాల్ మామూలుగా ఆసుపత్రికి వెడుతూ వస్తున్నాడు, తనకు తండ్రి పని చెప్పినా చెప్పకపోయినా.

కాంతారావుగారి అమ్మాయి ఆమర్నాడే చనిపోయింది తన కూతురు చావుకు కారణం గోపాల్ అని అందరి దగ్గరా వాపోసాగారు, కాంతారావుగారు. అదేవిధంగా ముసలాయన తనకొడుకు కళ్ళు పోవడానికి గోపాల్ కారణమని, అతనే తక్షణం తనకొడుకు కళ్ళకు ఆపరేషను చేసి ఉంటే తనకొడుకుకు అంధత్వం వచ్చేది కాదని నలుగురితో యాగీ చేయసాగాడు.

గోపాల్‌కు యీ మాటలు సూదుల్లా హృదయంలో గ్రుచ్చుకునేవి. తండ్రి అతనిపై చూపే ఉదాసీనత అతనికి మరీ విచారం కలగచేసేది. డాక్టరుగారు కొడుకుపై చూపే నిర్లక్ష్యతవల్ల గోపాల్‌కు ఆయన నౌకర్లలోకూడా గౌరవం తగ్గింది, ఆసుపత్రికి వచ్చిన గోపాల్‌ను ప్రతీవాడు చూసీ చూడనట్లు ప్రక్కనుంచి వెళ్ళిపోతూండేవారు.

"ఇకనుంచి జాగ్రత్తగా ఆసుపత్రిలో పని చేస్తానాన్నగారూ!" అన్నాడు ఒకరోజు గోపాల్.

"నువ్వు నాకేం సహాయం చెయ్యనక్కరలేదు" కటువుగా కసిరారు డాక్టరుగారు.

గోపాల్ కానేపు మౌనంగా నుంచుని యింట్లోకి వెళ్ళిపోయాడు.

ఒక వారం రోజులుదాకా తన గదిలోంచి బయటికి రాలేదు. భోంచేసి గదిలో తలుపులు మూసుకుని కూర్చునేవాడు.

ఒకరోజు సాయంత్రం ఆసుపత్రికి వెళ్ళాడు గోపాల్. కాంపౌండరు శ్రీనివాసు సిగరెట్టు తాగుతూ బంట్రోతు సూరయ్యతో కబుర్లు చెబుతున్నాడు. డాక్టరు రోగులను

చూడటానికి ఊళ్ళోకి వెళ్ళారు. పిచ్చివాళ్ళ కేకలు సంతలో రొదల్లా వినిపిస్తున్నాయి. గోపాల్ ఆసుపత్రిలో అడుగు పెట్టినా, కాంపౌండరు కాని, బంట్రోతులు కాని పలకరించ లేదు. గోపాల్ వైపు కళ్ళప్పగించి చూస్తున్నారు. గోపాల్ తిన్నగా పిచ్చివాళ్ళ గదుల దగ్గరికి వెళ్ళాడు. "యంబి. బియస్. చదివేడుట! జ్వరమంటే ఏమిటో తెలియదు. ఏ మందు యివ్వాలో తెలియదు" అంటూ మెల్లిగా నవ్వాడు శ్రీనివాసు వెనకనుంచి. ఈ మాటలు వింటూంటే గోపాల్‌కు లోలోపల ఉడికిపోయింది. కాని ఏమనకుండా సహజ ముఖభావంతో ముందడుగు వేశాడు.

పిచ్చివాళ్ళ గదులు లెక్కపెట్టాడు ఇరవై అయిదు ఉన్నాయి. ఒక గది మాత్రం ఖాళీగా ఉంది. తక్కిన వాటన్నిటిలోనూ ఎవరో పిచ్చివాళ్ళున్నారు. మామగారు కట్నం యివ్వలేదని పిచ్చెక్కిన అల్లుడు. గయ్యాళి భార్య, పెట్టే బాధల వల్ల మతిపోయినవాడు, పెరిగే సంసారం పోషించలేక బెంగతో పిచ్చెక్కినవాడు, అనేక రకాలు అతని ముందు కనిపించారు. ఏవేవో వాగుతున్నారు. వారి మాటలన్నీ కందిరీగల ధ్వనుల్లా చెవుల్లో మ్రోగుతున్నాయి.

మతి ఎందుకు చెడుతుంది? బెంగవల్ల, బాధవల్ల, ఆవేదనవల్ల, స్వేచ్ఛ లేకపోవడం వల్ల నల్గురూ అనే దెప్పుడు మాటలవల్లా స్ప్రింగు తీగల మధ్య నొక్కినట్లు జీవితాలను వలిపేయడం వల్ల యింకా ఎన్నెన్నో కారణాలుండవచ్చు. మొత్తంమీద అధైర్యపు మనస్సులు బలవత్తరమైన బాధలు, ఆవేదనలు, భరించలేక చిదికిపోయి చెడిపోతాయి. అందుకే పిచ్చి, అనుకున్నాడు గోపాల్.

ఆసుపత్రి విడిచి ముందుకువచ్చి కాళింగు చెరువువైపు నడిచాడు గోపాల్. చెరువులో బాగా నాచు పెరిగిపోతోంది. నీరు పసరురంగు దాలుస్తోంది. సరైనప్పుడు అది పరిశుభ్రం చెయ్యకపోతే చెరువు చెడిపోతుంది. ఆ నీరు త్రాగే వారికి రోగాలు వస్తే కాని, ఆ చెరువు పరిశుభ్రం చెయ్యాలనే బాధ్యత త్రాగేవారికి కలగదు.

చెరువుగట్టున కూర్చున్నాడు గోపాల్. పిచ్చి వాళ్ళు చచ్చిపోయిన కాంతారావుగారి అమ్మాయి. గుడ్డివాడైన గాయాల కుర్రాడు - జ్వరపీడితులు - మందుల కోసం వచ్చిన రోగులు - కోపంతో ఉగ్రుడైన తండ్రి - కాంతారావుగారి సూటీపోటీ మాటలు, సేవకుల నిర్లక్ష్యత - అన్నీ ఒక్కసారి గిర్రున తిరిగాయి గోపాల్ మనస్సులో. తనకి యీ ప్రదేశంలో యింక స్థానం లేనట్లు తోచింది. మనస్సులోని బాధ చెప్పుకోడానికి ఆప్తులెవరూ ఉన్నట్లు కనిపించలేదు.

"మా అమ్మాయి నీమూలానే చచ్చిపోయింది."

"మా కుర్రాడు నీమూలానే గ్రుడ్డివాడైయాడు. గోపాల్ చెవులు గింగురుమన్నాయి.

"నన్ను పెళ్ళాడ్డానికి వచ్చావనుకుంటా" లలిత వెకిలిగా నవ్వింది.

"నీకువచ్చునోయి లెక్కలు. జీవితంలో లోతులు లెక్కపెట్టగలవూ!" శాస్త్రి అరిచాడు.

అవధాని తనకేసి మూగిగా చూస్తున్నాడు.

వీరందరూ తనకేదో బోధ చేస్తున్నట్లు తోచింది గోపాల్‌కు. వెర్రిదుఃఖం వచ్చింది. చేతులు ముఖాన అడ్డుపెట్టుకుని ఏడ్చాడు.

తిన్నగా గదిలోకి పోయి పడుకున్నాడు. ఆ రాత్రి భోజనం చెయ్యలేదు గోపాల్. రాత్రి అంతా ఏవో ఆలోచనలే. తనచుట్టు ఏవరో పిచ్చివాళ్ళు తిరుగుతూ గంతు లేస్తున్నట్లు - మంచం తిరిగిపోతున్నట్లు ఏవో ఆలోచనలు అతనిలో దొర్లిపోయాయి. కళ్ళు పెద్దవిచేసి యింటి కప్పు చూస్తూ పడుకొన్నాడు ఒళ్ళు చెమటలు కమ్మాయి. ఒకసారి ఏడ్చాడు. ఒకసారి నవ్వుకున్నాడు. ఒకసారి నిట్టూర్పు విడిచాడు. పీదో కెవ్వున కేక వేశాడు. తనేం చేస్తున్నాడో, ఏం చెయ్యాలో గోపాల్‌కి ఏమీ తెలియనట్లు అనిపించింది.

మర్నాడు మధ్యాహ్నందాకా గోపాల్ గది తలుపు తెరవబడలేదు. డాక్టరుగారి భార్య తలుపు తెరచి లోపలికి వెళ్ళింది.

"గోపాల్"

పడుకున్న గోపాల్ కదలలేదు.

"గోపాల్!" ఆమె దగ్గరకు వెళ్ళింది. గోపాల్ ఇంటి కప్పువైపు చూస్తున్నాడు తీవ్రంగా.

ఆమెకు గోపాల్ స్థితి చూడగానే భయం కలిగింది. "గోపాల్" అని అరిచింది ఆమె

గోపాల్‌లో చలనంలేదు.

కంగారుగా డాక్టరుగారికి కబురు చేసారు. డాక్టరు గారు ఆసుపత్రినుంచి హడావడిగా వచ్చి ఆత్రంతో "గోపాల్ గోపాల్" అంటూ కుదుపుతూ పలకరించారు.

గోపాల్ మాట్లాడలేదు.

అతన్ని పక్కమీద కూర్చో బెట్టారు. గోపాల్ కప్పు కేసి చూస్తున్నాడు.

డాక్టరుగారికి గుండె దడదడ లాడింది. నాడిచూశారు. బాగానే పనిచేస్తోంది. కాని గోపాల్ శరీరం చెమటలు కక్కుతోంది. కాంపౌండరు శ్రీనివాసును పిల్చి ఏవో మందులు తెమ్మన్నారు తక్షణం.

డాక్టరు గారి భార్య కంటతడి పెట్టింది. ఆయన కుటుంబం అంతా శోకంతో మూర్తీభవించింది.

రెండురోజులు గడిచాయి. గోపాల్ స్థితిలో మార్పు రాలేదు. ఒకరోజు గోపాల్‌కు మందుయిస్తూ "శ్రీనివాస్" అంటు డాక్టరుగారు బాధగా దుఃఖంతో ఏదో సమాధానం కోసం అతనివైపు చూశారు.

ఇరవైఅయిదోగది కాళీగానే ఉందండి.

అది వినగానే డాక్టరుగారి భార్య గొల్లుమంది. చుట్టు ఉన్నవారు తెల్లబోయారు. డాక్టరుగారు, శ్రీనివాసు, ముందుకర్తవ్యం ఆలోచిస్తూ నిర్వణ్ణులై నిలుచుండిపోయారు.





# ఆంధ్రుడా!



ఏదేశ మేగినా ఎందుకాలిడినా
ఏపీఠమెక్కిన ఎవ్వరెదురైన,
పొగడరా నీ మాతృభూమిని
నిలుపరా నీ జాతిగర్వంబు.

*　　*　　*



లేదురా గోంగూర పచ్చడి ఆవ
　కాయవంటి వస్తువులు.
　　మరువ వద్దురా వాటిని నీవెచ్చటికి బోయినా.

*　　*　　*

కయ్యానికి కాలు దువ్వరా
　బొబ్బిలి యుద్ధములు చేయవలయును.
　　పల్నాటి వీరుల మనిపింప వలయును.

*　　*　　*





కీచులాటలు మన సొమ్ముగా
　కోడిపందేలు మన ఆటలుగా
　　ఎచ్చటికి బోయినా
　　　పదహారణాల ఆంధ్రుడ వనిపించుకో.





# అత్తగారి ఔదార్యము



పండుగా వచ్చింది ఓ అత్తగారా!
పిండికి బియ్యమ్ము ఎన్నిపోసేది ?"
అని కోడలు అత్తగారిని అడిగితే అత్తగారి జవాబు :
"వెయ్యవే నిచ్చెనా, తెయ్యవేగాదె
పొయ్యవే తలగిచి తవ్వడే వడ్లు
ఆవడ్లు నానేసి పిండింత దంచి
పిండిపోకలు చెయ్యి, చక్రాలు చుట్టు

ఇరుగుపొరుగు వారికింతింత పెట్టు
ఇంట్లోని పిల్లలకు లేదనక పెట్టు
మాపటికి మాటకు మారుమూతెట్టు
మార్నాటి చుట్టలకు మరుదులకు పెట్టు
మనయింటి పాలేళ్లు మురియంగ పెట్టు
మన వీటి మందరికి మనసొప్ప పెట్టు."



# మాలావతి

"కవిరాజహంస - కవికులాలంకార"

శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు

( ఏకాంకిక )

ప్రదేశము : కౌశికీనదీ తీరోపవనము.

ప్రవేశము : మాలావతి — మృతభర్తృ శిరమొడియందుఁ జేర్చుకొని, వీణ నొకకరంబునఁ దాల్చి దుఃఖముతో నాసీనయైయుండును.

మాలా : హా నాథా! నీతో సర్వసౌఖ్యముల ననుభవించుచు నెన్నియో యేండ్లు నిమిషములలాగునఁ గడపివైచితిని. ఈపది నిమిషములును, నాకిప్పుడు పదియుగములుగా నున్నవి. ఇట్టి ప్రాణప్రియనగు నా కాత్మేశ్వరుఁడ వైయున్ననీవు — నన్ను విడిచి - నిర్దయుండవై యెచ్చటికి కేగినావు? ఒక్కింత కనుదమ్ములు విచ్చి, వలపు గొలుపు చూపులతో నన్నేల తిలకింపకున్నావు. ప్రసన్న వదనుఁడవై తొంటివలె ప్రణయ సుధామధుర వచనములతో నన్నలరింప కున్నావేమి? దివ్వెతోఁ దేజముంబోలి నేను నిన్నాశ్రయించి యుండఁదగినదానను గదా — ఇట్టి నన్నుఁ ద్యజించి చనుట నీకు ధర్మమగునా?

సకల ధర్మస్వరూపుఁడ వగునో జగద్భర్తా! నాభర్త యగునీయుపబర్హణుఁడు నీకుఁ బరమ భక్తుఁడు — నేనీతని భక్తురాల నగుటచే నీకుఁ బ్రసన్నురాలను - ఓ ప్రసన్న జనపారిజాతా! ఆపన్ననగు నన్ననుగ్రహించి పతి భిక్షమును బ్రసాదింపుము. నేను స్వర్గమును గోరుట



లదు - అమరత్వమును వాంఛించుట లేదు - మోక్షమును నాకాంక్షించుట లేదు - ధర్మార్థకామ మోక్షప్రదాతయగు నా యాత్మేశ్వరుని నాకనుగ్రహింపుము !—దేవాదిదేవా ! సర్వశక్తి సంపన్నుండ వగునీ వీనాచిన్న కోరికను జెల్లింపలేవా ? సర్వభూతదయాపరా ! అపారశోకార్ణావనిమగ్ననై యున్న నీపరమభృత్యురాల నగు నా మొఱ నాలించి నాయెడల బ్రసన్నుండవగుము.

(ప్రవేశము!—విప్రకుమారుడు)

మాలా:- (ఎదుటఁ జూచి యాశ్చర్యముతో) ఔరా ! ఏమి యీదివ్యతేజము ! ఆ ప్రభామండల మధ్యంబున—శిరంబున ఛత్రమును, విశాలప్రసన్న వదనంబున సింధూరతిలకంబును, వక్షంబున బ్రహ్మసూత్రమును మెఱయ, నొక కరంబున దండమును, వేఱొక హస్తమున బుస్తకమును, దాల్చి తొల్లిటి వామనదేవునింబోలి వెలుంగుచు నీవంకకే వచ్చుచున్న యీ విప్రకుమారుఁ డెవ్వరై యుండును ? ఈతడిప్పుడు నిజముగా నాపాలిటి దేవునివలె నున్నాఁడు.

విప్ర:- (సమీపించి) నేను కార్యార్థినై యీ వనమార్గమునఁ బోవుచు జాలిగొలుపు నార్తనాదము నాలించి యిటు వచ్చితిని—అమ్మా ! ఈమృతుని శిర ముత్సంగమునఁ జేర్చుకొని యిట్లు దుఃఖించుచున్న నీవెవ్వరు ? ఈతఁ డెవ్వడు ?

మాలా:- అయ్యా ! ఈతఁడు నాయాత్మేశ్వరుడు. గంధర్వరాజ కుమారుఁడగు ఉపబర్హణుఁడు !

విప్ర:- ఉపబర్హణుఁడా యీతఁడు ! ఈతడు సర్వవిద్యానిధి యనియు, సరస్వతీ నారదులను మించిన జగదేకవైణికుఁడనియు చిత్రరథపుత్రికయగు మాలావతికి భర్తయని వినియున్నాను. నీవు మాలావతివాతల్లీ !

మాలా:- ఔను,

విప్ర:- పరమ విజ్ఞానవతివి, పతివ్రతవు నని ప్రఖ్యాతి గాంచిన నీవు పరమపదించిన భర్తకు సకాలమున నుత్తర క్రియల నాచరింపక పామరయువతివలె నిట్లూరక దుఃఖించుచుంటివేమి ? లోకమునందలి జీవులకు జననమరణములు సహజములు. మరణించిన వారికై దుఃఖించుట వలన బ్రయోజనమేమున్నది ?

మాలా:- విప్రకుమారా ! దుఃఖము వలన బ్రయోజనములేదని నేనెఱుంగుదును — కాని — నా ప్రాణేశ్వరుని బ్రతికించుకొను మార్గము చూచుకొనకుండ నేనెట్లూరకుండగలను ?

విప్ర:- సర్వజ్ఞురాలవయ్యును, భర్తృప్రేమచే సాధ్యాసాధ్యముల వివేచింపకుండ నిట్లు దీక్షవహించి యుండుట నాకాశ్చర్యముగ నున్నది. మఱియు నీ బేలతనముం గూర్చియు, దీనావస్థంజూచియు, జాలి గలుగుచున్నది. నేను ఘనవైద్యుడను, నాకడననేకౌషధములున్నవి. నీ పతి యే జబ్బుచే మరణించెనో తెలుపుము, నేను బ్రతికించెదను.

మాలా:— అయ్యా ! నా భర్తకే వ్యాధియును గలుగలేదు. ఆకస్మికముగా మరణించెను,

విప్ర:- అలాగా ? నీ దైన్యమును నీ సౌశీల్యమును గాంచి నేనెంతయో నీకు శక్తికొలఁది సాయపడవలెనని యనుకొంటిని. కాని, యిట్టి స్థితియందు నేనేమి యుపకారము చేయఁగలను ?—ఈయుపబర్హణుఁడు సహజముగానే మరణించినాఁడు —ఆయువు చెల్లి మృతినొందినవారికై శోకించుట వివేకవంతులకుచితముగాదు.

మాలా:- ఇంతేనా ? నా భర్తను బ్రతికించుకొను నుపాయము లేనేలేదా ? నేను కూడా నా యాత్మేశ్వరునితో జావవలసినదేనా?—చావను !—అట్లు చావను— నాప్రియుని మరణమునకుఁ గారణులైన దేవతులెవ్వరో వారు వచ్చి నాస్వామిని బునర్జీవితునిం చేయవలయును. అట్లు కాకున్నచో దేవతుల నందరిని శపించెదను.

విప్ర;— అదేమమ్మా ! ఎవ్వరో యొకరి వలనఁ దటస్థించిన యపకారమునకై లోకపాలకులగు సకల దేవతులను శపించుట ధర్మమా ? మహాపతివ్రతలకు సాధ్యంగాని కార్యము లేదనుట నిజమే — వారి దివ్యశక్తికి సమస్తశక్తులను దలలు వంపవలసినదే—కాని, క్రోధదుఃఖవశంబున గుణాగుణపరిశీలనము లేకుండ దివ్యశక్తి నపమార్గమున వినియోగించుట తగునా ?

అ. ఎంతశక్తి యున్న నంతటి శాంతంబు,
నెంతలేమి యున్ననంతయీవి,
యెంత దుఃఖంబు యున్న నంతటియోరిమి
గలుగువారే యుత్తములు గదమ్మ !

మాలా;— ఔను నిజమే ! నీవు చెప్పినది లోకహితధర్మమనుట సత్యము ! కాని— నా స్వామిని బునర్జీవి

తుని జేసుకొనుట నాకు ముఖ్య ధర్మము గాదా? నా నాథుని మృతికిఁ గారకులెవ్వరో వారు వచ్చి నాపతిని నా కనుగ్రహింప కూడదా?

విప్ర:- సాధ్వీమణీ! నీ పతి మృతికి మృత్యువు కారణమై యుండవలయును—అంతకంటె మృత్యుకారకు లెవరుందురు మఱి?

మాలా:- అట్లయినచో మృత్యువునే శపించెదను!

విప్ర:- తొందర పడుట తగదమ్మా! ఇందు మృత్యువున కెంతవఱకు సంబంధమున్నదో యడిగి తెలిసికొనకుండ నూరక శపించుట కేవల మపచారము గాదా?

మాలా:- అయినచో నేనేమి చేయవలయును?—ఆమృత్యుదేవత నాయెదుటికి రాదయ్యెను—అడిగి తెలిసికొనుట యెట్లు?

విప్ర:- నీ కాసంశయమక్కఱలేదు. ఆ మృత్యువును నేనిచటికి రప్పించెదను—

మాలా:- మృత్యువును కూడా రప్పించుశక్తి నీకు యున్నదా? నీవు కేవలము వైద్యుఁడవు మాత్ర మే యనుకొనుచున్నాను—అద్భుత చరిత్రుఁడవుగా నగుపడుచున్నావే!

విప్ర:- ఒక్క మృత్యువునే కాదు సకల దేవతులను గూడ రావింప గలను.

మాలా:- విప్రకుమారా! ఇంతటి చిన్నవయస్సులోనే చిర తపస్సులకుఁగూడ లభింపని యింతటిశక్తి నీకెట్లు సిద్ధించినది?

విప్ర:- ఆత్మోపాసనము వలన—ఈ ప్రకృతియందు విజృంభించుచున్న యఖిలశక్తులనుకూడ నాత్మశక్తియం దడఁగియున్నవి, ప్రకృతినుండి సాధించిన శక్తులు జీవుల యధీనములై యుండవు. ఇప్పటి నీయిచ్ఛ ప్రకృతి శక్తివంటిది,—నీ కోపము లోకపాలకులను లోకమునుగూడ నాశనము చేయునేగాని, యొక్క తృణమునయినను మొలిపింపగలదా? నాయాత్మశక్తి రక్షణ శిక్షణములయందు సర్వదా నా యధీన మందుండును. ఇదిగో—కాటుక కొండవంటి నల్లని భయంకరాకారము తో, రక్తాంబరధారిణియు, షడ్భుజయునగు మృత్యుదేవతను రావించుచున్నాను చూడుము.

(మృత్యుదేవత ప్రవేశము)

మాలా:- ఓ మృత్యుదేవతా! నీవు లోకమునందలి జీవుల నందఱిని గబళించుదానవు గదా! నీ చెంతనున్న యీ పిల్లలందఱు నెవ్వరు?

మృత్యు:- ఈ యరువది నలుగురును నాబిడ్డలు.

మాలా:- నీ కన్నబిడ్డలేనా? ఇందఱు బిడ్డలతల్లివై యాడుదానవై యున్న నీవు — స్త్రీలకుఁ బతివియోగ మెంతటి నిరంతర దుఃఖదాయకమైనదో యెఱుఁగఁగలిగి యుండియు నిండువయస్సు నందున్న నా స్వామిని నెట్లు చంపగలిగితివి?

మృత్యు:- అమ్మా! పరమధర్మ స్వరూపుఁడగు సంతకుని యాజ్ఞచే నానియమిత కృత్యమును నేను నెఱవేర్చుచుందును. ఇందు నాకుఁగాని, వ్యాధిమూర్తులగు నాబిడ్డలకుఁగాని, యెట్టి యపరాధమును లేదు తల్లి!

మాలా:—విప్రకుమారా! మృత్యువిట్లు చెప్పుచున్న దేమి?

విప్ర:- అవును. ఇందు మృత్యుదేవత తప్పున్నట్లగపడదు, ఆ ధర్మునే రావించెద నడుగుము.— ఓమృత్యువా నీవు పొమ్ము. ధర్మరాజా! నీవొకసారి యిచ్చటికి విచ్చేయుము!

(మృత్యువు నిష్క్రమించును—ధర్ముఁడు ప్రవేశించును)

మాలా:- ఓ ధర్మ ప్రభూ! ఈ వయస్సులో నన్నెడఁబాపి నాప్రాణ ప్రియుండగు కాంతునేల హరించుకొని పోయితివి?

ధర్మ:- సతీమణీ! జగద్రంగమునందుఁ గాలము సంప్రాప్తముగాకుండ నెవ్వఁడును మరణింపడు. రోగములుగాని, మృత్యువుగాని, నేనుగాని చావునకుగారణములుగాము—నిమిత్త మాత్రులమంతే — అన్నిటికిని గాలమే కారణము!

విప్ర:- సతీమణీ! సమవర్తియగు నీధర్మరాజు సర్వోక్తులను వింటివి గదా!

మాలా:- విన్నాను—ఇందువలన నేమిప్రయోజనము సిద్ధించినది?

విప్ర:— కాలునిఁగూడ రావించెద నడిగి చూడుము! ఓ ధర్మరాజా! నీవిక దయచేయ వచ్చును—కాలమూర్తీ! ఒకసారి నీ దర్శనము దయచేయుము,

(ధర్మునిని నిష్క్రమణము—కాలుని ప్రవేశము)

మాలా:— నారాయణాంశభవుండవగు కాలమూర్తీ! నీకు నమస్కారము. సనాతనుఁడవు, సకలకర్మసాక్షివియునగు నీవు నేను జీవించియుండగా నాయాత్మేశ్వరుని యేల హరించితివి ప్రభూ?

కాలు:- పతివ్రత తిలకమా! జనన మరణములకుఁగాని, సుఖదుఃఖములకుగాని, నేనెంతమాత్రము గర్తనుగాను, నాకు మిత్రులుగాని, శత్రువులుగాని, యెవ్వరూ లేరు,—బంధువులు పరులు నను భిన్నభావము నాకించుకంతయునులేదు. ఈ లోకమునందు నేనెవ్వరికిఁ నధీనుఁడనుగాను. అందఱును నా యధీనులై యుందురు. సాక్షిస్వరూపుఁడనై జగంబుల గడపుచుండుటయే నాధర్మం—పరమేశ్వరుఁడును విశ్వభర్తయునగు శ్రీకృష్ణ పరమాత్మని యాజ్ఞకు మాత్రమే నేనధీనుడను!

మాలా:— అఖిల కర్మసాక్షివగునో దేవా! నీవుగాని, ధర్ముడుగాని, మృత్యువుగాని, వ్యాధులుగాని, కారణము కాకున్న యెడల నాభర్త యెట్లు మరణించెను?

కాలు:- దేవీ! సృష్టికాలమందు జగత్కర్తయగు బ్రహ్మ వారి వారికర్మములంబట్టి యేమి విధించునో జీవులు తప్పక యా ఫలము ననుభవించుచుందురు. ఆ విధివిధానమును దప్పించుకొనుట కెంతవారికిని శక్యముగాదు.

విప్ర:— ఔను! ఈ విశ్వమున కంతకు నదియే సహజ ధర్మము, ఈ మాలావతి వివేకవతి యయ్యును, పతివియోగ దుఃఖవివశయై క్రోధాతిరేకంబున దేవతలనందరిని శపింపంబూనుకొని యుండుటచే లోకశ్రేయమునుగోరి మిమ్మిట్లు రావింప వలసివచ్చినది. భగవానుఁడవగు కాలుడా! ఇందు నీ యపచార మేమియును లేదు— ఇంక నీవు పోవచ్చును.

(కాలుఁడు నిష్క్రమించును)

మాలా:— విప్రకుమారా! నాకు దేవతలపై యెట్టిక్రోధమునులేదు. నాకిట్లు పతివియోగమును గూర్చిన దేవతలెవరో వచ్చి నన్ను అనుగ్రహించి నాప్రాణేశ్వరుని బ్రతికింపవలయును గదా?

విప్ర:- లోకసహజ ధర్మమునుబట్టి మరణించిన నీ భర్తను మరల జీవింపజేయ గలశక్తిమంతులగు దేవతులెవరున్నారు?

మాలా:— సృష్టికర్తయే జననమరణాది సుఖదుఃఖములకు విధాయకుఁడని కాలుఁడు వచించెనుగాదా? అపితామహుఁడే వచ్చి నాపతిని బునర్జీవితుని గావింపవలయును.

విప్ర:— అట్లయినచో బ్రహ్మనుగూడ రావింతును.

(బ్రహ్మ ప్రవేశము)

మాలా:- ఓచతుర్ముఖా! వేదస్వరూపా! నీకు నమస్కారం.

బ్రహ్మ:- సౌభాగ్యవతీభవ!

విప్ర:— ఓ సత్యలోకేశ్వరా! నీ సుభాషితము సత్యము కావలయును. ఈ దేవి యుపబర్హణుని భార్య—గంధర్వ రాజపుత్రికయగు మాలావతి—

బ్రహ్మ:- అలాగా. ఈ యుపబర్హణుడు నా భక్తుఁడు. నా సభలో రంభ నాట్యము చేయుచుండఁగా నీతఁడు వీణావాదనముగావించుచుండెను. సభకు వచ్చినదేవేంద్ర దేవతాదులందఱు నానందమగ్నులయి యుండిరి. అట్టి యామోద సమయమున రంభంగాంచి మోహపరవశుఁడై ఈతఁడు మూర్ఛిల్లెను. సభయంతయు రసాభాసమై పోయినది. అదిచూసి సహింపజాలక నేనతనింగూర్చి చావుమని తిట్టితిని. అదియే శాపమై యీతఁడు మరణించెను—కాని—ఈతని కింకను నాయువు వేయేండ్లున్నది!

విప్ర:- అట్లయినచో నీ యుపబర్హణుని కాయువును బ్రసాదించి మహాపతివ్రతయగు నీ మాలావతిని సౌభాగ్యవతింగావించి నీ పలుకు నిలుపుకొనుము!

బ్రహ్మ:- అట్లే చేసెదను. ఈ నాకమండలూదకమునీ యుపబర్హణుని సజీవుం జేయుఁను. గాక!

(అని యుదకమును జల్లును)

విప్ర:- ఓ సత్యలోకేశ్వరా! నీవొసంగిన యాయువు వలన నీతనికి జీవకళ వచ్చినది! నీపలుకు సిద్ధించినది!

మాలా:- ఇంతమాత్రమున నేమి లాభము! భగవానుఁడవగుచతురాననా! ఎప్పటియట్ల నా స్వామిని సర్వలక్షణ సంపన్నునిగ నొసర్చి ననుగ్రహింపుము!

బ్రహ్మ:- దేవీ! శక్తివంచన లేకుండా నాచేతనైనపని యంతయునుఁ జేసితిని.

విప్ర:- ఔను! నీవాయువును మాత్రమిచ్చితివి—అయినను నీతనికిఁ దెలివి రాలేదే!

బ్రహ్మ:- దానిని జ్ఞానానంద స్వరూపుఁడగు విశ్వేశ్వరుఁడు ప్రసాదింప వలయును.

విప్ర:— ఆలాగా? ఒక్కరు గావించిన పొరపాటు నెందరు దేవతలు వచ్చి సవరింపవలసి వచ్చుచున్నది. సరే — ఈశ్వరుడు వచ్చి తెలివి నీయవచ్చును. అంత మాత్రముచేత నేమీ ప్రయోజనము? కన్నులు తెఱవఁడు — మాటాడఁడు— ఊపిరిలేదు — దేహమునందు కళలేదు. ఇవి యన్నియు లభించినప్పుడుగదా పునర్జీవితు డైనట్లు?

బ్రహ్మ:— ఔను! ఈశ్వరుఁడు తెలివి నిచ్చును. సూర్య చంద్రులవలన జక్షుశ్శక్తి లభింపవలయును. భారతీప్రసాదమున వాక్పాటవము సిద్ధింపవలయును. జగత్ప్రాణుఁడగు వాయుదేవునికృపచే నుచ్ఛ్వాస నిశ్వాసా ప్రసారము గావలయును. లోకమాత యగుమహాలక్ష్మి కటాక్షముచే శరీరము కళాప్రపూర్ణము గావలయును.

విప్ర:— ఔను, నిజమే — కాని — నిరంతర లోకావన శీలురైన యిందఱు దేవతలను స్వప్రయోజనముల నుండి తప్పించి యిచ్చటికి రప్పించుట యుచితము గాదు— సర్వమంగళప్రదుండ వగు సాంబశివా! జగత్ప్రకాశకులగు సూర్యచంద్రు లారా! భాషారూపిణివగుసరస్వతీ! ప్రాణమూర్తివగు పవనదేవా! జగజ్జనని వగు శ్రీదేవీ పతివియోగదుఃఖితయు బరమ పతివ్రతయు నగునీమాలావతి యెడల గరుణించి మీరెల్లరును మీమీశక్తులను — మరణించిన యీయుపబర్హణునకు బ్రసాదించి యీతని బునర్జీవితునిం గావింపుడు.

మాలా:— (కన్నులు తుడుచుకొనుచు) భగవానుఁడ వగు నోపద్మగర్భా! నీవనుగ్రహించి నాభర్త కాయువు నొసంగితివి. ఈ విప్రకుమారుని యప్రతిమ శక్తివలన సకలముఖ్య దేవతలును నాస్వామికిఁ దమతమ శక్తులను గరుణించినారు — నానాథుఁ డెప్పటివలెఁ దిలకించుచున్నాడు, మాట్లాడుచున్నాడు — ఊపరి పీల్చి విడుచుచున్నాఁడు. ఎప్పటితేజములూ గాంచియున్నాఁడు — కాని లేచి కృతజ్ఞతాపూర్వకముగా మీకు నమస్కరింప డేమీ? కదలఁడేమి?

బ్రహ్మ:— ఆత్మ చైతన్యము లేకుండుటచే నిట్లు జడుడై చలింప జాలకున్నాఁడు.

మాలా:— ప్రభూ! నాపతి కాశక్తిని గూఁడ బ్రసాదించి నాయభీష్టమును సంపూర్ణముగ ఫలింపఁజేయుము.

బ్రహ్మ:— ఓదెవీ! నాకుఁగాని, యితర దేవతలకుఁ గాని యట్టిసామర్థ్యము లేదు. సర్వాత్మకుఁడగు జగదంతర్యామి యాకృష్ణ పరమాత్ముయనుగ్రహమువలననే యట్టి దివ్యశక్తి లభింపవలయును.

మాలా:— ఇంతమంది దేవతలు నన్నను గ్రహించి నప్పు డాపరమాత్ముఁడుమాత్ర మేల కటాక్షింప గూడదు?

బ్రహ్మ:— విశ్వమయుఁడును విశ్వశాసకుఁడు నగునా విశ్వాత్ముఁ డవ్యాజముగ ననుగ్రహింప వలయునే గాని యావిశ్వనియంతను నియోగించుసామర్థ్యమెవ్వరికిని లేదు.

మాలా:— లేకేమి? ఆతఁడువచ్చి నాప్రాణప్రియుని జైతన్యవిశిష్టునిగాఁ జేయకున్నచో నా పరమాత్మునే శపింతును,

బ్రహ్మ:— వెఱ్ఱిదానా! అతఁడు లోకమందలి యెల్ల దేవతల వంటివాఁడే యనుకొనుచున్నావా? లోకాతీతుఁ డగునాతని నీశాప మేమి చేయఁగలదు?

మాలా:— దేవదేవా! అట్లయినచోఁ జాపును బ్రతుకును గాని యవస్థలో మేమిట్లుండ వలసినదేనా?

బ్రహ్మ:— ఆతనియనుగ్రహమును సంపాదించుకొని కృతార్థురాలవు గావలయును,

మాలా:— మహాత్ముఁడ వగువిప్రకుమారా! శ్రీపితామహుని వచనములను వింటివిగదా! పరమదయాళుండ వగు నీవు నాయెడలఁ గృప జూపి యింతవర కిట్టి మహోపకారముం గావించితివి, దయామయా! నీయసాధారణసామర్థ్యమునకు సాధ్యముగాని దేదియును లేదు ఓపుణ్యమూర్తీ! ఆత్మశక్తి సంపన్నుఁడ వగునీవు నా భర్తసచేతనుఁడై యెప్పటివలె మెలంగునట్టి మార్గముం జూపి నన్ను ధన్యురాలినిగాఁ జేయుము!

విప్ర:— పతివ్రతాశిరోమణివగు నోమాలావతీ! పరమేశ్వరునిప్రాపుఁ బడయుటకు భక్తిజ్ఞాన మార్గములకంటె నితరోపాయము లేదు దేవీ! నాయుపదేశమును గ్రహించి యాపరమేశ్వరుని భక్తితో బ్రార్థించి కృతార్థురాలవుగమ్ము!

మాల:— అనుగ్రహింపఁబడితిని మహాత్మా! నీవు నాపాలిటి కృష్ణపరమాత్మవు. ఆశ్రయదాతవు — త్వదేకశరణ్యనగు నాయెడల సంపూర్ణ వాత్సల్య ముంచి యుపదేశింపుము!

విప్ర:— దేవీ! స్వస్థచిత్తవగుము! అట్లే యుపదేశించెదను. (అని మాలావతిదక్షిణకర్ణము నందుపదేశించి)

మాలావతీ! తెలిసినదా? తదేకచిత్తవై పరమభక్తితోనేనుపదేశించిన స్తోత్రమును బఠించుచూ నీనాధుని చుట్టును ముమ్మారు ప్రదక్షిణము గావించి కృతకృత్యురాలవగుము!

మాలా:— చిత్తము—

(అని తనయొడియందలి స్వామిశిరమును వీణాదండముపైఁ జేర్చి లేచి యంజలి బద్ధయై)

"వందే త్వం పరమాత్మానం సర్వకారణకారణం
వినా యేన శవా స్సర్వే ప్రాణినో జగతీతలే
నిర్లిప్తం సాక్షిరూపం చ సర్వేషాం సర్వకర్మసు
విద్యమానం సవృష్టం చ సర్వైస్సర్వత్ర సర్వదా
యేన సృష్టా చ ప్రకృతి స్సర్వాధారా పరాత్పరా
బ్రహ్మ విష్ణుశివాదీనాం ప్రసూ ర్యాత్రిగుణాత్మికా
వరం వరేణ్యం వరదం వరార్హాం వరకారణం
తపఃఫలం తపోబీజం తపసాం చ ఫలప్రదం
ద్విభుజం మురళీహస్తం పీతకౌశేయవాసనం
కిశోరవయసం కృష్ణం రాధాకాంత మనంతకం"

(అని స్తోత్రము చేయుచూ భర్తకు ముమ్మాఱు)
(దక్షిణ మాచరించును)
(ఉపబర్హణుఁడు సచేతనుడై లేచి వీణం గైకొని)

ఉప:— వందే త్వం పరమాత్మానం సర్వకారణ
కారణం
వినా యేన శవా సర్వే ప్రాణినో జగతీతలే

అని (తానును బాడును)

మాలా:— (పరమానందముతో భర్తనుగౌఁగిలించుకొని ప్రాణప్రియా! నేను ధన్యురాలనైతిని. మనకు మహోపకారముంగావించిన పరమదయాకరుండగు విప్రకుమారునకు నమస్కరింతము రమ్ము!

బ్రహ్మ:— సాధ్వీ! నీవు ప్రదక్షిణము చేయుచుండగనే — నేను వింతగా జూచుచుండఁగనే — నీనాధుఁడు లేచుటయు నావిప్రకుమారుఁడ దృశ్యుఁడగుటయు నొక్కక్షణములో జరగినవి.

ఉప:— మహాత్మా! ఆ విప్రకుమారుడు మమ్మును, లోకములనుగూడ నుద్ధరించుటకై వచ్చిన శ్రీమన్నారాయణుఁడే కాని మఱియెవ్వరును గారు (అని మాలావతింగాంచి) ప్రాణేశ్వరీ! ఆమహావిష్ణుని కరుణచే మనము ధన్యులమైనాము.

బ్రహ్మ:— ఓపుణ్య దంపతులారా! మీయభీప్సితము సఫలమైనది. మీరు సర్వార్ధ సంపన్నులైతిరి ఇంకను మీకేమికావలయును?

మాలా:— వేదమూర్తీ! సతికి బతియే దైవతము పతికి సతియే సర్వమును — నీయనుగ్రహమునను, సర్వదేవతాకటాక్షముననుమేము కృతార్థులమైతిమి — మాకిఁక గోరఁదగిన దేమున్నది?

బ్రహ్మ:— అయిన నిట్లగుఁగాక!

క. పతిదేవతలగు నుత్తమ
సతులచరిత్రములవలన సర్వోన్నతభా
రతభూమి వెలయుఁగావుత
బ్రతిగృహ మొక్కొక్క స్వర్గభవనము గాగన్

అశరీరవాణి:— తథాస్తు

ఉప:—
మాలా:— } రవిమండలసవగర్భిణి సంధ్యా

రాగవతీ మోహనతారుణ్యము
నవసుప్రోత్థితనవినమరాళా
నందసరశ్రీకరలావణ్యము
కలసి మెలసి నవరసముల ముల్లో
కము లలరించిన ప్రకృతిన్
లలితమధురవల్లకీ స్వరంబుల
గలిపి పాడుదము సుకృతిన్
జయరాధా — జయకృష్ణా
జయజయరా—ధాకృష్ణా—
వికసితకుసుమకదంబకశాఖా
విలసితమధుపాళీఝుంకారము
సకలచరాచర సంజీవనకర
శంపాంబుదమాలాలంకారము
దొరసి,బెరసి ఘనభములఁ దానై
తోఁచు రసమయప్రకృతిన్
వరవీణాగళరవముల నేకా
వళిగఁ బాడుదము సుకృతిన్
జయరాధా! జయకృష్ణా!
జయజయరా — ధాకృష్ణా!

(అనిపాడుచునందఱునునిష్క్రమింతురు)



# "నీకోడలిపాతివ్రత్యము నాకిరీటముకంటె గొప్పది"

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

అవి జహంగీరు పాదుషా రాజ్యం చేస్తున్న రోజులు. ఢిల్లీనగరమునకు చివర కార్మికులు నివసించే మజదూర్ పేటలో ముస్లిం యువకుడు కాశీము, అతని భార్య, అతని తల్లి నివసిస్తూ ఉన్నారు. రెక్కలాడితే గాని డొక్కలాడని నిరుపేద సంసారం అతనిది. పగలంతా కూలీనాలీచేసి సంపాదించిన కొద్దిపాటి డబ్బులతోనే వారు ముప్వురు బ్రతకాలె. అతని తల్లి ముసలిది పనికికాదు. అతని భార్య యెలప్రాయపు జవ్వని ఎక్కడికిపోదు. కనుక అతని ఒక్క సంపాదనేవారికి ఆధారం. పూటబత్తెం పుల్లవెలుగుగా గడిపేసంసారమైనప్పటికి ఆ యువదంపతుల అన్యోన్యం ఇంతా అంతాకాదు. కాశీం యింట ఉన్నంతసేపు సతీపతులిరువురు చిలకా గోరువంకల్లాగ కూడ కూడ ఉంటూ ముసిముసినవ్వులు నవ్వుకుంటూ ముచ్చట్లాడుకుంటూ ఎంతో ప్రేమగా ఉంటారు. ఫాతిమా అతిలోక సౌందర్యవతి. అతిలోక గుణవతికూడా. భర్తను ఎంతో ప్రేమగా చూస్తుంది. ఆమె చేతులనున్నవి వెండికడియాలు. చెవులనున్నవి యిత్తడిపోగులు. కట్టుకున్నది చిఱుగులబట్ట. అయినా ఆమెకు భర్తయందు అసంతృప్తిలేదు. అష్టోపభోగములు అనుభవించేవారిని చూచి అవి నాకు లేవన్నచింతలేదు. సుఖమునకు కాణాచి భాగ్యభోగ్యాలు కావు. తృప్తి. ఆ తృప్తితో ఆమెసమస్త సౌఖ్యాలు అనుభవిస్తున్నట్టుగానే భావిస్తున్నది. కూలికిపోయిన పెనిమిటి కొంచెం రావడం ఆలస్యమైతే ఆమె అతను వచ్చేబాటమీదనే చూపులుపెట్టుకొని కూర్చుంటుంది. కాశింగూడా తన పని అయితేక్షణం ఆలస్యం చేయకుండా ఇంటికి ఉరుకులుపెట్టుకుంటూ వస్తాడు. ఆ కొడుకూ కోడలు ముచ్చటలు చూచి తనంత అదృష్టవంతురాలు లేదని ఆముసలిది మురిసిపోతుంటుంది.

౨

ఢిల్లీనగర కొత్వాలు సాదుల్లా. ప్రజలు చేసే సమస్త నేరములు విచారించి శిక్షించే అధికారి అతను. ఉద్యోగరీత్యా న్యాయాధిపతి అయినను వానివద్ద రవ్వంత న్యాయములేదు. స్వభావముచేత మనిషి అతి కఠినుడు, క్రూరుడు, పాపభీతి లేనివాడు, త్రాగుబోతు, స్త్రీ లోలుడు. చక్కని పిల్ల వాని కంటబడినదా వదులుదక్కదు. తక్షణం వాడి జనానాకు చేర్చబడవలసిందే. దుష్టుడైన అధికారికి దుష్టులైన అనుచరులు ఉండటం సహజం. గూఢచారి దళం వాని అనుచరులు యెక్కడెక్కడ చక్కని యువతులున్నారో వారిని వెదకి వెదకి తమ అధికారికి నివేదించడం వాళ్ళవృత్తి. ఒకనాడు కాశీం భార్య ఫాతిమా వాని అనుచరుల్లో ఒకని కంటబడింది. ఆ సౌందర్యవతిని చూచి ముగ్ధుడై అధికారికి ఆమె ఉనికి చెప్పి వాని అనుగ్రహమునకు పాత్రుడైనాడా నీచుడు. నాటినుండి ఆమెను పట్టుటకు వేట ఆరంభమైంది. ఇరువదేండ్లు నిండీనిండని ఆయె లప్రాయపు జవ్వనిని కొత్వాలు సాహెబు వారికి సమర్పించినచో ఆయన కోరినంత ధనమీయగలడనీ, మీ దారిద్ర్యం వదిలిపోతుందనీ, సుఖంగా జీవించవచ్చుననీ, రాయబారులు మొదలు పెట్టారు. సౌమ్యంగా ఒప్పుకుంటే ధనమైనా దక్కుతుంది లేకపోతే ధనమూ భార్యా గూడా దక్కడం వట్టిదని బెదరించడం మొదలుపెట్టారు. ఫాతిమా ఛీ ! వాని ముఖం చూడనని ఛీత్కరించింది. వాడి ధనమెవడికి కావలె నా కాయకష్టమే నాకు చాలునని కాశీం తిరస్కరించాడు. మీ భోగభాగ్యాలతో మాకేం పని మా కొడుకు కోడలు సుఖంగా ఉంటే అంతేచాలును. మీ ముఖము మండ ! ఎక్కడదాపురించినారని ముసలిది తిట్టిపోసింది. నాటినుండి వారి సుఖ సంసారము ఏదో ఒక మహా అగాధంలో పడినట్లయింది. ఆ ముచ్చట్లు మురిపాలు లేవు. ఆ చిఱునవ్వు వెన్నెలలు లేవు. అన్నం నీరు ముట్టక ఫాతిమా ఒకటే యేడుపు. ఈ భార్యను ఈ నరరూప రాక్షసుని బారినుండి ఎట్లా రక్షించుకోగలనని కాశీంకు ఒకటే వేదన. అయ్యో ! ఈ కొడుకు కోడలు యీ ఆపదనుండి ఎట్లా బయట పడతారని ముసలిదానికి ఒకే ఆరాటం. కాశీం ఎన్ని విధాల బుజ్జగించినా ఫాతిమాకు శాంతిలేదు. అతని ఒడిలో తలదూర్చి ఒకటే విధంగా ఏడుస్తుంది. ఆ భార్య

దుఃఖం చూడలేడు కాశీం కాని ఏంజేస్తాడు ? కొత్వాలు సాహేబును ఎదిరించే తాహతు ఆ పేద కూలీకి యెక్కడిది ? ఎప్పుడు కొత్వాలు నౌకర్లువచ్చి తన భార్యను బలవంతంగా లాక్కొని పోయి కొత్వాలుకు ఒప్పగిస్తారోనని అడిలిపోతూ క్షణం ఒక యుగంగా గడుపుతున్నాడు కాశీం. ఒకనాడు కాశీం ఏ కూలీకో పోయినాడు. ముసలిది బజారుకు పోయింది. సాదుల్లా నౌకరొకడు సంచి నిండా మొహరీలు పోసుకువచ్చి, ఫాతిమాకు చూపిస్తూ ఇవిగో బంగారు మొహరీలు ; నీ జన్మలో చూచి యెరగవు. ఈ మజదూర్ ముండాకొడుకును అంటిపెట్టుకొని ఉంటే ఏమి సుఖపడతావు. కొత్వాలు సాహేబు వద్దకు వస్తే మహారాణీలాగా సుఖిస్తావు రమ్మన్నాడు. ఛీ ! అషర్ఫీ లెవ్వడికి కావాలె. నా పెనిమిటితో పేదఱికం మీ కొత్వాలు భాగ్యంకంటే నాకు గొప్పదే. మీ కొత్వాలు తుచ్ఛుడు నీచుడు, కనపడ్డ స్త్రీనల్లా చెఱపట్టే దుర్మార్గుడు నా భర్త యోగ్యతముందు వాడి అధికారము, ఐశ్వర్యము గడ్డిపోచతో సమమని ఫాతిమా తిరస్కరించింది. ఇంతలో ఫాతిమా అత్తవచ్చి మొహరీల సంచి యెత్తి వీధిలో పడవేసి నీచుడా ! నీకు ఆడతోడు లేదా నా కోడలు వెంబడి పడ్డావని తిట్టి వెళ్ళగొట్టింది. “ఎన్ని విధాల చెప్పినా వినకుండా తిరస్కరిస్తున్నావు. కొత్వాలుతో విరోధం పులితో చెలగాటం. రాత్రి తొలిజాము వెళ్లే లోపల కొత్వాలు సాహేబు స్వయంగా వచ్చి నీ కోడలిని తీసుకపోడానికి నిశ్చయించుకున్నాడు. ఇక యెవ్వరడ్డు పడుతారో చూస్తామ”ని ఆ నౌకరువాడు అరుచుకుంటూ వెళ్ళిపోయినాడు. ఇంతలో కాశీం ఇంటికి వచ్చాడు, జరిగిన సంగతి తల్లి, భార్య, చెప్పారు. ఆరోజుతో తమ దాంపత్య జీవితానికి అంతిమ ఘడియలు వచ్చినట్లేనని నిశ్చయించుకున్నారు, ప్రొద్దు క్రుంకే లోపల ఢిల్లీనగరం వదిలి పారిపోతే బాగుండుననుకున్నారు. కాని చేతిలో చిన్న కాసీలేదు, బండ్లు వాహనాలు యెక్కి పోలేరు. నడిచిపోతే సాదుల్లా నౌకర్ల కంటబడకుండా పోవడం కష్టం. వారిలో ఏఒక్కడు చూచినా కాశీమును, అతని తల్లిని తుదముట్టించడము, అతని భార్యను సాదుల్లా జనానాకు చేర్చడము క్షణంలో జరిగిపోతుంది. ఇది కాదు మార్గమని ముసిలిది కాశీంను కోడలికి కాపలాపెట్టి తమ కులపెద్దగా ఉన్నవానివద్దకు పోయి మొరపెట్టుకున్నది. అతను సాదుల్లాను ఎదిరించడం ఎవరికి చేతగాదు. నీకు న్యాయం కలిగితే పాదుషావారివల్లే కలగాలె. నీవు కోట వద్దకు పోయి అచట కట్టిఉన్న గంటను మ్రోగించు, నీ మొఱను ఆలకించే ప్రభువు కనిపిస్తాడని చెప్పాడు. సరే ఆ కోటవాకిటకు పోయి మొరపెట్టుకుందామని ముసలిది నిశ్చయించింది.

మజుమూర్ పేటకు పాదుషావారి కోట ఎంతోదూరం అయినప్పటికీ అన్నం నీళ్ళులేని ఆ ముసలిమగ్గు దారిపట్టి అట్లాగే పోవడం మొదలుపెట్టింది.—

## 3

మొగలాయి ప్రభువులలో న్యాయతత్పరత యందు అగ్రగణ్యుడని పేరుగాంచిన జహాంగీరు పాదుషా ప్రియురాలైన నూర్జహానుతో ఉల్లాసంగా ముచ్చట్లాడుతున్నాడు. అంతలో ప్రజల విన్నపముల నాలకించే నిమిత్తం కోటవాకిట గట్టించిన గంట గణగణా మ్రోగింది. న్యాయ ప్రియుడైన పాదుషా ప్రియురాలితో ముచ్చట్లు కట్టిపెట్టి చరచరా నడచి కోట వాకిట వచ్చి నిలిచాడు. గంట వద్ద ఒక ముసలిది నిలిచి పాదుషా వారిని చూచి సలాం చేసింది. పాదుషా ఆమెను చూచి ఏమిటి నీ ఆర్తి అన్నాడు. న్యాయప్రభువులైన పాదుషావారి రాజ్యంలో గూడ మావంటి పేద ప్రజల కష్టాలకు నివారణ కనిపించడం లేదుగదా అన్నది. ఏమిటి నీ కష్టమన్నాడు ప్రభువు.

స్త్రీల మానమర్యాదలకే భంగం వస్తున్నది. అంతకంటె కష్టమేమి కావలెనన్నది ముసలిది.

“భంగపాటా” అన్నాడు ప్రభువు.

అయ్యా ! ప్రభువులు రక్షించకపోతే మావంటి పేద వాళ్ళు మనగలరా ? అన్నది ముసలిది.

అవునమ్మా సంగతేమిటో చెప్పరాదా అన్నాడు ప్రభువు.

పాదుషావారు ప్రజల మొరలనాలకించి వారి కష్టముల నివారించగలరని కోట వాకిట గంట కట్టించారు. గంట గంటగానే ఉన్నది. జరుగవలసిన అన్యాయాలు జరుగుతున్నవన్నది ముసలిది.

ఏమి అన్యాయమో చెప్పవేం అన్నాడు ప్రభువు విసుగ్గా.

’అయ్యా ! నా కొక్కగా నొక్క కొడుకు.’

‘సరే’

# నీకోడలిపాతివ్రత్యము

'నా కోడలు చక్కని చుక్క.'

'ఊఁ.'

'మహా యిల్లాలు.'

'అదృష్టవంతురాలవు.'

'ఏమి అదృష్టవంతురాలను ? ఆమెను రక్షించుకో లేక అల్లాడుతున్నాను. ఈ ఒక్క రోజు ఆమెను రక్షిస్తే చాలు. సాయంత్రం లోపల ఆమె వెండికడియాలమ్మి దారి బత్తెమునకు నాల్గు డబ్బులు చెంగున గట్టుకొని తెల్ల వారగట్లనే ఏపూరో లేచిపోతాము. అయ్యా ! ఈ ఒక్క రాత్రి నా కోడలు ఆ దుర్మార్గుడి బారి పడకుండా రక్షిస్తే చాలు. తెల్లవారితే ఈ అధర్మ నగరంలో మేము ఉండ మని ముసలిది వలవలా ఏడ్చింది.

"ఎవరమ్మా ఆ దుర్మార్గుడు" అన్నాడు ప్రభువు.

'సాదుల్లా'

ఎవడు ? కొత్వాలు సాదుల్లాయేనా ?

అవును. ఈసాయంత్రంలోపల నా కోడలిని వాడింటికి చేర్చకపోతే రాత్రి ఝాము పొద్దుపోయిన తర్వాత వాడే స్వయంగా వచ్చి బలాత్కారంగా నా కోడలిని తీసుక పోతాడుట. అయ్యో ! నా బిడ్డ అన్నం నీళ్ళు గానకుండా అల్లాడిపోతున్నది. నా కొడుకు పిచ్చివాడులా అయి పోయినాడు. పండువంటి నా బిడ్డ కాపురం గంగలో కలిసిపోతున్నది అని ముసల్ది మరింత బిగ్గరగా ఏడ్చింది.

"పాదుషా ఉశ్ ఏడువబోకని వారించి ఊరిక బెద రించడానికన్నాడేమో ఇష్టం లేనిది నీ కోడలి నెందుకు తీసుకపోతాడులే అన్నాడు.

అయ్యా ! తీసుకపోకేమి ఎట్లాగైనా దాన్ని తీసుక పోవాలెననేగా మొహరీలు సంచిలో పోసి యింటికి పంపిం చాడు. వాడి మొహరీలు యెవరిక్కావలె. విసరి వీధిలో పారవేశాం. డబ్బు కొఱకు శీలం పోగొట్టుకొనే నీచులం కాము మేము. నా కోడలు మానావతి. వాడిబారి పడకుండా ప్రాణత్యాగం చేసుకుంటానంటున్నది. నా కొక్కగా నొక్క కొడుకు. వాడికి భార్యమీద పంచప్రాణాలూను. అటువంటి భార్యపోతే నా బిడ్డ బ్రతుకుతాడా ! ముసలిది మళ్ళీ హృదయం ద్రవించేటట్లు ఏడ్చింది. పాదుషాకు గూడా పట్టరాని దుఃఖం వచ్చింది. కన్నులనిండా వచ్చిన కన్నీళ్ళను చేతి రుమాలుతో తుడుచుకున్నాడు. ప్రజల అపరాధాలు విచారించి శిక్ష విధించే కొత్వాలే ఇంత దురా గతానికి ఒడిగట్టడమా. ప్రజల కష్టములను విచారించి వారి ఆర్తిని నివారించడంలో అగ్రగణ్యుడని కీర్తిగన్న తన ప్రభుత్వంలోనే తన ఉద్యోగులే ఇంత దుర్మార్గానికి ఒడిగట్టడమా. ఒక మహాసాధ్వి కష్టం నివారించలేని తన చక్రవర్తిత్వం ఉండియేమి లేకయేమి ? అన్న భావా లెన్నో పాదుషా హృదయంలో మెదలిపోయినాయి. ఆలోచనా ధీనచేతస్కుడై పాదుషా అట్లే నిలబడిపోయి నాడు. మహా కష్టంతో తల్లడిల్లిపోతున్న ఆ ముసలిదాని మనస్సు చల్లపడేటట్టుగా ఒక్క మాట పలకడానికైనా ఆయనకు చేతగాలేదు. ఆయన అట్లా నిలబడి ఉండగానే 'పేదవాళ్ళ మొర దేవుడే వినడు. మానవుల చెవికా యెక్కేది ? ఇటువంటివాళ్ళు ప్రజలగోడు వింటామని గంట కట్టడం గూడా డంబమే అంటూ విసురుగా ముస లిది వెళ్ళిపోవడం మొదలుపెట్టింది. అప్పుడు పాదుషా తన యోచనా సమాధినుండి మేలుకొన్నట్లయి అవ్వా ! మీ యిల్లెక్కడ అన్నాడు. నగరి చివరను ఉన్న మజ దూర్ పేటలో అంటూ ముసలిది వెళ్ళిపోయింది. పాదుషా గూడా దీర్ఘంగా ఒక్క నిట్టూర్పు విడిచి నగ రిలోకి వెళ్ళిపోయినాడు.

౮

రాత్రి తొమ్మిది గంటలు దాటింది. పగలంతా కష్టించి వచ్చిన మజదూరుపేటలోని పాటకపుజనం తిండీతిప్పలు తిని ఎక్కడివాళ్ళక్కడ పడిఉన్నారు. కాశీము, అతని భార్య, అతని ముసలి తల్లి, పాదుషావారికి స్వయంగా చెప్పుకున్నా ఆయన తమ్ము రక్షిస్తానన్న అభయవాక్యం మాటవరుసకైనా పలుకనందున తమరిక సర్వనాశంకాక తప్పదన్న నిస్పృహతో చీమచిటుక్కుమన్న సాదుల్లా వచ్చాడన్నభీతావహంతో ఆహారనిద్రలు మాని గడగడ లాడుతూ తలుపులు మూసుకు కూర్చున్నారు. ఇంతలో టకటక గుఱ్ఱం వచ్చినచప్పుడు, ఆ గుఱ్ఱముమీదినుంచి మనిషి దిగినచప్పుడు, ఆ మనిషి దబదబ వచ్చి తలుపు తట్టినచప్పుడు ఒకదాని వెంట ఒకటి వినవచ్చినాయి. ఆచప్పుడు వినవచ్చినకొలది లోపల ఉన్న ముగ్గురు ఒకరి దగ్గరకొకరు చేరుకొని నాటితో తమ బ్రతుకులు ఆఖరై నట్లేనని తల్లడిల్లడం మొదలుపెట్టారు. ఎవరు లోపల తలుపు తీయండన్నకేక మళ్ళీ కర్ణకఠోరంగా వినిపిం చింది. ఆ కేకలకు దద్దరిల్లి తలుపువేసుకొని లాభంలేదని

ముసలిది ఏడుస్తూవచ్చి తలుపుతీసింది. ఆ ముసలిదాన్ని చూచి బాగా కైపులో ఉన్న సాదుల్లా ముసలిముండా తలుపుతీయమంటే తీయక బుడిబుడి ఏడ్పులు ఏడుస్తావా అని ఫెడీలుమని ఒకచెంప పెట్టుపెట్టి అవతలికి పడద్రోసి కాశీం దగ్గరకుపోయి బ్రూతీకాలుతో వానిని నాల్గుతన్ని త్రోసివేసి ఫాతిమాను పట్టబోయినాడు. ఫాతిమా వాడిని చూచి పెద్దగా ఏడ్వటం మొదలుపెట్టింది. ఇంతలో మొండితెగువ చేసుకొని కాశీం భార్యకు అడ్డం పోయి నాడు. కాశీంపై దెబ్బలు వర్షంకురిసినట్లు పడుతున్నాయి. ఏమైనా కాశీం భార్యపై చేయిపడనీయడు. ఫాతిమా మగ నిని పెనవైచుకొని వదలదు. లోపల సాదుల్లా చేస్తున్న భీభత్సం ఇరుగుపొరుగులవారికి వినవస్తునే ఉన్నది. కాని కొత్వాలు సాహేబును ఎదిరించే సాహసం ఆపేద జనానికెక్కడిది? కాదంటే రేపు తమ యింటిమీదయిదే జులుం సాగిస్తాడనే భయంగదా. ఎవరుకిక్కురుమనలేదు. లోపల ఆ క్రందనాలు, అరుపులు, వినవస్తున్నాయి. బైట సాదుల్లా గుఱ్ఱపువాడు గుఱ్ఱమును పట్టుకొని నిల్చిఉన్నాడు. ఇంతలో ఎవరో అజ్ఞాతవ్యక్తి త్వరత్వరగా వచ్చి యింటి చుట్టు తిరగడం మొదలుపెట్టాడు. గుఱ్ఱపువాడు వానిని చూచి "ఎవడవోయి నీవు ఇట్లా వచ్చావు. లోపల ఎవరున్నారో తెలుసునా? కొత్వాలు సాహేబు! లోపలికి పోతివా ప్రాణాలు దక్కవు వెంటనే వెళ్ళిపో" అన్నాడు. ఆ అజ్ఞాత వ్యక్తి మారుమాట్లాడకుండా వానిచెంపపై ఒక్క పెట్టుపెట్టి గుఱ్ఱమును చూరుదగ్గరకులాక్కొని దాని జీనులాడాలమీదుగా ఇంటికప్పుపైకెక్కి ఆకులూడి పోయిన ఆకప్పుకంతలలోగుండా కాశీమును ఒక చేతితో నెట్టివేస్తూ, ఫాతిమాను గట్టిగా చేయిబట్టిలాగుతున్న సాదుల్లా యెట్టయెదుటకు అరే! సాదుల్లా ఎంతపని చేస్తున్నావు దుర్మార్గుడా అంటూ ఒక్క దుముకు దుమి కాడు. పాదుషా కేక పెట్టుతూ ఎదుట ప్రత్యక్షం కావడం సాదుల్లాకు ఉఱుము ఉఱిమి పిడుగు పడ్డట్లైంది. మనిషి చేతులు కాళ్ళు పట్టుతప్పిపోయి నిలువునా నేల పడిపోయి నాడు. నోరు మూసుకుపోయింది. కళ్ళు తేలవేశాడు. ప్రాణం మాత్రమే గుండెల్లో కొట్టుకుంటున్నది. పాదుషా పండ్లుపటపట కొఱుకుచు కాలితో వానిని తట్టి పదఅన్నాడు, సాదుల్లా లేని బలంతెచ్చుకొని లేచి గడగడ లాడుతూ పాదుషా వెనుక నిలబడాడు. పాదుషా వానిని 'రా' అని బయటికి లాక్కొని పోయి పొడుగాటిత్రాడు వాని నడు ముకు కట్టి ఆత్రాడును గుఱ్ఱపు వెనుకకాలికి కట్టి గుఱ్ఱము పై తానధిరోహించి చక్‌మని కొఱడాతో గుఱ్ఱాన్ని అద లించాడు. గుఱ్ఱముపై స్వారిచేయుచు పాదుషా. ఆ గుఱ్ఱ ముకాలికి బంధితుడై పరుగెత్తుచు సాదుల్లా. క్షణంలో గుఱ్ఱము దృష్టి పథందాటి పోయింది.

౫

తెల్లవారి జాము ప్రొద్దెక్కింది. న్యాయ ప్రభువైన జహంగీరు చక్రవర్తి అత్యవసరంగా కొలువు తీర్చినాడు. మంత్రులు, సామంతులు, సేనాధి పతులు, ఇతర రాజో ద్యోగులు, రక్షకభటులు ఇతర పరివారజనులు ఎవరి స్థాన ములవారు ఉండి పాదుషా ఆజ్ఞల కెదురు చూచుచున్నారు. పాదుషా సింహాసనాధిష్టితుడైనాడు. అత్యవసరంగా రాజ సభ ఎందుకేర్పరచ బడినదో ఎవరికీ తెలియదు. చక్రవర్తి ప్రసన్నుడుగాలేడు. రాత్రి గాంచిన భీభత్స భయానక దృశ్యము మనస్సు నెమరు వేస్తున్నది కాబోలు. ముఖం జేవురించి ఉన్నది కన్నులు రోష కషాయితమై భయం కర పరిణామాన్ని సూచిస్తున్నవి. అప్రసన్నుడైన ప్రభువు ముఖారవిందం చూచి ఎల్లరు ఎవరికేమి కీడు మూడనున్నదోనని భయవిహ్వలురై శంకిస్తున్నారు. ఇంతలో చక్రవర్తి ఒకమారు సభ కలయచూచి రక్షక భటాధ్యక్షునితో నేరస్థుని హాజరు పెట్టించుము అని ఆజ్ఞా పించినాడు ఈలోగ ప్రభువు ఉత్తరువుచేకాబోలు ఫాతిమా అత్త ముసలిది సగౌరవముగా లోనికి తోడ్కొని రాబడి ఉచితాసనమున కూర్చుండపెట్టబడినది. ఈ రెండు విష యములు వినగా కనగా ఆ నేరస్థుడెవరు? ఈ ముసలి దెవరు? అని అందరు ఆశ్చర్యచకితులై ఆందోళన చిత్తంతో దిక్కులు చూస్తున్నారు. ఇంతలో గుఱ్ఱము వెంట పరువెత్తుటచే ఒడలినిండ రక్తసిక్తమైన గాయములతో శృంఖలా బద్ధమైన చేతులతో, అరుణసిక్తమైన నేత్రములతో అవనతమస్తకుడైన సాదుల్లా చక్రవర్తి సమ్ముఖమునకు కొనిరాబడినాడు. ఏమి! నిత్యము నేరాపరాధులకు శిక్ష విధించే కొత్వాలు సాహేబు అపరాధియా! కొలువెల్ల ఒక్కమారు భ్రాంతచేతస్కమైపోయింది, దిగ్భ్రమతో మిఱ్ఱిమిఱ్ఱిచూచేవాళ్ళు. భయంతో వడవడ వణికేవాళ్ళు దుఃఖంతో కంటతడి పెట్టేవాళ్లు. శంకతో ఇతడు చేసి అపరాధమేమై ఉంటుందని వితర్కించేవాళ్లు. ప్రభువు కాగ్రహం వస్తే ఎవరి బ్రతుకైనా యింతేనని చింతిం వాళ్ళు అయి సభంతా లోపల నక్రగ్రాహ మహానాది భీక జలజంతు సంతానయుతమై శోభిల్లుతూ ఉంది పైకి ని

రంగ జలధిలాగా మౌనముద్ర వహించి గంభీరంగా ఉన్నది. కొలది నిముషాలు గడిచాయి. ఎల్లరు చక్రవర్తి దెస కేంద్రీకృత దృక్కులై ఉన్నారు. అంతలో మేఘగంభీర నిస్వనంతో సభోప విష్టులైన ప్రజలనుద్దేశించి పాదుషా ఇట్లనినాడు. "ఈ కొత్వాలు సాదుల్లా నిరుపేద అయిన ఒక మానవతిని చెఱపట్టుటకై చేయుచున్న ప్రబల బలాత్కార దౌర్జన్యమును రాత్రి నేను కండ్లారా చూచి చేతులారా యితనిని బందీకృతుని చేసి గుఱ్ఱపు కాలికి కట్టివేసి లాక్కొని వచ్చాను. కనుక దీనికి ప్రత్యేక విచారణా తీర్పు అనవసరము. ప్రజల కష్టములను స్వయంగా విని ఆపదలను నివారించుటకై కోటవాకిట గంట కట్టించిన నాకు, నా ప్రభుత్వములో ప్రజల నేరములను విచారించి శిక్ష విధించవలసిన నా ప్రభుత్వోద్యోగియే ఒక స్త్రీ యెడ ఇంత దౌర్జన్యము జరపడం కంటె గర్హితమైన విషయము నాకు అవమానకరమైన విషయము వేరొకటి లేదు. ఇంత దుశ్శీలురు రాజోద్యోగులుగా ఉంటే ప్రజల ప్రాణ మాన ధనంబులకు రక్షణమెక్కడ ? పతిప్రాణలైన పరమ సాధ్వీమతల్లులు నా పరిపాలనలో ఎట్లు సురక్షితంగా ఉండగలరు ? నా రాజరికానికి గౌరవమేమున్నది ? పరమ సాధ్వీమ తల్లులైన స్త్రీలను చెఱబట్టే ఈ నీచ సాదుల్లాకు మరణ శిక్షే అర్హమైంది. కాని వీడు చిరకాలము బ్రతికి స్త్రీల యెడ తాను చేసిన అపరాధాన్ని తలచి తలచి యేడవటమే మరణశిక్షకంటె బలీయమైన శిక్ష కాగలదు కాబట్టి వీనికి యావజ్జీవ కారాగృహ శిక్ష విధిస్తున్నాను" అన్నాడు పాదుషా. సాదుల్లా చేసిన మహాపరాధమూ వానికి విధింపబడిన దారుణ శిక్షా, ఒక్కమాటుగా విని ప్రజలు నిర్విణ్ణులై అనిమిషనయనులై చూస్తూ ఉండగా తక్షణమే పాదుషా సింహాసనం నుండిదిగి ఫాతిమా అత్త అయిన ముసలిదానివద్దకు వచ్చి దగద్ధగాయితమైన తన నవరత్న ఖచిత కిరీటమును శిరమునుండి తీసి ముసలిదాని పాదములపైనిడి "తల్లీ ! నీ కోడలి పాతివ్రత్యము నా కిరీటముకంటె గొప్పది" అని వినమ్రుడై మోకరిల్లినాడు.

# మానసిక విశ్లేషణ ★

శ్రీమతి కె. సుగుణమణి

మానసికశాస్త్రం:— పెద్దలు "మనఏవ జగత్సర్వం" అని సూచించేరు; ప్రహ్లాదుల్లాంటి పిన్నలు "సర్వార్థములు మనస్సంభవములు" అని సూక్ష్మంగా చెప్పేరు. మనస్సు అనే కోతి ఊహాప్రపంచంలో కోరికలనే చెట్లకొమ్మలపై యదేచ్ఛగా గంతులు వేయకుండా, భక్తి అనే త్రాటితో బంధించి భగవన్నామజపం వప్పజెప్పి, దాన్ని అదుపాజ్ఞల్లోకి తేవాలన్న భక్తియోగ సూత్రంకూడ మానసిక శాస్త్రానికి చెందినదే. వీటిల్లో ఎంతో అంతరార్థంయిమిడివుండేటట్లు చెప్పేరు పూర్వులు,

శరీరం, మనస్సు ఇవి అవినాభావ సంబంధంతో వ్యవహరిస్తేనే మనిషికి పరిపూర్ణారోగ్యం. ఐతే శరీరారోగ్యసూత్రాలు తెలిసినంత విరివిగా మానసికారోగ్య సూత్రాలు అందరికీ తెలియకుండా ఉన్నాయి మనస్సు అన్నది అతినిగూఢమైంది. దీని తత్వాన్ని అవగాహన చేసుకోడాన్కి ప్రయత్నించేది మానసికశాస్త్రం **(psychology)**. మన నిత్యజీవితంలో బాహ్యప్రపంచాన్ని గురించి పంచేంద్రియాలు తెచ్చేనాడీ సౌజ్ఞల్ని మెదడు ద్వారా అందుకుంటూ, సమన్వయపరచి, వాటిని అవగాహన చేసు కొనేది మనస్సు. ఇది ఊహా ప్రపంచంలో వ్యవహరిస్తూ భౌతికశరీరాన్ని నడిపే ప్రజ్ఞకలది. ఈ సమన్వయించే పని సరిగా నిర్వహించ లేకపోవడమే మతిభ్రమించడం (హిస్టీరియా) అన్నారు ఒకప్పుడు. ఉదాహరణ చెప్పేరు; బజారులో రెండుచేతులూ నిండిపోయేటట్లు పొట్లాలు కొన్నమనిషి, అన్నీపట్టుకో లేక, కొన్ని క్రిందపడేసు కుంటూ, వాటిని ఏరుకుంటుంటే మరికొన్ని పడేసుకుంటూ ఎలా అవస్థపడతాడో, అలా హిస్టీరియారోగి తన మనస్సునూ ఊహల్నీ అదుపాజ్ఞల్లో ఉంచుకో లేక భ్రమలోపడి కొట్టుకుంటూ ఉంటాడన్నారు. "దీనికిమార్గాంతరం ఏమిటి" అంటే "మనోరోగానికి మందులేదు" అన్నారు దీన్నిగురించి ఛార్కాట్, జానెట్ బెరన్‌హీమ్, బ్రీయర్ వగైరాశాస్త్రజ్ఞులు పలువిధాల కృషి చేసేరు, ఒకప్పుడు మతిభ్రమించిన అమ్మాయిని ప్రశాంతంగా పరీక్షిస్తూ, తాను ఆలా ఐపోడానికి కారణాలేమిటో నన్న చరిత్ర ఓర్పుతో చాకచక్యంగా ఆమె నోటనేచెప్పించ గలిగేరు డా॥ బ్రీయరూ అతడిశిష్యుడు సిగ్మండ్ ఫ్రాడ్డూను. ఈ సూక్ష్మ ప్రక్రియవల్ల మామూలు మందులకూ మాకులకూ లొంగని రోగం తమాషాగా కుదిరి ఊరుకుంది! దీనికి "సంభాషణద్వారా రోగం కుదర్చడం" అని పేరెట్టేరు అప్పట్లో. ఐతే ఇతరుల్లాగ, సిద్ధాంతాలు ప్రకటించడమే ప్రమేయంగా పెట్టుకోక దీని ఆరాపూర్తిగా తీస్తే మానవజాతికి మహోపకారం జౌతుందని మహా తంటాలు పడ్డాడు ఫ్రాడ్ మహానీయుడు.

సిగ్మండ్ ఫ్రాడ్:— ఇతడు అతినిగూఢమైన సూత్రాల్ని ఒక రూపంలోకి తెచ్చి, మానసికశాస్త్ర పితామహుడని పించు కున్నాడు.

మనలో పుట్టుకరీత్యా పశుత్వం — ప్రేమ — భయం వగైరా అరిషడ్వర్గాల గుణాలన్నీ మనస్సులో అంతర్గతమైయుండి, "నాగరిక" ప్రపంచంలో యథేచ్ఛగా ప్రకటితం కాడానికి వీలులేక "లోమనస్సు" **(sub-conscious)**లోకి నెట్టివేయబడతాయనీ, అవి క్రమంగా 'మానసికముడులు' **(mental complexes)** గా తయారై రూపాంతరం పొంది మాటల్లోను చేష్టల్లోను పొరబాట్లుగాను ఆకోరికలు వింతరూపాల్లో కలలుగాను తయారౌతుంటాయనీ, వీటిని సరిగా అదుపాజ్ఞల్లో ఉంచుకోలేని వ్యక్తి క్రమంగా మతిభ్రమించినట్లు చరిస్తాడనీ తేలింది. "పిచ్చి కుదిరితేగాని పెళ్లి అవదు, పెళ్ళైతేగాని పిచ్చికుదరదు" అని మనవారు చెప్పేసామెతల్లోకూడా చాల అర్థంఉంది. ఐతే వీటి అంతరార్థాల్నీ, ఈవిషయసమస్యల పరిష్కారాల్నీ చెప్పేవారు కావాలి, కొంతకాలానికి తాను లోన అణచుకొన్న భావం ఏమిటో ఆవ్యక్తికే గుర్తులేకుండా పోతుంది. హిప్నటైజ్ చేస్తే, పూర్వపు స్మృతిపథాలు కొందరు రోగులు గుర్తులోకి తెచ్చుకొని చెప్పగలిగే వారుకాని అందరూ దీనికి వశ్యులయ్యే వారుగారు. హిప్నటిజమ్ అనగానే అదొకరంతు. అందుచేత మార్గాంతరాలకోసం తంటాలుపడ్డాడు ఫ్రాడ్.

మార్గాంతరం:— ఇదిమొదట్లో దారీ తెన్నూలేని అయోమయంగా అగుపించింది. ఎందుకంటే — డాక్టరుకు తెలియని విషయాలు రోగివల్ల చెప్పించాలి; అవి రోగికి కూడా స్మృతిపథంలో లేని విషయాలు! రం

పద్ధతి జయప్రదం కావడం ఎట్లాగ!! హిప్నాటిక్ స్థితిలో నడయాడిన మనిషి (మామూలు స్థితిలోకి వచ్చేక), హిప్నాటిక్ స్థితిలో నున్నప్పుడు గావించిన కార్యాల్ని గురించి అడిగితే — మొదట "నాకేమీ జ్ఞాపకంలేదం"టాడు; కాని "నీకుతెలుసు. ప్రయత్నించి జ్ఞాపకంలోకి తెచ్చుకొని చెప్పు" అని గట్టిగా పట్టుబడితే — అతడు తప్పకుండా స్మృతిపథంలోకి తెచ్చుకొని చెప్పగలుగుతాడు. ఈ హంశం ఫ్రాయిడ్ తెలుసుకున్నాడు గనుక హిస్టీరియారోగం విషయంలోకూడ ప్రయత్నించి చూచేడు. నయాన్ని మెల్ల మెల్లగా నిలదీస్తే, రోగి ఎన్నడో మరచిపోయిన, (రోగ చిహ్నాలకు హేతు భూతమైన) విషయాలొక్కటొక్కటే క్రమక్రమంగా ఏకరువు పెట్టగలిగే వాడు — హిప్నాటిక్ సజషన్ అక్కరలేకుండానే. ఐతే ఇదిఇంత సులువుగా జరిగేది కాదు, దీర్ఘకాలం పట్టేది; విశేష ప్రయాస పడవలసి వచ్చేది. ఐనా ఫ్రాయిడ్ మాత్రందీన్ని విడిచిపెట్టక, సఫలీకృతుడయ్యే వరకు కృషి చేసేవాడు. అతడు ఈ నిశ్చయానికి వచ్చేడు:— ఆ పూర్వ మెప్పుడో మర్చిపోయిన హంశాలు రోగి స్మృతిపథంలో లేకపోయినా, అవి లోమనస్సులోనే అణచిపెట్ట బడియుండి, అనేక చిహ్నాల్ని కలిగిస్తాయనీ, వీటిలో దేనినో దానిని పట్టుకొని, ఆరా తీసుకుంటూపోతే, (తీగలాగితే డొంక అంతాకదిలినట్టు), వాటిని 'మరపు'లో నుంచి క్రమక్రమంగా రోగి 'ఎరుక' లోకి తేవచ్చుననీ అన్నాడు, అనేక హేతువులవల్ల ఈ ఊహల్నీ, ఉద్రేకాల్నీ, రోగి. లోపల అణచియుంచు తున్నట్టూ. అవిబయట పడకుండా అప్రయత్నంగా అడ్డులు పన్నుతున్నట్టూ, డాక్టరు ప్రోద్బలం వల్ల ఈ ఆడ్డులు అధిగమించి, (ఇష్టంలేక, చెప్ప లేక, విధిలేక) చెప్పుతున్నట్టూ స్పష్టమయ్యేది,

మూలకారణం:— ఇలా సంకల్పాలను లోన అణచి పెట్టి ఉంచడమన్నదే హిస్టీరియారోగానికి మూలాంకురం. రోగం కుదర్చాలంటే, ఈ అణచిపెట్టే ప్రయత్నాల్ని సడలింపజేసి, వాటిని సక్రమంగా. ఉద్రేకపూరితంగా వెడలగ్రక్కించడంలోనే ఉంది — కిటుకంతాను. ఐతే ఒక ప్రశ్న:— ఇలా సంకల్పాలను అణచిపెట్టే శక్తి, ఏమిటి? అణచిపెట్టడానికి 'కారణం' ఏమిటి? అనేక రోగాల్ని పరీక్షించగా అన్ని కేసుల్లోను అగుపడింది ఏమిటంటే: వీరి బుర్రల్లో ఏవోకొన్ని కోరికలు పుట్టడం, అవి వ్యక్తుల సహజ జీవనాన్కి - మతానికి — నీతికి — సంఘ నిబంధనలకు విరుద్ధం కావడం. ఈ పరస్పర విరుద్ధాలవల్ల, ఆ కోరికలుగాని, ఉద్రేకాలుగాని తీర్చుకోడానికీ వెలిబుచ్చడానికీ వీలులేక, లోలోన అణచివేయబడ్డం; క్రమంగా ఈ తీరనికోరికలు "లోమనస్సు" లోకి నెట్టి వేయబడి, మరపులోకి పోవడం. వ్యక్తియొక్క నైజానికీ లోకానికీ విరుద్ధం అవడమే ఆ ఊహలు అణచివేయ బడ్డానికి 'కారణం'. 'అణచిపెట్టేశక్తులు' ఏమిటిటంటే— దైవభీతి — సంఘభీతి — పాపభీతి వగైరాలు: ఇలాలోక విరుద్ధమైన కోరికలవల్ల, మనస్సులో అలజడ,బాధ. బాధపోగొట్టుకో డాన్కి కోరికలు అణగద్రొక్కివేయ బడడం; ఇలాగ అణగద్రొక్కితేనే గాని "నాగరిక" సంఘంలో తమ వ్యక్తిత్వం నిలబెట్టుకొందుకు వీలులేక పోవడం. కోరికల్ని అణచిపెట్టడాన్కి కారణం, అణచిపెట్టేశక్తి, రోగికీ వీటికీగలపర్పర సంబంధం ఇంకా స్పష్టంకావాలంటే ఈ క్రింది ఉపమానం చెప్పుకోవచ్చు:— ఒక హాలులో ఒకరు ఉపన్యాసం ఇస్తున్నారను కోండి. అంతాశ్రద్ధగా వింటున్నారు కాని ఎవరో ఒకరు నవ్వులు ఎదురుమాటలూ, బల్లచప్పుళ్లూ చేస్తూ అల్లరిచేసే రను కోండి. ఉపన్యాసం ఇచ్చేఆయన ఈ కల్లోలం సహించ లేక, ఉపన్యాసం సాగించ లేనంటాడు. అంతట సభికుల్లో కొందరు గట్టివారు లేచి, కొంతగల్లంతు జరిగినా, అల్లరి చేసే అతణ్ణి బయటకు నెట్టివేస్తారు. అతడు ఇలాకల్లోలం జరిగించకుండా 'అణచివేయ బడ్డాడ'న్నమాట. మళ్లీ ఉపన్యాసం ఎప్పట్లాగ సాగించ వచ్చునను కుంటారు. తిరిగి అల్లరి బయలుదేరకుండా కొందరు గుమ్మందగ్గర కాపలా కూర్చుని, ఆపెద్దమనిషిని లోనికి రాకుండా కాస్తుంటారు. వీరు 'అణచివేసేవారు' అవుతారు. అలాగే హిస్టీరియా రోగి మామూలు జీవితంలో నుండగా ఏదో ఒక 'వక్ర సంకల్పం' అనుకున్నది ఉద్భవించింది అనుకుందాం. ఇది నిత్యజీవితానికి సరిపడదు. గనుక మానసిక కల్లోలం జరిగించకుండా లోలోపలి మనస్సులోకి 'అణగద్రొక్కబడుతుంది' ఇది స్మృతిపథంలోకి రాకుండా జాగ్రదావస్థలోనున్న మనస్సు కాపలా కాస్తూ, దాన్ని 'అణచి ఉంచుతుంది.' కాని, లోనికోరిక, ఆ వ్యక్తి అప్రమత్తతలో నున్నప్పుడు బయటపడ్డానికి ప్రయత్నిస్తూనే ఉంటుంది. ఈ పరస్పర విరుద్ధమైన వాటివల్ల మానసిక కల్లోలం ప్రారంభమైన దన్నమాట. ఇంకా పై ఉపమానం పొడిగించి చూదాం:— కల్లోలం తెచ్చిపెట్టే రౌడీని బయటకు నెట్టివేసి 'అణచిఉంచి' నంత మాత్రంచేత కల్లోలం ఆఖరుగాదు. ఆతడు బయట మరింత రెచ్చి

పోయి, విచ్చలవిడిగా తలుపులు గ్రుద్దడం — గందరగోళం చేయడం సాగిస్తుంటాడు — (అణచివేయబడ్డ కోరిక మానసిక కల్లోలంకలిగిస్తూనే ఉంటున్నట్టు).

అలాంటప్పుడు ఏసభాధ్యక్షుడో మధ్యవర్తిత్వం వహించి, బయటరౌడీని సంప్రదించి మళ్లీ మనదగ్గరకు వచ్చి - అతడు సరిగా ప్రవర్తించుకుంటా నంటున్నాడు లోనికి రానివ్వండి అని రాయబారం జరుపుతాడు. ఆరిక మండేషన్‌తో అతడ్ని మళ్లీ మనలోనికి రానిస్తాం — శాంతి నిశ్శబ్దం నెలకొల్ప బడుతుంది అలాగే హిష్టీరియా రోగం కుదిర్చే వైద్యుడు (పై మధ్యవర్తిలాగ పనిచేసి) రోగి అంతరంగంలో అణచి పెట్టబడి మానసిక కల్లోలానికి దారితీస్తున్న ఊహల్ని మళ్లీ అతడిస్మృతి పథంలోకి తెచ్చివదలి ఇప్పుడు వాటిని అవగాహన లోకి తెప్పుకున్నావు గనుక ఇవేవీ నిన్ను అలజడి చెయ్యవని హామీయిచ్చి వదులుతాడు! ఈ ఉపమానంద్వారా హిస్టీరియా రోగతత్వం అందరికీ కొంత గ్రాహ్యమై యుండవచ్చు.

పంథా:— ఈ మాదిరి సంకల్ప వికల్పాలు సహజంగా అందరి బుర్రల్లోనూ పుడుతూనే ఉంటాయి గాని మతిభ్రమ ఎప్పుడొస్తుందంటే — లోనకు నెట్టినేయబడ్డ సంకల్పాలు (అతిగాఢమైనవై) వ్యక్తిత్వానికి లోపం రాకుండా పూర్తిగా అణచివేయ బడ్డానికి తగిన మానసిక సత్తా అతనికి లేనప్పుడు, అవి అతడి ఎరుకలో లేకుండానే అతనిమానసిక జీవితంలో కల్లోలం కలిగిస్తూ, క్రమంగా రూపాంతరాలుగా (పొరపాటు మాటలు, చేష్టలుగా) వెలువడుతూ. చివరకు హిస్టిరియా చిహ్నాలతో తయారౌతాయి. బుర్రలో పుట్టిన (మత - నైతిక - సాంఘిక) విరుద్ధమైన బలవత్తరమైన కోరికలు) అప్పటికి లోనకు అణగద్రొక్క గలిగినా కొన్నాళ్లకు వాటి ప్రభావానికి లొంగిపోయి. పిచ్చివాడుగా తయారౌతాడు. దాంతో అతడు తన్నులోన బాధించేది మరచిపోయి, నూతన రోగ చిహ్నాలతో అవస్థ పడుతుంటాడు. ఇతణ్ణి మళ్లీ స్వస్థచిత్తుణ్ణి చేయాలంటే, రోగచిహ్నాల నుంచి రోగ కారణాల్ని, వాటికి హేతు భూతమైన (వ్యక్తంకాడానికి అవకాశం లేక లోమనస్సులోనికి నెట్టివేయబడి) అణచి పెట్టబడియున్న సంకల్ప వికల్పాల్ని మళ్లీ అతడి స్మృతి పథంలోకి వచ్చేటట్లు. రోగి సహాయంవల్లనే కథవెనక్కు విప్పుకుంటూ వెళ్లవలసిందే. ఫలానా ఊహల్ని, ఉద్రేకాల్ని అణచివేసుకున్నావు సుమా వాటిఫలితమే ఇదంతానని (పైనదెల్పిన రౌడీకి పునః ప్రవేశం కలిగించి కల్లోలం తగ్గించినట్లు). అతడి ఎరుకలోనికి వాటినిమళ్లీ తెచ్చి వదలాలి. ఇదిజరగడానికి (అతడికి తెలియ రాకుండానే పై సంకల్పాల్ని అణగదొక్కి ఉంచేశక్తిని) నయాన్ని అధిగమించేటట్లు చేసి, తదను గుణ్యమైన ఉద్రేకం వెలిబుచ్చుకొనే టట్లు కూడ అవకాశం కల్పించి డాక్టరు కృషి చేయగా మరుపు ఎరుకలోనికి వచ్చి. అంతఃకరణలో నున్న అవ్యక్తంసువ్యక్తమై రోగి మామూలు మనిషి ఔతాడు. చికిత్స ముగింపు మూడు విధాలలో ఏదో విధంగా చేయవచ్చు (1) నీవు లోనఅణగ ద్రొక్కిన కోరికలు వెలిబుచ్చు కోకుండా ఉంచడం నీవ్యక్తిత్వం నిలబెట్టుకోడాన్కి అడ్డు రాదని నచ్చచెప్పి, దానిని డాక్టరు అమిత సానుభూతితో వ్యక్త పరిపించడం, (2) తన నైతిక జీవితం వగైరాలకు విరుద్ధంకాని విధంగా మరేదో ఉన్నతా శయాలమీదకు మనస్సు మరలించడం (3) లేదా నీవు అలా అణచివేయడం సహజమే గాని. వాటిని నీవు మరచిపోయినా నిన్నవి అంతరాత్మలోనుంచి బాధిస్తూయున్నాయి. నీవు వాటిని పూర్తిగా స్మృతిపథంలోకి తెప్పుకొని, ఫలానా అని గ్రాహ్యం చేసుకొని. త్రికరణ శుద్ధిగా వాటికి తిలోదకాలు వదలలేదు గనుక నీవు మతి స్థిమితం లేక ఉన్నావు అని అతడికి పునఃస్మృతిలోనికి తెచ్చి ఎరుకలో వాటిని వదిలింపించడం, అణచ నసాధ్యమైన అనేక పటుతర కోరికలు, గట్టిసంకల్పాలు పూర్తిగా అతడి స్మృతిపథంలోకి తెప్పించి, త్రికరణశుద్ధిగా వాటిని వదలు కొనేటట్లు, అధిగమించేటట్లు చేస్తే అవి మరి బాధించవు.

మానసికవిశ్లేషణ:— ఇంతవరకు మనం చర్చించిన మనస్సును పరిశోధించే విధానాన్నే, సైకో ఎనాలిసిస్. అంటారు. అంతే వైద్యుడు — మానసిక విశ్లేషణచేసి, రోగినిబాధించేది ఫలానా సుమా అని అతడి స్మృతిపథం లోకి తెచ్చి. అవగాహన చేయించి, అణచియున్న కోరికలు, ఉద్రేకాలు రోగిస్వయంగా వెలిబుచ్చు కొనేటట్లు క్రమంగా చేయకు రావడం. ఇలా అతినిగూఢమైన ఊహాన్యాల్ని ఆరాతీసి, ఎవరేమన్నా లెక్కచేయక నిర్భయంగా. లోకం ముందుపెట్టిన సిగ్మండ్ ఫ్రాయిడ్‌ను చాలకాలం, లోకం వెటకరించింది. (ఏశాస్త్రజ్ఞుణ్ణి మాత్రం లోకంమొదట్లోహర్షించింది? గెలిలి యోనుఖైదులోపెట్టేరు. మార్కోనీని "లూనాటిక్" అన్నారు! అలాగే ఫ్రాయిడ్‌ను నైతిక కల్లోలంతెస్తున్న తెంపరి అన్నారు). కానిచివరకు సత్యం ఒప్పుకోక తప్పిందిగాదు యదార్థాన్ని మనం ఏమనిపిల్చినా యదార్థంగానే ఉంటుంది.



# సంక్షేమం



మనదేశములోని బిడ్డల కందరకు ఆనందదాయకమగు గృహము, పఠించుటకు మంచి పాఠశాల సమకూర్చిననే మన పతాకము మీద అశోకచక్రము మన దేశమునకు నిజమగు స్వాతంత్ర చిహ్నముకాగలదు.

కాని నేటికీ చిన్నచిన్న పిల్లలు వీధులలో అడుక్కొనుట, జేబుదొంగతనాలు సహితము చేయుట కనబడుచునేవున్నవి

సాంఘిక సంక్షేమము వారి ముఖ్యాశయము యట్టి సౌకర్యములు మన బిడ్డలందరి కొసగుటయే. ఈ చిట్టి జీవితాలకు ఆరోగ్యకర మైన గృహము సుశిక్షణ నిచ్చు పాఠశాలల నిచ్చివారిని ఆదర్శప్రాయులగు భారత పౌరులుగ తయారగు అవకాశమిచ్చుటే సాంఘిక సంక్షేమము వారి ముఖ్యోద్దేశము.





# అమెరికా, యూరప్‌లలో సంఘ సంక్షేమకృషి

## శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారి పర్యటన విశేషాలు

---

అట్టావాలో జరిగిన కొలంబో రాజ్యాల సలహా సంఘ సమావేశంలోను, ప్రపంచం బ్యాంకి, అంతర్జాతీయ ద్రవ్య నిధుల గవర్నర్ల సమావేశంలోను పాల్గొనడానికి ఇండియా మంత్రి శ్రీ దేశ్‌ముఖ్‌గారితో పాటు శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారు కెనడా, అమెరికా, యూరప్‌లను సందర్శించినపుడు 300 మంది ప్రముఖులైన సంఘసేవకులను కలుసుకొన్నారు. మహిళలకు, పిల్లలకు, వికలాంగులకు నెలకొల్ప బడివున్న పెక్కు సంస్థలను ఆమె దర్శించారు.

స్వాతంత్ర్య సంసిద్ధికి పిమ్మట ఇండియాలో జరిగిన కృషి ఆ దేశాలలో ప్రతిచోట విశేషంగా ప్రశంసించ బడినప్పటికీ, సంఘసంక్షేమ కృషిలో ఇండియా ఏయే విషయాలలో వెనుకబడివున్నదో తెలుసుకొనడానికి ఈ విదేశ పర్యటన శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారికి అవకాశమిచ్చింది.

ఇటీవల ఆమె పత్రికా ప్రతినిధులతో యిటీవల ప్రసంగిస్తూ, ఇండియాలో కూడా క్రీచీలు వున్నవి కాని అవి ఫాక్టరీలకే పరిమితమై వున్నాయని సూచించారు. ఇతర రంగాలలోను, వృత్తులలోను పనిచేస్తున్న స్త్రీలకు అట్టి సౌకర్యాలు లేవని, ఐచ్ఛిక సేవకుకాని, ప్రతిఫలమిచ్చే పద్ధతినిగాని వేలాదిగా మహిళల సేవ దేశానికి అవసరమైవున్న సమయంలో క్రీచీలు వుండాలని ఆమె పేర్కొన్నారు.

### లండనులో క్రీచీలు

లండన్‌లో వేర్వేరు పనులలో నిపుణ్యమైన స్త్రీల బిడ్డలకోసం 75 క్రీచీలున్నవని, తాను దర్శించిన ఒక క్రీచీలో 140 మంది పిల్లలున్నారనీ, ప్రతి 25 మంది పిల్లలకు ఒకరు వంతున ముగ్గురు సంరక్షకులున్నారని ఆమె వివరించారు.

లండన్‌లో వేర్వేరు సంస్థలలో పనిచేసే స్త్రీలు ఉదయం 7–30 గంటలకు పనికి వెళ్ళేటప్పుడు ఆరు మాసాలనుంచి అయిదు సంవత్సరాలలోపున వుండే తమ బిడ్డలను ఈ క్రీచీలలో అప్పగించి, సాయంకాలం యింటికి తిరిగి వెళ్ళేటప్పుడు తీసుకుపోతూవుంటారట; ఆ తల్లులు తమ బిడ్డలను వీటిలో చేర్పడానికి- తాము పనిచేసే సంస్థనుంచి ఒక సర్టిఫికెట్ తెస్తే చాలునట. ఇప్పుడిప్పుడే ఈ సౌకర్యం రోగ గ్రస్తులైన బిడ్డల ఆలన పాలనలను సరిగా చూడలేని తల్లులకు కూడా వర్తింపబడుతూ వున్నదని. దీనికి చెల్లించవలసిన ఛార్జి చాలా తక్కువ అని శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారు అన్నారు.

అమెరికాలో కమ్యూనిటీ చెస్టుల ఏర్పాటు, వికలాంగులకు పనులు సమకూర్చే గుడ్‌విల్ ఇండస్ట్రీస్, స్త్రీలు యిళ్ళలో తయారు చేసే వస్తు సామాగ్రి అమ్మకానికి ఏర్పాట్లు చేసే కోఆపరేటివ్ సంస్థలు కూడా ఆమెలో శ్రద్ధాశక్తులను రేకెత్తించినవట.

ఈజిప్టులో మహిళలు కొన్ని సంవత్సరాల క్రితం క్షయ రోగులైన తలిదండ్రుల బిడ్డలకోసం స్థాపించిన ఒక రక్షణాలయంలో 400 మంది బిడ్డలున్నారని ఆమె అన్నారు.

ఇండియాలోని కేంద్రసంఘ సంక్షేమ బోర్డుకు సమకూర్చబడిన స్వయం నిర్ణయాధికారాన్ని గురించి తాను ప్రస్తావించగా అక్కడి సంఘ సేవకులు విశేషంగా ప్రశంసించారని, అటువంటి సౌకర్యం తమకు లేకపోవడం వల్ల ఖర్చుల మంజూరుకు అనవసరమైన విలంబన జరుగుతూ యుందని వారు శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారితో చెప్పారట కూడా.



రాష్ట్ర సంక్షేమ సంఘ సంస్థల అధ్యక్షురాండ్ర ప్రథమ సమావేశం ఢిల్లీలో నవంబరు 11వ తేదీన జరిగింది. రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్‌గారి ప్రారంభోపన్యాసంలోని కొన్ని భాగాలు :

“ నీ దేశం నిన్ను కోరుతోంది ”

# సంక్షేమ కార్యక్రమమే భవిష్యత్తుకు పునాది

—రాజేంద్రప్రసాద్

రాజ్యాంగ ప్రణాళికలో సూచించిన ప్రకారము మన విధులను పూర్తిగా నిర్వహించగలుగుతున్నామా? నిరుద్యోగులకు తగు వుద్యోగమును కలిగించుటలోగాని నిరక్షరాస్యత నిర్మూలనలో కాని ఏరాష్ట్ర ప్రభుత్వమైనా పూర్తిగ కృతకృత్యురాలయిందా? పదునాలుగు సంవత్సరములకు లోబడిన పిల్లలు గనులలోనూ, యంత్రములలోనూ పనిచేయరాదని వుదహరించబడినవి. అట్టి సంక్షేమ కార్యక్రమములలో సంపూర్ణ విజయమును సాధించగలిగామా? అదృష్టవశాత్తూ, మన భారతదేశములో చారిత్రికరీత్యా సాంఘిక సంక్షేమసేవ పురాతనమునుండియూ తరలివచ్చుచున్నదియే! పూర్వమునుండియూ సంఘసేవాభిలాషులు అపూర్వమైనకృషిని సలుపుచున్నారు. యిట్టి కృషిని కావించిన ఉత్తమమార్గదర్శకులలోకి॥ శే॥ గోపాలకృష్ణ గోఖ్లేగారొకరు. 1910 సం॥ములో నేను బారెట్లా చదువుకొనుచుండెడి కాలమున, వారితో నేను సలిపినగోష్టి, వారు జెప్పిన భవిష్యద్దృక్పథములు నిప్పుడు జ్ఞప్తికి వస్తున్నవి. ఆయన నన్ను సంక్షేమసేవకు తీసుకొనబోయే ముందీ విధముగ జెప్పుకొచ్చారు. ''యువతులు, యువకులు తమసేవను సాంఘిక సంక్షేమము కొరకు సమర్పించబోవుదురని నిరీక్షిస్తుండెద'' నని వారు జెప్పారు. అంతేగాక ''నీదేశప్రజలు నీకృషిని మెచ్చుకు తీరుతారు.'' అనిగూడ జెప్పారు. కాబట్టి యువజన సంఘములు సాంఘిక సంక్షేమం విషయంలో కృషిని సలుపడము చాలామంచిది. ఈ సహకార యత్నము ప్రథమంలోనే ప్రత్యేకముగ ప్రజలదృష్టిలో పడినందుకు నేను మిగుల సంతోషిస్తున్నాను. అనేకవిషయములలో నణగియున్న జాతీయ ప్రణాళికలోని సాంఘిక సంక్షేమం శాంతి చిహ్నమై, సుస్థిరముగ నుంచబడినది. సంక్షేమ నిర్వాహక వర్గములవారికి గ్రాంటులనిస్తూ, యితరసహాయ సంపత్తులనుగూడ కలుగజేస్తున్నందుకు కేంద్ర సంక్షేమ సంఘము నభినందించ తగినది. బస్తీ ప్రాంతాలలో సంక్షేమ నిర్వాక సంఘములకు మాత్రమే, తాము ఆర్థిక సహాయము జేయుటచాలదని, గ్రామ ప్రాంతాలలోగూడ నట్టి సాంఘిక సంక్షేమమును విస్తృతీపరచుటకు సంక్షేమకర్తలు కావలసియున్నారని గుర్తించుటకూడ హర్షించదగినది. గాంధీజీ సూచించిన నిర్మాణ కార్యక్రమమే సమర్థనీయమగు నీప్రథమయత్నానికీ, కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్మాణానికీ, గ్రామసీమల సంక్షేమానికి కారణమనుటలో సందేహము లేదు. కాని, నొక్కి జెప్పవలసివస్తే, యీకమ్యూనిటీ ప్రాజెక్టులూ, జాతీయ జీవనములతో బాటు, నిదేరీతిలో రవాణా, రాకపోకల కనువుగ రోడ్ల

నభివృద్ధిపరుస్తూ, సాంఘిక విద్యతోబాటు ప్రజారోగ్యసేవకూడ అవశ్యమై యున్నది. కేంద్ర సంక్షేమ సంఘముయొక్క గ్రామక్షేమ కనుబంధమైన విస్తరణక్షేమ సహకార ప్రణాళిక త్వరితగతిని నొకరోజులో నయ్యేడిది కాకపోయినప్పటికినీ, వారి కార్యక్రమములు జయప్రదముగ నిర్వహించుచున్నందుకు సంతోషిస్తూన్నాను.

భారతదేశం సంక్షేమ రాజ్యమైనప్పటికినీ, ప్రభుత్వోద్యోగులకన్నా సహకారోద్దేశ్యముతో సంక్షేమ సేవజేయుచున్న కార్యకర్తలవలనే నెక్కువ కృషి జరుగుతూంటుంది. అదెంతయో ప్రశంసింపదగిన విషయము. వివిధ రాష్ట్రములలోని సంక్షేమ సంఘములు జరుపు కృషినీ, సంక్షేమ కార్యక్రమములూ కేంద్ర సంక్షేమ సంఘముచే అజమాయిషీ చేయబడుతూంటవి.

కేంద్ర సంక్షేమ సంఘమువారు ప్రతీ రాష్ట్రములోనూ, రాష్ట్రప్రభుత్వముల సహకారముతో, సంక్షేమసలహా సంఘములను నెలకొలిపి, కృషిచేస్తూన్నందుకు చాలా సంతోషిస్తూన్నాను. ఇంతకుముందే కొన్ని సలహా సంఘముల యొక్క స్థాపనము జరిగియున్నది. సదరుసలహా సంఘములవారు సౌహార్ద్రతతో కృషిని సలుపుతూ కేంద్ర సంక్షేమ సంఘముతో సహకరించగలరని భావిస్తాను. యిట్టి సహకారము వలననే కేంద్రసంక్షేమ సంఘము గట్టిగ పనిజేయగలదు. కేంద్ర, రాష్ట్ర సంక్షేమసంఘములు తమ కార్యక్రమమును ఆలస్యముగ మొదలిడినప్పటికిని, ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలములోగానే తమతమ సంక్షేమ సేవలను దిగ్విజయముగ జరుపుదురనియు, మన దేశములోని ప్రతీ జిల్లాలోను సంక్షేమసంఘము లేర్పడి, సంక్షేమ ప్రాజెక్టు ప్రణాళికల నెక్కువగ జేయగలరనీ గట్టిగ నమ్మగలను.

కేంద్ర, రాష్ట్ర సంక్షేమ సంఘములలోని సభ్యులెల్లరకునూ నా శుభకాంక్షల నందజేస్తున్నాను. మీసమావేశం జయప్రదమగుగాక!



# సంఘ సంక్షేమ కృషిలో నూతనాధ్యాయం

శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ వివరణ

భారతదేశపు ప్రథమ పంచవర్ష ప్రణాళికను, యితరదేశములవారి ప్రణాళికలతో పోల్చి చూచినట్లయిన, మన ప్రణాళికను చాలవరకునూ నమలు పరచడమే గాకుండగ, సాంఘిక సంక్షేమ కార్యక్రమముల నిమిత్తము 2,244 కోట్ల రూపాయిలలోనూ 20% వరకునూ కేటాయించడము జరిగియున్నది. సాంఘిక సంక్షేమమునకు సహకరించుటయే ఈప్రణాళికయొక్క ముఖ్యోద్దేశము.

మనదేశములో నీసాంఘిక సంక్షేమము యన్నది కొన్ని శతాబ్దములనుండియు, పురాతన భారతీయ చరిత్రనుండి పరంపరలుగా వచ్చుచున్నదనె చెప్పాలి. మరియు సాంఘిక సంక్షేమకార్యకర్తలూ, సుహృద్భావులూ సహజబుద్ధితో,మతప్రచారకులవవలెననే పట్టుదలతో తమదృష్టిని నిలిపి కృషి జేస్తూండెడివారు. అయినప్పటికినీ, కొన్ని చారిత్రక సంబంధమైన కారణములచేత మనకృషి, పట్టుదలలు క్షీణించినవి. అట్టితరి, ప్రథమ పంచవర్ష ప్రణాళికకు పునాదులు వేయబడినవి. ఈప్రణాళిక యొక్క సదుపాయ సహకారముల వలన, లోగడ సంక్షేమ కార్యకర్తలు సలిపిన సంక్షేమ నిర్మాణ కార్యక్రమములను తిరిగి నమలు పరచడానికినీ, వానిని బలిష్టపరచడానికినీ, జాతీయ ప్రణాళికలోని నీసంక్షేమ కార్యక్రమము ప్రధానముగా యెంచబడుచున్నది. ఈప్రణాళికయొక్క బలిష్టతకై దాని పూర్వపు సహజశక్తి సంపత్తులను కలుగజేస్తూ, శక్తిసంపద నూతన దృష్టిలోనికి తేవలయునని నిశ్చయింప బడినది. యిటువంటి కార్యక్రమములు అనధికార సంక్షేమ సంఘముల ద్వారానే చక్కగ కొనసాగింపబడుతూ ప్రజల హృదయాల కత్తుకొని పోగలవు. కాని, అట్టిసంఘములు గట్టిపునాదులును వేసుకొనుటకు సరియైన నమూనానిస్తూ, తగినంత ఆర్థిక, సంకేతిక సహాయమును యితర సాధన సంపత్తిని కలుగ జేయవలెను. ఇవ్విధమగు సహకార సంస్థలను కేంద్ర సాంఘిక, సంక్షేమ సంఘమునుండి పొంద వచ్చును.

సాంఘిక సంక్షేమము నిమిత్తమై ప్రథమ పంచవర్ష ప్రణాళికనందు కేటాయించబడిన నాలుగుకోట్ల రూపాయిలునూ ఇప్పుడు మనదేశములోగల సుమారు పదివేల సంక్షేమ నిలయములకై వినియోగ పరచుటకు నిశ్చయింప బడినది.

సాంఘిక సంక్షేమ కార్యకర్తలు దేశమంతటా పర్యటిస్తూ వివిధ సేవాకేంద్రములకు తగుసహాయములనిస్తూ, కేంద్రముల కెట్టిసాధన సంపత్తినీయవలయునో మాకు తెలియపరుస్తున్నారు.

ఈసంక్షేమ కార్యక్రమములలో పిల్లలూ, స్త్రీలూ, వృద్ధులూ, అవిటి వాళ్ళునూ వెనక బడిన తరగతులవారు, ప్రధానంగ యెంచబడుతారు. అట్టివారికి కేంద్ర సంక్షేమ సంఘము తగుసహాయ సంపత్తులను కలుగజేస్తుంది.

ఈకొద్ది మాసముల కాలములోనే మన దేశములోని యిట్టిపై సంక్షేమ నిలయములనుండి అసంఖ్యాకముగ దరఖాస్తులు వచ్చినవి. ఈసంక్షేమ నిలయముల పూర్వమే, 14 మాసముల క్రితము ఈప్రణాళికను కొనసాగించుటకు 65 లక్షల రూపాయలను వెచ్చించియున్నాము. ఈమొత్తములో 27.5 లక్షల రూప్యములను 900 సంక్షేమ నిలయముల నిర్మాణాభివృద్ధికిన్నీ, 34.2 లక్షల రూపాయిలను ప్రాజెక్టుల నభివృద్ధి కొరకునూ వినియోగింపబడి, మూడు మాసాలనుండి పనినిసాగించుచున్నాము. మరియు నీప్రణాళికలోనే ప్రాజెక్టుల కొరకై 3.38 కోట్ల రూపాయిలను కేటాయించడము జరిగినది వెచ్చింపబడిన మొత్తము చాలవరకునూ సాంఘిక సంక్షేమాభివృద్ధికొరకునే వినియోగించ బడినది. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో నుదహరింపబడినట్లు, సంక్షేమ నిర్మాణకార్య క్రమములు సక్రమముగ చాలవరకునూ పూర్తియైనవి. యికమీదట నిర్మాణ కార్యక్రమములకు నేపథ్యమైన నాటంకములు కలుగకుండ, సంక్షేమ కార్యకర్తలకు, సంక్షేమనిలయములకు తగు ఉత్సాహమునిస్తూ, సరియైన ఆర్థిక, సహాయ సంపత్తులు చేకూర్చ బడుతవి. ఈసంక్షేమ నిలయములన్నిటికిని సంపూర్ణసహాయ సంపత్తుల నివ్వడానికి కేంద్ర సంక్షేమ సంఘము తీర్మానించినది. గ్రామ సీమల్లోనూ, అనారోగ్య వాతావరణముగల అయోగ్య ప్రదేశముల్లోనూ గూడ సంక్షేమ నిర్మాణ కార్యక్రమములను కొనసాగింపవలయునని తలంచ బడినది. యిట్టిపనిని సంపూర్ణముగ సాగించు నిమిత్తము కేంద్ర సంక్షేమ సంఘమునకై 27 రాష్ట్రములలో సంక్షేమ సలహా సంఘములు (Social Welfare advisory Boards) స్థాపింప బడినవి, అందువలన నిప్పుడు

27 రాష్ట్రములలోని ప్రతినిధులు సమావేశమై చర్చించుకొనుటకు తగిన యవకాశ మేర్పడియున్నది. అనతి కాలములోనే ఈ పైలట్ సంఘములను స్థాపించి, నిర్వాహణ జేయుట కాయా రాష్ట్రములలోని ప్రధానామాత్యులు, సంక్షేమ కార్యకర్తల హృదయపూర్వక కృషి, సహకారములే కారణము. యిక రెండవది వచ్చే ఈ 16 మాసములలోనే, మన దేశములోగల 307 జిల్లాలలోని, గ్రామసీమలలోనూ, కనీసము జిల్లా 1 కి నొకటి చొప్పున సంక్షేమ ప్రాజెక్టుల నిర్మాణము జరుప బడుతుంది.

ఆగస్టు 15 నుంచి నిప్పటివరకూనూ గల నీమధ్యలో 130 ప్రాజెక్టులకు పైగా పనిని మొదలిడి నిర్మాణము సాగించుచున్నారు. ఇంతేగాకుండగ ఈ సాంఘిక సంక్షేమ సంఘముయొక్క దృష్టి నిరుద్యోగ సమస్య పైననూ, స్వల్ప వేతనములపై జీవించువారి కుటుంబముల పైననూ మరలినది. తమకువచ్చు నా స్వల్ప భత్యములపై, కుటుంబ భారమును మోయలేక, గృహిణులనూ, పిల్లలనూగూడ పనులలోకి పంపుతూంటారు. అందుచేత, స్త్రీలు బయటకువెళ్లి భారమగు పనిని జేయవలసిన అక్కర లేకుండగనే, వారి తీరిక సమయములలో జేసుకొనుట కనువగు గృహ పరిశ్రమల నుగూడ నేర్పరచి యున్నాము,

అట్టి స్త్రీలచే తయారుచేయబడిన వస్తువులలోని లోపాలోపములను సరిదిద్దుటకు నొక పరిశ్రమశాలనుగూడ స్థాపించియున్నాము. అగ్గిపుల్లలను తయారుజేసెడి యంత్రశాల నొకదానిని ఢిల్లీలో స్థాపించనున్నాము. దీనిని భారత పరిశ్రమశాఖల మంత్రి, ఢిల్లీ రాష్ట్రప్రభుత్వము స్థానికవర్గము వారు సహాయమునగాని స్థాపించుటకు సాధ్యముకాదు. వారికి మావందనములు తెలియజేయుచున్నాము.

ఇట్టి కార్యక్రమమును సంక్షేమ కార్యకర్తలచే ఇంటింటిలోనూ పనిజేయునట్టి స్త్రీలకు తెలియజేయబడుతుంది. ఈ కార్యక్రమములు దేశములోని పలుప్రదేశములలోనూ వ్యాప్తి జేయబడుతవి. శీఘ్రగతిని సాగుచున్న నీకార్యక్రమముతోబాటు మరొక కార్యక్రమమునుగూడ నెరవేర్పనున్నాము. కాన నిట్టి కార్యక్రమములను సక్రమముగ నిర్వహించుటకై సంక్షేమాభివృద్ధినిగూర్చి, కేంద్రసంఘమునందు అభివృద్ధి, పరిశోధన(Development and Research) శాఖనుగూడ పెట్టియున్నాము. ఈ శాఖ వివిధ దేశములలోని సంక్షేమ సంఘముల విధానములూ, వారి కార్యక్రమములను చదువుట నారంభించినది. ఇట్టి విషయములలో ఒకరినుంచి మరొకరు నేర్చుకొనవలసిన దెంతయినా యున్నది. భారతదేశములో నున్నటువంటి విదేశ మిషనరీలు మనకీ సాంఘిక సంక్షేమము విషయమై మంచి మంచి శక్తి సామగ్రుల నొసగిరి. నేనామధ్య అమెరికా, యిరోపా దేశములు వెళ్లినప్పుడచటి సంక్షేమ కేంద్రముల లోని అధికార, అనధికార ప్రముఖులు సాంఘిక సంక్షేమమునకు సంబంధించిన వాఙ్మయమును పంపుదుమని వాగ్దాన మిచ్చినారు.

మేముకూడా నొక ప్రచురణశాఖను పెట్టియున్నాము. ఆ శాఖనుంచి, సోషల్ వెల్ఫేర్, అను ఆంగ్ల మాసపత్రికను వెలువరించుచున్నాము. వీటితోబాటు సాంఘిక సంక్షేమమునకు సంబంధించిన యితర పుస్తకములనుగూడ ప్రచురించుచున్నాము, మీలో చాలామంది 'సోషల్ వెల్ఫేర్' పత్రికను జూచియే యుంటారని భావిస్తాను అందులోని అభిప్రాయములు, సమీక్షలు మున్నగునవి మిమ్ములనాకర్షిస్తూ ఉపయోగ యోగ్యముగ నుండగలవనే తలుస్తాను. ఇప్పుడా పత్రికను ఇంగ్లీషునుండి తదితర ప్రాంతీయ భాషలలోగూడ ప్రచురించుచున్నాము. ముందు హిందీ, బంగాలీ, తెలుగు, ఒరియా, తమిళ భాషలలో ప్రచురింపబడును. వీటితోబాటు ప్రణాళికసంఘము వారి సహాయముతో "సోషల్ వెల్ఫేర్" "సోషల్ లెజిస్లేషన్" అను పుస్తకములను మరుసటి సంవత్సరమునుండి ప్రచురించుటకు యత్నిస్తున్నాము.

సమత్వముతో మాట్లాడుచున్నప్పుడు సాంఘిక సంక్షేమకర్తలకు తీరని తలనొప్పిని కల్గించెడిది ధనసేకరణీయమని చెప్పక తప్పదు. కార్యక్రమములకు వలసిన ధనమును సేకరించుటకే వారి జీవశ్శక్తులను వినియోగిస్తారు. అట్లు తమ జీవశ్శక్తులను వినియోగపరచుచుతూ, సౌహార్ద్రతతో సమర్థతగా కార్యక్రమములను కొనసాగింపవలయునని యత్నిస్తారు. అప్పటికినీ వారి కార్యక్రమములు వారనుకొన్నంత స్థాయిలో జయప్రదముగ జరుగకుండుటయూ కలదు. తుదకు ప్రజలే కష్టములకు లోనగుదురు. దురదృష్టవశాత్తూ ప్రజలకు నీ ప్రణాళిక నవగాహన కాకుండుటయూ, వారిని తగు సంతృప్తులుగ చేయకపోవుటయూ కారణమై యుండును. వివిధ రకములుగ వివిధ కార్యక్రమములకు చందాల నడుగుట ప్రజలకు తెలిసినవిషయమే! ఈ రీతిగ నెన్నియో కార్యక్రమములవారు అడిగినవారినే చందాలనడుగుచుండిన కారణముచేత, సంక్షేమకర్తలు తాముగూడ వారివలననే ధనమును సేకరించుట సాధ్యముకాదని ఎరుగుదురు. కాబట్టి

# సంఘ సంక్షేమ కృషిలో నూతనాధ్యాయం

వివిధ కార్యక్రమ నిర్వాహణకర్తలూ, సంక్షేమకర్తలూ నొకటికజేరి ప్రజానుకూలముగ, ప్రజాక్షేమాన్నే కాంక్షించుతూ సంవత్సరములో పేర్కొనబడిన కాలములందు ధన సేకరణ జేయుట మంచిది.

ఈ మధ్య నేను యునైటెడ్ స్టేట్సులోని "కమ్యూనిటీ చెస్టు"లు సాగించెడి కార్యక్రమాన్ని జూచాను. వారు పనిజేసినట్లుగ దీక్షా తత్పరులమై, మనమెందుకు పనిజేయరాదనెడు తలంపు కల్గుచున్నది. నిజానికీ ధన సేకరణ యన్నది క్రొత్తపద్ధతి కాదు. మనదేశములోని కొన్ని గ్రామపంచాయతీలు, జాతిసంఘము లీరీతిగ సంక్షేమము నిమిత్తమై చందాలను సేకరిస్తూ, కొంత కొంత విజయాన్ని సాధించినవి.



నా ఈ ఉపన్యాసము ముగిసేలోగా మరొక విషయముగూర్చి సంక్షిప్తముగ చెప్పదలిచాను. అదేమనగ, మనద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఈ ప్రథమ ప్రణాళిక కాలంలో, సాంఘిక సంక్షేమ కార్యకలాపములనే ప్రధానముగ తలచి, వాటికై కృషిసలిపినాము. కాని, యింకనూ నెన్నియో పనులను నిర్వహించవలసి యున్నది. నెన్నియో కార్యక్రమములను సలుపవలసియున్నది. సాంఘిక సంక్షేమాన్ని విస్తృతపరచడంలో నింకనూ వెనుకబడియున్నాము. దీనిని బహుళవ్యాప్తి కావించుటకు, విశేషము కృషిని సలుపవలసియున్నది. కాని, యిట్టి కార్యము త్వరితకాలంలో స్వల్ప ప్రయాసలతో కొనసాగింపబడుట కష్టము. అర్థశాస్త్రజ్ఞులు నొక పురుషాంతములోగా జాతీయ రాబడులను పెంచవచ్చునని తలచుదురుగాని, సాంఘిక సంక్షేమముండుటవలననది సాధ్యముకాదు. మీరుదాహరణముకై, ముఖ్యమైన పిల్లలసంక్షేమాన్ని తీసుకోండి! అది అన్ని రాష్ట్రములలోనూ సంవత్సరము పొడుగునా నిర్వహింపవలసి యున్నదే! రెండవది స్త్రీ సంక్షేమాన్నిగూడా ప్రధానంగ తలంచవలసినదే! తరువాత వికలాంగులు, మతి స్థిరము లేనివారు, నిరాశ్రయులు సంక్షేమాన్నిగూడా ప్రధానంగ భావించి పాటుబడవలసియున్నది. మతిచెడినవారు, రోగపీడితుల యొక్క సంక్షేమాన్ని ముఖ్యవిషయంగా గమనించి, వారికెంతత్వరితకాలంలో వ్యాధిని నివారింపజేస్తే బాగుంటుందోనని యూహిస్తూ, సుహృదయంతో ప్రతీఒక సంక్షేమకర్తవారికై పాటుపడాలి. జనాభా పెరిగినకొలదీ, సాంఘికసంక్షేమం విస్తృత మవుతుంది.

రాబోవు ప్రణాళికలో కేంద్ర సంక్షేమసంఘముయొక్క తీర్మానము, దేశములో బహుళవ్యాప్తితమైన సంక్షేమ సంఘములయొక్క ఆశయములూ విజయవంతముగ కొనసాగింపబడగలవని విశ్వశిస్తూన్నాను.

---

రాష్ట్ర సలహాసంఘ అధ్యక్షుల సమావేశమునకు వచ్చిన ప్రతినిధులు ఓక్లా (ఢిల్లీ) వద్దనున్న కమ్యూనిటీ కేంద్రములో గ్రామబాలుడు చీర నేయుట తిలకిస్తోన్న దృశ్యం.

# మరపురాని దీనబాంధవులు

**'సోషల్ వెల్ఫేర్' పత్రికా సంపాదకురాలు శ్రీ ఫ్రెడాబెడీగారు యిటీవల దక్షిణ భారత మధ్యప్రదేశ్‌లలో జరిపిన పర్యాటనానుభవాలను కొన్నిటిని వివరించారు.**

"దీనిపేరు శారదాదేవి. నా ఆశ్రయంలోకి వచ్చిన మొదటిపాప. తలిదండ్రు లెవరో తెలియని అనాథ" అంటూ స్వామి బంతిలా ఎగిరి పడుతున్న తొమ్మిది మాసాల బిడ్డను పితృతుల్యమైన వాత్సల్యంతో చూపారు.

త్రివేంద్రంలోని రామకృష్ణ మిషన్ ఆసుపత్రిని దర్శించడానికి నేను, శ్రీమతి తంగమ్మ నిశ్చయించుకొన్నాము. అక్కడ బక్కపలచగా యింకా పిన్నవయస్సులో వున్న స్వామి తన సంరక్షణలో వున్న ఆబిడ్డను చూపించారు.

"ఇక్కడ అనాథలైన బాలలకు ఒకమందిరం వుండడం అవసరమని నేనుగ్రహించాను. కాని ఒక్క బిడ్డకంటె ఎక్కువమందినిసంరక్షించ తగినంత డబ్బులేదు. ఈబిడ్డ ఆలనా పాలనలకు రాత్రి ఒకనర్సు, పగలు ఒకనర్సు వున్నారు. చిన్న తోటవుంది. ప్రతినెల బిడ్డకు పాలకోసం పండ్లరసంకోసం, తిండికి, విటమినులకు ఇరవై అయిదు రూపాయలు ఖర్చు పెడుతున్నాను" అన్నారాయన.

మేము మిసమిసలాడుతున్న శారదవంక చూశాము. శూలాల్లాంటి ఆమె కళ్లలో ప్రశాంతి వుట్టిపడుతూవుంది.

"బిడ్డ పోషణలో అనుసరిస్తున్న ప్రమాణాలను తగ్గించబోను" అని స్వామి అన్నారు నిశ్చలంగా. మేము ఆయనతో ఏకీభవించాము. ఇదే నిజమైన దేశ నిర్మాణకార్యక్రమం.

"శారదకు పద్దెనిమిది నెలలు దాటగానే తీసుకొని పెంచే తలిదండ్రులు లభించారు. ఆ తర్వాత మరి యిద్దరు బిడ్డలనో, ముగ్గురు బిడ్డలనో, సంరక్షించడానికి పూనుకొంటాను."

స్వామి సిద్ధహస్తుడని మేము గ్రహించాము. దక్షిణాదిని పూర్తిగా పర్యటించి పెక్కుచోట్ల చిన్నవీ, పెద్దవీ శరణాలయాలను చూసిన మీదట స్వామి యింతవరకు అపరిష్కృతంగా వుండిపోయిన ఒక పెద్ద సమస్యను బిడ్డలను క్రమబద్ధమైన శాస్త్రీయపద్ధతులలో పోషించడానికి పూనుకొనడంద్వారా పరిష్కరించబూనుకొన్నాడని గ్రహించినాము.

సమగ్ర సాధనసంపత్తిగల కొన్ని సంస్థలలో మేము చూసిన బిడ్డల పరిస్థితి హృదయ విదారకంగావుంది. చిక్కిశల్యమైవున్న పిల్లలే వారిలో ఎక్కువ. అసలు సంస్థలలోకి ప్రవేశించేటప్పుడే వారు ఎముకల గూళ్లలావుంటారు. వారిని కాపాడడమే దుర్ఘటకార్యం. నేను చూసిన రెండు పెద్ద సంస్థలలోనే చేరిన బిడ్డలలో సగంమంది మాత్రమే బ్రతికి బట్టకడతారని చెప్పారు. ఇక చిన్న సంస్థలలో మేము ఈ ప్రస్తావనే చెయ్యలేదు.

మామూలుగా తలిదండ్రులకు పుట్టిన బిడ్డకో, తలిదండ్రులచే ఏకారణంవల్లనో, దుర్వ్యాధివల్లనో వదిలివేయబడిన పిల్లలకు తేడావుంది. ఇటువంటి బిడ్డలలో చాలమంది పుట్టుకతోనే ఏవో రోగాలతో బయటపడతారు. కొందరు చింత,

చికాకులతో నలిగిపోయిన తల్లులకు పుట్టిన వారు కొందరు, వివాహితలకు, లేదా అవివాహితలకు పుట్టినవారు, విపరీతమైన క్రూర విధి విధానానికి బలియై పుట్టగానే తల్లులచే వదిలి వేయబడిన బిడ్డలు ఎన్నో తరహాలుగా వుంటారు. ఆ బిడ్డ సంస్థల కంటపడేసరికే ఆహారం లేక చిక్కి సగమైపోయివుంటుంది. ఈ పరిస్థితులన్నీ మనం గమనించవలసినవైతే, మన దేశంలోని పరిస్థితులకు అనుగుణంగా స్థానికంగా, చౌకగా దొరికే ఆహార పదార్థాలతో శిశు పోషణను సాగించడం విషయమై మనం అంత శ్రద్ధతీసుకోలేదనే అభిప్రాయంమట్టుకు నా మనస్సులో గాఢంగా నాటుకుపోయింది. బహుశా ఆహార, పోషణ సమస్యలలో నిపుణులైనవారికి, వైద్యులకు సంఘ సేవకులమైన మనం ఎదుర్కొంటున్న సమస్యల భోగట్టాను సేకరిస్తున్నామనే చెప్పవచ్చునేమో.

ఏమైతేనేం శారద అదృష్టవంతురాలు. పాలు, ఫలరసం, ప్రత్యేకం శ్రద్ధాసక్తులతో సంరక్షణ లభించాయి. మానవ సంరక్షణలో స్వామి కొత్త తెన్నులను పరిశోధించి చూస్తున్నారు. పుస్తకాలనుంచి గ్రహించడంవల్లనే కాక, తన రక్షణలోకి వచ్చిన బిడ్డలలో మానవ ప్రకృతిలోని మహిమతిశయాన్ని వెలుగుకు తెచ్చే దివ్య దీప్తులద్వారాకూడా ఆయన పరిశోధనలను కొనసాగించగలుగుతున్నారు.

శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిని ఆమె యింటనే కలుసుకొన్నాను. మద్రాసు రాష్ట్రంలో మహిళల సాంఘిక హక్కులకోసం పోరాడిన విదుషీమణి ఆమె.

ఆమె తనూలత అప్పుడే వంగనిది. శిరోజాలు నెరిసిపోయినవి. చూపుకూడా సరిగా ఆనడంలేదు, కాని ఆమె మందహాసం చేసినపుడు-మాట్లాడినపుడు మేముమాట్లాడుతున్న వ్యక్తి సామాన్యురాలుకాదని వెంటనే తట్టింది.

"అవ్వై శరణాలయంలో ఆశ్రయం కోరి వస్తున్న అనాథ స్త్రీల సంఖ్య ఆరోజుకారోజు హెచ్చి, నాకు ఆందోళన కలిగిస్తున్నది. శరణాలయంలో శిక్షణపొందినపిమ్మట వీరికి పునరావాస కల్పన మరొక పెద్ద సమస్యగా ఔతున్నది, పట్న వాసానికి ఏళ్లతరబడిని అలవాటుపడిపోయిన వీరిని తిరిగి గ్రామాలకు పంపడం కష్టసాధ్యమౌతున్నది." అని ముత్తులక్ష్మిరెడ్డి అన్నది.

ఇంతకంటె ముఖ్యమైన, అసాధ్యములుగా తోచిన సమస్యలను పరిష్కరించిన శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిని "అయితే ఈ సమస్య నెలా పరిష్కరించదలచుకొన్నా?"రని ప్రశ్నించాను.

"అనాథ స్త్రీలకు, వారి బిడ్డలకు మద్రాసు రాష్ట్రంలోని ప్రతి జిల్లాలోను ఒక్కొక శరణాలయాన్ని స్థాపించడంద్వారా. ఆ శరణాలయాలు పట్నాలలోగాక గ్రామాలలోనే వుంటాయి" అని ఆమె జవాబిచ్చారు.

ఆమె అన్నట్లు జిల్లాకొక శరణాలయం వుండగలదు. పంచవర్ష ప్రణాళిక ముగిసే లోపుగా సాంఘిక సంక్షేమ ప్రణాళికలో రాష్ట్ర విస్తృతంగా వ్యాప్తంకావడంతో, ప్రతీ ప్రాజెక్టు నిర్వహణ సంఘం కనీసం ఒక శిశు రక్షణాలయస్థాపనకైనా ఏర్పాటుచెయ్యడంతో అవి ఆతర్వాత పెద్ద కేంద్రాలుగా రూపొందగలవు.

మద్రాసులో ప్రతి ప్రాజెక్టు ఏదో కేంద్రాల యూనిట్‌గా విభాగించబడుతుంది.

తమకు ముట్టిన కట్నం తృప్తికరంగా లేదనో, మరోసారి కట్నం సంపాదిద్దామనే ఆశతోనూ, చదువుకొన్న భార్యకోసం ఆశపడు భర్తలు చదివివేసిన భార్యలందరి పట్ల కాకున్నప్పటికీ, మొత్తంమీద స్థానికంగా ప్రజల సానుభూతి ఎక్కువగా లభించడానికి అవకాశంవున్నందున యిట్టి రక్షణాలయాల స్థాపన కష్టంకాబోదు.

డాక్టర్ రెడ్డి తలపెట్టిన ఈ కార్యక్రమం ఎలా అమలుజరగగలదని మీరు ప్రశ్నించ వచ్చు. డాక్టర్ రెడ్డి అసమాన కార్యధురం ధురాలు కావడంవల్ల, దేశంలోని సంఘ సంక్షేమ శాఖలలో ఒక సమర్థమైన శాఖ అండ దండాలు చేకూరడంవల్లను ఆమె ఫలించ గలదు. దేవదాశి విధానాన్ని నిర్మూలించ డానికి ఆమె నడుముకట్టినపుడు ప్రతికూల శక్తు లెన్నో ఎదురైనప్పటికి, రేడియంకోసం క్యూరీలు పాటుపడినట్లే అవి రామకృపిసల్పి ఆమె. ఆమె భర్తకూడా కృతకృత్యులైనారు. శాసనాలు చెయ్యబడ్డాయి. యువజనం ఆమెకో విశేషమైన చేయూతనిచ్చి తదాశయ సాఫల్యానికి మార్గాం పెట్టారు.

దక్షిణాదిని ఆమె పేరు ప్రఖ్యాతులు యింటింటికి ప్రాకినవి. దేశం అంతటికీకూడా తెలియవలసిన వ్యక్తి ఆమె. ఆమె వయస్సు 70 ఏళ్ల దాపున వున్నప్పటికీ కొత్తగా ఏర్పడ్డ కాన్సర్ పరిశోధనశాలాభవనాలే ఆమె కార్యదీక్ష సాధించదగు విజయాలను సూచిస్తుంది.

కాన్సర్ పరిశోధనాలయంలోని ఆపరేషన్ థియేటర్స్‌ను, యిప్పుడిప్పుడే సమకూర్చబడుతున్న యక్సరే యంత్ర సముదాయాన్ని, కాన్సర్ రోగులకు ఉచిత చికిత్స చెయ్యడానికి సిద్ధపడ్డ వైద్యుల పేర్లను చూశాము. మరొక నెలలో మద్రాసులో కాన్సర్ రోగులచికిత్సకు యితోధిక సౌకర్యాలు సమకూడగలవు. ప్రతి ఏడెనిమిది మంది పురుషులలో ఒకపురుషుడు, ప్రతి ఆరుగురు స్త్రీలలోను ఒక స్త్రీ కాన్సరు వ్యాధికి బలౌతూ వుంటారనే సంగతి మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. ప్రారంభదశలోనే చికిత్స జరిగితే—?

అవ్వై శరణాలయం డాక్టర్ రెడ్డి యింటికి దగ్గరగా—ఆయింటిలోని ఒక భాగంగానే వుండడం కూడా గమనించదగ్గ విశేషమే. ఆమెరక్షించిన అనాధలు ఆమె పెంచుతూన్న బిడ్డలు—అంతా ఆమె కుటుంబమే. ఆమె కుమారుడు, కూతురు, కోడలు మనవలు ఎంతో వారందరూ ఆమెకంతే.

ఆంధ్రదేశంలో నాకు మరొక డాక్టరు కనిపించింది. ఆమె నడివయస్సులో వుంది. శిరోజాలు అప్పుడే కొంచెంగా నెరుస్తున్నాయి. పైకి మరొక సంఘసేవకురాలుగానే కనిపిస్తుంది కాని నెల్లూరు దగ్గర రాళ్లు రప్పలతో నిండిన దారులలో ప్రయాణం సాగించిన సందర్భంలోనే ఆమెలోని గుణవిశేషాన్ని కనుగొన్నాను.

అప్పటి కప్పుడే చీకటి పడిపోయింది. ఆరాత్రి రైలుకే మేము ప్రయాణం పెట్టుకొన్నాము. నెల్లూరు జిల్లా సంఘ సంక్షేమ పథకంలోని నాలగవ గ్రామ కేంద్రాన్ని చూసి నెల్లూరుకుతిరిగివస్తూదారితప్పాము. అది వెన్నెల రాత్రి కనక చివరకు మాజీప్ డ్రైవరు దారి తెలుసుకో గలిగాడు. ముందుదారి తెలుసు ననుకొన్నాము కాని ఆతర్వాత చూస్తే ఆ

చోంక ప్రాంతములో తిరుగాడ వలసి వచ్చింది.

ప్రాజెక్టు నిర్వాహకురాలుగా డాక్టర్ లక్ష్మి ప్రసూతి కేంద్రాల సంస్థాపనకు నెల్లూరుజిల్లా లోని గ్రామాలను ఎన్నుకొంది. నిజానికి ఆగ్రామాలకు సరియైన మార్గాలు, ప్రయాణ సౌకర్యాలు లేవు. అయితేఆమెలో అదేమో వినూత్నమైన ఉత్సాహం, అచంచలమైన విశ్వాసం, సాహసం కనిపించాయి. వీటిని ఆమెలోని ఆంధ్రతేజంగా పేర్కొన వచ్చునేమో! ఈ ఉత్సాహమే గ్రామసీమలలో జరిగిన అనేక సమావేశాలలో మాకు కనిపించింది.

'మేము నవభారత నిర్మాణాన్నే సాగిస్తున్నాము. దేశమంతటికీ మేము స్థాపించినది చూప దలచుకొన్నాము.' అని అన్నట్లుగా ఆ ఉత్సాహం తోపించింది.

ఒకగ్రామంలో సంపన్నులుంటే కేంద్రస్థాపనకు యిల్లు సమకూర్చారు. మరొక పేద గ్రామంలో ప్రజలంతా కలసి, పాఠశాల కోసానికి చిన్న యిల్లు నిర్మించారు. అడగడమే తరవాయిగా ఆగ్రామాలలో స్థలం లభించింది. సహాయం చెయ్యడానికి అనేకమంది ముందుకు వస్తారు. కనీసం ఆంధ్రదేశంలోని గ్రామాలలో సంఘసేవకులైన స్త్రీలు దొరకరనే పరిస్థితి వుండదనే నా అభిప్రాయం.

ఇటువంటి పరిస్థితులలో ఆంధ్ర సంఘ సంక్షేమ శాఖాధ్యక్షురాలు శ్రీమతి అన్నప్రగడ చెన్నఘంటమ్మగారు ఆంధ్రమహిళ అయి వుండడం ఆశ్చర్యంకాదు. ఆమె చాల ఏళ్ల నుంచి ఆంధ్రమహిళాసభ అభివృద్ధికి కృషి చేసిన వారిలో ఒకరు. ఆంధ్రమహిళాసభ విద్యా కేంద్రంగా, శిక్షణకేంద్రంగా, కళాశాలగా, నర్సింగ్ హోంగా ఈనాడు రూపొందింది.

ఆంధ్రలో అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణ అత్యంత విశిష్టమైనది. ఇతర రాష్ట్రాలలో ఈమాత్రంకృషి కొన్నింటిలో మాత్రమే జరుగుతూవుంది. ఇంచు మించుగా అన్ని ప్రాజక్టులకు ఆంధ్రదేశంలో మూడు నాలుగు కేంద్రాలున్నాయి.

"మనం త్వరలోనే దారికనుక్కొంటాము." అంది డాక్టర్ లక్ష్మి.

"జీప్ కారులో సుఖంగా నిద్రపోవచ్చు" అన్నారు నవ్వుతూ అధ్యక్షురాలు. నవ్వుతూ జమునాబాయిజీ ఉన్నట్లుండి తినడానికి ఆహార పదార్థాలను తీశారు. ఈలోగా డ్రైవరు (విద్యార్థి) ఎలాగైతే ఆడొంకల చుట్టు తిరిగి తిరిగి దారిని కనుగొన్నాడు. మాకు రైలు దొరికింది.

నాలుగో వ్యక్తిని నేనుచూసినది మధ్యప్రదేశ్ లోని దత్తపూర్ లో. సుమారుగా 20 ఏళ్ల వయస్సులో వున్న ఆ అమ్మాయి దత్తాపూర్ లోని కుష్ఠురోగ చికిత్సా కేంద్రాలలో పిల్లల శాఖలో నర్సుగా పనిచేస్తున్నది. మేము వెళ్లేసరికి ఒక చిన్న బిడ్డను ఆమెఎత్తుకొనివుంది. వరండాలో కొందరు అబ్బాయిలు అటుయిటు పరుగులిడుతున్నారు. ఒకమంచం మీద ఒక పాప వుంది. మరి కొంచెం దూరంలో ఒక చిన్న మంచంపై ఒక బిడ్డ ఎండలో పడుకొని వుంది.

కుష్ఠువ్యాధి పీడితులైన తలి దండ్రులకు పుట్టిన ఈబిడ్డలకు ఆవ్యాధి సోకకుండా కాపాడడంలో ఆమె మాకు సాయంచేస్తున్నదని బాపూవలె వున్న ఆ ఆశ్రమాధిపతి అన్నారు. ఆయన శ్రీ దేవన్. ఇప్పటికీ సేవాగ్రాం ఆశ్ర

మం సభ్యుడు. గాంధిజీ కార్యక్రమాన్ని మధ్య ప్రదేశ్ గ్రామాలలో నిర్వహిస్తున్నారు.

"ఈబిడ్డలెవరూ కుష్ఠువ్యాధితోనే పుట్టలేదు. ఇది వంశానుగతంగా ప్రాప్తించే జబ్బుకాదు. కలసి మెలసి తిరగడం వల్లనే సంక్రమిస్తుంది. ఈబిడ్డలను వారి తల్లులతో సంబంధం లేకుండా వేరే అట్టేపెట్టి పెంచితే యితర బిడ్డల మాదిరిగానే పెరగగలరు. ఈ అమ్మాయి భర్త ఆసుపత్రిలోనే వున్నారు. తన భర్తతో కూడా తాను యిక్కడే వుంటానని పట్టుపట్టింది. ఇక్కడ వుండి పిల్లలను చూస్తుండమని చెప్పాను" అని ఆయన అన్నారు.

ఆమె నేత్రాలలో సంతృప్తి కనిపించింది. ఆమె మెడలో నెక్లస్, చేతికి బంగారు గాజులు వున్నాయి. రోగిష్టి భర్త శుశ్రూషకి జీవితాన్ని ధారాదత్తంచేసిన అపరమ సాధ్వీకంటె భారత నారికి సంప్రదాయ సిద్ధమయిన ఆ ఆభరణాలు ధరించే అధికారం ఎవరికి కలదనుకొన్నాను.

"మనం వార్డులలో తిరిగి నపుడు ఆమె భర్తను మాకు చూపించలేదు. ఆయన ఏమనుకొంటాడో అని ఊరుకొన్నా" నన్నారు శ్రీ దేవన్.

నేను చూసిన ఈ నలుగురు నాలుగు రాష్ట్రాలలోని ప్రధాన సమస్యలకు ప్రతికా ప్రాయులుగా కనుపించారు.

అంతులేని యిసుకబయళ్లు, మనోజ్ఞమైన తాటితోటలతో నిండిన తిరువాన్కూర్ కొచ్చిన్ సంస్థానంలో మితిమీరిన జనాభా, పెక్కుమంది యిక్కడనుంచి బ్రతుకుతెరువుకోసం మదరాసుకు వస్తారు. ఈ ప్రాంతంలోని పెద్ద పట్టణాలలో నేరాలుచేస్తువుండే కుర్రవాళ్లు నూరింట 30 లేక 40 మంది మలబారునుంచి వచ్చినవారే. ఈ సంస్థానంలో శిశుసంక్షేమం ముఖ్య సమస్య. అనాధలైన శిశువుల సంరక్షణకూడా దీనికి సంబంధించినదే. రాబడిలేక, భూస్థితి లేక, ఉద్యోగాలు లేక ఎక్కడెక్కడ ఎందరు బాధపడుతున్నది తెలుసుకొంటేనేగాని, చౌకగా దొరికే ఆహారపదార్థాలతో, పోషణ విధానాలను సూచించడానికి అవకాశంవుండదు.

క్రిందటి తరంలో ఇండియా ఎదుర్కొన్న సమస్యలన్నిటికి మద్రాస్ నాకుప్రతిక ప్రాయంగా కనిపించింది. శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిలో కాలగతిలోని పరివర్తనం, డాక్టర్ లక్ష్మిలో అసమానమైన ఆంధ్ర నవోత్సాహం, దత్తపుర్‌లోని 'అజ్ఞాత సతి'లో యిప్పటికీ తీరని కుష్ఠు వ్యాధి సమస్య దృగ్గోచరమైనాయి.

వైద్యులు చేసే చికిత్స మాట అలావున్నప్పటికీ తమ్ము ఆదరించాలని, మంచిమాట ఆడాలని ఆరాటపడే కుష్ఠురోగుల కోర్కెలు, అవసరాలు ఎవరు తీర్చగలరు! ఎవరు వారి కుటుంబాలను—తాము చికిత్సపొందుతున్న సమయంలో పోషించగలరు? చికిత్స పూర్తిఅయిన పిదప ఎవరు వారిని సంఘంలోనికి తిరిగి రానిస్తారు. వారు యాచనకు పాల్పడకుండా స్వతంత్రంగా జీవించడానికి ఎవరు తోడ్పడతారు.

మధ్యప్రదేశ్ లోని 'అజ్ఞాతసతి'—భారతేతిహాసాలలోని పరమ సాధ్వీమతల్లులుభర్తలతో ప్రవాసానికి, ఖైదుకు, వనవాసానికి వెళ్లిన పతివ్రతలు నా మనోవీధిని పొడకట్టారు.

●



# అత్తార్ సింగ్

"అత్తార్ సింగ్ జోళ్లు ఎవరేనా చూశారా?" అంటున్నాడు మహమ్మద్ అఫ్‌జల్ ఒకరోజు. ఆరోజు జోళ్లులేని కాందిశీకులకి అమూల్యమైన మిలటరీ బూట్లు పంచుతున్నాం. 1947-48 సంవత్సరంలో జాలనేదే లేకుండా కాశ్మీరంలో ప్రవేశించిన శీతాకాలపు రోజులవి. అప్పటికే ఒక నెలనుండి మంచుదట్టంగా పడుతూంది. ఇంకా రెండునెలలపాటు యిలాగే పడుతుంది.

నిజానికి అత్తార్ బూట్లు ఎక్కడున్నాయో నాకు తెలియదు. నేచూడలేదు. ముజఫరబాద్ సరిహద్దు ప్రాంతాలనుండి వచ్చిన కాందిశీకుడు అత్తార్ సింగ్. నేపని మొదలు పెట్టిన తొలిరోజులలోనే నాదగ్గరకి వచ్చాడు, సహాయంగా వుంటానని. "అక్కడ పల్లెటూరిలో స్కూలు మేస్టరుగా వుండేవాడిని" అంటూ తాను వదలి వచ్చిన ప్రపంచం కేసి చేయిచాపేడు. అతని సహాయం నాకెంతో కావాలి. మాకు కొంచం కష్టమైన పనులు సరిదిద్దే వ్యక్తులు కావాలి అప్పట్లో.

ఆఫీసులో చాలామందే గుమిగూడి వున్నారు. "భాటిబాద్‌షాహీలో పిల్లలకి పాలు ఎవరు పంచుతారు?" అడిగాను నేను. నాకు తెలుసు: అన్ని పనులలోకీ యిది అతి కష్టమైనది, ప్రతీరోజూ ఉదయాన్నే దారుణమైన మంచులో ఆరుమైళ్లు నడిచివెళ్లి, రాత్రి మళ్లీ తిరిగి అంతమారం నడిచి రావాలి.

"నే చేస్తాను" అంటూ ముందుకి వచ్చాడు అత్తార్ సింగ్. మాకందరకీ సన్నిహితం అయిపోయింది అతని చిరునవ్వు.

ఆరోజు మొదలు శ్రద్ధాశక్తులతో ఆపని నతడు నిర్వహించాడు. ఆప్రాంతపు పిల్లల ఆరోగ్య అనారోగ్యాలని గురించి ఎంతో శ్రద్ధ తీసుకొని, తాపత్రయ పడేవాడు. అతని ఒకే ఒక ఎఱ్ఱతలపాగా, అతని చిరునవ్వూ అందరికీ ఆనందాన్నిచ్చేవి. మేం చూపిన కన్నీళ్లకి అంతులేదు. అందుకే అతని ఆనందకరమైన ముఖం అందరికీ ఆనందాన్ని యిచ్చేది.

"అతనెంతో దూరం నడవవలసి వుంటుందే" అంటూ తిరిగి ప్రారంభించాడు మహమ్మద్ అఫ్‌జల్. నేనా బూట్లకేసి చూశాను. వాటికి మడమేలేదు, బూట్లు అడుగున నోరుతెరుచుకొన్నాయి. చిరిగిపోయిన మేజోడులోనుంచి ఎఱ్ఱగా వాచిన పాదం కనిపిస్తూంది. నేవూరుకున్నాను. ఏంచేస్తాం: బూట్లంటూవున్నాయి, అంతే. అప్పుడే కాందిశీకులు హృదయాలు ద్రవించేలా వారికష్టగాథలు చెప్పడం. ఎప్పుడూ యీ అత్తార్ సింగ్ జీవితకథ వినడం జరగలేదు. "నీ కథచెప్పు అత్తార్ సింగ్", ఆతృతాన్ని కల్గిన ఉద్రేకంలో అడిగాను. మానుతున్న గాయాలని కెలకడం నా ఉద్దేశంకాదు, కాని, అత్తార్ సింగ్ ఎంతో ప్రశాంతగా కనుపిస్తాడు. అతని గాథ అంత దారుణమైనది కాదనే భావన కల్గిందినాకు. "నే ఏకాకిని," అతనన్నాడు. "నాకళ్లముందే నాకొడుకు లిద్దరిని దోపిడీవాళ్లు కాల్చి చంపారు. నాభార్యని అపహరించారు. ఇంకో యిద్దరు చిన్నకుర్రాళ్లనీ, మూడేళ్ల పిల్లనీ.... అందరినీ కోల్పోయాను. నా భార్యనుగురించే నాకాందోళన ఎక్కువ—ఆమె ప్రసవించే రోజులవి.... ఆచిన్నపిల్ల...." అతని గొంతు బొంగురు పోయింది.

"మరి నువ్వెప్పుడూ ఎంతో హాయిగా కన్పిస్తావు. కష్టపడి పనిచేస్తావు," అన్నాను. ఇంక ఎక్కువ ఏమీ చెప్పలేకపోయాను.

"నేను పనిచెయ్యకపోతే, నన్ను నేను రక్షించుకోడం ఎలాగ?" చాలా తేలికగానే అన్నాడు.

"అజ్ఞాత వీరుడు"

అంతే ఆసంగతి మళ్లీ మేము జ్ఞాపకానికి తెచ్చుకో లేదు. కాని పాల పంపకం జరుగుతూనే వుంది. వేసవి తొలిరోజులలో ఒక ఉదయాన, చేతిలో ఒక ఉత్తరంతో అత్తారుసింగ్ నా దగ్గరికి వచ్చాడు, ముఖం ఉత్సాహంతో కాంతివంతంగా వుంది.

"నా భార్యదొరికింది. ఆమెని తీసుకు రాడానికి అమృతసర్ వెడుతున్నాను" అని చెప్పాడు అత్తార్ సింగ్.

అమృతసర్ పోడానికి సరీసరి పొనంత డబ్బుంది; పంజాబ్‌లో పనిలేదు; అయినా అత్తార్ సింగ్ వెళ్లాడు.

కొన్నాళ్లకి సంతోష పూర్వకమైన ఒక పోస్టుకార్డు వచ్చింది నాకు, ఢిల్లీనుంచి— "నాభార్య అమృతసార్‌లో ఒక పిల్లవాణ్ణి కంది. నేను ఢిల్లీలో పనిచేసుకోవడం ప్రారంభించాను" అని.

ఇదంతా ఐదు సంవత్సరాల క్రితం మాట. ఈమార్చిలో మా సంపాదక వర్గం "అజ్ఞాత సైనికుడు" శీర్షిక ప్రారంభింప నిశ్చయించింది. అతక్షణాన్నే నా స్మృతిపథాన అత్తార్ సింగ్ మెలిగాడు. అత్తార్ సింగ్ ఏమైపోయాడో అన్నాను. అతని గురించిన ప్రస్తావనలో.

ఒకరోజు మధ్యాహ్నం అత్తార్ సింగ్ నా ఆఫీసులో అడుగు పెట్టాడు. అదేచిరునవ్వు అతని ముఖాన్ని అలంకరించి ఉంది. కాని తెల్లటి తలపాగా చుట్టుకున్నాడు. అతనిగెడ్డం అప్పుడే అక్కడక్కడ తెల్లపడుతోంది.

"ఢిల్లీలో వున్నారని విని, ప్రతియిల్లూ మీకోసం వెతుకుతున్నాను." అన్నాడు వస్తూనే. "నీకుటుంబం?" నేనే ఒక ప్రశ్నార్థకంగా అడిగాను.

"నా యిద్దరు కుర్రాళ్లూ నాలుగు సంవత్సరాల అనంతరం దొరికారు. నా చిన్నకూతురు కూడా 'జేబీ' యిప్పుడు స్కూలుకి వెడుతూంది. నేను 'డ్రైక్లీనింగ్' వ్యాపారం ప్రారంభించాను. స్వంతవ్యాపారం మంచిది కదూ." ఇదంతా చెప్తూంటే అనంతమైన సంతృప్తి అతని కంఠస్వరంలో ధ్వనించింది.

## మన ఎరుకకురాని వీరులు

పేరు ప్రఖ్యాతులుకాంక్షించక ప్రజాసేవ గావించేవారు అందందు ఎందరో వుంటారు.

ఏ మారుమూల గ్రామంలోనో, కాందిశీకులమధ్యో లేక ఏ బస్తీలోనో అపార సేవ గావిస్తూ, ప్రజాదరణను పొందుతుండే స్వార్థరహితులగు సంఘ సేవకులనుగూర్చి మనలో చాలామంది ఎరిగివుంటారు.

వారు పెద్ద సంస్థలు నడపకపోవచ్చు. సామాన్యజనులు కృషి చేయలేని అసాధారణ పరిస్థితులను ఎదుర్కొంటూ జీవిత యుద్ధరంగంలో ఆధునిక కురుక్షేత్ర భటులవలె కష్టించే వీరులు వీరు.

మీరు అలాంటివారి పేరు విధిగా తెలియపర్చ నక్కరలేకపోయినా అట్టివారిని గురించి తెలియపరుస్తూ అందుకు సంబంధించిన ఫోటోకూడ పంపించండి. వీటిల్లో ఉత్తమమైనవి ఎంచి మాసమాసం ప్రకటిస్తూవుంటాం.

ఎడిటర్ 'సోషల్ వెల్‌ఫేరు'

10, కిచనర్ రోడ్డు, న్యూఢిల్లీ.

" బిడ్డలకు క్రీచీలు, ఆర్తులకు, అగతికులకు, వృద్ధులకు రక్షణ, శిక్షణ, వృత్తికల్పన "

# కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ కొత్త పథకాలవివరాలు

క్రొత్త ప్రణాళికలను రూపొందించడం, పైలట్ ప్రాజెక్టుల నిర్వాహణ. "ఇవి కేంద్రసంఘ సంక్షేమ సంస్థ విధులు" అని ప్రథమ పంచవర్ష ప్రణాళికలోని 36 వ అధ్యాయం 'సంఘ సంక్షేమాన్ని' గురించి వివరిస్తూ పేర్కొన్నది. ఈ విధానానికి అనుగుణంగానే గ్రామ ప్రాంతాలకు సంక్షేమ విస్తరణ ప్రణాళికలను, పట్టణ ప్రాంతాలకు కుటుంబ సంక్షేమ ప్రణాళికలను కేంద్ర సంఘ సంక్షేమసంస్థ ఏర్పాటు చేసింది. ఇప్పుడు దేశంలో అన్ని స్వచ్ఛంద సంస్థలు ఆదిలో నిర్ణీత పథకాలతో బయలుదేరి వుండకపోవడం, ద్రవ్యాభావం, తగినంతమంది సంఘసేవకులు లేకపోవడం కారణంగా పెక్కు సమస్యలు అపరిష్కృతంగా వుండిపోయినవి. కేంద్రసంఘసంక్షేమ సంస్థ ఏర్పడడంతో పిల్లల, స్త్రీల సంక్షేమ కార్యక్రమాలకు ప్రాధాన్యమిస్తూ, స్వచ్ఛంద సంస్థలను ప్రోత్సహించాలనే ప్రధాన సూత్రాలకు అనుగుణంగా రాష్ట్ర సంఘ సంక్షేమ సలహా సంఘాలు దేశవిస్తృతంగా కొత్త ప్రణాళికలను అమలు జరపడానికి ఆవకాశం ఏర్పడ్డది.

## పిల్లలకు క్రీచీలు

పెక్కుమంది స్త్రీలు కుటుంబ పోషణకై పనులకు వెడుతున్నందున, పని వేళలలో వారి బిడ్డలను చూస్తు వుండడానికి క్రీచీలను ఏర్పాటు చెయ్యడం అవసరమయింది. ఇంతవరకు ఒక ఫ్యాక్టరీలలో పనిచేసే స్త్రీల బిడ్డల విషయంలోనే క్రీచీలు ఏర్పాటు శాసనరీత్యా ఆవశ్యకం కావించబడింది. ఇతర రంగాలలో పనిచేస్తున్న స్త్రీల బిడ్డల విషయంలో, వారిని కొలువున పెట్టుకొన్న సంస్థలో స్వచ్ఛందంగా గాని, శాసనరీత్యాగాని అట్టి ఏర్పాట్లు చెయ్యాలనే నియమంలేదు. దీనివల్ల వసతి సౌకర్యాలు కల సంస్థలు కాని తదితర సంస్థలుకాని పనిచేసే తల్లుల బిడ్డల సంరక్షణ కార్యక్రమాలకు సిద్ధపడే పక్షంలో వాటికి తగు సహాయం చెయ్యాలని సూచించబడింది.

ఈ సంరక్షణ భారం వహించే సందర్భంలో సంస్థలు వినోదకాలక్షేపం ద్వారా చదువు చెప్పడం, ఆరోగ్య వర్ధకమైన ఆహారపోషణ, వైద్య చికిత్సాది సదుపాయాలను కూడా బిడ్డలకు సమకూర్చుతూ వుండాలి. ఈ సంస్థలు పిల్లల అవసరాలను తీర్చునట్టివై వుండాలి. ఈ బిడ్డలతో అనాథ బాలలను, బాలనేరస్థులను చేర్చరాదు. ఇటువంటి కార్యక్రమాన్ని నిర్వహించదగు సంస్థలు లేని ప్రాంతాలలో సంఘసంక్షేమ సంస్థ రాష్ట్ర సంఘసంక్షేమ సలహా సంఘాలద్వారా కొత్తగా యిందుకోసం సిద్ధపడగల స్వచ్ఛంద సేవక వర్గాలనుంచి దరఖాస్తులను స్వీకరించగలదు.

హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులు, రోడ్లు, కాలువలు త్రవ్వడం భవన నిర్మాణం వంటి ప్రజాహిత కార్యాలలో (పబ్లిక్‌వర్క్) పనిచేసే స్త్రీల బిడ్డల సంరక్షణను గురించి కూడా యోచించవలసివుంది. ఈ అవసరం దృష్ట్యా ప్రజాహిత కార్యాలను రెండు తరగతులుగా విభజించవచ్చు. పనిచేసే స్త్రీలు, పురుషులు చాలాకాలం ఒక చోటునుంచి మరొక చోటుకు కొన్నేసిరోజులకు మారుతూ పని కొనసాగించవలసిన కార్యక్రమాలు. ఇటువంటి పనులలోని స్త్రీల బిడ్డల సంరక్షణకు ఎక్కడకు పడితే అక్కడకు కదలివెళ్ళే "మొబైల్‌సర్వీస్" ఏర్పాట్లు చేస్తూవుండాలి.

## తర్వాత జాగ్రత

తప్పు చేసేవారిని సంస్కరించడానికి, జబ్బుపడ్డవారికి చికిత్స చెయ్యడానికి, నిలవ నీడలేనివారిని తాత్కాలికంగా కాపాడడానికి పక్క సహాయ సంస్కరణ కార్యక్రమాలున్నప్పటికి, తర్వాత జాగ్రతకు తగిన ఏర్పాట్లు లేకపోవడం ఒక పెద్ద లోటుగావుంది. ఈ లోటు తీర్చే వుద్దేశంతోనే హాస్టల్సు వర్కుషాపులు, పునరావాస కల్పనకు ఋణ సహాయం సమకూర్చే కార్యక్రమాన్ని రూపొందించాలని నిర్ణయించబడింది.

# కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ

ఎక్కడ నిలవ నీడలేని వారికి హాస్టల్సు ఆశ్రయమి స్తాయి, వర్క్‌షాపులు ఆ తర్వాత తగిన మంచి ఉద్యోగం దొరికేవరకు కనీసవేతనంపై పనిని సమ కూర్చుతాయి. స్వల్పమైన పెట్టుబడితో ఏదైనా చిన్న వ్యాపారం పెట్టుకొని జీవించగోరేవారికి ఋణాలు ఉపక రిస్తాయి.

ఈ కార్యక్రమాన్ని ప్రొబేషన్, ఆఫ్టర్ కేర్ సంస్థలు. విడుదలపొందిన ఖైదీల సహాయ సంఘాలు, పునరావాస కల్పనకు ఏర్పడ్డ సంస్థలు నిర్వహించాలి.

ఇటువంటి సంస్థలు లేని రాష్ట్రాలలో సంఘసేవా సమి తులనుగాని, బాలల సహాయక సంఘాలను కాని నెల కొల్పవలసివుంది.

### హాస్టల్స్‌లో పిల్లల రక్షణ

బాల నేరస్థుల లేదా దిక్కు మొక్కు లేని బిడ్డల రక్ష ణకు దేశంలో చట్ట బద్ధంగా, ప్రభుత్వాభిమానం పొందిన సంస్థలు వున్నా, అవి క్రిక్కిరిసి వుండడంవల్ల పెక్కు మంది రిమాండ్ హోమ్స్‌లోనే అట్టేపెట్టబడడమో. మందలించి, లేదా పూచీకత్తుపై వదిలివేయబడడమో జరుగుతున్నది.

తలిదండ్రులు వుండిగాని, లేకగాని ఆలన పాలనలు లేక తిరుగాడే పిల్లలకు, కూడా బాల నేరస్థుల చట్టం వర్తి స్తుంది కనక అట్టి నేరస్థులను విచారించే కోర్టులకు వారిని పంపి ప్రయోజనం లేదు. కనుక వీరికి ప్రత్యేకంగా హాస్టల్సు నెలకొల్పాలి. వారిని బడికి పోనిస్తూ వుండాలి, అయితే హాస్టల్ సూపర్వైజరుగాని సూపరెంటెండెట్ గాని బిడ్డలను ఒక కంట జాగ్రత్తగా కనిపెడుతునే వుండాలి.

### ప్రత్యేక శిక్షణావశ్యకత కల పిల్లలు

మనోవికాసం తక్కువైన పిల్లలకు, చిరకాలం వ్యాధి చికిత్సకై ఆసుపత్రిలో వుండ వచ్చిన పిల్లలకు ప్రత్యేక శిక్షణనిచ్చే పాఠశాలలు లేక పోవడం కూడా ఒక పెద్ద లోటుగానే వుంది. ఇటువంటి పిల్లలు కూడా తమ కుటుంబాలకుగాని, సంఘానికిగాని భారం కాకుండా వారిని చదివించి, పైకితెచ్చే మార్గాలు లేకపోలేవని ఒకటి, రెండు స్వచ్ఛంద సంస్థలు ఈసందర్భంలో కృషిచేశాయి. దేశం లోని వేర్వేరు ప్రాంతాలు అట్టి పాఠశాలలు లేకపోతే, వాటికి అవసరం లేదని భావించరాదు. ఆయా రాష్ట్రాల సంఘ సంక్షేమ సలహా సంఘాలు ఈ సందర్భంలో తగు విధంగా సంస్థలను ఏర్పాటు చెయ్యడానికి, గల అవకాశా లను పరిశీలించాలి.

### అగతికుల సమస్య

మన దేశంలోని ప్రధాన నగరాలలోను, పట్టణాల లోను పార్కుల దగ్గర, సినిమాలవద్ద, యింకా యితర ప్రజాహిత సంస్థలుండే చోట ఎందరో యువకులు, యువ తులు కనిపిస్తువుంటారు. దిక్కు, మొక్కు లేని అగతి కులుంటారు. ముష్టెత్తుకొనే వారుగా, దొంగలుగా, అవి నీతిపరులుగా వారు మారిపోగల ప్రమాదం ఎంతైనా వుంది. వారిలో కొందరు యిష్ట తల్లిదండ్రులు వున్నవారే అయితే చదువు సంధ్యలకు తగిన అవకాశాలు, కట్టు దిట్టాలు లేవు. తప్పు చేసే వారిని సంస్కరించడానికి ఏర్పాటు చేసే కార్యక్రమాలలో తప్పు చెయ్యకుండా వారించే చర్యలు కూడా వుండాలి.

ఇటువంటి దారి తెన్నూ లేని వారికి క్రీడా కేంద్రాలలో కాలక్షేపపు తరగతులు సమకూర్చాలి. కనీస ప్రాథమిక విద్యా సౌకర్యం లేని కారణాన అనేకమంది పిల్లలు ఏవిధమైన విద్యాభ్యాసనావకాశాలు లేకుండా పోతు న్నారు. క్రీడా కేంద్రాలు, కాలక్షేపపు తరగతులు కనీస కొంతవరకు క్రమ బద్ధమైన ప్రోగ్రాము నిర్వహించడంలో తోడ్పడ గలవు. ఈ కాలక్షేపపు తరగతులు వారికి ఏదో ఒక వృత్తి విద్యపై ఆసక్తి కలిగించి, జీవనోపాధికి మార్గం కావచ్చు.

### ఆడ ఖైదీల బిడ్డలు

జైళ్ళలో శిక్ష ననుభవిస్తున్న స్త్రీ నేరస్థుల బిడ్డల సమస్య ఒకటున్నది. అక్కడి చెరసాల వాతావరణం నుంచి వీరిని కాపాడి, వారి వయస్సులకు తగిన వసతు లను ఏర్పాటు చెయ్యాలి. ఇది జైళ్ళలో ప్రవేశానికి అవ కాశంగల ఖైదీల సహాయక సంఘాలద్వారానే సాధ్య పడుతుంది.

ఉద్యోగంలేక, యజమాని శిక్షించబడటంవల్ల, లేదా జబ్బుపడడంవల్ల కొన్ని కొన్ని కుటుంబాలు చిక్కు పడుతూవుంటాయి. అటువంటి కుటుంబాలలోని బిడ్డలకు వేరే సదుపాయం చెయ్యడం అవసరం. విదేశాలలో యిటు వంటివారికి 'తాత్కాలిక వసతి గృహాలు' వుంటాయి. మధ్యతరగతి, తక్కువ తరగతి కుటుంబాల బిడ్డలకు

తాత్కాలికంగా రక్షణ నిచ్చే యిటువంటి గృహాలను కొంత రుసుము చెల్లించే పద్ధతిలోకూడా ఏర్పాటుచెయ్యవచ్చును.

## వృద్ధుల రక్షణ

సమిష్టి కుటుంబ విధానం సడలిపోవడంతో యింతకు ముందు కుటుంబం అంతా బాధ్యతవహించే కొన్ని సమస్యలు అలక్ష్యం చెయ్యబడుతున్నాయి. ఉమ్మడి కుటుంబాలనుంచి వెళ్ళగొట్టబడిన వారి రక్షణకు సంఘమే ఏదో ఒక ఏర్పాటు చెయ్యడం అవసరమౌతూవుంది.

ఈ సందర్భంలో వృద్ధాప్యం ప్రాపించినవారు, దుర్బలులు అని రెండు తరహాలుగా వీరిని వర్గీకరించవచ్చు. వయస్సు మళ్ళి, సంపాదించే శక్తి వుడిగిపోయినపిదప, కుటుంబానికే తాము భారమైపోయామని వీరు బాధపడుతూ వుంటారు. ఇటువంటివారు సంఘానికి భారంగా పరిణమించకుండా, వీధిని పడి బిచ్చమెత్తుకోకుండా యిట్టి వారిని కాపాడడానికి సంస్థలు ఏర్పాటు చెయ్యాలి. వీరి వయస్సుకు, ఆరోగ్యానికి తగు సంరక్షణ సౌకర్యాలు కలిగించాలి.

పైన పేర్కొన్న సంస్థలు ప్రత్యేక తరహాల సేవకు సంబంధించినట్టివి. ఇవి జయప్రదంగా నిర్వహించబడాలంటే అనేక విధాలైన సహాయం అవసరం. ఇవి విజయం పొందడం, లేదా విఫలం కావడం ద్రవ్యలబ్ధిపైన, సుశిక్షితులైన సేవాతత్పరులు లభించడంపైన, సాధన సంపత్తి సమగ్రంగా సమకూడడంపైన ఆధారపడి వుంటుంది.

## కమ్యూనిటీ చెస్టులు

కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ దేశంలో సంక్షేమ ప్రణాళికల పనులు జరపడానికి కొంత ద్రవ్యం వున్నది. దానితో పైన పేర్కొన్న కార్యక్రమాల నిర్వహణకు ఆర్థిక సహాయం చెయ్యడానికి కేంద్ర సంఘ సంక్షేమ సంస్థకు అవకాశంవుంది. ఆయితే దేశంలోని అవసరాల దృష్ట్యా యీద్రవ్యం బహుపరిమిత మైనదనే చెప్పవచ్చు

కేంద్ర సంస్థ ప్రణాళికలలో పెక్కు స్వచ్ఛందవర్గాల నుంచి "మేచింగ్" పద్ధతిని లభించే విరాళాల ప్రాతిపదికపైనే రూపొందినట్టివి. అయితే అనుభవాన్ని బట్టి యీ "మేచింగ్" పద్ధతిని వ్యక్తుల్నుంచి, లేదా సంస్థల నుంచి దానధర్మాల రూపంలో సొమ్ము సేకరించి కష్టసాధ్యమని తేటపడ్డది. ఈ చిక్కుల నధిగమించడం కోసం, కమ్యూనిటీ చెస్ట్ పద్ధతి ప్రవేశపెట్టడం యుక్తమని తోచింది. ఒక ప్రాంతంలోని సంస్థలు ఏడాది కొకసారిగా సమిష్టిగా ద్రవ్యం సేకరిస్తారు. అలా సేకరించు కొన్న ద్రవ్యాన్ని నిర్ణయించు కొన్న విధంగా పంచు కొంటాయి. ఇది యిచ్చే వారికి, పుచ్చుకొనే వారికీకూడా ఉపయోగకరమైన పద్ధతి. "కమ్యూనిటీచెస్ట్" పద్ధతిలోని లక్ష్యంయిదే.

## సాంకేతిక సహాయం

సంఘసేవా కార్యక్రమాలు మనదేశంలో ఒక క్రమ పద్ధతిని పెంపొందించ బడివుండలేదు. దీనివల్ల కొన్ని రాష్ట్రాలలో పురోభివృద్ధి యితోధికంకాగా కొన్నిచోట్ల అసలే కాకుండా పోయిన పరిస్థితికూడా ఏర్పడివుంది. కాగా సంఘసేవ ప్రణాళికల నిర్వహణలో విశేషాభివృద్ధి పొందివున్న రాష్ట్రాలలోని నిపుణులను కొంత గౌరవ ప్రతిఫలం (ఆనరేరియం) యిచ్చేపద్ధతిని దేశంలోని వేర్వేరు ప్రాంతాలలో ప్రత్యేక కార్యక్రమాల నిర్వహణలో తోడ్పడానికై ఆహ్వానించడం కూడా ప్రయోజనకరం కాగలదు. స్థానిక సంఘసేవకులు యీ ప్రణాళికల నుంచి శిక్షణ పొందగలరు.

సంఘసేవలో శిక్షణనిచ్చే పాఠశాలలకు, సంస్థలకు కూడా ప్రత్యేక ప్రణాళికల పనులు జరపడానికై కావలసిన వారికి తగుశిక్షణనిచ్చే బాధ్యతను వహించడానికి ద్రవ్య సహాయం చెయ్యవచ్చు.

## సాధన సంపత్తి

కొన్ని సంవత్సరాలుగా ఐక్యరాజ్యసమితికి చెందిన పిల్లలనిధి, ప్రపంచ ఆరోగ్య సంస్థ లేక రెడ్ క్రాస్, వంటి అంతర్జాతీయ సంస్థలు సంఘ సంక్షేమ కార్యక్రమాలకు పాలు, మందులు, ఇతర వస్తుసముదాయం సప్లయి చేస్తువున్నవి. ఈ సహాయం ప్రభుత్వం పరంగానే అందుబాటు జరుగుతూవుండడంవల్ల పూర్తిగా వినియోగించుకొనబడానికి సందర్భాలుకూడా కనిపించాయి. ఇప్పుడు కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ స్వయంగా నెలకొల్పుతున్న సంస్థలు, సహాయం చేస్తున్న సంస్థలు అనేకం వున్నందున వేర్వేరు సంస్థలకు ఆ సరఫరాలను క్రమబద్ధంగా అందజేసే అవకాశాలను పరిశీలించే యోచనకూడా జరుగుతూవుంది.



# కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ

## క్రొత్తగా ఇచ్చుటకు నిర్ణయించిన గ్రాంటులు

కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ తనయొక్క సప్తమ సమావేశంలో నవంబరు 12 వ తేదీన ఈ క్రిందివిధంగా నిర్ణయించింది :

### భవన నిర్మాణాలకు అవసరమైన గ్రాంటులు.

స్వచ్ఛంద సంక్షేమ సంస్థలకు భవన నిర్మాణానికి అవసరమైన సహాయక గ్రాంటులు చేసే విషయమై కేంద్ర సంస్థ పునఃపరిశీలించి, ఈ దిగువ సూచింపబడిన షరతులపై భవన నిర్మాణానికి గ్రాంటులు ఇచ్చుటకు నిర్ణయించినది :—

1. ఈ గ్రాంటు సాధారణముగా భవనముల మరమ్మతుకు, పూర్వపు నిర్మాణములో అవసరమైన మార్పులు చేయుటకు, లేదా ప్రస్తుతం ఉంటున్న భవనాలకు క్రొత్త కట్టడములు చేర్చుటకు, సంస్థయొక్క అర్హతలను పరిశీలించిన మీదట ఈయబడుతుంది.

2. కేంద్ర సంక్షేమ సమితి సహాయంతో గాని, స్వచ్ఛందంగాగాని, ఒక ప్రత్యేక సంస్థ పూనుకున్న విస్తరణ కార్యక్రమానికి అనువైన వసతి లేని పక్షములోనూ, అందుకు తగిన భవనం అద్దెకు కూడా దొరకని పక్షములోనూ గ్రాంటు ఈయబడుతుంది.

3. ఇతర అంగీకృత కార్యక్రమాలకు కేంద్ర సంక్షేమ సంస్థనుండి గ్రాంటును ఈ సంస్థ పుచ్చుకున్నప్పటికీ, భవన నిర్మాణమునకుగాను ప్రత్యేకముగా గ్రాంటును పొందుటకు అర్హత కలిగి ఉంటుంది. రు 15,000 లకు మించని సగము గ్రాంటు భవననిర్మాణానికి ఈయబడుతుంది.

### మోటారు వాన్‌లకు గ్రాంటులు.

అర్హత కలిగిన సంక్షేమ సంస్థలకు మోటారు వాన్‌లను ఇచ్చేవిషయమై కేంద్ర సంస్థ పరిశీలించింది. ఈ క్రింద సూచింపబడిన షరతులపై మోటారు వాన్ కొనే నిమిత్తమై రు 15,000 గ్రాంటును ఇవ్వవచ్చునని నిర్ణయించింది.

1. వైద్యసహాయము. సాంఘిక విద్యా ప్రచారమునకు అవసరమైన సినిమా, టాకీ పరికరాలను తీసుకువెళ్లే నిమిత్తము, బాల గ్రంథాలయము మొదలైన ఇతర సంక్షేమ కార్యక్రమాల నిమిత్తమై ఈ 'వాన్'లను కోరవలెను. వీటి నిమిత్తమై ఉపయోగింపవలెను. మామూలు ప్రయాణానికి దీనిని ఉపయోగింపరాదు.

2. ఇందు ఉపయోగార్థము సమకూర్చవలసిన పరికరములకగు వ్యయమును సంస్థ భరించినయెడల ఇది సంస్థయొక్క "మేచింగ్" భాగముగా అంగీకరింపబడును. దీని నిమిత్తము కాగల రోజువారీ ఖర్చులను సంస్థయే భరించవలసి ఉంటుంది.

### ఒకే సంస్థకు ఒకటికి మించిన గ్రాంటులు.

ఒక స్వచ్ఛంద సంక్షేమ సంస్థ అనేక శాఖలను నిర్వహిస్తున్నప్పుడు, కేంద్ర సంస్థ ప్రతి శాఖకు అవసరమగు గ్రాంటులను వేర్వేరుగా, ఆ సంస్థయొక్క అర్హతానర్హతలనుబట్టి నిర్ణయిస్తుంది. ప్రతి గ్రాంటుకు ఈయబడే హెచ్చు మొత్తం రు 15,000 లు. అయితే ఈ శాఖలు ఒకే కార్యాలయములో గాక వేరు వేరు స్థలములలో ప్రత్యేకముగా నిర్వహింపబడుతూ ఉండాలి. ఒకే స్థలములో జరిగే అన్ని కార్యక్రమాలకు ఒకటిని మించిన గ్రాంటు ఈయబడదని గుర్తుంచుకోవాలి.

కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ నూతన కార్యాచరణ విధానాలను కొన్నిటిని అమలు జరుపుటకు నిశ్చయించింది. ప్రస్తుతం ఉన్న సంస్థలు ఈ నూతన కార్యక్రమాలను తగు విధంగా అమలు జరుపుటకు ముందుకురానిచో, క్రొత్త స్వచ్ఛంద సంఘములు ఏర్పడి, రిజిస్టర్డు సంస్థలుగా నమోదు చేయించుకున్నయెడల ఆ సంస్థలు ఈ నూతన విధానాలను అమలుజరుపవచ్చును.

### సంక్షేమ విస్తరణ ప్రణాళికల బడ్జెటు హెచ్చింపు.

ప్రస్తుతం సంక్షేమ విస్తరణ ప్రణాళికలలో ప్రతి ఒక ప్రణాళికలోను కేంద్ర సంస్థయొక్క భాగము సంవత్సరానికి రు 12,500. ఈ మొత్తమును రాష్ట్ర సంక్షేమ సలహా సంస్థల అధ్యక్షుల సభ సలహా ప్రకారం, అవసరమైనంత వరకు పెంచుటకు కేంద్ర సంస్థ నిర్ణయించింది.

మనదేశ చరిత్రలో- అనేక జాతులు- విదేశీయులు మన దేశముపై దండెత్తిరి. కాని మన దేశ నాగరికతను జయింపజాలకపోయిరి. భారతనారే మన సంస్కృతికి సంరక్షకురాలుగ నుండుటచే దానికి నాశముగాని అపజయముగాని లేదు. వారి అద్భుత కౌశల్యము చాకచక్యములతో సుందరమయ వస్తుసముదాయాన్ని సృష్టించగలుగుతున్నారు. సాంఘిక సంక్షేమము వారి కార్యక్రమములో స్త్రీలకు లలితకళలయందు శిక్షణనిచ్చుట ఒక ముఖ్యాంశము.

## సంక్షేమ కార్యక్రమ స్థాయి హెచ్చింపు.

కేంద్ర సంస్థ, తను చేకూర్చుచున్న సహాయంవల్ల దేశంలో సంక్షేమ కార్యక్రమంయొక్క స్థాయి హెచ్చవలెనని ఆశిస్తున్నది. దీనికిగాను, సహాయము పొందుతున్న సంస్థలు సంస్థ నిర్వహణకు తగు శిక్షణ పొందిన కార్యకర్తలను నియమింపవలెనని సహాయము అందజేయుటకు ముందుగా షరతు ఉంచవలెనని నిశ్చయింపబడినది.

అనుభవము, అర్హత కలిగిన కార్యకర్తలను ఈ స్వచ్ఛంద సంస్థలలో రాష్ట్రీ సంఘ సంక్షేమ సలహాసంస్థ నియమింపగలదు. దీని వలన సహాయము పొందుతున్న సంస్థలకు, నూతనముగా స్థాపింపబడిన సంస్థలకు, ప్రజాశికలకు అవసరమైన సాంకేతిక సహాయము లభింపగలదు.



ఆనందమయమగు గృహిణింటే ఆనంద మయమగు గృహము తథ్యము! ఇది పంచవర్ష ప్రణాళిక సాధించుటకు భారతదేశ నిర్మాణ కార్యక్రమములు సఫలీకృతమగుటకు ధనము మిగుల్చి కొనవలయును - ఇదే మన ప్రధాని మొన్న సాంఘిక సంక్షేమ సంఘ అఫీసులో కూడిన స్త్రీలందరికీ విశదీకరించి నచ్చ చెప్పుటకు ప్రయత్నించారు!



# ఆంధ్ర బాలానంద సంఘం

## (మదరాసు)

ఆంధ్ర దేశంలో 'రేడియో అక్కయ్య'ని 'రేడియో అన్నయ్య'ని ఎరుగని పిల్లలుండరు. వీరు ఒక్క రేడియోలో మాత్రమే 'అక్కయ్య', 'అన్నయ్య' కాకుండ ఈనాడు మన నిత్యజీవితంలోకూడా ఆ బాల గోపాలానికి అక్కయ్య అన్నయ్య అయినారు.

వీరు 15 సంవత్సరాలుగా, బాలబాలికల విజ్ఞానవికాసాలను పెంపొందింపటానికి సాగిస్తున్న కృషి అత్యంత ప్రశంశనీయమైనది. ప్రప్రథమంగా పిల్లలు రేడియో కార్యక్రమాలద్వారా బాలబాలికల సహజశక్తులను వికశింపచేశారు. ఆకార్యక్రమాలు క్రమేపీ ఒక పిల్లల ఉద్యమంగా మారి, మద్రాసునగరంతో ప్రారంభించి తుదకు యావదాంధ్రదేశమూ ఆవరించాయి. ఈనాడు మనదేశంలో వూరూరా బాలానందం సంఘాలు వెలుదేరాయంటే అది వీరిరువురు చేసిన నిరంతర కృషిఫలితమే! దేశాభివృద్ధికి ముందు ముందు ఆదర్శపౌరులు కావలసిన ఈనాటి బాలబాలికల వినోదవిజ్ఞానవికాసాలకు నిరంతర కృషి సాగిస్తున్న శ్రీ రాఘవరావు శ్రీమతి కామేశ్వరి గార్లకు మనమందరం చేయూతనీయటం మనవిధి.

కొద్దిమంది చిట్టిచెల్లాయిలు, చిన్నతమ్ముళ్ళతో ప్రారంభమైన బాలానంద సంఘం క్రమేపీ చిలవలు పలవలుతో ఈనాడు ఏవిధంగా యావదాంధ్రదేశంలోను విస్తరించిందో చూడండి—— ——

——:o:——

మొట్టమొదట "బృందావన బాలికల"తో మైలాపూరులో ఆంధ్రమహిళాసభ ఎలాగప్రారంభమయిందో, అలాగే, మైలాపూరులో రేడియో బాల బాలికలతో ఆంధ్ర బాలానంద సంఘము కూడా ప్రారంభమైంది. అటు శ్రీమతి దుర్గాబాయమ్మ గారి నాయకత్వాన బృందావన బాలికలు పెరిగి ఆంధ్రమహిళలు అయారు: ఇటు రేడియో అక్కయ్య (శ్రీమతి న్యాయపతి కామేశ్వరి). రేడియో అన్నయ్య (న్యాయపతి రాఘవరావు) లప్రోత్సాహముతో రేడియో బాలబాలికలు బాలానందం సాగిస్తూ వచ్చారు. అటు అది స్త్రీల సంస్థ; ఇటు ఇది బాలల సంస్థ— ఈ రెండుసంస్థలు, మదరాసు పట్టణములో తెనుగుస్త్రీలకు, బాల బాలికలకు, విజ్ఞానవినోద వికాసములకు పునాది సంస్థలుగా పనిచేస్తూ వచ్చాయి.

సుమారు పదిహేను సంవత్సరముల క్రితం పుట్టిన యీ "బాలానందం" సంస్థ రేడియో అక్కయ్య అన్న య్యల ఇంట్లోనే పెరుగుతూ వచ్చింది.

ప్రతి శనివారము, ఆదివారము, బడి సెలవురోజుల్లో ప్రతిసాయంత్రం, తెనుగుపిల్లలు అక్కయ్య అన్నయ్యల



శ్రీయుత దేశ్‌ముఖ్ గారికి, శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారికి బాలానంద సంఘంవారు స్వాగతము ఇచ్చుచున్నప్పటి దృశ్యం.



పిల్లలతో మాజీ ఆంధ్ర మంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు.

కొలువుతో పాటు, బాలబాలికలు తయారు చేసిన చేతిపనులు — కుట్టుపనులు, అల్లికపనులు, ఏంబ్రాయిడరీ పనులు, రంగు రంగులపూసల పనులు, చేత్తో తయారుచేసిన బొమ్మలు, చిత్ర లేఖనం—ఎన్నెన్నో ప్రదర్శించే వారు. ఈచిత్రవస్తు ప్రదర్శనకు మదరాసులోని పిల్లలే కాకుండా పై ఊళ్లనుంచికూడా ఎందరో బాలలు తయారుచేసిన వస్తువులు కూడా పంపేవారు, కొలువంత కన్నుల పండువుగా అలంకరించే లాగు ఈ దసరాలోనే బాల బాలికలకు, పాటలతోను, నృత్యములలోను, నాటికా ప్రదర్శనములలోను, వ్యాసరచన, చిత్ర లేఖనము హాస్యవేషధారణ మొదలగు వాటిలో పోటీలుచేసి, గెలిచినవారికి బహుమతులు పంచేవారు. ఈవిధంగా బాలానందం దసరా ఉత్సవాలు, ఎంతో జనరంజకముగా ఉంటూవచ్చాయి.

చుట్టూచేరి, కథలు, పాటలు, పాటకథలు, ఆటలు, ఎన్నో నేర్చుకునేవారు. ప్రతిఆదివారంరేడియో పిల్లలప్రోగ్రాములో పాల్గొనేవారు.ఇంతేకాకుండా, ఇంకానృత్యములు,నాటికలు, మొదలైన వెన్నో నేర్చుకొని. అవకాశ మొచ్చినప్పుడల్లా స్టేజిమీద ప్రదర్శిస్తూ, మదరాసులోని తెనుగుపిల్లల్లో ఒక నూతన చైతన్యం కలిగిస్తూ వచ్చారు.

దసరాపండుగ వచ్చిందంటే, ఎవరిళ్లల్లో వారు బొమ్మల కొలువులు పెట్టుకోవడం సహజం.కాని బాలానంద సంఘం సంస్థ పుట్టినతరువాత, పిల్లలందరూ చేరి, తమ తమ ఇండ్లనుండి బొమ్మలు తెచ్చి, ఉమ్మిడిగా ఒక పెద్ద బొమ్మల కొలువు ఏర్పాటు చేసేవారు. ఓ ఓ ! రకరకాల బొమ్మలు — చందనం బొమ్మలు, కొండపల్లి బొమ్మలు, మట్టిబొమ్మలు, రబ్బరుబొమ్మలు, నక్కపల్లి లక్క బొమ్మలు, కొవ్వొత్తితో చేసిన బొమ్మలు, తాటాకు బొమ్మలు, ఎన్నెన్నో బొమ్మలు కొలువుగా పెట్టేవారు. ఈ బొమ్మల కొలువును చూచుటకు, పిల్లలు, పెద్దలు అందరు వచ్చేవారు. పిల్లల చేత వినోద కార్యక్రమములు జరిపి, చిన్నచిన్న బహుమతులు, తీపి తీపి జేజేలతో మిఠాయిపంచి పెట్టేవారు.

ఈ దసరాబొమ్మల కొలువు, రానురాను. ఏ యేటా బాలల చిత్రవస్తు ప్రదర్శనంగా మారింది. బొమ్మల

బాలల విజ్ఞాన — వినోదములకు అవకాశం కలిగించాలంటే, ఇంకా ఎన్నో విధాల బాలల ఉద్యమం పని చేయాలి. బాలల విజ్ఞానానికి తోడ్పడే పుస్తకములు పత్రికలుకావాలి.అప్పటివరకు తెలుగులో ఒక్క పిల్లల పత్రికయినా లేకపోవడం గుర్తించారుఅక్కయ్య అన్నయ్యలు. 1945 సం॥ లో 'బాల' పత్రికను స్థాపించారు. 'బాల' మొట్ట మొదట వెలువడిన పిల్లల బొమ్మల పత్రిక. ఆ పత్రికద్వారా బాలల ఉద్యమానికి ప్రచారము చేస్తూవచ్చారు. బాలల కొరకు తమ ఇంట్లోనే ఒక చిన్న గ్రంధాలయం నెల కొల్పారు. లలితకళలలో ఆరితేరిన బాల బాలికలను తీసుకొని, ఆంధ్రదేశములో పలుతావులకు విజ్ఞానయాత్రలు చేశారు. ఈవిధంగా మదరాసులో పుట్టిన బాలానంద సంఘం, క్రమంగా అభివృద్ధిపొంది ఆంధ్రబాలానంద సంఘంగా మారింది.

పెద్దలు ఈ ఉద్యమానికి ధనసహాయం చేయ సంకల్పించారు, కేవలం ధనంవుంటే సంస్థ నడుస్తుందా? . . . దినదినాభివృద్ధి పొందుతూన్న బాలానంద సంస్థకు

శ్రద్ధతో పాటుపడే యువకులు, పెద్దలు సహాయంకావాలి. బాలల విజ్ఞాన వినోదవికాసములకు తోడ్పడుతామనియువకులు, పెద్దలు ముందం జవేశారు, తత్ఫలితంగా 1952 సం॥ ఏప్రిలు నెలలో "ఆంధ్ర బాలానంద సంఘం" రిజిస్టరు చేయబడింది.



దసరావిల్లంబులు పట్టుకుని బాలానంద సంఘ దసరా ఉత్సవములకు స్వాగతము చెప్పుచున్నటువంటి బాలాలు.

ఆ సంవత్సరం ఆగస్టునెలలో ఆంధ్రబాల మహాసభ మదరాసులో జరిగింది. ఆసభలకు వేర్వేరు జిల్లాలనుంచి ఎందరో ప్రతినిధులు వచ్చారు. బాల వాఙ్మయ ప్రదర్శనం ఏర్పాటు చేశారు. పిల్లల పత్రికలు, పిల్లలు నడుపుచున్న వ్రాత పత్రికలు, పిల్లల పుస్తకాలు, ఎన్నో ప్రదర్శించారు. ఇంతేకాకుండా, పెద్దల ఉపన్యాసాలు, పిల్లల తీర్మానాలు, వినోద కార్యక్రమాలతో, బాలమహాసభలు చాల జయప్రదంగా జరిగాయి — బాలల ఉద్యమం గట్టి పునాదులతో నాటుకొంది. ఆంధ్ర బాలానంద సంఘస్థాపకులు, అటుమదనపల్లి, తిరుత్తణి, చిత్తూరు కాళహస్తి ఇటు కాకినాడ, విజయనగరం, పిఠాపురం, పాలమూరు, ఒంగోలు, మొదలగు పట్టణములలోను, గ్రామములలోను బాలలసంస్థలకు దోహద మిస్తూవచ్చారు — 1953 సం॥ జనవరి నెలలో నెల్లూరులో సభలు జరిపి, బాలానంద శాఖను స్థాపించారు. మదరాసులో నున్న కేంద్ర ఆంధ్రబాలానంద సంఘాన్ని ఆదర్శంగా తీసుకొని, ఆంధ్ర పట్టణాలలోను, పల్లెలలోను బాలసంఘాలు స్థాపించబడుతూ వచ్చాయి.



బాలానంద సంఘ క్రీడాశాఖకు ప్రారంభోత్సవము చేయుచున్న మాజీ యూనియన్ మంత్రి శ్రీ గిరిగారు.

ఆంధ్రబాలానంద సంఘము యొక్క ముఖ్య ఆశయములు:— 1. ప్రతిగ్రామములోను ఒక బాలసంఘమును పెట్టుట; 2. ఒక 'బాలవిహార' కేంద్రమును స్థాపించి, పిల్లలకు ఒక బహి



దసరానృత్య, నాటిక పోటీలలో ఒక నృత్యభంగిమము

రంగ నాటకశాలను నిర్మించుట; 3 బాల గ్రంథాలయము, పఠన మందిరము నెలకొల్పుట; 4. ఇంట్లో ఆటలు, బహిరంగ ఆటలు ఏర్పాటు చేయుట; 5. లలితకళలు పెంపొందించుటకు పోటీలు పెట్టుట; 6. విజ్ఞానయాత్రలు చేయుట; 7. సభలు, సమావేశములు జరుపుట మొదలగునవి.

బాలల ఉద్యమ ప్రచార భారం దినదినాభివృద్ధి గాంచు తోంది. దానికి తగిన ధనసహాయం ఉంటే, ఈ ఉద్యమం ఇంకా బాగానడిచే సూచనలు కనబడే రోజులవి. ఇంతలో కేంద్రప్రభుత్వము వారిచే నియమింపబడిన కేంద్రసాం ఘిక సంక్షేమ సంఘమువారు ఒక బాలల సంక్షేమ సలహా సంఘమును మదరాసు పంపేరు. వారు ఆంధ్రబాలానంద సంఘము చేయుచున్న కృషిని చూచి, ప్రశంశించి, రు 10.000 లు గ్రాంటుగా ఇచ్చారు. ఈ గ్రాంటుకు సమభాగం అనగా ఇంకో రూ 10 000 లు ఈ సంస్థ ప్రోగుచేసి, ఇప్పుడు ఒక బాల గ్రంథాలయము, పిల్లల ఫిలింక్లబ్బు, ఇంటా బయటా ఆడుకునే ఆటలు, మొదలగు కార్యక్రమాలను అమలు జరుపుచున్నది.

ఆంధ్రబాలానంద సంఘమునకు మదరాసు పట్టణములోనే ఆరు ప్రాంతీయ ఉపసంఘము లున్నవి. 1. మైలాపూరు; 2. త్యాగరాయనగరు; 3 పరశువాకం; 4. జార్జి టౌను; 5. ఆంజనేయనగర్ (రాయపురం); 6. శ్రీరామ నగర్ (ట్రిప్లికేను) శాఖలు వేర్వేరుగా పిల్లల విజ్ఞాన వినోద క్రీడాకార్యక్రమములు జరుపుతున్నారు. ఇటీవలనే కర్నూలు పట్టణములో జరిపిన ద్వితీయ ఆంధ్రబాల మహా సభలో, వేర్వేరు జిల్లాలనుంచి వచ్చిన బాలసంఘ సభ్యులందరు పాల్గొన్నారు. ఆంధ్రదేశములోని పలు తావులలో నున్న బాలసంఘములన్నియు, ఆంధ్రబాలానంద సంఘానికి, అనుబంధ సంస్థలుగా చేరి, బాలల ఉద్యమం బలపరచాలని తీర్మానించారు.

ఇటు ఆంధ్రబాలలు, ఆంధ్రమహాజనులు, అటు కేంద్ర ప్రభుత్వము, ఆంధ్రప్రభుత్వము తగురీతిని తోడ్పడితే ఆంధ్రదేశములో ప్రతిగ్రామములో ఆంధ్రబాలానంద సంఘములు, బాల సంక్షేమ కేంద్రములు నెలకొల్పుటకు తగిన అవకాశమున్నదని మనము గుర్తించవలెను.



"క్యాంపు టౌనకేలా"లో ఆటలుపోటీలు



# మా ఆవిడంటే నాకు భయమే

• శ్రీమతి ఆ. భాస్కరమ్మ •

భుజంగరావు కూనిరాగాలు తీసికొంటూ, చాలాసరదాగా యింటికివచ్చాడు. నిర్మల గబగబా యెదురుగా వెళ్లి ఈవేళ చాలా హుషారుగా ఉన్నారే? ఏమిటికథ? అంది. నేనెప్పుడు హుషారుగా లేను? నిన్ను తలచుకొంటో ఉంటే, నిన్ను చూస్తో ఉంటే నాకంతా హుషారే. హుషారిచ్చే మనిషి యెదురుగా ఉంటే హుషారుకేమి లోపం? అన్నాడు. నిర్మలకోటు బొత్తాములు తీస్తో ఏమిటిది? నీనోరేదో వాసనవేస్తోంది? ఏమయినా వేసివచ్చావా యేమిటి? చెప్పు. నాకిందుకే పెద్ద ఆఫీసర్లంటె నేభయం. పెద్ద ఆఫీసరు కాగానే చేతినిండా డబ్బుంటుంది. మంచిహోదా, అథారిటీ ఉంటాయి. సర్వస్వతంత్రులు. ఎవరేమనుకొంటారో అనే భయముండదు. వాళ్ల చిత్తం. వాళ్లే చెడపనిచేసినా మంచిపనిగానే యుంటుంది. వారే అందరికీ ఆదర్శం.

భుజంగరావు. — చంపావు. నానోరు వాసనకూడా వేస్తోంది? వాసన ఉంటుందనుకోలేదు నేను. ఈవేళ మామేనేజరు ఆఫీసర్ల కందరకు చిన్న టీపార్టీ చేశాడు. ఈరోజున క్రిష్టమసు పండుగని తెలుసు కదానీకు. దొరల ఆచార ప్రకారం టీ అయిన తరువాత అందరూ కొంచెం వైను త్రాగాలి. ఒకరి క్షేమం ఒకరు కోరుతో అలా త్రాగకపోతే వారినవమాన పరచినట్లు. వచ్చినవాళ్లంతా త్రాగుతున్నారు. నాకు తెలుసు నన్ను నీవు బ్రతుకనీయవని ముందుగ్లాసు తీసికొనుటకు వెనుకతీశాను. దొరగారే చేతికందిచ్చారు. ఇక త్రాగననడం ఏలాచెప్పు? దొరకు నామీద యెక్కువ అభిమానము, గౌరవము అని తెలుసును కదానీకు? అంతా త్రాగుతో ఉంటే, దొరగారెంతో ప్రేమతో నాకు గ్లాసందిస్తే త్రాగనని మూర్ఖంగా అక్కడ పెడితే వాళ్లంతా ఏమనుకొంటారు? దొరకు కోపం రాదు? నీవేదో పెద్దయుపన్యాసం మొదలుపెట్టావుకాని నిర్మలా! నేనాలాటివాడనా చెప్పు.

నిర్మలకు దుఃఖం వచ్చింది. కళ్లనుండి నీళ్లుకారుతోన్నాయి. కొంతసేపటి వరకూ ఏమీమాట్లాడ లేకపోయింది. ధైర్యం తెచ్చుకొన్నది. మావాళ్లంతా పెద్ద ఆఫీసరును తీసికొనివచ్చి పెళ్లి చేస్తామంటే వాళ్లమాట వినక వాళ్లను ధిక్కరించి ఉద్యోగము దొరుకునను నమ్మకము లేని ఈ నిరుద్యోగపు రోజులలో ఇంకా చదువు పూర్తికాని నిన్నుకోరి పెండ్లిచేసి కొన్నదెందుకు? నీవు బుద్ధిమంతుఁడవనీ, సిగరెట్టైనా కాల్చవని, నన్నెంతో ప్రేమిస్తో, చాలా గౌరవంగా చూస్తావని. అప్పుడే అన్నారు మావాళ్లు నీవు ప్రేమించిన భుజంగం మాత్రం రేపు పెద్ద ఆఫీసరయితే అతను మాత్రం సిగరెటు కాల్చకుండా, త్రాగకుండాఉంటాడా అప్పుడేమి చేస్తావని? అప్పుడు నేను చెప్పాను కదా అసలతను అటువంటివేమి



చేయడు. ఒకవేళ ఏ స్నేహితులయొక్క ప్రోద్బలము చేతనైనా చేశాడో నేనుచెప్పి అతనిచేత మాన్పించగల నను ధైర్యము నాకున్నదని.

భుజంగం నిర్మలను దగ్గరకు తీసికొన్నాడు. కళ్లు తుడుస్తూ నిర్మలా! ఏమిటిది? ఇంతమాత్రానికే నేనేమో త్రాగుబోతు నయినట్లు ఇలా భయపడి ఏడుస్తున్నావు! ఈ రోజున తప్ప యిదివరకెప్పుడైనా యిలా చేశానా చెప్పు? మేనేజరు దొర ఎంతోప్రేమతో ఇస్తాడంటే ఏంచేయమంటావు? పోనీ నీవైతే ఏంచేస్తావో చెప్పు.

నిర్మల:— నేనయితే ఒక్కనాటికి త్రాగను. మేనేజరు కానీ, దొరకానీ, చివరికి చక్రవర్తికానీ, నాకిష్టంలేని పదార్థాన్ని నాచే ఎలా తినిపిస్తారు? దిట్టంగా సిగరెట్టు కాల్చడం, త్రాగడం, మాంసం తినటం, ఇష్టంవచ్చిన స్త్రీలతో సరదాగా కాలం గడపటం ఇదిప్రస్తుతపు, నవ నాగరికత. ఆలాటివేమీ చేయకపోతే నాగరికత తెలియని అడవి మనిషి అని ఎక్కడను కొని పోతారో అని తక్కిన వారికి భయం వాళ్లకిష్టం లేకపోయినా. దాని పేరే Weakness అంటారు. నాదగ్గర ఆ Weakness లేదు అందులోనూ ఈలాటి చెడ్డ విషయాల్లో. ఈలా ఒకటి రెండు సార్లు ఇతరుల ప్రోత్సాహంవలన దిగుతారు తరువాత అది పుక్కు పట్టుకుంటుంది. తరువాత వానిని తప్పించడం బ్రహ్మతరంకాదు. నాకిష్టంలేదు నేను త్రాగనంటే మీదొర కొడతాడానిన్ను? ఉద్యోగం తీసేస్తాడు? ఎవరెంత బలవంతం పెట్టినా ఇంకెప్పుడూ త్రాగనని, సిగరెట్టు అయినా కాల్చనని నాకు వాగ్దానంచేయాలి.

భుజంగరావు:— నీవు దీనినింత సీరియసుగా తీసికొంటావనుకోలేదు నిర్మలా! ఈవేళ యింత గందరగోళమయాక ఇంకా చేస్తానా? ఇంకెప్పుడూ చేయను.

మేనేజరు కూతురు పుట్టినరోజు వచ్చింది, తనదగ్గరి ఆఫీసర్లను, స్నేహితులను టీకి పిలిచాడు, టీ అయాక వైను ఇచ్చారు. భుజంగరావు తీసికోలేదు. సిగరెట్టు ఇచ్చారు తీసికోలేదు. తక్కినవారంతా తీసుకొన్నారు. ఏం నీవెందుకు తీసికోవు? అంతా తీసికొంటావుంటే నీవొక్కడవు ఆలా తీసికోననడం మర్యాదాకాదు తీసికో అన్నాడు వీపుమీద ప్రేమగా తడుతో మేనేజరు. నాకిష్టం లేదు నేను తీసికోననడానికి ధైర్యములేదు భుజంగరావుకి. ఏమి చెప్పడానికీ తోచడంలేదు. చటుక్కున మా ఆవిడ కోప్పడుతుంది అన్నాడు. అక్కడ వాళ్లంతా పకాలున నవ్వారు. వేళాకోళాలు చేశారు. భుజంగరావు ఏమిమాట్లాడలేదు. మీ ఆవిడంటే నీకంత భయమా అన్నాడు మేనేజరు. మాఆవిడంటే నాకుభయమే అన్నాడు భుజంగం. తరువాత ఎక్కడ టీపార్టీ అయినా ఎన్నిసార్లు టీపార్టీలయినా భుజంగరావు వొక్కడూ ఏర్పాటుగా ఉండేవాడు, సిగరెట్టు కాల్చడనీ, త్రాగడనీ, పరస్త్రీలను తనతోబుట్టువులవలె ఎంతో గౌరవంగా చూస్తాడనీ. భార్యఅంటె అపరిమితమైన అనురాగము, భయము అని, ఎంత అవకాశమున్నా లంచం తీసికోడనీ. చివరకు ప్రజంట్లు కూడా ఇష్టపడడనీ అతనియొద్ద అన్నీ మంచిగుణములే కాని యెంత చూద్దామన్నా చెడ్డగుణము లేమీ లేవనీ దొరగారికి నానాటికీ అతనియందు ప్రేమ. గౌరవము హెచ్చినవి. త్వరలోనే అతను చాలా పెద్ద ఉద్యోగి అయ్యాడు. గాని పెద్ద యుద్యోగులకుండే పై లక్షణములేవీ మాత్రం అతని కబ్బలేదు.



బిడ్డల లివరు అండు స్ప్లీను వ్యాధులకు

# పాత్రుడుగారి బాలసంజీవిని

డాక్టరు పిల్లా పాపయ్యపాత్రుడుగారి "బాలసంజీవిని" నిజముగ అమోఘమైనది. బిడ్డలకు సంభవించు లివరు అండు స్ప్లీను వ్యాధులలో ప్రథమ దశయందుగాని, కాంప్లికేటెడ్ స్థితియందుగాని తప్పకుండ గుణమిచ్చును. వైద్యవృత్తియందును నా స్నేహితులలోను బంధుకోటిలోను అనేకులు ఉపయోగించుటవల్లను "బాలసంజీవిని" యొక్క గుణాతిశయములు పరీక్షించుట కవకాశమేర్పడినది. బజారులోగల యితర లివరు ఔషధములుగూడ యిదివరలో వాడి చూచితినిగాని "బాలసంజీవిని" వాడిన పిమ్మట పైవాటినెల్ల విసర్జించి దీనినే హెచ్చుగ వాడుచున్నాను. అమోఘముగ నిట్టి మహౌషధమును ప్రజోపయోగమునకు వినియోగించుచున్నందుకు పిల్లావారి వంశము స్తుతిపాత్రమైనది.

డాక్టర్. ఎన్. రామనాధన్‌గారు L. M. P. కావేరిపాకం.

వివరములకు:

**డాక్టరు పిల్లా పాపయ్యా పాత్రుడు & బ్రదర్సు,**

నెం. 19, దక్షిణమాడావీధి, మైలాపూరు, మద్రాసు 4.

కుంభకోణం బ్రాంచి:
నెం. 7 సారంగపాణి కోవిల్
తూర్పు వీధి.

తిరుచినాపల్లి బ్రాంచి:
నెం. 5 పుగళై పిళ్లై వీధి
తెప్పకొలం.

అన్ని మందుల షాపులలోను దొరకును.

# రీటా హెయిర్ టానిక్

## తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరకు, ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువాడి గుణమును పొంది యున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూదేశ మంతటా దొరకును.

వెల: సీసా 15 అణాలు.

**RITA**
**HAIR TONIC**



# చేతి అద్దకం

శ్రీ గెర్ట్రూడ్ సిన్హా హిరిచ్
(పూర్వ అస్సాం ప్రభుత్వపు వ్యాపార కళానిపుణురాలు)

చేతి అద్దకం మనదేశంలో పురాతనకాలం నుంచీ వస్తున్నదే. దక్షిణహిందూ దేశంలోని కేలికట్ అద్దకపు పనివారు, యీ చేతి అద్దకాన్నే, కేలికో అద్దకం అంటారు. కళాత్మకమైన ఛాయ తగ్గని చేతిఅద్దకాలకి కేలికట్ పేరు గాంచింది. ప్రకృతినుండి తీసుకొనే పూర్వపు రంగులన్ని చాలా భాగం సింథెటిక్ రంగులచే తొలగింపబడ్డాయి. కాని, యిప్పటికీ, కొన్ని అద్దకం పద్ధతులు — బట్టనుండి యాసిడ్ లక్షణాలు తీసివేయడానికి — అతి పురాతనమైనవే. సోడియం ఫోస్ఫేట్‌లో బట్టవుడక వేస్తే దాని యాసిడ్ లక్షణాలు పోతాయి. కాని యిప్పటికీ గుజరాతీ అద్దకపు పనివారు యిందుకు గోమయాన్నే వుపయోగిస్తారు.

నలుగురు కలిస్తే సులభంగా అయేపని కనుక యీ చేతి అద్దకం సంస్థలకి అనువైనది. యీ అద్దకపుశాల నిజమైన నేర్పరీ, యుక్తిపరురాలూ అయిన వ్యక్తి ఆధిపత్యాన వుంటే తప్పక లాభం కలుగుతుంది. ఈ అద్దకపుశాల ఆర్గనైజరు చిత్రకారిణి కానక్కరలేదు. కాని, సరిగ్గా శీలూ, లతలూ, ఏర్పడంలో నేర్పరి అయి వుండాలి.

డిజైనుమీదనే బట్ట అమ్మకం ఆధారపడి వుంటుందంటారు. ఆర్గనైజరు, తగిన డిజైనులు ఎన్నుకొనీ, తయారు చేయించీ అట్టేపెట్టి, వాటిని నవనాగరిక పద్ధతులకు సరిపోయేలా మార్చుకొంటూ వుండాలి. తమ వృత్తిలో ఆరితేరిన అద్దకపు పనివాడిని ఒకనెలరోజుల పాటు అట్టే పెట్టుకొంటే, అద్దకపు పని పూర్తిగా అలవాటయేదాకా సలహాదారుగా, సహాయకారునిగా వుంటాడు. అద్దకము రంగులు సప్లైచేసే I C I,; c.ba, బొంబే అసోసియేటెడ్ రిసెర్చి లేబరెటరీ, మొదలైనవారు, అడిగితే, ఉట్టిరంగులే కాక అద్దకపుపనిలో చేయవలసిన విధానాలనుకూడా తెలియచేస్తారు, కొన్ని కంపెనీలవారు, **(I.C.I.)** మీ మి సమస్యలను తెలుపుతే, తగు సలహాలను కూడా యిస్తారు.

సాధారణంగా అద్దకపు పనివాళ్ళు తాము రంగులు కలిపే పద్ధతినే చెప్పరు, సరికదా వారు అద్దకపు పద్ధతులు చేసి చూపెడతారా? అదీకాక, యిలాంటి అద్దకపు పనివాళ్ళని అమర్చుకోవడం చాలా ఖరీదైనపని. అందుకే, మీ టీములో ఒకరిని I.C.I. ప్రింటింగు. రంగు వేయుట కోర్సుకు పంపితే సరిపోతుంది, తెలివితేటలూ నేర్చుకోవాలనే ఆసక్తీ వున్నట్టయితే యీ పద్ధతి ఒకటి రెండు వారాలలోనే పట్టుబడిపోతుంది.

పల్లెటూరి అద్దకపు పనివారు మనం యిచ్చిన బట్ట మీదనే అద్దకం చేస్తారు. అలా కాంకుంటే, అద్దకపు షాపు అర్గనైజరు, బట్ట ఎంత వుందో అన్న విషయం జాగ్రత్తగా కంట్రోలు చెయ్యవలసి వుంటుంది. ఎక్కువగా బట్ట ఉతకడం — అద్దకానికి ముందూ అద్దకం అయాకాకూడా — అవసరం, అద్దకానికి ముందూ తరువాతాకూడా యిస్త్రీపెట్టడంకూడా అవసరం.

పనిముట్లు :

1. అద్దకం చేయడానికి సమానమైన బల్ల! ఏదైనా సరే గట్టిబల్ల యీ అద్దకానికి ఉపయోగించుకోవచ్చు. పాలరాయివేసిన బల్ల అయితే ఉత్తమం. కాని, కాంక్రీటు పలక వేసినదేనా బాగానే వుంటుంది. ఈ బల్లమీద నాలుగైదు మడతలుగా వేసిన దుప్పటీ ఒకటి పరవాచ్చు. దీనిమీద ఒక పాత బట్టో దుప్పటియో, ఉతికినా పాడవనిది వేయాలి. దానిమీద అద్దకం చేయ దల్చుకొన్న బట్ట పరవాలి. సమయానికి బల్ల దొరక్కపోతే, దళసరిగా దుప్పటి మడిచి సాఫైన నేలమీదనే మడిచివేయవచ్చు. అప్పుడు అద్దకం కూర్చుని చేయవచ్చు.

రంగుల దోనెలు :

2. మనం ఉపయోగించదలచుకొన్న బ్లాకులలో పెద్దది ఎంతవుందో అంతసైజులో రంగుల ట్రేలని తయారు చేసుకోవచ్చు. రెండు రంగులు ఒకేసారి ప్రక్క ప్రక్కల

వుండేలా పెద్ద ఫ్రేంనుకూడా తయారుచేసుకోవచ్చు. పెద్దసైజు బ్లాకు కొంచంలో యీ ఫ్రేం చేసుకోవచ్చు. ఆ బ్లాకుసైజు కర్ర చట్రం చేసి దానికి అడుగువైపున ఆయిల్ క్లాత్ కాని, ప్లాస్టిక్ బట్టగాని మేకులువేసి బిగించాలి. దాన్ని కొంచం పెద్దసైజు కర్రపెట్టెలో పెట్టాలి. ఈ పెట్టెనే Swimming Tub అంటారు.

## Swimming Tub:

3. ఇదికూడ దీర్ఘచతురస్రాకారంగా వుండాలి. దాని అడుగుభాగానికి జిగురుపూత పెట్టాలి. పిండి వుడికించిన జిగురుకూడ పనికి వస్తుంది. ఈ జిగురుపూత వుండడం వల్ల రంగు సమానంగా బ్లాకుకి అంటుతుంది. పాతగోనె గుడ్డముక్కనో, దుప్పటి గుడ్డముక్కనో రంగుదోనెలో వేసి దానిమీద రంగు పట్టిస్తారు. యీ రంగు పేస్టు సమానంగా అంటడానికి స్పాంజి ఉపయోగించవచ్చు. ఈ Swimming Tub లో తేలే రంగు ట్రే అంటే సులభంగా తోచదు చాలామందికి. కాని బ్లాకులు పెద్దవి అయినప్పుడు, వాటికి రంగు సాఫీగా అంటడంకోసం యీ పద్ధతే ఉత్తమమైనదిగా తోస్తుంది. చిన్నబ్లాకు అయితే యింత గొడవ అక్కరలేదు. చాలామంది అద్దకపు పనివాళ్ళు, ఏ డబ్బామూతలనో రంగుట్రేలుగా వుపయోగిస్తారు. ఈ మూతలోనే, రంగులో నాన్చిన గోనె ముక్కగాని, దుప్పటి ముక్కగాని అమరుస్తారు. అలాకాకుండా, నే చెప్పినదానికంటే కూడా క్లిష్టమైన రంగు ట్రేలుకూడా ఉపయోగించేవారు ఉన్నారు. యీ రంగు ట్రేలూ, Swimming Tub లూ ట్రాలీలమీద అమరిస్తే యింట్లో ఒకచోటినుంచి యింకోచోటికి దొర్లించుకొని పోవచ్చు.

## బ్లాకులు :

4. ఇవి చాలా ముఖ్యమైనవే. మన వూహలోవున్న డిజైనూ, స్వంత తరహా వాటిమూలాన్నే కదా వ్యక్తమవాలి. ఈ రోజులలో బట్టల డిజైనులు జానపద కళల నుంచి ఎక్కువగా తీసుకోబడుతున్నాయి. దీనివల్ల బ్లాకులు క్లిష్టం కాకుండా సులభం అవుతున్నాయి. పురాతన కాలంనుంచీ చేతి అద్దకానికి పేరుగాంచిన ఫరూకాబాద్, అహమ్మదాబాద్, బెనారెస్ కలకత్తా ఢిల్లీ మొదలైన ప్రదేశాల్లో, బ్లాకులు చెక్కడం వృత్తిగాగలవారు యింకా వున్నారు. మనం మన కిష్టమైన డిజైనుని యిస్తే అతి త్వరగా బ్లాకు తయారుచేసి యిస్తారు వాళ్ళు. వాళ్ళు డిజైను కోయడంలో డిజైనుని మార్చేస్తారు కూడా — మనం జాగ్రత్తగా చూస్తూవుండకపోతే; అంతేకాదు; మనం కర్రయిస్తే దానిమీద వారు చెక్కరు. తమ కేదైతే అలవాటో దానిమీదే సులభంగానూ త్వరగానూ వాళ్ళు చెక్కగలరు. కంబులోకూడా మన్నదానికి బ్లాకులు చేసేవారూ వున్నారు. అలాకాకుండా, లినోలియమ్ మీద చెక్కి కర్రకి దానిని అంటించి అదే బ్లాకుగా ఉపయోగించేవారుకూడా వున్నారు. యీ లినోలియం బ్లాకులు చాలాకాలం వుండవు. కొన్ని సమయాల్లో రంగుకూడా సరిగా పీల్చుకోవు. కాని, స్కూళ్ళలో పిల్లలు సరదగా త్వరగా అచ్చువేయడానికి లినోలియం బ్లాకులు బాగుంటాయి.

కదమ్, సీమ్, చింత, పనసకర్ర గట్టిగ వుండి, నారలేకుండ, బ్లాకులు చెక్కడానికి బాగుంటుంది. ఒకే రంగులో అద్దే డిజైనుకి ఒకేబ్లాకు సరిపోతుంది. రంగులు కలిసేలా అద్దాలంటే కాంబినేషన్ బ్లాకులు తయారు చేసుకోవాలి. ఎన్నిరంగులలో డిజైను అద్దాలంటే అన్ని బ్లాకులు తయారు చేసుకోవలసి వుంటుంది. యీ బ్లాకులకి వెనక గుర్తులు పెట్టుకోవాలి. లేకుంటే ఎగుడు దిగుడు అద్దకాలూ యింకా యితర ప్రమాదాలూ వస్తాయి. ఆ రోజు అద్దడం అయిపోగానే బ్లాకులు బాగా కడిగి గుడ్డతో ఒత్తి ఆరనియ్యాలి.

నేను అస్సాం ప్రభుత్వానికి సలహాదారిణిగా వున్న రోజులలో, బ్లాకులు — వివిధ డిజైనులవి తయారు చేయించి అస్సాం కొ ఆపరేటివ్ కాటేజి ఇన్‌డస్ట్రీస్ ద్వారా అమ్మబడాలని సూచించాను. పల్లెటూరివారి చేతి అద్దకపు కుటీర పరిశ్రమలు సాఫీగా జరగడానికి, బ్లాకులు అరువు యిచ్చే సంస్థలు నెలకొల్పాలనికూడా సూచించాను. ఈ సంస్థలు, ఆయా ప్రాంతాల డెవలప్‌మెంటు ఆఫీసర్ల ఆధీనంలోనూ, చేనేత డిమోన్‌స్ట్రేటర్ల ఆధీనంలోనూ వుండనీయనచ్చు.

5. రంగులు నూరడానికి కల్వం : ఈ రంగులు ఎలా నూరవలసిందీ, వాటి కంపెనీదారులు చెప్తారు. పేస్టు మాత్రం అతి మెత్తగా వుండాలి. ఏమాత్రం గరుకువున్నా బ్లాకుకి సరిగా రంగు అంటదు. ప్రింటుకూడా బాగాపడదు. ఈ పేస్టులు విశాలమైన అల్యూమినియం గిన్నెలలోకాని, కుండలలోకాని అట్టే పెట్టవచ్చు. ఏ రంగు తీయడానికి దాని గరిటే ఉపయోగించాలి, ఒక రంగులోంచి తీసి

గరిటెని యింకోరంగులో పెట్టకూడదు. ఈ గరిటెతో తీసి రంగు ట్రే మీద జాగ్రత్తగ పరచవచ్చు.

వీటి తరువాత కావలసినవి రెండు పెద్ద పాత్రలు. కుండలయితే మంచిది. అద్దకం పని పూర్తి అయాక, బట్ట డెవలప్ చేయడానికీ, పుతకడానికీ యీ విశాలమైన గిన్నెలు పనికి వస్తాయి.

అద్దకపురంగులు :

6. కన్నులకింపైన నాటురంగులన్నీ పోయి సింథటిక్ రంగులు అమల్లోకి వచ్చాయి కొనడానికి చౌకా, ఉపయోగించడానికి సులభమూ అని. పల్లెటూరి అద్దకపు పనివాళ్ళుకూడా యీ సింథటిక్ రంగులే వుపయోగిస్తున్నారు. పూర్వకాలపు నాటురంగులలో రకాలు చాలా తక్కువ. కాని సింథటిక్ రంగులతో దరిదాపు రెండువేల వర్ణాలు మార్పులతో చేకూర్చవచ్చు. సంప్రదాయ సిద్ధమైన పూర్వపు రంగులు లెక్కలో తక్కువకావడం వల్లనే — ఆనాటి అద్భుత అద్దకాలు యీనాటికీ నిలిచివున్నాయని అనుకోవచ్చు. కాని, రంగులు ఎన్నుకోడంలో నేర్పుతోనూ, సంస్కృతి, పరిమితులలోనూ యీనాటి సంథిటిక్ రంగులలోకూడ ప్రసిద్ధికెక్కిన పాతకాలపు అద్దకాలను పునరుద్ధరించవచ్చును. ఈనాడు వచ్చే సింథిటిక్ రంగులకీ, వాటిని కలపడానికి ఉపయోగించే ఆమ్లాలకీ లెక్కేలేదు.—పన్నెండు రంగులు కలిపే ఆమ్లాలలోనూ, ఆరు రకాల ఆల్కలీలతోనూ, ఆరురకాల పొటాసియంలతోనూ, దరిదాపు డెబ్భయికి మించిన రంగులతోనూ, నా లేబరేటరీని అమర్చుకోవాలని చాలామంది నాకు సలహా యిచ్చారు. కాని నా కందులో స్థోమంతుకూడా లేవు. నా "లేబరేటరీ" మా వంటయింటిలో ఒక భాగం. కొన్ని డబ్బాలతో రంగులూ, కెమికల్సూ నిలువ చేస్తాను నేను. ఇవి నే నుపయోగించేవి :

(ఎ) నెఫ్థాల్స్, బ్రెన్‌థాల్స్ — వాటికి సంబంధించిన తదితర లవణాలూ, యింకా, నూలు బట్టమీదా ఆర్టు సిల్కు బట్టమీదా అద్దకం చేయడానికి అవసరమైన పునాది రంగులూను. ఇవి పక్కారంగులను తయారు చేయడమే కాక, చౌకలోకూడా వస్తాయి ఇవి ఉపయోగించడంవల్ల — అద్దకపు పని చాలాసేపు పడుతుంది.

రాపిడ్ ఫాస్ట్, రాపిడొజెన్ రంగులు :

7. ఈ రంగులు కాలికో అద్దకపు పనివారు ఎక్కువగా వాడుతారు, బట్ట ఉడకవేయక్కరలేకుండా యీ రంగులు నే వుపయోగించాను, యీ రంగులు తగ్గవు మెరుగు తగ్గవు. ఈ రంగులు కలిపినప్పుడు గట్టిగా మూసిపెట్టాలి, గాలి తగులుతూ అట్టే పెట్టేస్తే, యివి నిరుపయోగం అయిపోతాయి. రాపిడోజెన్ రంగులు రాపిడ్ ఫాస్ట్ రంగులకంటె యింపుగా వుంటాయి. కాని వీటిలో కొన్ని రంగులు వేసినప్పుడు బట్ట వుడక పేయవలసి వుంటుంది. రాపిడ్‌ఫాస్ట్ రంగులలో ఎరుపు రంగు వాడినప్పుడు, మొదట ఆరెంజి రంగులో వుండేలా చూసుకోవాలి. గాలిలో ఆరవేసినప్పుడు యిదే ఎర్రటి ఎరుపుగా మారుతుంది.

ఇండిగోసల్ రంగులు :

ఖరీదెక్కువ. కాని పక్కారంగులు వీటిలోనూ దొరుకుతాయి. ముఖ్యంగా, నెఫ్థాల్స్‌లోనూ, రాపిడ్ ఫాస్టులలోనూ లేని ఆకుపచ్చ రంగు దీనిలో బాగుంటుంది. యీ రంగులు మార్కెట్టులో దొరుకుతాయి. (వాటికే అనేక కంపెనీలు, అనేక పేర్లుపెట్టుకున్నాయి: I.C.I వారి 'Soledons', సిబా వారి సిబన్‌థైన్స్ మొదలైనవి) పక్కారంగులలో యివన్నీ శ్రేష్ఠమైనవే. వీటిని, సిల్కు, నూలు, పూలు బట్టలమీద వుపయోగించుకోవచ్చు. కాని, యీ రంగులు వాడినప్పుడు బట్టని ఆవిరిమీద ఉడికించి తేనేకాని, రంగునిగారింపు బాగారాదు. ఈ ఆవిరిమీద ఉడికించడానికి ఏ పెద్ద డ్రమ్మైనా ఉపయోగించుకోవచ్చు. డ్రమ్ములోపల పైగా కర్రముక్కలు ఆధారంగా చేసి వాటిమీద ఉడికించవలసిన బట్టను పెట్టవచ్చు

ఈ క్రింద నేనుపయోగించే రంగులూ, వాటికి కావలసిన యితర పదార్థాలూ, అవి ఉపయోగించే విధానమూ చెప్తాను : సాధారణంగా రకానికి ఒకపౌను రంగు అట్టే పెట్తాను.

రాపిడ్ ఫాస్ట్ :

**Red RH**, ఎర్రటి ఎరుపూ, ఆరెంజో, నిమ్మపండు రంగూ, నీలమూ, ఇండిగోసల్ నీలం 04B ; బంగారు పసుపు IGK. ఈ రంగులనుండే, బ్రౌనులో రకాలూ, ఆకుపచ్చలో రకాలూ ఊదారో రకాలూ తయారుచేసుకోవచ్చు.

రంగు పూర్తిగా వేసేసి, తరువాత డిజైను అద్దడమూ, అలా కాకుండా, డిజైను వేసి రంగు వేయడమూకూడా చేయొచ్చు.

**అనిలైన్ బ్లాక్ :**

సాధారణంగా అందరు అద్దకపు పనివాళ్ళూ ఉపయోగిస్తారు. ఈ రంగు ప్రింటు చేయగానే కొంచం ఆకుపచ్చగా వున్నట్లు తోస్తుంది కాని, 2 గంటలసేపు ఎండలోగాని, 12 గంటలసేపు నీడలోగాని ఆరవేస్తే. కారు నలుపుగా మారుతుంది. కాని, ఒకటి రెండు సంవత్సరాలు వాడేక, ఆ నలుపు మళ్ళీ కొంచం ఆకుపచ్చగా మారుతుంది.

ఈ అనిలైన్ నలుపు తయారు చేయడానికి, I.C.I. సూత్రం ఆధారంగా, (నూలుబట్టకి మాత్రం)

1. సోడియం క్లోరెట్ లేకుంటే

| | |
|---|---|
| పొటాసియం క్లోరెట్ | 1 పాలు |
| నూరిన కాపర్ సల్ఫేట్ | 1-2 ,, |
| వేణ్ణీళ్ళు | 5-6 ,, |
| అన్నీ బాగా కరిగి ముద్ద అయేలాచేసి | |
| జిగురుగా తయారు కాడానికి జిగురు | 40-50 ,, |

2. అనిలైన్ లవణం 5-6 ,,

| | |
|---|---|
| చన్నీళ్ళు | 6-8 ,, |
| అనిలైన్ నూనె (కొన్ని చుక్కలు) | 0.5 ,, |

వీటన్నిటినీ తరువాత కలపాలి. అద్దకం చేశాక రెండుగంటలసేపు ఎండలో ఆరవేయడం కాని, 12 గంటలసేపు గదిలో అట్టేపెట్టడంగాని చెయ్యాలి. రాపిడ్ ఫాస్ట్ రంగులూ ఇండిగోసల్ రంగులూలాగే యీ అనిలైన్ నలుపుకూడా 20 పాళ్ళు సల్ఫ్యూరిక్ ఏసిడ్ కల వేడినీటిలో డెవలప్ చేయాలి. అలా కాకుంటే, 10 పాళ్ల పొటాసియం బైక్రొమేట్, $2\frac{1}{2}$ పాళ్ళు చాకలిసోడా వెయ్యిపాళ్ళు వేడినీటిలో నాల్గు నిముషాలసేపు అద్దకం చేసినబట్టని డెవలప్ చేయాలి. ఏ పద్ధతిలో డెవలప్ చేసినా, తిరిగి ఎండకి బట్టని ఆరవేయాలి.

అన్ని అద్దకపు రంగులకీ కూడా, ముద్దకావడానికినే సాధారణంగా గమ్ అరబిక్ ఉపయోగిస్తారు. సమపాళ్ళలో నీరూ. జిగురూ ఒకరాత్రి అంతా నానవేసి అట్టే పెట్టేయాలి. ఈ జిగురు రంగు ముద్దతో కలిపేముందు, దీనిలో కొంచం చాకలిసోడా కలిపితేజిగురు రంగు బట్టకి ఏమాత్రం అంటదు,

మన జాతీయతని ప్రతిబింబించే చేతి అద్దకపు గుడ్డలకి యీరోజులలో గిరాకీ బాగా వుంది. ఎగుమతి అవకాశాలు కూడా బాగా వున్నాయి. వర్తకవ్యాపారానికి, అనువయిన అవకాశాలు — ఢిల్లీలోని సెంట్రల్ కాటేజి యిండస్ట్రీస్ ఎంపోరియం లాంటివి—అన్ని పెద్దపట్టణాలలోనూ వున్నాయి. వుత్పత్తి విధానాలనీ, పద్ధతులనీ కొంచం సరిదిద్దుతే, యీ చేతి అద్దకపు పనిచేసిన వస్త్రాలు — మిషను ప్రింటు బట్టల పోటీనికూడా ఎదిర్చి నిల్వ కలుగుతాయి. చేతి అద్దకపు ప్రత్యేకత — మిల్లు అద్దకానికి ఎనాడూ రాదు. అంతే కాకుండా, యీ చేతి అద్దకం — స్వాతంత్ర్య భారతదేశానికి ఒక కళాత్మక బహూకృతి అవుతుంది.

(సోషల్ వెల్ఫేర్ పత్రికనుండి)



# బాలానందం

## ముగ్గురు చెవిటివాళ్ళు

శ్రీ నందివాడ కామేశ్వరరావు

గేయకథ:— బాలానందం

ఎడ్లపాలెములో గొల్లకాపరొకడు
చెఱువుగట్టుపై ఎద్దులుమేపుచు,
కూర్చుండెనొకనాడు,
చెవుడున్నాదివాడికి బ్రహ్మాండముగ,
ఢంకాగొట్టిన డొంకైనకదలునుగాని,
చలనముండదువానికి,
మండుటెండలోనెత్తిపై
తడిగామంచాతో
బిళ్ళకట్టుగామంచాతో
బాపణొకడు పోవుచుండె
నాత్రోవను, ఆనాడు,
బాపనిచూచిదిగ్గునలేచి,
గబ్బునవంగి, నమస్కరించి
ఇట్లులనెనా గొల్లలరేడు,
'దాహముగొలికై యేటికిపోయి
నీటినిత్రావివస్తా, నాయెద్దుల
చూడుముయొకమాటు'
యీయెద్దునీకు బహుమానమిస్తా
నంటూకుంటెమూడ
చూపించేడారేడు.
చెవిటి విప్రుడదిచూచి,
నాదారినినే పోతుంటె
నీమూడకాలు నేవిరగగొట్టితినా
పోపోవెధవా! పొమ్మన్నాడు.
కానిమాటలర్థముగాక
'ఆపశులకాపరి బ్రాహ్మనిచూచి'
యేమయ్యా! నావల్లకాదనాలిగాని
ననుకొడతావా అంటూ
చప్పునశిగంచుకున్నాడు,
తగువుతీరక యిద్దరుతన్నుకుంటూ
మునసబుదగ్గరకు పోయినారు.
చూచితివా, నాయుడుమామ!
నాయెద్దులచూడమంటె
కొడతాడా బాపనాడు?
అంటూముందుకువచ్చేడా గొల్లవాడు,
నాయుడయ్యా! వానిమీదకాలు
నేవిరచితినట, తీర్పుచెప్పుమా
న్యాయముగాను,
అన్నాడాముసలిపటువు.
వీళ్ళిద్దరికంటె చెవుడానాయుడు
దొరగారికి,
కళ్ళునులుపుకుంటూలేచి
యేమిట్రాగోలన్నాడు,
మీరునూరుగాదు
వెయ్యిచెప్పండి
ఆముండతోనే కాపురం
చెయ్యనుపొమ్మన్నాడు,
బాగుందిరాచెవిటి
మాలోకంఅంటూ
అందరు పక్కుననవ్వేరు.

# తిరుక్కోం

శ్రీ భీమవరపు సత్యనారాయణమూర్తి

మన దేశంలో వైష్ణవ వంశం తాము గొప్పని చెప్పుకోకపోయినా, కొంత మర్యాద వాళ్ళల్లో వాళ్ళు చూపుకుంటూ వుంటం హెచ్చుగా వుంటుంది. ఒక వూళ్ళో శుద్ధ వైష్ణవులుండేవారు. వారికి ఒక కొడుకు పుట్టాడు. అల్లారు ముద్దుగా పెంచి పెద్ద జేసి పెళ్ళి కూడా చేశారు. క్రొత్తగా కాపురానికి కోడలు వచ్చింది. ఆమె "అత్తా, అత్తా" అని పదే పదే అనటం ఆ యింటి అత్తగార్కి అసహ్యం వేసింది. తన కోడల్ని తనతో మాట్లాడేటప్పుడు. "తిరు, తిరు" అని పలకమంది. తిరు అంటే వాళ్ళ భాషలో "శ్రీ" అని అర్థం. ఆనాటి నుంచీ కోడలు అత్తగారిని తిరు 'అత్తగారూ' అనటం ఆరంభించింది. ఒక రోజున ఒక కుక్క మురికి గుంటలో నుంచి లేచివచ్చి, ఆచార్యులవారి దొడ్లో మడి బట్టలు దగ్గిర వళ్ళు విదిలించింది. దాంతో ఆ యింటి కోడలుగారి మామగారి బట్టనిండా బురద పడింది. ఆ మామగార్కి కోపం వచ్చింది. ప్రక్కనే వున్న బడితతో దాన్ని నాల్గు బాదాడు. అకుక్క కుయ్యోమంటూ పోయింది.

ఇంతలో అత్తగారు వచ్చింది. మామగారు ఆమెను, "శ్రద్ధగా నాలుగూ చూసుకోకపోతే యిల్లాగే పాడయి పోయేది" అని ఆయన నాల్గుతిడుతూ వెళ్ళాడు. ఏమి జరిగిందే అని కోడలిని అడిగింది అత్తగారు. కోడలు యిలా చెప్పింది. "తిరు అత్తగారూ, తిరు అత్తగారూ! తిరు మామగారు తిరు బట్ట తిరు దొడ్లో ఆరవేస్తే తిరు కుక్క వచ్చి, తిరు వళ్ళు దులిపితే, తిరు బురద తిరు మామగారి తిరు బట్టనిండా అయింది. తిరు మామగారికి తిరు కోపం వచ్చింది. తిరు కఱ్ఱ తీసుకొని తిరు కుక్కను కొట్టారు. అది 'తిరుక్కోం తిరుక్కోం' అంటూ తిరు తిరుగకుండా పోయింది." అన్నది.

ఆ అత్తగారికి మంచి కోపం వచ్చింది కోడల్ని "ఓసి నీ దుంపతెగ, ప్రతి మాటకు తిరు అంటావేమిటే? నీ తిరుక్కోం బంగారంగానూ,' అని కేకలేసి ఆనాటి నుంచి తనను తిరు అంటం మానేయమంది.



# మంచి సమాధానం

శ్రీ సన్నాకుల సుందరరావు

అవతార పురుషుడైన క్రీస్తు డిసెంబరు ఇరవై మోతారీఖున జన్మించారు. అతను అనేక అద్భుత క్రియలు ప్రపంచంలో ఉండగా చేశాడు. అనేక మందిని మృత్యు దేవతనుండి బ్రతికించాడు. చని పోయిన వానిని లేపాడు. ఆ కాలంలో ఎవరైనా తప్పు చేస్తే రాళ్ళు రువ్వి చంపటం ఆచారం. ఆ ప్రాంతంలో ఒక స్త్రీ వ్యభిచారతనం జరిగించటం ప్రజలకు తెలిసింది. వెంటనే ఆ స్త్రీని ఊరి బయటకు తీసుకువెళ్ళి రాళ్ళు వేసి చంపటానికి సిద్ధంగా ఉన్నారు. ఆసమయంలోనే క్రీస్తు అటు రావటం సంభవించింది. జనం గుంపుగూడి యుండటం చూచి వారిని సమీపించాడు. క్రీస్తును చూస్తూనే అందరూ ప్రక్కకు తిరిగి త్రోవ యిచ్చారు. వారిని క్రీస్తుచూచి ఇచ్చట మీరుగుంపుగా కూడి ఉండటానికి కారణ మేమిటని అడిగాడు. ఆ కాలంలోనే మతాధికారులనే కులు క్రీస్తు కంటే పెద్దవారు. అతనియొక్క బోధల యెడల అసూయగా ఉండేవారు. అతని బోధలన్నిటినీ ప్రజలు ఆదరించి తమ మాటలు వినక పోవటంచేత ఎలాగైనా క్రీస్తులో ఒక తప్పు కనిపెట్టి అతన్ని వోడించాలని పట్టు పట్టారు. అపుడే మంచి సమయం దొరికింది. గుంపులోకి వచ్చిన క్రీస్తుతో ఇలా అన్నారు. ఈమె వ్యభిచారం చేసింది. శాస్త్ర ప్రకారం తప్పు చేసిన వారిని రాళ్ళతో కొట్టి చంపాలని ఉంది. ఇందు నీయొక్క అభిప్రాయమేమిటని అడిగారు. అందుకు క్రీస్తు నవ్వుతూ మీలో ఏతప్పు చేయనటువంటి వాడు మొట్ట మొదట రాతితో ఈమెను కొట్టవచ్చని చెప్పాడు. ఈమాట విన్నవారి ముఖాలు తెల్లబోయాయి. ప్రతివాడూ ఏదోఒక తప్పు చేసినవాడే. కొబట్టి అందరూ మారు మాట పలుకక ఎవరిండ్లకు వాళ్ళు వెళ్ళిపోయారు. అపుడు క్రీస్తూ, స్త్రీ మిగిలారు. క్రీస్తు ఆ స్త్రీని చూపుతూ ఇంకెపుడూ ఇలాటి పాపము చేయవద్దు. నీ పాపము

ఎన్నిటినీ క్షమించానని చెప్పి వెళ్ళిపోయారు. చూశారా తమలో తప్పుంచుకుని ఇతరుల తప్పులను పట్టేవారికి శిక్ష విధించే వారికి, పైవ సమాధానం ఎలాఉంటుందో? మీరుకూడా తప్పు చేసిన వారిని అనవసరంగా శిక్షించ బోకండి. ఆనాటి క్రీస్తు జనులందరూ కూడి తనను శిలువ వేసినా వారినేమీ అనకుండా దేవునితో తండ్రీ! వీరేమి చేయుచున్నారో వీరికే తెలియదు గనుక వీరిని క్షమించమని ప్రార్థించాడు. ఆ తరువాత ఆ మహాపురుషుడు చనిపోయిన మూడవ దినాన లేచి తన శిష్యులందరికీ దర్శనమిచ్చి వారితో మరికొన్ని దినములుండి.... ఉన్నపాటున ఆకాశంలోకి ఆరోహణమయ్యాడు. ఆ మహామహుని జన్మదినం ఈ నెలలోనే. మీ రంతా క్రీస్తు యొక్క ఆదర్శాలను గ్రహిస్తే, ముందుకు గొప్పవారవుతారు. డిసెంబరు, ఇరవై యైదవ తారీఖున మరువకుండా మన పాపములకోసం అనవసరంగా చనిపోయిన ఆమహామహునికి జోహార్లు అర్పించాలి.



# ★ అపరంజి బొమ్మ ★

శ్రీ జూలూరి హనుమంతరావు, బి.కాం.

[బాలసాహిత్యంలో ప్రత్యేక కృషి చేయుచున్న శ్రీ జూలూరి హనుమంత రావుగారి రచన.]

బృందగానం :-

అదిగదిగో పూల తోట
అందమైన పూల బాట
ఆబాటన చలువ రాళ్ళ
అరుగుపైన ఒక బాలిక.
విరిసిన పున్నమి వెన్నెల
వెన్నెల చిందేటి జాబిలి
జాబిలిలో జింకపిల్ల
చక్కని కన్నులు త్రిప్పుచు
బాలిక ఆ అరుగుపైన
పవ్వళించి కనుచున్నది
చల్లని జాబిల్లి లోని
చక్కని చుక్కను జింకను.

బాలిక :

పాల సంద్రంలాంటి వెన్నెలా
తేలు జాబిలి ఒక్క పడవగా
ఆపడవలో ఒక్క
అందాల పసిపాప
ఆటపాటల తోడ ఆడురా
ఆజింకతో గూడి ఆడురా
పసిపాపపై పూల
వాన జల్లులు కురిసె
చుక్కలే తెలిమల్లె పూలుగా
సొబగు మినుకుల చుక్క పూలురా.
యెంత తియ్యని రేయి
ఈరేయి నే నాడి
ఆపాపతో చెలిమి చేయగా
ఆగునా ఆపడవ చేరగా
పాల సంద్రంలాంటి వెన్నెలా
తేలు జాబిలి ఒక్కపడవగా
(దూరంగా జాబిల్లిలో నుండిపాట)
ఆగవే పోవకే
ఆగవే జింకా!
ఆకాశ మార్గాన.
అలుసుకొన్నది మబ్బు
కారు మబ్బుల లోన
దారికనబడ దయ్యె
ఆగవే పోవకే
అందు కొందును నిన్ను
ఆగవే పోవకే
ఆగవే జింకా!

బాలిక :

అజింక ఎక్కడో!
ఆపాప ఎక్కడో!
పసిపాప పరుగెత్తి
పట్టుకొన దలచినది
దారి తెలియని జింక
దగ్గఱనె నిలచినది
తొలగిపోయిన వంత మబ్బులు
తొలకరించిన దంత వెన్నెల
జింక పాపను పాప జింకను
చేరికొని నారే!

(దూరంగా జాబిల్లిలో నుండిపాట)
నల్ల మబ్బులోన్వ లేవు
తెల్లదనము మెచ్చలేవు
చందమామపై కోపము
పొందనేలనో వానికి
పొన్న చెట్టు కడకుపోయి
పొన్నపూవు లేరుదమా?
పూలు దండకట్టి.... ఎవరి
పూజ కొరకు కట్టుదమే?
ఎవరి మెడను వేయుదమే!
ఎవరి కొఱకు వెదకుదమే!

బాలిక :

పసిపాపకు తగిన జింక
పసిడి పలుకు పలుకు పాప
పూలు దండ కట్టునటే!
పూజకొరకు కట్టునటే!

ఎవరి పూజ కొఱకో! అది
దైవ పూజ కొఱకో!

పాప నేను కలిసి ఆడ
బాగుండును కాదా?
జింకతోడ ఆడుకొనగ
చెలిమి మాకు కాదా?

జాబిల్లి పడవగా
సాగిపోయెడి పాప!
నను కూడ నీతోడ
కొనిపోవ రావా?

(విమానం వస్తున్న చప్పుడు. ఆ విమానంలో దేవత లుంటారు)

1 వ దేవత :
భూలోక స్వర్గాన
పోవు చున్నామే!
హాయిగొలిపెడుగాలి
తీయ తావుల పూలు
పూల తోటల పైన
పోవు చున్నామే!

2 వ దేవత :
చూచినావే చెలీ!
సుందరమ్మా తోట
ఆ పూల తోటలో
అందాల పసిపాప!

1వ దేవత
తెల్లని వెన్నెల లోపల
చల్లని పువ్వుల లోపల
పవ్వళించి పాప యేదో
పలువరించు చున్న దే!

బాలిక :
జాబిల్లి పడవగా
సాగిపోయెడి పాప!
నను కూడ నీ తోడ
కొనిపోవ రావా?

2వ దేవత
జాబిల్లితో పాప
సఖ్యమ్ము కోరినది
జింకతో ఆటాడి
స్నేహింప దలచినది

1వ దేవత :
జాలిగొలిపెడి పాప
జాబిల్లి చేరవలె
ఆ పాపతో గూడి
ఆటాడి పాడవలె.

2వ దేవత :
దేవతలమే మనము
తీర్పవలదా కోర్కె?
మనమె తీర్పకయున్న
మఱితీర్చు వారెవరు?

1వ దేవత
మనుజులకు సహాయ్య
మొనరించుటకె మనము
దేవతల మైత్రిమే
తీర్పవలెనే కోర్కె

2వ దేవత :
ఈ విమానము పూల
తావిలో పోనిమ్ము
పాప ఉండిన పూల
బాటలో పోనిమ్ము.

(విమానం దిగుతున్న చప్పుడు)

1 దేవత :
పాపమా పాపెటుల
పలువరించునో చూడు
గుండె దిగులు పొంది
కుములి పోవునో ఏమొ :

బాలిక :
జాబిల్లి పడవగా
సాగిపోయెడి పాప
నను కూడ నీ తోడ
కొనిపోవ రావా?

2వ దేవత :
ఎవరిపాప వమ్మాయీ?
ఏలచింత లమ్మాయీ?

# అపరంజి బొమ్మ

1 దేవత :

అమ్మ నాన్న లేర నీకు
అర్ధరాత్రి ఐనదికద !

బాలిక :

ఈ పూల తోటలో
ఇవతలనె మా యిల్లు
ఆ పూరి పాకలో
అమ్మ నాన్నలు కలరు.

2వ దేవత :

ఒంటిగా తోటలో
ఉంటివే మమ్మా ?

బాలిక :

పాకలో పడుకొంటి
వచ్చినది జాబిల్లి
విచ్చె పూవులు : చక్క
వచ్చినే పడుకొంటి

1వ దేవత :

భయములేదా నీకు ?
పసిపాప వమ్మా !

బాలిక :

పండు వెన్నెల లోన
భయ ముండునా ?
ప్రక్కనే మా యిల్లు
భయ ముండునా

2వ దేవత :

జాబిల్లి అననెంత
సంతోష మమ్మా
ఆ చందమామతో
ఆటాడు వమ్మా :

బాలిక :

అదిగో జాబిల్లిలో
అందాల పాప !
ఆ పాపతో జింక
ఆడునదె చూడు !

1వ దేవత :

ఆ పాపతో గూడ
ఆడుదువా బాలా
ఆజింకతో గూడ
ఆడుదువ పాపా ?

బాలిక :

ఆడుదును ఆడుదును
ఆపాపతో గూడ
ఆజింకతో గూడ
ఆడుదును ఆడుదును

2వ దేవత :

ఆజింకతో గూడ
ఆడుదువు, పాపతో
జాబిల్లిలో చేరి
చక్కగా పాడుదువు.

బాలిక :

దారిలేమగ పాప
దగ్గఱకు పోవుటకు
ఎంతదూరమొ తెలియ
దెవ్వరికి జాబిల్లి !

1వ దేవత :

మేము చేర్తుము చంద
మామ లోనికి నిన్ను
పాపతో ఆడుకొని
పాటపాడుదువమ్మ

బాలిక :

దూరాల పాపతో
దోబూచు లాడుకొన
చేరువగ జాబిలికి
మీరు దేవతలా ?

2వ దేవత :

తెలియదమ్మా నీకు
దేవతల మేమేము

బాలిక :

మనుజులకు దేవతలు
కనబడరు కాదా ?

1వ దేవత :

పెద్దవారికి మేము
కనుపింప మమ్మా !

పసిపాపలకె మేము
కనుపింతు మమ్మా!

బాలిక:

ఎందుకని కనబడరో
సందేహ మమ్మా!

2వ దేవత

ఏది చెప్పిన వినరు
ఈ పెద్దలమ్మా!
మాయమర్మము లాడు
మనుజులే తల్లీ!

బాలిక:

ఎందుకని కనబడుదు
రీ పాపలకు మీరు?

1వ దేవత:

మాయమర్మము లేని
తీయ పలుకుల వారు
పసివారు దేవతలు
బాల! తెలిసినదా?
(దూరంగా జాబిల్లిలో నుండి పాట)
ఛెంగు ఛెంగు మంచుదూకు
చిన్ని ముద్దు జింకవే!
వెన్నముద్ద వలె మెత్తని
వెన్నెల పూడొంకలే!
పొన్నక్రింద అవ్వవడకు
సన్నని దారమ్ములే
మంచి పాటలన్ని చంద
మామకు ద్వారమ్ములే!
ఛెంగు మనుచు దూకిపాట
చెప్పి నాట్యమాడవే!
బోసినోటి అవ్వచూచి
బోసి నవ్వు నవ్వవే!
ఛెంగు ఛెంగు మంచుదూకు
చిన్ని ముద్దు జింకవే!
వెన్నముద్దవలె మెత్తని
వెన్నెల పూడొంకలే!

బాలిక:

జింక నాట్యమాడు చూడు
చిన్ని పాప పాడు చూడు
పాపతోడ నేనుకూడ
పాడవలెను ఆడవలెను.

2వ దేవత:

త్వరపడకు జాబిలికి
పయనమై పోవుదము

బాలిక:

ఆలస్య మైనచో
ఆపాప ఉండునా?
జాగైనా పవలైనా
జాబిల్లి ఉండునా?

1 దేవత:

ఈ విమానము లోన
ఎక్కవే బాలా!
చెలి! రావె పోవుదము
చిన్ని జాబిలికి.
(విమానం పోతున్న చప్పుడు)

2వ దేవత:

పయనించి పయనించి
వచ్చితిమి జాబిలికి
ఇంత వెన్నెల నింపు
నిదెచంద మామ.

బాలిక:

పరువెత్తు జాబిల్లి
పడవఅను కొన్నాను
జాబిల్లి వెన్నెలను
సంగ్రమను కొన్నాను.

1వ దేవత

ఏమి నేర్చితి వమ్మ
ఇచ్చటకు వచ్చి?

బాలిక:

పరువెత్తు జాబిల్లి
పడవ కానే కాదు
జాబిల్లి వెన్నెలన
సంద్ర మనలే కాదు.

2వ దేవత:

అవును నీవేమేము
అనుకొంటి వమ్మా

# అపరంజి బొమ్మ



బాలిక :

హాయిగూర్చెడి ఒక్క
అందాల నేల
అందులో జాబిల్లి
అద్దాల మేడ.

1వ దేవత :

నిజము పలికితివమ్మ
నీవు పసిపాపా !

బాలిక :

లేదేమి పసిపాప
లేదేమి యిచట ?
చిన్నారి ఎచ్చటకు
జింకతో వెళ్ళినది ?

2వ : దేవత

పాప కనబడదిపుడు
వచ్చు నిముషాన.

బాలిక :

ఎచ్చటకు వెళ్ళినది
యీపాప యిపుడు ?

1వ దేవత

ఆపాప నీవన్న
అందాల జాబిల్లి
అద్దాల మేడలో
అపరంజి బొమ్మ !

బాలిక :

చూడవలె అద్దాల
సొంపులో పసిపాప !

2వ దేవత :

మేడలో అద్దాం
నీడలో బొమ్మ
సొంపు లింపులు అచట
చూడగా రమ్మ.

బాలిక :

వరుసగా మేడలో
బంగారు బొమ్మలే
పాప కనబడదమ్మ
పాపెచట నమ్మా ?

బొమ్మలు :

చిట్టి చిట్టి పాపరావే
చిలుక పలుకు చిన్నిరావె
ఆటలాడి పాడరావె
అందమైన పాపరావె
బంగారు బొమ్మలము
కంగారు పడవలదు
మాటలాడు శక్తి నం
పాదించి నామమ్మ !

బాలిక :

బంగారు బొమ్మలా !
పాట పాడినవా



# అపరంజి బొమ్మ

పాట పాడినవా!
మాట లాడినవా!

1 దేవత:

అబ్బురం పడవలదు
ఆ బొమ్మలే చెప్పు
దగ్గఱనె నిలబడుచు
తమ కథలనన్ని.

బొమ్మలు:

పదియారు బొమ్మలము
బంగారు బొమ్మలము
విందువా మా పేర్లు
వినుమమ్మ పాపా!

1వ బొమ్మ:

సత్యమను బొమ్మనే
జ్ఞానమను బొమ్మ అది
శాంతమను బొమ్మ అది
న్యాయమను బొమ్మ అది
నలుగురము మేమమ్మ
నవ్వు కొందుము కలిసి.

బాలిక:

తెలిసినది మీ రెవరో
తెలుపుడీ మీ పేర్లు.

2వ బొమ్మ:

ఉత్సాహమును నేను
ఓర్పన్న బొమ్మ అది
దయ అన్న బొమ్మ అది
ధర్మమను బొమ్మ అది
కలిసి నలుగురమేము
కనబడుదు మొక్కటిగ.

బాలిక:

తెలిసినది మీ రెవరో
తెలుపుడీ మీ పేరు

3వ బొమ్మ

నీతి బొమ్మను నేను
శుచి అన్న బొమ్మ అది
అందమను బొమ్మ అది
అహింస అను బొమ్మ అది
మేము నలుగురు మెపుడు
మెఱుగు చూపెట్టుదుము.

బాలిక:

తెలిసినది మీ రెవరో
తెలుపుడి మీ పేర్లు

4వ బొమ్మ:

శ్రేయసందురు నన్ను
ప్రేమ అను బొమ్మ అది
భాగ్యమను బొమ్మ అది
భోగమను బొమ్మ అది
మేము నలుగురం మెపుడు
మిల మిలల మెఱసెదము.

బాలిక:

అవుగాని మీలోని
అందాల పాపెచట?

బొమ్మలు:

పాప వేరుగలేదు
పాపయే మేమమ్మ!

బాలిక:

ఆగుదురో మీ రెట్లు
అందాల పాపగా!

బొమ్మలు:

పదియారు బొమ్మలము
బంగారు బొమ్మలము.
కలసి పాపగ మారి
కనబడుదు మమ్మా!

బాలిక:

పాపయా! మీరు కను
పాపలకు కలలేమో!

బొమ్మలు:

కలగాదు పాపగా
కనబడుదు మమ్మా!
కలియగా అందరము
కలుగు శక్తులు మాకు
శక్తులన్నియు కలిసి
చక్కనౌ రూపమే
అందఱకు కనబడెడి
అందాల జాబిల్లి;
పాప! చూడుము మేము
పాపగా మారెదము.

2వ దేవత :

ఒక్కొక్క బొమ్మయే
ఒక్కొక్క కళగా
అన్ని బొమ్మలు కలిసె
అందాల పాపగా
అందాల పాపయే
అపరంజి బొమ్మ !

బాలిక :

వరుసగా జాబిలికి
పదియారు కళలనుచు
చిన్ని జాబిలి చూపి
చెప్పినది అమ్మ !
బంగారమున కెపుడు
జిలుగు పూవులు తెచ్చి
చెప్పె మానాన్న !

1వ దేవత :

అవునను నిజమమ్మ !
అదియంత నిజమమ్మ !

బాలిక :

అవుగాని జింకెచట ?
అపరంజి బొమ్మా ;

అ. బొమ్మ :

జింకకాదది నాకు
జీవశక్తియె కాని
ఆశక్తియే నేను
ఆడు కొనునా జింక

బాలిక :

పొన్న మ్రానని అవ్వ
బోసి నవ్వంటివే !
అదియేమొ చెప్పవా?
అపరంజి బొమ్మా !

అ. బొమ్మ :

పదియారు బొమ్మలకు
పదియారు కళలు
ఆ కళలు సద్గుణము
లందురో పాప
ఆ గుణము లెవరిలో
అమరునో వారు
సర్వ శక్తులు పొంది
జ్ఞాన మొందెదరు.
అజ్ఞాన వృక్షమే
ఆపొన్న మ్రాను
అజ్ఞాన పుష్పాలె
ఆపొన్న పూలు.
ఆపూల దండయే
ఆ తపస్సగును
అది దైవపూజకే
అర్పితంబగును.
అనుభవమ్ముల తోడి
అవ్వయే ఆత్మ
దండకై సంతసపు
దారమ్ము వడకు.

బాలిక :

ఎంత విజ్ఞానమ్ము
ఇచ్చితివె పాపా !
ఆ గుణములను నేను
అలవరచు కొందు.

అ. బొమ్మ :

దైవమును ప్రార్థించు
దముశక్తి కొఱకు
పాడవె నాతోడ
పసిపాప ! పాట

బాలిక }
అ. బొమ్మ } లోకాల పాలించు

లోకాధి నాయకా !
జ్ఞానశక్తుల నిచ్చి
సాకవయ్యా ! మమ్ము
పసిపాపలము మేము
పాలింపు మోదేవ
జ్ఞానశక్తుల నిచ్చి
సాకవయ్యా మమ్ము

2వ దేవత :

పాప యెవరో చిట్టి
పాప ! తెలిసినదా ?

1వ దేవత :

హాయిగా పాపతో
ఆడుకొంటివ తల్లి ?

## అపరంజి బొమ్మ

పాపతో తీయగా
పాడుకొంటివా తల్లి?

బాలిక :

పాప సామాన్యమా?
పాపయే జ్ఞానమ్మ
ఆ గుణములను నేను
అలవరచు కొందు
మా అమ్మతో పాప
మాటలను చెప్పుదును
మా నాన్నతో పాప
మహిమలను చెప్పుదును.

దేవతలు :

చెప్పుమా పాపా :
చెప్పు మా పాపా :

బాలిక :

దింపరా తోటలో
దింపరా మీరు?
దింపకున్నను మీరు
దిగి పోవు టెట్లు?
విషయ మమ్మకు నేను
వినిపించు టెట్లు?

దేవతలు :

ఈ విమానము లోన
ఎక్కవే బాలా!
దించుదుము తోటలో
దిగి పోదువమ్మా?

బాలిక :

వందనము జాబిల్లి!
వందనము పాపా!
అను కొందు నిన్నెపుడు
అపరంజి బొమ్మా!
(విమానం వెళ్ళుతున్న చప్పుడు)

1వ దేవత :

ఇదె తోట వచ్చినది
ఇక విమానము దిగుము
వెళ్ళు చుంటిమి పాప
వెళ్ళి వచ్చెదము.

బాలిక :

మీ సాయమున నేడు
మెలసె జ్ఞానము నాకు
వందనము మిమ్మెపుడు
వదలి మరువను నేను

దేవతలు :

మరువకుము మరువకుము
మా మంచి పాపా!
వచ్చెదము వచ్చెదము
బంగారు పాపా!
(విమానం వెళ్ళి పోతుంది.)

బాలిక :

(పరుగుతో)
అమ్మా! అమ్మా! అమ్మా!
జాబిల్లిలో చేరి
జ్ఞానమును పొందితిని
అచటి పాపకు నాకు
అలవడెను స్నేహమ్ము.
ఆ పాప యెవరనిన
అపరంజి బొమ్మ.
ఆ పాపయే నాకు
అపరంజి బొమ్మ.



## చుట్టరికము

నేనొక యవ్వన పుత్రిక గల పూర్వ సువాసినిని వివాహమాడితిని. నా తండ్రి నా సవతి కుమార్తెను ప్రేమించి వివాహమాడి నాకు అల్లుడాయెను. మరియు నా సవతి పుత్రిక నా తండ్రి అర్ధాంగి గావున నాకు తల్లి అయ్యెను—

నా భార్య ఒక పుత్రునిగనెను— బాలుడు నా తండ్రికి బావమరిదియు నాకు సవతితల్లి సోదరుడు గావున మేన మామయ్యెను.

నా తండ్రి సతియు ఒక కుమారుని గనెను, ఆ పిల్ల వాడు నాకు తమ్ముడును, నాకూతురి కుమారుడు గావున మనుమడయ్యెను.

అట్లే, నా భార్య నా తల్లి తల్లి గావున నాకు అమ్మమ్మ ఆయె—నేను నాభార్యకు భర్తనై మనుమడనై మరియు అమ్మమ్మ భర్త తాతయ్య గావున—

నాకు నేనే తాతయ్యని!!!

"సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత మార్క్‌ట్వేన్"



# ఆనందం

బాబూ

వసంత ఋతువులో
వనముల దగ్గర
రంగుపూలపై
ఎగిరే చిలుకలు

చూచేటప్పుడు
ఆనందం-నాకానందం

గున్న మామిడీ
కొమ్మల మీదను
కోకిల బాలలు
కుహూ కుహూయని

కూసేటప్పుడు
ఆనందం-నాకానందం

ఆకాశములో
చుక్కల మధ్యా
చక్కగ నవ్వే
చంద మామనూ

చూచేటప్పుడు
ఆనందం-నాకానందం

చిటపట చినుకులు
పడు చున్నప్పుడు
చారలు చాచి
గిరగిర తిరుగుచు

ఆడేటప్పుడు
ఆనందం-నాకానందం

వర్షము కురిసీ
వెలిసిన వెనుకా
ఏడురంగులా
ఇంద్ర ధనస్సును

చూచేటప్పుడు
ఆనందం-నాకానందం

ఆట లాడుచూ
పాడు చుండగా
"బాబూ! మిఠాయి"
అనుచూ అమ్మా!

పిలిచే టప్పుడు
ఆనందం-నాకానందం



# నందేరాజా భవిష్యతి

శ్రీమతి దీదువాని బదరీనారాయణమ్మ

పూర్వం ఉపాయాలు చేత పూళ్లు ఏ రేవా రు. ఉత్తుంగభుజుడు ధర్మనిరతుడు. సాహస, ధై ్య. వితరణ గుణములచే సహస్రవర్షాలు సభాస్థానాన్ని సమర్థించాడు, ప్రజలందరిచే, పరమపితా, అనిపించు కున్నాడు. కాని (ఎంతనేర్చినా కాంతదాసులే) అను కవులభావాలలో యితనొకడు, ఇద్దరభార్యల మొగుడు ఇరుకునపడ్డాడన్న సామెత యిందులో స్ఫురిస్తూవున్నది. పెద్దభార్య మహా పతివ్రతంటే, చిన్నభార్య చీత్మరాణి అని వూహించు కొనవలశినదే. పెద్దభార్యకు నందిరాజు పుట్టుట తోడనే, చిన్నభార్యకు చిటపటలు ఎక్కువ అయాయి. చీమలు దూరని చిట్టడివిలో చిట్టెడు మొక్కజొన్న లిచ్చి, చెలికత్తెసహాయముతో వేరుపెట్టించినది. ఒక చెంపకొడితేపాలు ఒక చెంపకొడితే నీళ్లు కారే, చిన్నబిడ్డను చూచియైనా జాలినొందక, ఉత్తుంగ భుజుడు, చిన్నభార్య వలలోపడి, యిహపరాలకు దూరమైనాడు. సమస్థానాల్లో సాధారణముగా సప్లయిచేశే షాహుకారు యథాలాపాన్ని సహస్ర రూకలవిలువకల ఒక సాడీనితెచ్చి ప్రభువుని సమర్థించమన్నాడు. చీరచూచి. చిన్నభార్య, జేజేలు కొట్టినది. ఎన్నివలపులు చూపినారాజు చీరకొనుటకు ఒప్పుకొన లేదు. చీరచెల్లుబడి కాలేదని చైతన్య హీనుడై షాహుకారు, చీరచేతపట్టుకొని, చిట్టడివిగుండా పోసాగినాడు. కడుపేదు కష్టాలలో, కన్నతల్లిలా కాపాపిన, గండకి, వాణిజ్యునివాలు మొహాన్ని చూచి వాకబు చేసినది. వాణిజ్యుడు, జరిగిన వృత్తాంతమంతా విన్న వించి, చమటబూర్చి సంపాదించిన యీ. చీరను సమర్థించే ప్రభువులేక, చీరగతికి విచారిస్తున్నానన్నాడు. (సాహసేలక్ష్మీ) అని గండకి చీరపట్టుకుని పెద్దభార్యకు చూపి తీసుకోమన్నది. చేత పైసా లేని పెద్దభార్య దీనాలాపంతో, యిటువంటి పరిస్థితులలో ప్రమాదాలు వాటిల్లుతుందిసుమా అని చెప్పెనది. (ఉత్తుంగభుజనాశేనా, దేశ కాలగతోపి వా వణి గ్వరశ్చనాశోవా, నందేరాజా భవిష్యతి) అమ్మా? కాలము తారుమారవచ్చు. వాణిజ్యునకు ఒక సంవత్సరము షరతుపెట్టి యీ చీరతీసు కుందాము కాలమాసన్న మైన రాజు, గతించకూడదా నంది రాజు. రాజుకాకూడదా, కష్టాలు కలకాలం వుంటాయా, కార్యసాధనం కావలశినది, నేను తీసుకోక తప్పనని, షాహుకారువద్దకు వచ్చి, చిన్నబిడ్డచే చేతిముద్దర వేయించి, షాహుకారుకు సంవత్సర షరతుమీద చీరతీసుకున్నది. గండకి చేశినపనికి షాహుకారు శెభాష అని అనుకున్నాడు. అమ్మగారైనా కట్టని చీర కట్టుకుని, గండకి, రాజప్రాంగణాల ముందర రాకపోకలు మొదలు పెట్టినది. రాణీగారి చెలికత్తెల దగ్గర, రభసాలు మొదలుపెట్టినది. (రాజుగారు బాగుంటే మా అమ్మగారికి ఏమిలోటు అని) చిన్నరాణి చిటపటలే వెలితి కాని, ప్రభువుగారి ప్రేమకు అడ్డేమున్నది. అడవిలో నున్నా కానీ ఆకాశం మీదనుంచి, వచ్చిపడుతూనేవున్నవి అన్నిభోగాలు అక్కడనే జరుగుతున్నవని అన్నది. చెలికత్తెల చిలిపితనాన్ని చెప్పాలా, చిన్న భార్యగారి చెవిలో వూదినారు, శయ్యాగారంలో చిన్నభార్య అలక కైకేయి కాళ్లేపట్టుకున్నాడు దశరథమహారాజు. ఎంత బ్రతిమాలినా వినదు, కల్పితాలు అంటే నమ్మదు, అలకతీర్చ లేక కడప్రాణాలువచ్చాయి. తిట్టావద్దు. కొట్టావద్దన్న సామెత లాగ ప్రాణంవిసిగి పరమ పదాన్ని పొందినాడు.

గుండికి కార్యసాధనానికి మెచ్చుకోవాలి. నందిరాజు పట్టాభిషేకం. వాణిజ్యుని వరదానం చెల్లించినది. చిలిపితనం గల చిన్నభార్య, చేశిన తప్పుకు చింతించి. అక్కా నీకూ నాకూ ఒక్కడేకాదా కొడుకు అని అన్నది. కళ్ల రెప్పలకు వలె కన్నతల్లిని, పిన్నతల్లినీ చూచుకుంటూ వుండేవాడు నంది రాజు.



# గేయకవి - ప్రశస్తి

శ్రీ జి. కృష్ణ

**సాయంకాల** మౌతూంది. పక్షుల కిలకిలారావములు ప్రతిధ్వనిస్తున్నాయి. ఒకసెలయేటి దరి ఇసుక తిన్నెల పై ఒక మధుర గేయకవి తన గేయాల్ని ఆహ్లాదకరంగా వెదజల్లుతున్నాఁడు. అతని గేయాల్ని వినుటకై పొలా ల్నుండి హలాల్ని భుజముల మీదుంచుకొని యెడ్లను ది లించుకొని వస్తున్నారు. వచ్చినవారంతా అతని మధుర గేయ సముద్రంలో తేలిపోయారు. తేలిపోరేం చక్కటి గేయాలు పల్లెప్రజలందరికీసులువుగా అర్థమౌతాయి, తుదకు యెద్దులు సహితం ఆతని గేయరాగాల్ని విని రావడి నిలుచు కొంటాయి. పొలాల్లో యెన్నోకష్టాల్లో కష్టించెడి కర్ష కులు సాయంకాలమున అచటికి వచ్చుసరికి వారు ఆనంద ముఖాల్ని చూపెడతారు. ఎన్నికష్టాలున్నప్పటికి సాయం కాలమున సంతోషంగానే వుంటారు. వారి ఆనందము ఖాల్ని చూసేదానికి ప్రతిదినం అతడు సెలయేటి దరికి విచ్చేసి యేవో తనభావ గేయాల్ని పాడుతుండేవాడు. ఇది అతనికి కులాసాగా వుండేది.

గేయకవిది ఒక చిన్నగ్రామం. ఆ గ్రామసమీపము పట్టణాధీశుడైనరాజుగారిది. ఆ రాజుగారి అనుమతి చే "నెయ్యన" అను ఒక కవి జీవించుటకొఱకు యిచ్చిన ప్రదేశం, దీనినే అగ్రహారమంటారు. సమీపమున నున్న రాజు మిక్కిలి దయాపరుఁడు కనుకనే ఆతనిరాజ్య మందు ప్రజలు సుఖంగా జీవించేవారు. ఆతని ఆస్థానాన్నే అగ్రహార యజమానియగు 'నెయ్యన' కవియుండేవాడు.

నెయ్యన గొప్పకవియు పండితుడు. ఇతఁడు చక్క గా వ్యాకరణరీతుల పదములనుపయోగించి చందోబద్ధమైన కవిత్వము జేయువాడు. ఇతడు యేమహాపురుషునో లేక గొప్ప వీరునో తీసుకొని పదునెనిమిది వర్ణనలతోవర్ణించి పదములు కూర్పకురానప్పుడు కష్టమైన పదములను చొ ప్పించుచు కవిత్వముచేసి రాజులదగ్గరకు తీసుకొనిపోయి వారి అనుమతికి పాత్రుడగు చుండెడివాడు కాని సామా న్యమైన కర్షకునో లేక బీదనో తీసుకొని వారికష్టములను కవిత్వమున చూపెట్టి వ్రాయువాఁడు కాడు. ఇటువంటి కవిత్వము కొంత కవిత్వమునందు అనుభవమున్నవారికి తప్ప ఇతరులకు అర్థంగానేరదు గదా! రాజాస్థానమున నెయ్యనకు ఈరీతి కవిత్వమంటేనే ఇష్టంగా వుంటుంది.

ఈ విధానమున్న నెయ్యన అధికారములోనున్న అగ్రహారం లో మనగేయకవి తియ్యన నివసించుచున్నాఁడు. ఈత నిది ఒకచిన్న పూరిగుడిసె. ఆ గుడిసెనానుకొని ఒక మర్రిచెట్టు వుంది. ఆచెట్టు పండ్లతోనిండి ప్రకాశిస్తోంది. చల్లని పిల్లవాయులు ఆయింటివైపు మెల్లనవీస్తునట్టి యింటియందు ఆనందముతో నివసించుచు సంతోషంగా వ్యవసాయము చేసుకొనుచుండెడివాడు.

ఆ గ్రామాన్నే గ్రామాధికారియగు నెయ్యన నివసించెడి వాడు. గేయకవిత్వమంటేనే అతనికి పట్టుకోదు. ఆతఁడు తియ్యనను చూచినప్పుడు "బాగున్నాయిరా! నీభావగేయా లు! వెధవ చందస్సుకు వ్యతిరేకంగా వ్రాస్తున్నావు! యేమిటి నీకవిత్వం! నీకవిత్వాన్నిజూచి నీవే ఆనందిం చుకో" అని హేళన చేసేవాఁడు. కోపపడేవాడుకూడ. "మహాకవులయిన మేము రాజులచేగాని పండితులచేగాని, మన్నన పొందుదురేగాని సామాన్య ప్రజలచేత మన్నన పొందరుకదా" యని తృప్తిచెందెడివాడు.

ఇక గేయ కవియేమి చేయగలడు. మరుమాట పలి కితే నెయ్యన అగ్రహారమునుండి తరుమునట్లున్నది. మరి ఒకనాడు అర్థే కోపగించగా చందోకవిత్వము వ్రా యుదునని ఒప్పుకున్నాడు. వ్యాకరణ రీతిగ వ్రాయ ప్రయత్నించినాడు. యతి ప్రాసలందే ఆతనికి కష్టమౌ తుంది. ఎంతోకష్టపడి పద్యాన్ని వ్రాస్తే దానియందుభావము లేకుండుటచూచి దుఃఖించినాడు. కాని ఎంతప్రయత్నం చేసినా కాకపోవుటవల్ల ఆతనిని నిరాకరించి తనగేయాల్నే వ్రాయుచు ప్రతిదినమును సెలయేటి దరికిపోయి ప్రజలను ఆనందముగ జేయుటచాలని నిశ్చయించుకొన్నాఁడు.

ఒకనాడు రాజు పండిత సభను పిలిచినాఁడు. అంద రును ఆసనములపై కూర్చొన్నారు. నెయ్యనగూడ ఒక ఆసనముపై ఉపవిష్టుడై యున్నాఁడు సభయంతయు హాజరైనది, పండితుల రచనలు విమర్శనలు ప్రారంభ మైంది సామాన్య ప్రజలు వారి ముఖములు చూచుట తప్ప ఇకనేమియు అర్థంకావటంలేదు. కాన ఇక వారేం చేయగలరు. ఒకొక్కరు మెల్లగా కదలిపోసాగిరి. పండిత పరిషత్తు పూర్తియగుసరికి రాజు, మహాపండి తులు తప్ప ఇక యెవ్వరును లేకపోయిరి. ఎట్లో ఆనాఁడు పండితసభ ముగిసింది.

ఆ పట్టణమును పాలించురాజు యేటిసమీపమున నున్న వుద్యానవనానికి యేగుదెంచాడు. ఆ వనములో ఉన్న నందివర్ధనపు పుష్పముల వాసనలను పీల్చుచు మనోహరముగ చిలుకలు గోరువంకలు చేయు ధ్వనులను విని సంతోషించాడు. సాయంకాలమైనది. రాజు సంతోషంతో సమీపమున నున్న భవనములోనికి వెళ్ళి రతనాల గద్దియపై కూర్చొన్నాఁడు. ఆతని యెదురన సరస్వతీదేవి పటము ఉంది. సెలయేటి దరినిపాడుచున్న గేయాల్ని విని రాజుగారు తక్షణమే మూర్ఛిల్లి ముగ్ధుడయ్యాడు. ముగ్ధుడైయుండి రాజుకలలో వాణి ప్రత్యక్షమై "భావ గేయములపై నా కేలాటి ద్వేషం లేదు. ఛందస్సుకై రచింపబడిన గ్రంథములయందు యెంత ఆశయున్నదో అంత ఆశ భావగేయములపై వున్నది, ప్రజలను చైతన్యులను జేయునవి నవభావగేయాలే పామర జనానీకానికి సేవజేయునవి నవభావగేయాలే కాన నీ వాతని బిలిపించి తగుసత్కారముచేసిఅతనినీయాస్థానము నందుంచుకొను" మని తననిజ స్వరూపమును భావగేయ గ్రంథములను ఛంధోవ్యాకరణ గ్రంధములను సమానముగనుండునట్లు యాభరణములుగ దాల్చి నాతనికి కనుపింపజేసి మాయమయ్యెను. అట్లే నెయ్యనకుగూడ తెలియునట్లు జేసింది. మఱి నెయ్యనకు ఆతఁడు కొన్నిదినములు గడచినపిమ్మట వ్యాకరణ సంబంధమగు కవిత్వాన్ని పామర జనానురంజితముగా వ్రాయఁగలడని విన్నవించింది. రాజు నిద్రబోయినట్లు లేచి యిటు అటు తిరగిచూచాడు యెవరున్నారు? యెవరులేరు. భావ గేయాలకున్న తేటను నాడు తెలిసికొని భావగేయ కవియగు "తియ్యన" ను రప్పించుటకు ప్రయత్నించినాడు. రాత్రియగుటచేత నాడెట్లోకాలము గడిపినాఁడు.

మరునాడు తెల్లవారగనే భటులను పిలిపించి తియ్యనను తీసుకొని వచ్చుటకు పంపినాఁడు, నాడు సభకు కావలసిన సత్కారములను గావించినాడు. తియ్యన ఆ స్థానమునకు పల్లకిపై కొని తేబడినాడు, సభ ప్రారంభమైనది, రాజు సగౌరవముగా తియ్యనను పచ్చలగద్దియపై కూర్చుండ బెట్టినాడు. పండిత పుంగవులందరు హాజరైనారు. ప్రజలు తండోప తండములుగా విచ్చేసినారు. అతనితియ్యనైన గేయాల్నివిని సంతసించారు. కాలము జారిపోతూ గంటలు పోవుట తెలియలేదు. రాజు అనేక బహుమానములను తియ్యనకొసంగినాడు, పండితపుంగవులందరు హర్షించినారు. నాటి సభ ఆనందముతో ముగిసినది. నాటినుండి నెయ్యనకు జెప్పిన వాణి యనుమతిమీద దిన దినాభివృద్ధి చెంది మన 'తియ్యన' చక్కనైనటువంటి తియ్యని చందో కవిత్వమును వ్రాయమొదలిడినాడు. దీనినిబట్టి భావ గేయాలె చంధో గ్రంధాలకు పునాదియని స్పష్టీకరింప బడింది. ★

# బిడ్డలు - తల్లిదండ్రులు

కె. వెంకట్రామయ్య

(దురలవాట్లను మాన్పుటకై కొన్ని సూచనలు తరువాయి)

2. బిడ్డల చెడ్డ అలవాట్ల నంతగా గమనింపక వారి మంచి ప్రవర్తననే యెక్కువగా మెచ్చుకొనుచుండవలెను. దాని వలన బిడ్డలు మంచిగా మెలగుటకే ప్రయత్నింతురు. బిడ్డలను నిందించుటవలనను, విమర్శించుటవలనను వారి చెడ్డ అలవాట్లు మరింత బలపడునేగాని నిర్మూలముగావు.

3. చెడ్డ అలవాట్లను మాన్ప ప్రయత్నించునపుడు ఫలితములకై తొందరపడరాదు. ఏమన, క్రొత్తయలవాట్ల నేర్పరుచుటకంటె ఏర్పడినవానిని తొలగించుట బహు కష్టము. ఇది గుర్తించి చెడ్డ అలవాట్లను మాన్పుటకు ప్రయత్నించునపుడు ఓర్పు వహించుట యవసరము.

4. కొంచ మెదిగిన బిడ్డల కెంతోకొంత జ్ఞానాభిమానము లుండును. వాని నాధారముజేసికొని తగు రీతిని బోధించుటచే తమ దురలవాట్లను బోగొట్టు కొనవలెనను కోరిక బిడ్డలకు జనింపవచ్చును. అట్టి యెడ ఆయలవాట్లను మాన్పుట కడు సులభమగును.

5. బిడ్డలను మాటి మాటికి నిందించుటగాని, వారి యందలి తప్పులను వెదకుచుండుటగాని పనికిరాదు. అట్లగుటచే వారికి, మేమెందుకు పనికిరాము, మాకేమియు చేతగాదనెడి నిస్పృహభావములు గలుగవచ్చును. ఆ భావములు గలిగినచో చెడ్డ అలవాట్లను మాన్పుకొనగల శక్తి వారికుండదు. ఆశక్తియుండుట కాత్మవిశ్వాసముండవలెను. ఆ విశ్వాసమును బిడ్డలలో పెంపొందించుటకే తలిదండ్రు లన్నివిధముల ప్రయత్నింపవలెను. స్వయముగ చిన్న చిన్న పనులను జేయుటకును, ఆటలలో నాటంకములను తామే తొలగించుకొనుటకును పిల్లలను ప్రోత్సహించుట అట్టి ప్రయత్నమే యగును.

6 శిశు నిర్వహణమునకు సమన్వయదృష్టియు, సానుభూతియు చాల యవసరము. గోరంతలను కొండంతలు జేయరాదు. అట్లు జేసిన బిడ్డలెన్నటికిని బాగుపడరు.

7. బిడ్డలు బాగుపడవలెనన్న తలిదండ్రు లలజడిపడుటయు, ఆందోళన జూపుటయు పనికిరాదు. వారి యాందోళనమే బిడ్డలను మరింత చికాకు పరచి పాడుజేయును. శాంతి సహనములులేక పిల్లల నెన్నటికిని సరిగా నిర్వహింపలేము చీటికి మాటికి కోపగించుకొనుచు, చిరాకు జూపుటచే బిడ్డలు మరింత వాధించుచుందురు. ఇంటిలో నొక విధమగు భద్రత, ప్రశాంతత యుండిన బిడ్డలు సంతోషముగా నుందురు. సంతోషముగా నున్నచో వారి నడత సరిగానే యుండును. అప్పుడు చెడ్డయలవాటేర్పడుట కంతగా నవకాశముండదు.

పెద్దవారి బాధ్యత :— (Adult Responsibility) పరిసరములను బట్టియు పెంచు విధానమును బట్టియు బిడ్డ కలవడు అలవాట్లను గూర్చి ఇంతవరకును చర్చించితిమి. ఈ యలవాట్లకు మూలాధారములు బిడ్డకు పుట్టుకతో నబ్బెడి శక్తి స్వభావాదిగుణములేయగును. బిడ్డను బెంచు విధానమీగుణములమీదనే ఆధారపడియుండవలెను. ఇవి ఏ యిద్దరు బిడ్డలలోను ఒకే రీతిగ నుండవు. ఒక బిడ్డ నాకర్షించు విషయము లింకొక బిడ్డ నాకర్షింపకుండ వచ్చును, ఒక బిడ్డ చాల తెలివిగానుండి మొదటినుండియు ప్రతివిషయమును పరిశీలించి అనుభవ పూర్వకముగ తెలిసికొన కుతూహలము జూపవచ్చును. మరియొక బిడ్డ కట్టి యుత్సాహమేమియు లేకపోవచ్చును. బలహీనత, దృష్టిలోపము, వినబడకుండుట, మొదలగు లోపము లుండుటచే నొక్క బిడ్డ ఇతర పిల్లలవలె స్వేచ్ఛగానుండుటకు వీలు కాకపోవచ్చును.

ఇట్లే ఏ యిద్దరు బిడ్డలకును ఒకే విధమగు పరిసరము లుండవు, ఒకే కుటుంబములో ప్రతి బిడ్డ పరిస్థితియు మరియొక బిడ్డ పుట్టగనే మారుచుండును. తలిదండ్రుల కొక్కడే బిడ్డయై యున్నప్పుడు వారాతనిపై జూపెడి ప్రేమయును, శ్రద్ధయు నొక విధముగానుండును. మరియొక శిశువు జనించినంతనే అది మరియొక విధముగా మారును పూర్వమువలె తలిదండ్రులిపుడు మొదటి బిడ్డపై శ్రద్ధను జూపక పుట్టిన శిశువు విషయమే యెక్కువగా జూతురు. ఈ క్రొత్త పరిస్థితులు మొదటి బిడ్డను బాధించును. ఇది తల్లి దండ్రులు గ్రహించి బిడ్డయెడ తగు రీతిని ప్రేమయు, శ్రద్ధయు జూపుచు తమయందతని కంతవరకునుగల నమ్మిక చెడకుండ వర్తించుకొనవలెను. కాని వారట్టి జాగ్రత్తను సాధారణముగ దీసికొనరు. దాని

వలన బిడ్డకు వ్రేళ్ళు చీకికొనుట, గోళ్ళు కొరికి కొనుట, మాట వినకుండుట, చిరాకుగనుండుట, వస్తువులను పాడు జేయుట మొదలగు దురలవాటేర్పడును.

బిడ్డలకు దురలవాటేర్పడెనని వారిని దండించిన నెట్టి ప్రయోజనమును గలుగబోదు. అవి యేర్పడుటకుగల కారణముల నరసి తెలిసికొనవలెను. బిడ్డలు బాగుపడుటకు కావలసినది మన తోడ్పాటేగాని దండనగాదు. తల్లి దండ్రులు బిడ్డల స్వభావమును బాగుగ నెరిగి తగు జాగ్రత్త దీసికొనినగాని వారికి సుగుణములబ్బవు.

బిడ్డలలో సాధారణముగ నేర్పడు చెడ్డ అలవాట్లకు కారణములేవనగా

1. కుటుంబములోని వారికి అన్యోన్యత లేకుండుట.

2. బిడ్డను స్వేచ్ఛగా మెలగనీయకుండుట.

3. తగిన ఆటవస్తువులను బిడ్డ కీయకుండుట.

4. పసితనమున బిడ్డ నిద్రాహార విషయములందును మల మూత్ర విసర్జన విషయములందును తగు జాగ్రత్త దీసికొనకుండుట.

5. బిడ్డ కారోగ్యము లేకుండుట. అవయవ లోపములుండుట.

6. పెద్దవారు బిడ్డల తప్పులనే యెప్పుడు నెంచుచు చిరాకుజూపుట.

7. ఇంటిలోనివారి ప్రవర్తనా దోషములు.

వీనిని తలిదండ్రులు గుర్తించి తగిన జాగ్రత్త దీసికొనుట వారి కర్తవ్యము.

<u>బిడ్డల ఆహార సమస్యలు, అలవాట్లు:</u>—శిశునిర్వహణములోని సమస్యలు చాలవరకు ఆహారవిషయములకు సంబంధించియుండును. చాలమంది బిడ్డలు ఆహారమును సరిగాదినక బాధించుచుందురు. తమకిష్టమైన ఈవస్తువులనే తినుటకు పంతగించుచుందురు. వారికి సాధారణముగా అనారోగ్యకరములగు వస్తువులే ఇష్టమగుటయు ఆరోగ్యకరములగు వానియెడనిష్టములే కుండుటయు తటస్థించుచుండును. ఇట్లగుటకు కారణమేమి? ఇట్టి బాధలను తొలగించుటెట్లు? అను ప్రశ్నలు తల్లిదండ్రుల నెదుర్కొనుచునే యుండును. కాని బిడ్డకు పసితనమునందే ఆహార విషయములందు సరియగునలవాట్ల నేర్పరచిన ఇట్టి సమస్యలకవకాశమే లేకపోవచ్చును.

బిడ్డలారోగ్యవంతులై యుండవలెనన్నను తలిదండ్రుల యెడవారు సరిగా మెలగుచుండవలెనన్నను వారి భోజన పద్ధతులు సరిగానుండవలెను. అట్లుగానిచో తల్లిదండ్రులకును బిడ్డలకును ఏదోవిధముగ భోజనవేళకు ఘర్షణ గలుగుచుండును. బిడ్డను భుజింపుమని తల్లి బ్రతిమాలుటయు భుజింపనని యతడు పట్టుబట్టుటయు, దానిపై తల్లి కోపించుటయు, బిడ్డ యేడ్చుటయు జరుగవచ్చును. లేదా తినగూడని వస్తువునే తినుటకు బిడ్డపంతగించుటయు తల్లి మొదట వద్దనితుదకు ఒప్పుకొనుటయు జరుగవచ్చును. ఇట్లు ప్రతిదినమును ఆహారవిషయమై తల్లీ బిడ్డలు తగాదాపడుచుండుటచే భోజనసమయమన్న నిరువురకును బాధాకరముగ దోచుచుండును. దీనివలన బిడ్డకు తల్లియెడనొక వ్యతిరేకభావమేర్పడి ఆహారవిషయములందేగాక ఇతరవిషయములందుగూడ అభావమునే జూపుచుండును.

చాలిమంది పిల్లల మనోభావములును, ఆలోచనలును సరిగానుండకుండుటకును, వారునిలుకడయు, నిగ్రహమును జూపకుండుటకును కారణమేమన వారి యాహారమందును, భోజనవిధానమునందును లోపములుండుటయే కావచ్చును.

ఆహారవిషయములందు బిడ్డలకు మొదటినుండియు సరియైన అలవాట్లేర్పడుట ఎంత ముఖ్యమో తెలిసికొంటిమి. అట్టియలవాట్లనే యుద్దేశములతో నేర్పరుపవలెనో కొంచమాలోచింతము. బిడ్డలకారోగ్యముండుట అన్నిటికంటెను ముఖ్యము. కనుక వారియారోగ్యమున కనువగు నలవాట్లనేర్పరచుట మన మొదటియుద్దేశమై యుండవలెను. ఇక బిడ్డలు మన మేదిబెట్టిన దానిని తినుటకలవాటు పడవలెను, వారితరులతో కలసిమర్యాదగ భుజింపనేర్చుకొనవలెను. సరియైనవేళకు దినుట, సరియైన స్థలమున దినుట, ఆహారము నిటునటు పారవేయక శుభ్రముగా భుజించుట వారికలవాటు కావలెను.

<u>బిడ్డలు ఆహారమును తినక బాధించుటకు కారణములు :—</u>

బిడ్డల కెట్టియాహారమవసరమో వైద్యులును, ఆరోగ్యశాస్త్రజ్ఞులును నిర్ణయించియేయున్నారు. ఆ యాహారమును బిడ్డలచే తినిపించు బాధ్యత తలిదండ్రులదేయైయున్నది కాని ఆపనివారికి సాధ్యము కాకున్నది. ఇట్లగుటకు కొన్ని సామాన్య కారణములేవన

(1) బిడ్డలయొక్క ప్రత్యేకావసరములను తల్లి దండ్రులు గుర్తింపకుండుట

(2) బిడ్డ శిశుదశను దాటగనే క్రమవిధానము ననుసరింపకుండుట.

(3) క్రొత్త యాహారములను బిడ్డచేదినిపింపబోవునపుడు తగు జాగ్రత్త దీసికొనకుండుట

(4) బిడ్డలకు సహజముగా గలుగు స్వాతంత్రేచ్ఛను గమనింపకుండుట

(5) పెద్దవారికి గల చెడ్డ అలవాట్లు, తప్పభిప్రాయములు

బిడ్డలలో గల తేదాలు :—బిడ్డలందరు నొకేరీతిగానుండరు. కొందరికి అకలి యెక్కువ. కొందరికితక్కువ. కొందరు లావుగానుందురు. మరికొందరు సన్నగానుందురు. కొందరు తొందరగా తిందురు. మరికొందరు నెమ్మదిగా తిందురు. బిడ్డలలో గల ఈ తేడాలను గమనించి తగురీతిని ఆహారవిధానము నేర్పరచుట అవసరము.

క్రమవిధానము:—బిడ్డలు నియమిత వేళలందే భుజించుచుండవలెను. లేనిచో వారియారోగ్యము సరిగానుండజాలదు. వేళనుపాటింపక తినుచుండుటవలన జీర్ణశక్తి పాడగును. భోజనవేళలకు మధ్య బిడ్డకు ఆకలి వేయుచున్న యెడల (1) తగినంత ఆహారమును బిడ్డ తినకుండుట (2) తిన్న ఆహారములో సంపూర్ణత్వము లేకుండుట (3) ఆహారమును సరిగా నమలక తొందరగా తినుటచే నదివంటబట్టకుండుట (4) భోజనవేళల మధ్య కాలము దీర్ఘమగుట కారణములు కావచ్చును ఇట్లాకలివేయు సమయములందు బిడ్డకు సులభముగా జీర్ణమగు పండ్లరసమువంటి యాహారమునిచ్చుట మంచిది. పాలనిచ్చుట మంచిదా ? కాదా ? అను విషయము సందేహకరమైనది. ఏలయన పాలు జీర్ణాశయములో చాలకాలము నిలచియుండును.

క్రొత్త ఆహారములను బిడ్డకలవాటు చేయుట :—పసితనమున పిల్లలు పాలుత్రాగుటకే అలవాటుపడియుందురు. ఇతర యాహారములను దీసికొనువిధము వారికి దెలియదు. అది వారు నేర్చుకొనవలెను. మరియు ఆ యాహారముల రుచియు, వాసనయు వారికెంతో క్రొత్తగానుండును. ఈవిషయములను తల్లి తెలిసికొని బిడ్డకు పాలయలవాటును తప్పించి క్రొత్త యాహారములనలవాటు చేయునపుడు ఎంతో జాగ్రత్త జూపవలెను. తొందరపడినచో బిడ్డ బాధపడగలదు.

క్రొత్త యాహారములను దినుట బిడ్డకు క్రమముగా నేర్పవలెను. అన్నిటిని ఒకేసారి తినిపించుటకు ప్రయత్నింపరాదు. క్రొత్త యాహారమును ప్రత్యేకముగా నొసగక బిడ్డకలవాటైన భోజన పదార్థములతో బెట్టుట మంచిది. పెట్టిన యాహారము బహుస్వల్పముగా నుండవలెను. బిడ్డమొదట క్రొత్త యాహారమునెడ అయిష్టత జూపవచ్చును. అప్పుడు మనమేమియు ననక దానిని దీసివేసి కొంచము సేపైన పిదప తిరిగిపెట్టవలెను. బిడ్డకిప్పుడు క్రొత్తదనముపోయి రుచిపుట్టి తినవచ్చును. ఒకవేళ తినకున్నచో రెండుమూడు దినములు తాళి తిరిగి ఆ యాహారమునే బెట్టుమండినయెడల బిడ్డకు తినవలెనను కుతూహలము గలుగవచ్చును. అట్లుగాక బిడ్డ ఇంకను అయిష్టత జూపునెడ ఆ యాహారమునే ముందుగా పెట్టి అది తినినంతనే తక్కిన యాహారమును తినవచ్చునని చెప్పుట మంచిది. మరియు, బిడ్డ మనస్సు క్రొత్త యాహారముమీదనే యుండకుండ బిడ్డతో మాట్లాడుచుండుటగూడ మంచిది. అతడింకను ఆ యాహారముపై అయిష్టత జూపుచున్నయెడల బలవంతముగా బెట్టుటకు ప్రయత్నింపరాదు బలవంతముగా బెట్టుటవలన బిడ్డకా యాహారమన్ననేగాక ఏ క్రొత్త యాహారమన్నను అసహ్యము గలుగవచ్చును అందుచే బిడ్డ ప్రతిదినము సరిగా భుజింపక భోజనవేళకు తల్లిదండ్రులను బాధించుచుండవచ్చును.

బిడ్డలు ఆహారమునెడ అయిష్టత జూపుటకు క్రొత్తదనమొక్కటే కారణముగాదు. తాము తినవలసిన ఆహారము చూపునకును, స్పర్శకును సరిగా నుండని యెడలగూడ వారయిష్టత జూపగలరు. కనుక బిడ్డల యాహారమును ఆకర్షణీయముగాగూడ తయారుచేయుట యవసరము. వారికి ఆహారము రుచించవలెనన్న కొద్దిగానే బెట్టుచుండవలెను. ఒకేసారి ఎక్కువగా బెట్టినచో ఆహారముపై వెగటు గలుగవచ్చును. భుజించునప్పుడు వారే క్రమమున దినవలెనో మనము జెప్పరాదు. వారిని వారి ఇష్టప్రకారముగ తిననిచ్చుటయే మంచిది. వారు తినవలసిన వివిధ ఆహారపదార్థములను కొంచము కొంచముగా బెట్టుచున్న యెడల ఏవియు వదలక అన్నిటిని

తినగలరు. వివిధాహారములను తిన్నప్పుడే వారారోగ్యముగనుందురు. ఆహార విషయములందు బిడ్డలు జూపు అయిష్టతలను గూర్చి వారియెదుట ప్రసంగింపరాదు. దానివలన వారి అయిష్టతలు మరింతబలపడుచుండును.

స్వాతంత్ర్యేచ్ఛ :—1½—2 సంవత్సరముల వయస్సు రాగానే బిడ్డలు స్వతంత్రముగా మెలగుట కిచ్ఛగింతురని ఇంతకుముందే జెప్పితిమి. అందుచేతనే వారి వయస్సు రాగానే తమయాహారమును తామేతినుటకు ప్రయత్నించుచుందురు. ఒరులను పెట్టనీయకపేచీ పెట్టుచుందురు. అట్టియెడవారిని స్వతంత్రముగా భుజింపనిచ్చుటయే మంచిది. లేనియెడల ప్రతిదినమును భోజనవేళకు వారు మనతో కలహించుచుందురు. ఈకలహగుణమునువారొక భోజనవిషయమునందేగాక వారి కోరిక తక్షణము చెల్లింపని ప్రతివిషయమునందును గూడ జూపుచుందురు. ఈ విధముగ బిడ్డల భోజన సమస్యలు వారి శీలస్వభావాదులలో గూడ మార్పులను దెచ్చుచుండును.

పెద్దవారి భావములు, అభిప్రాయములు, వానిఫలితములు:

తల్లి ఆతురత, ఆందోళన:— సాధారణముగా తల్లులు తమ బిడ్డలు తామనుకొన్నంత యాహారమును తినలేదని తల్లడపడుచుందురు. వారి యాతురతయు, ఆందోళనయు, బిడ్డల నుద్రేకపరచును. అందుచే వారికి ఉన్న యాకలిగూడ సన్నగిల్లును. ఇది తల్లులు గుర్తించి బిడ్డల భోజన విషయములందు ఆందోళన జూపకుండుట యవసరము. బిడ్డలు తినకుండుటకెన్నో కారణములుండవచ్చును. అలసి యుండుటయో, కోపముగా నుండుటయో, క్రొత్తగా పన్ను వచ్చుట గాని, జబ్బుచేయుట గాని కారణమై యుండవచ్చును. వారు భుజింపనంతనే ఆత్రత జెందక కారణమేదో యరసి తెలిసికొన ప్రయత్నింపవలెను. ఇంతేగాక బిడ్డలందరు నొకేరీతిగా భుజింపరు. వారిప్రకృతిని బట్టి ఎక్కువగనో తక్కువగనో తినుచుందురు. సహజముగ వారెంత తినగోరుదురో అంతే తిననిచ్చుట మంచిది. ఇక తిననని బిడ్డ చెప్పినప్పుడు తల్లి బిడ్డను బుజ్జగించియు పాటపాడియు తినిపింప ప్రయత్నించుట జరిగిన యెడల బిడ్డ తన తల్లి దృష్టినాకర్షించి, ఆదరమును బొందుటకై ఆహారమునెడ అయిష్టత జూపగలడు. మరియు నీ విధముగ తల్లిపై తన యధికారము జూపవచ్చునని యతడు గ్రహించి బ్రతిమాలించుకొని గాని భుజింపకుండుట కలవాటుపడును.

తిననని బిడ్డ చెప్పినప్పుడు తల్లి బ్రతిమాలియు, బలవంతపెట్టియు తినిపింప ప్రయత్నించుట తప్పు. దానిచే బిడ్డ ఉద్రేకపడుటయు అతని జీర్ణశక్తి చెడుటయు తటస్థించును. ఇంతేగాక తల్లిని తన యధీనమందుంచుకొనగోరుచు అతడామె మాటను వినక యెదిరించుచుండును.

బిడ్డల అయిష్టతలను గూర్చియు, ఆహార సమస్యలను గూర్చియు వారి యెదుట ప్రసంగించుట గాని, చర్చించుట గాని పనికిరాదని ఇదివరకే సూచించితిమి. వారందరితో కలసి భుజించి లేచుట కలవాటుపడవలెను. కాలయాపన జేయుచు భుజించుట పనికిరాదు. పెట్టిన యాహారమును వారు తిననిచో మనమెట్టి యుద్రేకమును జూపక ఆ యాహారమును తీసివేయవలెను. భోజన సమయమున బిడ్డ సరిగా భుజింపకున్న తిరిగి భోజనవేళ యగువరకును ఆహారము నీయకుండుట ఉత్తమము. "ఈ యాహారమన్న బిడ్డ కిష్టము, ఇది ఇష్టము" లేదని బిడ్డయెదుట చెప్పుట పనికిరాదు. దానివలన అతడేవో కొన్ని ప్రత్యేకాహారములున్న గాని భుజింపనని పంతగింపగలడు.

సూచన ప్రభావము:— కుటుంబములో నెవరికైనను ఆహార విషయములలో ప్రత్యేక రుచులు అలవాట్లు ఉన్నయెడల బిడ్డలు వారిననుకరింపగలరు. కనుక అట్టి అలవాట్లను గూర్చియు రుచులను గూర్చియు ముచ్చటించుటయు చర్చించుటయు పనికిరాదు. చాలమంది బిడ్డలు ఇంటియందు తినుట కిష్టపడని యాహారములను ఇతరచోట్ల దినుచుందురు. కారణమేమన ఇంటిలోనివారు ఆ యాహారములయెడ అయిష్టత జూపుటయో, బిడ్డల కిష్టము లేదని జెప్పుటయో, తినుటకు వారిని బలవంతపెట్టుటయో కావచ్చును.

తల్లిదండ్రులతో బిడ్డలకు సరిపడకుండుట—దాని ఫలితము:

ఒక్కొక్కప్పుడు బిడ్డలొకటి రెండు దినము లేమియు దినక పంతగించుచుందురు. అట్టి సమయములలో వారిపై సామాన్య పద్ధతులేవియు పనిచేయవు. ఈ వ్యతిరేక భావమును వారొక యాహార విషయమునందేగాక ఇతర విషయములలో గూడ జూపుచుందురు. ఇట్లు వారు ప్రవర్తించుటకు కారణము తల్లి దండ్రులతో వారికి సరిపడకుండుటయే కావచ్చును. తల్లి యెడలనో తండ్రి యెడలనో వారికి దీర్ఘ కోపముండుట, కుటుంబములోనివారు కలహించుచుండుట, తల్లిదండ్రులపై నమ్మికముచెడి తామెవ్వరికిని అక్కరలేదను నిస్పృహాభావము గలుగుట కారణములు కావచ్చును.

[సశేషం]

అనువాదము: శ్రీ వైకుంఠరావు

# పునరావృత్తి

రచన: శ్రీ రవీంద్ర

ఆ నాటి యుద్ధవార్తలు బాగులేవు, మనస్సు బాగులేక రాజాగారు తోటలో పచారిచేసి వద్దామని బయలుదేరారు

చిన్న అమ్మాయి ఒకతె, ఒకపిల్లవాడు ప్రహరి ప్రక్కను కూర్చొని ఆడుకొంటున్నారు; రాజాగారు వాళ్లనుచూచి, ఏమిఆట ఆడుతున్నారని అడిగారు.

"సీతారాముల వనవాసం—ఆట ఆడుతున్నాము ఇవాళ, అని వాళ్లు జవాబుచెప్పారు.

ఆటచూస్తూ రాజాగారు అక్కడే కూర్చుండ బడిపోయారు.

"ఇది మాదండకారణ్యం, ఇక్కడే కుటీరంకడతా" మన్నాడు పిల్లవాడు.

విరిగిన చెట్లకొమ్మలూ, ఆకులూ, గడ్డీ కూడబెట్టి కుప్పచేస్తున్నారు, గొప్ప హడావిడిపడుతున్నాడుకుర్రవాడు.

అమ్మాయి ఆకులతో అన్నంవండుతున్నది కుండలో, నిప్పులేకుండానే — రాములువారు భోజనంచేస్తారు, సీతకు ఒక్కనిమిషమైనా వ్యవధిలేదు.

"అన్నీ ఉన్నవికాని, రాక్షసుడు కనబడలేదే!" అని రాజాగారన్నారు.

దండక వనంలో కొన్నిలోట్లున్నవని కుర్రవాడు ఒప్పుకున్నాడు.

నేను రాక్షసుడనౌతానని రాజాగారు అంగీకరించారు.

పిల్లవాడు రాజాగారిని బాగాపరిశీలించి చూచి, "అట్లాగైతే నీవు ఓడిపోవలసి ఉంటుంది," అని అన్నాడు.

"నేను బాగా ఓడిపోగలను, ఆడిచూడండి" అని రాజాగారన్నారు.

రాక్షసవధ ఆనాడు బహుచక్కగా కాసాగింది; ఆ పిల్లలు రాజుగారిని ఎంతమాత్రం విడిచిపెట్ట మన్నారు— పది పదిహేనుగురు రాక్షసుల స్థానే రాజాగారొక్కరే చస్తుండవలసి వచ్చింది, చచ్చిచచ్చి రాజాగారు అలసిపోయినారు.

త్రేతాయుగంలో పంచవటిలో పక్షులు కూస్తుండేటట్టుగానే నేడు ఆతోటలో పక్షులుకూయడం మొదలు పెట్టినవి, పచ్చని లేతఆకులు వరసలపై సూర్య కిరణాలు త్రేతాయుగంలో ఎట్లా నాట్యంచేసేవో అదేవిధంగా నేడు కూడా నాట్యం చేస్తున్నవి.

రాజాగారి మనస్సులో నుండేభారం మాయమయింది; మంత్రిని పిలిపించి, ఆ అబ్బాయి అమ్మాయి ఎవరి బిడ్డలు అని అడిగారు,

"ఆ అమ్మాయి నాకూతురు, పేరు రుచిర, ఆఅబ్బాయి ఒక బీద బ్రాహ్మణుని కుమారుడు, కేశికుడు, వాడిపేరు, తండ్రి పూజారిపనిచేసి కాలం గడుపుతున్నా"డని మంత్రి జబాబు చెప్పాడు,

"సరిఅయిన వయస్సు రాగానే ఆఅమ్మాయిని ఆ అబ్బాయికి ఇచ్చి పెళ్లిచేయించాలని నాకోరిక." అని రాజాగారన్నారు. జబాబిచ్చే సాహసం లేకపోయింది మంత్రికి — తలవాల్చుకొని నిలుచోబడి పోయినాడు.

దేశంలోఉండే విద్వాంసు లందరికంటె గొప్పవాడైన పండితుడి దగ్గరికి కౌశికుని విద్యాభ్యాసానికై పంపారు— దేశంలోని పెద్ద పెద్ద కుటుంబాలలోని పిల్లవాళ్లూపిల్లలూ అంతా ఈపండితుడిదగ్గరకే చదువుకనివస్తున్నారు మంత్రి కొమార్తె రుచిర, కూడా ఇక్కడికే వస్తున్నది.

కౌశికుడు చదువుకోడానికి వచ్చిన రోజున అధ్యాపకుని మనస్సులో ప్రసన్నత కానరాలేదు, చదువుకోడానికివచ్చిన పిల్లవాళ్లకు కూడా సిగ్గు కలిగింది. కాని రాజవారి ఆజ్ఞ కావడంచేత ఎవ్వరూ ఏమీ అనలేక పోయినారు.

విద్యార్థు లందరూ తమలో తాము గుసగుసలాడుకుంటూ ఉండడంవల్ల రుచిరకు అందరికంటె కష్టంగా ఉన్నది, సిగ్గువల్ల ఆమెముఖం ఎర్రనై పోయింది. కోపంవల్ల ఆమెకళ్ల వెంబడి నీళ్లుకారడం ప్రారంభించినవి.

చదువుతున్నప్పుడు కౌశికుడు పుస్తకం ఆమెకు చూపించబోయిన యెడల రుచిర దానిని అటుతోసివేసేది.

పాఠంమాట ఏదైనా కౌసికుడు చెప్పబోతే. రుచిర జవాబు చెప్పేది కాదు.

అధ్యాపకుడు రుచిరను అమితాదరంతో చూచేవాడు. అన్ని విషయాలలో కౌశికునికంటె ఆమెకు ఉచ్చస్థానం ఉండవలెనని ప్రతిజ్ఞచేశాడు. రుచిర దీక్షకూడా అదేను.

వీళ్ల కోరిక సఫలంకావడం సులభమని కూడా అంద రికీ తోచింది — దానికి కారణం లేకపోలేదు. కౌశికుడు చదివేవాడు నిజమే. కాని అతని మనస్సు చదువులో ఉండేదికాదు — ఈతకొట్టడమూ, ఇటూ అటూ షికారు తిరుగుతుండడమూ యంత్రవాద్యాలు చేస్తూ పాటలుపాడు తుండడమూ మొదలైన వాటిమీద అతనికి మిక్కిలి సరదాగా ఉండేది.

"చదువుమీద నీకు శ్రద్ధలేకపోవడం ఎందుచేత ?" అని గురువుగారు కోప్పడేవారు, "ఒక్క చదువుమీదనే కాదు నా సరదా," అని కుర్రవాడు జవాబు చెప్పేవాడు.

"ఆ సరదాలన్నీ వదలు," అని గురువుగారు కేకలు వేస్తే అవి వదులుకుంటే చదువుమీదను కూడా సరదా పోతుంది" అని కుర్రవాడు జవాబు చెప్పేవాడు.

కొన్నాళ్లు ఇలాగడిచింది.

రాజాగారు ఒకనాడు గురువుగారిని. "మీ విద్యార్థులం దరిలోకి శ్రేష్ఠుడెవడు ?" అని అడిగారు.

"రుచిర" అని అధ్యాపకుడు జవాబు చెప్పాడు.

"కౌశిక మాటేమిటి ?" అని రాజాగారడిగారు.

"పిల్లవాడేమీ నేర్చుకుంటున్నట్టు తోచదు." అని అధ్యాపకుడు జవాబు చెప్పాడు.

"ఆ అమ్మాయిని ఆ అబ్బాయికి ఇచ్చి పెళ్లిచేయడం మంచిదని నాఅభిప్రాయం, అని అన్నారు,

"అమ్మాయి పెళ్లికి ఇష్టపడడంలేదు," అని మంత్రి జవాబు చెప్పాడు.

"స్త్రీలమనస్సులో ఉండేకోరిక మాటలద్వారా వ్యక్తం అవుతుందా ఎన్నడైనా" అని రాజాగారు అన్నారు,

"కన్నీరుకూడా సాక్ష్యం ఇస్తున్నవి," అని మంత్రి అన్నాడు.

కౌశికుడు ఆమెకు తగిన వరుడుకాడు అనా ఆమె అభిప్రాయం ?" అని రాజుగారు అన్నారు.

"అదే అనుకుంటాను ఆమె మనస్సులో నున్నమాట" అని మంత్రి అన్నాడు.

"నాఎదుట వారి ఇద్దరి పరీక్ష కానీయి, కౌశికుడు గెలిచినట్లైతే పెళ్లిచాపరేను" అని రాజాగారు అన్నారు.

"అమ్మాయి ఈ పందానికి ఒప్పుకున్నది," అని మంత్రి మర్నాడు వచ్చి రాజాగారితో అన్నాడు.

పోటీపరీక్షకై సభ ఏర్పాటు చేసారు. రాజాగారు సింహాసనం మీద కూర్చొని ఉన్నారు, కౌశికుడు సింహా సనం దగ్గర కూర్చున్నాడు.

గురువుగారు తానేస్వయంగా రుచిరను తీసుకొని వచ్చారు. కౌశికుడు లేచినిలుచొని గురువుగారికి ప్రణామం చేసి, రుచిరకు నమస్కారం చేశాడు. రుచిర అతనివంక చూడనైనా లేదు.

పాఠశాల పద్ధతిని అనుసరించినా కౌశికుడికీ రుచి రకు ఎన్నడూ వాదన జరగలేదు. ఇతర విద్యార్థులుకూడా కౌశికుని నిరసనగా చూచేవారు. ఒక్కనాడైనా వాదనకు అతనికి అవకాశం ఇచ్చేవారుకారు. కౌశికుని వాడిఅయిన మాటలుగాని అతని తీక్ష్ణహేళనగాని గురువుగారు మొట్ట మొదట వినడము రాజాగారికి సముఖాన జరుగుతున్న ఈ పోటీ పరీక్షలోనే. సూర్యకిరణాలు పడడంవల్ల జిగ జిగ మెరుస్తుండు బాణాలవలె యుక్తితో కూడి కౌశికుని మాటలు ఉన్నవి — గురువుగారికి ఆశ్చర్యం కలిగింది. కోపం వచ్చింది. రుచిర ముఖాన చెమట కమ్మింది, ఆమె మనస్సు స్థిరంగా ఉంచికో లేకపోయింది కౌశికుడు ఆమెకు పూర్తిగా పరాభవంకలిగించిపురీవదిలాడు.

పట్టరాని కోపంవచ్చి గురువుగారి నోటివెంట మాట రాలేదు. రుచిర కళ్లవెంబడి అశ్రుధారలు కారడం ప్రారంభించినవి.

"పెళ్లిరోజు ఇక నిశ్చయించ వచ్చును." అని రాజా గారు అన్నారు.

"నాకు ఈ పెళ్లి వద్దు," అని కౌశికుడు చేతులు జోడించి అన్నాడు.

"జయంపొంది బహుమతి అందుకోనంటావేమి ?" అని రాజాగారు అడిగారు.

"జయం నాకుచాలును, బహుమతిఇతరులను తీసుకోనీ యండి," అని కౌశికుడన్నాడు.

"మరొక సంవత్సరం వ్యవధి ఈయండి, మహారాజా. అటుపిమ్మట ఆఖరి పరీక్షకానీయడిం." అని అధ్యాపకుడు అన్నాడు.

రాజాగారు దానికి అంగీకరించి అట్లాగే కానీ" అని అన్నారు.

కౌశికుడు బడివిడిచిపెట్టాడు. ఒకనాడు, ఉదయంపూట వనప్రాంతాన కనబడేవాడు, ఒకనాడు కొండశిఖరాన కనబడేవాడు.

ఇవతల గురువుగారు యావచ్ఛక్తిని ప్రయోగించి రుచిరకు విద్యనేర్ప ప్రయత్నిస్తున్నారు. కాని రుచిర మనస్సు ఎక్కడికో పోయేది.

గురువుగారు చీకాకు పడుతూ" ఇప్పటినుండి శ్రద్ధగా చదవక పోతివంటే మరి ఒకమారు పరాభవం పొందవలసి వస్తుంది, "అని అన్నారు.

మరిఒకసారి పరాభవం పొందవలెననే రుచిర తపస్సు చేస్తున్నదన్నట్లు కనబడ్డది. అపర్ణ అనశన కొరకై తపస్సు చేసినట్లుగా రుచిర అనధ్యయనకై తపస్సుచేస్తున్నట్లున్నది, షడ్దర్శన గ్రంథము ఎల్లప్పుడూ మూసే ఉండెను, కావ్యగ్రంథాలు తెరవబడతవి కావోలు.

కోపగించి అధ్యాపకుడు ఈవిధంగా అన్నాడు, కపిల, కణ మొదలగు ఋషులపేరిట శపథం చేస్తూన్నాను—స్త్రీలకు ఎన్నడూ విద్య నేర్పబూనుకోను! వేదవేదాంతాల తుదచూచానుగాని, స్త్రీల హృదయాలను తెలుసుకో లేకపోయినాను."

ఇట్లా ఉంటూ ఉండగా, మంత్రి ఒకనాడు రాజాగారి దగ్గరకువచ్చి "భవదత్తగారి ఇంటిదగ్గరనుండి పెళ్లి సంబంధం వచ్చింది, వారు కులంలోనూ శీలంలోనూ ధనంలోనూ మర్యాదలోనూ అద్వితీయులు, రాజావారి సమ్మతిని కోరుతున్నా "నని అన్నాడు.

"అమ్మాయి ఏమంటున్నది"అని రాజాగారు అడిగారు.

"స్త్రీల మనస్సులో ఉండేకోరిక మాటలద్వారా వ్యక్తమవుతుందా ఎన్నడైనా ?"అని మంత్రి అన్నాడు.

"కన్నీరు నేడు ఎటువంటి సాక్ష్యం ఇస్తున్నది ?" అని రాజుగారు అడిగారు.

మంత్రి జవాబీయలేదు.

రాజాగారు తోటలోకూర్చొని ఉన్నారు, మంత్రిని పిలిచి

"మీఅమ్మాయిని నాదగ్గరకు పంపించు ఒక్కమారు," అని అన్నారు.

రుచిర వచ్చిరాజుగారికి ప్రణామంచేసిఎదుటనిలుచున్నది.

"సీతారాములు వనవాసం ఆట జ్ఞాపకం ఉన్నదా అమ్మాయి ?"అని రాజుగారు అడిగారు.

రుచిర తలవాల్చుకొని చిరునవ్వునవ్వుతూ నిలుచున్నది.

"మరి వొకసారి ఆ సీతారాముల — వనవాసం—ఆట చూడవలెనని చాలా కోరికగా ఉన్నది అమ్మా, అని రాజాగారు అన్నారు,

రుచిర పైట చెంగుకొను బుగ్గమీది లాగుకొని మాటాడక నిలుచున్నది.

"రాములువారూ ఉన్నారు, అరణ్యమూ ఉన్నది, కాని సీతలేదని వింటున్నాను, నీవు తోడ్పడినట్లైతే ఆలోటు పూర్తిఅవుతుంది, అమ్మా"అని రాజుగారు అన్నారు.

రుచిర నోటితో జవాబీయక, వంగి రాజుగారి పాదాలకు రాజుగారుప్రణామం చేసింది,

"కాని తల్లీ, నేను ఈసారి రాక్షసను కాజాలను,"అని రాజాగారు అన్నారు.

రుచిర అత్యాదరంతో రాజుగారి ముఖంవంక చూస్తూ నిలుచున్నది.

" ఈసారి మీ గురువుగారు రాక్షసి అవుతారు," అని రాజాగారు అన్నారు.



శ్రవ్యనాటిక :

# తెలియని లోతులు

శ్రీ యస్. ఆర్. నంది

లీల : అబ్బబ్బ! నీతో మంచి చిక్కొచ్చిపడిందే ? కింద ఆయన యెదురుచూస్తూ వుంటారు - నన్నేడిపించక త్వరగా యిద్దూ.

భారతి : ఒన్ మినిట్ ప్లీస్.

లీల : అలాంటి ఒన్‌మినుట్లు యేభైతొమ్మిది గడిచి, మరో —

భారతి : ఇదిగో నాదీ అయిపోయింది. [ చదువుతూ ] 'ఆ కృతినిబట్టి అంతరంగాన్ని అంచనా వెయ్యడం అర్థంలేని ఆలోచనని సులోచనకి ఆ క్షణంలో చప్పున స్ఫురించి పశ్చాత్తాప్పడింది'.... గ్రాండ్ ఫినిషింగ్ [ పుస్తకాన్ని ముద్దుపెట్టుకుంటుంది.]

లీల : అదేవిఁటేవ్ పుస్తకాన్నే ముద్దులాడేస్తున్నావ్! నిజంగా ఆ రచయితే ఐతే ...

భారతి : ఎదురేగి హారాలతో ఆహ్వానిస్తా: హృదయ సీమలోకి [ నవ్వుతుంది ] నిజంచెప్పవే లీలా: ఆయన రచనల్లో హృదయాలు స్పందించవు ?

లీల : ఏమోనబ్బా! నువ్వు పెళ్ళికాని పడుచువి-నీలాంటి స్పందన నాలో యెలా కలుగుతుంది ?

భారతి : ఊరుకోవే నువ్వు మరీను... మొన్న అయనకు మరో ఉత్తరం రాశాను.

లీల : ఏమని ?

భారతి : ముందు రాసిన ఉత్తరాలకంటె కాస్త పై స్థాయిలోనే.

లీల : ఇంకేం. మాకు త్వరలోనే పప్పూ అన్నం తినిపిస్తావన్న మాటే!

భారతి : ఛా! అవేం మాటలే!

లీల : ఏం! నువ్వా యన్ని నిజంగా కాంక్షించటంలేదు ?

భారతి : ....కాని....

లీల : కానీ గీనీ లేదు. అవునను. అయినప్పుడు నువ్వు కొంత తొందర పడుతున్నావనే చెప్పాలి.

భారతి : ఇందులో తొందరపాటేం లేదు లీలా: ఆయన్ని నేను ప్రేమిస్తున్నాను — హృదయ పూర్వకంగా.

లీల : ఎలా ? కనీసం నువ్వాయన ముఖమైనా చూసెరుగవే!

భారతి : ముఖపరిచయం వుండాలా ప్రేమ కలగడానికి ? ఆయన రచనలు చదువుతూ వుంటె ప్రతీ మాటలోనూ, వాక్యంలోనూ ఆయన నాకు సన్నిహితులైతే ఎంత బావుంటుందీ అనిపిస్తుంది.

లీల : బావచ్చు కళలోవున్న గొప్పతనం అదేకదూ ? అయితే మీ అన్నయ్యను ఒప్పించగలవా ?

భారతి : ఏం, వాడు మాత్రం శాంతినికేతన్ చదువు వెలగబెట్టడానికి వెళ్ళి ఓ బెంగాలీ బేలను వెనకేసుక రాలేదు ?

లీల : వాళ్ళు మగాళ్ళు.

భారతి : ఏడిశావ్ : వాడి వెనకాల వచ్చిందీ ఆడదేగా ? అయినా ఎదిరిస్తే వీడేం చెయ్యగలడో చూదాం. [ దూరంగా అడుగుల చప్పుడు ]

లీల : మీ అన్నయ్య వస్తున్నట్లున్నాడు.

భారతి : రానియ్.... ఏవిఁటిది ?

అన్నయ్య : లేఖ [ హేళనగా ] ప్రేమలేఖ.

భారతి : ఎవరిది ?

అన్నయ్య : తమరిదే.

భారతి : థ్యాంక్స్ : ఇంత ప్రయాసపడ్డందుకు.... అయితే ఆ కవరు విప్పవలసినంత అవసరం ఏమొచ్చిందో!

అన్నయ్య : [ మాటలు దొరక్క తడబడి ] నువ్వేం చేస్తున్నావో కాస్త అలోచించు భారతి.

భారతి : అలోచించాను.

అన్నయ్య : తర్వాత చాల విచారిస్తావ్.

భారతి : అలాంటి పరిస్థితి కలిగినపుడు నీ యింటికి రానులే.

అన్నయ్య : ఉఁ! [కోపంతో మాటాడలేడు] ఇంతకీ ఈ దయానిధి యెవడు?

లీల : ఒక కవి.

అన్నయ్య : కూటికిలేని....

భారతి : మేనర్స్‌కి అలా డైవర్స్ యివ్వడం నేను సహించలేనన్నాయ్.

అన్నయ్య : ఒకళ్ళ మేనర్స్ గురించి హెచ్చరించే తాహతు నాకు లేదు.

భారతి : సరె. లేదులే. దయచేసి యిక్కణ్ణించి వెళ్ళిపోయిక.

అన్నయ్య : వెడతా నాన్నగారితో సంజాయిషీ యేమని చెప్పుకుంటావో చూస్తా [వెళ్ళిపోతాడు]

భారతి : భయంలేదులే. నీకు దొరికిన అనుమతే నాకూ దొరుకుతుంది.

లీల : అప్పుడే మొదలయాయి చూశావా?

భారతి : క్లయిమాక్స్‌కి యివన్నీ తోడ్పడుతాయే లీలా.... అయినా ఈ ఉత్తరంలో ఏమని రాశారో చూద్దాం.

లీల : ఇలాతే నేను చదువుతూ [చదువుతూ] భారతి గారికి నమస్కృతులు........మీ ఉత్తరం యెన్ని సార్లు చదివినా....రకరకాలుగా....నాలో కలిగిన అనుభూతుల్ని....స్పష్టంగా యివి....

భారతి : అని వివరించలేను.

లీల : ఉండు మరి : వివరించలేను....నా నిజపరిస్థితిని మీకు చెప్పడంలో సిగ్గుపడాల్సినదేమీలేదు; అదీగాక మీరన్నమాట ఒకనాట ఆటకాదు: జీవితమంతా పెనవేసుకొని స్వర్గసౌఖ్యాలలోనికో, నరక కూపాలలోనికో తీసుకపోయే ప్రాణ సమస్య. నేను జన్మతః పేదవాణ్ణి. నా రచనలకి పరవశమై నాసామీప్యంకోసం పరిణయమే మీ చివరి అభిప్రాయమైతే మరోసారి మీ చర్యను ఆలోచించమని కోరుకొంటూ వున్నాను.

—దయానిధి.

భారతి : ఇహనేం ఆలోచించాల్సిందిలేదు.

లీల : ఆయనన్నది నిజమే నేమోభారతి?

భారతి : నీకు తెలీదే. 99 పర్సంట్ ఈ రచయితలందరు పెసిమిస్టులే. అందువల్ల లేని అవరోధాలని వూహించుకొని అబ్జర్వ్ చేయమంటారు.

లీల : నిజమే. ఆయన వ్రాసే రచనల గాలానికి చిక్కుకొన్న నువ్వు ఆయననించి వాస్తవికంగా యేమీ పొందలేవన్నది గూడా రచయితల జీవితాలు చెబుతాయి. మరోసారి ఆలోచించడంలో -

భారతి : ఆరు నూరైనా, నూరు ఆరైనా మన నిశ్చయం మారదు,

లీల : సరె. పంతం పడితే నేనేం బోధించనులే.

[వివాహాన్ని సూచిస్తూ మంగళ వాద్యాలు]

దయానిధి : [వస్తూ] భారతి :

భారతి : ఏం, భరత మహామునీ.

దయా : గంటనించి పిలుస్తున్నా -

భారతి : ఎందుకో!

దయా : చూడటానికే.

భారతి : బాగుంది. రోజూ చూసే ముఖానికే యింత ఆ ప్యాయమా?

దయా : ఆ ముఖం కోసం కాదు,

భారతి : మరి?

దయా : [రాగం తీస్తూ] అందు మెరిసే అందంకోసం.

భారతి : చచ్చాం - ఇహ కవిత్వానికి తోడు సంగీతం కూడా జతపడితే -

దయా : సువర్ణానికి సువాసన అబ్బుతుంది....అసలు నా అదృష్టంలో యిలాంటి పెన్నిధి దొరుకుతుందని ఎన్నడూ వూహించలేదు.

భారతి : ఇహ కవిత్వం పైత్యంలో పడినట్టుంది.

దయా : [వినిపించుకోకండా] ఎదో యిష్టాగోష్టిగా వ్రాసుకున్న వుత్తరాలు వివాహ పత్రికలుగా మారుతాయని వూహించివుంటె - [ఆగిపోతాడు]

భారతి : ఉంటె!

దయా : అసలు ఆడవాళ్ళు యింత ధైర్యం చేస్తారంటె నేను యింతకముందు నమ్మలేదు.

భారతి : నమ్మకండి; నాది కేవలం మొండిధైర్యం.

దయా : ఏం ?

భారతి ; ఏముంది! అవరోధాలు యెక్కువయ్యేకొద్దీ పట్టుదల హెచ్చుకావటం నాలాంటివాళ్ళనైజం. మా అన్నయ్య ఈ వివాహానికి చచ్చినా ఒప్పుకో నని గొడవచేస్తే, వాడెలా చస్తాడో చూడాలని నేను మరింత బిగుసుక కూచున్నాను.

దయా : చచ్చిపోయాడా ?

భారతి : చస్తాడూ! అసలు మీ చివరి వుత్తరం అందిన రోజున మా లీలగూడా అక్కడే వుంది.

దయా : ఆ విడా వుత్తరాన్ని చూసిందా ?

భారతి : చూసింది. చూసి ఓ సలహాగూడా యిచ్చింది.

దయా : ఏమని ?

భారతి : మీరు వ్రాసే రచనల గాలానికి చిక్కుకున్న నేను, మీనించి వాస్తవంగా యేం పొందలేనని.... బోడి సలహా.

దయా : అ విడ చెప్పినదాంట్లో నిజంలేకపోలేదు.

భారతి : ఏం ?

దయా : కవికి కొంత ముందు చూపుగూడా వుంటుంది. అందుకే అతడు కిందెంచి మేలెంచుకొంటాడు. నువ్వు ఆగర్భ శ్రీమంతురాలవు. నేనందుకు ఈ చివరివాడను. నా రచనలు నీకు కలిగించిన చెక్కిలిగింతలవల్ల నన్ను ప్రేమించగలిగావు గాని ఈ పరిస్థితులు, నా ప్రవర్తనా నువ్వు వూహించు కొన్న వూహలని కాస్త కుడి ఎడమలకు జరిగి నపుడు నువ్వు కష్టపడొచ్చు.

భారతి : అలా లేనివాటిని వూహిస్తూ వుండబట్టే మిమ్మల్ని పెసిమిస్టులన్నారు,

దయా : అనుకుంటారు గూడా చాలామంది.

భారతి : ఆఁ మీకొకటి చెప్పడం మరిచాను! చాల ముఖ్య మైన విషయం,

దయా : ఏవిఁటి ?

భారతి : వచ్చేనెల ఇరవైఐదున నా ట్వంటీ సెకండ్ బర్త్‌డే.

దయా : బర్త్‌డే ! [ నవ్వుతాడు ]

భారతి : ఏవిఁటా నవ్వు ?

దయా : [ నవ్వుతూనే ] నువ్వీయింట్లో అడుగుపెట్టిం దగ్గర్నుంచే కొన్ని విచిత్రాలు కనిపిస్తున్నాయి.

భారతి : ఏవిఁటో !

దయా : మీ వాతావరణంలోనూ మా వాతావరణంలోనూ వుండే కొన్ని భేదాలు, నేను పుట్టి యిప్పటికి సరిగా పాతికేళ్ళపైన అయినట్టు మా అమ్మ చెబుతుంది, కాని నే నింతవరకు ఒక్క బర్త్‌డే సెలబ్రేషనన్నా చేసుకోలేదు,

భారతి : అవును కొన్ని పరిసరాల ప్రభావానికి మనుషులు కొన్ని ముఖ్యవిషయాలనే మరిచిపోతూ వుం టారు. అయితే ఏవంటారు ?

దయా : మీర జాలగలడా తమ ఆనతి భారతీపతి........ రైటో చేసేద్దాం.

* * *

భారతి : ఈవాళ యింతాలస్యంగా వచ్చారేం ?

దయా : [ వస్తూ ] అఫీసుపని!

భారతి : సరి! పోనీ రేపేం వారమో జ్ఞాపకముందా

దయా : ఓ! భారతదేవిగారి బర్త్‌డే అని గూడా,

భారతి : అయితే ఏం ఎరేంజ్‌మెంట్స్ చేశారు ?

దయా : ఏం చెయ్యాలి ?

భారతి ; బావుంది !

దయా : నిజం భారతి! నేను పుట్టెరగను : ఇలాంటి పుట్టినరోజు పండగలు చేయడం, అగస్మాత్తుగా ఈ వింతపదాన్ని ఈ యింట్లో వినేసరికి ఎందుకో కంగారు పుట్టుకొస్తోంది.

భారతి : అస్తమానం అదే ఎత్తిపొడుపా : నా అలవాటు ప్రకారం చెప్పాను, మీ కిష్టం లేకపోతే చెయ్య నని చెప్పాలిగాని యిలా ప్రతీసారీ —

దయా ; నిన్ను హాస్యం చేయాలని కాదు భారతి. నిజంగా అలాంటివి నాకు అనుభవంలో ఏమీ తెలీదు.

[ దూరంగా దయానిధి తల్లి దగ్గుకొంటూవచ్చి కాలు జారి కింద పడిపోతుంది, కోలాహలం. దయానిధి 'అమ్మా' అనుకుంటూ వెళ్ళిపోతాడు ]

దయా : నీ ఒంట్లో అసలే బావుండలేదు, ఎందుకు లేచా వమ్మా యిప్పుడు అనవసరంగా ?

తల్లి : [ ఆయాసంగా ] నన్ను....కా స్త.. లోపలికి.... తీసుకవెళ్ళు బాబు.

దయా : [ లోనికి తీసుకవెళ్ళాక ] నేను వెళ్ళి డాక్టర్ని తీసుకొస్తాను నువ్విలా పడుకోమ్మా

తల్లి: [ ఆయాసంగా ] ఈ మాత్రం దానికి డాక్టరెందుకు బాబు ? వద్దునాయనా....చిన్న దెబ్బ....అంతే.... ఒక మాట బాబు —

దయా : ఏమిటమ్మా ?

తల్లి : కోడలు... రేపు....పుట్టినరోజు పండగ చేసు కుంటా నంటోంది....ఆ అమ్మాయి మాట కాదనకు బాబు,

దయా : నేనేం కాదనలేదమ్మా. ఇదుగో సీతారామయ్య గారిదగ్గరనించి అందుకే పాతిక తెచ్చాను.

తల్లి : పాతికా ? ఏం సరిపోతవిబాబు ? ఆ అమ్మాయి పెద్దింటి బిడ్డ. తన ముద్దూ ముచ్చటా మనం కాదనగూడదు నాయనా........తన పుట్టింట్లో అయితే....

దయా : నేనేం అనలేదమ్మా ; ఏదో హాస్యానికలా అంటున్నాను,

తల్లి : వాళ్ళకి మన హాస్యాలు చప్పున అర్థంకావు. అపార్థం చేసుకొంటె మంచిది కాదు బాబు.

భారతి : [ వస్తూ ] నేనేం వాటిని అపార్థం చేసుకో లేదు లెండి.

తల్లి ; వచ్చావా అమ్మా ..ఇలా వచ్చి కూచో తల్లీ.

భారతి : [ వినిపించుకోకుండా ] నేనీ విషయంలో అప్పు చేసేటంత ఒత్తిడి చెయ్యలేదే ! మరెందుకు పాతిక రూపాయలు అప్పుతీసుకరావాలి ?

దయా : అప్పని యెవరన్నారు ?

భారతి : నేను విన్నాను ...పుట్టింట్లో జరిగే సుఖాలన్నీ ఇక్కడ జరగాలని అనటంలేదు. దయచేసి మీరు మాత్రం రేపు యెలాంటి యేర్పాట్లూ చేయకండి [ వెళ్ళిపోతుంది.]

* * *

దయా : భారతి !

భారతి : [ చిరాకుగా ] ఆc !

దయా : ....ఇదిగో ...ఇది చూశావా ?

భారతి : అక్కడ వుంచండి.

దయా : ....నేను కొత్తగా వ్రాసిన నవల.

భారతి : విన్నాను. ఆ టేబిల్ మీద వుంచి వెళ్ళండి.

దయా : [క్షణం నిశ్శబ్దం తర్వాత] భారతి — [ ఆగి పోతాడు ]

భారతి : ఏమన్నా చెబుతారా ?

దయా : నువ్వు నవసరంగా మనమధ్య ఎందుకింత దూరాన్ని కల్పించుకుంటున్నావో అర్థంకావటం లేదు.

భారతి : నేనేం కల్పించుకోవటం లేదే !

దయా : పోనీ ఈ పరిస్థితులు కల్పిస్తున్నాయా ?

భారతి : అంత అర్థంచేసుకోలేని అమాయకత్వమా మీది ?

దయా : నా అమాయకత్వం కాదు ; నీ అపార్థం.

భారతి : అపార్థమా ?

దయా : అవును, మొదట్లో నిన్ను నేను అందుకే హెచ్చరించాను : నువ్వు ఆ గప్ప శ్రీమంతు రాలవు, నువ్వు పెరిగింది చాలా విచిత్రమైన వాతావరణంలో ; అందులోనించి నా రచనల్ని చదివి ఆనందించగలవేగాని, యదార్థజీవితంలో నా సామీప్యాన్ని అనుభవించి అసహ్యించుకో వచ్చు అన్నాను.

భారతి : మీకేవో కొన్నిమాటలు వచ్చని అస్తమానం ఆ సుభాషితాలు విసరడం నేను సహించలేను.

దయా : [ దెబ్బతిన్నట్టు ] నిన్ను బాధపెట్టాలని నా ఉద్దేశం కాదు భారతి.

భారతి : అవును ; మీరేదీ ఉద్దేశ పూర్వకంగా చెయ్యరు. చేసేది తిరిగి బాధపడేది నేనే.

దయా : అలా అని నేననలేదు ...నువ్వు పుట్టినరోజు పండగ చేసుకుంటానంటె వద్దనలేదు.

భారతి : వద్దనలేదు. కాని యిందుకోసం పాతికరూపాయలు అప్పుచేశానని పదే పదే చెప్పుకున్నారు — వెధవ పాతిక రూపాయలు !

దయా : అవే—అవి నీకు వెధవ పాతికరూపాయలుగా కనిపించాయి కాబట్టే నన్నర్థం చేసుకోలేక పోయావ్.

భారతి : ఏమిటోయ్ — మహా అర్థం చేసుకోలేక పోయావ్, అర్థం చేసుకోలేక పోయావ్ అని యిన్నిసార్లంటావ్ ? నీలో యేముందని అర్థం చేసుకోడానికి ?

దయా : [ దిగ్భ్రమతో ] భారతి !

భారతి ; భారతి : పెళ్ళయినంతలో నన్ను ఏకవచనంలో పిలవడానికి నీకేం అధికృత వుందోయ్ ? నేను అనే ప్రతీ మాటనీ వెక్కిరించే హక్కు నీ కెవరిచ్చారు ?

దయా : [ ఆశ్చర్యపోతూ క్షణం మాటాడలేడు ] అంత మాటన్న తర్వాత నిజంగా మన సంబంధం గురించి చాలా ఆలోచించాల్సివుంది, భారతి. లోలోపల యింత తీవ్రంగా 'సుపీరియారిటీ కాంప్లెక్స్ 'తో బాధపడుతున్నావని తెలిసుంటె ... సరె....కాస్త విశ్రాంతి తీసుకో .... ఏదో ఆవేశంలో అనేసివుంటావ్ [ వెళ్ళిపోతాడు ]

భారతి : ఆవేశం !....మూర్ఖుడు....

తల్లి : [ వస్తూ ] ఎక్కడికమ్మా వెడుతున్నావ్ ?

భారతి : మా యింటికి,

తల్లి : ఒంటరిగానే ?

భారతి : నాకేం సహాయం అవసరం లేదు.

తల్లి : దయానిధికి చెప్పావా తల్లీ ?

భారతి : అనవసరం [ వెళ్ళిపోతుంది ]

[ రైలు నడచి, క్రమంగా శబ్దం తగ్గుతుంది.]

భారతి : తిన్నగా యిక్కడికి వచ్చేశాను.

లీల : [ నిట్టూర్పు ] చాలా తొందరపడ్డావు భారతి, ఇది మీ వంశానికెంత అప్రతిష్టో ఆలోచించావా ?

భారతి : ఏం చెయ్యమంటావే లీలా ? ఆయన్ని నేను మరోలా వూహించుకొన్నాను. అందువల్లే అన్నయ్యను, అమ్మనీ, నాన్ననీ కాదని ఆయన్ని పెళ్ళాడాను....

లీల ; అవన్నీ ' రిపీట్ ' చెయ్యకు : నాకు తెలుసు.... అయితే నీ భవిష్యత్తు గురించి, నీ జీవితం గురించి యేమైనా యోచించావా ?

భారతి ! యోచించడానికేముంది ! నేను స్వతంత్రంగా బ్రతకగలను,

లీల : నిజమే. కాని మన వెనక లోకముంది, భర్తని విడచిపెట్టిన స్త్రీని అది లేవదీసేస్తూ వెంటబడుతుంది తెలుసా ?

భారతి : వాటిని నేను లెఖ్ఖచెయ్యను,

లీల : మాటలకీ చేతలకీ హస్తిమసకాంతరం భేదంవుంది. ఇప్పుడు నువ్వు యెన్నివిధాల ధైర్యపడ్డా నీవేపు మనుషులు వేలుపెట్టి చూపిస్తూ నవ్వినపుడు తెలిసొస్తుందే : ఆడదాని ధైర్యానికి యెంత బలం వుందో !

భారతి : అయితే నన్నేం చెయ్యమంటావ్ ?

లీల : ఏం చెయ్యగలం ? అనుకుంటాం ఎన్నో ; ఊహించుకుంటాం స్వర్గాలని — కాని అవి నెరవేరవు. నెరవేరవని వెనక్కి తిరిగిపోవడంలో గొప్పతనం లేదు. ఆ పరిస్థితుల్లో వుంటూనే వాటికి తగ్గట్టు నడుచుకోవాలి.

భారతి : అది మనని హింసస్తున్నా ?

లీల : హింసించేటప్పుడు వాటిని సానిభూతితో అర్థం చేసుకో ప్రయత్నించాలే గాని ఎదిరించడంవల్ల కలతలు, కలహాలు తప్ప సామరస్యం, స్నేహభావం యెలా కలుగుతాయి ? ఆఁ....ఒక మాటడుగుతాను....కోపగించుకోవుకదా ?

భారతి ; కోపమెందుకే ?

లీల : అయితే విను : నువ్వు కోరి కోరి దయానిధిని పెళ్ళాడావు....కొన్నాళ్ళు కాపరంచేసి విరక్తి చెందావు. ఎందుకు ?

భారతి : [ మౌనం ]

లీల : ఆయన Intillectual గా చాల గొప్పవారు. కాని ఆర్థికంగా పేదవాదు కావడంవల్ల సంఘంలో చాల చివరిస్థానంలో వున్నారు. ఆ పరిస్థితుల్లో, ఆ వాతావరణంలో ఆయన ప్రవర్తన మన ధనిక వాతావరణానికి భిన్నంగా వుంటుంది. అందులో నికి నీమటుకి నువ్వేవెళ్ళి అలవాటులేని ఆ కొత్త పరిస్థితుల్ని అర్థం చేసుకోలేక అస్యహించు కోవడం నీ తప్పా ఆయన తప్పా ?

భారతి : [ మాటాడదు ]

లీల : మాటాడవేం ?....అందుకే మొదట నిన్ను బాగా ఆలోచించమని హెచ్చరించాను. కాని నువ్వు పట్టిన కుంచేలన్నావ్. వెళ్ళావ్. అర్థంలేని అభి మానంతో, అహంభావంతో అతన్ని నానా మాటలు అన్నావ్....

భారతి : [ వణికే కంఠంతో ] లీ....లా !

లీల : పోనీ యిది ఆలోచించావా : వివాహమనేది మన సమాజ పరిస్థితుల్లో ఒక్కమాటే స్త్రీకి జరుగు తుందని ? ఒకవేళ మా మధ్య భేదాభిప్రాయాలు వచ్చి విడిపోయినా నీ మీద సానుభూతి చూపే స్థితికింకా ప్రజలు Evolve కాలేదనిన్నీ ?

భారతి : అయితే నేనేం చేయాలి లీలా ?

లీల : సంసారిక జీవితంలో ఆయన్ని రచయితగా కాకండా ఆ పరిస్థితులో పెరిగిన వ్యక్తిగా అర్థం చేసుకొని తిరగడం నేర్చుకో. ఇప్పటికీ మించి పోయింది లేదు. అలాంటి మేధావికి భార్య కావటం నీ అదృష్టం—నువ్వు గొప్పింటి బిడ్డ వని మరచి, అహంభావాన్ని చంపుకుంటె.... సరె, లేచి స్నానంచెయ్యి.

భారతి : [ నిట్టూర్పు విడిచి ] మీ వారేరి ?

లీల : లేడీ డాక్టరు దగ్గరకు వెళ్ళారు.

భారతి : ఎందుకు ?

లీల : ఊహించు [ సన్నగా నవ్వుతుంది ]

భారతి : నిజం ?....అదృష్టవంతురాలవ్ !

లీల : ఆ అదృష్టం నీకు లేదా ?

భారతి : [ క్షణం నిశ్శబ్దం తర్వాత మెల్లగా ] ఎందుకు లేదు ?

లీల : [ నవ్వి ] పిచ్చి భారతీ, స్త్రీ సహజ మాతృవాంఛ ముందు ఈ అహంభావాలు, పేద గొప్పలు, ఇష్టాయిష్టాలు అన్నీ చిత్తయిపోతవే. ఆ 'భడవ' నీ ఒళ్ళోకి వచ్చేవరకే ఈ కోపాలు, తాపాలు... ఉ సరె, ఇహ లే.

[ తలుపు తట్టిన చప్పుడు ; బయటనించి దయానిధి భారతి.... భారతి ]

లీల : ఎవరు, దయానిధిలా వున్నారు !

దయా : భారతీ !

భారతి : ఆ ! వారే ! [ ఆనందంతో ] అవును వారే !.,. నువ్వాగు.... నే వెళ్ళి తెరుస్తా.

[ తలుపు తెరచినప్పుడు ఉల్లాసంగా వినిపించే సంగీతంలో కరగిపోతుంది ]

— ఆలిండియా రేడియో ప్రసారితం.






శ్రీమతి నిర్మల — నాగరత్నము

స్వారాజ్యకాంక్ష సంభవమౌటగాక
ప్రత్యేకరాష్ట్ర సంప్రాప్తంబుగగ్గ
సాటి రాష్ట్రములందు మేటియౌ ఖ్యాతి
నొందుచు నలరారుమో యాంధ్రమహిళ !
కాకతీయాన్వయ కాంత రుద్రమ్మ
రాణి సంయుక్త — దుర్గావతి — లక్ష్మి
పరిపాలనం బొనర్చిరి సుఖంపడఁగ
వారి కీర్తి నందవలె నాంధ్రమహిళ !
మండన మిశ్రుని మగువ — యా యుభయ
భారతి శంకరున్ వాదించి గెలిచె
సకల విద్యాప్రద శారద నీదు
సోదరి : ధన్యవు సుమి ! ఆంధ్రమహిళ !

——— : o : ———

## ఆంధ్రమహిళ

శ్రీ పి. ఎస్. గోపాల్, బి.కాం.

ఆంధ్రమహిళ బహుళకీర్తి
అనితర సాధ్యమ్ము !
అపూర్వమ్ము అజేయమ్ము
ఆంధ్రుల సుయశమ్ము !
గడచిన చరితమ్ములోన
సడలని ధైర్యమ్ము
వర్తమాన చరితమ్మది
కీర్తినికాయమ్ము ॥ఆంధ్రమహిళ॥
ఆంధ్రులింటి యాడుబిడ్డ
అందాలకు పెన్నిధి
అన్యాయా లెదిరింపగ
ఆయమ బహుచెడ్డది
ధైర్యమ్మున ధీబలాన
పేరుపడ్డ దొడ్డది ॥ఆంధ్ర మహిళ॥
సత్యాగ్రహ సమరంలో
సింహబాలకమ్మురా !
స్వతంత్ర భారతస్యందన
సారథి ఆయమరా !
వితరణాన కరుణలోన
విపత్కరం పరులలోన
సుతిమెత్తని హృదయరా !
అతిథికర మూర్తిరా ॥ఆంధ్రమహిళ॥
కరుణామయి కనక దుర్గ
కిరవగు దేశమ్ము !
విజయవాటి కాపురమ్ము
విశ్వప్రకాశమ్ము !
విజయనగర ప్రాంతమ్మది
విద్యల నిలయమ్ము
స్వర్లోకపు ద్వారమ్మది
సస్య శ్యామలమ్ము ॥ఆంధ్రమహిళ॥
ఆంధ్ర మాతృ పుత్రికా
అనురాగపు వల్లికా
దిగ్దిగంత పరివ్యాప్త
పరిమళసుమ వల్లికా !
మాతృదేశ కీర్తికళిక
వ్యాప్తిజేయుమమ్మా
పుట్టినింట మెట్టినింట
మెప్పుల గొనుమమ్మా ॥ఆంధ్రమహిళ॥



# "భావతరంగాలు"

శ్రీ పి. వి. రత్నం

"ఏమండోయ్! ఇక బాకీ పెరిగితే లాభం లేదు సుమండీ" అని కిళ్లీషాపువాడు, ఆనాడు, అంతమందిలో, అకస్మాత్‌గా, అన్నమాటలు, ఇంకా చెవుల్లో, గింగురు మంటూనే వున్నాయ్. నిజంగ అవి మాటలు కావు ముల్లు పోట్లు.

ఆత్మాభిమానం, ఆవేశం కవలు పిల్లలు అయినా, అంచులు దాటలేదు, అవమానం; అంచులు దాటిందంటే. ఆనందాన్ని అణచి పారేసాయ్.

కాని తటాపటా యించాను. తమాయించు కున్నాను. తలతిరిగి పోయినా, తలవంపు అయినా, తొట్రుపాటు పడలేదు. తలతీసినంత పని అయింది.

"ఏమండోయ్, ఇక బాకీ పెరిగితే లాభంలేదు సుమండీ" అనడం తల తీసినంత పనికదూ?

ఏమి మాట్లాడం? ఎలా మాట్లాడం? కొంత సేపటికి, తెప్పరిల్లి "సరేలే" అన్నాను. ఎలా అన్నానో, ఏమన్నానో, జ్ఞప్తికి రావడం లేదు ఇప్పుడు.

ఉత్సాహంగా, ఉల్లాసంగ, ఉబుసుపోక కబుర్లు చెప్పు కుంటూ, స్టేషన్‌కు మిత్రులతో కలిసి వెళ్తుంటే, ఆ కిళ్లీ షాపు కన్పించింది, మెదిలిన ఆలోచన, మెరిసిన కళ్లు, సిగరెట్లు వైపు పోయాయ్, పోయిందే ముందని, ప్రియ మిత్రుల్ని తీసుకొని, పద్దువ్రాసి, పెట్టె సిగరెట్లు తీసుకుందా మని వెళ్లాను.

నన్ను చూసి, ఏమనుకున్నాడో, సిజరు పెట్టె ఇస్తూ "ఏమండోయ్ ఇక బాకీ పెరిగితే లాభంలేదు సుమండీ" అన్నాడు అదోలా ముఖం పెట్టి.

నా ప్రక్కనున్న స్నేహితులు ఏమను కుంటారో, ఎలాంటివారో, వాడు ఊహించడు. వాడికి అవసరం లేదు కూడా. ఏమి లోకం ? పిచ్చిలోకం!

ఇక నా గౌరవం, గొప్పతనం, అంత మందిలో, అప్పటికప్పుడు, అనుకోకుండా, అంతరిస్తుందని అను కోలేదెప్పుడూ. ఎప్పుడూ ఊహించని సంఘటన!

నవనాడులూ కృంగతీసిన మాటలు ....నెత్తురుచుక్క లేకుండాచేసిన హెచ్చరిక!

ఇక అక్కడ నిలబడలేక పోయాను. అంత వరకు ఉరకలు వేస్తున్న ఆనందోత్సాహాలు అంత మయ్యాయ్ నామర్యాద మంట గల్సింది.

నా మాట నీఏమాట! నా ప్రతిష్ఠ, నా హోదా, నా ఇంకా "నేను" 'నేనానా'? అని ఏమో!

ఇక, మిత్రులతో, ముసిముసి నవ్వులతో, మాట్లాడ లేక పోయాను. ఎలా మాట్లాడుతాను? మిత్రులముందు మాడిన ముఖం .. రైలుకు మిత్రులు వెళ్లిపోయారు....

నా బుర్ర వేడెక్కి పోయింది. మనస్సు మాట్లాడు కుంటోంది, ఆవేశం! ఆవేదన! అసంతృప్తి! అవమానం!! ఒక్కొక్కటి ఒక్కొక్కసారి .... విజృంభిస్తున్నాయ్. వడివడిగా విజృంభిస్తున్నాయ్!

స్టేషన్‌లో నుంచి సిగ్నల్ దాటాను. జీవితంలో ఒక సిగ్నల్! ఎర్రనిదీపాలు! పచ్చనిదీపాలు....అటూ ఇటూ .. తీగలు దాటుకుంటూ, తప్పుడు బద్దెలు, దాటుకుంటూ, గేటులోంచి వచ్చాను. జీవితానికి దీనికీ ఎంత సంబంధం, మరుపురాని సంబంధం.

నడుస్తున్నాను, నడవలేక, నడుస్తున్నాను. నడవలేక, నడవలేక నడుస్తుంటే, ఆలోచనలు అంగలుమీద అంగలు వేసుకుంటూ, బాగ, నడుస్తున్నాయ్.

ఎంత మాటన్నాడు? ఎలాంటి మాటన్నాడు? "ఇక బాకీ పెరిగితే లాభంలేదు సుమండీ" అని! అంటే అరువు అసాధ్యం అని అనడం కదూ ?

వాడికి విశ్వాసం వుందీ? వివేకంవుందీ? విలువ, నా 'విలువ' తెలుసా? 'వెధవ' ఛా ! ఛా ! తప్పు తప్పున్నర అలా అనుకోవడం.

ఆ! తప్పు ఏమిటి? ఎన్నిసార్లు, ఎన్ని పదులు ఇవ్వ లేదు? ఎగ్గొట్టానా? ఇవ్వనన్నానా? ఎక్కువ రాసావన్నానా? వెటకారంగా చెప్పానా? టపీమని, మనియార్డరురావడంతో మొఖంమీద, నిటారుగా నిలబడి, నిర్లక్ష్యంగా, పదిరూ పాయల నోటు విసరడం లేదూ? అప్పుడు పీనుగు "హిహి" అంటూ, సిగరెట్లు పెట్లుకు పెట్లు వక్కపొడి పొట్లాలు, ఎన్నికావాలన్నా, ఎప్పుడు కావాలన్న ఇస్తాడు.

ఇస్తాడనే. బాకీ నిమిత్తం పదిరూపాయలు జమ కట్టితే ఇవ్వడూ? ఇస్తాడు, అదైనా, ఆరురోజులు .... అనుమానించకుండ, అభ్యంతరం లేకుండా, ఆనందంగా, అందిస్తాడు చేతికి .... మళ్లీ మామూలే ముఖం ముడుచుకుంటుంది. ముఖావం ఎప్పుడూ, ఏడుస్తూ, వుంటాడు. చిటపటలు, చిర్రులు బుర్రులు... రోజులు దాటితే, రుసరుసలు....

అరువు ఇస్తే అవసరం తీరదని కాబోలు! అరువు ఇవ్వడానికి అలా చచ్చిపోతాడేం? డబ్బు ఎలాగూ, ఎప్పుడైనా, పుచ్చుకుంటాడు. ఏదులుకుంటాడా? ఊరుకుంటాడా?

వాడికి ఆమాత్రం జ్ఞానం వుంటే ఇంకేం? నావిలువ, గౌరవం, వాడికి ఏమిటెల్సు? తెలియకపోతే, తెలియ నట్టుండాలి. లేదా చెబితే వినాలి. అదేమిటిలే, అరువు అరువు అని అంతా దుకాణంలో వున్న సరుకు పట్టుకొని పోతే, 'దివాలా' తీయవలసిందే. మూడు రోజులకు దివాలా.... అంతా అలా అనుకుంటే, ఇక వ్యాపారం సాగేదెలా? అవసరం కొద్దీ, ఆత్రుతతో అడుగుతాడు. అంత మాత్రంచేత, 'అజ్ఞాని' అనుకోవడం అజ్ఞానం అనుకున్నాను.

ఉహూ, అదికాదు అసలు. ఆ కిళ్లీషాపు వాడు ఎందుకలా ఏడుస్తూ వుంటాడు? ఎప్పటికప్పుడు, పుస్తకంలో, పదిలంగా, పద్దు, న్యాయంగా, నిక్కచ్చిగా, రాసి పారేసే వాణ్నే. అడగడం, నాక అలవాటు అడగొద్దు అని అనేక అర్జీలు పెట్టుకున్నా అడగడం మానదేం? ఉంటే దాచుకుంటానా? మనియార్డరు రాలేదంటే అలా చూస్తాడేం? ఇస్తానంటే నమ్మడు. "ఎప్పుడూ మీరింతే" అంటాడు పైగా. ఇలాగే తిప్పుతానట వెధవ పీనుగు, బ్యాంకు చెక్కులు మార్చడం అనుకున్నాడేమో! మధ్యలో, మాయమై పోతానని మోసగిస్తానని, వాడికి భయం. తగని భయం తీరని భయం.

ఆ భయం, బిడియం లేకుండా, భక్తిలేకుండా, "బాకీ" "బాకీ" అని పలవరిస్తూ వుంటాడు, పదిసార్లు గుర్తు చేస్తాడు. "చెప్పాపుగా, రావడంతో ఇస్తానంటే" వినడు. వాడు అలాగ ఇస్తాడు కనుకనే అసలు అ సిగరెట్లు కాల్చినట్టే వుండదు. వీడి మాటలు మెదడులో మెదలి, మనస్సును చికాకు పరుస్తాయ్.

నాకు వాడు నెలకు అనేకసార్లు అనుకోకుండా కన్పిస్తూ వుంటాడు. ఎక్కడ? కలలో. నిజంగాకలలోకళ్లముందు.... ఏనుగుగున్నలా, యమకింకరుడులా, ప్రత్యక్ష మవుతాడు. "బాకీ" "బాకీ" అంటూ నా "బెడ్" చుట్టూ తిరుగుతాడు ఇక చెమటలు.... ఒకటే చెమటలు... నిద్ర పట్టదు. ఇంకేం నిద్ర.... ఒకటే. . . . నిద్ర. . . .

'బాకీ' పెరిగినట్టు నాకు తెలియనే తెలియదు. కాని వాడు ఇట్టే కనిపెట్టేస్తాడు. బాకీ అడిగేడా, ప్రాణాలు పోయాయన్నమాటే. తలెత్తుకొని, ఇక ఆవీధిలో, అందరితో నడిచి వెళ్లడమే? అసాధ్యం. అసంభవం ఉహూ, రాయిలా, మైలు రాయిలా, వాడు అక్కడ . . .రాయిలా. మూలలో నేనిక్కడ . . . మెయిన్‌రోడ్డును మర్చి పోవల్సిందే. మనియార్డరు వచ్చేవరకు . . .

లేదంటే, ప్రక్కసందులో నుంచి, ప్రక్కప్రక్కలకు చూస్తూ, ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని, బిక్కుబిక్కుమంటూ, పోవాలికదా!

పోనీ వాడి దగ్గర మానివేద్దామంటే.... అది లాడ్జికి దగ్గరలో.... హోటల్‌కు దగ్గరలో.... మంచి సెంటర్‌లో మెయిన్ రోడ్డులో వుంది. అన్ని రకాల సిగరెట్లూ, వాడి దగ్గర దొరుకుతాయి. హంగామా హెచ్చు. అందుకే అంతా అక్కడకు మూగుతారు, పెద్దలకు, పిన్నలకు, అక్కడ ఖాతాలు వుంటాయ్. వాడు అరువు యెంతైనా పెట్టగలడు. పైగా అక్కడే అంతా కొనడం ఒక అలవాటు అయిపోయింది. కల్సుకోవడం అక్కడే. అన్ని రకాల కబుర్లు, అన్ని రకాల విద్యార్థులు, అక్కడే కన్పిస్తారు. కులుకుతూ, కేరింతాలు కొడుతూ, కుర్చీల్లో కూర్చొని, రేడియో పాటలు వింటూ పిచ్చాపాటీ మాట్లాడుకోవడం మామూలు....

అక్కడ యెవరికైనా ఖాతా వుంటుంది. వుందంటే ఘనత. లేదంటే హీనం. అక్కడే, చక్కగా, సభ్యత సంస్కారం నవ్వుతుంటాయ్. నాగరికత నాట్యం చేస్తూయుంటుంది. ఎప్పుడైనా, యెవరికైనా, ఏమైనా, "ఆఫర్" చేయాల్సి వుంటుంది. డబ్బులు జేబులో గలగల లాడక పోవచ్చు. గడగడ లేకుండా, ఘరానాగా, ఆ కిళ్ళీ షాపులో ఖాతావుంటే, పద్దురాసి, పదిమందికైనా "ఆఫర్" చేయొచ్చు. ఖాతాలేదంటే, డబ్బులు లేవంటే ఖుషీగావుంటే నాకు నామోషీకాదూ?

నెలనెలా నాన్నగారు 'వంద రూపాయలు' పంపిస్తున్నారు. అసలు యెంత పంపించినా, నాకు సంతృప్తి, సంతోషం వుండదులే. సరిపోదు అంతే. ఆ 'వంద'తోనే సరిపెట్టుకొని తీరాలి. ఎక్కువ పంపమని యెలా రాయగలను ? రాసినా యెలా పంపించ గలరు ?

నెలనెలా యిచ్చింది. సహా యిచ్చింది. మీల్స్ హోటల్ అయ్యర్....ఫర్వాలేదులే. మీల్స్ టిక్కెట్స్ అయినా అంతగా, బెంగ పెట్టుకోనవసరంలేదు 'ఉడిపి' హోటల్‌లో నెలకు 20 రూపాయలకు దక్కుపరేదు. ఇంచుమించు. ఇదిగో, అదిగో అంటే రెండు రోజులు ఆగడానికి. వాళ్ళకి అభ్యంతరం లేదు.

పోనీ ఏ మిత్రుడ్ని అయినా అడుగుదామంటే అభిమానం అడ్డుపడుతుంది. ఇంతాచేసి అడిగితే లేదన వచ్చు. మరోలా మాట్లాడవచ్చు.

ఛా ! ఛా ! సిగరెట్లు ఎంతపని చేస్తున్నాయ్ ? ఎంత హుషారిస్తాయో, అంత మనస్సుని పాడు చేస్తాయ్, కాల్చకుండా వుంటే....అమ్మో ! ఇంకేమైనా వుందీ ? పోనీ మరెక్కడయినా మరొకసారి ఖాతా పెట్టితే....ఇప్పుడెవరు ఒప్పుకుంటారు ?

పోనీ తక్కువ రకం సిగరెట్లు కాలిస్తే ...నాన్‌సెన్స్! "దిసీజ్ ది డిగ్నిటీ" న్యూసెన్స్‌కూడా—అలవాటు అవమానం చేస్తున్నా—తలవంపు జరిగినా, తిరుగుబాటు చేయలేను. చేయలేను, ఎవరిమీద, ఎందుకు ? ఎప్పుడు ? ఎల్లా ! సిగరెట్లు మానేస్తే ఆకిళ్ళీ షాపువాడు ఇక నన్ను అడగగలడూ ? అరువు యివ్వననగలడూ ? వాడి అవసరంలేదు. అంతిమఘట్టం—అఖండ విజయం.

సిగరెట్లకు అలవాటుపడ్డ బానిసను—కన్పించని బానిసను—కనుకులేని బానిసను—కదగలేని బానిసను—కాలానికి కట్టుబడ్డ బానిసను—రోడ్డుమీద నవ్వలేక నడుస్తున్నాను నడవలేక నడుస్తున్నాను—

అప్పుచేసిన అవమానం—అశాంతి రేపిన అవమానం—అణచివేస్తా. ఆపివేస్తా. అందుకే, రేపు మనియార్డరు రావడంతో వాడి మొఖాన పది రూపాయల నోటు కొట్టి—పారేస్తా—రేపు వాడిపని—ఔను. రేపు చెబుతాగా.... రేపు రావాలి, ఔను నేను నిజంగా, ఏరోజుకా రోజు, రేపుకోసం ఆశతో, ఆరని ఆశతో, అంతులేని ఆశతో, అమూల్యమైన ఆశతో, చూశాను, చూస్తాను.

★

# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి. ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉదమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరఫున కొందఱు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయెడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ.45 ,035/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 563/- ఇంకా పెక్కుమంది సోదరిమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాము.

టి. జి. హైమవతి,
ఆర్. లక్ష్మి.

# మనసులో మాట

శ్రీమతి ఊ. లక్ష్మీకాన్తమ్మ

"ఆంధ్రమహిళ డిసెంబరులో ప్రత్యేకసంచికగా వెలువడబోతూ ఉన్నది. ఏదైనా రచన పంపండి" అని రెండునెలలనాడే వ్రాశారు శ్రీమతి కె. సుగుణమణిగారు! "ఆంధ్రమహిళకు ఇప్పుడు నేను సంపాదకురాలనైనాను! ఏదైనా రచనలు పంపుతూ ఉండండి" అని వ్రాశారు శ్రీమతి లక్ష్మీ రఘురాముగారు!

క్రొత్తవ్యాసం వ్రాయడానికి నిజంగా ఓపికాలేదు, తీరికాలేదు. ప్రాతవే పంపడానికి మనస్సూ పుట్టలేదు, 'ఏమిచేద్దామా?' అనే ఆలోచనతోనే రోజులుగడిచిపోయాయి. పోనీ అసలు పంపకుండా మానేద్దామా అంటే ప్రియసోదరీమణులమాట కాదనడానికి మనస్కరించనూలేదు.

ఇంతలో నవంబరు ఆంధ్రమహిళ వచ్చింది. ఒకసారి కడవరకూ చూడ్డంలో తుట్టతుదను సోదరి శ్రీ లక్ష్మీ రఘురాముగారి "మనలోమాట" వ్యాసంకనబడింది. తీరా వ్యాసంఅంతా చదివేటప్పటికి అచ్చంగా నాభావాలే శ్రీ సోదరి లక్ష్మీరఘురాముగారికికూడా ఉండడం గమనించిన నాకు చాలా సంతోషమూ, ఆశ్చర్యమూ కలిగినవి.

స్త్రీలు, స్త్రీవిద్య, స్త్రీలకు ఉద్యోగాలు అనేవిషయం చాలా విమర్శనాంశం ఐపోయింది రోజుల్లో. దాన్నిగూర్చి నామనస్సులో ఉన్నమాట వ్రాయాలని చాలానాళ్లనుండి ఉన్నసంకల్పం ఈనాటికీవిధంగా ఈరూపాన్ని పొందగలిగినందుకు సంతోషిస్తూ ఈ వ్యాసానికుపక్రమిస్తూన్నాను. చాలా పత్రికల్లో ఈ విషయమే చర్చిస్తున్నారు. రేడియోలోకూడా పదేపదే ఈ విషయమై చర్చలు జరుపుతున్నారు. అయితే ఇదమిత్థమని పర్యవసాన ఏమైనా తేలిందా? అంటేమాత్రం లేదనేచెప్పవలసి వస్తుంది. ఎందువల్లనంటే ఆ విషయమే అట్లాంటిది కావడంవలన.

ఇంతకూ ఈ రాద్ధాన్తం అంతా ఎందుకు బయలుదేరుతూందో, అసలు బయలుదేరవలసి వచ్చినకారణం ఏమిటో అందరికూ తెలిసిన చిదంబర రహస్యమే. 'ఉద్యోగం పురుషలక్షణం' అన్నారు, పూర్వం! సరేలెండి పూర్వం సూక్తులన్నింటికీ మనం అంగీకారముద్ర వేస్తున్నాంకనుక నా దీనికిమాత్రం తలొగ్గి ఊరుకోవడానికి? నిరుపేద సంసారమై ఉండి ఆడది బయటకు బయలుదేరితేనేతప్ప గతిగడవనంత అత్యవసర పరిస్థితులేర్పడిన కుటుంబాల్లో స్త్రీలు ఉద్యోగంచేయవలసినదే. చేస్తూనే ఉన్నారు కూడా. స్త్రీలు ఉద్యోగాలు చెయ్యనేకూడదు! అని ఎవ్వరనగలరు? ఉదరపోషణకు ధనార్జనకల్పించే వృత్తిని దేనినైనా ఉద్యోగమే అనాలి. అట్లాంటప్పుడు పరువుప్రతిష్ఠలకుజంకే మధ్యమతరగతి కుటుంబాల ఆడవాళ్లను మినహాయిస్తే పాటకపు వర్గాల్లోని స్త్రీలంతా ఏదోవృత్తి ఉద్యోగాల నాశ్రయించి తమపొట్ట పోసుకొంటూ తమకుటుంబాలకెంత సహాయపడుతూన్న వాళ్లేకదా. అందువలన స్త్రీలు ఉద్యోగాలు చేయరాదని ఎవ్వరూ అనరు.

కాని నిజానికి పెద్ద పెద్ద ధనవంతుల కుటుంబాల్లో పుట్టి పెద్దచదువులు చదివి, పెద్ద ఉద్యోగస్థుల భార్యలుగానో కుటుంబీకురాండ్రుగానో ఉండే ధనవంతులైన స్త్రీలుకూడా ఉద్యోగాలు చేయవలసినదేనా? అనేది మాత్రం ఆలోచింపదగిన విషయమే.

ఉన్నత విజ్ఞానవివేకంకల స్త్రీజాతి అంతా గుండెలమీద చేయివేసుకొని నిజంగా ఆలోచించండి. ఆత్మపరీక్ష చేసుకోండి ఈ విషయంలో! వారికెందుకు ఉద్యోగాలు?

స్త్రీలకు పురుషులతోబాటు సమానహక్కులు కావాలనే సిద్ధాంతం ఎంతవరకూ అన్వర్తిస్తుంది? సోదరి లక్ష్మీ రఘురాముగారు వ్రాసినట్లు ప్రజ్ఞాప్రాభవాలు వేరూ అర్హత వేరూకాదా? పురుషునికంటె అత్యధికమైన ప్రజ్ఞాప్రాభవాలే ఉండవచ్చు స్త్రీలకు! అంతమాత్రంతో 'సమానత్వం సమానత్వం' అంటూ అవసరమున్నా లేకపోయినా ప్రతీ స్త్రీ ఉద్యోగాలకు ఎగబడి, పోరాడవలసినదేనా? ప్రభుత్వానికి ఒత్తిడితీసికొనివచ్చి నిరుద్యోగ సమస్యను ఇంకా తీవ్రంచేయవలసిందేనా?

భారతదేశ పరిస్థితియేమి? ఇపుడిపుడే స్వాతంత్ర్యం పొంది సాటినాగరికదేశాల్తో నాల్గింటితోబాటు ఆర్థిక వ్యవస్థలో ఎంతవరకు పోటీచేయగల్గుతూంది? వైజ్ఞానికంగా భారతదేశానికి ప్రపంచ సమాఖ్యఅంతా నివాళులెత్తవచ్చుకాని, అమెరికా, ఇంగ్లాండు మొదలైన దేశా

ల్లో పోలిస్తే భారతదేశపు ఆర్థికప్రతిపత్తియేమి? విద్యావంతులకుగాని, పాఠకప్రజానీకానికిగాని, విజ్ఞానులకుగాని తప్పనిసరిగా ఉద్యోగము చూపించి పోషించవలసిన అర్హతగల, యోగ్యతకలిగిన ఎంతమందికి భారతదేశం, దేశప్రభుత్వం ఉద్యోగాల సౌకర్యం చేయగల్గుతూన్నది? నిజంగా ఇన్ని కోట్ల జనాభాకలదేశాల్లో ఇట్టినిరుపేద పరిస్థితుల్లో ఇంకే దేశమైనా ఈ సౌకర్యం చేయగలదా? అని విజ్ఞానవతులైన స్త్రీ లెందుకు ప్రశ్నించుకోరో? అర్థంకాకుండా ఉన్నది.

స్కూలుఫైనలు చదివితే ఉద్యోగం తప్పనిసరి! హైయరుగ్రేడు ట్రైనింగు ప్యాసయితే ఉద్యోగం తప్పనిసరి! ఏమివ్యామోహం! ఎంత అవివేకం! సామాన్యపు పనిపాటలు చేసుకోవలెనంటే, ఇంట్లో పిల్లపాపలను దిద్దుకోవలెనంటే నామోషీ! ఇంటిపనంటే ఏవగించుకొనే ఆడుది ఉద్యోగధర్మం ఏమి నిర్వహించగలదు? చదువులు నేర్చి తుదకు సాధించినదిదేనా? "చదివిన చదువు నెట్లావినియోగించాలి? ఉద్యోగంలేకపోతే ప్రజ్ఞ అంతా ఎట్లాబయటకు రావాలి?" అని అడుగుతున్నారే పబ్బు తీసికొని ఉద్యోగంచేస్తేనే ప్రజ్ఞాపాటవాలు ఉపయోగించినట్లూ లేకపోతే లేనట్లూనా? స్వచ్ఛందంగా సంఘసేవ చేసి సాటివారికెందఱకు ఉద్ధరణమార్గం చూపకూడదు?

ధనవంతులైన పురుషులూ, స్త్రీలూకూడా ఉద్యోగాల కెగబడి తమ పలుకుబడిచేత ఉద్యోగాలుసాధించి ఆయా ఉద్యోగాలకోసం కనిపెట్టుకొని ఉన్న ఎందఱు పేద వారికి నిరాశకల్పించి నిలువునా వారి జీవితాశలను కూల్చి వేస్తున్నారో? ఎప్పుడైనా ఆలోచించరా?

ధనవంతులై విలాసంకోసం, కాలక్షేపంకోసం ఉద్యోగాలుచే జిక్కించుకొనే సోదరీమణులంతా గుండెలమీద చేయివేసుకొని ఈ విషయంలో నిదానంగా ఆలోచించి సాటి బీదస్త్రీలకి ఉద్యోగావకాశము కల్పించి, తాము స్వచ్ఛందంగా సంఘసేవచేపట్టినట్లైతే దేశమూ బాగుపడుతుంది. ప్రభుత్వానికి నిరుద్యోగసమస్యా తీరిపోతుందని నా ఉద్దేశం.

మనసులోమాటను జంకకుండా బైటపెట్టినందుకు సోదరీమణులు కోపించకుండా నిదానంగా ఆలోచన చేయాలని మరీమరీ ప్రార్థిస్తూ విరమిస్తున్నాను.

# మీకు తెలుసా?

## ఈ చిత్రవిచిత్రాలు?

★

వినండి

భారతీయుని భోజనము

ప్రమాణాలు పెరిగినట్లు మంత్రిప్రకటన (కేంద్ర ఆహార వ్యవసాయా శాఖ మంత్రి శ్రీ డా. పంజాబురావు దేశ ముఖ్ గారు లోకసభలో ఈవివరాలు వెల్లడించారు.)

**1950–51** లో భారతీయుల సగటు భోజనం రోజుకి **1398** కేలరీలు

**1953–54** లో **1623** కేలరీలు

అంటే ఇదివరకన్నా ఇప్పుడు రోజుకి **225** కాలరీల భోజనము ఎక్కువ తింటున్నామన్న మాట

ఄ ఄ ఄ

2. కొలంబోలో అంటే లంకలో ఒక బాల భీముడు (రావణాసురుడు కాదు) వెలిశాడట. పిల్లవాని వయస్సు ఎనిమిదేండ్లేగాని బరువు మాత్రము నూట ఏబది పౌనులు మాత్రమేనట ఒక్కేతడవ సులువుగా పదకొండు బియ్యపు బస్తాలు మోయగలడట. కాని,

రోజుకి మూడు పూటలు ఆహారము తీసుకొంటాడట. పూటకు రెండుంబాతిక శేర్ల బియ్యపు అన్నము, ఎనిమిది కోడిగుడ్లు తింటాడట.

ఄ ఄ ఄ

3. సినిమా పరిశ్రమలో ప్రపంచంలో ప్రథమస్థానము—అమెరికాకు—రెండవస్థానము—మన దేశమునకే!

ఄ ఄ ఄ

4. కప్పల యుద్ధము దుశ్శకునము.

కప్పలలో కూడా వర్ణభేదా లున్నవట. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు ఎర్రకప్పలు నల్లకప్పలు హోరాహోరిగా ఉత్తర మలయాలో పోరాడినవట. ఈపోరాట ఫలితముగానే రెండవ యుద్ధము వచ్చినదని అక్కడివారి నమ్మిక. మళ్లీ మొన్న బుధవారము ఒకా అనంగ (ఉత్తర మలయాలో) అనేచోట ఎర్రకప్పలు నల్లకప్పలు యుద్ధము చేయుట మొదలిడినవట. మొదట్లో ఎర్రకప్పలే గెల్చినవట. కాని చివరికి జయాపజయాలు ఎట్లుండునో!

అక్కడివారికి ఇది ఒక దుశ్శకునముగా కనబడుతున్నదట.

ఄ ఄ ఄ

5. వినయముగల చెట్టు—భీమవరానికి సమీపములోనున్న నరసింగరాజపురం అగ్రహారములో ఒక దేవాలయమునకు సమీపమున ఒక ఈతచెట్టున్నదట. ఈచెట్టు షుమారు పన్నెండడుగుల ఎత్తున్నదట. సరిగా మధ్యాహ్నము మూడుగంటలకు పడమటకు తిరిగి వంగుతుందట (ఎవరికి నమస్కరిస్తుందో!) మళ్లీ ఒక అరగంట సేపైన తరువాత మెల్లగా లేచుటకు ఆరంభించి సరిగా నాలుగు గంటలకు యథాప్రకారము నిటారుగా నిలుచుండునట.

అతి వినయము ధూర్తలక్షణమంటారు. పాపము కాని ఆచెట్టు మధ్యరాత్రి పన్నెండు ఒంటిగంటలమధ్య మంచి సువాసనలు వెదజల్లునట!

ఄ ఄ ఄ

6. కేంద్రమంత్రి కర్మార్కరుగారు మొన్న మనదేశములో తయారయే అద్దపు గాజులు చాలా అందమైనవనీ వాటిని పాశ్చాత్య స్త్రీలు కూడా ధరించేటట్లు మనము ప్రచారము చేయాలనీ, గాజుల ఫేషను ప్రపంచ స్త్రీలందరిలో కలుగచేయవలయునని సలహా ఇచ్చారు.

అలాగే చేయవచ్చు, దానికేమి భాగ్యము. కాని మన దేశములో నిర్బంధముగా ఆడ మగ భేదములేకుండా అందరినీ గాజులు తొడుక్కోమంటే బాగుండవచ్చు.



Telegram : GONDIMENT. Telephone : 2257

# P. VENCATACHELLUM CONDIMENTS,

ESTD : 1860.

REGISTERED : PEACOCK BRAND.

1 & 2, POPHAM'S BROADWAY, MADRAS - 1

## PRICE LIST.

| | | Each. Rs. As. |
|---|---|---|
| Special Lime Pickle | (Large) | 2—0 |
| ,, ,, | (Small) | 1—4 |
| Special Mango Pickle | | 2—0 |
| Avakai (Hot Mango) Pickle | (Large) | 2—0 |
| ,, ,, | (Small) | 1—6 |
| Pepper Chutney | | 1—2 |
| Narthangai Pickle | (Large) | 2—0 |
| ,, ,, | (Small) | 1—4 |
| Mixed Vegetables Pickle | (Large) | 2—0 |
| ,, ,, | (Small) | 1—4 |
| Kadu Manga Pickle | (Large) | 2—0 |
| ,, ,, | (Small) | 1—4 |
| Nellikai Pickle | (Large) | 2—0 |
| ,, | (Small) | 1—4 |
| Pachai Melaga Chutney | | 0-15 |
| Ginger ,, | | 0-15 |
| Nallan Thokku | | 0-15 |
| Malli ,, | | 0-15 |
| Puthina ,, | | 0-15 |
| Pepper Powder ¼ lb. | | 1-12 |
| P. V. Sambar Powder Tin 1 lb. | | 2—0 |
| ,, ,, ¼ lb. | | 1—2 |
| ,, ,, ½ lb. | | 0-10 |



# మనలో మనమాట



" న్యాయశాస్త్ర మరయనన్యాయ మొనరించు
ధర్మశాస్త్ర మొసగు దుర్మతంబు
జోతిష్యంబు జనుల నీతులుతప్పించు
విశ్వదాభిరామ వినురవేమ "

దీనియర్థమేమి తిరుమలేశా?

న్యాయశాస్త్రజ్ఞానము అన్యాయములు చేయించును. ధర్మశాస్త్రజ్ఞానము దుర్మతముల బోధించును. జౌతిష్య శాస్త్రజ్ఞానము మనజుల నీతి దూరుల చేయుచున్నది.

ఇది తాత్పర్యము. అందుకే కాబోలు ఒక ఆంగ్లకవి "ignorance is bliss" అన్నాడు.

న్యాయశాస్త్ర మరయ నన్యాయమొనరించు—ఈ విషయము న్యాయవాదులకు తెలిసినా పబ్లికు సర్వీసు కమీషనువారికి తెలిసినట్లు లేదు. ప్రభుత్వానికి అసలీ విషయము బోధపడినట్లులేదు. లాకాలేజీలు ఎత్తివేసి, హైకోర్టుతలుపులు బంధించి బి. ఏ. బి. ఎల్‌ను తూర్పుకుతిరిగి దణ్ణముపెట్టమని ఎప్పుడు ఆర్డి నెన్సులు వెలువడునో!

ధర్మశాస్త్రమొసగు దుర్మతంబు—అందుకే మత ప్రభోధకులగతులు అలా పట్టినవి. గ్రీకు దేశీయులు సోక్రటీసును విషము త్రాగమని నిర్బంధించారు. ఆయనకు ధర్మశాస్త్రము బాగా తెలిసిండుటచేత దుర్మతంబులు ప్రభోధము చేశాడనే వారినమ్మకము. పాపము ఆయన విషాన్ని తేనెను త్రాగినట్లుత్రాగి తన ప్రాణాన్ని అంత మొందించు కున్నాడుగాని, ఆరంభించిన దుర్మతంబు విజృభించింది. ధర్మజుడు 'అశ్వద్ధామ కుంజిరహః' అని అనృతమాడుట ధర్మశాస్త్రములన్నీ తెలసిన ధర్మజునికే చెల్లింది.

జోతిష్యంబు జనులనీతుల తప్పించు – ఈ విషయము నారదమహాశయుని చరిత్ర తెలసిన వారికి విశదమే. తన దివ్యదృష్టిచేత భూతవర్తమాన భవిష్యత్తు సమాచారములన్నీ తెలియబట్టేకదా ఆయన అయినవారికి కానివారికి లంకెలుపెట్టి కలహాభోజుడని బిరుదాంకితుడయ్యాడు. అట్లాగే జోతిష్యము తెలిస్తే నీతి తప్పుట తథ్యము. ముందుగానే పిల్లలులేనాయన విల్లునామా తెలిస్తే ఏమాతుందో చూడండి (ఆయన బంధువులపాట్లు బ్రహ్మకెరుక)! రాజుగారికి రాజభ్రష్టు తాతామని ముందే తెలిస్తే అతనేమిచేస్తాడో ఆలోచించండి (ప్రజల అగచాట్లు దైవమెరుగు). లంకెలబిందెలు దొరకుతుందని తెలుసుకొన్న అదృష్టవంతుడు

ఎప్పుడూ గుంటలూ గోడలూ త్రవ్వుతుండుట సహజము. మంత్రిపదవి నలంకరించ బోతున్నావని తెలిసికొన్నవ్యక్తి ఉపన్యాసధోరణిలో దప్ప ఆలోచించనే లేకపోవచ్చు. సూర్పణకను పెండ్లాడుతానని తెలిసికొన్న యువకుడు ఏ సుందరాగి మృదుమధరహస్తముల చెంప పెట్టు రుచి చూడవచ్చు లేక బెండకాయవలే ముదిరి బ్రహ్మచర్యము అవలంబించవచ్చు.

పర్యవసానము ఈ విషయాలు పరీక్షిస్తే తేలిందేమిటంటే, న్యాయశాస్త్రము, ధర్మశాస్త్రము, జోతిశాస్త్రము—ఆ మాటకొస్తే ఏ శాస్త్రము తెలియకుండా వుంటేనే మానవులకు శ్రేయోదాయకము. (భౌతికశాస్త్రము తెలుసుకుంటేనే కదా హిరోషిమాకు అట్టి ఆపదలు కలిగినవి). తెలసినవాడికన్నా తెలియనివాడే మేలు. తెలిసినవాడు కీడుచేయగలడు. తెలియనివాడు మేలుకలుగ చేయవచ్చు. కాబట్టి తెలియనివాడే తెలిసినవానికన్నా మేలు. (తర్కశాస్త్రము తెలిసినవాడు తప్పుగా వాదించగలడు. తర్కశాస్త్రమెరుగక వాదించువాడు నావలే చక్కగా వాదించగలడు!)

అంటే చాణిక్యుడువలే రాజతంత్రము తెలిసినవాడు ఆయనవలనే రాజనీతి వెలగబెట్టుతాడు. అర్థశాస్త్రము తెలిసినవానికి జేబులో రాగికాణీ వుండకపోవటానికిదే కారణము. వైద్యశాస్త్రము తెలియని హిమాలయా బాబాలు జయప్రదంగా వైద్యముచేయుటయే ఈ సత్యాన్ని ఋజువుచేస్తున్నది. పొయ్యి దగ్గరే జీవితాలు గడుపమని నొసటమీద బ్రహ్మలిఖితమై పుట్టిననాటినుండి అందుకు తర్ఫీదైన స్త్రీలుగాక నలభీమాదులు పాకశాస్త్ర ప్రవీణులైనదీ అందుచేతనే.

కాబట్టే ప్రపంచములో న్యాయశాస్త్ర మెరుగని న్యాయశాఖామాత్యులు, వ్యవసాయ మెరుగని వ్యవసాయ శాఖామంత్రులు, వైద్య శాస్త్రిమెరుగని వైద్యశాఖామంత్రులు, అర్థ శాస్త్రివాసనలేని ఆర్థికమంత్రులు, విద్యాగంధములేని విద్యామంత్రులు వుండిరి, వున్నారు, వుంటారు.

ఇంజనీరింగు శాస్త్రిము చదువలేదు కాబట్టే మునుపు మన మేస్త్రీలు శాశ్వతమగు గుళ్లు గోపురాలు—విజయనగర సామాజ్యములో నేటికి అగబడు చక్కటి కట్టడములు, కాలువలు మొదలైనవి నిర్మించకలిగారు. అజంతా గుహలు చెక్కినవారుగాని, నాగార్జునకొండ, అమరావతీ వగైరాలు నిర్మించినవారు కాని ఏ ఆర్టు డిగ్రీపొంది యుండలేదు. వైద్యచింతామణి వ్రాసిన అశ్వినీకుమారులు ఏ వైద్య విద్యాలయములోను అయిదున్నర సంవత్సరములు చదివియుండలేదు. భరద్వాజ విమానశాస్త్రిము (aeronautics) చదువకుండానే రామాయణము నాటికి పుష్పక విమానములు సృష్టింపబడ్డవి.

ఈ విషయము మన ప్రధాని నెహరూ ఆలోచించి యుండబట్టే నిరుడు హైదరాబాదులో తమవంటివారు రాజకీయశాస్త్రిము పఠించకుండానే రాజకీయరంగములోకి దిగామని చెప్పారు. ప్రధాని రాజకీయశాస్త్రిము చదువలేదుకాబట్టే మనము బ్రతికిపోయాము—తానొక మంచి రాజకీయవేత్తగా తయారగు అవకాశము కల్గినది.

అంటే ఎవరైనా మంచి రాజకీయ వేత్తగా రాణింపదలచుకుంటే ఆ వ్యక్తి రాజకీయ శాస్త్రపు వాసనైనా ఎరుగని వ్యక్తిగా వున్నట్లయితే ఆ వ్యక్తి 'ఏ' క్లాసు రాజకీయవేత్తగా తయారగుటకు అవకాశముకలదు. అసలు సిసలైన రాజకీయవేత్తగా తయారుకావాలంటే ఒక రాజకీయ శాస్త్రమేకాదు ఏ శాస్త్రము పఠించివుండి వుండకూడదు. ఎంత తక్కువ చదివినవాడైతే అంతమంచిది. చదువుకున్నవానికన్నా చదువుకోనివ్యక్తే రాజకీయాలలోకి దిగుటకు ఎక్కువ అర్హుడు. శ్రీ నెహ్రూజీ చదువుకోనివాడై వున్నట్లయితే ఇంకా మంచి రాజకీయవేత్తగా ప్రకాశించి వుండెడివాడే!

అందుచేత మన విద్యావిధానాన్ని దూషించుట అవివేకము. మన విద్యావిధానము పతనమై పోతున్నదని అఘోరించుట అనవసరము. మన విద్యావిధానము సరిగాలేదనీ, అది ఏ విధముగాను విద్యార్థులకు ఉపయోగపడుట లేదని, అ విద్యావిధానాన్ని సంస్కరించాలనీ, భాష మార్పువల్ల, విద్యాప్రణాళికల మార్పువల్ల విద్యావిధానాన్ని బాగుపరచ వచ్చునని మనలో నూతనముగా ప్రజ్వరిల్లిన అపోహాలు నిరాధారము. విద్యాభ్యాసము అసలు ఉపయోగమైతేకదా విద్యాభ్యాసవిధానము మంచిదా కాదా యనుప్రశ్న వచ్చునది. న్యాయశాస్త్రజ్ఞానము అన్యాయములు చేయించుతూ వుంటే ధర్మశాస్త్రజ్ఞానము దుర్మతంబులు ప్రచారము చేయించితే, జోతిష్యశాస్త్రజ్ఞానము జనులనీతులు తప్పించుచున్నప్పుడు కష్టపడి ఆశాస్త్రజ్ఞానము, ఈ శాస్త్రజ్ఞానము సముపార్జనకొరకు హడావిడి ప్రయత్నాలెందుకు. ప్రతిరోజూ దేశములో ఏదోఒకమూల ఒక విద్యాలయమునకో, కళాశాలకో కష్టపడి మంత్రులను తిప్పలుబెట్టి మంత్రతంత్రములతో శంఖుస్థాపనలు చేయించుట ఎందుకో, విదేశస్కాలరుషిప్పులకై అన్వేషణలెందుకో, విశ్వవిద్యాలయాల్లో పరిశోధన లెందుకో తెలియదు. దినదినము పుట్టకొక్కులవలే సృష్టింపబడుతున్న క్రొత్త క్రొత్త విద్యాప్రణాళిక లెందుకు క్రొత్త క్రొత్త కమిటీల నివేదిక లెందుకు, సరిక్రొత్త కమిషనుల సిఫార్సులెందుకు? వీటితో అనవసరముగా ధనము, శ్రమ, సమయము వ్యయము చేయుటకన్న ఏదైన యుపయుక్తమైన పనులకు వినియోగింప వచ్చునుకదా?

నేర్చిమరచిన లాభమేమో? కావున నేర్చినదెల్ల మరచుటకు క్రొత్తవిధానములు పరీక్షించుట కమిషన్లు, కమిటీలు ఏర్పరచిన బాగుండును. దీని యర్థమేమి తిరుమలేశా? ఇదంతా మనలోమన మాటే సుమండీ!

కె. లక్ష్మి ర.



# పల్లెపడుచు



చిత్రకారిణి : పి. శాంత.

" పచ్చన్ని సేలోకి పండుయెన్నెల్లోన
నీలిసీరాగట్టి నీటుగొస్తావుంటె
వొయ్యార మొలికించునాయెంకి !
వొనలచ్చి మనిపించునాయెంకి !"

# "గీర్వాణి"

కుమారి నిడదవోలు. మాలతి.

"నాకు నేత చీరెలు చూస్తే అసహ్యం. కట్టుకునే వాళ్ళు మరెలాగ కట్టుకుంటారోగాని." అంది గీర్వాణి ముహం వికారంగా పెట్టి.

ఈ మాటలు ఎవర్ని వుద్దేశింపబడ్డాయో అందరికీ తెలుసు. జానకి పుస్తకాలు పట్టుకుని అప్పుడే వస్తోంది. గీర్వాణి మాటలు వినీవిననట్టు ఓ నవ్వునవ్వేసి తలొంచు కొని ఓ మూల కుర్చీ దగ్గిరికి వెళ్ళిపోయింది.

ఆ నవ్వు సిగ్గుతో క్రుంగిపోతుందనుకున్న గీర్వాణిని వెక్కిరించింది.

"నామటుకు నాకు అవి కట్టుకుంటే జెర్రులు ప్రాకిన ట్టుంటుంది." అంది తనేమళ్ళీ.

"అసలు అది ముట్టుకుంటేనే నీ సుకుమార హస్తాలు కందిపోతాయేమో ?" అంది కామేశ్వరి. కామేశ్వరికి గీర్వాణంటే వళ్ళు మంట గీర్వాణికి జానికంటే కోపం.

కారణం ఒకమాటు తన మాట జానకి నిరసించడమే.

ఇంగ్లీషు లెక్చెరర్ లెసెన్సు బాగా చెప్పడం లేదు. ఫాలో కావడం చాలా కష్టంగా ఉంది. పరీక్షలపేరు ఎత్తితే భయం వేస్తోంది.

"పోనీ, ప్రిన్సుపాల్‌తో రిపోర్ట్ చేద్దాం. లెక్చెరర్‌ని మార్చమని." అంది గీర్వాణి అతి సుళువుగా తేల్చేస్తూ.

అదే కాలేజీలో చదువుతూ లెక్చెరర్‌మీద రిపోర్ట్ చెయ్యడం మాటలా ?

"అమ్మ బాబోయ్ !" అన్నారు ఒకళ్ళు.

"గుండెలు తీసినపని" అన్నారింకొకళ్ళు.

"ఓహో ! జోహార్లర్పించదగ్గ భారతవీర నారీ మణులు." అంది గీర్వాణి వేళాకోళంగా.

"అలా చెయ్యడం మర్యాదాకాదు, క్షేమమూకాదు." అంది జానకి మెల్లిగా.

దాంతో గీర్వాణి అహంభావం తలెత్తింది, "యోగక్షేమాలూ, పరువూ మర్యాదల సంగతి తరవాత. ముందు రాబోయే పరీక్షల విషయం ఆలోచించు." అంది వస్తున్న కోపాన్ని అణచిపెట్టి.

జానకి తొణక్కుండా జవాబిచ్చింది ; "అదే నా వుద్దేశమూనూ. ఎప్పటికైనా మనపై వాళ్ళు వాళ్ళు కాని, వాళ్ళపైవాళ్ళం మనం కాదు" అని. గీర్వాణి కోపం తారాపథాన్నంటింది.

జానకి కాదనడం వల్లనే రిపోర్టు చింపిపారెయ్యాలసి వచ్చింది. లేకపోతే మిగిలిన వాళ్ళని తనెలాగైనా వప్పించేది.

అప్పట్నుంచీ గీర్వాణి, జానకితో మాట్లాడడం మానేసింది. సాధ్యమైనంత వరకు జానకిని వెక్కిరించి, వేళాకోళంచేసి అవమానించి, ఏడిపించాలని ప్రయత్నించేది. అంతకన్న చేయగలిగేది ఏముంది కనక ? అందులోనూ వాళ్ళూ బ్రతికి చెడ్డవాళ్ళని వినికిడి.

"జానకి ఉందాండి ?" అన్నాను.

"ఉంది. లోపలకి రండి" అంది, జానకి చెల్లెలు కాబోలు. ఎక్కడో చూసిన మొహంలా ఉంది అనుకున్నా లోపలికి వెళ్తూ. నేను విన్నమాట నిజమేమోననిపించేట్టు ఇల్లు బ్రతికి చెడ్డ ఇల్లులాగే ఉంది. ఇంతలో జానకి వచ్చింది.

"ఏంచేస్తున్నావు?" అన్నాను సంభాషణ కలుపుతూ

"ఏంలేదు. ఏంవుంది చెయ్యడానికి ?" అంది నవ్వుతూ.

"మీ చెల్లెలా ?"

"ఊఁ. మా చెల్లెలే."

"ఎక్కడో చూసినట్టున్నాను. ఎక్కడో జ్ఞాపకం రావడంలేదు" అన్నా ఆమెవేపుచూస్తూ. ఆ అమ్మాయి నవ్వేసి ఊరుకుంది.

"Dance చేస్తున్నప్పుడో, పాటకచేరీ చేస్తున్నప్పుడో చూశావేమో !" అంది జానకి.

నాకు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది.

"మీ చెల్లెలని నాకిన్నాళ్ళూ తెలీనేతెలీదు. అయితే డాన్సు చేసే చంద్రకుమారి మీరేనన్నమాట !" అన్నాను జానకితో ఆశ్చర్యంగా.

"దాని సంపాదనమీదే ఆధారపడి ఉన్నామనేకదా గీర్వాణికి నేనంటే అంత చులకన. కాని దానికి కారణం ఎవరో ఆలోచించదు" అంది జానకి బాధగా.

"ఏమిటన్నావూ ?" అన్నాను తన మాట అర్థం చేసుకోలేక.

"ఆ గీర్వాణి గర్వం మాటే చెప్తున్నా. మానాన్నగారు మద్రాసులో ఉన్నప్పుడు ధనవంతులే, కొన్నాళ్ళకి అప్పు అంటూ ఋజువూ, పత్రమూ లేకుండా ఈ గీర్వాణి తండ్రి ఇంచుమించు నాన్నగారి ధనమంతా తీసుకున్నారు. నాన్నగారి దగ్గిర అయిపోగానే ఈ విశాల ప్రపంచంలోకి అదృశ్యమైపోయారు ఆ మహాత్ములు. మళ్ళీ ఇక్కడ అవతరించారు." అంది జానకి. కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. పాపం వాళ్ళ నాన్నగారు ఇప్పుడు మంచంమీద ఉన్నారట.

కాలచక్రంలో సంవత్సరాలు దొర్లాయి. హఠాత్తుగా ఓరోజు జానకీ, కామేశ్వరీ కనిపించారు, ముగ్గురం కలిసినందుకు చాలా సంతోషించాం. కబుర్లు చెప్పుకున్నాం. ఆఖరికి సినిమాకి వెళ్ళాం. న్యూస్‌రీల్ వేస్తూండగా ఒకమ్మాయి వచ్చి మా ముందు లైనులో కూర్చుంది. గుర్తుపట్టడానికి అట్టేసేపు పట్టలేదు.

"గీర్వాణి ! క్షేమమా ?" అని పలకరించాను.

"ఆఁ. నీదియవల్ల" అంది విసురుగా.

మేం మెల్లగా నవ్వుకున్నాం.

కామేశ్వరి "ముతక చీరెలు ఎలా కట్టుకుంటారో బాబూ !" అంది తను వినేటట్టుగా.

"ఎలా ఉంటుందో చూద్దామని సరదాకి కొన్నాను." అంది గీర్వాణి....సార్థక నామధేయురాలు చింత చచ్చినా చావని పులుపు.

"ఎన్నాళ్ళనుంచి ?" అని ప్రశ్నించింది మళ్ళీ కామేశ్వరి.

గీర్వాణి మాట్లాడలేదు.

ఎవరో ఎవరితోనో అంటున్నారు. "పాపం ఆ అమ్మాయి ఆస్తి ఈ మధ్య దావాల్లో గట్టిదెబ్బతింది. దురదృష్టం తన్నుకొచ్చి దొంగలు పడ్డారు. తండ్రి మంచమెక్కాడు........ 

# సంఘ జీవనము

శ్రీమతి డి. శారదాదేవి, బి.ఏ., బి.ఎల్.,

సంఘ సేవకులూ, రాజకీయ నాయకులూ మాట్లాడుతూ దేంటప్పుడు కొన్నిపదాలు తరుచు విన వస్తూంటాయి. సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా, నైతికంగా, దేశం అభ్యుదయం పొందాలనో, దేశాభివృద్ధికి సర్వతోన్ముఖ కృషి జరగాలి గాని ఏ ఒక్క రంగంలోనో కృషి చేస్తే లాభం లేదనో చెప్తుతూ ఉంటారు.

అసలు ఈ రంగాలు ఏమిటి ? ఎందు కేర్పడ్డాయి అని తర్కిస్తే అసలు రహస్యం బయటపడుతుంది. మానవుడు సంఘజీవి. నలుగుర్లో కలిసి బ్రదకవలసిందే తప్ప ఒంటరిగా జీవించలేడు. అయితే, అతనికి స్వార్థం కూడా అమితంగా ఉన్నది. మనకాయుష్యం, మనకారోగ్యం అనే మనస్తత్వం ప్రతిఒక్కరికీ తీయకుండా ఉంటుంది తరతమ భేదాలతో. అందరితో కలసి జీవించాలంటే ఈ మనస్తత్వాని కేలా సరిపడుతుందీ? సంఘంలో ఒక అణువు లాగా జీవించాలి. కొంతవరకు సుఖాల్ని త్యజించాలి. తనకేవిధంగా తన సౌఖ్యం, వ్యక్తిత్వం ముఖ్యమో, అలాగే తనతోపాటు జీవిస్తున్న వారందరికీ కూడా తమతమ వ్యక్తిత్వాలూ, సుఖాలూ ముఖ్యమని గ్రహించి వారినిమిత్తం తన స్వార్థాన్ని కొంత త్యాగంచేయాలి అ విధంగానే సంఘంలో జీవిస్తున్న వారందరూ త్యాగం చేయాలి. అప్పటికి గాని నలుగురితో పాటు నారాయణ అన్నట్లు జీవించటానికి వీలుపడదు.

అందుచేత వ్యక్తిగత స్వార్థానికీ, సంఘజీవనానికి మధ్య నిత్యమూ పరస్పర సంఘర్షణ జరుగుతుంది. ఈసంఘర్షణను సామరస్యంతో పరిష్కారం చేసి, ఒక క్రమం ఏర్పరచి కట్టుదిట్టాలు చేయడం అవసరమయింది. అన్నిటికన్నా మొట్ట మొదటిది ధనం. మానవునకు ధనం మీద, ఆస్థిమీద ఉన్న లోభం మరి దేనిమీద లేదు. ఆస్థిపాస్తులు, ధనం సంపాదించటానికి కట్టుబాట్లుపెట్టి, నియమబద్ధమైన వినియోగం చూపితే అసలు సమస్యను సాధించినట్లే, అందుకోసం ఆర్థికశాస్త్రిలూ ఆర్థికవేత్తలూ అవసరమయ్యారు. ప్రతి మానవుడికీ కావలసిన కనీసపు ఆహారాన్ని ఇతర ఆవస్యక వస్తువులూ లభించేటట్లు చేయడం మొదటి ఆశయం. అందరి లోకీ ధనికుడైన వానికీ, అందరిలోకీ పేదవాడైన వానికీ ఆస్థిలో ఉండే తారతమ్యం వీలైనంత తక్కువ చేయడం రెండో ఆశయం. ఈ తారతమ్యం ఎంత ఉండవచ్చును ఎంత ఉండకూడదు అన్న విషయాలపై అభిప్రాయాలలో భేదాలను బట్టి ధనికవాదంనుండి సమాజవాదం వరకూ అనేక రకాల వాదాలు బయలుదేరాయి.

ఉత్తమ మనుకున్న ఒక ఆర్థిక వ్యవస్థను ఏర్పరచటంలో సంఘజీవనం సఫలం కాదు. ఈ వ్యవస్థను సక్రమంగా నడిపించే భారం వహించడానికి ఒక వ్యక్తిగాని కొందరు వ్యక్తులు గాని ఉండాలి. ఆ వ్యవస్థకు తగిన నియమాల నేర్పరచి అమలు పరచటానికీ, ఆ నియమాల నుల్లంఘించితే శిక్షించటానికీ, అవసరమైన అధికారం కూడా ఆ వ్యక్తులకు ఉండాలి. సంఘంలో ఉండే ప్రజలంతా ఆ వ్యక్తుల అధికారానికి లోబడి ఉండాలి. అప్పటికి గాని సంఘం సరిగా నడవదు, అయితే ఈ మహాభారాన్ని మోసే ఆ వ్యక్తులెవరు ? ఆ అధికారాన్ని చలాయించే ఆ వ్యక్తులెవరు? వారు ఎక్కణ్ణుంచి వస్తారు ? వారూ సంఘములోని వారేనా? అయితే వారి నెలా గుర్తుపట్టడం? వారికీ అధికారం ఎవరు ఇవ్వాలి. ఎలాఇవ్వాలి? అనే అశేషమైన ప్రశ్నలుదయించాయి. సర్వశక్తిమంతుడూ, మానవాతీతుడూ, విష్ణ్వంశ సంభూతుడూ అయిన ఒకరాజు క్రింద ప్రజలంతా ఉండాలని కొందరూ, భగవదను గ్రహ పాత్రులైన కొందరు ఒక జాతిగా ఉద్భవిస్తారు — ఆజాతికి లోబడి ప్రజలంతా జీవించాలని మరి కొందరూ అంటే, ప్రజంతాసర్వశక్తిమంతులు — వారిని పరిపాలించు కొనే శక్తి వారికే ఉన్నదని ఇంకో కొందరు భావించారు. ఈ విధంగా ఇన్ని అభిప్రాయాల ననుసరించి సామ్రాజ్యం వాదంనుండి ప్రజారాజ్యం వరకు వాదాలు ఏర్పడ్డాయి. ఇదే రాజకీయశాస్త్ర మయింది.

ఇలాగ మానవుని సంఘ జీవితాన్ని సరిదిద్దడానికే ఆర్థికశాస్త్రం, రాజకీయశాస్త్రం ఏర్పడ్డాయి. అయితే ఈ శాస్త్రాలు సులభగ్రాహ్యం కావు. ప్రజాసామాన్యానికి అందుబాట్లో ఉండవు. నిపుణుల కర్థమయినట్లుగా సామాన్యుల

కర్థంకావు. చిటికీ మాటికీ నచ్చినప్పుడల్లా ఈ వ్యవస్థలను మార్చటం ఎవరితరం కాదు. కష్టమో నష్టమో ఏర్పరచు కొన్నాక కొన్నితరాలు గడిస్తే కాని వాటి ఫలితమే తెలియదు.

మరి అయితే సంఘజీవితానికి మానవుడు తోడ్పడగలిగేది యేమీ లేదా అనే సంశయం కల్గవొచ్చు. దానికి జవాబు ఏమిటంటే — చేయవలసిం దంతా సామాన్య మానవుడేనని. వ్యవస్థలనేవి ఏర్పరచు కోవడం ఒక ఎత్తూ, వానిని మనోవాక్కర్మలతో ఆచరించడం ఒక ఎత్తూనూ. చిత్తశుద్ధి లేకపోతే ఎన్ని నియమాలున్నా, ఎలాంటి రాజ్యమున్నా, ఎలాంటి రాజ్యాంగం ఉన్నా, అన్నీ బూడిదలో పోసిన పన్నీరే. ఆర్థిక శాస్త్రానికీ, రాజకీయ శాస్త్రానికీ సంబంధించని అనేక విషయాలు దైనందిన జీవితంలో కన్పిస్తాయి. అనేక సమస్యలను తీర్చవలసి వస్తుంది. సర్వమానవులకూ సమాన హక్కులూ, సమానావకాశాలూ ఉండటం, అందరూ సుఖశాంతులతో జీవించటం సంఘం లక్ష్యం. దానికి సంఘచైతన్యం అవసరం. సంఘమంటే సామాన్య ప్రజలే. వారిలోనే చైతన్యం రావాలి. ఒకరితో ఒకరు వ్యవహరించడానికి, గౌరవ మర్యాదలు నల్పుకోడానికి, ఏ కొద్దిమందికో అతి గౌరవమూ లేదా అతిదైన్యమూ కలగకుండా చూడడానికి సామాన్య ప్రజలు పూనుకోవాలి, ఎవరైన తప్పుచేస్తే ఖండించే ధైర్యం ప్రజలకుండాలి. ఎవరైన తమ ధన ప్రాబల్యాన్ని, పలుకుబడిని దుర్వినియోగం చేస్తే దాన్ని నివారించగల శక్తి ప్రజలకుండాలి. జాత్యహంకారంతో కులగర్వంతో ఎవరైన ఇతరులను కించపరిచితే, నీచంగా చూస్తే దానికి అడ్డుచెప్పగల సామర్థ్యము ప్రజలకుండాలి.

ఈ స్థాయినందు కున్నప్పుడే ప్రజలు సాంఘికంగా అభివృద్ధి చెందినట్లు. దానికే నిరంతర కృషి జరగాలి.

ఇలాంటి సంఘ చైతన్యం, కలగాలీ అంటే ప్రభుత్వ శాసనాల తోడ్పాటు కూడా అవసరం. సంఘ సంస్కారము, సంఘాభివృద్ధి జరగడానికి కేవలంసంఘ చైతన్యం గాని, కేవలం ప్రభుత్వశాసనాలు గాని చాలవు, రెండు ఒకదాని కొకటి సహాయ భూతంగా నడుస్తూ ఉండాలి. ప్రజలలో యేవిధమయిన అభిలాషలూ, అలజడులు బయలుదేరు తున్నాయో గమనించి, అందుకు తగిన శాసనము ప్రభుత్వము చేయాలి, సంస్కరణకు సంఘం సిద్ధపడేవరకు శాసనరీత్యా ఆ సంస్కరణకు ఎలాటి అభ్యంతరాలూ లేకుండా ఉండాలి. సహగమనాన్ని నిషేధింమతూ శాసనం వచ్చినప్పుడు అనేకులు ప్రతిఘటించారు. వితంతు వివాహాలను గూర్చి శాసనం వచ్చినప్పుడు దేశమంతా అల్లకల్లోలం చెలరేగింది. కాలక్రమేణా సంఘదృష్టి మారింది. సంస్కరణకు సంఘం సిద్ధపడింది. వితంతు వివాహాలను ఖండించేవారు అట్టేమంది లేరు. అయితే వితంతు వివాహాలను గూర్చిన శాసనమే లేకపోతే ఈ సంస్కరణాభిలాషకు అడ్డుకట్టపడేదే. సంస్కరణగాచేసిన వితంతువివాహాలన్ని న్యాయవిరుద్ధాలూ, చెల్లనివీ అయ్యేవి. అలాగే సగోత్ర, సవర్ణ వివాహాలకు శాసనా లున్నందున సంఘ సంస్కరణకు మార్గము సులువయింది. అస్పృశ్యతను తొలగించాలని ఎన్ని ఏండ్ల నుండియో మహాత్ముని ఆధ్వర్యం క్రింద కృషి జరిగితే, ఈ నాటికీ దీని కథ్యంతరం, చెప్పేవారున్నారు. అయితే అస్పృశ్యతను పాటించడం నేరంగా పరిగణించుతూ శాసనాలుండటం చేత, మన రాజ్యాంగంలో అస్పృశ్యతను పాటించరాదని సూత్రం ఉండటంచేత సంఘ సంస్కరణాభిలాషులకి మంచి ఆయుధం దొరికింది. ఈ ఉద్యమానికి వ్యతిరేకులు తమ అభిప్రాయాల్ని నిర్భయంగా వెలిబుచ్చడానికి సంకోచిస్తున్నారు. స్త్రీ పురుష వివక్షత చూపరాదని రాజ్యాంగంలో సూత్రం ఉన్నందున స్త్రీలకూ, జనాభ్యుదయ కాంక్షులకూ స్త్రీల సమానస్థాయిని గూర్చి అలజడిచేయడానికీ, హక్కు పూర్వకంగా సాధించి పొందడానికీ, అవకాశం కలుగుతోంది. ఈ విధంగా ప్రజల సాంఘికాభివృద్ధికి సాంఘికశాసనాలు కూడా అవసరం.

పూర్తిగా సంఘ చైతన్యం కలిగితే, సత్సాంప్రదాయాలతో, తన్నియమాలతో, పరిపూర్ణలక్షణాలు కలిగిన సంఘ మేర్పడి సుస్థిరంగా ఉంటే, ఆ సాంప్రదాయాలూ నియమాలూ ఆచారాలుగా మారుతాయి. భగవదాదేశాలుగా మారుతాయి. అవే ప్రజలకు నీతి దర్శకులౌతాయి. ప్రజలంతా వివేకవంతులై, నిర్మల మనస్కులై, తామేర్పరిచు కొన్న వ్యవస్థనీ, రాజ్యాన్నీ, సంఘనియమాలనీ, నిండుమనస్సుతో స్వీకరించితే నైతికశక్తి ఆవిర్భవిస్తుంది. ఆస్థితితో మంచి చెడుల తారతమ్యం, న్యాయాన్యాయ విచక్షణ న్యాయశాసనాల త్రాసులో పెట్టితూచ నవసరం లేకుండా, హృదయానికే గోచరం అవుతాయి. సంఘ జీవనంలో ఉత్కృష్టమయిన, ఉత్తమోత్తమ మయిన లక్ష్యం అదే. అది సాధించితే మానవుడూ, సంఘమూ తమగమ్యస్థానం చేరినట్లే.

# మహాబలిపురం ఎక్స్‌కర్షన్ అనుభవాలు

శ్రీమతి ఉ. సుందరీ శంకరం



ఆరోజు క్లాసులోకి వెళ్ళగానే పిల్లలందరు లేచి ఒకేసారి. "ఏమండీ! టీచరుగారూ! మీరు కూడా వస్తున్నా రాండీ?" అని అడిగారు. నాకు యేమని చెప్పడానికీ తోచ లేదు. సమాధానం చెప్పేంతవరకు వాళ్ళు నన్ను వదల్లేదు.

నెహ్రూగారి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని మా మహిళాసభ స్కూలు వాళ్ళు పిల్లల నందరినీ మహాబలిపురం ఎక్స్‌కర్షనుకి తీసుకువెళ్ళాలని నిశ్చయించారు. మర్నాడు ప్రొద్దున ఆరు గంటలకల్లా బయలుదేరి వెళ్ళాలి. ఇంట్లో చిన్న పిల్లతో సహా అందరినీ వదలి వెళ్ళాలనే ఆలోచనతో యేం చెప్పటానికి తోచక పిల్లలందరు నారాకకి వుత్సాహం చూపిస్తున్నందుకు, రానని చెప్పలేక, వద్దామనే అనుకుంటున్నానమ్మా!' అని మాత్రం అన్నాను. 'మీరుకూడా రావాలండీ!' అని గొడవ చేస్తే రానని అనలేకపోయాను. కాని మా యింట్లో పిల్లల్నందరినీ వదలి వెళ్ళాలని లేదు.

ప్రొద్దున్నే లేచేసరికి ఆరున్నరయింది. మా పెద్దమ్మాయి కాఫీకాచింది. ఆ చలిలోనే స్నానం చేసి బట్టలు వేసుకుని కాఫీ త్రాగి తొందరగా బయలుదేరి ఆంధ్రమహిళాసభకు వచ్చాను. నన్ను చూడగానే పిల్లలందరు చేతులెత్తి టీచర్ టీచర్ అని అందరూ నా చుట్టూ గుమిగూడారు. నేను అక్కడికి వెళ్ళేసరికి ఆరున్నరయింది. మిగతా టీచర్లు కూడా అప్పటికే వచ్చేశారు. నాకోసము ఎదురుచూస్తున్నారు. ఆరున్నర గంటలకే దూరంనుంచి వచ్చే పిల్లలు కూడా వచ్చేశారు. పిల్లలందరు ప్రయాణాన్ని గురించిన కబుర్లూ, దారిలో తమకు కావలసిన సామాగ్రిని గురించీ, చూడబోయే దృశ్యాలను ఫోటో తీయడానికి హేండ్ కెమేరాలు సర్దుకోవడము మొదలైన హడావుడిలో వున్నారు. నన్ను చూడగానే హెడ్మిస్ట్రెస్ గారు "దగ్గరగా వుండికూడా యింత ఆలస్యం చేశారేమండీ!" అని అంటూ — పదండి పిల్లల నందరినీ త్వరగా గొడవలేకుండా కూర్చోబెట్టండి" అని నాకు ఆపని అప్పగించారు. ఈ ప్రయాణానికి మా స్కూలువాళ్ళు రెండు స్పెషల్ బస్సులు కుదిర్చారు.

సీనియర్ మెట్రిక్ పిల్లలందరూ ఒక బస్సులోను మిగతా పిల్లలందరు మరొక బస్సులోనూ కూర్చున్నారు. పిల్లలూ టీచర్లు కలిసి మొత్తం తొంభైమంది వరకూ వున్నాము. మాకందరికీ మధ్యాహ్న భోజనం మాతోనే తయారు చేయించి తీసుకెళ్ళాం. పులిహోర, దధ్యోదనం, బంగాళ దుంపల కూర, కొబ్బరి పచ్చడి మొదలైన పదార్థాలు మా హాస్టలులో వుండే నాయరే తయారు చేశాడు. ఇవన్నీ కూడ భద్రంగా గంగాళాలతో బస్సు యెక్కించాం. పిల్లల్నందరినీ లెక్కపెట్టి టీచర్లందరూ బస్సు యెక్కబోతూ వుంటే మరో యిద్దరు పిల్లలు దూరంనుంచి మమ్మల్ని చూచి పరుగెత్తి రోజుకుంటూవచ్చి బస్సు ఎక్కారు. మాతో ఒక స్పెషల్ కారు కూడ బయలుదేరింది. అంతా సర్దుకుని బయలుదేరేసరికి యేడు గంటలయింది. బస్సులు రెండూ కదిలాయి బస్సులోని పిల్లలు అందరూ ఒకేసారి 'వందేమాతరం' అనే పాట ఏక కంఠంతో ప్రారంభించారు. ఈ కోలాహలానికి దారిని పోయే జనం అంతా ఒకేసారి నిలబడి మా బస్సులవైపుకి చూచి నవ్వుకుంటూ చరచర సాగిపోయారు. తేనాంపేట మీదుగా మా బస్సులు సాగిపోతున్నాయి.

# మహాబలిపురం ఎక్స్‌కర్షన్ అనుభవాలు

నేను, సుశీలగారు, సుగుణమణిగారు, హైమావతిగారు ఒకబస్సులోనే యెక్కాము రంగనాయకిగారు, అనూరాధ గారు సీనియర్ల బస్సులో యెక్కారు. పిల్లలందరూ అతి వుత్సాహంతో పాటలు పాడేస్తున్నారు. వారి వుత్సాహం కట్టలు తెగినట్లయింది. మేమున్న బస్సు ముందూ, వెనకాల రెండవ బస్సూ, స్పెషల్ కారూ వస్తున్నాయి. మా బస్సు ముందు పోతూవుండటంచేత వెనకబస్సు మా బస్సును దాటి పోకుండా తొందరగా పోనిమ్మని డ్రైవరును పిల్లలు తొందర చేస్తున్నారు. రెండు బస్సులకీ పోటీ పడింది. వెనుక బస్సులో వున్న పిల్లలందరు వీళ్ళని చూచి వాళ్ళకి కూడ పట్టుదల యెక్కువైంది. చెంగల్పటు వెళ్ళే వరకు పోటీకోసం కేకలువేసి డ్రైవరుకు వూపిరాడకుండా చేశారు. ఈ పోటీలతో రావటంచేత మా వెనక బస్సు వెనకపడింది. డ్రైవరతో ఆ బస్సు వచ్చేవరకూ ఆపమన్నాము. ససేమిరా వల్లకాదని పిల్లలు మారాం చేశారు. వాళ్ళని యెలాగో ఒప్పించి బస్సు ఆపించాము. బాటకి రెండువైపులా చింతచెట్లు—చెట్లనిండా కాయలు—ఈ పిల్లల దృష్టి ఆ కాయలమీదపడింది ఇంకేం- పోటీ మాట మఱచిపోయి ఆ చెట్లమీదికి యెగబడ్డారు. దారిన బోయే ఓ అమ్మాయిని అప్పటికప్పుడే స్నేహం చేసుకుని దాని చేత యిన్ని చింతకాయలు కోయించుకొని టీచర్లు వద్దంటున్నా తినటం ప్రారంభించారు

ఇంతట్లోకే దూరంనుంచి బస్సు చప్పుడు వినపడింది. చింతకాయలు తింటున్నవాళ్ళల్లా యెక్కడికాయలక్కడ పారేసి కెవ్వున కేకపెట్టి ఒక్క వురుకున బస్సులో పడ్డారు 'డ్రైవర్ డ్రైవర్.' అనిగోల ప్రారంభించారు. అన్నిటికంటె చిత్రమైనవిషయమేమిటంటే పిల్లలందరూ ఒక స్కూలుకి చెందినవారయినప్పటికి వారి పోటీ, వుత్సాహం చూచి డ్రైవరుతోసహా మేముకూడ చిన్న పిల్లలమై పోయాము. డ్రైవరు పరుగెత్తుకుంటూవచ్చి కార్లో పడ్డాడు. మేముకూడ ఒక గంతులో వచ్చి చేరాము. మా కారు శరవేగంతో పోతోంది. ఈసారి పిల్లల వుత్సాహం తారాపథాన్ని అందుకుంది. అందులో ఒక పిల్ల లేచి మిగతా పిల్లల్ని "మీకు హోంలైఫ్ యిష్టమా! స్కూలు లైఫ్ యిష్టమా?" అని యెలుగెత్తి అంటూవుంటే మిగతా పిల్లలు "స్కూలులైఫ్ స్కూలు లైఫ్" అని పెద్ద పెట్టున వుత్సాహంతో కేకలేస్తున్నారు. ఒక పిల్ల చరచరా నా దగ్గరకి వచ్చి హడావిడిగా "టీచర్! టీచర్! మీకుహోం లైఫా స్కూలులైఫా యిష్టం." అని అడిగింది. ఏం చెప్పడానికీ తోచక గుటకమ్రింగి ఒక నవ్వునవ్వేశాను. ఆ సమయంలో 'హోంలైఫ'ని యెవరైనా అనగలరా?

తేనాంపేట మొదలుకొని తాంబ్రం వరకూ రోడ్డుకు రెండు వైపులా పెద్ద పెద్ద బంగళాలు, ఏపుగా పెరిగిన వృక్షాలు, బాల సూర్యకిరణాలు అలముకొని ప్రకృతి అంతా నూతనోత్సాహంతో తొణికిసలాడుతున్న ఆ ఉషఃకాల ప్రయాణం నామనస్సుకి యెంతో వుత్సాహాన్నిచ్చింది.

పక్షితీర్థానికి చేరుకునే సరికి తొమ్మిదిన్నర గంటలైంది. మా రెండు బస్సులు పోటీలతో దేవాలయం దగ్గిర చెరో రోడ్డంటా వచ్చి యెదురెక్కలయినాయి. రెండో బస్సులో ట్రాన్సుపోర్టు ఇన్‌స్పెక్టరుకూడవున్నాడు. అతడు తనవుద్రేకాన్ని దాచిపెడుతూ వారి బస్సుకంటె ముందు పోనిచ్చినందుకు సతాయించటం ప్రారంభించాడు "మొర్రో నాకేం లితెయదు—పిల్లలు గోల చేశారు, అయినా రూల్సు తప్పి యిరవైమైళ్ళస్పీడు కంటె పోనీలేదు" అని మా కారు డ్రైవరు యిన్‌స్పెక్టరును సమాధానంచేస్తున్నాడు 'నువ్వేనా మహా ప్రజ్ఞావంతుడివి? తలుచుకుంటే మేము మాత్రం



# మహాబలిపురం ఎక్స్కర్షన్ అనుభవాలు

యెక్కువ స్పీడుగా నడపలేమా ?' అని యింకా యేమేమో సాధింపులు మొదలెట్టాడు. అప్పుడు టీచర్లు కలగజేసుకుని సమాధాన పఱచేటప్పటికి చాలొచ్చింది. ఈవిధంగా పిల్లల పోటీలు డ్రైవర్లు తగాదా పడేవరకూ వచ్చింది.

అంతా బయలుదేరి గుళ్ళోకి వెళ్ళాము. ఆ దేవుడిపేరు భక్తవత్సల స్వామి. అమ్మవారిపేరు త్రిపురసుందరి. గర్భగుడికి మూడు ప్రదక్షిణాలు చేసి, అమ్మవారిని, అయ్యవారిని దర్శించి గుళ్ళోంచి బయట పడ్డాం. మా బస్సులను కొండ దగ్గిర ఆపి కొండ యెక్కటానికి ప్రారంభించాము. కొందరు పూలు, పండ్లు, టెంకాయలు మొదలైనవి కొని చేత బట్టుకొన్నారు. ఆ కొండమీద కోతులు కూడ వున్నాయి. కోతుల్ని చూచి పిల్లలు పండ్లూ ఆవీ దాచేశారు. పాపం కోతుల బాధ లేకుండానే యెలాగో కొండ యెక్కేశాము. కాని 'బ్రహ్మచారీ శతమర్కటః' అన్నట్లు కొండమీద యింకొక కాలేజీ స్టూడెంట్సు కాబోలు ఒక మంద అయితే వచ్చిచేరారు. ఇంక వారి కోతిచేష్టల కేం లోటు? అసలే కోతి — కల్లు త్రాగితే వేరే చెప్పాలా? మా పిల్లలంతా రకరకాల దుస్తులతో అలంకరించుకొని వన్నె వన్నెల విసనకఱ్ఱలవలె సీతాకోక చిలుకల్లా తయారయారు. నాముట్టుకు నాకు పిల్లలంతా ఆ కొండమీద గుంపులు గుంపులుగా కూర్చునివుంటే వనదేవతల్లా కనపడ్డారు. పాపం ఆ కుఱ్ఱాళ్ళు వీళ్ళని చూచి వుత్సాహపడ్డారంటే ఆశ్చర్యమేమిటీ!

అందరం తలలు పైకెత్తి పక్షుల రాకకోసం యెదురు చూస్తున్నాం. ఆరోజు ఆదివారం అవటంచేత జనం చాలా మంది వచ్చారు. ప్రదేశమంతా కిటకిటలాడిపోతోంది. ఈ జనాన్నంతనీ తోసుకొంటూ పక్షులకి ప్రసాదం పెట్టే పూజారి వచ్చాడు. స్టూడెంట్సంతా కొండెక్కి కూర్చుని వాళ్ళ యిష్టమొచ్చినట్లు హేండు కెమేరాలతో ఫొటోలు తీసేస్తున్నారు. కొంతమంది చెల్లెక్కారు. మధ్యమధ్య యికిలింపులు సకిలింపులు చేస్తూ తమ ప్రతిభావిశేషాలు, చాకచక్యం, అక్కడవున్న ఆడపిల్లలు చూచేలాగ బడాయిగా ప్రదర్శన లిస్తున్నారు. వారి భావ ప్రకటనలకూ అభావ చేష్టలకు అంతులేదు. కొంచెం తమాయించి చూచేవారికి ఆ దృశ్యం మహదానందాన్ని కలుగ చేస్తుంది.

నియమ ప్రకారం పన్నెండు గంటలవేసరికి పక్షులు వచ్చాయి. జనం అంతా నిశ్శబ్దంగా చూస్తున్నారు. పూజారి పెట్టిన ప్రసాదం రెండు పక్షులు వచ్చి ముక్కులతో అందుకొని గగన మార్గంలోకి యెగిరిపోయినాయి. ఈ దృశ్యాన్ని చూచిన జనమంతా — దేవతా మహిమని కొందరూ — కాదు అలవాటు అని కొందరూ — పూర్వకాలం నుంచీ ఈ పక్షులే వచ్చి ప్రసాదం తింటున్నాయని మనకి నిదర్శన మేమిటని మరికొందరూ యెవరికి తోచినట్లువారు వ్యాఖ్యానించారు. అదియేమయినప్పటికి ప్రతి నిత్యం నియమితంగా పక్షులు వచ్చి ప్రసాదం తిని పోవటం మిక్కిలి యాశ్చర్యాన్ని కలిగింపక మానదు.

కొండనుంచి క్రిందకు దిగి సత్రం చేరుకునేటప్పటికి ఒంటిగంటయింది. భోజనాలు చేసి తిరిగి మహాబలిపురం వెళ్ళటానికి బస్సులు యెక్కాము. పక్షి తీర్థానికి మహాబలిపురానికి పది మైళ్ళు వుంటుంది. గంటలోపుగా చేరుకున్నాము.

అంతకుముందే పక్షితీర్థం కొండమీద కనబడిన స్టూడెంట్సు తిరిగి యిక్కడ ప్రత్యక్షమయారు. అయినప్పటికీ మా పిల్లలందరికి ముందే జాగ్రత్త పడవలసిన విధానాలు చెప్పి ఒక గైడును మాట్లాడుకొని శిల్పాలు చూడ్డానికి బయలుదేరాము. పెద్ద పెద్ద కొండలులాంటి బండలను లిచి మంటపములు, యేనుగులు, సింహాలు, పేలు చూచుకునే కోతులు మొదలైనవి, ఒకే రాతిలో శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమెత్తగా యింద్రుడు కురిపించే రాళ్ళ వర్షానికి పర్వతం క్రిందకు చేరిన ఆవుల మందలు, చంటి పిల్లలను చంకన యిరికించుకుని కొండక్రింద నక్కిన గోపికా స్త్రీలు మొదలైనవెన్నో అపురూపశిల్పాలను చూశాము. ఈ శిల్పాలకి కొంత దూరంలో పాండవుల రథాలున్నాయి. ఇవి ఒక్కొక్క బండను దొలిచి చేసినవి. ఇవన్నీ చూచి వచ్చేటప్పటికి అక్కడికి దగ్గరగా వున్న సత్రంలో మాతో వచ్చిన పనివాళ్ళు పాలుకాచి సిద్ధంగా వుంచారు. మేము వెళ్ళి కాఫీ కలిపి పిల్లలందరికీ పంచేశాము. సముద్రపు టొడ్డున సరదాగా తినటానికని కారపుబూంది, కాజాలు పట్టుకుని బీచికి వెళ్ళాం. మహాబలిపురంలో అన్నిటికన్న ముఖ్యంగా చూడవలసిన దృశ్యం యిదొక్కటే. సముద్రంలోకి చొచ్చుకొనివున్న గుడి, చుట్టూ నందులు చెక్కబడి

## మహాబలిపురం ఎక్స్‌కర్షన్ అనుభవాలు

యున్నాయి. గుడికి వెనకాల సముద్రం వుంది. గుడికి ఆనుకుని కొంత ప్రదేశం అర్ధచంద్రాకారంగా సముద్రానికి అంటిపెట్టుకుని గోడ కట్టబడివుంది. దీని మధ్యలో స్వచ్ఛమైన యిసుక. సముద్రపుటలలు కోలాహలంగా ఎగిరి వచ్చి గట్టును తోసేస్తున్నట్లున్నాయి అక్కడ కొంతసేపు విశ్రాంతి తీసుకుంటూ ఫలహారాలు పూర్తి చేశాము. మాతో కూడ వెన్నంటి వచ్చే వేటగాళ్ళు మాతోబాటే వాళ్ళూ చూడ్డానికి వచ్చారు పాపం ఎలాగయినా ఆడపిల్లలు గదా! ఏదోవిధంగా ఏడిపించి తమషా చూద్దామనుకున్నారు. కాని ఏమి లాభం లేకపోయింది. వారి శషభిషలు మా పిల్లల దగ్గిర పనికిరాలేదు సరికదా పైపెచ్చువారి వుత్సాహం సన్నగిల్లింది.

సూర్యాస్తమానం కావడంతోనే అక్కడనుంచి వెంటనే బయలుదేరి తిన్నగా పక్షితీర్ధంమీదుగా మద్రాసు రోడ్డు పుచ్చుకున్నాం. కొండమీద కోతులు బాధిస్తాయేమోనని మేము భయపడితే వాటి బాధ మాకు లేదుగాని, యీ శతవర్కటంగాళ్ళ బాధ మాత్రం తప్పలేదు! అలాకాదు వారి రాకవల్ల మాకు వుత్సాహాన్ని కలిగించిందనే నేనంటాను ★

# శ్రీ శారదా దేవి

శ్రీమతి ఎర్రమిల్లి సరోజిని దేవి బి.ఎల్.

అత్యున్నతమై, అతిలోక రమణీయమైన దివ్యవ్యక్తి శ్రీ శారదాదేవి. ఆమె చరిత్రమే పవిత్రము. జీవనము పవిత్రతరము, స్వరూపము పవిత్రతమము. ఆమహాదేవి యొక్క శతవార్షికోత్సవము ఊరూరను, వాడవాడలను, నేడత్యంత కోలాహలముగా జరుగుచున్నది. ఆమె యెంత దాచుకొన యత్నించినను ఆమె జీవితగాథ, జీవితాదర్శము, ఆరోజు కారోజు ప్రకాశమానమై, ప్రస్ఫుట మగుచున్నది. భగవన్మాతృత్వమును లోకమునకు చాటుట కవతరించిన దివ్యత్వమే శ్రీ శారదాదేవి.

ఆమె జీవిత విశేషములు చాల స్వల్పము. బెంగాలు నందలి బంకూరా జిల్లాలోగల జయరాంబాటి యను కుగ్రామ మామె జన్మస్థానము. దైవభక్తిపరాయణులును, సేవాతత్పరులు కడుపేదలు నగు శ్రీ శ్యామసుందరీదేవి, శ్రీరామచంద్ర బంధోపాధ్యాయులు ఆమె జననీ జనకులు. ప్రమాదీచ. మార్గశిర బహుళ పంచమి గురువారము (22-12-1853) న ఆమె జన్మించినది. ఆమె కైదవ ఏటనే వివాహమయ్యెను. పిచ్చివాడుగా పరిగణింప బడి, ఆపిచ్చి కుదుర్చుటకై 23 వ యేట వివాహ మొనర్చ బడిన శ్రీరామకృష్ణ పరమహంసయే ఆమె భర్త. ఆమె భర్త చెంతకేగు సరికి ఆయన సన్యాసి. అట్టి సన్యాసితో ఆమె 13 సంవత్సరములు, వారికిని వారితోనే యున్న తన అత్తగారికిని. సేవచేయుచు వారిని దర్శించుటకై ఏతెంచు భక్తులకు భోజనాదికములమర్చుచు ఆమె కాలము గడపెను. భర్త నిర్యాణానంతరము శ్రీ శారదాదేవి, భర్త గృహమగు కమార్పుకూరు నందును, పుట్టినిల్లగు జయరాంబటి యందును, కలకత్తాయందును, 34 సంవత్సరములు గడపెను. ఈ కాలమున తమ్ములకు తమ్ములబిడ్డలకు ఆమె యెంతో సేవచేసెను. వారికై వండుట, వార్చుట, అంట్లుతోముట, పురుళ్ళు పోయుట, మేన గోడళ్ళను సాకుట మొదలగుసామాన్య కార్యములనెన్నో ఆమె యొనర్చెను. వైధవ్య మనుభవించు ప్రతి సామాన్య స్త్రీ చేయుచున్న పనులేయివి. అట్టిచో శ్రీ శారదాదేవి యొక్క గొప్పతన మెచ్చట నున్నది? ఆమె నారీలోకమున కాదర్శ మెట్లగు చున్నది?

అనుకరించి, ఆచరించుటకు వీలుగానుండునదే ఆదర్శము అట్టి ఆదర్శమును ప్రకటించుటకే శ్రీరామకృష్ణుడు శ్రీ శారదాదేవిని చేపెట్టెను. స్త్రీ పురుషులిరువురు కలిసిన గాని పరిపూర్ణత్వము రాదు. శక్తి వినా పురుషత్వము రాణించదు. అందుచేతనే సామాన్య జీవిత దశల నుండి పరిపూర్ణత్వము వరకు శ్రీ శారదాదేవి జీవితము నందు ఎన్నె చిన్నెలను శ్రీరామ కృష్ణుడను దిద్దితీర్చి దిద్ది తానే ఆమె, ఆమెయే తాను, అనునట్లు అభిన్నత్వమును నెలకొల్పెను.

శ్రీశారదాదేవి షుమారు పదిసంవత్సరముల వయస్సున్నప్పుడు బెంగాలున గొప్పకాటకము సంభవించెను. దయాపరుడైన ఆమె తండ్రి గంజికాచి అన్నార్తులకు పోయుచుండెను. లేత వయస్కురాలగు యీ బాలిక తండ్రికి సాయముగా ఆకలిదార్తులకు గంజి వడ్డించెను. ఇది సామాన్య విషయమే. కాని దీనస్థితి యందున్న వారినిగాంచి నప్పుడే ఆమె మానసము పరివర్తన మొంద సాగెను. సేవించుటయే లక్షణమైన మాతృత్వమే తన జీవితాదర్శమని, ఆమె అప్పుడే నిర్ణయించుకొనెనేమో! ఆటపాటలందు గూడ 'తల్లి' పాత్రనో లేక తగవులు తీర్చు 'న్యాయవాది' పాత్రనో ఆమె దాల్చెడిది.

వివాహమైన తనకు బుద్ధి తెలిసిన తర్వాత, తన 14 వ యేట ఆమె భర్తను కమార్పుకూరులో కలసుకొని ఆయన చెంత మూడు మాసము లుండెను. ఆ సమయమందే తొలి పాఠముల నామె నేర్చుకొనెను. "ఆసమయమందు నా హృదయమున నొక అమృత భాండ మున్నట్లుండెడిది" అని ఆదివ్య దినములను గూర్చి ఆమె తరువాత చెప్పు చుండెడిది. దీపములకు వత్తివేయుటదగ్గరనుండి, ధ్యానం వరకు ఆమహానీయు డామె కెంతో శ్రద్ధగా బోధించెను.

ఈ నన్నివేశమైన మరినాల్గు సంవత్సరముల వరకు, ఆమె మరల భర్తను కలుసలేదు. తానునేర్చు కొనిన పాఠములను ఆచరణ రూపమున సాధించుటకే ఆమె కాలమునంతయు వినియోగించెను. యెల్లప్పుడు యేదో యొకపనిని చేయుచుండెడిదిగాని, ఊసుపోకకై పొరుగు పంచల దొక్కుచుండెడిది గాదు. కాని తన భర్త పిచ్చివాడైనాడని పలువురుచెప్పు కొనుచుండుటను విని ఆమె తత్తర పడసాగెను, అతనికై నిర్ణయింప బడిన, తన శరీరము, తనమనస్సు, సర్వస్వము అతనికే అర్పింప

వలయునుగాన యీరకుండి ప్రయోజనము లేదని నిశ్చయించు కొనెను.

ఆమె బుద్ధి నెరిగి ఆమె తండ్రి రామచంద్రబంధోపాధ్యాయుడామెను దక్షిణేశ్వరమునకు గొంపోయెను. సన్యాసియైన తన భర్త తనను స్వీకరించునో లేదో యని ఆసనుయమున ఆమెకు తోచలేదు. అదే విధముగా శ్రీరామకృష్ణుడును ఆమెనెంతో ఆదరముతో స్వాగతమిచ్చి తన గదియందే తన ప్రక్కయందే పరుండ బెట్టుకొనెను. "నన్ను ప్రపంచంలోని కీడ్వవచ్చితివా ?" అని ఆతడామెను ప్రశ్నించెను. "కాదు, మీసాధనకు సాయమొనర్చుటకే నేనేతెంచితిని?" అని ఆమె సమాధానించెను. ఇది నిజముగా అద్వితీయమైన అపూర్వదాంపత్యము. "ఆమె అట్టి పవిత్రశీలయే కానిచో నేను నిజముగా కామశబలితముగాని జీవితమును గడపి యుండెడి వాడనుగాను" అని ఆమహనీయుడు తర్వాత శిష్యులతో చెప్పచుండెడివాడు. ఇట్లు, రోజులుగాదు, నెలలు, సంవత్సరములు గూడ గడచినవి? కాని ఒక్కరియందు గూడ ఒక్కమారైనను కామవాంఛ పొడ సూప నైనను లేదు.

శ్రీరామకృష్ణుడీ దినములలో నొకనాటిరాత్రి ఆమెను పీఠముపై గూర్చుండబెట్టి షోడశోపచారములతో సాక్షాత్ భగవతిగా నారాధించి, ఆమెయందు దేవిని సాక్షాత్కరింప జేసుకొని తన సాధన సర్వస్వము నంతయు జపమాలతోసహా ఆమె పాదపద్మములకడ ధారపోసి ఆధ్యాత్మిక శిఖరములలో విహరించు తన పవిత్ర శిరము నామె చరణములపైనుంచి నమస్కరించెను. ఆ క్షణమునుండియే శ్రీ శారదాదేవియను బంగారము. పదియారపవన్నెదాల్చి సాక్షాత్ పరమేశ్వరిగనే ఆ మహనీయునకు గోచరించుటచే ఆమె నెన్నడును 'నీవు' అని పొరపాటుననైనను పిలిచి యుండలేదు. యెల్లప్పుడును 'మీరు' అనియే సంబోధించెను. "నే నెవరని మీరు భావించుచున్నార"ని యొకసారి ఆమె వారి చరణముల నొత్తుచు ప్రశ్నించిన ప్రశ్నకు "ఏదేవి ఆలయమున భగవతీ రూపమున అర్చింప బడుచున్నదో, ఏ ననుగన్న మాత, చంద్రామణీ రూపమున నహబత్తున నున్నదో, ఆ మాతయే యిప్పుడు నా పాదముల నొత్తుచున్నది. నిన్నాభగవతిగా నేను భావించుచున్నాను" అని ఆయన దొట్రుపాటు లేక సమాధానమిచ్చెను.

శ్రీ శారదాదేవియు రామకృష్ణుని "సర్వదేవదేవీ స్వరూపునిగా, సర్వమంత్రాత్ముని'' గానే భావించెను. ఆ మహనీయుడు నిర్వాణము చెందగా "అమ్మా నన్ను వీడి యెచటకేగితివి'' అని విలపించెను. అందుచే వారిరువురు ఒండొరులకు మాతా శిశువులు. వారు ఒకరినొకరు ప్రేమించుకొనినట్లు యే ప్రాకృత దంపతులును ప్రేమించుకొనలేదు శ్రీ రామకృష్ణునకు వ్యాధి తీవ్రము కాగా తన ప్రాణములయినను త్యజించుటకై ఆమె తారకేశ్వరాలయమున ప్రాయోపవేశము సంకల్పించెను. ఆమెకు గ్రహణిబాధ రాగా, అమె ఆరోగ్యమునకై క్షణక్షణమును పసిబాలునివలె ఆ మహనీయుడారాటపడెను. ఇట్టి అపూర్వ ప్రేమయే దంపతులయందున్నది ?

శ్రీ రామకృష్ణ నిర్యాణానంతరము శ్రీ శారదాదేవి దుస్సహబాధ ననుభవించి ప్రాణత్యాగమున కుద్యమించెను. అప్పుడు శ్రీ రామకృష్ణుడామెకు సాక్షాత్కరించి తాను "ఒక గదినుండి మరియొక గదికిమాత్రమే పోయి యుంటినని" ఆమెకు వ్యక్తపరచెను. మరల రెండు మూడు సార్లు తనచేతి కంకణముల విసర్జించి వైధవ్య చిహ్నముల బూన ప్రయత్నించినప్పుడు గూడ ఆతడిట్లే ఆమెను వారించెను. ఆ మహనీయుడామె కెల్లవేళల సాక్షాత్కరించుచు తోడునీడగా వ్యవహరించెను. తన నిర్యాణమునకు ముందే తన యుద్యమమున కామెను సాయమొనర్చవలసినదిగా ఆతడర్థించెను. ''ఆడుదానను నేనేమిచేయగలను''అని ఆమె సమాధానించగా "నీ చుట్టు నున్న జనులు అంధకారమున సంచరించు పురుగులవలె నున్నారు. వారిని నీవుద్ధరించవలెను'' అని ఆయన ఆదేశించెను. ఆ కార్య భారమును మోయుటకే తర్వాత 34 సంవత్సరములామె యీ ప్రాకృత తనువును ధరించెను. వేలకొలది ముముక్షువులకామె దారి చూపవలసియుండుటచేతనే ఆతడట్లు పల్కెను. తపోధ్యానములచే తేజో విలసితములైన అనేక దివ్యమంత్రములనెన్నో. ఉపదేశ విధానముతోగూడ నామెకొసంగెను.

ఓర్పు, పరిస్థితులకను గుణముగా ప్రవర్తించుట ప్రతిగ్రహము లేని యీవి. యివే మాతృ లక్షణములు. సామాన్యుల యెడ యివే తమ బిడ్డల విషయముననే వర్తించుచుండ, శ్రీ శారదాదేవియందు, జాతి, మత, కుల, వర్ణవిచక్షత నెరుగక సర్వప్రాణి కోటియందును ప్రస్ఫుటమయ్యెను. అందుచేతనే ఆమెయందు దివ్యత్వమేగాక మాతృత్వము గూడ ఏకత్వము దాల్చుటచే ఆమె మాతృ

దేవి యను సార్థకనామమును బడసినది. ఉప్పుగల్లు గూడలేక, ఆకులేకూరగా భుజించుచు పీలికలనే వస్త్రములుగా ధరించుచు, వస్త్రలేశమాత్రము గానరాని విధమున భర్తృ నిర్యాణానంతరముకా మూర్ఛకారు జీవితము, కాలుజాపి పరుండుటకుగూడవీలులేని చిన్న సహాబస్త్రక్రింది గదిలో, తన అత్తగారు, చూడవచ్చిన స్త్రీ భక్తులు, వంట పాత్రలు మొదలగునవన్నియుయుండగా తెల్లవారుఝామున 3 గంటలకే లేచి తన కాలకృత్యములను తీర్చుకొని గుడి యజమానుల కంట ఒక్కసారియైనను పడకుండ నున్న ఆమె దక్షిణేశ్వర జీవితము, "నీవు చనిపోయినచో నీ కాష్ఠమునకు నిప్పంటించెదను" అను సంతటి కఠోర పరుష వాక్యముల నాడుటయేగాక అనేక యాతనలను పెట్టుచున్న తన పిచ్చి మేనగోడలు రాధుతోను, అంతకన్న పిచ్చిదగు ఆమె తల్లి సురబాలతోను తాను యిరువది సంవత్సరములకు పైగా గడుప గలిగిన జీవితమును, ఆమె యోర్పును పరిస్థితుల కనుగుణముగా ప్రవర్తించుటను చెప్పకయే చాటుచున్నవి. పాపాత్ములందరు మ్రొక్కుచు తాకుచుండుటచే కాళ్ళు భగ్గు భగ్గున మండుచున్నను, శరీరము అనేక రుగ్మతలకు లోనైనను ప్రేమానందస్వామి మొదలగు శ్రీ రామకృష్ణ శిష్య వరేణ్యులు గూడ మ్రింగ జాలని విషమును మ్రింగుచు "మహా పాపులకు గూడ ఉపదేశమిచ్చుట ఆమె ప్రతి గ్రహములేని యీవిని చాటుచున్నది. తనను చూడవచ్చిన యొక స్త్రీ బిడ్డ తివాసీ పాడుచేయగా తనచేతులతో ఆమె శుద్ధిచేసెను. అనేక దుష్టగుణములుగల తురుష్కునకు తాను వడ్డించి యెంగిలాకు నెత్తివేసినది. తక్కువకులస్థురాలు కక్కినకక్కును తాను బాగుచేసినది. నీచ కులజుడు భక్తితో తెచ్చిన కూరను జాతివిచక్షతను పాటించక ఆప్యాయతతో ఆరగించినది. ఆమె హృదయ విశాలత నుదహరించుటకీ యుదాహరణలే చాలును.

తాను నాగరికత మెరుగని పల్లె గ్రామమున పుట్టినది. సామాన్యమైన కుమార్తెగా గృహకృత్యముల చేసినది. సంతకమైనను చేయజాలని విద్య నభ్యసించినది. పతి యొద్ద సేవచేసి పత్నీత్వమును సాధించినది. కాని యొక ఉద్యమమైనను నడుపలేదు. ఒక ఉపన్యాసమైనను యిచ్చి యుండలేదు, అట్లయినను, నవనాగరికులైన కలకత్తా యువతులకు గుణపాఠమును నేర్పినది. నివేదిత, దేవమాత మొదలగు పాశ్చాత్య యువతులకు బోధ జేసినది. దిగ్గంతులైన వివేకానంద, శారదానందాదులకు చేయూత నిచ్చి బిడ్డలవలె లాలించినది. పతితులను, అనాథలను, తుదకు పిల్లలను ఉడతలను గూడ సౌశీల్య గరిష్ఠులగు శిష్యరత్నములతో సమానముగా చూచినది. లోకపావనులగు భక్తులచే గూడ పూజలందినది. ఇట్టి మహిమాన్విత భగవన్మాతృస్వరూపము లోకమును ప్రసాదింపవచ్చిన శ్రీ శారదాదేవి సాక్షాత్ 'సరస్వతి అవతారము'గాక మరే మగును.

"చంద్రునిలోనైనను మచ్చగలదు గాని, నా బిడ్డ మకలంకమై వెలయుగాక!" అనునదే ఆమె మొనర్చిన ప్రార్థన. "పరుల నెప్పుడును ద్వేషింపకుము. సరిగవా నీ లోపములను గుర్తించుము. ఈ లోకమున నీ వస్తు మేమియులేదు. సర్వము నీది గావించుకొనుము." అనునదే ఆమె ప్రధానమైన యుపదేశము. దీని నాచరించి మె ఆధునిక మానవత్వము స్త్రీత్వమునందున్న శక్తిని గుర్తించి ఆరాధించ నేర్చుకొని లోక కళ్యాణమును సాధించవలసియున్నది. అందుకే శ్రీ మాతృదేవి అవతరించినది. "పవిత్రం చరిత్రం యస్యాః, పవిత్ర జీవనం తథా। పవిత్రతా స్వరూపిణ్యై తస్యై దేవ్యై నమో నమః."



# "సూరీ-సీతీ-వెంకీ"

శ్రీమతి
వేమరాజు సుభద్రాదేవి

"సూరీ, సీతీ, వెంకీ" అని చిట్టి పిల్లల ముద్దు పేళ్లతో చిట్టిపిల్లల చిత్త ప్రవృత్తులు కనిపెట్టి చిట్టిపిల్లల చిలిపి చేష్టలు, ఆటలు, పాటలు, మాటలు కూర్చి చిన్న చిన్న కథలుగా వ్రాశారు చింతా దీక్షితులుగారు. ఈ సూరీ, సీతీ, వెంకీ ముగ్గురూ అక్కచెల్లెళ్ళు, సూరికిఎనిమిది, సీతికి ఆరు, వెంకికి మూడు ఏళ్ళుండవచ్చు. వీళ్ళ నాన్న రామమూర్తి, వీళ్ళ అమ్మా, వీళ్ళ అన్నా వీళ్ళకు కొబ్బరి ఆకులు కోసిచ్చిన అబ్బి, ఒక భట్రాజు వీళ్ళ ముచ్చట్లలో ప్రవేశిస్తూ ఉంటారు. ఈ ముచ్చట్లు చదువుతూ ఉంటే నా చిన్నప్పటి ముచ్చట్లుకూడా జ్ఞప్తికి వస్తూఉంటాయి. వీళ్ళలాగే నా అక్కచెల్లెళ్ళతో గుజ్జెనగూళ్లూ, బొమ్మరిళ్లూ, బొమ్మలపెళ్ళిళ్ళు మొదలయిన ఆటలాడాను. పాటలు పాడాను. తాటాకు బొమ్మలుచేయడం, ఆ బొమ్మలికి పాత్తిళ్ళు కట్టడం, కొబ్బరాకుల బూరాలూదడం, మా అమ్మకు పని సాయంచేయబోయి పాడుపనులు చేయడం, ఇళ్ళలకడం, ముగ్గులుపెట్టబోయి ముగ్గంతా నేలను పారబోయడం, అమ్మ కొట్టిందనో అక్క తిట్టిందనో, అన్న నాకు బూరాచేసిపెట్టాడు కాదనో నాన్నదగ్గరకేడుస్తూ పోవడం—ఈ పనులన్నీ సూరీ, సీతీ, వెంకీ లాగే చేస్తూ ఉండేవాళ్ళం గనుక, ఈ ముచ్చట్లు చదువుతూ మధ్య మధ్య ఆగిపోయి నా చిన్నప్పటి చిలిపిచేష్టలు జ్ఞప్తికివచ్చి అవి తలపోసుకొంటూ అరగంటలో చదవవలసిన ఈ ముచ్చట్లు ఒక గంటకుగాని పూర్తిచేయలేకపోయాను. అంత చక్కగాను సహజంగాను చమత్కారంగాను రచించారు దీక్షితులుగారు.

ఈ ముచ్చట్లు ముఖ్యమైనవి నాలుగు:—గుజ్జన గూళ్ళు బొమ్మరిల్లు, పాడుపుకథలు, భట్రాజు, అన్నిటనూ ఈసూరీ, సీతీ, వెంకి అనే పిల్లలు ముగ్గురిలోను ఎవరి స్వభావం ఏలాగుంటుందో ఈడుకు తగ్గట్టుగా నిరూపించారు. సూరి పెద్దపిల్ల గనుక ఇంటిపనులలో అమ్మకు సాయంచేస్తుంది. చెంబులకు చింతపండు గుజ్జు పట్టిస్తోంది. సీతికూడా వెంకికంటె కాస్త పెద్దది గనుక దక్షతవహించి "వెంకీ నీజడవిప్పేసి మళ్ళీ వేసిపెట్టనా?" అంది.

"అమ్మ కొత్తుతుంది" అంది వెంకి.

"కొట్టినులే ఇలారా, నేను ఎంచక్కా బాగా జడేసి పెట్టుతాను. ఏం!" అంటూ వెంకి చెయ్యి పట్టి కొం దస్తీసా లాగింది.

"నాకు జడెయ్యొద్దు" అని ఏడవబోయింది వెంకి.

"ఇంతట్లోనే ఏడవాలిటే అమ్మా! మాట్లాడితే నెత్తిమీదికొస్తుంది నీళ్ళకుండ" అంది సీతి.

కాస్సేపుండి వెంకిని పిలిచింది. "వెంకీ, వెంకీ- నువ్వెం అమ్మదగ్గరకు వెళ్ళి కందిపప్పు అడుగు. గుజ్జెన గూళ్ళు వండుకుందాం" అంటుంది.

వెంకి గబగబా వాళ్ళమ్మదగ్గరకు వెళ్ళి మూలగడం మొదలుపెట్టుతుంది. "ఎందుకే మూలుగుతావు" అని వాళ్ళమ్మ అంటే "నాక్కందిపప్పెత్తవూ" అని మళ్ళీ మూలుగుతుంది. మద్యాహ్నం పెడతానమ్మా" అంటే "ఇప్పుడే పెత్తవూ, నాకిప్పుడేపెత్తవూ" అని మారాం పెట్టుతుంది.

ఆఖరుకు సూరి సాయంతో వెంకి కందిపప్పును సాధించి సీతిదగ్గరకు వస్తుంది. అదిచూచి సీతి వాళ్ళ అమ్మదగ్గరకు పరుగెత్తుకువెళ్ళి "అమ్మా, అమ్మా నాకు బెల్లముక్కెట్టవూ" అని మారంచేస్తుంది. "సూరికీ, వెంకికీ కందిపప్పెట్టావుకదూ" అని దండోరా చేస్తుంది. వాళ్ళమ్మ. పెట్టనంటే వాళ్ళ నాన్నదగ్గరకు ఏడుస్తూవెళ్ళి ఫిర్యాదు చేస్తుంది. "వెంకికి కందిపప్పెట్టింది కాద్దు." అని మారం చేస్తుంది. "ఒసేవ్ దీనికి కొంచెం బెల్లం ముక్కెట్టూ" అంటూ సిఫారసుచేస్తాడు. అలాంటప్పుడు ఏ తల్లి పెట్టకుండా ఊరుకోగలదు!

ఆఖరికి వీళ్లు ముగ్గురూ కలసి గుజ్జెన గూళ్లు ఆడడం మొదలు పెట్టారు. కందిపప్పంతా కలబోసుకొని గుజ్జెన గూళ్లు లక్కపిడతలలో వండారు. బాదం ఆకులు తెచ్చి ఇది అన్నయ్యకి, ఇది వెంకికి, ఇది సీతికి, ఇది సూరికి, ఇది బొమ్మకీ అంటూ అందరికీ పేరు పేరు వరసన విస్తళ్లు వేసుకుంటారు. అందరూ అన్నివిస్తళ్ల దగ్గర కూర్చుంటారు. అన్నయ్య విస్తరి అన్నయ్య కోసం ఖాళీగా వుంచేశారు.

కూర్చోబోయే ముందు "అక్కలికర్రా, మొక్కలపీటా. కూచో వదినా కూచో" అంటూ రెండేసిసార్లు పాడుకుంటూరు. ఎవళ్లకి వాళ్లు అనేసిన తరువాత బొమ్మ విస్తరిలోది ఎవళ్లు తినాలని గొందాడుతుండగా అన్నయ్య వచ్చి, వాళ్ళు చెప్పేదివింటున్నట్లు నటించి తనవిస్తట్లో కందిపప్పు, బొమ్మ విస్తట్లో కందిపప్పు ఒక్కమాటు నోట్లో పోసేసుకు పారిపోతాడు నవ్వుతూ. సీతికి ఉడుకుమోత్తనం వచ్చింది. సూరికూడా కోపం వచ్చింది. ఇద్దరూ కలిసి వాళ్లన్నయ్యని "నారాయణ, నారాయణ నక్కతోక, కూర్చునిలేస్తే కుక్కతోక" అని ఉడికిస్తారు. వెంకిచిన్నపిల్ల. మాటలు సరిగ్గారావు. అందుకని ప్రతిపనిలోను పెద్దవాళ్లిద్దరు ఏమంటే చివరిముక్క తనూ అంటుంది. ఇప్పుడు "నారాయణ నారయణ, నక్కతోక కూతుని లేత్తే కుక్కతోక" అంటుంది.

ఇలాంటి అన్నయ్య, ఇలాంటి పిల్లలు లేనికొంప తెలుగు దేశంలో ఒక్కటైనా వుంటుందా?

ఇందులో అన్నయ్యకి చెల్లెళ్ళు సరదాగా ఏదైనా చేస్తుంటే వాళ్లని ఏదోవిధంగా ఏడిపించడం మహాసరదా. ఇందాక కందిపప్పు కాస్తా అలా మాయం చేశాడా, ఇంకోసారి పిల్లలు ముగ్గురూ సరదాగా పొడుపు కథలు చెప్పుకుంటూంటే, వెంట వెంటనే జవాబులు తనే చెప్పేసి వాళ్లకి కోపం తెప్పిస్తాడు. అన్నయ్య ఏదో పొడుపు కథకి వెంటనే జవాబు చెప్పేస్తాడు. "పోనీ అమ్మా మరి, ఊరుకోరా అన్నయ్యా" అంది సూరి.

"ఈమాటు చెబితే ఒట్టు" అంది సీతి.

"ఒత్తు" అంది వెంకి.

"ఈమాటు నేపొడుస్తానే సీతీ, పిల్లపుట్టుక తల్లిచావు" ఏమిటో చెప్పుకో, అంది సూరి. సీతచెప్పకముందే వాళ్లన్నయ్య "అరటి చెట్టు" అని చెప్పాడు.

"నే ఒట్టేశానులే" అంది సీత.

"ఒట్టుతీసి గట్టున పెట్టానులే" అన్నాడు వాళ్ళన్నయ్య. "పోనీలేరా అన్నయ్యా, పోనీలే సీతీ మనం పొడుపు కథలు పొడుచుకోవద్దు ఇంక ..." అంది సూరి.

ఈపిల్లలు ముగ్గురికీ ఆటలలో ఎప్పుడేనా మాటలు కలవక కాస్తాకీచులాడుకున్నా మళ్లీ మరుక్షణంలోనే అంతా మరిచిపోయి ఒక్కటైపోతారు. కథలు చెప్పుకొని, నిద్రపోతారు. వెంకిని ఎత్తుకొని వాళ్లమ్మ తనదగ్గరపడుకోబెట్టడానికి తీసుకు వెళ్ళుతుంది. సూరి, సీతా, కౌగలించుకొని ఒకరిమీద ఒకళ్ళు చేతులూ, కాళ్లూవేసుకుని కథలు తలుచుకుంటూ నిద్రపోతారు!

ఇంకోరోజు సంగతి. సూరికీ, సీతికీ, వెంకికీ అవాళే వాళ్లమ్మ తలంటి నీళ్లోసి, కాటికా బొట్టూ పెట్టి, చాకలి తెచ్చిన పరికిణీలు కట్టి 'అల్లరిచెయ్యకుండా నడవలో ఆడుకోండి' అని పంపించింది. అప్పుడు "సూరీ, సూరీ, నాకో తాటాకు బొమ్మ చేసిపెట్టవూ" అంటుంది సీతి. "నాకో" అంది వెంకి. "తాటాకులెక్కడ ఉన్నాయి చెప్మా ఇప్పుడు బొమ్మలు చెయ్యడానికి" అంది సూరి. "నేను తాటాకులు తెచ్చుకోనా" అంది సీతి. "తెచ్చుకో" అంది సూరి "నాకో" అంది వెంకి. "అక్కయ్య తాటాకులతో నీకూ చేసిపెడతాలే అమ్మా" అందిసూరి. "నాతాటాకు లివ్వను" అంది సీతి. "ఇంకోరెండు తేవే పాపం వెంకికూడా చేసిపెడదాము" అంది సూరి. "తాటాకు లెక్కడ ఉన్నాయమ్మా" ఇంకాను అందిసీతి. "పోనీ నీకు బూరాలు చేసిపెడతాను లేవే" అందిసూరి వెంకిని సముదాయిస్తూ.

ఇందులో చిట్టిచెల్లాయిపై అక్కకు ఉండే ప్రేమ, తనకంటె చిన్నదానిపై అధికారం చెలాయించడానికి చేసే ప్రయత్నమూ ఎంతబాగా కనబడతాయో చూడండి.

తాటాకు బొమ్మలు కట్టుకున్నారు. బూరాలు చేసుకున్నారు, తాటాకు బొమ్మలకి కాటికా బొట్టు పెట్టారు. పాతగుడ్డ పేలిక పమిటవేసి కట్టారు.

"మనం బొమ్మరిల్లు కట్టుకుందాం. కట్టుకున్నాక గుజ్జన గూళ్లొండుకొందాం" అందిసీతి.

"అమ్మ కోప్పడుతుందే సీతీ" అందిసూరి. అమ్మచూడకుండా ఇక్కడ కట్టుకుందాం" అందిసీతి.

"అమ్మతో చెప్తాను" అందివెంకి. నీకు అరటి పండిస్తానులే అమ్మతో చెప్పకు అందిసీతి.

"ఊఁ" అంది వెంకి. ముగ్గురూ ఎలాగైతేనేమి బొమ్మరిల్లు కట్టుకుంటారు. దానికి వెంకి ఓమూలా, సీతి ఓమూలా, సూరి ఓమూలా గోడలూ ఇల్లూ అలికివేశారు. అందరి చేతులూ మన్ను అయ్యాయి. ముగ్గుపెట్టాలనుకున్నారు. కాని ముగ్గుతెస్తే అమ్మ కొడుతుందేమోనని భయం. అందుచేత గోళ్ళతో మన్నుమీద ముగ్గులాగా గీతలుగీశారు. మాటలో

మాటగా గోళ్ళ అందాన్ని గురించి పెద్దపిల్లలిద్దరూ ఒకళ్లనొకళ్ళు ఆక్షేపించుకుంటూరు.

అప్పుడు సీతి ఏపాపం ఎరగని వెంకి గోళ్ళని కూడా ఆక్షేపిస్తుంది. "మంచిపిల్లవే ఊరుకుంటావా, ఒక్క దెబ్బ వెయ్యనా? పాపం వెంకి నెందుకంటావు" అంది సూరి. సీతి ఊరుకుంది. సూరికి తన చిట్టిచెల్లాయి మీద ఎంత అపేక్ష!

ముగ్గులు పెట్టాక మన్ను చేతులతో దులిపివేసుకుంటారు. బొమ్మలకి నైవేద్యం పెట్టి అరటిపళ్లూ, వెలగపళ్లూ ఆమట్టి చేతులతోనే తినేస్తారు. తరువాత సూరీ, సీతీకలిసి బొమ్మరిల్లు పాట పాడతారు. ఒకళ్ళనొకళ్ళు ఉడికించుకుంటూరు. వెంకి కూడా "ప్రత్తమన్ను తెత్తీ, బొమ్మరిల్లు కత్తీ, సూరి తలకీ నూనెలేదు. సీతితలకీ చమురూలేదు." అంటూ వెంకి చివరముక్కలు పట్టుకు పాడుతుంది. సూరి సీతీ దానిని విని ఇందాకటి ఉడుకుమోత్తనం మరచిపోయి నవ్వేస్తారు. ఎంతసహజంగా ఉంది ఈసంఘటన!

ఆ తరువాత వాళ్ళు బొమ్మల పెళ్లిళ్లు ఆడుకుంటారు. సూరి ఆడపెళ్లివారు, సీతి, వెంకి మగపెళ్లివారు చక్కగా 'చిన చిన దొంతుల్ చిటారి దొంతుల్, లక్క మేడల్, చిన్ని మేంపిల్లనిస్తామే, దాయీ మేం పిల్లనిస్తామే' అంటూ హాయిగా పాట పాడుకుంటారు. ఇంతట్లోకి వాళ్ల అమ్మ వచ్చి చూస్తుంది. "పొద్దున్నే నా తలంటి నీళ్లోస్తా. చెబతా వుండండి మీపని" అని కోప్పడుతుంది. వాళ్ళనాన్న కూడా వచ్చి చూచారు. సీతి ఏమీ అనకుండానే ఏడ్చింది. సూరిబిక్క మొగం వేసింది, వెంకి వాళ్లనాన్న కాళ్లు కాగలించుకొని "నాన్న నన్నెత్తుకో ర్రా" అంది. వాళ్లనాన్న వెంకని ఎత్తుకున్నాడు. ఇక్కడ ఒక్కసారిగా మట్టి అంటే పిల్లలకు ఉండే ఇష్టం, పసితొందరలో వాళ్ళ అమ్మచిరాకూ, వాళ్ళనాన్న అపేక్ష అన్నీ ఒక్కదమ్మున కనబడుతున్నయి కదూ!!

ఇంకోరోజు పొద్దున్నే కడుపునిండా బువ్వతిని వాళ్ళు ఒళ్ళో పాతాల గొడవలు చెప్పుకుంటున్నారు. అంతలో ఒక భట్రాజు వాళ్ళ ఇంటికి వస్తాడు. సూరి, సీతి, వెంకి వాణ్ణి పద్యాలు చదవమంటారు. వాడు ఏమీ అర్థం కాని చాటువులు ఏకరువు పెట్టేసరికి ఆవినచ్చక పాటలు పాడమంటారు. పాటలు రావంటే మాసెర్లమీద పద్యాలు చదవమంటారు. ఆశుకవిత్వంలో నిధి అయిన ఆభట్రాజు సీతి, వెంకి, సూరి పేర్లుకూర్చి పద్యం అల్లి చదివితే ముఖం చిట్లించుకున్న ఈపిల్లలు సంతోషంతో కిలకిల మంటారు. సూరి సోలతో బియ్యము తెచ్చి భట్రాజు వళ్ళోపోసింది, 'నేనూ పెడతా'నని సీతికూడా సోలెడు భట్రాజు వళ్ళోపోసింది. 'నేనూ పెత్తా' అని రెండు గుప్పిళ్ళతోటీ బియ్యం వళ్ళోపోసింది. "అయిదోతనం కలిగి, ఐశ్వర్యం కలిగి, ఆరోగ్యం కలిగి అమ్మాయిగార్లు నూరేళ్ళు వర్థిల్లండి" అని ఆశీర్వదించి భట్రాజు వెళ్ళిపోతాడు. చెప్పాలంటే ఇంకా చాలావున్నాయి వీళ్ల ముగ్గురిముచ్చట్లూను.

ఈవిధంగా మన తెలుగు పిల్లల మనస్తత్వాన్ని చిత్రించిన చింతా దీక్షితులుగారి రచన తెలుగుజాతి ఉన్నంతకాలం పిల్లలకూ వాళ్లతోపాటు పెద్దలకూ, ముఖ్యంగా చదువు నేర్చిన తెలుగు తల్లులకూ, ఆనందాన్ని కలిగిస్తూనే వుంటుంది.

# హాస్యానందం

## గర్వించిన మీసం

"రవిశ్రీ"

పొందూరులో యున్నాడొక
పోతుకూరి వస్తాదు
పొడవుగా నాజుగ్గాను
కండలు తిరిగిన మనిషి
వచ్చుచుండె వీధిప్రక్క
బొద్దులాంటి తనమీసం
కుడిచేత్తో మెలిపెడుతూ.

*      *      *

వీధిచివర యున్నదొక
చిల్లరవర్తక షాపు
వెంకటసత్తయ దాని
మేనేజరై యుండగ
నడచిరాక వస్తాదు
యీకొట్టుకే వచ్చాడు
వస్తాదునుచూచి, మన
వెంకటసత్తయ వెంటనె
అలవాటు ప్రకారమూ
తనమీసము కుడిచేత్తో
మెలిపెట్టడము చూచి
వస్తాదు కోపించి
యిట్టులనియె సత్తయతో.
"ఓరి కోమటోడ నీవు
నాపైకా వచ్చేది
యిదిగోచూడు నాదెబ్బ"
అనుచుండగ నాకోమటి
వస్తాదున కిట్లనియెన్,
"చాలుచాలు నీమాటలు
యిప్పుడు కాదాపండెం
రేపీవేళకి మనం
సంసారం గింసారం
అన్నీ తెగ తెంపేసి
చక్కావద్దాము కాని
యిప్పుడు కాదోయి భాయ్.

*      *      *

అనగానే వస్తాదు
కోమటోడు చెప్పినట్లు
తనయింటికి వెళ్లిపోయి
మరుసటిదిన మావేళకి
రెడీగాను వచ్చాడు
సత్తయ్యను చంపేందుకు.
ఈలోగా సత్తయ్యా
ఏంచేసాడో తెలుసా !
మంగళాన్ని పిలిపించి
తనమీసం తీయించి
యధాప్రకారము తన
స్థానములో కూర్చుండె
గబగబవచ్చిన వస్తాద్
ఎదురుగుండ యున్నయా

సత్తెయ్యాప చూచి
యుద్ధమునకు రమ్మనిమె.

*    *    *

వెంకట సత్తయ వెంటనే
వస్తామన కెట్లనిమెన్.
"బాబూ వస్తాము గారు
మీతోనా యుద్ధానికి
నేనేనా వచ్చేది" అని
యనగానే వస్తాదు
వెళ్ళిపోయెనెటకొ గాని
తెలియదు నెవరికిని.
గర్వించిన మీసానికి
తగిన పనయిందని
వెంకట సత్తయసెట్టి
సంతసమున అనగలిగెన్.



# సూర్యప్రభా దేవి

• శ్రీమతి దమ్మలపాటి సీతారత్నం •

కొన్ని వందల సంవత్సరముల క్రింద చంద్రగిరి నగరమును శాంతిమూర్తి యను రాజు రాజ్య పరిపాలన చేయుచుండెను. రాణియగు సుభాషిణీ దేవికి చాలా కాలమువరకు సంతానము లేకపోయెను. కొన్ని రోజులకు వరప్రసాదమున శాంతమూర్తికిని, సుభాషిణీ దేవికిని ఒక బాలిక పుట్టెను. ఆమె దినదిన ప్రవర్ధమానయై పదహారుకళల చంద్రుని వలె వెలుగొంద సాగెను. ఆమెను చూచి ప్రజలు ఆనందింప సాగిరి. ఆమెకు రాజగు శాంతమూర్తి సూర్యప్రభ యను పేరు పెట్టెను. ఆమె ప్రతి రోజూ తన చెలికత్తెలతో ఒక అడవి సమీపమునకు వెళ్ళి అచ్చట ఆడు కొనుచుండెను. ఇట్లు కొన్ని రోజులు జరిగిన పిమ్మట ఆమెకు పది సంవత్సరములు దాటినవి. తండ్రి యగు శాంతమూర్తి అడవికి వెళ్లి ఆడుటకు సమ్మతించలేదు. తనయుద్యానవనములయందే ఆడుకొనమని చెప్పెను. కాని సూర్యప్రభ తన తండ్రి మాటను వినక రోజూ వెళ్ళు స్థలమునకు వెళ్ళెను. అడవి వెయ్యి కోసెల దూరము వ్యాపించియున్నది. దానిలో ఒక భయంకర రాక్షసుడు నివాస మేర్పరచు కొనెను. కొన్ని రోజులు జరిగిన పిమ్మట ఆభయంకరుడు ఒక చక్కని రాజకుమారి రూపమును ధరించి అడవి బయటకు వచ్చెను. ఇంతలో సూర్యప్రభ చెలికత్తెలతో అచ్చట ఆడుకొనుచుండెను. వారిలో ఉన్న సూర్యప్రభను చూచి రాక్షసుడు చాలా సంతోషించి తనుకూడ వారి దగ్గరకు వచ్చి "నేను కూడ మీతో ఆడుకొందును కాబట్టి నేను. ఈ రాజకుమారి కలసి మిమ్ములను వెదికెదము మీరు దాకొను"డని చెప్పెను. వెంటనే చెలికత్తెలు దాకొనిరి. ఇంతలో రాక్షసుడు సూర్యప్రభను తన మాయ భవనమునకు తీసుకొని పోయి అచ్చట తన నిజస్వరూపము దాల్చెను. ఇది చూచి సూర్యప్రభ భయపడెను. రాక్షసుడు దగ్గరకు వచ్చి సూరప్రభను బుజ్జగించి "నీపేరు ఏమి?" అని అడగ నారంభించెను. అప్పుడు సూర్యప్రభ తన పేరు చెప్పెను.

ఇంతలో చెలికత్తెలు బయటికి వచ్చు సరికి సాయంత్రమవ సాగెను. సూర్యప్రభ కనుపించుట లేదని వారు ఇండ్లకు వెళ్ళి రాజుగారితో సమాచారమంతయు చెప్పిరి. రాజూ రాణీ,మంత్రి చాలా దుంఖించిరి. రాజు దేశములన్నియు తెలియ పరచెను. నాకుమార్తెను నాకు వప్ప చెప్పిన వారికి నారాజ్యముతోపాటు నాకుమార్తె నిచ్చిపెండ్లి చేయుదుననెను. అప్పుడు జయంతీపురరాజ కుమారుడు చంద్రసేనుడు వచ్చి నేను వెళ్ళుటకు సిద్ధముగా నున్నానని చెప్పెను. రాజగు శాంతమూర్తి చంద్రసేనుని దీవించి పంపెను. అతడు పడమర దిశగా ఆ అడవిలో చొరపడెను. ఆసమయములోనే రాక్షసుడు వేటకు చాలా దూరము వెళ్ళెను.

# పెద్దల సుద్ధి:

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు.

(ఐహికాముష్మిక విషయములన్నిటి యందును మన పూర్వులపార ప్రజ్ఞానిధులై అజ్ఞానాంధకార మగ్నులైన సోదర ప్రజానీకానికి తమ సూక్తులద్వారా జ్ఞానమయమైన జీవిత పద్ధతిని బోధించినారు వారు. ద్వంద్వాతీతులై, ఈశ్వరపదారవింద సంసేవనమున ఆరముగ్గిన చేతన కలవారై, సర్వభూతసములై, స్వార్థరహితులై తామునమ్మి ఆచరించిన జీవిత విధానమును లోకుల కుపదేశించినారు. కావున నే శతాబ్దుల కాలము కడచి పోయినను వారి ఉపదేశములను నేటికిని మానవజాతి మఱవజాలక స్మరించుచున్నది. అది ఆమహానుభావులకే చెల్లినది.

అట్టి మాననీయులలో ఒకడైన కబీరుదాసుని ద్విపదలను నానేర్చిన విధమున కొన్నింటిని తేలికభాషలో తెలుగు చేసితిని. ఇది ఆత్మోత్తరణమునకై చేసిన పనిమాత్రమే. ఇందేవైన తప్పులు దొరలిన నావిగాభావించి మన్నింప గోరుదును.)

ధరణి నంతను పత్రమ్ము దనరజేసి
వృక్షవితతికి లేఖినీ విభవమొసఁగి
ఏడుసంద్రాలసిరాగ నేర్పఱచియు
ప్రభుని గుణముల వ్రాయన ప్రభుడనైతి॥

మాలకరమున దిరుగును మలిన మగుచు
నోటనాలుక తిరుగును నూరుగతుల
చిత్తమది తిర్గునల్దిస చేవమీరి
జపము మాత్రమే సుంతేని జరుగదహహ॥

ఒక్కశబ్దము సుఖముల కిక్కయగును
ఒక్కశబ్దము దుఃఖాల కిక్కయగును
ఒకట బంధ మొకటగొంతు కురియునగును
ఒక్కటను మాత్రమె సమత నొందగలము॥

ఒరుల సేమము ప్రశ్నింతు నరులువెఱ్ఱి
తమదు మనికిని దెలియరు ధరణిపైన
జరయు మణిగెను ముడుగదె? మరణ భయ
సేమమింకేల రిత్తయాశింతు నరుడ॥

ఈవు నాకొఱ కేడ్తు విందెవరు తిరము
ఏనొకదినము నీకొఱకేడ్తునేమొ?
ముందు వెనుకగ నొకప్డు నందఱమును
ఎచటికో యెడ్తొ యిందుండి యేగవలదె?

ముందు గతి గానకయ నేడు మురిసి మురిసి
క్రుమ్ముచుంటివి నన్నిట్లు కుమ్మరీడ
నిన్నుక్రుమ్మెడి దినమును నిజము వచ్చు
నంచు పలుకును మట్టియాలింప మోయి॥

ఒక్కశీర్ష మెకల మానవుండు కూడ
హెచ్చుగా గర్వపడుటది యెంతవింత?
పదితలలు : కరములు రెండు పదులు గలుగు
రావణుడె తుద నేలపై రాలి యొఱ్ఱె॥

వనికి నేతెంచి మాలియే దినము నందు
మించి వికసించు సుమముల నెంచి త్రుంచు
రేపు మనవంతు బ్రదుకింత ఱిత్తయనుచు
కుందు వనిలోన చిన్నారి కుట్మలములు॥

ప్రేమ మార్గము సుగమము విదితమిదియు
వక్రగతివేచు దానినె వక్రమనకు
ప్రతిభ చాలక ముంగిలి వంకరనెడు
నాట్యకత్తియ తెలివికి నవ్విపోరె॥

గింజ నొక్కటి కొనియేగు కీటకమ్ము
మార్గమునవేరు గింజకై మనసు పడియె
ఏదియో యొక్కటియె దక్కు నింతెకాని
చిన్ని నోటికి రెండెట్లు చిక్కగలవు?

(సశేషం)

# గ్రంథ సమీక్ష

## నా చిన్ననాటి ముచ్చట్లు

శ్రీ. శే. డాక్టరు కె. ఎన్. కేసరిగారు తమ చిన్ననాటి ముచ్చట్లు అని వారి జీవితగాథను సంగ్రహంగా లిఖించేరు. ఇందులో వారు చిన్ననాటి పేదరికమువల్ల పడ్డ అష్టకష్టాలను, ఆపై వారు పొందిన ప్రతిష్టనే కాకుండా ఆరోజులలో మనవారిలో ఉండేమూఢ నమ్మకాలు, మూర్ఖపద్ధతులు, నాటు వైద్యం, చెన్నపట్నంలో ఆంధ్రుల జీవిత విశేషాలు మొదలైన ఘట్టాలన్నీ కూడ అతి సులభశైలిలో, మధుర భాషలో చదువరుల కండ్లకు కట్టినట్లు అతిరమ్యంగా వర్ణించేరు. సాధారణంగా కేసరిగారివలె దుర్భర దారిద్ర్యమను భవించి, ఆపిమ్మట అష్టఐశ్వర్యములు అనుభవించుచూ పూర్వానుభవాలను జ్ఞప్తికి తెచ్చుకునే వ్యక్తులు చాలా అరుదు. డాక్టరుగారు వారివెనుకటి చరిత్రఅంతా హృదయ రంజకంగా చిత్రించి అనేక మందికి మార్గదర్శకులు గావటంలో ఉంది ప్రతిభఅంతాను.

వారు స్వశక్తిచే ధనమార్జించి బీదలకు ముఖ్యంగా స్త్రీలోకానికి వారుచేసిన సేవ అపారం. ఆంధ్ర నారీలోకాని కంతకూ వారి 'గృహలక్ష్మి' 'లోధ్ర' ఇత్యాదులు చేస్తున్న సేవ సర్వజనవిదితమే. ఇటువంటి ఆదర్శ ప్రాయుల యొక్క జీవితపు చరిత్ర ప్రతీవ్యక్తికూడ చదివి అనుకరించ వలసినదే. ముఖ్యంగా ఈ రోజులలో నిరుద్యోగ సమస్యతో తారుమారవుతున్న యువకులంతా కేసరిగారి వలె స్వశక్తితో జీవనోపాధి యేర్పరుచుకోవడం నేర్చుకోవాలి. పెద్దలు 'ఉపాయంవుంటే వూళ్ళేలవచ్చు' నని సామెత చెప్పేరు.

డాక్టరు కేసరిగారు అమరజీవులు

ఈ గ్రంథములో అనేక అమూల్య విషయాలున్నాయి. పుస్తకంగెటప్ కూడచాల బాగుంది. గ్రంథం వలయు వారు గృహలక్ష్మి కార్యాలయం, రాయపేట, మద్రాసు అని వ్రాయాలి. వెలతెలియదు.

## శ్రద్ధాంజలి

రచన : — శ్రీరావు వేంకట శేషారావుగారు.

మూల్యం రూ 1—0—0

శ్రీ వేంకటశేషారావుగారు అప్పుడప్పుడు వ్రాసిన పద్యమాలికలు ఒక పుస్తక రూపంలో ముద్రించేరు. ఈ పద్యములలో శైలి ఆబాల గోపాలమునకు అర్థమయ్యేటట్లు అతి మధురంగావుంది. ముఖ్యంగా విద్యార్థుల కుపకరించే విషయాలు ఎక్కువగా వుండటంవల్ల స్కూళ్ళలో పఠన గ్రంథముగా పెట్టవచ్చు.

వలయువారు శ్రీ రావు వేంకటశేషారావు. చిత్రాడ, పిఠాపురంపోష్టు, తూర్పు గోదావరిజిల్లా అని వ్రాయండి.

## అరుంధతీ వశిష్ఠము

బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ; విద్వాన్ గారిచే వ్రాయబడిన పద్యకావ్యం. ఇందలి ఇతివృత్తం—భారత నారీలోకానికి ఆదర్శగృహిణియైన అరుంధతీయొక్క జీవిత గాథ. రచయిత చక్కటి మృదుమధుర శైలిలో, మనోరంజకంగా వ్రాసిన కావ్యం. ప్రతీ ఆంధ్ర నారీ కూడా చదవదగ్గ గ్రంథం.

మూల్యం : రు. 1—0—0 ప్రకాశకులు : బి. బి. అండ్ సన్స్, రామారావుపేట, కాకినాడ.

శ్రీమతి. కె. సుగుణమణి.

## ఆరసీ

### ప్రత్యేక వార్షికసంచిక

ఆరసీ:— హిందీ ప్రత్యేక వార్షికసంచిక. ఇందు ముఖ్యంగా స్త్రీల కుపకరించు విషయములు చాలా నున్నవి. ముఖ్యంగా స్త్రీలకు పనికివచ్చు, లేసు, వుల్లు అల్లిక, పాకకళ మొదలగు విషయాలున్నవి. హిందీ వచ్చిన ప్రతియొక్క గృహిణి తప్పక చదువ దగినదీ పుస్తకము. సంపాదకురాలు శ్రీమతి. లీలాప్రకాష్, బి. ఏ. దొరకుచోటు.

ఆరసీ కార్యాలయము: — స్వరూపునగర్, కాన్‌పూర్. విడిప్రతి 0-6-0 — చందా సంవత్సరానికి. రూ. 3-0-0



Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras 4